# సత్యవతీచరిత్రము



(K) 099

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

తొమ్మిదవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

[వెల రు. 1-0-0

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
[illegible] మహారణ్య పురాధిపత్యము
[illegible] ప్రహ్లాద నాటకము
[illegible]ంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 [illegible]

# సత్యవతీచరిత్రము



గ్రంథకర్త

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

# సత్యవతీచరిత్రము

## మొదటిప్రకరణము



మార్గశిరమాస మారంభ మయినందున శీతకాలపుశెలవులు జ్ఞప్తికివచ్చి సత్యవతి నారాయణమూర్తి రాకకై యెదురుచూచుచు దిన మొకయేడుగాఁ గడుపుచుండెను. ఓ నారీమణులారా! మీ కీవాక్యము చెవి సోఁకినతోడనే సత్యవతి యెవరో నారాయణమూర్తి యామె కేమగునో తెలిసికొనవలె నని యభిలాష కలుగవచ్చును. మీకు వారికథను చెప్పెదనుగాని యీకథ యం దేమో చిత్రవిచిత్రము లుండునని మాత్రము భ్రమపడ బోకుఁడు. మనపురాణముల యందువలె పదితలలు గలవారును, వేయిచేతు లున్నవారును, సముద్రమునంతను పానముచేయ గలవారును, భూమి చాపచుట్టువారును, ఇం దెవ్వరును రారు. అట్టి యద్భుతములు పుట్టెడి కాలమును పుట్టిన వన్నను నమ్మెడుకాలమును బహుసంవత్సరములక్రిందటనే దాటి పోయినవి. మన శృంగారప్రబంధములయందువలె దీని యందు దీర్ఘ సమాసములతోడను గూఢపదములతోను వనవిహారము, జలక్రీడ, వధూవరులయన్యోన్యవరణము, మొదలైనవర్ణనలు సహిత మెక్కడను కనఁబడవు. స్త్రీలు స్వతంత్రించి చెలికత్తెలతో కలిసి వనవిహారము చేసెడువార్త లిప్పుడు కలలోనివార్త లయినవి; జలక్రీడలు పుస్తకములలో మాత్రమున్నవి; యావజ్జీవమును సుఖదుఃఖములకు పాలికాపు లయి యుండవలసిన కన్యావరులయిష్టము ననుసరించి వివాహములు జరిగెడి యుతమకాల మదుఁగంటి తమవినోదారముగా తలిదండ్రులు

నోరెఱుఁగనిశిశువులను పల్లకులలో పెట్టి యూరేగించి యెల్లకాలమును వారిని బద్ధులను గావించెడు బొమ్మలపెండ్లిండ్లు చేసెడుకాల మిప్పుడు సంప్రాప్త మయినది. కాఁబట్టి యీనిజమయినచరిత్రమునందు తేట తెలుఁగుమాటలతో మీ రీకాలమున సర్వసాధారణముగా కుటుంబములయందు చూచుచుండునట్టియు అనుభవించుచుండునట్టియు సామాన్యవిషయములే కనఁబడునుగాని యింద్రజాలము లేవియు కనఁబడవు. విరుద్ధము లైనకల్పనాకథలను వినమరిగినమీచెవుల కీసత్యచరిత్రము రుచించునేని, దీనినిచదివి యానందింపను దీనియందు వర్ణింపఁబడిన యోగ్యులప్రవర్తననుసరింపను మీకుకావలసినంతస్వాతంత్ర్యముకలదు.

సత్యవతి నారాయణమూర్తి భార్య; ముంగొండాగ్రహారమున వసించు లక్ష్మీనారాయణగారి రెండవకోడలు. ముంగొండాగ్రహారము కోనసీమయం దమలాపురమునకు సమీపముననున్నది. లక్ష్మీనారాయణగారు పరమసాధువులు. ఆగ్రామమునం దాయన యున్నజాడయే తెలియదు; పలువు రాయనపేరుసహిత మెఱుఁగరు. కాని గ్రామమునం దాయనభార్యపే రెఱుఁగనివారుమాత్ర మెవ్వరును లేరు. ఆమె నూతికి వచ్చుచున్నదనఁగానే నీళ్ళుతోడుకొనెడు శూద్రస్త్రీలందఱును మీద నీళ్ళుపడిన యశోదమ్మగారు జగడమాడునని చేదలు పయికి తీసికొని దూరముగా తొలఁగి నిలుచుందురు; మడినీళ్ళకయి చెఱువునకు వెళ్ళునప్పుడు దూరమునుండిచూచి పిల్ల లీదులాట చాలించి భయముతో గట్టుచే పరుగులెత్తుదురు. గ్రామములో పిల్లలెవ్వరైన అల్లరిజేసెడుపక్షమున యశోదమ్మగారి కొప్పగించెదమని తల్లులు వారిని బెదరింపుచుందురు; ఆమె ప్రసిద్ధిచేత గ్రామవాసు లనేకు లాయనను యశోదమ్మమగఁ డందురుగాని యెవ్వరును పేరుపెట్టి పిలువరు.

ఆలక్ష్మీనారాయణగారికి నలుగురు కొమాళ్ళు. వారిలో పెద్ద తనిపేరు వేంకటేశ్వరులు; రెండవకొమారునిపేరు నారాయణమూర్తి అని మీ రీవలనే యెఱుఁగుదురు. మూడవకొడుకు రామస్వామి; చిన్నవానికి సుబ్రహ్మణ్యమని పేరు. వీరు నలువురుపుత్రులునుగాక యిద్దఱు కొమార్తెలున్నారు వారిలో పెద్దామె సావిత్రి; చిన్నది సీత.

వేంకటేశ్వరుల కిప్పు డిరువదియేడు సంవత్సరముల వయ స్సున్నది. అతఁడు దేశాచారమునుబట్టి చిన్నతనములో కాళిదాసత్రయ మును చదువుకొనెనుగాని కావ్యపాఠమునం దతనికి శ్రద్ధలేకపోవుట చేతను చదువుకొనుటకంటె గురువున కుపచారము చేయుటయందే విశేష కాలము పోవుటచేతను సంస్కృత మతనికి పట్టువడలేదు గాని కొంచెము లెక్కలు వేయుటకును చక్కఁగా వ్రాయుటకును మాత్ర మతఁడు నేర్చుకొనెను. అతఁ డిప్పుడు కరణమువద్ద గుమాస్తాగానుండి నెలకు పదిరూపాయలసొమ్ము తెచ్చుకొనుచున్నాఁడు. అతఁడు మతము చేత స్మార్తుఁ డయినను వైష్ణవులసహవాసముచేత విష్ణుభక్తి ముదిరి మెడనిండ తులసిపూసలు తావళములు వేసికొని పెద్దనామములు ధరించి హరిభక్తుఁ డనిపించుకొను చుండెను. అతనిభార్య సుందరమ్మ: ఆమెయు చదువెఱుఁగనిది. కాఁబట్టి కొన్నిసమయములలో పోట్లాడు చున్నను భార్యాభర్త లిరువురును మనసు కలిసి యొక్కమాటగా నుందురు. ఆదంపతులకు రామానుజమ్మయని రెండేండ్లు దాటిన చిన్న కొమార్తె గలదు.

నారాయణమూర్తికిప్పు డిరువదవయేఁడు వచ్చినది. అతఁడు మిక్కిలి బుద్ధిసూక్ష్మతగలవాఁడు. అతనికి చదువునందు మిక్కిలి యాసక్తి. అతఁడు బహుగుణవంతు డని అతని నెఱిఁగినవా రందఱు జాడుకొందురు. ఆగ్రామకరణముతమ్ముఁడు రాజమహేంద్రవరమున

నింగ్లీషు చదువుకొని యుద్యోగము చేయుట చూచి యింగ్లీషువిద్య నేర్చుకొనుటయందు మిక్కిలి యభిలాష కలవాఁడై తలిదండ్రులతో చెప్పక అమలాపురమునకు వెళ్లి యింగిలీషు పాఠశాలలో ప్రవేశించి వారములు చేసికొని కష్టపడి చదువుకొనుచు ధనికుల బాలుర కింటి వద్ద రాత్రులు పాఠములుచెప్పి సంపాదించిన సొమ్ముతో పుస్తకములు బట్టలు మొదలైనవి కొనుచు కొన్నిసంవత్సరములలో ప్రవేశపరీక్ష మొదటి తరగతిలో మెప్పువడసి నెలకు పదిరూపాయలు విద్యార్థివేతన మును పొంది రాజమహేంద్రవరమున ప్రథమశాస్త్రపరీక్ష తరగతిలో నందరిలోను చురుకయినవాఁడుగా నున్నందునను, ఆతరగతిలోనే సహపాఠిగా నుండి చదువుకొనుచున్న మాధవయ్య ప్రోత్సాహము చేతను, మండలన్యాయసభలో ప్రధానవిలేఖకుఁడుగా నున్నరాఘ వయ్యగారు పండ్రెండుసంవత్సరముల ప్రాయము గల తనకుమార్తె నాతనికిచ్చి వివాహముచేసెను. మాధవయ్య రాఘవయ్యగారి కొమా రుఁడే. వివాహ మయిన రెండుమూడు మాసములకే రాఘవయ్యగారు డిస్ట్రిక్టు మునసపుగా నియమింపఁబడి పెద్దాపురమునకు వెళ్ళిపోయిరి. అప్పుడు పెద్దతమ్ముఁ డయిన రామస్వామిగూడా వచ్చి పాఠశాలయందు ప్రవేశించినందున పదిరూపాయలును చాలక కొంతఋణము చేసినను తల్లిదండ్రి లేమియు పంపలేకపోయిరి. వారు వేంకటేశ్వరుల వివాహము నందు బ్రాహ్మణసంతర్పణ చేయుటకును సంభావన యిచ్చుటకును తాకట్టు పెట్టినమాన్యముమీఁది యప్పు నేటికిని తీరక వడ్డి పెరుగు చున్నందున వారికి జీవనము జరుగుటయే దుర్ఘటముగా నుండెను. ఈసంగతిని మామగారు విని చేసినయప్పును తీర్చివేసి నెలకు నాలుగు రూపాయలచొప్పున అల్లునకు పంపుచుండెను. ఇప్పుడునారాయణమూర్తి ప్రథమశాస్త్రపరీక్షయందు కృతార్థుఁడయి బీ-యే తరగతిలో చదువు

కొనుచున్నాఁడు. ఎఫ్-ఏ పరీక్ష యిచ్చినప్పటినుండియు అతనికి విద్యార్థి వేతనము నెల కిరువదిరూపాయల చొప్పున ముట్టుచున్నది. సత్యవతి సంవత్సరము క్రిందట వ్యక్తురాలయినందున భార్యాభర్తల నొకటిచేసి రాఘవయ్యగారు కొమార్తెను సారెపెట్టి అత్తవారియింటికి పంపివేసిరి. ఇప్పుడు శీతాకాలపుసెలవులు సమీపించుచున్నందున సెలవుదినములలో ఇంటికి వచ్చెద నని నారాయణమూర్తి తండ్రిపేర నుత్తరము వ్రాసెను. అందుచేతనే సత్యవతి యతనిరాకకయి ప్రతిదినమును ఎదురుచూచుచున్నది. కాంతామణులారా! మీ రీచరిత్రమును చదివినకొలఁదిని మీకు సత్యవతియొక్క సుగుణసంపద బోధపడి యామెయం దనురాగము హెచ్చుటయే కాక కుటుంబములోని యెల్లవారియొక్కయు స్వభావలక్షణాదులుకూడ తేటపడి యెవరి నేప్రకారముగా చూడవలెనో మీరే యాలోచించుకొఁగలరు.

---

## రెండవ ప్రకరణము

---

పగలు రెండుగంటలవేళ రాజమహేంద్రవరమునుండి బయలుదేఱినపడవలో శిరస్తాదారుగా రెక్కనందున బొబ్బరులంకకు రెండుకోసుల దూరములోనుండు చిన్నగ్రామమునకు సమీపమున దీపాలవేళ పడవ కట్టిపెట్టించి భోజనములనిమిత్తము వా రాగ్రామమునకు వెళ్ళిరి. వారు సుఖముగా కరణములోపల పిండివంటలతో విం దారగించి తాంబూలమువేసికొని సంగీతమువిని మెల్లగాపడవ చేరునప్పటికి రాత్రి పదిగడియలప్రొద్దుపోయినది. ఈలోపల పడవలోనివారందఱును పసిపిల్లలతోకూడ ఆకలిచేత మలమలమాడుచు రేపు రెండుజాములకయినను మెతుకులు దొరుకునో దొరకవోయని తొందరపడుచు హరినామస్మరణ

చేసికొనుచుండిరి. వారనుకొన్నప్రకారమే పడవ మఱునాఁడమలాపురము చేరునప్పటికి మధ్యాహ్నము రెండుజాములు దాటిపోయినది. అప్పుడు పడవదిగి నారాయణమూర్తి పూటకూటియింట భోజనముచేసి చల్లపాటువేళ బయలుదేఱి సాయంకాలము స్వగ్రామముచేరెను. ఇల్లు చేరునప్పటికి గృహకృత్యములసంగతి మాటాడుకొనుచు వాకిటనే కూర్చుండియున్న తల్లిదండ్రులు కొమారునిజూచి సంతోషించి, అతఁడు తమకు సాష్టాంగనమస్కారముచేయఁగా దీవించి లేవఁదీసి కౌఁగిలించుకొని కుశలప్రశ్నచేసిరి. ఇంతలోలోపలనుండి తమ్ములుకూడవచ్చి అన్నగారిని కౌఁగిలించుకొనిరి. అన్నగారుమాత్రము రాలేదు. అతఁడు నెలసరి లెక్కలలో తప్పులున్నవని తహశ్శీలుదారుగారు హుకుము వ్రాసినందున అమలాపురము వెళ్ళి రెండుదినములనుండి అక్కడనే యుండెను. తాలూకా గుమాస్తాలచేతులలో వెండినాణెములరూపమయిన దివ్యౌషధము పడినపక్షమున దానిప్రభావముచేత లెక్కలయందలి తప్పులన్నియు ఒప్పులగుననియు, ఆదివ్యౌషధము చేతికి తగులనిపక్షమున తిన్నగానున్న లెక్కలుసహితము తప్పులకుప్ప లగుననియు, అనుభవశాలులు చెప్పుదురుగాని దానినిజము నాకు తెలియదు. నారాయణమూర్తి కొంతసేపు సుఖసంభాషణచేసి వీధిలోనికి వెళ్ళి గ్రామములోని తన మిత్రుల నందఱిని చూచివచ్చి రాత్రి భోజనముచేసి పడకగది చేరి భార్యరాకకయి యెదురుచూచుచుండెను. సత్యవతి తన సంతోషమును పయికి కనఁబఱుపకపోయినను ముఖవికాసమువలనను, ఉత్సాహసూచకము లయినమఱికొన్ని యితరచేష్టలవలనను, ఆమెభావమును కనిపెట్టి అత్తగారు కొఱకొఱలాడుచు తాను మేలుకొనియుండఁగా కోడలు గదిలోని కేప్రకారముగా వెళ్ళునో చూతమని యేకులబుట్ట ముందువేసికొని వత్తులు చేయుటకై దీపముముందర కూరుచుండెను.

లోపల నారాయణమూర్తి భార్యనిమిత్తమయి ఆత్రముపడుచు కొంచెము మడుగులచప్పుడయినప్పుడెల్లను తలయెత్తిగుమ్మము వంక చూచుచు, ఎవ్వరును లోపలికిరాకున్న నిరాశచెంది మరల శిరస్సు దిండుమీద వాల్చి పుస్తకమువిప్పిచదువఁబోవుచు, చదువుటకుతోచకున్న మంచము దిగి భార్యను పిలుచుకొనివత్తమని తలుపుదాఁకవచ్చి సిగ్గుపడి మరలవెనుకకుఁబోవుచు, చిత్తముట్టూతలూఁగ మంచముమీఁద పొరలుచుండెను. మనసు కలిసినభార్య చిరకాల మెడఁబాసి యున్నతరువాత నూతన సమాగమదినమున ప్రియునిమన స్సిట్లుండుట యాశ్చర్యకరము కాదు.

ఈవల సత్యవతియు మగనినిచూచి యొక్కమాటు కుశలప్రశ్న చేసి రావలెనని యెంతయభిలాషపడుచున్నను చావడిలో అత్తగారు కూరుచున్నందున వెళ్ళవల్లకాక ఆమె యెప్పుడు వెళ్ళిపరుండునా యని కోటివేల్పులకు మ్రొక్కుచు, ఒక్కొక్కపనిచేసివచ్చి యామె వెళ్ళినదేమో యని తొంగితొంగిచూచుచు, యింటిపనియంతయుఁజేసి తోడికోడలిగది లో నెంతసే పున్నను అత్తగారాదినము లేచిపోయి పరుండుజాడగానక, తుట్టతుదకు ప్రియవల్లభుని చూడవలెననెడి యభిలాష సిగ్గును మనసు నుండి పాఱఁదోలఁగా సాహసముచేసి మంచినీళ్ళచెంబు చేతఁబట్టుకొని కాళ్ళచప్పుడు కానీక భయపడుచు మెల్లగా గోడయోరనుండి నడిచి పడకగది ప్రవేశించెను. అది యోరకంటచూచి తలపంకించి చివాలున లేచిపోయి అత్తగారు తనగదిచేరి తలుపువేసికొనెను. సత్యవతి గదిప్రవేశించి యెడమచేతితో పుడకపుచ్చుకొని దీపమెగసనఁద్రోయుచు ప్రేమ యుట్టిపడ భర్తవంకచూడఁగానే నారాయణమూర్తియును దయారసము వెదచల్లుచూపులతో భార్యమొగమువంక చూచి చిఱునవ్వునవ్వెను. ఆసమయమున వధూవరులకు మనస్సులందుఁగలిగిన పరమాహ్లాదమును వారిమనస్సులను చొచ్చి చూడవలసినదేకాని చెప్పుటకు శక్యముగాదు.

నారాయణమూర్తి చేయిపట్టుకొని భార్యను తనపక్కను కూరుచుండఁబెట్టుకొని—"యెంతసేపు కనిపెట్టుకొనివున్నా లోపలికిరాలేదు. నేను వచ్చినా నన్నుమాట మరిచిపోయినావా?"

సత్య—అత్తగారు వాకిట్లో వుండగా యెట్లారాను?

నారా—యేమివస్తే? ఆవిడ నమలి మింగుతుందా?

సత్య—మీరు బొత్తిగా చిక్కిపోయినారు ఈవేళ మార్గంలో బహు ఆయాసపడ్డారు కాఁబోలును.

నారా—రాత్రిళ్ళు పొద్దుబోయినదాకా చదువుకుంటూ వుండడంచేత కొంచెం చిక్కినాను. అంతేకాకుండా వూటకూటియింట్లో నాకు భోజనం సుష్టుగా లేదు. నీవుకూడా చిక్కినా వేమి?

సత్య—నేను మునుపుమాత్రం బలిసివున్నానాయేమి? యెప్పుడూ వకలాగేవున్నాను, నేనుయెదిగి కాపురానికి వచ్చినతరువాతకూడా మీరు పరదేశంలో కనపడుతూవుంటే యెందుకూ పనికిరాకుండా వుండిన్నీ లేనిదానితో సమానమే అయిపోయినాను.

నారా—ఇదిగో ఇక్కడకు వచ్చినానుగదా! ఈనెలరోజులలోనూ యెలాబలిపిస్తావో చూతాము.

సత్య—మీరు వచ్చేటప్పుడు మాఅన్నయ్యను చూచినారా? యింటివద్ద మావాళ్ళంతా బాగా వున్నారేమో!

నారా—నేను రేపు బయలుదేరుతా ననగా మీఅన్నయ్య నాకు కనపడ్డాడు. అతను చదువు మానివేసి పనిలో ప్రవేశించినాడు. మీవాళ్ళంతా బాగావున్నట్టు మొన్ననే వుత్తరం వచ్చినదట.

సత్య—మాఅన్నయ్య పదిహేనురోజులయింది నాకు పది రూపాయలు పంపించినాడు. అప్పటినుంచీ నాకు వాళ్ళవర్తమానమే తెలియదు.

నారా—వదిన యెక్కడా జాడ లేదు. నేనువస్తే కనపడకుండా వుండేదికాదు. అవీధికి పుట్టింటికి వెళ్ళిందా యేమిటి ?

సత్య—లేదు. యిట్లోనేవున్నది. పొద్దున్న అత్తగారు దేనిందుకో కోపపడి, కొంచెం తిట్టినారు. అందుమీద కోపం వచ్చి పొద్దుణ్ణుంచీ అన్నం తినకుండా గదిలో ముసుగుపెట్టుకొని క్రింద పడుకుంది. నేను యెన్నివిధాల బతిమాలుకొన్నా అన్నానికి లేచిందికాదు. నేను యిదివరదాకా ఆగదిలోనే కూర్చున్నాను. మీరు వచ్చి పిలిస్తే వస్తుందేమో. వకపర్యాయం లేచి రండి.

నారా—అసలు ఈవాళ ఖజ్జా యెందుకువచ్చింది ? అమ్మాయి రామానుజమ్మకూడా జాడ లేదేమిటి ?

సత్య—అది యేడిచియేడిచి మీరువచ్చేముందర నేనిద్రపోయింది. దానిమూలంగానే—ఈవాళ యెవరో మనయింటికి చంటిపిల్లవాణ్ణి యెత్తుకువచ్చినారట. యేదో మాటామాటావచ్చి "మీకందరికీ పనస పండువలె కొడుకులు పుడుతారు మా నిర్భాగ్యాలు యెందుకూపనికిరాని ఆడముండను కన్నది. ఆడచెత్తయెందుకు ? నాకొడుకు చేసుకొన్న పాపిలుద్ధంకొద్దీ యిటువంటి పెళ్ళాము దొరికింది" అని అత్తగారేమో అన్నారట. అందుమీద అక్కయ్యకు పుడుకుమాత్రనం వచ్చి "ఆడది పుడితే నేను యేంచేస్తాను ? కావలిస్తే మీకొడుకు లోపంగాని నాలోపం యేమీ లేదు" అనేటప్పటికి యిద్దరూ అంటుకుని ఖజ్జా ఆడినారు. పెద్దది అంటే యేమిటి పూరుకోమంటే నా మాట విన్నదికాదు అత్తగారు నన్ను యెన్నిమాట లంటారుకారు ? అన్నమాటకల్లా నేను యెదురుచెప్పి తగవు లాడుతానా ?

నారా—వారుయిద్దరూ యిద్దరే. ఒకరిదగ్గిరా శాంతము లేదు. మనవలో ఆడవాళ్ళువట్టిమూర్ఖులు; యేమీ తెలియనివాడికి నిష్కారణంగా

పోట్లాడి వుపోషాలు చేస్తారు. మగవాడుంటేనేకాని ఆడది వుంటే వృద్ధిపోయిందా యేమిటి? ఉపయోగానికి మగవాడెంతో ఆడదీఅంతే. ఇద్దరూకూడావుంటేనేకాని యెప్పుడూ సౌఖ్యం గలుగదు. పాపం నిండుపొద్దులమనిషి; భోజనం చెయ్యకుండావుంటే బహుజబ్బు; మనము వెళ్ళి భోజనానికి లేవదీతాము రా.

అని యిద్దఱును సుందరమ్మ గదిలోనికి వెళ్ళనమీఁదట సత్యవతి మెల్లగా తోడికోడలి మొగముమీఁది ముసుఁగుతీసి—అక్కా! నీకోసం యెవరో వచ్చారు చూడు.

సుందరమ్మ మఱఁది మొగమువంక చూచి కన్నులు వాల్చి మరల ముసుఁగు వేసికొనెను.

నారాయణమూర్తి మరల ముసుఁగుతీసి—వదినా! నన్ను మరచిపోయినావా యేమిటి? చాలాదినాలకు వూరినుంచి వచ్చిన మఱదిని యీలాగేనా ఆదరించడం? నీవు యేమీ నా క్షేమసమాచారం అడిగి తెలుసుకోనక్కరలేదా?

లోపల మాటలాడవలెనని యున్నను మాటాడక సుందరమ్మ కన్నులువిప్పి చూచుచుండెను. అప్పుడిద్దఱును చెఱియొక జెబ్బయు పట్టుకొని భోజనమునకు లెమ్మని లేవఁదీసి ఆమెను బలవంతముగా తీసికొనివచ్చి పీటమీఁద కూర్చుండఁబెట్టిరి. పయికి కొంతబింకము కనఁబరచినను, లోపల ఆకలిదేవత పొద్దుటనుండియు లేచి భోజనము చేయుమని బాధించుచుండుటచే అభిమానమును మఱచిపోయి యామె యిదివరకే యెవ్వరైన బలవంతపెట్టిన లేవవలె నని యాలోచించుచుండెను. కాఁబట్టి వీ రూరకచేతులు పట్టుకొనుటయే కాని తుత్తే యామెను లేవఁదీసి పీటవద్దకు తీసికొనివచ్చినది. అప్పుడు విస్తరివేసి సత్యవతి వడ్డించినతరువాత ఆమె కుడిచేయి మెల్లమెల్లగా అన్నము

మీఁదికి వెళ్ళి పనిచేయ నారంభింపఁగానే విస్తరిలోని కూరలును పప్పును అన్నమును ఒకదానితరువాత నొకటి మాయము కానారంభించెను. కొంచెము సేపటికల్లను విస్తరి వట్టిది కాఁగానే అంతసేపును బిగిసి నిమిషములో విస్తరిలోని యన్నమంతను మాయముచేసి యింద్రజాలము చేసితివని నవ్వి వదినగారు గనుక కొంత పరియాచకము చేసి నారాయణమూర్తి తనపడకగదికిఁ బోయెను. సత్యవతియు తోడికోడలిని పరుండఁబెట్టి తనరాక కయి నిరీక్షించుచున్న భర్తనుచేరి గదితలుపు లోపల వేసికొనెను.

---

## మూడవ ప్రకరణము

---

ఆమఱునాటినుండియు గుంపులుగూడి అమ్మలక్కలు, లెక్కడఁ జూచినను సత్యవతి తప్పులనే చెప్పుకొని ముక్కుమీఁద వ్రేళ్ళు వేసికొని వింతపడసాగిరి. వారు సత్యవతియందు మొట్టమొదట కనిపెట్టిన గొప్పతప్పిదము పట్టపగలు మగనితో మాటాడుట. ఇదేమిచోద్యమో యశోదమ్మ రెండవకోడలు మామగారు చూచుచుండఁగానే సన్న మగనితో గుసగుసలాడ మొదలు పెట్టినదట యని యొక్కతెయు, ఎన్నఁడును లేని యిటువంటి విరుద్ధములు పుట్టుచున్నవి గనుక కాలమున కేమో వచ్చినదని యొకతెయు, ఈకాలపువాండ్రకు బొత్తిగా అత్తమామలలక్ష్యమే లేదని యొకతెయు, మాకాలములో మగనితో మాటాడుసంగతి యటుండఁగా భార్యలు పగలు పెనిమిటి కంటఁబడి మెలఁగుదురా యని యొకతెయు, నావంటిదానిని అత్తగారినైతే ఇటువంటి ఆటలు సాగనిత్తునా యని యొకతెయు, ఇది మనుటకాల

మయినపక్షమున ఇటువంటి అకార్యము చేసినందుకు నిలువున కాటికమ్మ చీరినట్లు చీలుదు రని యొకతెయు, నూతులవద్దను స్నానముల రేవులలోను జేరి ముసలిముండలు నానావిధముల చేతులు సాచి దీర్ఘములుతీయుచు దోషము లెన్నసాగిరి. అంతటి యపచారము చేసినందుకయి ఇంటివద్ద అత్తగారుపెట్టు చివాట్లకును తిట్లకును పరిమితియే లేదు. ఆహా! ఏమి యీకాలమహిమ! ఇప్పుడు భార్య మగనితో మాటాడుట అంకయినది! అటువంటి పల్లెలయందు పడుచుభార్యలు అంకుచేసియయినను పలువురిలో నిర్భయముగా తలయెత్తుకొని తిరుగ వచ్చునుగాని పట్టపగలు మగనితో మాటాడి తోడివారిలో తల వంపులు లేకుండ తిరుగుట శక్యముకాదు.

సత్యవతియం దాయూరువారు పట్టుకొన్న రెండవతప్పు చదువు. ఆమె తల్లిదండ్రులు తాము విద్యాలాభ మెఱిగినవారుగనుక బాలికా పాఠశాలకు పంపియు తీఱికయైనప్పు డెల్లను తా మింటివద్ద పాఠములు చెప్పియు సత్యవతికి తెలుఁగునం దభిరుచి కలుఁగఁజేసి చక్కఁగా చదువుటకును వ్రాయుటకును, చదివినదానిని అర్థము చేసికొనుటకును నేర్పుటయే కాక సమయముచూచి కథలమూలమునను లోకవార్తల మూలమునను మంచినీతులను మనస్సునకు నాటునట్లుగా బోధించి సత్యము, శాంతత, మొదలయిన సమస్తసద్గుణములను గలిగి యుక్త ప్రవర్తనను గలదానినిగా దిద్దిరి. ఇప్పు డల్పవిద్యావంతులును విద్యావిహీనులును సాధారణముగా వివాహ మయినతోడనే తమభార్యలను పాఠశాల మాన్పవలయునని పోరి మామగారితో జగడమాడునట్లు నారాయణమూర్తి జగడ మాడక తనభార్యను చదివించుట కయి మామగారిని బావగారిని మఱింత ప్రోత్సాహపఱిచి యెవ్వరును చూడకుండ తానుకూడ పుస్తకములు తెచ్చియిచ్చి వివాహ మయి

నప్పటినుండియు రహస్యముగా చదువు చెప్పుచు వచ్చెను; అందుచే సత్యవతి విద్యయందును బుద్ధియందును తన యీడువారిలో అసమానురా లయి కొంచెము చదువఁగలిగిన యీకాలపు పడుచులవలె 'తారాశశాంకము' మొదలయిన దుష్టప్రబంధములను చదువక, అట్టి శృంగారకావ్యముల పేరయినను విననొల్లక, తనకు తీఱికయైనప్పుడెల్ల పతివ్రతల చరిత్రములను నీతులను సద్వర్తనమును బోధించు పుస్తకములను చదువుచుండును. అందుచేత పొరుగువారి కండతీఁట పరుల మీఁదిదోషము లెంచు వ్యర్థప్రసంగములలో తమతో చేరదని యొక కోపము, గవ్వలు గచ్చకాయలును మాని చదువుకొనుచుండు నని యొకకోపము, సత్యవతిమీఁద రెండుకోపము లుండెను. అత్తగా రేలాగునైనను కోడలిచదువు మాన్పింప వలెనని నిశ్చయించుకొని "ఆడది చదివి చెడె మగవాఁడు చదవక చెడె" నన్న సామెత నుదాహరించి చెప్పియు, స్త్రీలు చదివి సభలకెక్కి యుద్యోగములను జేయఁబోవుదురా ? చదువుమానుమని బోధించియు, మనయింట నెన్నఁడును లేనిది లక్ష్మీనారాయణగారి కోడలు పుస్తకములు చదువుచున్న దని బంధువులలో అప్రతిష్ఠవచ్చి తనకు తలవంపులుగా నున్నదని దూషించియు, "చదువునేర్చిన ఆడదానితోను వంటనేర్చిన మగవానితోను ఎవ్వరును వేగలే" రని తిట్టియు, పుస్తకములు దొరికినప్పుడు చింపివేసియు, నయమున భయమున తిట్టియు కొట్టియు తనశక్తినంతయు వినియోగించెను గాని, సత్యవతి యెన్నిపాట్లుపెట్టినను పడి మాఱుమాట చెప్పక మధ్యాహ్న మత్తగారు పరున్నప్పుడు తనగదిలో తలుపు వేసికొని కూర్చుండియు రాత్రి భోజనము లయి నిద్రింపఁబోవునప్పుడును తెల్లవారుజామునను తన పడకగదిలో దీపము పెట్టుకొని కూర్చుండియు రహస్యముగా తన చదువును వృద్ధిపఱచుకొనుచుం

యుండెను. చదువునం దాసక్తి కలిగియున్నయెడల, ఎన్నికష్టములు పడియైనను నేర్చుకోవచ్చును. ఆసక్తి యొక్కటి లేకపోయెనేని, ఎన్ని పుస్తకము లున్నను చదు వొక్కముక్కయు రాదు.

సత్యవతియొక్క మూడవతప్పిదము శుచిగా నుండుట. ఆమె చిన్నతనములో పాఠశాలయందే 'సుఖాధారపత్రికాశిక' ను చదివి గాలి మొదలగునవాని యుపయోగములను గ్రహించియున్నది. గనుక, తనపడకగదిని సదా శుచిగా నుంచుచు గోడలకు తఱుచుగా సున్నపు పూతను పెట్టుచు గాలి చెడిపోక నిర్మలముగా నుండుటకయి దొడ్డి యందు పేడకుప్పలు మొదలైన దుర్గంధపదార్థములు నిలువయుండ నీయక తీసివేయుచు పక్కదుప్పటులను కట్టుకొను చీరలను మాయ నీయక తఱుచుగా నుతికించి శుభ్రముగా నుంచును. నిర్మలమయిన జలమునే త్రాగుచు దేహారోగ్యమును కాపాడుకొనుచుండును. అంతే కాక యామె మంచినీళ్ళుత్రాగు చెంబులను వంటచేయు గిన్నెలను వాడుకొను పాత్రములను ప్రతిదినమును తోమి బహుశుచిగా నుంచును. అందుచేత సత్యవతిగది దోమలును చీమలును ఆముదపుమరక లును బూజును లేక చూచుట కెంతో ముచ్చటగా నుండును. అది చూచి యోర్వలేక యెడ్డితనమున జీవనముచేయు గ్రామ్యకాంత లందఱును సత్యవతిని దొరసాని యనియు సీమరాణి యనియు పరిహాసము చేయుచుందురు.

సత్యవతియందుఁగల నాలవతప్పిదము నోములు వ్రతములు లేకపోవుట. ఆమె పరమేశ్వరుని మనసునందు ధ్యానముచేసి ప్రార్థించునే కాని యెన్నఁడును నోములును వ్రతములను పట్టి తక్కినవారి వలె కాలయాపనము చేయదు. ఏకదాసు లని, శుక్రవారము లని, శివరాత్రు లని చెప్పి ఉపవాసములును, ఒక్కపొద్దులును, జాగరము

లును చేసి దేహము చెడఁగొట్టుకొనదు. దేహమునకు జబ్బుచేయు నని వెఱిఁగి తడిబట్టలు కట్టుకొక చాకింటిబట్టతో నైనను భోజనము చేయును. తేటనీటితో స్నానము చేయునేకాని పుణ్య మని చెప్పి క్రొత్తనీటికాలమున నదులయందు మునుఁగదు. ఇవి యన్నియుచూచి అత్తగారు తనకోడలియొద్ద ఆచారము లేదనియు, ఈ రెండవకోడలి మూలమున అనాచారము వచ్చి చుట్టుకొని మయిలకూడు సంప్రాప్త మవుచున్నదనియు, లేచినది మొదలుకొని సాధించుచుండును.

ఈకోడలియం దత్తగా రారోపించిన అయిదవతప్పిదము తండ్రి భాగ్యవంతుఁ డగుట. అతఁడు ప్రతిమాసమును కొమార్తెకు పది రూపాయలచొప్పున పంపుచుండును. ఆసొమ్ము పెట్టి యామె తోడి కోడండ్రకును బావగారిబిడ్డలకును బట్టలు రవికెలు మొదలగునవి కొనియిచ్చుచు, ఇబ్బందిగా నున్నప్పు డింటివ్యయమున కేమయిన యిచ్చుచు కోరినప్పుడు భర్తకు పుస్తకములు మొదలయినవాని నిమిత్తము కొంతపంపుచు, కుంటివాండ్రు గుడ్డివాండ్రు రోగులు మొదలయిన బీదలకు సాయముచేయుచు, ఉండునేకాని తనచిఱు తిండినిమిత్తముగాని నగలనిమిత్తముకాని యొంతమాత్రమును వ్యయము పెట్టదు ఇట్లున్నను యశోదమ్మ తనకు కోపము వచ్చినప్పుడెల్లను కోడలిని మహారాజ్ఞిగా రనియు, దొడ్డదొరసానిగా రనియు, నవాబు కూఁతు రనియు, ధనగర్వమనియు, అట్టి ధనికు లయినందుకయి యామె తండ్రిని తల్లినికూడా శపించుచుండును. ఈతప్పులు తప్ప సత్యవతి యందు మఱియేదోషములును కనఁబడవు. ఇటువంటి దోషములే స్త్రీలయం దందఱియందును కూడ ఉన్నపక్షమున దేశము శీఘ్రకాలములోనే బాగుపడవచ్చును.

---

# నాలవ ప్రకరణము

కొన్నిదినములైనతరువాత ఒకనాటిరాత్రి రెండుమూడు గడియలప్రొద్దుపోయి సుందరమ్మకు నొప్పులారంభ మైనవి. అప్పుడు వేంకటేశ్వరులును నారాయణమూర్తియు తప్ప ఇంట పురుషు లెవ్వరును లేరు. తక్కినవా రందఱును పొలమునకును రచ్చసావడికిని వెళ్ళి అప్పటి కిల్లు చేర లేదు. ఊరిబయుల గ్రామదేవతగుడి సమీపమున నొకరావిచెట్టును వేపచెట్టును మొదలొక్కటిగా చేరి పయికి బ్రహ్మాండముగా వ్యాపించి యున్నవి. చిన్నమొక్కలుగా నున్నప్పుడు తెచ్చి నాటి కరణముతాత ఆరెండుచెట్లకును పెండ్లి చేసె నఁట. ఆచెట్లచుట్టును గుండ్రని విశాలమైన మట్టియరుగు కలదు. దానినే జనులు "రచ్చసావిడి" అని పిలుతురు ప్రతిదినమును సాయంకాలమునందు గ్రామకరణమును మునసబును ఆయరుగుమీఁద చేరి జనులతో ఇష్టాగోష్ఠి చెప్పి ప్రొద్దుపుచ్చు చుందురు. ప్రాతఃకాలమునందు గ్రామకరణము మొదలైనవారు దానిమీఁదనే దంతధావనము చేసికొనుచు ఫిర్యాదులు మొదలయినవానిని విను చుందురు. దానికి సమీపమున బొఁడకొయ్య యొకటి యున్నది. దానికి కొంచెము దూరములో పశువుల బందె దొడ్డి యెదురుగా కనఁబడుచుండును. పొలములలో పని లేనివారు సాధారణముగా సాయంకాలమునం దాయరుగుమీఁదకూర్చుండి లోకవార్తలను కాలస్థితిని పంటలవిధమును చెప్పుకొనుచు ప్రొద్దుపోయినతరువాత ఇంటికి పోవుచుందురు.

నారాయణమూర్తి తన ప్రయాణముసంగతి అన్నగారితో మాటాడుచుండఁగా లోపలినుండి యశోదమ్మ "మంత్రసాని" "మంత్రసాని" అని కేకలువేయుచు వచ్చి కొడుకులను చూచి పరుగెత్తుకొని

వెళ్ళి నాగమ్మను తీసికొనిరం డని చెప్పి మరల లోపలికి పోయెను. ఆచుట్టుపట్ల నాలుగయిదు గ్రామములకెల్లను నాగమ్మ యొక్కతెయే మంత్రసాని. అది శూద్రజాతిస్త్రీ; దాని కిప్పుడు రమారమి యేఁబది సంవత్సరము లుండవచ్చును. అది చిన్నతనములో నెవ్వనినో తీసికొని లేచివచ్చిన దని చెప్పుదురు. దానికి బిడ్డపాప లెవ్వరును లేరు. అది ముంగొండాగ్రహారమున కరక్రోసెడుదూరములో నున్నచిన్నపల్లె యందు గుడిసె వేసికొని కాపుర మున్నది. దానికి ప్రసవ వైద్యము గాని సుఖప్రసవమునకు చేయవలసిన సదుపాయములుగాని యేమియు తెలియకపోయినను కొన్నివేళ్ళను మంత్రతీర్థమును నొప్పులుపడువారి కిచ్చి మంత్రసానితనమున గట్టి దని ప్రసిద్ధి కెక్కినది. దానియింటి కారాత్రి అన్నదమ్ములిద్దఱును బయలుదేఱి వెళ్ళి సంగతిని చెప్పి వేగిరము రమ్మని పిలిచిరి. వా రెంత తొందరపడుచున్నను అప్పుడే ముట్టించినచుట్ట యగునఱకును నడవలో కుంపటివద్దనుండి లేచినదే కాదు. తరువాత మెల్లగా లేచి నులకమంచమును గోడకు లేవనెత్తి కుంపటి గదిలో పెట్టి కొన్నివేళ్ళను బట్టచెంగున మూటకట్టుకొని, ముతకబట్ట నొకదానిని పైకప్పుకొని, లోపలితలుపు వేసి వీధితలుపు బయట గొళ్ళెము పెట్టుచుండఁగా గుడ్లగూబ యొకటి కూసెను. ఆకూత విని యపశకున మైనదని నాగమ్మ మరల తలుపుతీసి లోపలికి పోయెను. వేంకటేశ్వరుల కప్పుడు గుడ్లగూబమీఁద పట్టరానికోపము వచ్చి దానిని తిట్టసాగెను. నారాయణమూర్తి జనులమూఢత్వమును శకునములయందలి పిచ్చినమ్మకమును తలఁచుకొని వారిస్థితి యెన్నఁడు బాగుపడునా యని యాలోచించుచుండెను. అన్నదమ్ముల శరీరము లిక్కడ నున్నను ధ్యాన మంతయు ఇంటిమీఁదనే యున్నందున వా రెన్నిసారులు తొందరపెట్టినను మంత్రసాని గడియసేపటివఱకును

లోపలినుండి కదలి రాలేదు. తరువాత పొద్దుపోయిన దని మూల గుచు వీధితలుపు తాళము వేసి నాగమ్మ బయలుదేఱఁగా అన్నదమ్ముల మాటలాడుకొనుచు దానివెంబడిని నడవసాగిరి.

వేంక — రేపు దశమినాడే వెళ్ళకపోతే అమావాస్య వెళ్ళిః పంచమినాడో సప్తమినాడో వెళ్ళరాదా ? అప్పటికి పురుడూ బారసాలాకూడా అయిపోతవి.

నారా—నేను రేపే వెళ్ళవలసింది. వేగిరంవెళ్ళకపోతే పాఠాలు పోతవి. వదిన నొప్పులు పడుతూయున్న దనే పిల్లను తల్లినీ సురక్షితముగా చూచి మరిపోవచ్చు నని రేపు ప్రయాణం మానుకొని నీతో దశమినాఁడు వెళ్ళుతా నని చెప్పినానుకాని యింటివద్ద అందరితోనూ రేపే ప్రయాణ మని చెప్పినాను.

వేంక—పోనీ దానికి పత్యం పెట్టి తల్లీ బిడ్డా సుఖంగా వున్న తరువాతనైనా వెళ్ళు.

నారా—అసలు ప్రసవ మయిన స్త్రీలను లంకణాలుకట్టడమే జబ్బు. వాళ్ళు ప్రసవమయ్యేటప్పటికే బొత్తిగా అలసిపోతారు; అందు మీఁద లోపలికి ధారకంకూడా లేకపోతే నిస్సత్తువపడి లేవలేకుండా వుంటారు. యీలంఖణాలమూలంగా కొన్నిసమయాలలో ఖాయిలాలు కూడా వస్తవి. దొర్లలో చూచినారుకారా లంఖణాలు కట్టకపోవడం చేత బాలింతరాళ్ళు యెంత దృఢంగా వుండి మరునాటినుంచీ లేచి తిరుగుతూవుంటారో. ఆడవాళ్ళను కూకలువేసి వదినెకు నీళ్ళాడిననాడే పత్యం పెట్టేటట్టుచెయ్యి

వేంక—బాలింతరాళ్లకు మూడురోజులు దాటిందాకా అన్నం మాట తలపెట్టరాదు. సరిగదా తాగడానికి పచ్చిమంచినీళ్ళయినా లోప

లకు యివ్వరాదు. జాతివైద్యం మనతత్వాలకు యెంతమాత్రమూ పనికిరాదు. వాళ్ళకు పక్కశస్త్రవైద్యం తప్ప మరియేమీ తెలియదు.

నారా—పోనీ నాలుగోరోజుదాకా పత్యం పెట్టకపోయినా నేను వదినె అన్నం తిన్నతరువాతనే వెళ్ళతాను. అన్నంవిషయము నేను చెప్పితే వినరుగాని పురిటిగదిలోనికి గాలివచ్చేటట్టు తలుపుతీసి వుంచే టట్టయినా చెయ్యి.

వేంక—బాలింతరాళ్ళకు గాలి బొత్తిగానే పనికిరాదు; పురిటిల్లు యెప్పుడూ చీకటికోణంగా వుండవలెను. తలుపుతీసి కొంచెం వెలుతురు రానిస్తే యెన్నెమ్మ వచ్చి శిశువుగొంతుక నొక్కివేస్తుంది. పెద్దపురుడు పదిరోజులలోను బహుజాగ్రతగా కనిపెట్టకొని వుండవలెను. ఇన్నిపురుళ్ళు పోసుకుంది అమ్మకంటె మనకు యెక్కువ తెలుసునా ?

ఈప్రకారముగా మాటలు చెప్పకొనుచు వారు కొంతసేపటికి ఇల్లు చేరిరి. మంత్రసాని కాళ్ళను చేతులును కడుగుకొని తా నావటికు కట్టుకొన్నబట్టను విడిచి యింటివా రిచ్చినబట్టను కట్టుకొని గదిలో ప్రవేశించి, ముందుగా తాను తెచ్చినవేళ్ళలో నొకటి సుందరమ్మ మొలకు కట్టి చెంబుతో నీళ్ళుతెప్పించి మంత్రించి లోపలికిచ్చెను. మంత్ర జలమును త్రాగనిచ్చుటకు ముందే శీర్షోదయ మగుచుండెను. అటు తరువాత కొంచెముసేపటికి పురుషశిశువు జనన మాయెను. ఆసంగతిని లోపలివారు కేక వేసినతోడనే వేంకటేశ్వరులు సంతోషముతో పొరుగున నున్న జ్యోతిష్కుని నిమిత్తమై పరుగెత్తెను. ఆసిద్ధాంతి నిద్రలో కన్నులు నలుపుకొనుచు లేచివచ్చి నక్షత్రములవంక చూచి కాలము కట్టి మఱునాడు జన్మపత్రికను వ్రాసియిచ్చెద నని చెప్పి రెండుమూడు దినములలో పూర్ణాయుర్దాయము గల దివ్యజాతకమును వ్రాసి తెచ్చి

తన బహుమానమును పట్టుకొనిపోయెను. ఇక్కడ మంత్రసానియు బొడ్డుకోసినప్పుడు రూపాయయు, పిల్లవానిని చేటలో పరుండఁబెట్టినప్పుడు రెండుకుంచముల బియ్యమును, వరుసనీళ్ళకు డబ్బులును బియ్యమును, గ్రహించుచు మామూళ్ళపేరు చెప్పి యెడెసమిదిరూపాయలను లాగెను. మూఁడుదినములవఱకును తల్లియు పిల్లయు సుఖముగానే యున్నట్టు కనఁబడిరి. పురిటిగది సత్యవతి పరుండుగదికి చేరి యున్న మిద్దెయిల్లు; దానికి చావడిలోని కొకద్వారమును దొడ్డిలోని కొకద్వారమును గలవుగాని దొడ్డితలు పెప్పుడును మూసి యుండును. ఇప్పుడు వాకిటిలోనికున్న తలుపులనుసహిత మత్తగారు పరాకు లేక సదా మూసి యుంచును. ఆగది అందుచేత పట్టపగలుసహితము చీఁకటి కోణముగా నుండెను. అందుమీఁద వెల్లుల్లిపాయలకంపును కుంపటి పొగయు చేరి గాలినంతను పాడుచేసినందున కొంచెముసేపు లోపలికి వెళ్ళువారికిసహిత మక్కడ నిలుచుట యెంతో యాయాసముగా నుండెను. చావడిగుమ్మముువద్ద పాతచెప్పొకటియు కలబందమట్ట యొకటియు భూతులసిచెట్టొకటియు మీఁద దూలమునకు వ్రేలాడ కట్టఁబడెను. ఆపురిటింటికంపు త్రోవపట్టుకొని పోవువారికే సహింపరాకుండఁగా సదా యింట నుండువారి సౌఖ్య మింక చెప్పనక్కరలేదు. బాలింతరాలు దాహముచేత నాలుక యెండిపోవుచున్న దని కేకలు వేసినను, ఆకలిచేత ప్రాణము పోవుచున్న దని యేడ్చినను, నాలవ దినమువఱకును దాని పేరు తలపెట్టఁగూడ దని అత్తగారు కోపపడెను. మూఁడవదినమున సుందరమ్మకు కొంచెము కన్నులుతిరుగుట కడుపులో వికారముగా నుండుట మొదలయిన కొన్ని దుర్లక్షణములు కనఁబడినవిగాని ఆసంగతిని చెప్పినచో లంకణము లెక్కువ కట్టుదురని భయపడి యెవ్వరితోను చెప్పక దాచి రహస్యముగా నొక్కసత్యవతితో

మాత్రము చెప్పెను. సత్యవతి కారణమును తెలిసికొని, అత్తగారు భోజనమునకు వెళ్ళినప్పు డెవ్వరికిని తెలియకుండ తనగదిలోనుండి వచ్చి దొడ్డితలుపు తీసి కుంపటి నావలకు తీసికొనిపోయి గదిలోపలికి మంచిగాలి వచ్చునట్లు చేసి రహస్యముగా త్రాగుటకు మంచితీర్థమును తెచ్చియిచ్చెను. అందువలన బాలింతరాలి దేహము కొంత స్వస్థపడెను. అన్నపానములు లేకపోయినను లోపలికి కావలసినంత యింగువయు, కాయమునుమాత్రము పెట్టుచుండిరి. నాలవదినము పథ్యము పెట్టిన తరువాత నారాయణమూర్తి బయలుదేరి రాజమహేంద్రవరమునకు చదువునిమిత్తము వెళ్ళిపోయెను. పథ్యము పెట్టినతరువాతి తన దేహ స్థితిని బాలింతరా లత్తగారితో చెప్పఁగా ఆమె తొందరపడి గ్రామములో వైద్యము చేసెడు పూజారి శరభయ్యను తీసికొనిరాఁగా, అతఁడు పురిటింటిలోనికి వెళ్ళి బాలింతరాలిచేయి చూచుట కంగీకరింపక మంత్రసానిచేతనే చేయి చూపించి తన కౌషధయోగము లేవియు తెలియకపోయినను సూతికాభరణము, వాతవిధ్వంసి, వాత రాక్షసము మొదలయినపేరులు చెప్పి యేవో లోపల కిచ్చెను. ఆవైద్యుఁ డిచ్చినమందులకంటె సత్యవతి చేయుచువచ్చినయుపచారమే బాలింతరాలి దేహమును స్వస్థపరిచెను. అత్తగారు మధ్యాహ్నము భోజనమునకు వెళ్ళి పరుండి చల్లవాటువేళ పురిటిగదిలో ప్రవేశించువేళవఱకును సత్యవతి రహస్యముగా దొడ్డితలుపు తీసియుంచి శుద్ధ వాయువు లోపల ప్రవేశించునట్లు చేసి యేమియు నెఱుఁగనట్లు అత్త గారు వచ్చునప్పటికి మరల తలుపువేసి యెప్పటియట్లు యుంచు చుండును.

తలుపులు బొత్తిగా వేసియున్న మూఁడుదినములలోనే దుర్గంధ ముచేత గదిలో పేడపురుగులవంటి రెక్కలపురుగులు పుట్టఁగా

చూచినవారు ఎన్నెమ్మలని వానిని వెదకి చంపుచు వచ్చిరి. అయిదవ దినమున శిశువు పాలుత్రాగుట మానివేసినందున మఱునాడు ప్రాతఃకాలమున యశోదమ్మ పోలేరమ్మగుడివద్ద నున్నమాలదాని వద్దకు సోదెకు వెళ్ళఁగా వేంకటేశ్వరులు బయలఁబడి యదియంతయు తన మహాత్మ్యమే యని చెప్పెను. అందుమీఁద వేంకటేశ్వరులకు రూపాయ ముడుపుకట్టి తిరుపతికొండమీఁద పుట్టువెండ్రుకలు తీయింతుమని మ్రొక్కుకొనిరి. ఆఱవనాటిరాత్రి శిశువు కాలముచేసెను. అందఱును శిశువు సందుగొట్టిపోయెనని నిశ్చయించిరి. తల్లిమాత్రము పురుటిదినములలో తలుపుదీయుటచేత ఎన్నెమ్మ లోపలప్రవేశించి పిల్లవానిని నెత్తిఅడఁచెనని లోపల దుఃఖించెను. గాని తెలిసినచో సత్యవతిని తిట్టి కొట్టుదు రని చిరకాలమువఱకును పైకిచెప్పలేదు. తల్లి పదునొకండవదినమున శుద్ధస్నానము చేసి సుఖముగా నుండెను.

---

## అయిదవ ప్రకరణము.

---

చైత్రశుద్ధసప్తమినాఁడు యశోదమ్మ సవతిఅన్నగారి మనువనికి పుట్టువెండ్రుకలు తీయించుటకు నిశ్చయించినందున వెనుకటిదినము రాత్రి వచ్చి వారు స్త్రీలను పురుషులను భోజనమునకు పిలిచిపోయిరి ఆ సవతియన్న తన ద్వితీయభార్య కొకకొమారుఁడు పుట్టినతరువా కాలముచేసెను. ఆయన్నకుమారునిపేరు శ్రీరాములు. అతనికొడుకునకే యీదినమున కేశఖండనముచేయ నిర్ణయింపఁబడినది. తెల్లవాఱి తరువాత కోడండ్రను వెంటబెట్టుకొని అన్నగారియింటికి వెళ్ళుటకై యశోదమ్మ ప్రయాణమయి తల దువ్వుకొనుచున్న పెద్దకోడలిని వేగిరము రమ్మని తొందరపెట్టి పిలుపుమీఁద పిలుపుగా నాలుగుసారులు పిలిచెను

సుంద—నేనేమి లోపల ఆడుకుంటూ వున్నా ననుకొన్నారా యేమిటి అలాపిలుస్తారు ? మెట్టుచీర పెట్టెలో పెట్టి తాళంవేసుకొని వీధులో నిలుచుని పిలిస్తే యీమురికచీరతో నేను యేలాగువస్తాను ?

యశో—నేను యిప్పుడు మళ్ళీ లోపలికి రాలేను. నీ అందానికి మెట్టుచీర లేకపోతే లోపంరాదు. ఆమురికచీరతో రావచ్చును.

సుంద—నేను మంచిబట్ట కట్టుకుంటే వోర్వలేరేమి? బంధువుల యింటికి భోజనానికి వెళుతూ తగుదునని నేను యీమేలికమ్మిచీరతో రానా ?

యశో—వోసి నీనోట్లో పుండుపుట్ట ! నీవు బట్ట కట్టుకుంటే నేను వోర్వలేనటే ? యీకట్టుకున్న బట్టమాత్రం మేముయివ్వకపోతే నీఅబ్బ ముల్లెపెట్టి కొనుక్కున్నావటే ? కుక్కనుతీసుకువచ్చి అందలంలోపెడితే తలుపులన్నీ తెగకొటికిందని, కులంతక్కువవాళ్ళను తెచ్చి యింట్లో పెట్టుకుంటే మీబుద్ధులు మీరు పోనిచ్చుకుంటారా యేమిటి?

సుంద—కావలిస్తే నన్ను అన్యాయంగా ఆడిపోసుకున్నవాళ్ళ నోట్లో పుండుపుడుతుంది. నేను కులంతక్కువదాన్ని అయిందీ నీవు కులం తక్కువదాన వయిందీ నీమాటలవల్లనే తెలుస్తూవున్నది.

సత్య—అక్కా ! పెద్దది అత్తగారు యేమైనా అంటే మనకు పడడం విధాయకం. పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డవాళ్ళుకారు. నామాట విని నీవు వూరుకో. నీకుకావలిస్తే నాబనారసుచీర యిస్తాను కట్టుకుందువుగానిరా.

సుంద—కావలిస్తే నీవుమాటలుపడు; నేను వక్కనాటికిమాటలు పడను.

సత్య—ఆమాటలు నామీద పడి కొట్టవు. ఆమాటలన్నీ నన్నే అన్నదనుకుని లేచిరా.

యశో—వోసి నీ కేమి అంతేకాలం వచ్చిందంటే ఆలా పొంగి పోర్లపడుతూవున్నావు! వోసి నీవాలుకపుచ్చిపోనూ! నన్ను కులం తక్కువదాన్నంటావూ! నీ మొగుడు యింటికిరానీ యీరోజుననిన్ను యేమిచేయిస్తానో!

సుంద—వస్తే యేమిచేస్తారు? నేను తెచ్చిన అప్రతిష్ఠకు నన్ను చంపుతారా యేమిటి? పోనీ చంపితే చూతాము, వక్కసారి చంపివేస్తే యీకోడంట్రికమయినా విరగడయి పోతుంది.

సత్య—అక్కా! నిన్ను గడ్డంపట్టి బతిమాలుకుంటాను నామనవి విని లోపలికి నడువు.

అని సత్యవతి బలవంతముగా సుందరమ్మను రెండుచేతులతోను గెంటుకొనిపోయి లోపల కూరుచుండబెట్టి, ఏమో అనబోవు చుండగా శాంతించుమని తోటికోడలిని బతిమాలుకొనుచుండెను.

యశో—యీచిన్నదానికికూడా అంతకంతకు చేటుకాలం మహావస్తూవున్నది. తనఅక్క గారిని నేనేమో కానిమాటలాడినట్టున్ను, తాను మంచిమాటలాడి వోదార్చినట్టున్ను, మధ్య అడ్డంవచ్చి దాన్ని లోపలికి లాక్కుపోయింది. అదుపూ ఆజ్ఞాలేక బొత్తుగా హద్దుమీరి పోతూవున్నది. అస్తమానమూ చదువంటూపెట్టి తాను చెడడమే కాకుండా కట్టుదాన్ని సీతనుకూడా చదువుచెప్పి పాడుచేస్తూవున్నది. అదికూడా వదినగారిలోచేరి నామాటవినకుండా చదువు మానమంటే మానకుండావున్నది. నారెండోకొడుకయినా మంచిసంబంధం వస్తుందేమో అంటే, వాడిచదువు చట్టుబండలుగాను వాడి యింగ్లీషు చదువుమూలంగా యీలాగంటి దిక్కుమాలిన సమ్మంధం వచ్చింది. తండ్రిభాగ్యంచూచుకుని తనపాటివారు భూలోకంలో లేరని కిందా మీదాకూడా వుండకుండావున్నది. వట్టినాలిముచ్చు; యెన్నన్నా

కిందిచూపులుచూస్తూ ముద్దులాగు మాట్లాడదు; అది చేసేచేష్టలు మెవరికీకనపడవు. యేమయినాఅంటే నలుగురికీ నానోరుమాత్రం బయలుపడుతుంది. వాళ్లనోళ్లలో పురుగులుపడ! అది ముద్దరాలనీ నేను వూరికే దాన్ని కోసిపెడతాననీ అమ్మలక్కలునన్ను ఆడిపోసుకుంటారు.

అని యశోదమ్మ రెండవకోడలిని, పెద్దకోడలినికూడా వీధి గుమ్మములో కూరుచుండి నోరునొప్పిపెట్టి అలసటవచ్చువరకును తిట్టెను. ఈలోపల సావిత్రమ్మకూడా నీళ్ళబిందె యెత్తుకొని వీధిలో నుండివచ్చి, కోడండ్రు తన్ను కులహీనురాలన్నారని తల్లిచెప్పగా విని నోరికివచ్చినట్లెల్లను సుందరమ్మను సత్యవతిని వారి తలిదండ్రులను విసుగువచ్చినదాక తిట్టెను. మధ్యమధ్య సుందరమ్మకూడ అందుకొని తిట్టఁబోయెను గాని సత్యవతి బతిమాలుకొని నివారించెను. ఇటువంటి అత్తలును ఆడుబిడ్డలును లోకములో పలువుర కుండియుండవచ్చును. అటువంటివారితో ఈగ్రంథము చదువతటస్థించినవా రెవ్వరును కలహము పెట్టుకొని తిట్టుకు మాఱుతిట్టు తిట్టక సత్యవతియొక్క శాంతత నవలంబించి కలహము చంపివేయుటకు ప్రయత్నింతురని కోరుచున్నాను. ఈప్రకారము వర్షముకురిసి చల్లారినట్లు నిశ్శబ్దముగానుండి అత్తగారును కోడలును మూతి ముడుచుకొని చెఱియొకచోటను కూరుచుండియుండఁగా వీధిలో జీడిమామిడిపండ్ల కేక విని రామానుజమ్మ పండ్లుకొనిపెట్టుమని ముత్తవతల్లిబట్ట పట్టుకొని లాగెను.

యశో—అడ్డమయినవాళ్ళూ నన్నుపట్టుకుని పీక్కుతింటారు. యేమయినా కావలిస్తే మీ అమ్మనూ బాబునూ పట్టుకుని యేడవరాదా ?

అని కసరుకొని యశోదమ్మ [illegible] రామానుజమ్మ "పళ్ళుకొనిపెట్టు" అని యేడ్చు[illegible]పోఁగా

నమోదు సంఖ్య [805]
1-10-82

తల్లి నాలుగుతిట్టి వీపుమీఁద రెం డదవులు అడఁచినది. దానిమీఁద ఆపిల్ల మరింతయేడ్చుచు; ఆయేడుపులోకూడ "అమ్మా పళ్ళే" అని కేకలువేయుచునే యుండెను. సాధారణముగా మనదేశపుస్త్రీలు తమ కితరులమీఁద కోపము వచ్చినప్పుడు నిష్కారణముగా తమనోరెఱుఁగని బిడ్డలను కొట్టి తిట్టుచుందురు. ఇదిచదువువా రట్టి యవివేకకార్యము నన్నఁడును జేయకుందురుగాక! అప్పుడు సత్యవతి తన పెట్టెతీసి రెండు డబ్బులు చేతఁబెట్టుకొని పిల్లను చంకవేసికొనివచ్చి పండ్లుకొనిపెట్టి యూఁదార్చెను. అత్తగా రదిచూచి కొఱకొఱలాడుచు కోడలిమీఁద నెటికలువిఱిచి "భాగ్యవంతుల కూతుళ్ళు కోడళ్ళవడంకంటె పరువుగల వాళ్ళకు అనర్థంలేదు. యేదికావలిస్తే అదెల్లాకొనిపెట్టి పిల్లలకు మంకుతనం నేర్పుతారు" అని తనలో తాను సణుగుకొనుచుండెను. ఇంతలో శ్రీరాములు గారియింట పనిచేయు దాసివచ్చి "అమ్మగారు మిమ్మలినీ కోడళ్ళనీ వేగిరం రమ్మన్నారు" అని పిలిచెను. అప్పుడు 'నేమరా' నని సుందరమ్మయు, 'నీవు రాకపోతే నేనూ పో' నని యశోదమ్మయు, పట్టుపట్టి కదలకకూరుచుండిరి. సత్యవతి వారినిద్దఱిని బతిమాలుకొని వా రెన్నిమాటలు తోసివేసినను ఎన్నిసారులు కసరుకొన్నను సహించి బలవంతముగా లేవఁదీసి ప్రయాణముచేసి, తనకు పుట్టినింటివారిచ్చిన విలువబట్ట లెన్నియున్నను వానిని కట్టుకొనక సాధారణమైన తెల్లచీరెను కట్టుకొని రామానుజమ్మను చంకనెత్తుకొని తనమంచి చీరెను సీతకుకట్టఁబెట్టి తననగలు పెట్టి ముందునడిపించుకొని, అత్తగారివెంట బయలుదేరెను. యశోదమ్మ వెళ్లునప్పుడు 'సావిత్రీ! యిల్లు భద్రము' అని పెద్దకొమార్తెతో చెప్పి యొప్పగించి ముందునడవసాగెను.

సావిత్రి కప్పు డిరువదినాలుగు సంవత్సరముల వయ స్సున్నది. వేంకటేశ్వరుల పెండ్లినిమిత్తము సొమ్ము కావలసినప్పు డయిదు

వందలరూపాయలను పుచ్చుకొని తల్లిదండ్రులామెను డెబ్బదిసంవత్సరముల ప్రాయముగల మూడవపెండ్లివరున కిచ్చి వివాహము చేసిరి. అతఁడు వివాహమైన రెండవయేటనే కాలధర్మము నొందెను. అప్పులవారు పెండ్లికి చేసిన ఋణములక్రింద వ్యాజ్యములువేసి మాన్యముల నమ్మించివేసిరి. రెండు సంవత్సరముల క్రిందట కోటిపల్లియాత్ర వెళ్ళినప్పుడు సావిత్రిశిరోజములు తీసివేయించిరి. ఆమె జీవనము నిమిత్తమయి యేమైన నియ్యవలసినదని యత్తవారి నెన్నిసారు లడిగినను వారు లక్ష్యము చేయనందున బీదతనముచేత కొమార్తెను భరించుట కష్టముగాతోఁచి లక్ష్మీనారాయణగారు తనకొమార్తె సవతికొమారుని మీఁద భరణమునిమిత్తమయి అమలాపురము డిస్ట్రిక్టుమునసబుకోర్టులో వ్యాజ్యము తెచ్చెను. అందు మీఁద నతఁడు తన తండ్రిసొత్తు తనకు చెందలేదనియు, తనసవతితల్లి వ్యభిచారిణియనియు, వాదించి భరణము నెగఁబెట్టవలెనని సకలవిధముల పాట్లు పడెనుగాని పితార్జితమయిన పెంకుటి ల్లున్నదని ఋజువుపడినందున మునసబుగారు సంవత్సరమునకు పండ్రెండు రూపాయలచొప్పున భరణము నిచ్చుటకు తీర్పుచెప్పిరి. మనోవృత్తిని మాన్పించుకొనుటకయి పన్నినకుతంత్రమే కాని నిజముగా సావిత్రి యొంతమాత్రమును వ్యభిచారిణి కాదుసుండీ. ఆమె కొంతగయ్యాళి యయినను, మూఢభక్తికలదై రెండవపూట భోజనమైనను చేయక తఱచుగా వ్రతములు పట్టి యుపవాసములు చేయుచు బహునిష్ఠ కలదయి యింటిపని యంతయు చేయుచుండును.

అత్తయు కోడండ్రును శ్రీరాములుగారియింటికి వెళ్ళునప్పటికి శ్రీరాములుగారిభార్య వాకిట నుండెను. అందుచేత పిండివంటచేయువారెవ్వరును లేక అత్తగారు మడికట్టుకొని వంటచేయుచు యశోదమ్మను రహస్యముగా లోపలికిపిలిచి యేమిబుద్ధి అని యాలోచన యడిగెను.

యశో—వదినా! నాపెద్దకోడలు వోపలేనిది; మూడునెలల క్రిందనే నీళ్ళాడి బిడ్డచచ్చి యేడుస్తూవున్నది; అదియేమీ చెయ్యలేదు గదా! రెండవకోడలు మహారాణీగారు; ఆమె భాగ్యవంతుల ఆడ బడుచు; ఆవిడకు దణ్ణాపెట్టి వూరుకుండవలెనుగాని పనిచెయ్యమని మనం నోరెత్తరాదు. నేను పెద్దదాన్ని పొయ్యివద్ద నాకు కళ్ళు కనపడవు.

అని యశోదమ్మ కొన్ని మిషలుచెప్పి తప్పించుకొనెను. వంట యెంతవఱ కయినదో చూడవలెనని లోపలికివెళ్ళిన సత్యవతి లోపలియిబ్బంది చూచి తాను మడికట్టుకొనివచ్చి యెవ్వరును తన్నడుగకయే తోడుపడి పిండివంటచేసి వడ్డనలోకూడ సాయముచేసెను. అప్పు డామె గర్వరాహిత్యమున కొక్కయత్తగారుతప్ప తక్కినవా రందఱును సంతోషించిరి. సత్యవతివలెనే స్త్రీలందఱును తాము గొప్పవారమని గర్వపడక పనిపాటులు చేసి యితరులకు చేతనైన విధమున సాయముచేయవలెను. ఒడలు వంచి పనిచేసినయెడల గౌరవ లోపము వచ్చుటకుమాఱుగా అందఱును గర్వము లేనిదనియును యోగ్యురా లనియును చెప్పుకొనుటవలన మఱింతగౌరవమును ప్రీతియు వచ్చుటయే కాక దేహారోగ్యమును సౌఖ్యమును కూడ కలుగును. సత్యవతి చేసిన యాస్వల్పసాహాయ్యమువలన ఇంటివారొక్కరు సంతోషించుటయే కాక యామె సౌజన్యమును వారు చుట్టుపట్ల వారితో ప్రశంసించుటచేత గ్రామములో ఆమె కపరిమితమైన కీర్తి వచ్చినది. ఆదినము భోజనము లయినతరువాత యశోదమ్మ తనకోడం డ్రితోగూడ సాయంకాల మింటికి వచ్చినది.

## ఆఱవప్రకరణము

---

నాటిరాత్రి యింటికివచ్చిన తరువాత సుందరమ్మ పడకగదిలో పెనిమిటితో తనకును అత్తగారికిని అయిన జగడమును చెప్పి, తానెందులోనయినపడి చచ్చెదనని యేడువ మొదలుపెట్టెను. వేంకటేశ్వరులును భార్యమాటలునమ్మి మనము వేఱుందమనిచెప్పి భార్యనోదార్చి మఱునాటినుండియు తల్లితో తిన్నగా మాటాడక కొఱకొఱలాడుచు; ఒకనాఁడు భార్యయు తల్లియు మరల పోట్లాడినప్పుడు భార్యను వెనుకవేసికొనివచ్చి తల్లిని కానిమాట లాడెను. అందుమీఁద యశోదమ్మ కోపగించుకొని యెందఱెన్నివిధముల బతిమాలుకొన్నను అన్నము తినక లేచిపోయి పొరుగింట కూరుచుండెను. అప్పుడు సావిత్రియు సత్యవతియు వెళ్ళి యశోదమ్మను బహువిధముల బతిమాలుకొని, కొంతవఱకు కోపము శాంతిపఱచి యెంతో కష్టముమీద దీపాలవేళ బలవంతముగా ఇంటికి తీసికొనివచ్చి విస్తరిముందు కూరుచుండఁబెట్టిరి. కాని యాదిన మామె యన్నము తిన్నగా తినక రెండుముద్దలు నోటపెట్టుకొని విస్తరి విడిచిపెట్టి లేచిపోయెను. ఆదినము మొదలుకొని యశోదమ్మకును పెద్దకోడలికిని మాటలే లేవు. అయినను వా రప్పుడప్పుడు పిల్లిమీఁద పెట్టియు ఎలుకమీఁద పెట్టియు ఒండొరులను తిట్టుకొనుచు, ఒకానొకప్పుడు నిష్కారణముగా నేదోవంక కల్పించుకొని దొమ్ములాడి నోటపట్టరాని దుర్భాషలాడి తాను తప్పెఱుఁగక నీమగఁడును బిడ్డలును చావవలెనని యశోదమ్మయు నీమగఁడును బిడ్డలును చావవలెనని సుందరమ్మయు శపించుకొని పురుషు లింటికి వచ్చునప్పుటికి పెద్దపెట్టున నేడ్చుచు గృహ మొక మహారణ్యముగా నుండునట్లు

చేయుచుండిరి. పూర్వము మగఁడు కొంచెము తల్లిపక్షమున నున్నప్పుడు సుందరమ్మ తిట్టుకు మాఱుతిట్టుతిట్టి ప్రత్యక్షముగా అత్తగారి నెదిరించుటకు కొంచెము సంశయించుచు వచ్చినను, ఇప్పుడు మగఁడు తనపక్షమయినందున పూర్వపు సంశయము విడిచి యశోదమ్మ యొక తిట్టుతిట్టికి తాను పదితిట్లు తిట్టుచు మగనిని కొట్టి మొగసాల కెక్కిన దన్నట్లు మగఁడింటికి వచ్చునప్పటికి లేనిపోనివిపది కల్పించుకొని మూల ముసుఁగు పెట్టుకొని పరుండి యేడ్చుచుండును. అతఁడును భార్యనే వెనుకవేసికొని వచ్చి తల్లితోడనే జగడ మాడుచుండును. అప్పుడప్పుడీజగడములలో తల్లిపక్షమున సావిత్రికూడ చేరుచుండును. అందుచేత కొన్ని రాత్రులయం దిరుగుపొరుగులవారికి నిద్రయే యుండదు. లక్ష్మీనారాయణగారెవ్వరిని శాంతిపఱచుటకును శక్తులు కాక యెవ్వరిజోలియు తలపెట్టక మెతుకులు నోట వేసుకొన్నతరువాత సాధ్యమయినంతవఱ కింటివద్ద నుండక యీ కలహములు చెవిని బడకుండ నల్లుగా ఎవ్వరియింటనైనను కూరుచుండురు. రామస్వామి యిప్పుడమలాపురములో ఉపాధ్యాయునితో పోట్లాడి రాజమహేంద్రవరమునకు లేచిపోయి అక్కడనున్న చిన్నపాఠశాలలో నొకదానిలో తగకపోయినను నాలవ తరగతిలో చేరి, అన్నగారియొద్దనే యుండెను. ఆకాలములో రాజమహేంద్రవరమున చిన్నపాఠశాలలో పోటీలుగా నున్నందున, పిల్లలు తాము చేర్చుకొను తరగతికి తగుదురా తగరా యన్న విచారము చేయక యెవ్వ రేతరగతిలో చేరుదుమని వచ్చిన వారి నాతరగతిలో చేర్చుకొనుచుండిరి. ఈవిధముగా నింట ప్రతిదినమును కలహముగా నున్నందున లేచిపోయి. సుబ్రహ్మణ్యము అమలాపురములో క్రైస్తవపాఠశాలలో ప్రవేశించి వారము లేర్పఱుచుకొని చదువుకొనుచుండెను. సత్యవతి తనశక్తి యంతయు వినియోగించి

అత్తగారిని కాళ్ళుపట్టుకొని ప్రార్థించియు, అక్కగారిని గడ్డముపట్టుకొని బతిమాలియు, వారన్న కానిమాటల కన్నిటికి తలయొగ్గి యోర్చుకొని యేవిధముననైన కలహములు చంపివేసి యుద్ధతిని సమాధాన పఱుపవలె నని పాటుపడెను. గాని మూర్ఖురాండ్రగుట, వారియెడల ఆమె మంచిమాట లెంతమాత్రమును పనికివచ్చినవి కావు. మూర్ఖులను బ్రహ్మ దిగివచ్చి బోధించినను సంతోషపెట్టలేఁ డన్నమాట అందఱును ఎఱిఁగియున్నదే కదా? అట్లు సత్యవతి వేఁడుకొన్న కొలఁదిని సుందరమ్మకు మత్సర మెక్కువయి తుద కామెతో మాటాడుటయే మానివేసెను. ఆమె యత్తగారి కోపమును చల్లార్చుటకయి మంచిమాటలు చెప్పినప్పు డెల్లను మండెడు పెనముమీఁద నీళ్ళుపోసినట్లు మఱింత మండిపడి యశోదమ్మ పెద్దకోడలిమీఁది కోపమునుగూడ సత్యవతిమీఁదనే కనఁబఱుచుచు అయినదానికిని కానిదానికినికూడ నిర్హేతుకముగా తిట్టుచు సకలబాధలను పెట్టుచుండెను. సత్యవతి యెవ్వ రెన్నిపాట్లు పెట్టినను సహించి, తానెన్నటికిని మంచిది కాక పోయినను తన ప్రయత్నమును మానక వారి నేలాగు నయిన పొందుపఱుపవలయు నని మనసులో భగవంతుని ధ్యానించుచుండును. ఈవిధముగా నున్నప్పుడు కలిసి యుండుటకు సరిపడక వేంకటేశ్వరులును భార్యయు వేఱుండి ప్రత్యేకముగా వంటచేసికొనుట కారంభించిరి. ఇట్లు గృహచ్ఛిద్రములు దినదినక్రమమున వృద్ధియగుచు వచ్చినను మగని మనస్సునకు విచారము కలుగు నని యోచించి ప్రతివారమును తాను నారాయణమూర్తిపేర వ్రాయు జాబులలో సత్యవతి యీసంగతి యెంతమాత్రమును ఉదాహరించినదికాదు.

అక్కడ నారాయణమూర్తియొక్క తెలివియు, బుద్ధియు, విద్యయందలి సక్తియును, చూచి నాలవతరగతిలో చదువుకొనుచున్న

యాతని తమ్ముఁడును అట్టివాఁడే యగు నని నమ్మి రాఘవయ్యగారి దూరబంధుఁ డైనగోపాలయ్యగారు తనకొమార్తె యయినమహాలక్ష్మిని రామస్వామి కియ్యవలెనని యుద్దేశించి నారాయణమూర్తితో చెప్పఁగా అతఁడు తండ్రిపేర వ్రాసెను. గోపాలయ్యగారికి మండల న్యాయసభలో నెలకు పదియేనురూపాయలజీతము గల పని యున్నది. మహాలక్ష్మి కిప్పుడు పండ్రెండవసంవత్సరము వచ్చినది. ఆచిన్నది శ్రీమహారాజుగారి బాలికాపాఠశాలయందు పయితరగతిలో చదువుకొనుచు విద్యాబుద్ధులయందు తోడిబాలికలను మించి ప్రతిసంవత్సరమును మంచిబహుమానములను పొందుచు వచ్చెను. రాజకీయపాఠశాలలో ఐదవతరగతియందు చదువుకొనుచున్న కృష్ణమూర్తి యను పదునాలుసంవత్సరముల యీడుగల చిన్నవాఁడు నిత్యమును నారాయణమూర్తివద్ద పాఠములు చెప్పించుకొను చుండెను. అతఁడు తనతరగతిలోని వారిలో మిక్కిలి తెలివిగలవాఁడు. అతనికి తల్లిమాత్రమున్నది. అతనికి మాన్యము లేవియు లేకపోయినను తల్లి తననగల నమ్మి వడ్డికివేసిన రెండుమూఁడువందల రూపాయలతోను కొమారునికి విద్య చెప్పించు చుండెను. ఆచిన్నవానికి సీత నియ్యవలెనని నారాయణమూర్తికి తాత్పర్యముండి తండ్రిపేర వ్రాయఁగా, అతఁ డందున కంగీకరించి ప్రత్యుత్తరము వ్రాసెను. ఈ సంగతి యాచిన్నవానితల్లికి తెలుపఁగా, ఆమె యపరిమిత సంతోషభరితురా లయ్యెను. ఈవిధముగా రెండుసంబంధములు నింత యనుకూల మయినవి దొరికినందున వైశాఖమాసములో వివాహములు చేయుటకు నిశ్చయింపఁబడెను. వ్యయములోవ్యయము 'కూడివచ్చు నని' అక్కడ లక్ష్మినారాయణగారు తనభార్య తమ్మునికొమార్తెను సూరమ్మను సుబ్రహ్మణ్యమునకు చేసికొనుట కొప్పుకొని యీమూఁడు పెండ్లిండ్లును ఏక కాలమునందె

చేయుటకు నిశ్చయము చేసికొని పొలముమీఁద నాలుగువందలరూపా యలు బదులు చేసి పొలమును ముప్పదిసంవత్సరముల కౌలు కాపు వానికి వ్రాసియిచ్చెను. ఈసూరమ్మతండ్రి తొమ్మిదిసంవత్సరముల క్రిం దనే కాలము చేసినందున తల్లి సవతిబావగారితో పోట్లాడి పుట్టినింటికి లేచిపోయి వ్యాజ్యమువేసి భరణము పుచ్చుకొనుచున్నది. సూరమ్మ కిప్పుడు పదవసంవత్సరము వచ్చినది. పల్లెలలో పెరిగినది గనుక చదు వన్నమాట యెఱుఁగదు. ఈపిల్లను తనకొడుకునకు చేసికొనుటకు లక్ష్మీనారాయణగారి కెంతమాత్రమును ఇష్టము లేకపోయినను ఆపిల్లను తప్ప మఱియొకపిల్లను చేయవల్లపడ దని పట్టుపట్టిన భార్య పోరు పడలేక వివాహములో వివాహము చేసినచో సొమ్ము కలిసి వచ్చు ననుకోరిక చేత తుద కెట్టకే యంగీకరించెను.

నారాయణమూర్తి వేసవికాలపు సెలవులలో ఇంటికి వచ్చునప్ప టికి పెండ్లిపనులుచేయఁబడు చున్నవి. వైశాఖశుద్ధ దశమినాఁడు సుము హూర్తము నిశ్చయింపఁబడి యావఱకే బంధువులకు శుభలేఖలు వ్రాయఁబడినవి. అయినను గృహమున నొకరికొకరికి పడకపోవుటచేత ఎవ్వరు తిన్నగా శ్రద్ధవహించి పనిచేయక తమకంటనట్టు లటస్థముగా నూరకుండుచు వచ్చిరి. ఒక్కసత్యవతియు కొంతవఱకు సావిత్రియు పనిపాటులలో మిక్కిలిశ్రద్ధగా తిరుగు చుండిరి. నారాయణమూర్తి తల్లివలన ఇంటిస్థితియంతయు విని ఖేదపడి, అన్నతో మాటాడి యంద ఱిని కలుపవలె నని చూచెనుగాని యందువలనను కార్యము లేక పోయెను. వేంకటేశ్వరులు తానొక్కఁడే గడించి తెచ్చుకొనుచున్నా నికుండ ననియు, పెండ్లికార్యమునిమిత్త మున్నమాన్యములనుకూడ తాకట్టు పెట్టుటవలన పయిగా వచ్చుమార్గము లేక ముందు కుటుంబ భార మంతయు తనమీఁదనే పడు ననియు తలఁచి తానెలాగున

నయిన వీడిపోయి వేఱుండవలె నని మనస్సులో నిశ్చయించుకొన్నం దున పంపక అతఁడా హేతువును చెప్పకపోయినను స్త్రీల కలహములు మొదలయిన కారణములు చెప్పి యిఁక కూడియుండుట పొసఁగనేర దని స్పష్టముగా చెప్పెను. అంతట వివాహములు వచ్చినందున లోపల నున్న ద్వేషమును మ్రింగి నలుగురును ఏమనుకొందురో యని యందఱును పంపక కలిసి యుండిరి. వివాహములు యథావిధిగానే జరగినవి కాని యందులో నెక్కడ తప్పుదగినంతవిశేషము లేవియు కనఁబడ లేదు. పెండ్లివా రంతగా అలుగకపోయినను, పెండ్లివారివెంట క్రొత్త బట్టలనిమిత్తము వచ్చిన దూరపుచుట్ట మొకఁడు ముందుగా తనకు పీట వేసినారు కారనియు తనకు విశేషగౌరవము చేసినారు కారనియు అలిగి యొకదినము భోజనమునకు లేవక పెండ్లివారినందఱిని మూడు జాములవరకును మాడ్చుటమాత్రము కొంతవిశేషము. ఆదినమున నారాయణమూర్తి సాహసము చేసి పెండ్లివారందఱికిని బోధచేసి యాతనిని విడిచిపెట్టియే భోజనము చేయునట్లు చేయకపోయినయెడల మఱికొన్నివిశేషములు పుట్టునుగాని అట్లు చేయుటవలన మఱునాటి నుండి యాచుట్టమే ముందుగా భోజనమునకు వచ్చికూర్చుండుటచే ఏవిశేషములకును అవకాశము లేకపోయినది. పురుషులలో నారాయణమూర్తియు స్త్రీలలో సత్యవతియు చేసినయాదరణము వలన అన్ని లోపములును నివారణమై యెల్లవారును సంతోషించిరి. సుందరమ్మ భోజనముల వేళకుమాత్రము వచ్చి యివిలే వని యవిలే వని లోపము లెంచుచు వచ్చినపేరంటాండ్రు నాదరించువారు లేరని వారిమీఁదను వీరిమీఁదను కోపపడు నేకాని యొక్కపని నైనను చేసినపాపమున పోయినదికాదు. సత్యవతి యొక్కతెయు వంటలో సావిత్రికి సాయము చేయుటయేగాక పేరంటాండ్రకు పసుపు రాచి తాంబూలము లిచ్చి

యాదరించుటలో యశోదమ్మకు తోడుపడి యేలోపమును లేకుండ వేయికన్నులున్నదానివలె ప్రవర్తించెను. అందుచేత సాధారణముగా పెండ్లిండ్లలో పోవుసిరీతిగా మూడువివాహము లొక్కసారిగా జరిగినను, ఇంటఁగలవస్తు వొక్కటియైనను పోలేదు. భాగ్యవంతుల యాడుఁబడుచైనను సత్యవతి యాప్రకారముగా పనిచేయుట చూచి యాగ్రామములో పడుచులు పలువురు పనివచ్చినప్పుడు దాసివలె పని చేయవలయు ననియు, అనుభవించునప్పుడు రాణివలె ననుభవింపవలయు ననియు, నేర్చుకొని యాప్రకారముగా నడవనారంభించిరి. నోటితో నూఱునీతులను చెప్పుటకన్న చేతితో నొక్కకార్యము చేసి చూపినయెడల, అది యెంతో ప్రయోజనకరముగా నుండి పలువురను మంచిమార్గమున నడిపించును.

---

## ఏ డ వ ప్ర క ర ణ ము

---

ఈప్రకారముగా వివాహములయి బంధువులను సాగనంపక మునుపే యొకదినమున యశోదమ్మకును పెద్దకోడలికిని పెద్దపోట్లాటజరిగినది. ఒకనాఁడు సుందరమ్మకూఁతురు రామానుజమ్మ చేతిలో జామపండును పెట్టుకొని యాడుకొను చుండఁగా, చిన్నపెండ్లికూఁతురు నారమ్మవచ్చి మంచిమాటలు చెప్పి పిల్లదానిచేతిలోనిపండు పుచ్చుకొని సగము తాను తిని తక్కిన సగమును మరల చేతిలో పెట్టెను. అది యేలాగు ననో సుందరమ్మకంటఁబడి చిన్నతోడికోడలిమీఁద కోపపడి తిట్టెను. ఆకేకలు విని యశోదమ్మ లోపలినుండి వచ్చి చిన్నకోడలిమీఁది పక్షముచేత తానందుకొని యుల్లెగిరిపోయినట్లుగా జగడ మాడెను. వా రిరువురును మాటలలో ఒకరి కొకరు తీసిపోవువారు కారుగనుక

చిత్రవిచిత్రముగా వన్నెలును చిన్నెలును కల్పించి తిట్టినతిట్టు తిట్టకుండ భాషలోనున్న కానిమాటల నన్నిటిని ఉపయోగింప సాగిరి. లక్ష్మీనారాయణగారది విని సహించి యూరకుండలేక భార్యను కూకలువేసి జగడము మానుమని తిట్టిరి. కోపావేశముచేత దేహము తెలియక యశోదమ్మ "లోకువయినదాన్ని నన్నుతిట్టకపోతే మీ కోడలిని తిట్టడానికి నోరు పడిపోయిందా ?" అని మగని నదిరించెను. ఎంత శాంతాత్ముల కయినను ప్రాణము విసిఁగినప్పుడు కోపము రాక మానదు గనుక, లక్ష్మీనారాయణగారప్పుడు కోప మాపుకోలేక భార్యను మూలనున్న కఱ్ఱతో నొకదెబ్బ వేసిరి. అందుమీఁద నాబిడ గోలుగోలున నేడ్చుచు పెద్దపెట్టున శోకమున కారంభించెను. ఇంతవఱకును గదిలో మంచముమీఁద పరుండి వేడుకచూచుచున్న వేంకటేశ్వరులు లోపలినుండి లేచివచ్చి తల్లిమీఁది కోపమున భార్యను చితుకఁగొట్టెను. అప్పుడు సుందరమ్మ యింట పిడుఁగు వెడలినట్లు తల విరియఁబోసికొని క్రిందపడి దొర్లుచు ఊరును వాడయు వినఁబడునట్లుగా పెద్దపెట్టున రోదనము చేయ మొదలు పెట్టెను. సాధారణముగా మూర్ఖురాండ్రకు తమ కార్యమును సాధించుకొనుటకు యేడుపే ముఖ్య సాధనమయి యేనిమిషమున కావలసిన ఆనిమిషమున సిద్ధముగా నుండును. స్త్రీలను విద్యావతులఁగా జేసి ఐకమత్యమువలనిలాభము తెలిసికొనునట్లు చేసినంగాని వారు వివేకము గలవారై పోరుతో కూడియుండి 'యొకయింట నూఱుజట్లముండునుగాని రెండుకొప్పులిముడవు' అన్న సామెత అసత్యము చేయఁజాలరు.

తరువాత పెండ్లికి వచ్చినచుట్టము లందఱును తమతమ గ్రామములకు వెళ్ళిపోయిరి. యశోదమ్మకు మిక్కిలి ప్రియ మగుటచేత మఱఁదలిని మేనకోడ లైన సూరమ్మను తనయొద్దనే మఱికొన్ని

దినము లుంచుకొనెను. నూరమ్మ చిన్నప్పటి నుండియు నల్లరిగా తిరిగినది గనుక, ఏదో దుడుకుచేష్టలు చేయుచు నెల్లవారితోను జగడ మాడి యత్తగారితో సందటివిూదను చాడీలు చెప్పుచుండును. ఆమాటలు నమ్మి యశోదమ్మ జగడమునకు వచ్చి యెల్లవారిని తిట్టు చుండును. ఒక్క సత్యవతి తప్ప తక్కినవా రందఱును మరల జగడ మాడుచుండుటచేత, ఇంట నిత్యమును ఏదో యొకవిధమున వివాదము సంభవించుచునే యుండును. అందులో ముఖ్యముగా యశోదమ్మకును సుందరమ్మకును జరిగెడు పోట్లాట చూచినవారి కీయిల్లు విడిచిపెట్టి యెప్పుడు లేచిపోయి సుఖింతుమా యనుబుద్ధి పుట్టకపోదు. సత్యవతి కోపపడకపోయినను నూరమ్మను దగ్గఱకుపిలిచి మంచిమాటలతో బుద్ధిచెప్పుచు వచ్చుటచేత కుక్కకు నేయి పడన ట్లాహితవచనము లాచిన్నదానికి పడక మనసులో కోపము పెట్టుకొని నూరమ్మ ప్రతి దినమును అత్తగారితో సత్యవతిమీద నేరములు చెప్పుచుండును. ఆమాటలు పట్టుకొని యశోదమ్మ నిష్కారణముగా నిత్యమును తిట్టి కొట్టి సత్యవతిని కోసిపెట్టుచు వచ్చినను మాట యెదురుమాట లేకపో వుటవలన పయి కేమియు కానరా కుండెను. మూఢురాండ్రగుటచేత మన స్త్రీలు సాధారణముగా నెదురుతిరిగి వారిజోలికి పోక తమకు లోబడి లోకువగా కనబడు వారిమీదనే యందఱిమీది కోపమును గనబఱతురుగనుక అత్తగారివలన సత్యవతికి కలుగుబాధ యింతింతని చెప్ప నలవికాదు. అట్లున్నను సత్యవతి చాటుననైనను అత్తగారు మంచిదికాదని చెప్పుటకాని మనసులో నయినను కోపము పెట్టుకొనుటకాని యెంతమాత్రమును లేదు. తల్లికి సుందరమ్మతోడిపోరు చూచి కొంతకాల మిద్దఱిని దూరముగా నుంచుట యుక్తమని తలంచి కార్యతల్లిని తనతోడ రాజమహేంద్రవరము తీసికొనిపోవలె నని

నారాయణమూర్తి యాలోచించుచుండఁగా, ఇంతలో లక్ష్మీనారాయణగారు రాజమహేంద్రవరము వెళ్ళివచ్చెద నని చెప్పి యెవ్వరికిని తెలియకుండ కొంతసొమ్ముతో కాశీయాత్రకు ప్రయాణమయి విశాఖపట్టణము చేరి యుత్తరము వ్రాసిరి ఆయుత్తరము వచ్చినతోడనే యింట నందఱును కొంత విచారించి యేలాగునైన నాతని మరల నింటికి రప్పింపవలె నని చూచిరి కాని యిఁక దారిని నాతనిని పట్టుకొనుట దుర్ఘట మనియెంచి యాప్రయత్నమును మానుకొనిరి.

తరువాత నారాయణమూర్తితల్లి మొదలయినవారితో రాజమహేంద్రవరమునకు వెళ్ళుటకు ప్రయాణములగుచువచ్చెనుగాని యున్నయూరి నొకపట్టున వదలలేక మంగళవార మని యొకనాఁడును, శుక్రవారమని యొకనాఁడును, అష్టమి నవము లని కొన్నిదినములును వర్జ్య మని యొకసారియు తిథివారనక్షత్రములు మంచివి కావని కొన్నిదినములును యశోదమ్మ జరపినమీఁదట తుదకు త్రయోదశినాఁడు ప్రయాణము నిశ్చయించుకొని యుండఁగా, ఇంతలో నేకాదశినాఁడామెకు జిగటవిరేచనము లారంభమయి విశేషజ్వరముకూడ నగపడెను. మొదట రెండుమూడుదినములు కూరగాయవైద్యము చేసిరి. కాని దానితో రోగము కుదురక మఱింత ప్రబల మయినందున మందిచ్చుటకయి పూజారి శరభయ్యను తీసికొనివచ్చిరి. అతఁడు చేయి చూచి యీరోగము మహాకారకముమీఁద పుట్టిన దని చెప్పి మూఁడు దినములలో విరేచనములు టక్కున కట్టించెద నని పదిరూపాయలొప్పించుకొని యేవేవో మందులు వేయ మొదలుపెట్టెను. వ్యాధి యంతకంతకు ప్రబలుచునే యున్నను వైద్యుఁడు వచ్చి ప్రతిదినమును చేయి చూచుచు విరేచనములు తగ్గకపోయినను ఒకదినముకంటె నొకదినము శరీరలో గుణ మగపడుచున్నదనియు, క్రమక్రమముగా

కుమారవతిగాని విరేచనము లొక్కసారి కట్టుట మంచిది కాదనియు అందుచేతనే తాను నిమిషములో విరేచనములు కట్టింపగలిగియు దానినిమిత్తము యింతగా పనిచేయుక మూలమును కనుగొని మహాకారకపువిషయములో విస్తారముగా పనిచేయుచున్నాననియు, చెప్పి అప్పుమజ్జిగతో అన్నము పెట్టించుచుండెను అందుచేత నామె యంతకంతకు బలహీనురాలయి లేవలేక మంచము పట్టెను. కొన్ని దినములకు మెల్లగా మీఁగాళ్ళమీఁద ఉబ్బారంభమయి క్రమక్రమముగా పయికి ప్రాకసాగెను. అది చూచి నారాయణమూర్తి మొదలయినవా రామె జీవించుటయే దుష్కరమని తలఁచికొనిరి. తనచేతి మీఁదుగా నెందఱినో కడతేర్చి యున్నవాఁడుగనుక వైద్యుఁడాసంగతి నావఱకే కనిపెట్టి ప్రాణము పోయినమీఁదట తనసొమ్ము రాదనీ యెఱిఁగి యేదో మిషపెట్టి ముందుగానే సొమ్ము లాగవలెనని నిశ్చయించుకొని యీపూట చింతామణి వేయక పోయినయెడల కార్యము లేదనియు తాను చెప్పినట్లు పథ్యము నడపక పాడుచేసినా రనియు, ఆయౌషధము తనయొద్ద లేదు గనుక వేరే యొకనమ్మక మయినస్థలములో కొని తీసికొని వచ్చుటకు పదిరూపాయలు నిమిష ములమీఁద కావలయు ననియు చెప్పెను. వేంకటేశ్వరులు తనపెట్టెలో ముప్పదిరూపాయలున్నను ఏమియు లేనివానివలె నటించెను. నారాయణమూర్తి నిజముగానే తనయొద్ద నేమియు లేక యేమి చేయుటకును తోఁచక విచారించు చుండెను. సత్యవతి ఆసంగతి యెఱిఁగి భర్తను చేసైఁగచేసి గదిలోనికి పిలిచి తనమెడలోని కాసులు నాలుగు తీసి చేతిలో పెట్టి యవి అమ్మి వైద్యున కిచ్చి మంచిమందు వేయింపవల సిన దని యాత్రముతో చెప్పెను. పుట్టినింటివారు పెట్టిన భార్యసొత్తు నమ్ముటకు మనసు కొల్పక యతఁడు సంకోచింపసాగెను.

సత్య—మీరెంతమాత్రమున్ను సందేహపడవద్దు. నాప్రార్థన విని యీకాసులను యెవరికైనా అమ్మివేసి వేగిరము మందు తేయించండి. బ్రతికివుంటే నగలు యెప్పటికయినా వస్తవిగాని పోయిన ప్రాణము మళ్ళీ రాదు.

నారా—నిష్కారణంగా నీనగ పోవడమేకాని నాతల్లి దక్కే జాడ కనపడడంలేదు. నేను నీకేసొమ్ము పెట్టకపోవడం సరిగదా నీకు పుట్టింటివారు పెట్టినసొమ్ముకూడా తీసుకోవడానికి నాకు చేతులు రావడంలేదు.

సత్య—నేనే మీసొమ్మునై యుండగా దీనిని తీసుకోవడానికి మీరెందుకుసంశయిస్తారు? మీరు బాగావుంటే నాకు నగలులేకపోయినా విచారంలేదు. ప్రాణంవున్నంతమట్టుకు మనము చెయ్యదగిన ప్రయత్నము మనము చెయ్యవలెను. మీరు వృథాగా కాలం పోగొడుతూ వున్నారు. ఇక నామాట కడ్డం చెప్పక వేగిరం తీసుకుని వెళ్ళండి.

అని బలవంత పెట్టఁగా, అతఁడు మఱియొకమార్గము కనఁబడ నందున విధిలేక విచారముతో నాలుగుకాసులు తీసికొనిపోయి విక్రయించి పదిరూపాయలును వైద్యునిచేతిలో పోసెను. అత్తగారికి రోగము వచ్చినది మొదలుకొని సత్యవతియే యామెను కనిపెట్టుకొని యుండి సమస్తోపచారములను చేయుచుండెను. అందులోను ముఖ్యముగా నామె మంచ మెక్కినది మొదలుకొని రాత్రియు పగలును మంచము విడువక, మంచినీళ్ళిచ్చుచు, కాళ్ళును చేతులును పట్టుచు, తాపముపోవునట్లు విసరుచు, వైద్యుఁడు చెప్పినప్రకారము కడుపు మొదలయినవి కాచి కావలసినపట్లు వేయుచు, మందులు నూఱుచు, మలమూత్రములు మంచములోనే యైనను రోఁతపడక విసుఁగుకొనక తీసి బట్టలుమార్చి బట్టలువేయుచు కావలసినప్పుడు లేవఁదీసి పరుండఁ

పెట్టుచు, కడుపునపుట్టిన బిడ్డకంటె నెక్కువగా పనులు చేయు చుండెను. సావిత్రి పథ్యపానములు చూచుచు ఇంటనున్నవారి కందఱి కిని వంట పెట్టు లయినతరువాత కొంతసేపు తల్లివద్ద కూరుచుండి వ్యసనపడుచుండెను. సీతయొక్కతయే సత్యవతియందు మిక్కిలి ప్రేమకలది గనుక చిన్నతన మగుటచేత తల్లి దేహస్థితి తిన్నగా తెలి యకపోయినను మందులు నూఱుట మొదలయిన పనులలో వదిన గారికి తోడుపడుచుండెను. సుందరమ్మ యెవ్వరైనను వచ్చినప్పుడు బుడిబుడియేడ్పు లేడ్చుచు వచ్చినను అత్తగారి కొక్కపనినైనను చేసి పదిశాదు. యశోదమ్మ కంతకంతకు దినములు దగ్గఱపడుచుండెను. చివర కందఱును ఆమె బ్రతుకునన్న యాశ వదలుకొనిరి. అందఱును తొందరపడి వైద్యుని నిమిత్తమై పరుగులెత్తుచున్నప్పుడు శరభయ్య మొగము చాటువేసెను. అప్పుడొక వైద్యుఁడు వచ్చి తనకు రెండు రూపాయ లిచ్చినయెడల రెండుగడియలలో రోగము మళ్ళించెద నని చెప్పఁగా, కన్నులవెంబడిని నీరుకార విసనకఱ్ఱ చేతఁబట్టుకొని విసరుచున్న సత్యవతి తన చెంగుననున్న రూపాయలు విప్పి చేతిలో పెట్టి మందు వేయించెను. అటుతరువాత ఏమందువేసిన బ్రతుకునో యను నాసచేత నతఁడు వైద్యుఁ డొనా కాఁడాయని విచారింపక యెవ్వరేది యిచ్చినను దానినెల్ల మ్రింగఁ గలిగినంతవఱకు నోటిలో పోసిరి. ఆమె యించుమించుగా నెలదినములు మంచముమీఁద నున్నను ప్రాణము పోవు వఱకును తెలివిగలిగియే యున్నది. ఆమె వెనుక సత్యవతి నెంతబాధపెట్టినను, ఆపత్కాలమందు తనకుచేసిన యుపకారము చూచి మిక్కిలి సంతోషించి కోడలిని దగ్గఱగా పిలిచి కౌఁగలించుకొని కన్నుల నీరు పెట్టుకొని "నీవు మాయింటి కేవలము మహాలక్ష్మివి. నేను నిర్దయురాలనై చేసిన తప్పులు క్షమించి మఱచిపో

వలెను. నేను యింకొకజన్మమందు నీకడుపునపుట్టి నీరుణము తీర్చుకోవలె నని దేవుణ్ని ప్రార్థిస్తాను" అని చెప్పి మొగమునకు చేతులడ్డము పెట్టుకొనెను. సత్యవతియు నోదో చెప్పవచ్చి దుఃఖముచేత నోరుతడఁబడగ కన్నులనీరుకార్చుచు నూరకుండెను. ఇంతలో యశోదమ్మ కవసానదశ వచ్చినందున మంచముమీదనుండి క్రిందికి దింపుటకయి వేంకటేశ్వరులను పిలువఁగా నతఁడావఱకే నక్షత్రము మంచిదానో కాదో, తల్లిని వీధిలో పెట్టవలెనో లేదో తెలిసికొనివచ్చుటకై సిద్ధాంతియింటికి పోయియున్నందున కనఁబడనేలేదు. అప్పుడు నారాయణమూర్తి మొదలయినవారు క్రిందచాపమీఁద ఆమెను పరుండఁబెట్టిరి. ప్రాణము పోయినతరువాత చుట్టుపట్లవారు చూడవచ్చినప్పుడు సుందరమ్మ యేడిచినంత బిగ్గరగా కేకలు వేసి యేడ్చినవారు మఱి యెవ్వరును కనఁబడలేదు. ప్రాణము పోయినతరువాత వేంకటేశ్వరులువచ్చి యేల వీధిలోపెట్టలేదని తమ్ములమీఁద కోపపడ మొదలుపెట్టెను. గృహయజమానురాలు పోయినప్పు డిల్లేప్రకారముగా నుంచునో యందఱకును తెలిసియుండునుగనుక వారియేడుపులును పెడబొబ్బలును వర్ణింపవలసినపనిలేదు. అది పట్టణము కాకపోవుటచేత మోచుటకు డబ్బియ్యవలసిన యక్కఱలేకయే బంధువులు నలుగురువచ్చి సహాయపడి శవమును తీసికొనిపోయి దహనాదికృత్యములు జరిగించిరి. తరువాత పదిదినములు జరగవలసినకర్మలు యథావిధిగా జరిగినవి. ఉత్తరక్రియల నిమిత్తమయి వ్యయపడిన సొమ్ములో విస్తారభాగము సత్యవతి కాసుల నమ్మిన సొమ్మైనను వేంకటేశ్వరులుకూడ కొన్నిరూపాయలు కర్చుపెట్టవలసివచ్చెను. అందుచేత తాను ఋణముల పాలగుచున్నాననియు అందఱిని కూరుచుండఁబెట్టి మేపలేననియు, వేంకటేశ్వరులు విసుగుకొనుచు పదిదినములలోనే తక్కినవారు వేరుండవలయునని యభి

ప్రాయము కనఁబడిరెను. అందుచేత నారాయణమూర్తి సావిత్రిని చెల్లెలిని తమ్ముల నిద్దఱిని భార్యను తీసికొని రాజమహేంద్రవరము వెళ్ళుటకు నిశ్చయించుకొనుచుండెను. తల్లినగలు న్యాయముచేత కొమార్తెకు రావలసినను తగవులుపడక వదినెగారియొక్కయు అన్న గారియొక్కయు ఇష్టప్రకారముగా వారికే యిచ్చివేసి, పాత్రసామగ్రి వారు కోరినంత వారికివదలివేసి లెక్కినవారి నందఱిని తనవెంటఁ దీసికొని నారాయణమూర్తి రాజమహేంద్రవరము ప్రవేశించెను.

---

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము

నారాయణమూర్తి కుటుంబసహితముగా రాజమహేంద్రవరము ప్రవేశించిన తరువాత కొన్నిమాసములు సుఖముగానుండెను. ముంగొండాగ్రహారమున నారాయణమూర్తితో నున్న కాలముననే సత్యవతికి గర్భము నిలిచినందున సీతాదులట్లై పుట్టినింటివారామెను పెద్దాపురమునకుఁ దీసికొనిపోయిరి. పెద్దాపురములో రాఘవయ్యగారి యిల్లు మాధ్వు లునిచిన "పీర్లపంజా" కు సమీపముగా నుండెను. సత్యవతి తానా (పంజా) కథను విన్నప్పుడు ముప్పది మూడుకోట్ల దేవతలును స్థలదేవతలును గ్రామదేవతలు గృహదేవతలును చాలక హిందువులకు తురక దేవతలుకూడ కావలసివచ్చినారాయని యాశ్చర్య పడసాగెను. సత్యవతితల్లి యైన శ్యామలాంబయు చిన్నప్పటినుండియు పట్టణవాసమున మెలఁగినదగుటచేతను చదువుకొన్నదగుటచేతను సాధారణముగా తనయీడు స్త్రీల కుండు వెఱ్ఱియాచారమును మూర్ఖత్వమును లేనిదై లేనిపోని యుపవాసములుచేసి దేహము చెడఁగొట్టుకొక యిల్లు శుచిగానుండుటయందును వేళపట్టున భోజనము లమర్చుట

యందును మిక్కిలి శ్రద్ధవహించుచుండును. అందుచేత రాత్రియుపగలును నిత్యము నొక్కవేళకు భోజనములగుచుండుటయు ధనవంతులకు సాధారణముగానుండు రోగములును రొచ్చులును లేక యింట నెల్ల వారును మంచి యారోగ్యదశ గలిగియుండుటయు చూచి, ఆయూరివా రందఱును మిక్కిలి వింతపడుచుందురు. ఆమెయోగ్యతకు తగినట్టు గానే కోడలుకూడ మిక్కిలి గుణవంతురాలును విద్యావంతురాలు నయియుండెను. ఆచిన్నదానిపేరు జానకమ్మ. ఆమె యంతగా రూపవతి కాకపోయినను గుణవతి యగుటచేత భర్తకా చిన్నదానియందుఁగల ప్రేమయింతంతయని చెప్పనలవికాదు. ఆదంపతుల పరస్పరానురాగము చూచినవారెల్లను భార్యాభర్త లేకదేహ మన్నమాట వీరియెడ సార్థక మయ్యెనని మెచ్చుకొనుచుందురు. లోకములో మూఢులనేకులు తమ భార్య లెంత సుగుణసంపదగలవారయినను పయితోలు తమకన్నుల కింపుగా లేదని యాముద్దరాండ్రను విడిచి నరకకూపమునకు ప్రథమ సోపానములుగానుండి యౌవనమదాంధుల కన్నులను భ్రమింపఁజేసి తేనెమాటలనుపాశములచే వారి నాకర్షించి గోతిలో పడద్రోయు నవత రించి వ్యభిచారమే కులవృత్తిగాఁ గలయపమృత్యుదేవతల వలలలో తగులుకొని యిల్లును శరీరమును గుల్లచేసికొని నిందలపాలగుదురు. అట్టి బుద్ధిహీను లీదంపతులచరిత్రమును వినియు కనియు బుద్ధితెచ్చుకో వచ్చును. అత్తగారికి జానకమ్మయన్న రెండవప్రాణము; ప్రతివిష యమునందును వారిద్దఱిదియు నొక్కమాట. లోకములోని మూఢ వనితలయందువలె అత్తగారును కోడలును కారసించునప్పుడు పిల్లియు ఎలుకయు కారసించినట్లుండక లక్ష్మియు సరస్వతియు కలసి నట్టింలో హృదయరంజకముగా నుండును. ఆయింట కోడలికమన్నమాట కర్ణ కఠోరముగా నుండక చెవులకమృతతుల్యముగా నుండును. సత్యవతియు

జానకమ్మయు దేహములు వేఱైనను ప్రాణమొక్కటియే యన్నట్టు కలసిమెలసి యుందురు. వా రిరువురకును గల చెలికారమువలనిసుఖ మనుభవించి తీరవలసినదేగాని చెప్పతీరదు. "పిండిబొమ్మనుజేసి పీట మీఁదపెట్టిన, ఆడుబిడ్డతనమున కల్లలనాడిన" దన్నసామెత యేయుగములోనిదోయని వీరియింటనుండువారికెల్లను తోఁచును. ఏ యీఁడువారి కాయీఁడువారును, ఏగుణమువారి కాగుణమువారును సరిపడుదురన్నమాట వీరిని చూచినచో సిద్ధాంత మగును. ఇద్దఱును సమానగుణవతులేయని చెప్పవచ్చినను విద్యాబుద్ధులయందు జానకమ్మ సత్యవతినిజూచి నేర్చుకోవలసినయంశము లనేకము లున్నవి. సత్యవతి పుట్టినింట నున్నంతకాలములో నడతవిషయమునను జానకమ్మ యెన్నో సంగతులను నేర్చుకొని యెంతో వృద్ధిపొందెను. చదువెఱుఁగని స్త్రీలు చేసినట్టుగా వా రెప్పుడును పరులదోషములను చెప్పుకొనుచు కాలము గడపరు. పనిపాటులయినతరువాత తీఱికకలిగినప్పు డేదో పుణ్యాంగనా చరిత్రమును చదువుచునో లోకోపకారవిషయమున ప్రసంగించుచునో ప్రొద్దుపుచ్చుచుందురు. అత్తలును కోడండ్రును, భార్యలును, భర్తలును, ఈప్రకారముగా గుటుంబములో అన్యోన్యమైత్రి కలిగి యున్నచో, ఆగృహమే భూలోకస్వర్గమని చెప్పవచ్చును; వారియింట రాఘవయ్యగారి ముత్తవతల్లి మాత్ర మీసమాజములో కలియని దొక్కతెయున్నది. ఆమె కిప్పుడు దాదాపుగా డెబ్బదిసంవత్సరములు ఉన్నవి. రాఘవయ్యగారి తాతగా రామెను ముసలితనములో వివాహము చేసికొని యామెవలన సంతానము కలుగకమునుపే లోకాంతరము చేరెను. ఆమెపేరు పార్వతమ్మ. ప్రొద్దు జరగనప్పుడు జానకమ్మయు సత్యవతియు "అవ్వా!" అనిపిలిచి పూర్వకాలకథల నడుగుచు

వేడుకగా ప్రొద్దు పుచ్చుచుందురు. ఆమె కీకాలపువారినడతలును వస్తువులును క్రొత్తగా నుండెను.

ఈప్రకారముగా నుండఁగా నొకనాఁడు చంద్రగ్రహణము పట్టెను. పార్వతమ్మ స్నానము చేసివచ్చి తడిబట్ట విడిచి పొడిబట్ట కట్టుకొని విడిచినబట్టను దణ్ణెముమీఁద నారవేయుటకయి దొడ్డిలోనికి వచ్చునప్పటికి సత్యవతియు జానకియు చంద్రుని వ్రేలితో చూపుచు గ్రహణము విషయమై యేదో మాటాడుకొనుచుండిరి. అదిచూచి పార్వతమ్మ ముక్కుమీఁద వ్రేలువేసికొని దిగులుపడి మాటలేక నిలుచుండెను.

సత్య—అవ్వా! యేమి యీలాగు తెల్లపోయి నిలుచున్నావు?

పార్వ—ఏమి అవ్వ? కొంపముంచివేసినావు. మాకాలంలో యెన్నడూ గ్రహణంవచ్చినదంటే కడుపుతోవున్నవాళ్ళు గదిలోపరుండి కడు పుబ్బుకువచ్చినా శుద్ధమోక్షం అయ్యేదాకా గడపదాటి యివతలకు వచ్చి యెరుగరు. ఇదరేమివిరుద్ధమే? యిదియేమివిరుద్ధమే?

సత్య—(నవ్వుచు) అవ్వా! వస్తేయేమి?

పార్వ—ముసలిదాన్ని; నామాటలు నీకు చీమ కుట్టినట్టయినా వుండ లేదు యెదురుకెదురు నామాట వేళాకోళంగా వుంచి నవ్వుతూ వున్నావు. రేపు పుట్టే పిల్లవాడికి ముక్కోకాలో వంకరవచ్చినప్పుడు పెద్దదానిమాట విన్నానుకానుగదా అని అప్పుడు విచారిస్తావు.

సత్య—అవ్వా! యెవళ్ళకయినా గ్రహణం మొరికిరావడం నీవు చూశావా?

పార్వ—నా అన్నగారికుమారుడు నామేనల్లుడికి ముక్కుకాడ వేలెడు మొట్టవచ్చింది. మావదినెగారు గ్రహణంపట్టినప్పుడు యివతలకు రాకపోయినా మంచముమీఁద పడుకొని కదిలిందట! అందుమూలంగా

ఆమొగికి వచ్చింది. గ్రహణం పట్టినంతసేపూ కడుపుతో వున్న వాళ్ళు కాలూచెయ్యీ అయినా కదపకూడదు. యేదికదిపితే దానికల్లా మొరికివస్తుంది. ఏమేసత్యా! యింకాకదలవు? నా మాట వట్టిబూటకం కింద కట్టివేసినావా యేమిటి?

సత్య—అవ్వా! అలాఅనుకోకు ఈనటుకే చంద్రుణ్ణి చూచి నాను గనుక ఇఖమళ్ళీచూడడంచేత వచ్చేది యేమిలేదని అట్టే నిలు చున్నాను. నీఆజ్ఞ అయితే చూడడం మానివేస్తాను.

పార్వ—నీవు నదురూబెదురూ లేకుండా మాట్లాడుతూవున్నావు. పిల్లవాడు యేమైపోతాడో అన్నభయం నీకు యిప్పటికీ పుట్టలేదు నీకు తెలిసిన మెట్టవేదాంతాలు నాకు తెలియవు. ఈకాలంలో యింతలేసి వాళ్ళకూ పెద్దవాళ్ళమాట అంటే లక్ష్యంలేదు.

సత్య—అవ్వా! కోపపడకు యిదుగో వస్తూవున్నాను నిద్దర పట్టకుండావున్నది. మీకాలపుకబుర్లు యింకా యేమయినా చెప్పవూ. నీవు మొగుడితో కాశీయాత్ర వెళ్ళినావుగదా దోవలో యేమేమి చూచినావు?

పార్వ—ఆకాలపు కబుర్లుచెపితే మీకు యిప్పుడు నవ్వులాటగా వుంటుంది. పూర్వం కాశీవెళ్ళినవాడూ కాటికివెళ్ళినవాడూ వకటే అని చెప్పేవారు. అప్పుడు మళ్ళీవచ్చిందాకా యింట్లో గెవ్వరికీ బ్రతికివున్నారన్న ఆశలేదు. ఇప్పుడు రెణ్ణెల్లలోనే దుడుగూకుడుగూ కాశీవెళ్ళినామని యిట్టేవస్తారు నిజంగా వెళుతారో లేదో తెలియదు.

సత్య—అవ్వా! నీవు కాశీ యెందుకు వెళ్ళినావూ?

పార్వ—నాచిన్నతనంలో నన్ను సవితిపట్టుకుని యెన్నివైద్యాలు చేయించినా యెన్ని దివ్యస్థలాలకు వెళ్ళినా యెన్నితీర్థాలలో స్నానాలు

చేసినా వదిలిందికాదు. సోదికి వెళ్ళినప్పుడు కాశీకివెళితే వదులుతానని చెపితే మావారు నన్ను తీసుకొని వెళ్ళినారు.

సత్య—అవ్వా! దోవలో జగన్నాథం చూచినావా?

పార్వ—అయ్యో! జగన్నాథమే చూడకపోతే యింకాయేమి వున్నది? స్వామివారిప్రసాదం యింకా నావద్ద కొంచెమువున్నది. రేపు మడికట్టుకొన్నప్పుడు జగన్నాథంబుట్టలోనుంచి తీసి నీకుకొంచెం పెడతాను. అక్కడ ప్రసాదం యిచ్చేవాళ్ళు జగన్నాథపు మంగలవాళ్ళు. మనం దాన్ని కళ్ళ నద్దుకొని తినక మంగలవాడిప్రసాదం వద్దంటే తక్షణం కళ్ళుపోతవి.

సత్య అవ్వా! జగన్నాథస్వామికి కాళ్ళుచేతులూ లేవంటారు నిజమేనా?

పార్వ—దానికి కారణం చెపుతాను విను. అతనిపేరుజ్ఞాపకం లేదు యెవరోకాని గొప్పరాజు వుండేవాడు. ఆరాజు కోట్లకొద్దిసొమ్ము ఖర్చుచేసి గొప్ప దేవుడుగుడి కట్టించి దానిలో వుంచడానికి తగిన దేవుణ్ణి చేయించవలెనని కాశీపనివాళ్ళను పిలిపించి దివ్యసుందర విగ్రహం గలదేవుణ్ణి చేసుకురమ్మని చెప్పినాడు.

సత్య—అలాగు యెవరైనాచేసి తీసుకువచ్చినారా?

పార్వ—లేదు. విగ్రహం బాగానుండకపోతే బుర్ర తీసివేయిస్తానని రాజు భయపెట్టడంచేత పనివాళ్ళు యెవళ్ళూ వచ్చినారుకారు. యిలా కొంతకాలం జరిగినతరువాత వకనాడు వకముసలివాడు వులీ సుత్తీ పుచ్చుకొనివచ్చి నీవు కోరినవిగ్రహాన్ని చేస్తానని రాజుతో చెప్పినాడు. విగ్రహం బాగావుండకపోతే తలతీసివేయిస్తానని రాజు చెప్పినా జడియక అందుకే వప్పుకొని వక్కటిమాత్రం కోరినాడు.

సత్య—యేమికోరినాడు?

పార్వ—నేను విగ్రహం చేస్తూవున్నంతకాలము యెవరూలోపలికి రాకూడదు. అలావస్తే చెడిపోతుందని రాజుతో చెప్పి వప్పించి గుళ్లో ప్రవేశించి లోపల తలుపు గడియ వేసుకొన్నాడు. రాత్రీపగలూకూడ వకటే మోస్తరుగా గుళ్లో టకుక్కు టకుక్కు సుత్తి దెబ్బలు వినబడుతూ వుండేవి. ఈప్రకారముగా మూడు నెల లయిన తరువాత రాజు యిఖ చపలత్వం పట్టలేక గుడిగోడలు పగలుకొడుతూ వున్నాడేమో అనుకుని తలుపుదగ్గరకు వెళ్ళి కేకలు వేసినాడు. ఎంత కేకలు వేసిన పలుకక పోవడమే కాకుండా గుడిఅంతా సుత్తిదెబ్బలు మరింత బిగ్గరగా వినపడడం మొదలు పెట్టేటప్పటికి రాజు జడిసి గునపాలు తెప్పించి తలుపులు బద్దలు కొట్టించి లోపల ప్రవేశించిచూడగా మొండికాళ్లూ మొండిచేతులూ వున్న వక అందవికార మయిన బొమ్మ లోపల వున్నది.

సత్య—రాజు చూచి యేమి చేసినాడు?

పార్వ—యిటువంటి విగ్రహం చేసినా వేమని రాజు అడిగేటప్పటికి ఆముసలివాడు మీరు కడతేరా చెయ్యనిచ్చినారు కారు. మీరు తొందరు పడకపోతే యిదే దివ్యసుందరవిగ్రహం అవు నని చెప్పినాడు. అందుమీద రాజునకు కోపంవచ్చి శిరచ్ఛేదం చేయిస్తానని బయలుదేరేటప్పటికి "ఇదే జగన్నాథస్వామి అయి అందరూ కొలుస్తారు" అని పలుకి దూకి వాళ్ళలోనుంచి దూరి మాయమయి పోయినాడు.

సత్య—మనిషి రాళ్ళసందునుంచి యేలాదూరినాడు?

పార్వ—అతడు సామాన్యం మనిషి అనుకున్నావా యేమి? పరమేశ్వరుడే ముసలివాడయివచ్చి ఆప్రకారం చేసినాడు. అందు చేతనే జగన్నాథంలో దేవుడికి అంతమహాత్యం వచ్చింది. అస్వామివారి

రథంకింద పడి చస్తే యెంతోపుణ్యం వస్తుందట. దిక్కుమాలిన కుంపినీవాళ్ళు యిప్పుడు యెవళ్ళనూ చావనియ్యరు. కిరస్తానీరాచరికం చేత యిప్పుడంతా మాలకూడు వచ్చింది. వాళ్ళు యెప్పుడో వర్ణసంకరం చేస్తారు.

సత్య—అవ్వా! నిష్కారణంగా సర్కారువారిని యెందుకు తిడతావు? వారు మనకు యేమిఅపకారం చేసినారు? యిప్పుడు చూడు రోడ్లు వేయించి కాలువలు తవ్వించి దేశం యెలాబాగుచేసినారో?

పార్వ—చేసినారులే. కులం పాడుచేసినతరువాత యివన్నీ యెందుకు? సహగమనాలు బొత్తిగా మాన్పించినారు గదా!

సత్య—నీ వెప్పుడైనా సహగమనం చేస్తూవుండగా చూచి నావా?

పార్వ—వక్కటిమాత్రం చూచినాను. నాకప్పుడు ఇరవ య్యేళ్ళకంటె యెక్కువ లేకపోయినా మావారు పోయేటప్పటికే యీ దిక్కుమాలిన కుంపినీవాళ్ళు సాగుమానం మానిపించివేసినారు. ఆయేడే మానిపించివేసినారని అంతటా వింతగా చెప్పుకునేవారు.

సత్య—నీవు చూచింది మాకు చెపుతావా?

పార్వ—మాబంధువుడే వకడు డబ్బయియేళ్ళాయన చచ్చి పోయినాడు. ఆయన మూడో పెళ్ళి పెళ్ళాము యింకా పెద్దమనిషి కాలేదు. యేడేళ్ళు వున్నవికావచ్చును! మొగుడుచస్తే తిన్నగా యేడుపే యెరగకపోయింది. ఆపిన్నదానితండ్రి మహా తెలిసినవాడు. నిత్యకర్మలూ అన్నీ అయి అపరాహ్ణం తిరిగితేనేకాని భోజనము చేసే వాడుకాడు. మొగుడు పోయినప్పుడు పిల్లది వీధులో ఆడుకుంటూ వుండగా తండ్రి యెత్తుకొని లోపలికి తీసుకువచ్చి సాగుమానంచేస్తే యెల్లకాలము స్వర్గములో మొగుడితో సుఖపడడమే కాకుండా

మొగుడివంకవారినీ తండ్రివంకవారినీకూడా తరింపచేస్తావని చెప్పేటప్పటికి సాగుమాన మంటే యేమిటో తెలియక మంచిదని వప్పుకున్నది. వెంటనే ఆచిన్నదానివంటినిండా నగలు పెట్టించి అలంకరించి మంచిచీర కట్టించి కొత్త పెళ్ళికూతురులాగు చేసి బాజాభజంత్రీలతో వూరేగిస్తూ శవంతోకూడా దూరంగా గోదావరివడ్డుకు తీసుకు వెళ్ళినారు. అది చూడడానికి వూళ్ళోప్రజ వేలకొద్ది వెళ్ళినారు. పసుపూ కుంకమూ తెచ్చుకోవడానికి వూళ్ళోవుండేపునిస్త్రీలంతా వెళ్ళినారు. మొట్టమొదట మొగుడిశవం చిన్నదాని తలమీద పెట్టి బ్రాహ్మణులు మంత్రాలు చెపుతూ యేమేమో కర్మలు చేయించి తరువాత చిన్నదాని నగలన్నీ తీయించి తండ్రి బ్రాహ్మలకు పంచి పెట్టినాడు.

సత్య—ముత్తైదలకు పసుపూ కుంకమూ యెప్పుడుపంచిపెట్టినారు?

పార్వ—చాలాకాలం అయింది, మరిచిపోయినాను అదివరకే కాబోలును పిల్లదానిచేత అందరికీ పసుపూ కుంకమూ యిప్పించినారు. యెల్లకాలమూ అయిదోతనం వస్తుందని అప్పుడు పసుపూ కుంకమూ నేనూ పుచ్చుకున్నాను. పిల్లదాన్ని కాష్టంమీద మొగుడిపక్కను పరుండబెట్టి బ్రాహ్మలు వూరికే మంత్రాలు చెపుతూ వుండగా వాయిద్యాలు చెవులు తడికలుకట్టేటట్టు వాయిస్తూవుండగా నాలుగు పక్కలనూ తండ్రే కాబోలును నిప్పు ముట్టించేటప్పటికి—నేను చెప్పలేను. కళ్ళకు కట్టినట్టు వుండి నాకు వళ్ళు వణుకెత్తుతూ వున్నది.

సత్య—వినేవాళ్ళకు మాకే యిప్పుడు కళ్ళవెంబడి నీళ్ళువస్తూ వుండగా దగ్గిర వుండి చూచినదానికి నీకప్పు డెంతవిచారం వేసిందో! యిలాగంటి క్రూరకృత్యం మానిపించినందుకు దొరలను నీవు తిడుతూ వున్నావే.

పార్వ—మనం అలాగు దూషించరాదు. శాస్త్రంలో చెప్పిన దాన్ని దూషిస్తే కళ్ళు పోతవి. మనకు యెంత క్రూరంగా కనపడ్డా శాస్త్రం చెప్పినదాన్ని చేస్తే బహుపుణ్యం వస్తుంది. ఆకాలంలో సమేతు ఒక్కడనో లక్షకు వక్కర్తె వీరపతివ్రత సాహసమానం చేసేది కాని అందరూ చేసేవారు కారు. కాష్టానికి నిప్పు ముట్టించేటప్పటికి నాకు వళ్ళంతా చెమటపోసి రణకంపరమెత్తి నిలువలేక వెనుకకు వచ్చి స్పృహ లేకుండా పడిపోయినాను. నట్టికి ముందు సోకడంతో ఓ చిన్నది కెవ్వన కేకవేసి వులిక్కిపడి లేచి యేడుస్తూ కిందకు దిగవురికింది. అప్పుడు తండ్రి యెన్నోతిట్టి ఘూముసేపటిదాకా శాస్త్రంలో చెప్పిన ప్రాయశ్చిత్తాలన్నీ చేయించి మళ్ళీ పడుకోబెట్టినాడట. నేను అది చూడలేక యింటికి పరుగెత్తివచ్చినాను. నాకు ఆరాత్రి జ్వరం వచ్చి పదిరోజులదాకా నిద్రలో సమేతు వులిక్కిపడుతూ వుండేదాన్ని. అది బాగా జ్ఞాపకం. ఇప్పటికీ ఆసంగతి తలపుకువస్తే భయంవేసి వళ్ళు జలదరిస్తుంది. ఆతరువాత తిరిగీ పడుండబెట్టిన తరువాత మళ్ళీ లేచిరాకుండా బ్రాహ్మలు వెదురుగడలతో గట్టిగా నొక్కిపెట్టి యేడుపు వినపడకుండా బాజాలు వాయించుమని వేదమంత్రాలు ఘోషిస్తూ నిమిషంలో దహనం చేసివేసినారట! ఆచిన్నది తరువాత పేరంటాలయి మావూరివద్దనే వకవూళ్ళో వెలిసిందట. మాకాలంలో అంతవంటి పతివ్రతలు వుండేవారు. ఈకాలపు వాళ్ళు మగడువస్తే లేవనేలేవరు. మానాడు పట్టపగలు మొగుడితో మాట్లాడితే అత్తగార్లు చంపివేసేవారు. ఈకాలపువాళ్ళు అత్తా మామా వుండగానే మొగుడితో గుసగుసలాడుతారు. కాలమంతా చెడిపోయింది.

సత్య—అవ్వా! చాలా పొద్దుపోయింది. యింటికి వెళ్ళిపడుకో.

అని యారాత్రి యందరు వెళ్ళి పరుండి సుఖముగా నిద్ర పోయిరి. సత్యవతి గ్రహణము చూచినసంగతి మఱునాటి కూరంత టను వ్యాపించి ముక్కులమీఁద వ్రేళ్ళు వేసికొని యెల్లవారునుఆశ్చర్య పడుచు సత్యవతికి పుట్టు బిడ్డ కేమివంక యుండునో చూడవలె నని యందఱును కొండంతయాశ పెట్టుకొని యుండిరి.

---

## తొ మ్మి ద వ ప్ర క ర ణ ము .



సత్యవతి ప్రసవ మగువఱకును చెప్పవలసినవిశేషము లేవియు లేవు. మాఘబహుళత్రయోదశినాఁడు సూర్యోదయ మయినరెండుగడి యలకు సత్యవతి సుఖముగా పురుషశిశువును ప్రసవ మయినది. ఆమె తల్లిదండ్రులు పూర్వాచారమునే నమ్ముకొని యుండుసత్యకాలపువారు కారు గనుక కొమార్తెను లంకణములు కట్టక యలసటపడి యున్న ప్రాణ మగుటచేత బొత్తిగా నిస్సత్వము కలుగకుండుట కయి బిడ్డను కన్నదినము మొదలుకొని చులకనగా నఱగెడు జావ మొదలయిన పదార్థములను పెట్టుచు వచ్చిరి. పూర్వము సుందరమ్మ గదిముందర నున్నట్లుగా ఇప్పు డీపురిటియింటిముందు పాతచెప్పులు మొదలయిన వేమియు కట్టఁబడి యుండలేదు. గదిలో వాయువును పాడుచేసెడు కుంపటిపొగలుగాని, ఉల్లిపాయలు మొదలయినవాని కంపుగాని, ఏదియు లేదు. మంచిగాలి వచ్చుట కయి తలుపు కొంచె మోరవా కిలిగా తెఱవఁబడి యుండెను. అందుచేత తల్లియు బిడ్డయు గూడ మిక్కిలి యారోగ్యము కలిగియుండిరి. ఊరివారు గుంపులుగావచ్చి బిడ్డకెక్కడ మొఱికియున్నదో విచారించి యేవంకరయులేదని మంత్ర సాని చెప్పినను మరి యెవ్వరు చెప్పినను నమ్మక తప్పక యేదో వంక

యుండునని పోవుచు వచ్చిరి. ఆహా! జనులమూఢత్వ మిప్పటికి నిట్లున్నదిగదా?

ఇక్కడ రాజమహేంద్రవరములో నారాయణమూర్తియు భార్య పుట్టినింటికి వెళ్ళినతరువాత రాత్రియు పగలును కష్టపడి చదివి పరీక్షనిమిత్తమయి పుష్యమాసమున చెన్నపురికి వెళ్ళఁబోవునప్పుడు ముందుగా పెద్దాపురమునకు వెళ్ళి భార్యనుచూచి అక్కడ రెండు దినము లుండి తరువాత కాకినాడకు పోయి అక్కడనె సముద్రపు పొగయోడ నెక్కెను. అతఁడు చెన్నపట్టణములో నున్నపదియేను దినములును దేహ మక్కడనే యున్నను ప్రాణము లన్నియు భార్య మీఁదనే యున్నందున, అక్కడి వినోదములను చూచుట కయి నిలిచిన తనతోడివారిని విడిచి పరీక్షయయిన తరువాత వచ్చిన మొదటి పొగయోడమీఁదనే మరల బయలుదేఱి వచ్చి పెద్దాపురములో నుండఁగానే రాజమహేంద్రవరములోనిపాఠశాలానిర్వాహకు లొక రాతనికి నలువదిరూపాయలు జీతముగల ప్రధానోపాధ్యాయత్వము నిచ్చెదము రమ్మని జాబు వ్రాసిరి. ఆవలకే ప్రయాణ వ్యయముల నిమిత్తము కొంతఋణము చేసియుండుటచేతను ముందు సొమ్ము కావలసినకార్యములు చేయవలసిన వనేకము లుండుటచేతను పని మించిపోయినతరువాత మరల దొరకుట కష్టము గనుకను భార్య యాలోచనప్రకారముగా నారాయణమూర్తి రాజమహేంద్రవరమునకు వచ్చి పని కొప్పుకొనెను. ఇట్లుండఁగా చెన్నపట్టణమునుండి బియే పరీక్షలో తేఱినట్టు తంతీవార్త వచ్చినసంతోషదినముననే పుత్రజనన మయినశుభవార్త కూడ వచ్చి సంతోషము నినుమడించెను. ఇరువదియొకటవదినమున నామకరణమహోత్సవము నిశ్చయ మయినందున నాలుగుదినములు సెలవు పుచ్చుకొని తమ్ములతోను మఱి

తండ్రితోను తోడఁబుట్టిన పడుచులతోను పెద్దాపురమునకు పోయి మరల వచ్చెను. చిన్నవానికి లక్ష్మీనారాయణరా వని తాతగారిపేరు పెట్టిరి. కొన్నిమాసములక్రిందట నాగులచవితికి పుట్టలో పాలుపోసి కొనుటకై తల్లితోకూడ వెళ్ళినప్పుడు రామానుజమ్మ పాము కఱచి పోయినవర్తమానము తెలిసియు నారాయణమూర్తియు భార్యయు వచ్చి చూచిపోయినారుకా రన్నకోపముచేతను కొమార్తె పోయిన దుఃఖముచేతను నారాయణమూర్తి స్వయముగావచ్చి పిలిచినాఁడు కాఁడన్న పట్టుదలచేతను శుభలేఖవ్రాసి పెద్దతమ్ముని రామస్వామిని పంపినను నామకరణమహోత్సవమునకు వేంకటేశ్వరులును సుందరమ్మయు మాత్రము వచ్చినారుకారు. అన్నగారును వదినెగారును రాకపోయినా రని నారాయణమూర్తియు భార్యయు మనసులో చాల ఖేదపడిరి.

ఈలోకములో నెవ్వరును ఎల్లకాలమును సుఖముగానుండరు. మధ్యమధ్య నేదోవిధ మయినవిచారము కలుగుచుండును. ఇట్లందఱును సుఖముగానుండి సంతోష మనుభవించుచుండఁగా నొకనాఁడు కృష్ణమూర్తి నరసాపురములో తనమేనమామకు జబ్బుగా నున్నదని విని చూచివచ్చుటకై మధ్యాహ్నము మూఁడుగంటలవేళ పడవనెక్కి గోదావరిలో సగముదూరము పోయినతరువాత కొంచెము గాలివచ్చి తెఱచాపకుకట్టిన ప్రాతతాళ్లు తెగుటచేతను పడవవాండ్ర తెలివి తక్కువచేతను పడవ యొకమూల కొరుగగా లోపలిమనుష్యులందఱు నొక్కసారిగా నొక్కప్రక్కకు వచ్చినందున పడవ మునిగిపోయినది. అప్పు డీతరాకయు గదిలోనుండి పయికివచ్చుటకు వీలుపడకయు మృతి నొందినవారిలో కృష్ణమూర్తి యొకఁడు. పడవమునిఁగిపోయిన పిడుగు వంటి దుర్వార్త రాత్రి యేడుగంటలకు రాజమహేంద్రవరమునకు

తెలియఁగా, అప్పుడు నారాయణమూర్తి మొదలయినవారు చిన్న పడవలు వేసికొని యాస్థలమునకు పోయి చూచి జరిగిన వైపరీత్యమున కపరిమితదుఃఖమును పొందిరి. సీతకు వివాహ మయి సంవత్సర మయినను కాకపోయినను, ఇంతిలోనే వైధవ్యయోగము సంభవించినది? అహహ! విధికృత మేమనవచ్చును! అవఱకు సత్యవతి పిల్లవాని కాఱవ నెల వచ్చువఱకును పుట్టినింటనే యుండనెంచినను తనముద్దుల మఱదలి కిటువంటియాపద వచ్చిన దన్నదుఃఖవార్త విన్నతరువాత నిమిషమయిన నచ్చట నుండి కాలునిలువక బిడ్డను తీసికొని మూఁడవ నెలనే పడవనెక్కి యన్నగారివెంట మఱునాటికి రాజమహేంద్రవరము వచ్చిచేరెను. అప్పు డింట నెక్కడ చూచినను రోదన ధ్వనులతో నిండిపోయి చూచువారికి సహింపరాక గుండెలు పగిలిపోవునట్లుండెను. సత్యవతికి మఱదలిమీఁదిప్రేమ యపార మయినది! గనుక, ఆమెదుఃఖము మొదలే పట్టరానిదిగా నుండెను; ఆమెయు సీతకు మొదటినుండియు చదువుచెప్పి కన్నకూఁతురునవలె చూచుకొనుచుండెడిది; సీతకును వదినెగారియం దటువంటిప్రేమయే. తనతల్లికడుపున పుట్టినవారందఱిలోను సీతయే మిక్కిలి చిన్నదగుటనుబట్టి గారాబముతో పెరిగిన దగుటచేతను సీతవివాహమునకు తానే కారకుఁడగుటచేతను నారాయణమూర్తియు సీతకు సంప్రాప్తించినదుర్గతికి చెప్పనరాని ఖేదము నొందెను. లోపల నెంతదుఃఖపడినను, ఆడంబరపు లేడుపులను పైకిమాత్రము తక్కినవారివలె పెద్దపెట్టున నేడువలేదు. తోఁడబుట్టిన దాని కిటువంటి గొప్పయాపద సంభవించిన దన్నమాట విన్నను వేంకటేశ్వరుఁ డొక్కసారియైనను వచ్చిచూడక తనకుమారుఁడు పోయినప్పుడు వచ్చి చూచినాఁడుగా రన్నకోపముచేత రాతిగుండె చేసికొని యూరకుండి ఆపత్సమయములో నోదార్చవలసినదానిని నూఱకుగా అటువంటి

సంబంధము చేసినందున కాదు నారాయణమూర్తిని దూషించుచు చేసినదాని ననుభవించవలసినదని జాబు వ్రాసెను. ఆజాబులోనిమాట లాతనికి శూలములవలె నాటుకొనెను. ఆయనజన్మ మెత్తినను సుందరమ్మ మగనికంటె నెక్కువజాలిపడుటే కలదికాని దయ కార్పణ్యమును సాధించుట కిది సమయము చేసికొని తాను పుట్టినదుఃఖములో నున్నప్పుడు తన్నువచ్చి చూడకపోయినతరువాత తానుమాత్ర మేల చూడవలె నని వారియుండెడు నీతము దెల ననసాగెను. విద్యామహిమ లేకుంగిక పూర్వకాలపుదేని మూర్ఖత్వమున పెరిగినవారు కోపమే ప్రధానము చేసికొని పగసాధించుటకే యెప్పుడును జూచుచుందురు.

---

## పదవ ప్రకరణము



ఎంతటిదుఃఖ మయినను చిరకాల మొక్కరీతిగా నుండదు. దినములు గడచినకొలందిని దుఃఖ మంతకంతకు తగ్గిపోయి కడపట కనంబడనే కనంబడకపోవచ్చును. వచ్చినయాపదకు తాళలేక నేటి దినము ప్రాణపరిత్యాగము చేసికొందు మన్నవారునహితము నెల దినముల్లలో దుఃఖము నంతయు మఱచిపోయి దైవకటాక్షముచేత నేమియు నాపదరానివారివలెనే నలుగురిలోను సుఖముగా తిరుగ మొదలుపెట్టుదురు. సర్వదయాపరుం డయినయీశ్వరుండు తనవిచిత్ర సృష్టియందలి జీవులకు దుఃఖము శీఘ్రకాలములోనే కృశించి రూపు మాయునట్లును సుఖము కాలక్రమమున పెరిగి దృఢపడునట్లును తగిన సాధనకలాపమును జేసియున్నాడు. సీతకు సంభవించిన విపత్తును తలంచుకొని నారాయణమూర్తియు సత్యవతియు పొందినఖేదమును ఆరంభదశయందు చూచినవా రెవ్వరును వారు వీధిమొగమునుజూచి

నలుగురిలోను తలయెత్తుకొని తిరుగుదు రనుకోలేదు. అయినను వారు సహితము నది దినక్రమమున కొంతధైర్యము నవలంబించి, ఆకాల మున రాజమహేంద్రవరమున జరుగుచున్న కొన్నిప్రయత్నములను తలఁచుకొని సంప్రాప్తమయినయాపదను పోఁగొట్టవచ్చునుగదా యని విచారించి కొంచెముగుండె కుదిరి యుండిరి.

ఈలోపల రామస్వామిమూలమున వారికి కొంత మనోవ్యాకు లత కలుగుచుండెను. అతఁడు తగనితరగతిలో చేరినందున పాఠము లను చదువశక్తుఁడుకాకయు చిన్నప్పటినుండియు భయభక్తులు గలిగి యొకచోట కాలు కుదరి కష్టపడి చదువ నలవాటుపడినవాఁడు కాక యు విద్యయందు శ్రద్ధలేకయు తిన్నఁగా పాఠశాలకు పోక మనసు వచ్చిననాఁడు వెళ్ళినట్టును మనసు రానినాఁడు వెళ్ళనట్టును కాలము వ్యర్థముగా గడపుచుండెను. అన్నగారదిచూచి తిన్నఁగా బడికిపో వనియు పాఠములు చదువవనియు మందలించినప్పుడెల్లను రామస్వామి కోపగించుకొని యొకటి రెండుపూటలు భోజనము చేయక ముసుఁగు పెట్టుకొని మూల పరుండుచుండును. అటువంటి సమయములందు సావిత్రి కలిపించుకొని వచ్చి భార్యాభర్తలిద్దఱును జేరి తిండిపెట్టవలసి వచ్చినదని తమ్ముని బాధించు చున్నా రనియు వాఁ డేలాగుననైన లేచిపోవలెనని బెదరఁగొట్టుచున్నా రనియు జగడమాడి యింట నెవ్వరో చావ సిద్ధముగా నున్నట్టుగా నేడ్చుచుండును. నిజముచేత నారాయణమూర్తియే యప్పుడప్పుడు చదువుకొమ్మని తమ్ముని కూకలు వేయుచుండును గాని సత్యవతి యెప్పుడును మఱదిని పల్లెత్తు మాట నోట రానియ్యలేదు; 'నాయనా' 'అమ్మా' అని పిలుచుచు నెమ్మదిగా నున్నప్పుడు మంచిమాటలతో బుద్ధులుచెప్పి చదువుకొ మ్మని బతిమాలుకొనుచు వచ్చుటయేకాక, అన్నగారు శిక్షించినప్పు

డలిగి భోజనమునకు లేవక పరుండినప్పు డెల్లను తా ననేకవిధముల రామస్వామిని బుజ్జగించి వేఁడుకొని భోజనమునకు లేవదీసికొని వచ్చుచుండును. ఇట్లున్నను సత్యవతి మఱఁదులను మఱఁదలిని తిన్నఁగా చూడదనియు తన మగఁడు గడించి పెట్టుచున్నాఁ డని గర్వపడుచున్నదనియు ఏవో వంకలుపెట్టి సావిత్రి సత్యవతిని కానిమాటలాడుచు, ఆఁడుబిడ్డతనము నంతకంత కెక్కువ చేయుచుండెను. ఇంట విద్యాగంధ మెఱుఁగని మూర్ఖురా లొకతె యున్నపక్షమున, తా నెప్పుడును నెమ్మది కలిగియుండక లేనిపోని విచారములను తెచ్చిపెట్టుకొని తన యధికారము నందఱిమీఁదను జూపఁబోయి మంచివారికి నిష్కారణముగా మనస్తాపమును కలిగించుచు బాలురు మొదలయిన వారి విద్యాబుద్ధులకు భంగము చేయుచు కుటుంబమున కంతకును మితిమీఱిన యాయాసమును నష్టమును కలుగఁజేయుచుండును. సావిత్రి తన మూఢత్వముచేత మఱఁదలిమీఁద నధికారము చూపి తిట్టికొట్టుటకు తనకు పరమస్వాతంత్ర్యము కల దనియు, ఆఁడుబిడ్డతనమెంతయధికముగాఁ జూపిన తన కంతప్రతిష్ఠ యనియు భావించుకొని యైనదానికి కానిదానికి కోపపడుచు సత్యవతి నెంతసాధించుచు వచ్చినను, ఆమెమాత్ర మెన్నఁడును వదినెగారిమాట కెదురాడక యామె మనసు నొవ్వకుండునట్లు ప్రవర్తించుచు, ఆవల పసిబిడ్డను సవరించుకొన వలసినదయినను తీఱిక చేసికొని వదినెగారికికూడ నుపచారములు చేయుచుండెను. సాధారణముగా మనలో మూర్ఖురాండ్ర కెదుటివారు తమ కెంత లోఁబడియుందురో వారిమీఁద నంత యెక్కువ అధికారమును జూపి కేకలువేసి తిరుగఁబడువారిజోలికిపోక లోకువయినవారినే బాధించుచుండుట స్వభావము గనుక సావిత్రి మఱదలి నడతవిషయమయి తప్పుపట్టుట కవకాశము దొరకకపోయినను తిన్నగా ఆచార

(R) 0229

వ్యవహారములు లేవనియు భాగ్యవంతులబిడ్డనని గర్వమనియు సిగ్గులేక పదిమందినిపోగుచేసి చదువు చెప్పుచుండుననియు గొణుగుచుండును. సత్యవతి వదినెగారు తన్నెన్నిమాట లన్నను మాఱుమాట చెప్పక మనసులోనైనను కోపముపెట్టుకొనక తలలోనాలుకవలె మెలఁగుచు సీతదుఃఖము పోగొట్టుటయే తనపనిగా నెంచుకొని చిన్నమఱదలి సుఖమునకయి తనకునూవచ్చుశక్తిని వినియోగించుచు తనకు కొంచె మవకాశ మున్నప్పుడెల్లను సీతకు చదువుచెప్పుచు తాను పనిచేయు చున్నప్పుడు సహితము మఱదలిని దగ్గఱనుంచుకొని నీతికథలు మొదలయినవి చెప్పి కొంచెకాలములోనే దుఃఖము మఱచిపోవునట్లు చేసెను.

ఇది యిట్లుండఁగా రామస్వామి యింట నన్నగారు చదువుకొమ్మని బడికిపొమ్మని పోరుచుండుటవలన వేళకు భోజనముమాత్రము చేసితలగుడ్డచుట్టుకొని పుస్తకములు చేతఁబట్టుకొని యిష్టమువచ్చినదినమున పాఠశాలకుపోవుచు రానిదినమున నెక్కడికో పోయిచీకటిపడినసాయంకాలమింటికిచేరుచు దినములుగడుపుచుండెను. పూర్వకాలమున పాఠశాలలలో పిల్లలాడిన దాటగాను పాడినది పాటగాను ఉండెనేగాని యదపాజ్ఞలు లేవు; ఏపిల్లవానిని కొఱకలువేసిన వాఁడు లేచిపోయి మఱియొకపాఠశాల చేయునోయని భయపడుచు పిల్లలు బడికివచ్చినను రాకపోయినను పాఠములు చదివినను చదువకపోయినను నూఱియు చూడక నూరకుండుచు బాలురచిత్తవృత్తిప్రకారమే యుపాధ్యాయులు మెలఁగుచుందురు. అత్తకాలము కొన్నాళ్లును కోడలికాలము కొన్నాళ్లును నన్నట్లు పాఠశాలలలో నిప్పు డుపాధ్యాయుల కాలము పోయి బాలుర కాలమువచ్చి యుపాధ్యాయులకు బాలురు భయపడ వలసినదానికి మాఱుగా బాలురకే యుపాధ్యాయులు జడియుచు

వచ్చిరి. అందుచేత చదువునందు శ్రద్ధగలబుద్ధిమంతులు కొందఱుతప్ప తక్కినవారు యథేచ్ఛముగా నొకపాఠశాలను విడిచి యొకపాఠశాలకు పోయి సంవత్సరములో పట్టణములో నున్నపాఠశాల లన్నియు తిరిగి యెక్కడను నాలుగుమాసములు కాలుకుదిరి చదువక యెందుకును పనికిరాక పలుగాకు లయి చెడుచుండిరి. తల్లిదండ్రులు సహిత మెక్కడ తగినయుపాధ్యాయు లున్నారో యెక్కడ విద్య చక్కగా వచ్చునో యన్నవిచారణము చేయుటకు సమర్థులుగాక పిల్లల కెక్కడకు పోవ నిష్ట ముండునో యెక్కడ జీతములు తక్కువగా నుండునో యాపాఠశాలకు వారిమనసు వచ్చినట్లు పోవవిడుచుచుండిరి. ఈప్రకారముగా తిరిగి చదువక చెడినవారిలో మనరామస్వామి యొకఁడు. తమ తెలివికి తగినతరగతిలో చేరి తిన్నగా చదివి వృద్ధి కాఁదగినవారు పెద్దతరగతిలో చేరి కడపట నెందుకుఁ బనికిరాక చెడిపోయిన మన రామస్వామివంటివా రీనడుమ లెక్కకెక్కువగుచు వచ్చిరి. అన్నగారి చేత మూఁడురూపాయలు దండుగ పెట్టించి మధ్యతరగతిపరీక్షకు వెళ్ళి ప్రశ్నలకాగితములకెల్లను సరియైనయుత్తరములు వ్రాసినట్లు డంభములు పలికినను పరీక్షలో తేరినవారిపేరులు వచ్చినప్పుడు రామస్వామిపే రందు లేదు. తనకాగితములను దిద్దినపరీక్షకులు తిన్నగా చూడక యన్యాయము చేసిరని యతఁ డెందఱిముందఱ చెప్పినను రాజకీయపాఠశాలలో నయిదవతరగతియందు చేరఁగలుగుట కావాద మెంతమాత్రమును సాయము చేసినది కాదు. అతఁడు వెనుక చదివిన తరగతిలోనే మరల చదువుదునా యనుదురభిమానము గలవాఁ డయి యేపాఠశాలలోను చేరక కొన్నిదినములు గడపి తరువాత తానేదో పాఠశాలలో చేరుటకుఁ గొంచెము ప్రయత్నించెదనుగాని, అన్నగారు తా నుపాధ్యాయుడుగానున్న పాఠశాలలోనే చేరుమని నిర్బంధపెట్టుట

వలన మొదటిప్రయత్నములుమాని యుద్యోగముచేసి సంపాదించి కుప్పలు వేసెదనని బైలుదేరి శిరస్తాదారుగారి ననుసరింప మొదలు పెట్టెను. ఆయన లంచము లుద్యోగధర్మమనియు వ్యభిచారముపురుష ధర్మమనియు, తలంచు సిద్ధాంతములోచేరిన పూర్వకాలపువాఁడుగనుక ఇప్పటిచదువును ఇప్పటివారి నడతలను ఆక్షేపించుచు తనవద్దకు వచ్చు వారి నడత యెట్లున్నను వారు విభూతిపెట్టుకొన్నారో లేదో చూచు టయందును మీసములు పెంచుకొన్నారోలేదో కనిపెట్టుటయందును బిళ్ళగోచులు పెట్టుకొన్నారోలేదో విచారించుటయందును శ్రద్ధ వహించుచుండును. మనరామస్వామి యిప్పు డాయన యనుగ్రహ సంపాదనమునకు తిరుగుచున్నవాఁడు గనుక, భక్తి లేకపోయినను పయికి కావలసినన్ని బాహ్యవేషములు వేసి వానితోనే పుణ్యమును పురుషార్థము నున్నదని యెంచి స్త్రీలు విద్యచదువఁగూడ దనియు పురుషు లింగ్లీషు చదువఁగూడదనియు వాదింప నారంభించెను. అటు తరువాత స్నానముచేసి జుట్టు చివర ముడివైచి దేవతార్చనలు చేసి రామాయణ పారాయణచేసి పగలెల్లను భక్తాగ్రేసరులుగా నుండి రాత్రివేళ భోగకాంతలయిండ్లు చేరుపెద్దమనుష్యులను జూచి, ఆపెద్ద మనుష్యులవలె తానును ప్రవర్తింపవలెనని యెంచి రామస్వామియు రాత్రులు సంచారమున కారంభించెను. ఇది యంతయు చూడ నారా యణమూర్తియు సత్యవతియు రహస్యముగా నాలోచించి యాతనిని దుర్మార్గమునుండి మరలించుటకయి యుపాయము లనేకములు విచా రించి, మహాలక్ష్మి నూఁడుమాసముల క్రిందటనే వ్యక్తురాలయినందున గర్భాదానము చేయుటకు నిశ్చయించి పురోహితుఁడు పెట్టిన మంచి ముహూర్తమునం దతనికి పునస్సంధానము జరిగించిరి. ఆమఱునాఁడు మొదలుకొని యతఁడు భార్యను చదువవలదని యాజ్ఞాపించి పుస్త

కము చేతముట్టినదన్న యనుమానము కలిగినను శిక్షించుచు లేని పోని వంకలు కల్పించి చీటికిమాటికి నిష్కారణముగాఁగొట్టుచు ఆచిన్న దానికి మాత్రమేకాక యన్నగారికిని వదినెగారికిని కూడ మనోవ్యథ కలిగించు చుండెను. ఇఁక సమయము దొరకినదని సంతోషించిసావిత్రి పయికి బైలుదేఱి తనయాఁడుబిడ్డతనమంతయు నిర్దోషురాలైన యా యబలమీఁదనే కనఁబఱుచుచు తాను స్వతంత్రించి కొట్టితిట్టి బాధిం చుటయేకాక మగఁడింటికి వచ్చునప్పటికి లేనిపోనివి కల్పించి కొండె ములుచెప్పి యతనిచేత గొడ్డును బాదించినట్లు బాదించుచుండెను. అది చూచి నారాయణమూర్తి సహింపలేక కొన్నిదినము లప్పగారి నేమియు ననలేక యూరకుండియు పెట్టెడుబాధ చూచి యొకదినము కోపముపట్టలేక యామెను మెల్లగా చాటునకు పిలిచిచీవాట్లుపెట్టెను. అప్పుడామె పెద్దనోరు చేసికొని జగడమాడి బోరుబోరున నేడ్చుచు, ఎందఱెన్నివిధముల బతిమాలుకొన్నను భోజనముచేయక తన్ను తమ్ముఁడు వెడలఁగొట్టినాఁడని యల్లరిచేయుచు, అమలాపురపుపడవ యెక్కి సావిత్రి రెండుజాములవేళ అన్నగారివద్దకు లేచిపోయెను. ఇంట పనిచేయువా రెవ్వరును లేక వేంకటేశ్వరుఁడు రెండుమూఁడుసారు లీవలికే చెల్లెలిని తనయొద్దకు రమ్మని వర్తమానములు పంపెను. ఇక్కడ నెంతసౌఖ్యము కలిగియున్నను సావిత్రి ప్రేమయంతయు అన్న గారిమీఁదను వదినెగారిమీఁదనే యుండి వారియొద్దనే యుండవలె నని యాలోచించుచుండెను. మూర్ఖులకు మూర్ఖులతోఁ గలిసినట్లు మంచివారితో నెప్పుడును కలియదు. కప్పకు బురదనీళ్ళింపయినట్లు పన్నీ రింపగునా?

---

# పదునొకండవ ప్రకరణము

ఉపాధ్యాయుడుగా నున్నకాలములో సహితము నారాయణ మూర్తి యేమియు చదువక యూరక కాలముపుచ్చలేదు. ఉదయకాల మునందును రాత్రులును చదివి యాసంవత్సరమే యతఁడు మండల న్యాయసభయందలి ప్లీడరుపరీక్షకు వెళ్ళెను. అప్పుడప్పుడు సారమ్మ మూలమునను రామస్వామిమూలమునను వచ్చు గృహచ్ఛిద్రముల చేతను కృష్ణమూర్తిపోయిన విచారముచేతను చదువు సన్నగా జరగ నందున పరీక్షలో తప్పిపోదునని యతఁడు భయపడుచు వచ్చెనుగాని తుదకేలాగునో దానికిరావలసిన సంఖ్యవచ్చి పరీక్షయందుఁగృతార్థుఁ డయ్యెను. ఇప్పుడున్నజీతము పోఁగొట్టుకొని న్యాయవాదియుద్యో గములో ప్రవేశించినచో వచ్చుబడి యుండునో యుండదోయని సంశ యించి నెలదినములాలోచించి తుద కొకనిశ్చయము చేసికొని యెట్లో కష్టపడి యొకనెలజీతముమాత్రము చేతిలో నిలువయుంచుకొని స్కూలుమేష్టరుపనిలో ప్రవేశించిన పదెనాలుగుమాసములకు డిస్ట్రిక్టు కోర్టులో పట్టాపుచ్చుకొనెను. పట్టాపుచ్చుకొన్న మొదటినెలలోనే యతనికి ముప్పదిరూపాయలు దొరకెను. రెండవనెలలో రాఁబడి దానికిరెట్టింపయ్యెను. మూఁడవమాసమున నూఱురూపాయలవఱ కును దొరకినవి. ఈప్రకారముగా మాసక్రమముగ ఆదాయము హెచ్చి సంవత్సరము లోపలనె నెలకు రెండువందల రూపాయలవఱకును దొరకనారంభించెను. తమ సామర్థ్యమును విచారింపక కొందఱు పనిలో ప్రవేశింపకముందు తాము సంపాదింపఁగలమో లేమోయని యధైర్య పడుదురుగాని నిజముగా పనిలో ప్రవేశించినతరువాత విశేషశక్తి మంతులు కాకపోయినను న్యాయముగాను పూనికతోను పనిచేసిన

యెడల తామనుకొన్నదానికంటె నధికముగానే సంపాదించుటకు శక్తులగుదురు. ఇప్పుడు మన నారాయణమూర్తి గట్టిప్లీడ రని ప్రసిద్ధి పొందెను; అతఁడు తనవద్దకు వచ్చినకక్షిదారులతో నెమ్మదిగా మాటాడి పల్లెలనుండి వచ్చినవారు కొందఱెంతవిసుగు పుట్టించినను కోపపడక శాంతతో నుపలాలించి యడిగినదానికెల్లను సమాధానము చెప్పి తెలిసికోవలసిన సంగతులనన్నిటిని తెలిసికొని వారిని పంపివేయు చుండును; మొట్టమొదటనే ఫీజు ఖండితముగా నిర్ణయించుకొని ముందుగా కొంతపుచ్చుకొనునే గాని పూర్వకాలపుప్లీడరులవలె తక్కువ ఫీజు మాటాడుకొని యక్రమముగా స్టాంపుల పేరు చెప్పియు, ఇతరుల కియ్యవలసిన మామూళ్ళపేరు చెప్పియు చిల్లిగవ్వయైన నధికముగా పుచ్చుకొనఁడు; ఎన్నఁడును సాక్షులకు తప్పుసంగతులను బోధించుట గాని దొంగపత్రములను ప్రోత్సాహపఱచుటగాని దురాలోచన చెప్పుట గాని వచ్చెడివి లక్షరూపాయలు పోయినను చేయఁడు; అందుచేత జమీందారులును కలహములను పెంచుచు నూహారఁ దిరిగి వ్యాజ్యములు తెచ్చెడి దొంగలెల్లను ఈయనయొద్దకు రారు; అయినను వ్యవహారముతో సంబంధించిన కాగితములను దానికనుకూలములయిన చట్టములను దిట్టముగా నింటివద్ద చదువుకొని వెళ్ళి న్యాయసభకు వెళ్ళినతరువాత న్యాయాధిపతి యిష్టమునుబట్టి మోమోటపడి యూరకుండక తనపక్షమునకున్న సాధనములను కనఁబఱిచి చక్కఁగా వాదించుట వలన మంచివారనేకు లీతనివద్దకే వచ్చుచుండిరి. ఈప్రకారముగా మంచిపేరు సంపాదించి స్థిరపడిన తరువాత నతఁడొక మంచియిల్లు పదిరూపాయల కద్దెకు పుచ్చుకొని దానికి తగినట్టుగా బల్లలు కుర్చీలు మొదలగువానిని సంపాదించెను; ఇంట వంటచేయుట కొక బ్రాహ్మణుని పనిచేయుట కొక బాపనక్కను కుదిరిచెను; వ్యవహారపుపని

చూచుటకొఱకు గృహాంతమున రాత్రులు దీపములు వెలిగించుట మొదలయిన పనులు చేయుటకొఱకు చాకలివానిని ఏర్పఱిచెను; తాను సాయంకాలమునందు ప్రతిదినమును సంగీతము నేర్చుకొనుటకు జీతమిచ్చి యొకపాటకుని నేర్పఱుచుకొనుటయే కాక నీతకును సత్యవతికిని విద్యనేర్పుటకును ప్రవీణురాలయిన యొక జాతిస్త్రీని నియమించెను. ఈప్రకారముగా సకలసుఖములను కలిగియున్నకాలములో సహితము సత్యవతి పనిపాటలు చేయక కాలము వ్యర్థముగాఁ గడుపునదికాదు; ఇంటివెచ్చములను పశువులసంరక్షణమును తానే స్వయముగా విచారించుచు, కాసయినను వ్యర్థముగా వ్యయమగుటకోర్వక, సేవకులజతబత్తెములు తనచేతిమీఁదగానే యిచ్చుచుండును; చల్లపాటువేళ పూలచెట్లలో త్రవ్వియు నీళ్లుపోసియు చెమ్మటపట్టునట్లు పనిచేయుచుండును; తీఱికయున్న కాలములో నిరుగుపొరుగుల స్త్రీలకు విద్యచెప్పియు, బుద్ధిచెప్పియు, కావలసిన యితరసాహాయ్యముచేసియు సాధ్యమయినంత మేలుచేయుచుండును. అందుచేత చుట్టుపట్లకుటుంబములలో నెల్లను వినయవినమార్పు గలిగియన్యోన్యకలహము లడంగి సుఖము హెచ్చసాగెను. చూచితిరా యొక్క యుత్తమాంగనవలన నెందఱికెన్నివిధముల లాభము కలుగుచున్నదో! దీనిని జదువ తటస్థించిన మీరందఱును సత్యవతివలె ప్రవర్తించుటకు ప్రయత్నపడుఁడు. ఆవీధియందుండు స్త్రీలకందఱికిని సత్యవతి యన్న ప్రాణముగా నుండును గనుక, ఎవ్వరేమంచి వస్తువు దొరికినను సత్యవతికి దెచ్చి యిచ్చుచుందురు. ఎవ్వరేక్రొత్త నగ చేయించుకొన్నను సత్యవతికి ముందుగా చూపుచుందురు; వారికేకష్టము వచ్చినను పరుగెత్తుకొని వచ్చి యామెతో చెప్పుచుందురు; పిల్లలకు కొంచెము జబ్బుగానున్నచో ఆమె నాలోచన యడిగి పోవు

చుందురు. మగండుకాని, అత్తకాని, వదినెకాని కొట్టినను తిట్టినను వచ్చి ఆమెతో చెప్పుకొని యేడ్చినప్పుడామె వారిని మంచిమాటలతో నోదార్చి బుద్ధిచెప్పి సంతోషపెట్టి మరల పంపివేయుచుండును; ఇరుగుపొరుగువారు జగడమాడి తనతో చెప్పుకొన వచ్చినప్పుడు వారికి చెప్పవలసినట్లు వారికిచెప్పి సమాధానపఱచి వారిని సంతోషాంతరంగములతో పంపివేయుచుండును. ఎవ్వరైన దుర్మార్గమున ప్రవేశించిన యెడల సాధ్యమైనంతవఱకు ప్రయత్నము చేసి నయమున భయమున వారికి బుద్ధిచెప్పి వారిని మంచిత్రోవకు తెచ్చుచుండును; ఎంతబీద వారికైనను రోగములుకాని యితరకష్టములుగాని వచ్చినప్పుడు వారి యిండ్లకు తాను పోయి యాదరించి పథ్యపానములు విచారించుచు పసి బిడ్డలను తనయింటికి తీసికొనివచ్చి బుజ్జగించి తిండిపెట్టించుచుండును. ఈప్రకారముగా సుఖముగా నున్నకాలములోనే మరల సత్యవతికి గర్భము నిలిచెను. అయినను సుఖ మెల్లకాలమును నొకరీతిగా సాగదు. సుఖములో కష్టమును కష్టములో సుఖమును సమముగ నెప్పుడు వచ్చుచునే యుండును. గుండెలలో నొప్పివచ్చి యొకనాటిరాత్రి యకస్మాత్తుగా సత్యవతితండ్రి రాఘవయ్యగారు స్వర్గస్థు లయిరి. దుఃఖవార్తలను పెంచిచెప్పుట వినువారికిని వ్రాయువారికినికూడ కష్టముగా నుండును గనుక, ఆకుటుంబమునకు గలిగిన విచారమును పాఠకులూహించుకొనుటకే విడిచిపెట్టెదను.

---

## పండ్రెండవ ప్రకరణము

సత్యవతి తండ్రిమరణవార్తను విన్నప్పుడు సామాన్యస్త్రీలవలె ఱొమ్ము బాదుకొనియు తల పగులగొట్టుకొనియు పెద్దపెట్టున నేడువ లేదు. కాని దుఃఖమును తాళజాలక మిగుల విన్నబోయినదై ప్రత్యేకముగా

గోడ నానుకొని మాటలేక కన్నులనీరు కార్చుచు కూరుచుండెను. ఆమె కేకలువెట్టి యేడువలేదని యామెకు దుఃఖము తక్కువ యని యెవ్వరును తలంప గూడదు. దహించుకొనియుండి యామెమనసు లోనిపరితాపమును హృదయము చొచ్చి చూడవలసినదే కాని మఱి యొకవిధముగా గ్రహించుటకు శక్యము కాదు. నారాయణమూర్తియు మామగారినిమిత్తము మనసులో మిక్కిలి ఖేదపడెను. గాని పైకి మాత్రము గంభీరముగానే కనఁబడెను.

సత్యవతి లోపల తన కెంతదుఃఖమున్నను పైకి కనఁబడ నియ్యక పెనిమిటికిని బిడ్డకును నవ్వుమొగము చూపుచు గుట్టుగా నుండెను. కాని మనోవ్యాధిమాత్రము లోలోపల తన పనిచేయక మానినదికాదు. గర్భవతి యగుట యొకటివలన ఆమె దేహము కృశించినసంగతి నెవ్వరును కనిపెట్టినవారు కారు. ఇప్పుడు పిల్లవానికి రెండవయేడు గనుక మెల్లమెల్లగా నడుచుచు పరుగెత్తబోయి పడుచు లేచుచు కొంచెము తప్పుమాటలాడుచు ముద్దుల మాటకట్టుచుండెను. పిల్లవాని ముద్దుముచ్చటలను జూచుచున్న సంతోషముచేత సత్యవతి యూపిరికరముగా నిలువఁబడెనే కాని లేనియెడల వెంటనే మంచమెక్కియుండును. ఆమెకు నెలలు నిండినతరువాత నొకదినమున సుఖప్రసవమై యీసారి చిన్నకొమార్తెను గనెను. ఈసారి జాతివైద్యము తెలిసిన సమర్థురా లయిన మంత్రసాని దాపుననే యుండెను. ప్రసవగృహము విశాలమయినదిగాను శుద్ధవాయువు ప్రవేశించు మార్గములు గలదిగాను ఉండెను. శరీరారోగ్యమునకు భంగము కలిగించు కుంపటిపొగలు మొదలైన వేమియులేవు. ఈప్రకారముగా పైసౌఖ్యము లెన్నియున్నను లోపల నెమ్మది లేకపోవుట వలన నీళ్ళాడిననాల్గవదినముననే జ్వరమును తలనొప్పియువచ్చి సత్య

వతి కంతకంతకు జబ్బు చేయనారంభించెను. నారాయణమూర్తి యెంతసొమ్ము వ్యయపోయి ఘనవైద్యులచేత మందులు వేయించినను దేహము స్వస్థపడక దినదినక్రమమున శరీరమునిండను నొప్పులుపుట్టి మఱుపుచెఱుపులుపుట్టి రాత్రులు తప్పుమాటలు కూడ రాసాగెను. ఆమె కొన్నిసమయములయందు దేహస్మృతి లేక యీ లోకమునే మఱచియుండును. ఈ ప్రకారముగా కొన్నిదినము లున్నతరువాత వైద్యులుసహిత మామె జీవించు నన్నయాశను వదలి దైవముమీఁద భారమువేసి మందులను మాత్రము వేయించి పోషణనిమిత్తము లోపలకు జావనుమాత్రము గంట కొకపర్యాయ మిప్పించుచుండిరి. మొట్టమొదట వమనముల మూలమున జావసహితము లోపల నిమడకపోయినను క్రమముగా జావ కొంచె మిమిడి కొంత సుగుణ మగపడెను. ఆ కాలములో సీతయు సుబ్రహ్మణ్యమును వదినెగారి మంచమువద్దనే సదా కనిపెట్టుకొనియుండి యామెకుపచారము చేయుచుండిరి. రామస్వామి యుదయకాలమునం దొకసారి గదిలోకి వచ్చి చూచి బుఱిబుఱిరాగములు తీసి పోవుచువచ్చినను మయిల పడుదు నన్నభయముచేత భోజన మయినతరువాత తానుగదిత్రొక్కి చూడక భార్యనుసహితము పోనీక నిర్బంధ పెట్టుచుండును. మహాలక్ష్మి నిజముగా సత్యవతిని కన్నతల్లివలెఁ జూచుకొని ప్రేమింపుచుండును గనుక తాను లోపలికి పోకుండ నిలుచుటకు మన సొప్పక మగనికి వెఱచి యాతఁ డింట నున్నంతవఱకు కూరకున్నను మగఁడు గడప దాఁటినతోడనే యప్పగారిగదిలోనికి వెళ్ళి మొగమునకు కొంగడ్డము పెట్టుకొని యేడ్చుచు దిగులుపడి నిలుచుండును. ఇఁక నారాయణమూర్తి తనపనిమానుకొని రాత్రియును పగలును భార్యమంచము వద్దనే యుండి నిద్రహారములు మాని రాత్రి రెండుజాముల వేళ

నైనను వైద్యునికొరకు పరుగెత్తుచు వైద్యుఁడేపథ్యపువస్తువుకావలె నన్న దానినిమిత్త మప్పుడే పోయి తెచ్చుచుండును. ఇప్పుడు సత్యవతి యొద్ద కావలి యుండుటకుఁగాని పథ్యపానము లమర్చుటకుఁగాని వైద్యునియొద్ద మందుమాకులు తెచ్చుటకుఁగాని పరిచారకులకు కఱవు లేదు. ఆమె నెఱిఁగియున్నంతవఱకు పట్టణములో నామెమీఁద ప్రేమ లేనివా రెవ్వరును లేరు గనుక ఎంతో మంది రేయింబగళ్లు గుంపులు గుంపులుగా వచ్చి సత్యవతిస్థితి చూచి కంట తడిపెట్టుచు, ఆమెకు కావలసినదానిని తెచ్చుటకయి సిద్ధముగ నుందురు. సత్యవతి తెలివి గలిగి యున్నసమయములలో గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు నిలుచున్న పెనిమిటివంకఁ జూచి విచారము మాని సభకు పోయి పనిచూచుకో వలసిన దనియు, తనకు వచ్చినప్రాణభయ మేదియు లేదనియు, సీతను జూచి భోజనమునకు వెళ్ళవలసిన దనియు, సుబ్రహ్మణ్యమును జూచి పరుండవలసిన దనియు, మహాలక్ష్మిని చూచి యేడువవల దనియు, పరిచారకులను జూచి యేడుపుమాని వెళ్ళి పనిపాటులు చూచుకో వలసిన దనియు, ఇరుగుపొరుగులవారలఁ జూచి నానిమిత్తము మీకంద ఱకును శ్రమ కలిగినదికదా యనియు, కొన్నిసమయములయందు సంజ్ఞలతోను కొన్నివేళల హీనస్వరముతోను చెప్పుచుండును. ఆమె నోటినుండి యామాటలు వచ్చునప్పు డెల్లవారిగుండెలును పగిలిదుఃఖ ము లోపలినుండి పొరలిపొరలి రాఁగా కష్టముమీఁద నిలుపుకొని నడవకాళ్ళాడక కదలిపోవ బుద్ధిపుట్టక చిత్రపుప్రతిమలవలె నిలువఁబడి కన్నులనీరు విడుచుచుందురు. కొన్నిదినము లీప్రకారముగా నున్న తరువాత దైవానుగ్రహమువలన రోగము మరలుముఖమునకురాఁగా, అందఱికిని కొంతయాశ పుట్టి ముఖములు తెలివొంద నారంభించెను. గాని యామె నట్టింట కాలుపెట్టి మెల్లగా తిరుగఁగలుగునప్పటికి

మూడుమాసములు పయిగా నయినది. ఈకాలములో చంటిపిల్లను పోతపాలుపోసి పెంచుటయు, ఎడబిడ్డను తల్లికొంటి కేడువకుండ ననున యించి బెంగపెట్టుకొనకుండఁ జేయుటయు, తల్లి వ్యాధినిమిత్తమయి పడినకష్టముకంటెను హెచ్చయ్యెను. అంతకాలమును వైద్యుఁడామెకు నీళ్ళు పోయనియ్యలేదు. ఈమూడుమాసములలోను నారాయణమూర్తి యొక్కసారియైనను సభకుపోయి పని చూడనందున కక్షిదారులు మఱియొక న్యాయవాదియొద్దకు పోవలసినవా రయిరి. అన్నగారితోఁగూడ సుబ్రహ్మణ్యము చదువు మానుకొని యింటనే యుండి తనతోఁ గలిసి చదువుకొను సోమసుందరమును తానును సత్యవతి కుపచారములు చేయుచుండిరి. సత్యవతికి స్నానమయిన తరువాత నారాయణమూర్తివైద్యునికిఁ దానార్జించినదానిలో నిలువయున్న రెండువందలరూపాయల నిచ్చి యాతనిఋణమును తా నెన్నటికిని తీర్చుకోలే నని పెక్కువందనములు చేసెను. అంతిరోగమువచ్చి నిమ్మళించినతరువాత నుత్సవముచేసి నామకరణము చేయ బుద్ధిపుట్టక యూరకే పిల్లదానిని ముత్తవతల్లి పేరిట శ్యామలాంబ యని పిలువ సాగిరి. సత్యవతిక దేహము స్వస్థపడినందునకయి పట్టణములోనివా రందఱును తమయింట నెవ్వరికో ప్రాణాపాయమువచ్చి బ్రతికినట్లుగా సంతోషించిరి. భూమిమీఁద జన్మమెత్తినతరువాత పురుషు లయినను స్త్రీలయినను సకలజనులచేత నిరీక్షినిగఁదా మించివా రనిపించుకో వలెను.

---

# పదుమూడవ ప్రకరణము



సత్యవతి కంతకంతకు దేహమున రక్తముపట్టి బలము రాసాగెను గాని నారాయణమూర్తిమాత్రము భార్య జబ్బుగా నున్నదినములలో రాత్రులు నిద్రలేకపోవుటవలనను వేళపట్టిన భోజనము లేకపోవుటవలనను ముఖ్యముగా మనసులోని చింతలవలనను దేహమంతకంతకు శుష్కించి పాలిపోయి తిన్నయన్నమఱుగక కాళ్ళనొప్పులును గుండెలలో బరువును గలిగి నీరసింపసాగెను. సత్యవతికి రోగమెక్కడ తిరుగఁబెట్టునో యనుభీతిచేత నతఁడు తన దేహస్థితిని భార్యతోఁ జెప్పక దాఁచెనుగాని చెప్పకపోయినమాత్రమున రోగ మడఁగి యుండునది కాదు గనుక సత్యవతి యది గ్రహించి మగనిబలహీనతను చిక్కిపోవుటను కనిపెట్టి లోపల దుఃఖపడి శీఘ్రముగా వైద్యునిపిలిపించియౌషధము పుచ్చుకొండని నిత్యమును తొందరపెట్టసాగెను. అతఁడు పది దినములాస్థితిలోనే సభకు వెళ్ళి పని చూచుచుండుటకు ప్రయత్నించెనుగాని, ఆయాస మెక్కువయి యక్కడ కూరుచుండలేక యొకదినమింటికివచ్చి నాటినుండియు మరల వీధిమొగము చూచుటకైనను శక్తుఁడు కాకపోయెను. అతనివ్యాధి దినములలో కుదురునది కాదనియు వైద్యము మొదలైనవానికయి విశేషధనము కావలెననియు సత్యవతి మొదటనే కనిపెట్టి యేలాగునైనను ఇంటివ్యయము తగ్గింపవలెనని నిశ్చయించుకొనెను. ఔషధమునిమిత్తమయి తక్షణము ముప్పది రూపాయలు కావలసివచ్చెను. నారాయణమూర్తి పెట్టెలో నాలుగు రూపాయలకంటె నెక్కువ లేవు. ఈవఱకు సంపాదించినదానిలో నిలువ చేసిన దంతయు సత్యవతిరోగముక్రిందనే కర్చుపడిపోయినది. వడ్డీ యిచ్చి ఋణముచేయుట సత్యవతికి లేశమాత్రమును ఇష్టము లేదు.

అందుచేత సత్యవతి తనపుట్టినింటివారు పెట్టినసగ యొకటి యేబది రూపాయలకు విక్రయించి మందులనిమిత్తము వైద్యుని కిచ్చెను. ఆరూపాయ లెక్కడ తెచ్చితివని నారాయణమూర్తి భార్య నడిగెను గాని యామె చెప్పక యిటువంటివిషయములలో మీరిప్పుడు మీ మనస్సు నాయాసపెట్టవల దనియు మీదేహము స్వస్థపడిన తరువాత అన్నియు సావకాశముగా చెప్పెద ననియుమాత్రము చెప్పెను. అటు తరువాత నొకనాడు సత్యవతి భర్తతో నాలోచించి సాధకబాధక ముల నాతనికి బోధపఱిచి, ఆతనిసమ్మతిని కర్తవ్యమును నిశ్చయించి, ఒకనాడు బ్రాహ్మణిని బాపనక్కను మెల్లగాపిలిచి తమస్థితిని వారికి తెలిపి కొంతకాలము మఱియొకచోట పని చూచుకొం డని వారితో చెప్పెను. వా రామెమాటలు విన్నతోడనే లోపలినుండి దుఃఖము పొరలిపొరలి వచ్చి కన్నీరు వఱదలుగట్ట నేడ్చుచు బాబయ్యగా రీవ్యాధి కుదురువఱకును తాము జీత మక్కఱలేకయే పనిచేసెద మనియు కావలసియున్నయెడల తమవద్ద నున్నరూపాయలనుకూడ నిచ్చెద మనియు వారు బహువిధముల వేడుకొనిరి. కాని సత్యవతి వారిని మంచిమాటలతో నూరార్చి కన్నులనీరు తాడ్చుచు ఎంతో కష్టముమీద వారిని సమాధానపఱిచి కొంతకాలము మఱియొక చోట నుండుటకు వారిని ఒప్పించెను. తా మెక్కడ నున్నను వచ్చి నిత్యమును దంపతుల కుపచారము చేసి పోవుచుండుటకుమాత్రము సెలవిమ్మని యామెను వేడుకొని, ఆమెచేత నావరమును పొంది మనసు కొంతసమాధానపఱచుకొని, పసిబిడ్డలు తల్లిదండ్రులను విడుచు నప్పుడు దుఃఖించునట్లు దుఃఖించుచు ఆవలకు పోయిరి. అటుతరువాత సత్యవతి యొకరితరువాత నొకరినిగా పరిచారకులనందఱిని తప్పించెను. కాని వా రందఱు నామెయందు మాతృస్నేహము గలవారగుట ప్రతి

దినమును రెండుమూడుసారులు వచ్చి కొంతసేపు కూరుచుండి తాము చేయవలసినపని యేమయిన నున్నదాయని యడిగి పోవుచుందురు. అటుతరువాత స్థలము మార్పవలయు నని నిశ్చయించి సత్యవతి యా వీధిచివరనే చిన్నదైనను మంచిగాలివచ్చుట కనుకూలముగా నున్న మఱియొకయింటిని రెండురూపాయల కద్దెకు పుచ్చుకొని యక్కడకు కుటుంబసహితముగా వెళ్ళి ప్రవేశించెను. ఈక్రొత్తయింటిలో ఇప్పు డున్నబల్లలు కుర్చీలు మొదలైన వాని నుంచుకొనుటకు చోటులేదు. గనుక ముఖ్యముగా కావలసినవాని నుంచుకొని తక్కినవాని నన్నిటిని రమారమి నూఱురూపాయల కమ్మివేసిరి.

ఈసమయములోనే సూరమ్మ రజస్వల యయ్యెను. సత్యవతి యేమియు లోపము లేకుండ జరపవలసిన లాంచనములు జరిగించినను సూరమ్మతల్లి తనకొమార్తె కన్నియు లోపములు జరుగుచున్న వనియు ముద్దులును ముచ్చటలును వేడుకలను తిన్నగా జరగలే దనియు అల్లరి చేయనారంభించెను. మూఢురాండ్రు తమ వేడుకలను కార్యములనే చూచుకొందురు గానియెదుటివారి యనుకూల్యమును సాధకబాధకములను లేశ మయినను విచారింపరు. అటువంటి విచారసమయములోనే యాదంపతులు తమ కష్టముల నొకమూల పెట్టి సూరమ్మయొక్కతల్లి నిర్బంధముచేతను సాధింపుచేతను సుబ్రహ్మణ్యముయొక్క గర్భాధానముసహితము చేయవలసిన వారయిరి. ఎంతచేసినను కృతజ్ఞతలేక, అప్పటిస్థితిని విచారింపక, ఆగయ్యాళి రెండుపిండివంటలు చేయలేదనియు తనకొమార్తెకు పెట్టిన మధుర చీర మంచిది కాదనియు కొంగున రెండురూపాయలే కట్టినా రనియు అత్యంతతృప్తికరమయిన మాటల నని యావధూవరుల మనస్సునకు ఖేదము

కలిగింపసాగెను. ఓమూఢత్వమా! ఆహా! నీప్రభావ మెంతయని ర్వాచ్యమైనది! నీవున్నచోట వివేకాదులుకలనైనాపనైనను లేవుగదా!

ఇప్పుడు ఘనవైద్యుఁ డౌషధ మిచ్చుచున్నను, నారాయణ మూర్తికేమియు నిమ్మళముగా లేదు. విరేచనములుకూడ నారంభ మయి, అన్నహితము లేక యాకలి మందగించెను. వైద్యుఁ డొక జబ్బున కౌషధమిచ్చిన మఱియొకజబ్బు ప్రబలుచుండెను. ఇటువంటి సమయములో సత్యవతి మనస్సుయొక్కస్థితిని వర్ణించుట కెవ్వరికిని శక్యముకాదు. నిప్పులలోవేసి పొరలించినను, ఆమెమనసున కంతపరి తాపము కలుగదు. అంతదుఃఖ మున్నను అదియంతయు లోపల దిగమింగ్రి పయికిధైర్యమవలంబించి సంతోషముగా నున్నట్టే భర్తకు కనఁబడు చుండును. అయినను క్రొత్తగా రక్తముపట్టుచున్న యామె దేహము మరల క్రమక్రమముగా శుష్కించి మగఁ డధైర్యపడకుం డుటకై పయికి లేనినవ్వు తెచ్చిపెట్టుకొనుచున్నను ముఖమునందు విచారలక్షణములు స్పష్టముగా కనఁబడసాగెను. ఆమె మొగమును చూచినప్పుడు భర్త కెంతచింత కలిగినను రెండవవయిపునకు తిరిగి కంట తడిపెట్టునేకాని యామెచూచునట్లుగా నెప్పుడును దుఃఖపడఁడు. ఒకానొకసమయమునందు సత్యవతికి దుఃఖముపట్టశక్యముకానియెడల, ఆమెయేదోపని కల్పించుకొని దొడ్డిలోనికి దూరముగా వెళ్ళి యెవ్వ రును చూడకుండ నింతసేపు దుఃఖపడి కన్నులనీరు తుడుచుకొని భర్తృసేవ చేయుట కయి మరల వచ్చుచుండును. ఈసమయములో సుబ్రహ్మణ్య మేమో యన్నాఁడని కోపగించుకొని సూరమ్మతల్లి యెవ్వరితోను చెప్పకుండ కొమార్తె నిక్కడ దగ్గవిడిచి తన పుట్టి నింటికి లేచిపోయెను. అందుచేత సూరమ్మ యుదయాస్తమానములు తల్లికొఱకు శోకములు పెట్టుట కారంభించి రోగికినిడ్రకూడ లేకుండ

తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాలయం
నమోదు సంఖ్య 805

జేయును. సత్యవతి పిల్లలను సవరించుకొనుటకు తోడు లేనప్పుడును పెనిమిటి వద్దనుండి యుపచారము చేయవలసి వచ్చుచుండుటచేతను మగనిబాధవలన మనఃక్లేశమువలనఁ బనిచేయుటకును వల్లకాకపోవుట చేతను, మగఁడింట లేనప్పుడయిన పనిచేయుటకై సాహసించివచ్చినను వేవిళ్ళమూలమున శక్తిచాలకపోవుటచేతను, గయ్యాళియైన సూరమ్మయుండియు లేనిదానితోనే సమానమయిన దగుటచేతను ఇంటిపని యంతయు సీతమీఁదనే పడెను. ప్రాణసమానురాలయిన ముద్దుమఱఁదలెల్లప్రకారముగా కష్టపడుట సత్యవతి కేమాత్రమును ఇష్టము లేకపోయినను చేయునదిలేక మఱఁదలికొఱకు గుండెలోపల కొంతవ్యసనపడుచు పథ్యపానములు చేయుటలో నవకాశమున్నప్పుడెల్లను సీతకు కొంచెము తోడుపడుచుండెను. సుబ్రహ్మణ్యము కావలసినప్పుడెల్లను వైద్యునియొద్దకు వెళ్లి మందులు తెచ్చియిచ్చుచు, పథ్యమునకు కావలసినపాలు మొదలైనవి తెచ్చియిచ్చును, బాహ్యాదులకు వెళ్లవలసివచ్చినప్పుడన్నగారిని లేవఁదీసి పరుండఁబెట్టుచు, కష్టపడుచుండెను. ఈకష్టకాలమునందానిసహపాఠియు సహోదరముకంటె ఆపద్బంధుఁడైన సుబ్రహ్మణ్యముతో సమానముగా కష్టపడి సాయము చేయుచుండెను. అవలకుబాంధవ్యమును తెలుపుకొని విందులు కుడిచిపోవుచుండెడిబంధువు లొక్కఁడును కష్టకాలములో మొగము కనఁబఱచలేదు. పరమమిత్రులుగా నగపడిన ధనికులును తామేమయిన బదు లియ్యవలసివచ్చునేమో యని యింటికి వచ్చుటయే మానివేసినారు. ఒకటి తరువాత నొకటిగా సత్యవతినగ లన్నియు వర్తకుల పాలయినవి. ఇంట నన్నగారింత జబ్బుస్థితిలో నున్నను చీమకుట్టినట్టయిన నుండక యివి లేవనియు అవి లేవనియు వంకలు పెట్టి యే లాగుననో భోజనము చేసి తెచ్చెడిది చిల్లిగవ్వ లేకపోయినను వేళకు వెళ్లకపోయినయెడల

శిరస్తాదారుగారు కోపపడుదు రని భార్యమీఁద నాలుగు కేకలువేసి రామస్వామి యిల్లుపట్టక నిర్విచారముగా తనస్నేహితులతోకూడ తిరుగుచుండెను. తమ్మునికి మిక్కిలి జబ్బుచేసిన దని విని సావిత్రి యిప్పుడు మరల వచ్చినది. అందుచేత సీత కిప్పుడు కొంతవిశ్రాంతి కలిగి వదినెగారితోకూడ అన్నగారివద్ద కనిపెట్టుకొని యుండుట కవకాశము కలిగినది, ఇప్పుడు చేతనున్న డబ్బంతయు వ్యయపడినందునను, అమ్ముటకు సత్యవతిశరీరమున నేమియు లేకపోయినందునను, ఇంటికి కావలసినంతమంది యున్నను గడించి తెచ్చుప్రయోజకు లొక్కరును లేనందునను, ముందెట్లు జరుగునో తోఁచక సత్యవతి సీతతోను సుబ్రహ్మణ్యముతోను రహస్యముగా చెప్పి వ్యసనపడెను. సుబ్రహ్మణ్య మాదినముననే వెళ్ళి తానుదినమునకొక గంటచొప్పున రాత్రు లింటివద్ద ఒక్కధనికునికొమారునకు విద్యచెప్పునట్లును వారు నెలకు నాలుగురూపాయ లిచ్చునట్లును నిర్ణయించుకొనెను. సీతకూడ తాను కొంతవఱకు చదువెఱిఁగిన దగుటచేతను, కుట్టుపనియందు కొంతప్రవీణత కలది యగుటచేతను అప్పుడు రాజకీయపాఠశాలలోని విద్యార్థులు క్రొత్తగా ఇన్నీసుపేటలోపెట్టిన బాలికాపాఠశాలయందుపాధ్యాయినిగా ప్రవేశింప నిశ్చయించుకొని, అన్నగారికిని వదినెగారికిని తనయభిప్రాయము చెప్పి వారియనుమతి పొంది, తెలియని వారు తన్నొకవేళ పరిహసించి దూషించినను వారిమాటలు సాటి చేయరా దని మనసు దృఢపఱుచుకొని దరఖాస్తు వ్రాసి పాఠశాలా కార్యనిర్వాహకుల కిమ్మని సుబ్రహ్మణ్యముచేతి కిచ్చెను. ఇంతలో నారాయణమూర్తిగారికి దేహారోగ్యముతప్పియున్నదన్నవర్తమానము విని చూడవచ్చిన కచేరీదారుఁడొకఁడు వారిస్థితిని జూచి మిక్కిలివ్యసనపడి యేదో వ్యాజ్యములో తాను బాకీపడియున్న ఫీజు నూఱురూపాయ

లను సత్యవతిచేతి కిచ్చెను. మంచివారికెప్పుడును దైవమేదోయొకరీతిని సాహాయ్యముచేయుచుండును. ఈయాపత్సమయమం దందఱును కృతఘ్నులుగానేయున్నారని దీనింజదువువారు భావింపవలదు. వంట బ్రాహ్మణులు మొదలయిన సేవకులు వచ్చి యేపని చెప్పినను చేయుటకు సిద్ధముగానుండి తనయజమానుని నిమిత్తమయి కంట తడిపెట్టని దినము లేదు. ఇరుగుపొరుగువారును వారివలన ఉపకారముపొందిన యితరులును కృతజ్ఞతగలవారై యనుదినమును విరామము లేకుండ వచ్చి చూచిపోవుచునేయున్నారు. కొంతకాలము వైద్యుఁడు సహిత మతఁడు జీవించునోలేదోయన్న సంశయము కలిగియుండెను.అయినను సత్యవతిమొదలయినవారుపడినప్రయాసము వ్యర్థముగాపోలేదు. ఆఱు మాసములకు రోగము మళ్ళిన చిహ్నములు కనఁబడనారంభించెను. వాడి చిన్నవోయియున్న సత్యవతిముఖమునం దిప్పుడు కొంచెము తెలివి కనఁబడనారంభించెను.నారాయణమూర్తి మంచముదిగి మెల్లగా తిరుగ నారంభించునప్పటి కెనిమిదిమాసములయినది. తరువాతఒకటి రెండుమాసములలో నతఁడు మరల సభకువెళ్ళి పనిచూడ శక్తుఁడైనందున కక్షిదారులెప్పటివలె రానారంభించిరి. సంవత్సరమగునప్పటికి చేతిలో కొంచెము డబ్బుచేరినందున నారాయణమూర్తి మరల మును పటియింట ప్రవేశించెను. కొమారుఁడును కొమార్తెయుకూడ సుఖముగా పెరుగుచుండిరి.

---

## పదునాల్గవప్రకరణము



చూచువారికందఱికిని పయికి నారాయణమూర్తియు భార్య మొదలగువారును మిక్కిలి సుఖపడుచున్నట్టుగానే కనఁబడుచున్నను, పైవారనుకొన్నంత సుఖముమాత్రము వారికిలేదు. ఒకవేళ దంపతులు

తమలో తా మెంతమైకమత్యము గలిగి యెంత సెమ్మదితో సంసారచక్ర మును నడిపించువారయ్యును మనలోని యవిభక్తకుటుంబస్థితివలన పెక్కుబాధలును మనస్తాపములును కలిగి తఱుచుగా వారిసుఖము నకు భంగముకలుగుచుండును. ఇంటనున్నవారు తమజీవనార్థమయి తామిసుమంతయు పాటుపడక కుటుంబములో కొంచెము ప్రయోజకుండయి గడించి తెచ్చుచున్నవాండొకం డున్న వానినే యన్నిటికిని నమ్ముకొనియుండి పనిపాటులు లేక యూరక తిని కూరుచుండుటచేత ప్రొద్దు జరగక ప్రతిస్వల్పవిషయములోను నిష్కారణముగా కలహము లాడుచు, సంపాదించి తెచ్చి కుటుంబసంరక్షణము చేయువానికష్టము లను లేశమైనను విచారింపక తమ కిదిచాలదని అది చాలదని రవ్వ పెట్టుచు గృహయజమానున కేదోయొకవిధమైనశ్రమను కలుగం జేయు చుందురు. ఇంట సోమరులుగానుండి తినువారిసంఖ్య యెంతయెక్కువైన జగడము లంతయెక్కు వగుచుండును. భగవంతుండు తమకుదయచేసిన కరచరణాద్యవయవము లన్నియు తిన్నగా నుండి తాము దృఢకాయు లయియుండియు వాని నుపయోగించుకొనక పోయినందుకు సిగ్గుపడ వలసినదానికి మాఱుగా త మ్మితరులు పోషించుట విధి యనుకొని గర్వపడుచు నానావిధముల గడించి తెచ్చిపెట్టువారి మనస్సులకు బాధ కలిగించుచుందురు. ఇందుచేత హిందూకుటుంబములో సాధారణ ముగా తెచ్చిపెట్టువారికింగాని తెచ్చినదాని ననుభవించువారికింగాని తృప్తియు సంతోషమును కలుగక, ఒకరిమీంద నొకరి మనస్సులో అసూయయు ద్వేషమును గలిగియుండును. ఈ కారణముచేత నేయత్యం తైకమత్యమును దృఢానురాగమును ఉండవలసినయొక్క కడుపున పుట్టినవారిలో సహితము సోదరవాత్సల్య మంతగా లేక ద్వేషమే యధికముగా నుండి లోకములో అన్నదమ్ములశత్రుత్వమన్నసామెత

పుట్టవలసినంతగతి సంభవించినది. కాఁబట్టి మనవారందఱు ఒక్క చోటఁ గలిసియుండక యెంతదూరముగా నున్న అంత యనురాగము ప్రేమయుఁ గలవారయి యుందురని నామనస్సునకు తోఁచుచున్నది.

రామస్వామి బాగుగోరి నారాయణమూర్తి యతనిని చాటునకు పిలిచి యెన్నిసారులు బుద్ధిచెప్ప యత్నించినను రామస్వామిమనస్సులో నేదో దురభిప్రాయము పెట్టుకొని యుద్దేశము తెలిసి చెప్పినదానికెల్లను విపరీతార్థములు కల్పించి తన్ను భార్యను పోషింపవలసి వచ్చినదని కానిమాటలాడి యన్నగారు తమ్మెలాగుననైన వెడలఁగొట్ట చూచుచున్నాఁడని యెఱిఁగినవారితో నెల్లను చెప్పనారంభించెను. అందుచేత నారాయణమూర్తి తమ్మునితో నేమియు చెప్పుట మాని వేసి, అతఁడేదారిపోయినను చూడనట్లూరకుండవలసినవాఁడయ్యెను. అందువలనను అతనిదుర్నయ మడఁగక మఱింతమితిమీఱిపోయి, దుష్టుల సహవాసము మరిగి యథేచ్ఛముగా తిరుగుచు రాత్రులు దీపములు పెట్టుకొని సహితము జూదములాడి యోడినసొమ్ము నిమిత్తమయి భార్యను బెదరించి నగయేదైన దీసికొనిపోయి పాడుచేయుచు, ఒకానొకప్పు డింట చేతికందినవస్తు వేదియైన నెత్తుకొనిపోయి జూదగాండ్ర కిచ్చుచు, తానోడిపోయిన దినమున చిరచిరలాడుచు తిన్నగానన్నము తినక యలిగి లేచిపోయి భార్యను కొట్టి తిట్టుచు, అన్నగారిపేరుచెప్పి యంగళ్ళలో వస్తువులు తెచ్చి తానుపయోగించుకొనుచు, తుంటరులను వెంటవేసికొని రాత్రులవేళ తిరిగి తమవిరోధులతో పోట్లాడి మాటతెచ్చుచు, పలువిధముల అన్నగారికి మనస్తాపము తెచ్చుచుండెను. అతఁ డప్పుడప్పుడు సీమసారాయములను త్రాగుచుండునని చెప్పుదురుగాని యాతఁ డెప్పుడును తప్పత్రాగి దేహముమఱచి

పడిపోయినట్లు కనఁబడదు. అయినను ముండల మరిగి జూదములాడ నలవాటుపడినవారికి పానముండుట యంత వింతకాదు. ఈనడతనుకని పెట్టి మహాలక్ష్మి మనసులో ఖేదపడి మగనితో అనేకవిధముల నయమున చనువున హితముచెప్పి చూచెనుగానియాహితోపదేశమువలన కార్యము లేకపోవుటయే కాక మీఁదిమిక్కిలి యతఁడామెనుకొట్టు టయు తిట్టుటయుకూడ సంభవించుచువచ్చెను. మగనివిషయమైన యీబెంగచేత నేయామె దేహములో నెంతోజబ్బుచేసి ప్రసవమైనప్పుడు బ్రతుకదన్నంతదుస్థితికివచ్చెను. జీవిత సంశయము కలిగియున్న యా దినములలో ఒకసారి మహాలక్ష్మి యొంటిగా తనమంచమువద్ద కన్నుల నీరు పెట్టుకొనుచు నిలుచున్న తనమగనిని చేరఁబిలిచి మీఁదమెల్లగా చేయివైచి హీనస్వరముతో తనవ్యాధి కాతనినడతవలనఁ గలిగిన మనోవ్యథయే కారణమనిచెప్పి, తానుపోయినతరువాతనైననుప్రవర్త నము తిన్నపఱుచుకొని యన్నగారును వదినెగారునుచెప్పినట్టు విని వచ్చెడుభార్యను సుఖపెట్టి మీరు సుఖపడెదమని చేతిలో చేయివేసిన యొకల నిర్విచారముగాప్రాణములు విడిచెద నని గడియకొకమాట చొప్పున చెప్పి కన్నులుమూసికొనెను. అతనికామాటలు శూలముల వలె నాటినందున తనవెనుకటి నడతవిషయమై నిజమయిన పశ్చాత్తా పము గలిగి యిఁకముం దెప్పుడును మునుపటి దుస్సహవాసమున నుండక బుద్ధికలిగి యోగ్యముగా ప్రవర్తింపవలయు నని నిశ్చయము చేసికొని భార్యకు తనమీఁదఁగల ప్రేమకును తనబాగువిషయమై నూమె మనసులోని చింతకును దుఃఖము పట్టలేక పెద్దపెట్టున నేడిచి భార్యచేయి పట్టుకొని భగవదనుగ్రహమువలన నీవు బ్రతికి నేనుసుఖ పడవలసిన భాగ్యము తటస్థించిన పక్షమున నాముందు నడత యెట్లుం డునో నీవే చూచెద వని చెప్పి యాపైని నోటమాట రాక కన్నీరు

కాలువలు కట్టించుచు నూరకుండెను. ఆమాటలవలన మహాలక్ష్మి కెంతో ధైర్యము కలిగి నాటినుండి యామె దేహస్థితి యద్భుతముగా మారి దినదినక్రమమున దేహము స్వస్థపడి మంచముమీఁదికాలు క్రింద మోపఁగలిగి నెలదినములలో నింట నడయాడ శక్తురా లయ్యెను. ఆమెకు పుట్టిన స్త్రీశిశువును సుఖముగా పెరుగుచుండెను. తోడికోడలి వ్యాధిదినములలో సత్యవతి పడిన ప్రయాసమునుపరితాపమును చేసిన యుపచారమును గూర్చితెలుపవలసిన దేకాని చెప్పనేరదు. స్వప్రయోజనపరిత్యాగ మన్నమాట నేలోకమునను లేక తనజీవనమును దేహమును పరులనిమిత్తమే ధారపోసెడి యిటువంటి సాధ్వీమణులుండబట్టియే దుఃఖబహుళమైన యీలోకమునందు బహుగృహములు భూతలస్వర్గము లగుచున్నవి. భార్యమాటవలన రామస్వామి నడతయు ఆకస్మికముగా మంత్రించినట్లు మారిపోయెను. అతఁడు నాఁడు మొదలుకొని మరల నెప్పుడును రాత్రు లిల్లు బయలుదేరి వీధిలో కాలుపెట్టలేదు. జూద మాడలేదు. పూర్వపు విహితులతో సహవాసము చేయలేదు, మఱి యేదుష్కార్యమును చేయలేదు. పూర్వమిత్రు లనేకపర్యాయము లాతని నిమిత్తమై యింటికివచ్చి పిలిచియు పరిహాసము చేసియు రోషము పుట్టించియు తమమార్గమునకు మరల దింపఁజూచిరి కాని వారి ప్రయత్నములు కొనసాగనందున, అతఁడిక చెడిపోఁడని విడిచిపెట్టి యాతనిమైత్రిని వారు మానుకొనిరి. మును పన్నగారిమాట యన్న తిరస్కారబుద్ధితోఁ జూచెడు రామస్వామి యిప్పుడన్నగారికిని వదినెగారికినిపరమభృత్యుఁడయివారి యాజ్ఞ కడుగుదాటక మెలఁగఁజొచ్చెను. ఇప్పుడతనికి తా నేలాగుననైన విద్యాభ్యాసము చేసి పరీక్ష లిచ్చి గొప్పతనము పొందవలెనన్న చింత తప్ప వేఱుచింత లేదు. అందుచేత నతఁ డిప్పుడు రాత్రియు

పగలును పుస్తకములు చేతఁ బుచ్చుకొని చదువుచు తనకుఁ దెలియని దాని నన్నగారి యొద్దను యితరులయొద్దను నేర్చుకొనుచు విద్యా కాలక్షేపము చేయుచున్నాఁడు.

నారాయణమూర్తికిని సత్యవతికిని మనస్సులకు నొప్పి కలిగించి వ్యాకులత పుట్టించెడు రెండవ కారణము సూరమ్మనడత. సూరమ్మయు తల్లియు చిన్ననాటినుండియు పల్లెలయందు పెరిగినవా రగుటచేతను, చదువుకొన్న నాగరికులతో నెన్నఁడును మెలఁగి యుండక పోవుటవలన వారియాచార వ్యవహారములు మిక్కిలి భిన్నము లగుటచేతను, వారికి సత్యవతి మొదలయిన యింట నున్నవారి ప్రవర్తన మెవ్వరిదియు సరి పడక యుండెను. సూరమ్మ ప్రతిదినమును ఏదో యొకనోము చొప్పున లోకములో లేనినోము లన్నియు పట్టవలెనని కోరు చుండును. సుబ్రహ్మణ్యము నోములయం దిష్టము లేనివాఁడై సాధ్య మయినంత వఱకు మాన్పింపఁ బ్రయత్నింపు చుండును. సూరమ్మ పేడ శుచి యని భావించి కంపుకొట్టునట్టుగా ఎల్లయెడలను ముద్దలుముద్దలు పడునట్టు మోటిమాటికిని పేడనీళ్ళు చల్లు చుండును; సుబ్రహ్మణ్యము పేడ యశుచియని యెంచి దానిని చూచినప్పు డసహ్యపడుచు వచ్చుటయే కాక పేడనీళ్ళుపడి పాదరక్షలును బల్లలును కొన్నిసమయములయందు బట్టలును పాడగుచున్న వని విసుగుకొనుచుండును. సూరమ్మయెవ్వరో దగ్గరకు వచ్చి రనియు, ఏదో యొకగుడ్డ కాలికి తగిలిన ట్టనుమానముగా నున్నదనియు చెప్పరానివానిమాట వినఁబడిన దనియు పేరులుచెప్పి మయిలపడితి నని దినమున కయిదారుస్నానములు చేసి తడిబట్టలు కట్టుకొని తలనొప్పిచేతను పడిసెముచేతను మూలుగుచుండును; సుబ్రహ్మణ్య మది యంతయు వెఱ్ఱియని చెప్పి మానిపింపఁ జూచు చుండును. సూరమ్మ రోగము వచ్చినప్పుడు మందులు వేసికొనక

వ్యాధిని పెంచుచు సోదెనిమిత్తమును శకునములనిమిత్తమును వేరు వెల్లంకులనిమిత్తమును ప్రయత్నించి సొమ్ము వ్యర్థముగా వ్యయపఱుపఁ జూచుచుండును. సుబ్రహ్మణ్యము వ్యాధి కౌషధముతప్ప వేఱుమందు లేదనియు దానికి దేవతలును దయ్యములును కారణములు కావనియు బోధించి ఆపిచ్చిపనుల నివారింపఁ జూచు చుండును. సూరమ్మ శని వారములనియు ఆదివారములనియు మంగళవారములనియు శుక్ర వారములనియు ఏకాదసులనియు అమావాస్యలనియు శివరాత్రు లనియు కృష్ణాష్టము లనియు గ్రహణము లనియు పర్వములనియు తఱు చుగా ఒక్కప్రొద్దులును జాగరములును ఫలహారములును నిరాహార ములును చేసి దేహము చెడఁగొట్టుకొను చుండును; సుబ్రహ్మణ్య మివి యన్నియు ఛాందసము లని కోపపడి యత్తగారియొక్కయు భార్య యొక్కయు ఆగ్రహమునకు పాత్రుఁడగుచుండును. సూరమ్మ తాను ధనికురాలివలె కనఁబడనెంచి తనస్థితికి తగనిబట్టలును నగలును తెమ్మని బాధించుచు, దంభము నిమిత్తమయి లేనిపోనిబొంకులు పలుకుచు, దొంగతనముగా ఇంటనున్నవస్తువులు తీసి బ్రాహ్మణులు మొదలయిన వారికిచ్చుచు, స్వల్పవిషయములలో ఇరుగుపొరుగులవారితో కలహ ములాడుచు, ఊరక కూరుచున్న కాలములో పరులమీఁదిదోషముల నెన్నుచు, ఉండును; సుబ్రహ్మణ్య మివి యన్నియు కానిపనులని నొక్కిచెప్పి నీతులు చెప్పి భార్యచెవులకు నొప్పి కలిగించు చుండును. ఈవిధముగా ఆదంపతు లనేకవిషయములయందు భిన్నాభిప్రాయము గలవారుగా నుండుటచేతను, ఈకలహములలో సత్యవతి మొదలయిన వారు సుబ్రహ్మణ్యముపక్షమే యవలంబించినట్లు కనఁబడుటచేతను సూరమ్మకును తల్లికిని వారందఱియందును ద్వేషముపుట్టి తల్లిబిడ్డలు పిల్లిమీఁద పెట్టియు ఎలుకమీఁద పెట్టియు నారాయణమూర్తిని సత్య

వారిని వారిబిడ్డలను నోట పట్టరానితిట్లుతిట్టియు పొరుగువారితో వారి మీఁద నేరములుచెప్పి తమ కన్నమును బట్టియు నియ్యక బాధించు చున్నారని బోరుబోరున నేర్చి యల్లరిపెట్టియు, ఆదంపతులకు మనో వేదనను కలిగించుచుండిరి. చూచితిరిగదా మూర్ఖులవలన ఎంతమంచి వారికిని లోకములో నెట్టివంటి యాయాసమును మనోవ్యథయును సంభవింపుచుండునో! ఈకలహములచేత సూరమ్మయు తల్లియు చేరి కట్టుకట్టి తలనొప్పి యున్నప్పుడు లేనప్పుడునుకూడ మొగమునకు పట్టు వేసికొని యిచ్చినమందులు వేసికొనక తమ్ము చూచువారు లేరని పెద్దపెట్టున నేడ్చుచు పొరుగువారలనెల్ల ఆకర్షింపుచుండురు. మఱికొన్ని సమయములయందు సూరమ్మ దయ్యము పట్టిన ట్లభిన యించి పెద్దకేకలు వేసి యల్లరిచేసి రాత్రివేళ అందఱి నూరిమీఁద పరుగులెత్తించుచు దేహము తెలియనట్టు నటించి నోరికసి దీఱ తన కోపమున్నవారినందఱినితిట్టుచు, దయ్యముపేరుపెట్టి బట్టను కాల్చియు గాజుగిన్నెలు మొదలయినవి పగులఁగొట్టియు, విశేషనష్టమునుగలుగఁ జేయుచుండును. అందుచేత చదువేమియు జరగక సుబ్రహ్మణ్యము తన కటువంటిగయ్యాళి భార్య యయినందుకును తనమూలమున నిష్కారణముగా అన్నగారికిని వదినెగారికిని కూడ శ్రమ కలుగు చున్నందునకును మిక్కిలి ఖేదపడి ప్రాణమువిసిగినప్పుడు కొన్నివేళల యందిల్లువిడిచి దేశాంతరము లేచిపోవుటకును కొన్నిసమయముల యందాత్మహత్య చేసికొనుటకును ప్రయత్నించుచు వచ్చెను గాని నేఁటివఱ కటువంటి వైపరీత్య మేదియు పుట్టలేదు. ముందేమి జరగఁ బోవునో ఈశ్వరునకు తెలియవలెను గాని మనకేమియు తెలియును.

సత్యవతికిని భర్తకును గలమూఁడవచింతసీతకుతటస్థించిన దుర వస్థవిషయమైనది. వా రామె దుర్గతిని మాన్పి యేలాగునన్నైన పున

ర్వివాహము చేసి మరల సుఖస్థితికిఁ దీసికొనిరావలెనని వారి మనస్సులలో దృఢముగా నిశ్చయము చేసికొని యుండిరిగాని చిరకాలము నుండి ఆచారము లేకపోవుటవలన జనులలోఁగల ద్వేషమును క్రొత్తగా వివాహము చేసికొన్నవారి విషయమై శంకరాచార్యులవారు బహిష్కార పత్రికలనుబంపి పెట్టినబాధను తలఁచుకొని తమ యభిప్రాయమును కొంద రాప్తులతోతప్ప నితరులతో నెవ్వరితోను జెప్పలేదు. వారికి సోమసుందరమునకు సీత నిచ్చి వివాహము చేయవలెనని యున్నది. సోమసుందరమును సీతయుఁగూడ పరస్పరానురాగము గలవారయి యొండొరులను వివాహ మాడవలయు నని కోరి యున్నారు. కాని యీవివాహ మగునో కాదో మాత్ర మిప్పుడు నిశ్చయముగా చెప్ప వలనుపడదు. ఇటువంటి విషయములలో సరిగా కార్య మయినవఱకును రూఢిగావివాహ మగునని యెవ్వరును నమ్మఁగూడదు. వివాహము లయినయెడల మీకందఱికిని తెలియకమానదు గనుక దీనిని జదువువా రందఱును కార్యము నిమిత్త మెదురు చూచు చుండవచ్చును.

తక్కిన విషయములలో నారాయణమూర్తియు సత్యవతియు మిక్కిలి సుఖు లయి యున్నారు. ఆదంపతులలోఁగల యనుకూల దాంపత్యము మఱి యెక్కడను కనఁబడదు. అన్నవస్త్రాదులకును దానధర్మములకును లోపము లేకుండ కావలసినధనము దొరకుచున్నది; కొడుకును కూఁతురును చక్కఁగా పెరుగుచు కన్నుల పండువు చేయుచున్నారు. లోకములో సుఖమున కంతకంటె నధిక మేమి కావలెను ?

---

# పదునేనవ ప్రకరణము



ఓకాంతామతల్లులారా! సత్యవతియొక్కయు ఆమె భర్త యొక్కయు కుటుంబముయొక్కయు స్థితిగతులను నేటివఱకును నాకు తెలిసినంతవఱకును మీకు తెలిపియున్నాను. కొంతకాలముక్రిందట ఇంట నెవ్వరితోను జెప్పక కాశికాపురమునకు లేచిపోయిన లక్ష్మీనారాయణప్పగారిప్పుడే యాత్రచేసికొని కాశికావడితో వచ్చి కొడుకులతోను కోడండ్రతోను కాశికాపుర మరక్రోసెడు వెడల్పున క్రోసెడునర పొడుగున గంగానదియొక్క యుత్తరతీరమందున్నదనియు, ఇప్పుడున్న విశ్వేశ్వరుని యాలయమునకన్నను పురాతనమయి మహాత్త్వము కలిగియుండిన శివాలయమునుపడఁగొట్టించియారంగజేబను మహమ్మదీయుఁడు కట్టించిన మసీదును చూచితిననియు, గంగానది పొడుగునను శిలామయము లగుఘట్టములు కట్టఁబడుటయేకాక బ్రాహ్మణులు జపము చేసికొనుటకు నీటిపయిని కొయ్యలతో కట్టఁబడిన యున్నతాసనము లున్న వనియు, ఆపట్టణమును పంచక్రోశ మధ్యమున చుట్టు నున్నప్రదేశమును మిక్కిలి పవిత్ర మయిన వనియు, అక్కడ నాలుగైదు లక్షలజను లున్నా రనియు, చెప్పుచున్న వార్తావిశేషములు తప్ప మీకు చెప్పవలసిన సంగతు లేవియు నాకుఁ గనఁబడుచుండలేదు. దీనిలో ముందేమి విచిత్రకథ వచ్చునో యనునభిలాషచేత నైన మీలో పలువురు సావధానముగా దీనిని జదివి యుందురు. పురాణేతిహాసాదులయందువలె హృదయాహ్లాదకరము లయినవిషయములు మీకు దీనియందు కనఁబడి యుండవు. లోకచరిత్రములయందు కథలయందలి వినోద మెప్పుడును కలుగదు. కాని సత్యప్రియు లయినవారికి చరిత్రములయందలిసత్యమే సంతోష

జనకముగా నుండి సుఖసాధన మగును. సమర్థులయినవారు వ్రాయక
పోవుటచేత సత్యముసహితము కొన్నిసమయములయందు మనోహర
ముగా నుండక పోవచ్చును. చెప్పవలసినవానిని కొన్నిటిని చెప్పక
పోవుటచేతగాని చెప్పగూడనివానిని కొన్నిటిని చెప్పుటచేతగాని
చెప్పినవానిని వ్యాసమాధుర్యశైలిని వ్రాయలేకపోవుటచేతగాని యిది
మీకు మనోహరముగా కనఁబడక పోయినయెడల నాలోపమును
మన్నించెదరు. మీప్రకారమే శ్రీమతి సత్యవతియందుండవలసిన గౌర
వముచేతనైనను దీనిని మీరందరు పలుమారులు చదివి యామెవలె ప్రవ
ర్తించుటకు ప్రయత్నించెదరు. ఈచరిత్రమును చదువుటవలన మీలో
నొక్కరు సద్గుణవతి యైనను నాప్రయాసమునకెల్లను అదియే ప్రతిఫలమని
సంతోషించెదను. దీనియందు పురాణములయందలి చిత్రకథ లేవియు
లేకపోయినను నీతిబోధయందుమాత్ర మిది యేపురాణమునకును తీసి
పోవనిదై యుండునని నమ్మెదను. దీనిం జదివినవారికందఱికిని పెక్కువిషయ
ములు మనస్సున నాటియుండును కాని వానిలో స్పష్టముగాకనఁబడు
చున్న వేంకటేశ్వరులయొక్కయు సుందరమ్మయొక్కయు స్థితినిబట్టివిచా
రింపఁగా దంపతులిరువురును చదువెఱుఁగనిమూర్ఖులయి యున్నపక్ష
మున వారిలో నెప్పుడెప్పుడు నిష్కారణముగా కలహములు పొసఁగుట
చేత గృహస్థసుఖము కలుగకపోయినను పరస్పరము నొకరీతిగాఁగలసి
వారొకవిధముగా సుఖజీవనమే చేయుచుందురని తేలుచున్నది; నారా
యణమూర్తియొక్కయు సత్యవతియొక్కయు స్థితినిబట్టి విచారింపఁగా
దంపతులిద్దఱును చదివినవారయి యుక్తాయుక్తవివేకముగలవారయి
యున్నయెడల హితకారులైన బంధువులు మొదలయినవారివలన
నిర్హేతుకముగా మనస్తాపము కలిగించినప్పుడు తప్ప సాధారణముగ
గృహము భూతలస్వర్గమువలెనుండి వారికిసంపూర్ణసుఖముగలిగి వారి

మాత్రమేకాక లోకమునకుంగూడను మేలుకలుగునని స్పష్టమగుచున్నది. రామస్వామియొక్కయు మహాలక్ష్మియొక్కయు యుస్థితినిబట్టి విచారింపఁగా భర్త చదువుకొనఁగని మూఢుఁడయి భార్యవిద్యావతియు గుణవతియు నయి యున్నయెడల భర్త వలన పెక్కుకడగండ్లు సంభవించుచువచ్చినను మార్దవముగల స్త్రీస్వభావమునుబట్టి యుక్తసమయమున చేసిన హితోపదేశముచేత పురుషునకొకానొకప్పుడు బుద్ధివచ్చి సంసారము బాగుపడునని తెలియవచ్చుచున్నది; సుబ్రహ్మణ్యముయొక్కయు సూరమ్మయొక్కయు స్థితినిబట్టి విచారింపఁగా భర్తవిద్యాధికుఁడయిన యోగ్యుఁడుగానుండి భార్య చదువుకొనని గయ్యాళియగుట సంభవించినయెడల స్వప్నావస్థయందును సుఖముకలుగక గృహము మహారణ్యమువలెనుండి దంపతులకుమాత్రమేకాక యిరుగుపొరుగులవారికి సహిత మాయాసము కలుగుచుండునని తేటపడుచున్నది. కాఁబట్టి దీనిం జదివి తమబిడ్డలకు వివాహముచేయఁ దటస్థించువారు వారిభావిసుఖమును చక్కఁగా విచారించి ధనమే ప్రధానముగా చూడక విద్యయందును బుద్ధియందును వయసునందును ఎవరికిఁదగినవారిని వారికి వివాహముచేసి సాధ్యమయినంతవఱకనుకూలదాంపత్యము కలుగునట్లు చూతురని కోరుచు దీనిని ముగించుచున్నాను.

సంపూర్ణము.

---

## స్త్రీల కుపయోగించుకథలు

### ఐదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజసమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

### ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉ ప న్యా స ము లు

### ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హాకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్రకవులు
2 మధ్యకాలపు కవులు
3 అధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు కలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శారదా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# చంద్రమతీ చరిత్రము

స్త్రీల యుపయోగ నిమిత్తము.



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

తొమ్మిదవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-12-0

[illegible] రావుబహద్దూరు
కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 షట్కవిలాసము
9 జాన్‌గిల్పిన్
10 నీతిదీపిక

# చంద్రమతీచరిత్రము

గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము
1950

కాపీరైటు

# చంద్రమతీచరిత్రము.

## మొదటి ప్రకరణము

చేది దేశమునకు పూర్వకాలమునందు ప్రతిష్ఠాన మనుపట్టణము రాజధానిగా నుండెను. దానిని ఉశీనరుఁ డనురాజు పాలించుచుండెను. అతనికి సునంద యనుభార్యయందు చిరకాలమున కొక్క కుమార్తె పుట్టెను. ఆశిశువునకు వారు చంద్రమతి యని నామకరణము చేసిరి. లేక లేక కలిగిన సంతాన మగుటచేతను, లోకైకసుందరి యగుటచేతను, తల్లిదండ్రు లాముద్దులకూఁతును నెత్తిమీఁది కాలు నేల మోపనీయక యెంతో గారాబముతోఁ బెంచుచుండిరి. ఇట్లు దినదినప్రవర్ధమానమయి, ఆచిన్నది మెల్లమెల్లఁగా తప్పటడుగులు పెట్టుచు తమముందట నడయాడుచుండుటను కన్నులపండువుగాఁ జూచి జననీజనకులు పరమానందభరితు లగుచుండిరి; ఆబాలిక తడఁబడుచు పలికెడు వచ్చియురాని మాటలే తల్లిదండ్రుల చెవులకు శ్రావ్యమయిన సంగీతనాదమునకన్నను మధురముగా వినఁబడుచుండెను. ఆచిన్నదానిని జూచిన కన్నులతో రంభను మించిన సుందరులఁ జూచినను, ఆబాలికసౌందర్యము ముందఱ వారి దొక్క చక్కఁదన మని చెప్పుట కెట్టివారికిని మన సొప్పదు. సునంద తాను విద్యావంతురాలు గనుక, విద్యవలని ప్రయోజనముల నెఱిఁగిన దయి కొమార్తెకు కొంచెము గ్రహణశక్తి కలిగినది మొదలుకొని చిన్న చిన్న నీతిపద్యముల నేర్ప మొదలు పెట్టెను; ఇఁక గుణము లన్ననో ఉగ్గుపాలతోనే నూరిపోయనారంభించెను. అందుచేతఁ జంద్రమతి

ఆఱుసంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికే సాధారణముగా తన యీడుబాలికలకంటె వివేకవతియు గుణవతియు ఆయెను; మృదుత్వముతప్పినమాట నెప్పుడును పెదవిదాఁటి రానీయదు; తల్లిదండ్రులు ప్రేమతో నిచ్చినదానినే పుచ్చుకొని సంతోషించును గాని, లేనివస్తువులు కావలెనని యెప్పుడును పోరుపెట్టదు; తనతోడ నాడుబాలికల నెప్పుడు పల్లెత్తుమాట యనక, తాఁ దెచ్చుకొన్న ఫలములు మొదలగునవి వారికి పెట్టక ముందు తాను భుజింపక ఒక్క తల్లికడుపునఁ బుట్టిన బిడ్డలవలె వారిని జూచుచుండును. ఎప్పు డయిన తప్పిదారి తా నొక తప్పిదమును జేసినపక్షమున, మాఱుమాటాడక యొప్పుకొని క్షమార్పణను జేయునే కాని తనతప్పును మఱుఁగుపఱచుటకయి లేనిపోనివి కల్పించి బొంకుట కెన్నఁడును బ్రయత్నింపదు.

ఉశీనరమహారాజొకనాఁడు విద్వాంసు లనేకులు చుట్టును జేరి యుండఁగా సభలోఁ గూరుచుండి విద్యావ్యాసంగము చేయుచున్న సమయమందు, పండితమండలాగ్రగణ్యుఁడైన విద్యాసముద్రుఁడను శాస్త్రజ్ఞుఁడు రాజానుమతంబున విద్యావిషయమై యీక్రిందరీతి నొకయుపన్యాసము చేసెను—

"లోకములో స్థూలదేహమును పెంచుట కాహార మేప్రకారముగా నావశ్యకమో, ఆప్రకారముగానే జ్ఞానదేహమును వృద్ధిపఱచుటకు విద్య యను నాహార మత్యావశ్యకము. విద్యవలన వినయవివేకాదులు కలుగును; అందువలన సమస్తసద్గుణములును పట్టుపడును. సాధారణముగా చదువుకొన్నవారు తమవిద్యకుఁ దగినబుద్ధియు సత్ప్రవర్తనయు గలవారై [illegible]కవిధమున గౌరవముతో జీవనము చేయుచుండుటయు, చదువుకోనివారు బుద్ధిబల మంతగా లేక మంచిచెడవసిక తెలియక కట్టెలుకొట్టి యమ్ముకొనుట మొదలగున

పనులయందు నీచముగా జీవనము చేయుచుండుటయు, సమస్తదేశ ములందును మనము చూచుచున్నాము. దొంగతనము, హత్య, మొదలగు గొప్పనేరములు చేయువారు తఱచుగా చదువ వ్రాయనేరని హీనజాతులవారె యగుటయు ననుభవముచేత నెల్లవారికి దెలిసియే యున్నది. సభలకెక్కి యుద్యోగములు చేయఁబోరు గనుక, స్త్రీలకు విద్య యనావశ్యక మనియు, అనర్థదాయక మనియు, కొంద అందురు గాని యది వివేకులు మెచ్చఁదగిన మాటకాదు. విద్యను జ్ఞానాభి వృద్ధికొఱకభ్యసింపవలసినదే కాని యుద్యోగములు చేయుట నిమి త్తము కాదు. ఫలమునిమిత్తము నాటిన పనసాదివృక్షములు నీడ నిచ్చుట మొదలగు తక్కిన పనుల కుపయోగించులాగుననే, తెలివి కొఱకేర్పడినచదువు సహిత మితరకార్యములకుకూడ నుపయోగ పడవచ్చును. పశువునకంటె మనుష్యుఁ డధికుఁడగుటకు జ్ఞానాధిక్య మే కారణ మగుటచేతను, జ్ఞానాభివృద్ధికి విద్యయే సాధన మగుట చేతను, మనపూర్వులు విద్యావిహీనుని ద్విపాదపశువుగా గణించుట యక్రమముకాదు. మానుషధర్మమును విడిచి పశుప్రాయులుగా నుండఁ గోరిక గలవారుతప్ప మఱియెవ్వరును జ్ఞానైక సాధన మయిన విద్య యనావశ్యకమని తలఁచువా రుండరు. పయికి వేఱుగా కనఁబడి నను భార్యాది భర్త్రాది యొకదేహమే యని యెల్లదేశములవారును జెప్పుచున్నారు. అట్లయినచో, భర్త విద్యగలిగి వెలయవలె ననియు భార్య యవిద్యగలిగి మెలఁగవలెననియుఁ బలుకుట,అర్ధశరీరము మను ష్యుఁడుగాను తక్కిన యర్థశరీరమును మృగముగాను ఉండవలయు ననుటయే. బుద్ధిమంతుఁ డెవ్వఁడుగాని విద్యాగంధమేనిలేని పశు తుల్యునితో నిమిషకాల మయినను సహవాసము చేయనొల్లఁడు; అట్టి సంగతిలో స్త్రీలను జదివింపక పశువులతో సహవాసము చేయునట్లు

సదా యవిద్యావతులతోడనే సహవాసము చేయవలయు నని యుప
దేశించువారు తెంపరికి బుద్ధిమంతు లగుదురో నేను జెప్పనక్కఱ
యుండదు. విద్యలేనివారికిని విద్యగలవారికిని తఱుచుగా చీఁకటికిని
వెలుతురునకును నున్నంత భేదము గలదు. ఏకమత్యము గలిగి యిరు
వురకును సుఖావహముగ నుండునట్లుగా సంసారభారము నీడ్చుకొని రావ
లసిన భార్యాభర్తలలో విద్యావ్యాసంగము వలన నొకరిత్రోవ యొక
రిది గాక యొక రొకరికిని మతిభేదములు కలిగిన దీయువారై రేని,
లోకవృత్తమున వారెట్లు చిన్నగా బ్రవర్తింపఁ గలుగుదురు? స్త్రీ
పురుషులు కొన్ని విషయములయందు భేదపడి యున్నను, జ్ఞానము,
బుద్ధి, మొదలగునవి యిద్దఱకును సామాన్యము లయియే యున్నవి.
కాఁబట్టి జ్ఞానాభివృద్ధికి హేతుభూత మయిన విద్య పురుషుల కెట్లో
స్త్రీలకు నట్లే పరమప్రయోజనకరముగా నుండుననుటకుసందేహము
లేదు. జ్ఞాననేత్రమునకుఁ దోడుపాటుగానుండు విద్యవలనఁ బురుషు
లకు మేలును స్త్రీలకుఁ గీడును గలుగునని వాదించుట, బాహ్యనేత్ర
మునకుఁ దోడుపాటుగానున్న వెలుతురు పురుషులకు ప్రయోజనకర
మును స్త్రీల కనర్థప్రదమును నని వాదించుట వంటిదేగాని వేఱు
గాదు. సస్యములకుఁ బెట్టిన జలము కలుపునకుసహిత ముపయోగ
పడునట్లు, సన్మార్గప్రవర్తనమున కయి వినియోగపడవలసిన విద్యయు
నొకానొకప్పుడు స్త్రీపురుషుల దుర్మార్గప్రవర్తనమునకు సహితము
తోడుపడ వచ్చును. కలుపు పెరుగు నని నీరు పెట్టక పయిరు నెండ
గట్టి చంపుట పాలముకాపుల కెట్లు ధర్మముకాదో, అదేప్రకారము
గా నెప్పుడో దుష్కార్యముల కుపయోగపడినఁ బడవచ్చునని జ్ఞానమూల
మయిన విద్యను తమబిడ్డలకు నేర్పకమానుటయుఁ దల్లిదండ్రులకు
ధర్మము కానేరదు. కలుపును మిగులఁ బెరుఁగనిచ్చిన పైరునకే భం

ముపచ్చి ఫలము లభింపనేర దని యెఱింగి పొలముకాపు యుక్తకాల ములోఁ గలుపుతీయుచు సస్యములను గాపాడవలయునట్లే, జననీజన కులును దాము చెప్పించువిద్య చేతఁ బనుల కుపయోగ పడకుండునట్లు శిక్షించుచు బిడ్డలను మెలఁకువ గలిగి సంరక్షించుచుఁ దుష్ఫల మనుభ వింపఁ బ్రయత్నింపవలయును. లేఁతలో వంచనిచెట్టు ముదిరినతరు వాత వంగ దనుసామెత జ్ఞప్తియందుంచుకొని, ఒకనిమనసును దుర్గు ణములనుండి మళ్ళించి సన్మార్గమునకుఁ ద్రిప్పుటకును బాల్యదశయే యుత్తమ మయిన దని యెఱింగి యట్లు చేయ యత్నింపవలయును. చిన్నతనములోఁ బట్టుపడినదుర్గుణమునుగాని సుగుణమునుగాని, పెద్ద పెరిఁగిన తరువాత మార్చుకొనుట దుర్ఘటము. కాఁబట్టి బాలురను గాని బాలికలనుగాని పసితనమునందే యుక్తప్రవర్తనము గలవారిని గా దిద్దుటకు శక్తివంచన లేక పాటుపడుట తల్లిదండ్రులకు విధిగా నున్నది. అందులోను బాలురకన్న బాలికలవిషయములో నెక్కువ శ్రద్ధపుచ్చుకోవలెను. మగబిడ్డ లెప్పుడును తల్లిదండ్రులయింటనే యుండఁదగినవారు. ఆఁడుబిడ్డ లన్ననో యెప్పుడయిన వేఱొకరియిల్లు చేరవలసినవారేగాని యెల్లకాలము పుట్టినింటనే యుండఁదగినవారు కారు. కాఁబట్టి పెంచువారికి కష్టములు రాకుండుట కయి వారి నత్త వారి యిండ్లకుబంపు కాలము రాకముందే పుత్రికల నుత్తమగుణములు గలవారినిగాను తెలివిగలవారినిగాను జేసి మఱి పంపవలయును. ముందుగా సుగుణములను బోధించి జ్ఞానవంతురాండ్రనుగాఁ జేయక సంసారసాగరము నీదుట కయి తమపుత్రికలను పురుషుల గృహములకు బంపు తల్లిదండ్రులు, ఈఁతనేరనివారిని సముద్రమునం ద్రోచి వారు కొట్టుకొనుచుండఁగాఁ గన్నులు పెట్టుకొని చూచుచు వెనుక పశ్చా త్తప్తు లయ్యును నేమియు జేయనేరక నింద పొందువారివలెనె తామును బిమ్మట నపకీర్తిపాలయి పశ్చాత్తాపపడవలసినవారగుదురు",

## రెండవ ప్రకరణము

విద్యాసముద్రుఁడు పై యుపన్యాసమును జేయనారంభించిన కొంతసేపటికి, చంద్రమతి యచ్చటికి వచ్చి తండ్రితొడమీఁద గూరుచుండి యుపన్యాసము సాంత మగువఱకును చెవియొగ్గి తదేకధ్యానముతో వినుచుండెను. అది యంతయు గనిపెట్టి యుపన్యాసము ముగియఁగానే రాజు కొమార్తెను ముద్దుపెట్టుకొని శరీరముమీఁదఁ జేయి వైచి నిమురుచు "అమ్మాయీ! నీవేమో తెలిసినదానివలెనేయింత సేపును మఱువంకచూడక వారు చెప్పెడిదానినంతను మహాశ్రద్ధతో వినుచుంటివి. అందులో నీకేమయినఁ దెలిసినదా?" అని యడిగెను.

చంద్ర—నేను విన్నదానివల్ల బాలికలకుఁగూడ విద్యనేర్పించుట యుపయోగకర మని వా రుపదేశించినట్లు నాకర్థమైనది. వారి ప్రసంగము యొక్క ముఖ్యతాత్పర్య మంతేకాదా ?

ఉశీ—అవును; వారిప్పుడు ముచ్చటించినది దానివిషయమే. నీవు రెప్పవేయక కడవఱకును జాగ్రత్తతో వినుచుండుట చూచినప్పుడే, నీవు దానియర్థమును గ్రహించి చదువుకొనవలెనని యభిలాష పడుచుంటివని నామనస్సునకుఁ దోఁచి యెంతో సంతోషమయినది. నీవు చదు వెప్పుడు మొదలుపెట్టి మీతల్లికిని నాకును ప్రమోదము గలిగింతువో !

చంద్ర—వారిప్రసంగము విన్నమీఁదట మీరు న న్నెప్పుడు చదువవేసెద రని యడుగ బుద్ధిపుట్టఁగా, ఆప్రశ్న నానాలుకచివరకు వచ్చినది. ఇంతలో మీరే ముందుగా నన్ను పలుకరించి నామనసులోనున్నదానినె యడిగితిరి. మీరు నన్నెంత వేగిరము చదువవేసెదరో యంతసంతోషముతో చదువుకొనుటకు నేను సిద్ధముగా నున్న

దానను. మాయమ్మగారీవఱకే నా కక్షరములను వర్ణక్రమమును గొంతవఱకు నేర్పియున్నారు.

అని చంద్రమతి యిచ్చిన ప్రత్యుత్తరమునకు రా జపరిమితానందము నొంది, వెంటనే విద్యాసముద్రునకు దన కొమార్తెను జూపి మీ శిష్యురాలిని దీని నెల్లు విద్యాబుద్ధులు నేర్పి మంచిమార్గమునకు దిద్దెదరో మీదే భార మనిచెప్పి యప్పగించి, రాజాయనను ధనవస్త్రవాహనాదులచే సత్కరించి పంపెను. విద్యాసముద్రుఁడును మంచి ముహూర్తమొకటి విచారించి యాదినమునఁ జంద్రమతికి విద్యగఱపుట కారంభించి, రెండు సంవత్సరములలోపలనే వ్రాఁతపుస్తకము చూచి చక్కఁగాఁజదువుటకును, చెప్పినదానిని తప్పులులేకుండవ్రాయుటకును, ఇతరులసాయ మక్కరలేకుండ సులభ మయినపద్యము లర్థము చేసికొనుటకును, సాధారణశైలిని జాబులు వ్రాయుటకును, శక్తురాలిని జేసెను. బొత్తిగా పిల్లల నాటపాటలకుఁ బోనీయక నిర్బంధపెట్టి చదివించినచోఁ జదివినచదువు మనసునఁ బట్టక యందువలనలాభము కలుగనేరదనియు, ప్రతిదినమును కొంతసే పాటలాడుట కూడ దేహారోగ్యమునకావశ్యకమనియు తెలిసినవాఁడు గనుక, అతఁడాచిన్నదాని కెప్పుడును శ్రమయని తోఁచకుండునట్లుగా మంచి మాటలతో ప్రోత్సాహపఱచి యుపాయముగా చదివించుచు కొంత సే పాటలాడ సెలవిచ్చి యాయాటలతోఁగూడ నేదో యుపయుక్తమైన యొక క్రొత్తవిషయమును నేర్పుచుండును; పిల్లలకు బొమ్మలను జూచుటయం దెంతయు నిష్ట ముండునని యెఱిఁగి, అప్పుడప్పు డా చిన్న దానిని తీసికొని పోయి గోడలకుఁదగిలించియున్న చిత్రపటములను రాతిస్తంభములు మొదలగు వానిమీఁద మలఁచఁబడియున్న విగ్రహములను జూపివానివిషయ మయిన వినోదకరములగు కథలమూలమున

గొన్నినీతులను బోధించుచుండును. ఆచిన్నది గ్రహింపనేరని విషయ మెన్నండును అతండామెకు చెప్పలేదు; చెప్పినదానియర్థము తెలియ కుండ గుడ్డిపాఠముగా శ్లోకపద్యమును గాని పాటనుగాని యామెచేం జదివింపలేదు; చదివించిన వ్యాకరణాదిలక్షణములతోంగూడ భాషాభి వృద్ధికై లక్ష్యములను సహితము నేర్పి చదివినదంతయుం బ్రయోజన కరమగునట్లు చేసెను. బుద్ధివికాసమును విభాగజ్ఞానమును గలుగునని సాధారణముగా గృహకృత్యములను నిర్వహించుటకుం గావలసియున్న దానికంటెం గొంచె మధికముగానే గణితశాస్త్రమునందు జ్ఞానము గలిగించెను. ముందు సంసారభారము మీందపడి పెక్కుకష్టములు వచ్చి చుట్టుకొని దేహయాత్రి దుస్సహముగాం దోంచునప్పుడు మన సున కుల్లాసమును విశ్రాంతియుం గలుగుటకయి గానవిద్యాభ్యాసము చేయించి భక్తిరసమొలికెడు గీతములను పాటలను బహురాగములతో గర్ణరసాయనముగా పాడుటకు నేర్పెను. లోకములో బాలురుగాని బాలికలుగాని తాము నేర్చుకొన్నదానిని నితరులకు బోధింప వేడుక గల స్వభావము గలవారుగా నుందురుగనుక, చంద్రమతియుం దాను గురువు ననుకొని తోడిబాలికలను గాని వారులేనప్పుడు చందనపు బొమ్మలు మొదలయిన వానిని గాని శిష్యులనుగాను శిష్యురాండ్రను గాను నేర్పుచు కొని తాను గురువువద్దం జదివినదెల్ల వానికిబోధించి యాడుకొనుచు మఱింతజ్ఞానాభివృద్ధిచేసెను. పెద్దలును తెలిసినవారును యేప్రకారముగాం బ్రవర్తింతురో, చిన్నలును తెలియనివారునుఆప్రకా రముగానే నడుచుచుందురుట లోకస్వభావము గనుక,ఇంట జననీజనకుల యొక్కయు బయట విద్యాగురునియొక్కయు సత్ప్రవర్తనమునుబట్టి చంద్రమతికిం బట్టుపడిన సుగుణసంపద యింతంతయని చెప్పవల్లకాదు. నోటితోం జెప్పెడుపాడిమాటలకన్నం జేతులతోం జేసిచూపెడు కార్య

ములే మిగులబలమైనవిగాను మనసునకుఁ జక్కఁగా నాటునవిగాను ఉండుట సహజము గనుక, గురువు బోధించిన యుపదేశములకన్నను ఆయన సాధువర్తన మామెను విశేషనీతిమంతురాలిని జేసెను.

ఆయన యిహలోకానుకూలములైన సంగతులను చంద్రమతికి విస్తారముగా బోధించుచు వచ్చినను, పరలోకసాధన మగు భగవద్విషయకజ్ఞానమును బొత్తిగాఁ గలిగింపక యుపేక్షచేసి యూరకుండలేదు. ఒకనాఁడు చంద్రమతి యొకచిత్రపటమును జేతఁబట్టుకొని కూరుచుండి గురువు వచ్చినప్పటికి, వాని సొగసునకుఁ దలయూఁచి యద్భుతపడి చూచుచుండెను.

గురు—అమ్మాయీ! నేనువచ్చుటసహితము కనిపెట్టక నీవా పటమువంక నెంతో శ్రద్ధతోఁ జూచుచున్నావు. అందు నీమనస్సు నాకర్షించునంత విచిత్ర మేమున్నది?

చంద్ర—ఈపటములోని సరస్వతీవిగ్రహము చూచుటకు ముచ్చటగానే యున్నదిగాని, ఆమెచేతిలోని తామరపుష్పమును జూచినమీఁదట నామనసు మఱియొకచోటికిఁబోవక యెంతసేపుచూచినను తనివితీరకున్నది.

గురు—నీ వీవఱకెప్పుడును జూచియెఱుఁగని యాదివ్యసుందర విగ్రహమునకంటె నిత్యమును నీచేతులలో నలుగుచుండు తామర పూవు నీకింతవింతగాఁ గనఁబడుటకుఁ గారణమేమి?

చంద్ర—ఇది పలకమీఁద వ్రాయఁబడిన దయినను, నిజమయిన తామరపూవును మఱపించుచున్నది. ఇదిగో నాకాడకొనుటకై యింతకుముందు కొలనిలోనుండి దాసి కోసి తెచ్చియిచ్చిన యీతామరపూవువలెనే, అచ్చముగా దీని రేకులును మిద్దెయును కేసరములును గనఁబడుచున్నవి. ఇంత చమత్కారముగా వ్రాసిన చిత్రకారుని నేర్పును నే నెట్లు మెచ్చుకొనకుందును?

గురు—దీనియందు నీకింతమక్కువపుట్టుటకిది నిజమైనతామర పుష్పమువలె నుండుటయే కారణమని నీవిప్పుడు జెప్పుచున్నావుగదా. ఒకవస్తువును సరిగాపోలియున్న దను హేతువుచేతనే యిదియింతగా మెచ్చుకోఁదగియున్నప్పుడు, మొదటివస్తువునుజూచి మెచ్చుకోకుండు టయు దానిని జేసినదవ్యచిత్రకారునిశక్తి కద్భుతపడకుండుటయు నెంతయు వింతగానున్నది.

చంద్ర—నేనిప్పుడు కొప్పులోముడుచుకొన్న యీ తామర పువ్వుకూడ నొకరిచేతఁ జేయఁబడినదా?

గురు—ఈపటములోని పుష్ప మెవరిచేతనైన వేయఁబడి నదా? లేక తనంతనే కలిగినదా?

చంద్ర—దీనిని వేసినవారెవ్వరో నే నెఱుఁగకపోయినను, ఇది యొకరిచేత వ్రాయఁబడినదని మాత్రము నాకు దెలియును; ఎవ్వ రును వ్రాసియుండనియెడల, ఈపుష్ప మీపటముమీఁద లేకపోయియే యుండును.

గురు—నీవిచ్చిన ప్రత్యుత్తరము మిక్కిలి చక్కఁగానున్నది. ఒకరుచేసినంగాని యొకవస్తువుండదని నీకుఁ దెలిసినట్లు నీమాటలవల్ల స్పష్టమగుచున్నది. ఆహేతువుచేతనే యీకమలము నొకరు చేసి యుండనియెడల; ఇదియు లేకపోయియే యుండును.

చంద్ర—అట్లయినచో దీనిని జేసినవా రెవ్వరో నాకుఁ జూపెదరా?

గురు—ఆమహానుభావుఁడు మనకన్నులకగపడువాఁడు కాఁడు. అట్లు కనఁబడకపోయినను, ఆయన యిప్పుడిక్కడనుండి మనమాడు కొనుచున్న మాటలను వినుచునేయున్నాఁడు. ఆయనలేనిస్థల మెక్క డను లేదు. ఆయనచేసిన వస్తువులన్నియు సర్వోత్తమములుగానున్నవి;

ఆతఁడే సర్వేశ్వరుఁడు. మనము చేసినవస్తువు లెంతమంచివిగానున్నను ఆయన చేసినవస్తువులను కోటితమాంశ మయినను బోలఁజాలవు. ఈపటముమీఁద వ్రాయఁబడిన యీపద్మ మెంతమనోహరముగా నున్నను ఈశ్వరనిర్మితమయిన యీపద్మముతో నెంతమాత్రము సమానము కానేరదు. వర్ణమునను రూపమునను గొంతవఱకు సరిపోలినను బోలవచ్చునుగాని, దానియందుఁగల చలువయు, మార్దవమును పరిమళమును, మకరందమును, దీనికెక్కడనుండివచ్చును? దీనిని మనమారక చూచి సంతోషింపవలయునే కాని, దానివలె నిది కొప్పులో ధరించుకొనుటకుఁగాని యౌషధముక్రింద నుపయోగించుకొనుటకుఁగాని యెట్లు పనికివచ్చును? ఈప్రకారముగా మనకు మహోపయుక్తము లగునట్లు సమస్తపదార్థములను సృజించినసర్వేశ్వరుని విచిత్రసృష్టి కద్భుతపడుచు మన మాతనియెడల భక్తియును కృతజ్ఞతయును గలవారమయి యుండవలెను.

చంద్ర—మీరు సెలవిచ్చిన సర్వేశ్వరుఁ డను దివ్యచిత్రకారుఁడు చేసిన పదార్థములు మఱియేమున్నవి?

గురు—ఆయన చేయనిపదార్థ మొకటియు లేదు. నీవు భూమిమీఁదఁ జూచినను, ఆకాశమువంకఁ జూచినను, మఱియెక్కడఁజూచినను, ఆయనచేసిన యనంతములయిన సుందరపదార్థములు కన్నులపండువు చేయుచుండును. మన కగపడుసర్వమును సృజించినవాఁ డతఁడే.

చంద్ర—మీరు చెప్పినది చూడఁగా మన కగపడెడి యీవృక్షజాలమును, నదీపర్వతాదులను, సూర్యచంద్రాదులనుకూడ ఆయనే సృజించినట్లు కనఁబడుచున్నది.

గురు—ఒక్కసూర్యచంద్రాది జడపదార్థములను మాత్రమే కాక పశుపక్ష్యాది సమస్తజీవరాసులను, నిన్నును, నన్నును, సమస్త

మానవకోటిని సృజించి కాపాడుచున్నవాఁడామహాపురుషుఁడే. చరాచరము లయినసర్వపదార్థములు నాతనిచే సృజింపఁబడినవే. ఇవిగాక మనకన్నుల కగపడనివస్తువులు సహిత మసంఖ్యాకములుగా నతనిచేతఁ జేయఁబడియున్నవి.

చంద్ర—అంతటి యద్భుతశక్తియుక్తుఁడైనసర్వేశ్వరునిమహాత్త్వాదులను సంపూర్ణముగా విన వేడుకయగుచున్నది. నాకు వివరించి చెప్పఁడు.

గురు—ఆయన దివ్యగుణములలో సహస్రాంశమయినను నేను వర్ణించుటకుశక్తుఁడనుగాను. ఇప్పటికింతఁయు చాలును. నీకు జ్ఞానాభివృద్ధికలిగినకొలఁదిని, ఆయనగుణములను దెలిసికొని నీవే యానందింపఁగలవు.

---

## మూడవ ప్రకరణము

---

మఱియొకనాఁడు చంద్రమతి గురువువద్ద చదువుకొనుచున్న సమయములో, అక్కడకొకయింద్రజాలవిద్య తెలిసినవాఁడువచ్చిసంచిని తెఱచి కూరుచుండి తనవిద్యను జూడవలయునని కోరెను. వానిని జూచి చదువుకొనుచున్న బాలికలందఱును చదువుమీఁద దృష్టివిడచి వానివంకనే చూడసాగిరి. విద్యాసముద్రుఁడు వారియభిప్రాయము గ్రహించి మఱియొకపనిమీఁద ధ్యానముపాఱినపుడు చదివించుట వలనఁ బ్రయోజనము లేదని యెఱిఁగినవాఁడుగనుక, వెంటనే చదువు కట్టిపెట్టించి పిల్లల నందఱిని దనముందుఁ జేర్చుకొని, ఆయైంద్రజాలకుని గొన్నివినోదములను గనఁబరుపుమనియడిగి, వాఁడు తాను నేర్చిన

విద్యలలోఁ గొన్నిటిని జూపినతరువాత వానికి తగినబహుమానము చేసి, వానినిసంతోషపెట్టి పంపివేసెను. అప్పు డాబాలికలందఱును వాఁడుచేసిన యద్భుతముల నొండొరులతోఁ జెప్పుకొనుచు నాశ్చర్య పడఁజొచ్చిరి. వారిలోఁ జంద్రమతి మామిడిటెంక నందఱును చూచు చుండఁగా భూమిలోపాతి నిమిషములో మొక్క మొలిపించి కాయలు కాపించుటయు, ఒక్క కాసును సంచిలో వేసి పెక్కు కాసులను జేసి చూపుటయు, వాఁడు చూపిన విచిత్రములలో నెల్ల మెచ్చుకోఁదగి యున్నవని గురునితోఁ బ్రశంసించెను. అతఁ డది సందుచేసికొని దాని మూలమునఁ జంద్రమతికిఁ గొన్నియుపయుక్తవిషయముల నేర్పఁదలఁచి, ఈప్రకారముగా బ్రసంగమునకుఁ దిగెను.

గురు——నేను వెనుక నీతోఁజెప్పిన సృష్టికర్తకొక్కనికేతక్క మఱియెవ్వనికినిక్రొత్తగా నొకదానినిసృష్టించుశక్తియుండదు. ఇప్పుడు వచ్చిన యైంద్రజాలికుఁడు చేసినదంతయు మోసమేగాని మఱియొకటి కాదు. పొడుగయిన నాలుగుకాళ్ళుగల వెదురుపేళ్ళబుట్టను బయిని బెట్టి బట్టకప్పి చాయిన దానిలోపల చేయనీయక, ఆబుట్టనుతీసివేసి బహిరంగముగా మామిడిటెంకను పాతిపెట్టి చెట్లుచేయుమన్నచో వాఁడు చేయనేలేకపోవును. వాఁ డావటకే చిగుళ్ళతోను, పూవుల తోను, కాయలతోను, ఉన్న వేఱువేఱుకొమ్మలను రహస్యముగాఁ దెచ్చి జాగ్రత్తచేసికొని పదిలముగా బుట్టలో దాఁచియున్నవాఁడు గావున, నడుమనడుమ గుడ్డతెరనువేయుచువచ్చి మనము చూచుచుం డఁగా భూమిలోనాఁటిన టెంకనుదీసివేసి బుట్టలో దాచుకొన్నవాని లోఁ బ్రథమమున చిగురుకొమ్మను, తరువాత పూలకొమ్మను, అటు పిమ్మట కాయలకొమ్మను, క్రమముగా నడుగుతట్టున నున్న రంధ్ర ముగుండ బుట్టలోనుండి తీసి భూమిలో పాతిపెట్టి తెరతీసి చూపుచు

వచ్చెను. కోళ్ళచుట్టును గలగుడ్డ తెరను మూసి వాఁడు మధ్యమధ్య లోపల చేయిపెట్టి చేయుచువచ్చిన పనియంతయు నిదియే. వాఁడు కాసులుచేసి చూపుటయు యిటువంటి మోసపుకృత్యమే. వాఁడు హస్తలాఘవముచేత మన కగపడకుండఁ గొన్నికాసుల చేతిలో దాచుకొని వానిలో నొకదానినిమాత్రమే మొదట మనకుఁ గనఁ బఱచితక్కినవన్నియు అవెుుక్కదానితో నేతానుచేసినట్టుకనఁబడ మన లనుభ్రమింపఁజేసినాఁడు. వాఁడెక్కడఁజూపినను, తనయొద్దనున్న పది కాసులనే చూపఁగలఁడు గాని యంతకంటె నెక్కువగాఁ గనఁబఱుపఁ జాలఁడు. వానికే కాసులను జేయుశక్తి యుండెనేని, ఈవిధముగా వాఁడింటింటికిం బోయి యాచించి జీవింపవలసినయక్కఱలేకుండ, తన యింటికిబంగారుగోడలు పెట్టుకొని మనవంటివారికిఁగూడ వలసినంత ధనమియ్య సమర్థుఁడయి యుండును. పట్టపగలు మనయందఱ కన్నులను గప్పి భ్రమింపఁజేసిన వానినేర్పునకు మెచ్చుకొనవలసినదే గాని, మనము నిత్యమును జూచెడి యీశ్వరుని పరమాద్భుత మహిమలముందఱ నివి పర్వతములో పరమాణువులో నైనను బోల్పఁదగి యుండవు. మనకుఁ గన్నులుండియుఁ బరమేశ్వరుని విచిత్రములను జూచి యానందింపఁజాలకున్నాము. తుచ్ఛములైన యిట్టిమోసపు పనులను జూచి మెచ్చుకొనుచున్నామేగాని, యీశ్వరుఁడను నైంద్ర జాలికుఁడు చేయునిజమైన యద్భుతచర్యలకు వింతపడకున్నాము. మనమిప్పు డద్భుతము లని తలఁచిన వీని నేభగవంతుఁడు ప్రతిదినమును నీచేతను, నాచేతను, ప్రపంచమునందఱచేతను చేయించుచున్నాఁడు. నాలుగునెలలక్రిందట నీగదిముందఱ నీచేతులతో పాతిన నీరుగోరింటచె ట్టిప్పుడే నిత్యమును పూలుపూచి కాయలు కాచుచుండలేదా ? భగ వంతుఁ డీయింద్రజాలమును నీచేతను చేయించియున్నాఁడే. దీని

కేలయద్భుత పడకున్నావు? మంటిలోఁబెట్టిన పెసరగింజంత నల్లని విత్తువలన, పచ్చని సుందరమైన యాకులును, మృదువైన కొమ్మలును చిత్రవర్ణములుగల పూలును, పెక్కుచెట్లుపుట్టుట కాధారమైన విత్తనములుగల కాయలును, గలుగుచుండుట వింతకాదా? ఇంతకంటె వింత మరేమున్నది? కొన్నిసంవత్సరములక్రిందట మాతోఁటలో నా చేతితో నేనేయొకమామిడిటెంకను నాఁటినాఁడను; ఇప్పుడది గొప్ప వృక్షమై ప్రతిసంవత్సరమును మితిలేని ఫలముల నిచ్చుచున్నది. సర్వేశ్వరుఁ డను నైంద్రజాలికుఁడు తానుముట్టుకొనైన ముట్టుకొనక నాచేతనే యీయద్భుతమును జేయించినందున కెంతని మెచ్చుకోవచ్చును? ప్రపంచములో నందఱును పొలములో కొన్నివడ్లగింజలను పాతి, కొన్నిమాసములలో కోటిగుణితముగా ఫలముల నొందుచున్నారు. మన కెక్కడఁజూచినను కన్నుల పండువుగా కనఁబడు వృక్షములు, సస్యములు మొదలైనవి యన్నియు, ఈప్రకారముగానే యత్యద్భుత జనకములుగా నున్నవి. ఇప్పుడు మనవద్ద సొమ్ముపుచ్చుకొని వెళ్ళిన యైంద్రజాలికునివలె ధనలాభ మపేక్షించి చేయక, భగవంతుఁ డను నైంద్రజాలికుఁడు తానుజేసిన వస్తువుల నన్నిటిని స్వేచ్ఛముగా నను భవింపుఁడని మనకిచ్చివేయుచున్నాఁడు. అట్టివానియెడ మన మెంత కృతజ్ఞతయు భక్తియుఁ గలిగియుండవలసినది!

చంద్ర—తమరు భగవంతుని దివ్యమహిమలను విప్పి చెప్పిన కొలఁదిని నామనసున కద్భుత మధికమయి సంతోషమును పట్టఁజాల కున్నాను. నేను ప్రతిదినమును నిద్రలేచినది మొదలుకొని పరుండఁ బోవువఱకును భగవంతునిసృష్టినే చూచుచున్నను గుడ్డివానివలె దానియందలి విచిత్రములను గనిపెట్టఁ జాలకున్నాను; మీవాక్సుధామృతపానమువలన, పరమేశ్వరుని దివ్యగుణాదులను దెలిసికొని

యానందింపవలె ననుకోరిక యంతకంతకు పెరుగుచున్నది. నాయందనుగ్రహించి, నాకోరిక సఫలముచేసి నన్ను ధన్యురాలిని జేయుడు.

గురు——ఆయన గుణములను పూర్ణముగాఁ దెలిసికొనుటకు మనుష్యమాత్రున కెవ్వనికిని శక్యముకాదు. మహానుభావులైనవారికిఁ గొందఱికిఁ గొంచెమధికముగాఁ దెలిసియుండును. నీవు నన్నుమిక్కిలి ప్రార్థించుచున్నావుగనుక, నాకు తెలిసినంతలో నీవు గ్రహింపఁగల రీతిని కొంతవఱకుఁ జెప్పెదను. ఆయనదివ్యగుణములలో మనము తెలిసికోఁగలస్వల్పభాగమువలననే మనకు గలిగెడియానంద మపరిమితమయి నదిగా నుండును. భూమినిమాత్రమే కాక సూర్యచంద్రాది గోళకోటుల నసంఖ్యములుగా నిర్మించిన మహాపురుషునకు శరీరమే యుండినయెడల, ఆరూపము బ్రహ్మాండమైనదిగా నుండి మన కగపడుచునే యుండవలెను. అట్లగపడుచుండలేదు గనుక, ఆతఁడు రూపము లేనివాఁడని యూహింపవలయును. అణువు మొదలుకొని బ్రహ్మాండమువఱకు నుండు సమస్తపదార్థములును, అనంతములగు సూర్యచంద్రాది గోళకోటులును పరస్పరసంబంధమును గలిగి యుండుటచేతను, ప్రతివస్తువు నేదో యొక ప్రయోజనము నుద్దేశించియే యాలోచనతోఁ జేయఁబడినట్లు కనఁబడుచుండుటచేతను, సమస్త సృష్టిని జేసినవాఁడొక్కఁడేయనియు నతఁడాత్మస్వరూపుఁడనియు స్పష్ట మగుచున్నది. రూపములేని వస్తు వెప్పుడును నశింపదు గనుక, అతఁడు నాశనరహితుఁడు; అందుచేతనే శాశ్వతముగా నుండువాఁడు. సృష్టియొక్కధర్మములు సృష్టికర్తకుఁ దెలియకపోవు గనుక ఆయన సర్వజ్ఞుఁడనియు, సర్వత్రయొకఁడుండి నడిపించుచున్నట్లే సృష్టియంతయుఁ గ్రమముగాఁ బ్రవర్తించుచున్నది గనుక అతఁడు సర్వవ్యాపి

యనియు, సృష్టినిజూడ ఆతని శక్తి కసాధ్యమయినది యన్నట్టు కనఁబడదు గనుక అతఁడు సర్వశక్తుఁ డనియు, సులభముగానే తెలిసికోవచ్చును. సృష్టిలోని యేవస్తువును జూచినను సృష్టికర్తయొక్క బుద్ధియును తెలివియు ప్రకాశించుచున్నందున, అతఁ డపరిమిత బుద్ధిమంతుఁ డనియు జ్ఞానస్వరూపుఁ డనియుఁ దెలియవచ్చుచున్నది. సృష్టిలో సమస్తజీవరాసులును స్వభావముచేత సౌఖ్యమునే యనుభవించుచుండుటచేతను, ఎన్నఁడైనను దుఃఖము వచ్చినయెడల అది మనలోపమువలననో యితరదోషమువలననో కలుగుచుండుటచేతను, దేవుఁడు జీవకారుణ్యము గలవాఁ డనియు దయాస్వరూపుఁ డనియుఁ దేటపడుచున్నది. స్వభావముచేత నొకజంతువునకు సుఖమును మఱియొకజంతువునకు దుఃఖమును కలుగుచుండుట లేదు గనుక, భగవంతుఁడు పక్షపాతము లేనివాఁ డనియు న్యాయస్వరూపుఁ డనియు విశదమగుచున్నది. లోకములో నెవ్వరైన దుష్కార్యములు చేయుటకు భయమో, శక్తిహీనతయో, భ్రమప్రమాదాదులో కారణములుగా నుండును. భగవంతునియం దట్టిలోపము లేవియు లేవుగనుక, అతని యందు హేయగుణము లేవియు నుండవు; అందుచేత నతఁడు పరిశుద్ధుఁ డనియు సమస్తకళ్యాణగుణ పరిపూర్ణుఁ డనియు కరతలామలకముగా తేటపడుచున్నది. మనయొక్క సమస్తావయవములును, వాని వ్యాపారములును, మనచుట్టునునుండు సమస్తవస్తువులును, మనసౌఖ్యముకొఱకే తోడుపడుచున్నవి. ఈశ్వరుఁడు మనకిట్టి మేళ్ళను గలుగఁజేయుటకు మనమీఁద నాతనికిఁ గల ప్రేమ తప్ప మఱియొకహేతువు గానరాదు. మనమీఁది నిర్హేతుకజాయమానకటాక్షముచేతనే మనకిట్టి మహోపకారమును జేయుచున్న పరమేశ్వరుని మనమెల్లప్పుడును నిర్మలహృదయములతో నారాధించుచుండ వలయును.

చంద్ర—సమస్తజీవరాసులును స్వభావముచేత సౌఖ్యముసే పొందుచున్నవని మీరిప్పుడు సెలవిచ్చి యున్నారు. స్వభావముచేతనే కొందఱు రోగపడి దుఃఖములను మాత్రము పొందుచుండలేదా?

గురు—రోగములు సహితము స్వభావికముగా వచ్చునవి కావు. మనము తినెడియాహారపదార్థములు మంచివి కాకపోవుటవలననో, మఱికికాల్వలు మొదలగువాని దుర్గంధమువలన గాలి చెడుటవలననో, ఇటువంటి మఱికొన్ని యితరకారణములవలననో, సాధారణముగా వ్యాధులు సంప్రాప్తము లగును. అవి యెప్పుడును స్వదోషముచేతనో యన్యుల దోషముచేతనో మనల నాశ్రయించును. ఈవిషయమయి ముందు ముందు నీకు కొంత వివరించి చెప్పెదను.

చంద్ర—తమ యనుగ్రహమువలన భగవంతుని దివ్యచరిత్రమును కొంతవఱకు తెలిసికొనఁగియు, నామనస్సున కింకను తృప్తి కలుగకున్నది. ఆయనయెడల మనము వర్తింపవలసిన క్రమముకూడ బోధించి నన్ను కృతార్థురాలినిఁ జేయుఁడు.

గురు—ఇప్పుడు నేను చెప్పిన వన్నియు మనసునఁ బట్టించుకొన్నచో, ఈదినమున కింతయే చాలును. మఱియొకసారి నీవడిగిన దానిని జెప్పఁ బ్రయత్నించెదను.

---

## నాల్గవ ప్రకరణము

తరువాత నొకనాఁడు చంద్రమతి పాఠశాల కాలస్యముగా వచ్చి, పుస్తకమును చేతఁబట్టుకొని చదువుటకుఁ జాల ఖిన్నురాలై క్రిందుచూచుచు కూరుచుండెను. అదిచూచి విద్యాసాగరుఁడు శిష్యురాలికి మనస్స్థిమితత లేనప్పుడు చదివించుట నిష్ప్రయోజనమని తలఁచి కొంచెము

వాఁడు గనుక చదువుమని నిర్బంధపఱుపక, ఆమెయొక్క విచారకార ణము దెలిసినవాఁ డయ్యును అది యామెచేతనే చెప్పించి సందర్భా నుకూలముగా నూతనవిషయములు కొన్ని బోధింపనెంచి యాప్రకా రముగా ప్రసంగమున కారంభించెను.

గురు—చంద్రమతీ! నీ వెల్లప్పుడును వేళతప్పక బడికివచ్చెడు దానవు, ఎంతపని యున్నను నీ వీవఱ కెన్నఁడును కాలము మించి వచ్చి యెఱుఁగవు; అట్టి నీ వీ దినమున నాలస్యముగా వచ్చుటకు గారణ మేమి?

చంద్ర—నన్ను చిన్నప్పటినుండియు మొన్నమొన్నటిదాఁక ఎత్తుకొని యాడించుచు వచ్చిన వృద్ధురా లయిన యొకపరిచారిక రాత్రి పాముకఱచి యకస్మాత్తుగా చనిపోయినది. అది మాతల్లి నత్తవారింటికిఁ బంపినప్పుడు పుట్టినింటివారు కూఁతున కరణముగా నిచ్చి వెంటఁబంపినదాసి యఁట. అది నన్ను తనపంచప్రాణములలో నొక ప్రాణమునుగాఁ జూచుకొను చుండెను. అంతప్రేమగల సేవకు రాలు పోయిన దన్నవిచారముచేత క్రిందమయిన వేళకు రాలేక పోయితిని. ఈతప్పిదమును క్షమింపుఁడు. ఇప్పటికిని నామనస్సంతయు దానిమీఁదనే యున్నది.

గురు—నీ విప్పుడు చేసినదానిలో తప్పిద మేదియు లేదు; నమ్మకముగా పనిచేసినదానియందు నీ కింత కనికరము కలుగుట చూచి నాకెంతో సంతోష మగుచున్నది. అది రాత్రి పోయిన దని కదా నీ విప్పుడు చెప్పితివి? ఇంతకుమునుపు మీనాయనగారి దర్శనము చేసివచ్చుచు దారిలో పశువులపాకపంచను నేను దానిని చూచితిని. నేను నిమిషముక్రిందట చూచివచ్చినది పూర్వము నిత్యమును నీతో వచ్చెడునప్పుడు చూచెడు ముఖమును కన్నులును తక్కిన సమస్తావ

యవములునుగల దేహమే యనుటకు సందేహము లేదు. నీ వది పోయినదని యెట్లు చెప్పఁగలవు?

చంద్ర—ఇప్పుడు దానిబొందిమాత్రమె యీలోకములో నున్నది; ఆ దేహమును ఇఁక కొంతసేపటికి మంటిలో గలిసిపోవును. దానిలోనుండి జీవాత్మ లేచిపోయినది.

గురు—ఈసంగతి నీకు తెలియునో లేదో తెలియుటకయియే యీప్రశ్న వేసినాను. మన దేహముకంటె జీవాత్మ వేఱనియు, దేహమేనిమిషముననో నశించిపోవునదియనియు నీకు తెలిసినందున కెంతయు సంతసించుచున్నాను. శరీరముతో నాశనము నొందక తరువాత మనయాత్మ పరలోకమునకుఁ బోవునని నీకే తెలిసినది గనుక, ఈసంగతిని స్థాపించుటకయి శ్రమపుచ్చుకొని నిదర్శనములు చూపవలసిన యక్కఱ యేమియు లేకపోయినది. సర్వచరాచర కర్తయైన పరమేశ్వరుఁ డొక్కఁడే శాశ్వతుఁడని యీవఱకే చెప్పియున్నానుగదా! ఈ రెండుసంగతులు దెలిసినతరువాత నీకు బోధింపవలసిన విషయములనేకములున్నవి. మన మీలోకములో పూర్ణముగా నూఱుసంవత్సరములు బ్రతికినను, అదియంతయుమిక్కిలి స్వల్పకాలమే; మనము పరలోకములో నుండవలసిన కాలమో పరిమితిలేనిది. మనమును ఉన్నట్టియుండి యెప్పుడో యీలోకమును వదలి పరలోకమును జేరవలసినవారమే. పరలోకమున నిత్యసుఖము ననుభవించుటకు ధర్మ మొక్కటితప్ప సాధనాంతరము లేదు. మనము శాశ్వతమయిన పరలోకసుఖము నపేక్షింతుమేని, ఈలోకమునందలి తుచ్ఛములయిన నిమిషసౌఖ్యముల కాశపడక యెన్నికష్టములకయిన నోరిచి ధర్మమార్గమునందు నడవవలయును.

చంద్ర—మనకు శాశ్వతసుఖము లభించుటకయి తోడుపడు ధర్మములేవో, వాని ననుష్ఠింపవలసినక్రమ మెట్టిదో, నాయం దనుగ్రహించి వివరముగాఁ జెప్పుఁడు.

గురు—మన మీప్రకారముగా నడుచుకోవలె నని ధర్మస్వరూపుఁ డయినలోకరక్షకుఁ డుద్దేశించినయాజ్ఞలే ధర్మములు. అట్టి ధర్మముల ననుసరించుటవలన సుఖమును, మీఱుటవలన దుఃఖమును గలుగుచుండును. మన మనుసరింపవలసినధర్మము లన్నియును నాలుగువిధము లయిన వని చెప్పవచ్చును. మొదటివి సృష్టికర్తయైన పరమేశ్వరునివిషయమున నడుచుకోవలసినవి; రెండవవి మన దేహరక్షణాదుల నిమిత్తము స్వవిషయమున నడుచుకోవలసినవి, మూడవవి భగవత్కుటుంబములోఁ జేరి మనకు సోదరసమములుగా నుండు మానవకోటివిషయమున నడుచుకోవలసినవి; నాలవవి జీవదయాపరుఁ డయినయీశ్వరునిచేతఁ జేయఁబడిన యితర జంతువుల విషయమున నడుచుకోవలసినవి.

చంద్ర—ముందుగా నాకు భగవంతునియెడలఁ బ్రవర్తింపవలసినవిధమును జెప్పి, తరువాత వరుసగా తక్కినధర్మములను బోధింపుఁడు.

గురు—పరమదయాపరుఁ డయిన ఈశ్వరుఁడు తనకుటుంబమైన మానవసముదాయము నివసించుటకయి భూమి యనుదివ్యగృహమును నిర్మించి సుఖజీవనమునకయి కావలసిన సమస్తపదార్థముల నందుంచి యున్నాఁడు. కొట్లలో దాఁచుకొనుచున్న వానిని తీసికొనుచున్నట్టే, సస్యములనుండియు ఫలవృక్షములనుండియు భోజనపదార్థములను పొందుచున్నాము: సూర్యబింబము చమురు పోయనక్కఱలేకయే వెలిఁగెడి పెద్దజ్యోతిగా నున్నది: నదులు మొదలగు

నవి నీడనిలువచేసికొను గొప్పబిందెలవలె నున్నవి. మనచుట్టునుండు సమస్తజంతువులును, వృక్షలతాదులును లోహములునుసర్వవిధముల నుపయోగపడుచున్నవి. వాయువు చెమ్మట పోవ విసరు పరిచారకునివలె స్పర్శసుఖమును గలిగించుచున్నది; మధురరుతములు చేయు కోయిల మొదలగుపక్షులు సంగీతపాఠకులవలె చెవులు పండువచేయుచున్నవి. ఇవియన్నియు భగవదనుగ్రహమువలననే మనకుఁ లభించినవి. కాఁబట్టి యింతటిమహోపకారమును జేసిన మహానుభావుని యెడల మనమెంత కృతజ్ఞత గలవారమయి యాతనిని స్మరించుచుండవలయును. సద్గుణములు కలవానిని ప్రేమించుటయు దుర్గుణములు గలవానిని ద్వేషించుటయు లోకములో నెల్లవారికిని సహజగుణము. సమస్తసద్గుణములకు నిలయుఁడగుటయే కాక మనలను నిత్యమును బుత్రవాత్సల్యముతోఁ గాపాడు కరుణాకరుని మనము ప్రేమింపవలయునని వేఱుగఁ జెప్పనక్కఱయే లేదు. మనజననమునకుఁ గారణభూతు లయినతల్లిదండ్రులయొక్కయు, మనలను పరిపాలించుచు న్యాయము తీర్చు రాజుయొక్కయు, ఆజ్ఞకు లోఁబడి నడుచుకోవలయునని నీవెఱుఁగుదువు గదా? అట్టిస్థితిలో మనయందఱిజన్మములకు నాదికారణుఁడయి, మనపుణ్యపాపముల నెఱిఁగి న్యాయముతీర్చి సుఖమొసఁగి రక్షించుమోక్షదాతకు మనము పరమవిధేయులమయి నడుచుకోవలయునని వేఱేచెప్పవలయునా? మనమెప్పుడును తప్పు లేకుండనడుచుకో లేముగనుక మనయపరాధములను క్షమించుటకును, మనకుఁగావలసినవానిని ప్రసాదించుటకును, మనయాపదలను విచారించుటకును, సర్వశక్తుఁడయినయీశ్వరుని గౌరవపూర్వకముగాను నిశ్చలభక్తితోను నిత్యమును వేఁడుకొను చుండవలయును. ఇవియే భగవంతుని యెడల మనమునడుచుకోవలసిన ముఖ్యధర్మములు.

చంద్ర—ఈరీతిగాఁ దనయెడల మనము నడుచుకొనియెడల భగవంతుఁడు మనలను శిక్షించునుగదా?

గురు—భగవంతుఁ డాత్మస్తుతికి సంతోషించువాఁడునుగాఁడు దూషణమునకు కోపించువాఁడునుగాఁడు. కాఁబట్టియిందువిషయమున మనము ప్రత్యేకముగా శిక్షను పొందకపోయినను, మనకింతటి యుప కారములను చేసినప్రేమానిధియెడలనే కృతఘ్నులమయి విధాయక కృత్యములను విడిచి యుపకారస్మృతిలేని కఠినులమగుదుమేని సామా న్య మానవులవిషయమున బొత్తిగానే దుష్ప్రవర్తనము గలవార మయి పాడగుదుము. కాఁబట్టి యందువలన దండనను పొందుదుము.

చంద్ర—దుర్మార్గచరులుగాక యుక్తముగా ప్రవర్తించు వారికి భగవద్ధ్యానాదులవలనఁ బ్రయోజనములేదా?

గురు—కావలసినంత ప్రయోజనమున్నది. ఈశ్వరధ్యానము వలన మనమనస్సుల కానందము కలుగుటయేకాక, సత్కార్యాచర ణమునందు ప్రోత్సాహమును, దుష్కార్యములయందు విరక్తియుఁ గలుగును; అందువలన సర్వశ్రేయస్సులును మనకు కరతలామలకము లగును. కాఁబట్టి మనము నిత్యమును త్రికాలములయందును భక్తితో నీశ్వరారాధనము చేయుచుండవలెను.

చంద్ర—మీహితబోధవలన నాయజ్ఞానాంధకారము కొంత తొలఁగి ముక్తిమార్గమును కొంచెము చూడఁగాంచితిని. తమయుప దేశానుసారముగా నిఁక నిత్యమును త్రికరణశుద్ధిగా నీశ్వరు నుపా సించుచుండెదను.

---

## అయిదవ ప్రకరణము

మఱునాఁడు చంద్రమతి పాఠమునప్పగించుచున్న కాలములో నడుమ నడుమ నెడమచేతిని గోఁకుకొనుచు వ్రేళ్ళను నలుపుకొనుచు వచ్చెను. అది కనిపెట్టి విద్యాసముద్రుఁడు పాఠమయినదాఁక నూర కుండి తరువాత నీప్రకారముగా సంభాషణ కారంభించెను:—

గురు—అమ్మాయీ! ఈదినమున నీ వేమో కాని పలుమాఱు చేతులు నలుపుకొనుచు వచ్చితివి. అట్లు చేయుటకుఁ గారణమేమి?

చంద్ర—ఎందుచేతనో కాని నావ్రేళ్ళసందున చిన్న చిన్న గజ్జి పొక్కులు లేవనారంభించి చేయి దురదగా నున్నందున గోఁకు కొంటిని. అందులోను నడిమివ్రేలి కణుపుమీఁద వేసిన యీచిన్న పొక్కు నన్ను మిక్కిలి బాధపెట్టుచున్నది.

గురు—మనకు విధాయకములయియున్న ధర్మములను మీఱితివి గాన, నీకీవిధముగా శిక్షకలుగుచున్నది. నీవు చేతులను తిన్నగా కడుగుకొనక యశుచిగా నుండినందున, నీచేతులమీఁద నిప్పుడు గజ్జి లేచుచున్నది. భగవంతుని యాజ్ఞరూపములైన ధర్మములలో దేనిని మీఱినను, దానికి ఫలముగా తగినశిక్ష కలుగక మానదు.

చంద్ర—చదువునందలి యాసక్తిచేత, ఈమధ్య కొన్నిదిన ములనుండి నా దేహసౌఖ్యమును గూర్చి నేనంతగా శ్రద్ధపుచ్చుకొనుట మానివేసినాను. చేతులను శుభ్రముగా కడుగుకొనకపోవుటకూడ నొకధర్మాతిక్రమణమే యగునా?

గురు—మనము శుచిగానుండవలయుటయు నిస్సందేహముగా మన కొకవిధాయకకృత్యమే. ఇది నేను నిన్న రెండవ దని చెప్పిన

స్వవిషయ మయినధర్మములలోఁ జేరును. చదువునందు శ్రద్ధ యుంచుట ముఖ్యమే గాని, అందునిమిత్తమయి దేహారోగ్యమును చెడఁగొట్టుకొనరాదు.

చంద్ర—అట్లయినచో, స్వవిషయమునఁ బ్రవర్తింపవలసిన ధర్మము లేవో, వాని నతిక్రమించుటవలన నేమినష్టములు కలుగునో కొంచెము వివరించి చెప్పుఁడు.

గురు—శరీరసంరక్షణార్థము మన మాచరింపవలసిన కృత్యము లన్నియు స్వవిషయ మయినధర్మములే. వానిని మీఱి నడుచుట వలనఁ బలువిధములయిన వ్యాధులు సంభవించి బహుబాధలు కలుగును, దేహ మారోగ్యదశయం దున్నంతవఱకే మనమేధర్మకార్యము నయినను జేయుటకు శక్తుల మగుదుము. దానికిఁ గొంచెము విఘాతము తటస్థించెడు పక్షమున, సమస్తధర్మములును మూలపడును. కాఁబట్టి యన్నిటికంటెను మనసౌఖ్యమును ముఖ్యముగాఁ జూచుకొని దేహము కాపాడుకొనుచు రావలెను. దేహారోగ్యమునకు శుద్ధ వాయువును, నిర్మలోదకమును యుక్తాహారమును, శుభ్రవస్త్ర ధారణమును,నిత్యస్నానమును,సుఖనిద్రయు ముఖ్యముగా గావలసియుండును.

చంద్ర—మన శరీరారోగ్యము నిమిత్తమంటు వాయువుకూడ నంత యావశ్యకముగా కావలసియే యున్నదా?

గురు—మన మాహారము లేక కొన్నిదినము లయినను జీవింపఁ గలుగుదుము గాని, వాయువులేక నిమిష మయినను బ్రతుక జాలము. మన మాఘ్రాణించువాయువులో నొకభాగము ప్రాణ వాయువు చేరియుండును. మన ముచ్ఛ్వాసనిశ్వాసములను జేయుట వలన ప్రాణవాయువు లోపలికి పోయి రక్తమును శుద్ధపఱుపఁగా, లోపలినుండి చెడుగాలి పయికి వచ్చును. అట్టిగాలి విషస్వభావము

కలడి కాఁబట్టి జీవజంతువులు శ్వాసము విడిచిన గాలినే యెవ్వా రయినఁ బ్రత్యేకముగా పీల్చినయెడల కొన్నినిమిషములలోపలనే వారు మరణము నొందుదురు. కాఁబట్టి ప్రతిమనుష్యుఁడును వాసముచ్చు చేయు గృహములలోనికి పరుండు గదులలోనికిని తగినంత మంచి గాలి వచ్చు వీ లేర్పఱుచుకోవలయును. క్రొత్తగాలి చక్కఁగా వచ్చుటకు మార్గములేని యొకగదిలో పలువురు పరుండినయెడల, కొంతసేపటిలోనే ప్రాణవాయు వంతయు క్షీణించి పిదప చెడుగాలినే పీల్చుచు వచ్చుటవలన పెక్కువ్యాధులు కలుగుటయే కాక యొకా నొక సమయమందు మరణము సహితము సంభవింపవచ్చును. సాధా రణముగా మూఢు లయినమనవారు పురుటింట్లలోనికి మంచిగాలి రానీయక తలుపులు మూసిపెట్టుటవలననే తఱుచుగా బాలింత రాండ్రును శిశువులును పురిటిదినములలోపలనె మరణము నొందు చున్నారు.

చంద్ర—మంచిగాలి లేకపోవుటచేతనే కాఁబోలును, ఎక్కడి కైన నెగిరిపోవునను భయముచేత మొన్న నేనిక్కడకు బయలుదేఱఁ బోవునప్పుడు పెట్టెలలోఁ బెట్టి మూఁతవేసివచ్చిన పావురము వారల నేనింటికి వెళ్ళినతరువాత మూఁత తీసి చూచునప్పటికి చచ్చి యున్నది. నాకప్పుడు కారణ మేమో తెలిసినదికాదు. అంతేకాక నేను మొన్ననీనరుము దాఁగుడుమూఁత లాడునప్పుడు బొత్తిగాక్రొత్త గాలి వచ్చుటకవకాశము లేని మా నేలకొట్టులోనికి వెళ్ళి గడియసే పుండి యీవలకు వచ్చునప్పటికి దేహ మంతయుఁ జెమ్మటపోసి యూపిరిసలుపక పోయినందుకును ఇదియ కారణమై యుండును.

సుద—అవును. శుద్ధవాయువు లేకపోవుట వలన జీవజంతు వుల ఆరోగ్యమునకు హానికలుగుటయేకాక, నిప్పుసహితము మండదు,

చంద్ర—నాలుగుమాసములు క్రిందట నొకనాఁడు మా దేవ తార్చన పెట్టెలో వెలుఁగుచున్నదీప మట్టెయుంచి తలుపు తాళము వేసితిమి. ఇంతలో నందులో నున్న గంధపుగిన్నె కావలసివచ్చి తలుపుతీసి చూచునప్పటికి ప్రమిదనిండ చమురును వత్తియు నున్నను దీప మాఱిపోవుట చూచి నే నప్పు డెంతో యద్భుతపడితిని. ఇప్పు డందునకుఁ గారణము తెలిసి నామనస్సునకు సంతోష మగుచున్నది. మన మూపిరి విడుచుటవలనఁ దక్క మఱి దేనివలననయినను గాలి చెడిపోయి విషస్వభావముగలది యగునా?

గురు—ముఱికికాల్వనుండి బయలుదేఱు దుర్గంధమును, చచ్చిన జంతువులకళేబరములు కుళ్ళునప్పుడు గలుగుదుర్వాసనయు, పశువులను గట్టినస్థలములయందుఁ బుట్టురొచ్చుకంపును, మొక్కలు మొదలయినవియు పేడకుప్పలును మురుగుటవలనఁ గలుగు చెడు వాసనయు, గాలిని విషయుక్తముగాఁ జేసి మన దేహారోగ్యమునకు భంగమును గలిగించును. నిప్పు మండుటవలనను, వాసస్థలమును తేమగా నుంచుటవలనను, ఇండ్లచేరువను మలమూత్రవిసర్జనము చేయుటవలనను, పొగ మొదలగువానివలనను, గాలి చెడిపోయి బహువిధము లయిన వ్యాధులను బుట్టించును గనుక, వాస గృహ ముల సమీపమున నిట్టివేమియు లేకుండ జాగ్రత్తపుచ్చుకొనుచు నివాసస్థలము నెప్పుడును శుచిగా నుంచవలయును.

చంద్ర—ఇన్నివిధములుగా నిత్యమును గాలి చెడిపోయి హానికర మయిన దగుచుండఁగా భగవంతుఁ డీబాధను నివారించు సాధనములను వేనినిఁ గల్పించియుండలేదా?

గురు—మనము శ్వాసము విడిచెడు చెడుగాలిని వృక్షాదులు గ్రహించి మన కావశ్యక మయిన ప్రాణవాయువును బగటిపూట

విడుచుచుండును. ఈ ప్రకారముగా వృక్షాదులు శుద్ధపఱుచుచుం డుట వలనను, గాలియొక్క వ్యాపనమువలనను, ఓరుగాలిచే దూర ముగా దొలఁగుచుండుట వలనను, విషవాయువువలన మనకుఁ గలి గెడుహాని తగ్గిపోవుచుండును. ఊపిరివిడుచుట మొదలయిన యనివార్య కార్యమువల్ల తప్ప వేఱువిధముగ మనము గాలిని పాడుచేయకుండెడు పక్షమున, మన యారోగ్యదశకు భగవంతుఁడు కల్పించినసాధనములే చాలియుండును గాని పయినిజెప్పిన లోపములను బట్టి మనమునుశ్రద్ధ పుచ్చుకోవలసి వచ్చినది.

చంద్ర—మనము శ్రద్ధపుచ్చుకొని చేయవలసిన పను లేవి?

గురు—మనము గృహాదులను సదా శుచిగా నుంచి, గాలి యొక్క దుర్గంధము మొదలగునవి తొలఁగునట్లుగా గోడల కప్పు డప్పుడు సున్నపుపూఁత వేయుచు, శుద్ధవాయువు ధారాళముగా లోపల ప్రవేశించుట కనుకూలముగా గోడల మీఁదుగా గవాక్ష ములనెత్తించి, పొగ మొదలగునవి పోవుటకుఁ దగినమార్గము లేర్పఱచి మనదేహసంరక్షణార్థ మయి తగినంతశ్రద్ధ పుచ్చుకోవలెను.

చంద్ర—ఇక జలము నుపయోగింపవలసినరీతినిగూర్చి కొంత చెప్పుఁడు.

గురు—దేహారోగ్యమే కావలసియున్నయెడల, ఆఘ్రాణించు టకు నిర్మలవాయు వెంతయావశ్యకమో పానముచేయుటకు నిర్మల జలమును అంత యావశ్యకము; కాఁబట్టి నదులయందలిగాని చెఱువు లయందలిగాని కలుష మయిన నీటిని ఎప్పుడును త్రాగక చక్కఁగా వడియఁగట్టిన తేటనీటినే త్రాగుచుండవలెను. మనము త్రాగుట కయి నీళ్ళు తెచ్చుకొను రేవులయందు స్నానములు చేయుట, అంట్లు తోముట, బట్టలుతుకుట మొదలగున పనుల నెంతమాత్రమును

చేయరాదు. అట్లు చేయుటవలన జలము కలుష మయిపోయి త్రాగిన వారికి రోగములు పుట్టించును.

చంద్ర—మనము పుచ్చుకోవలసిన యుక్తాహార మెట్టిదో, ఏయే వేళల భోజనము చేయవలెనో యనుగ్రహించి చెప్పెదరా?

గురు—ఆరోగ్యప్రదములును పుష్టికరములును అయిన పదార్థములనుమాత్రమే భుజించుచు, దేహమునకు జబ్బుచేసెడునట్టియు నజీర్ణకారు లయినట్టియు వస్తువుల నెప్పుడును పుచ్చుకొనకుండవలెను. సాధ్యమయినంతవఱకును ఆకుకూరలు తినకుండుట మంచిది. మంచి పదార్థమని మితముతప్పి తింటిమేని అజీర్ణాదివ్యాధులు సంప్రాప్తమగును. పసిబిడ్డలు దినమునకు మూడునాలుగు సారులు తినవలసినవారయినను, పెద్దవారు ప్రతిదినమును రెండుసారులు వేళపట్టున భుజించుచు, సాధ్యమయిన యెడల నెప్పుడు నొకటేపదార్థమును గాక కూరగాయలను రసవర్గమును మార్చి తినుచుండ వలయును. నోముల పేరును వ్రతములపేరును జెప్పి వేళతప్పి తినుట, ఒంటిపూట తినుట, ఉపవాసములు చేయుట మొదలయిన యాచారములను గట్టిపెట్టవలెను. లేకపోయినయెడల నట్టివారు రోగములపాలయి ఒడలు చెడఁగొట్టుకొందురు.

చంద్ర—వస్త్రధారణమును గూర్చి విశేషించి చెప్పవలసియున్నాదా?

గురు—చెమ్మట మొదలయిన వానివలన మనము ధరించుకొను వస్త్రములు శీఘ్రముగా మాసిపోవుచుండును. మాసినబట్టనే మరలఁ గట్టుకొనుటచేత చిడుము మొదలయిన చర్మరోగములు పుట్టును. కాఁబట్టి బట్ట కొంచెము మాసినతోడనే విడిచి యుతికి

తెచ్చినబట్టను కట్టుకొనుచుండవలయును. దేహారోగ్యమునకు ముఱికి లేనిబట్టలే యావశ్యములు గాని విలువబట్టలుగావు. కాఁబట్టి ధనికుల భార్యలను జూచి బీదవారల భార్యలు తమకును విలువబట్టలే కావల యునని పట్టుపట్టు బుద్ధిహీనతను విడిచిపెట్ట వలయును.

చంద్ర—నిత్యమును స్నానముచేయుటవలనఁబ్రయోజనమేమి?

గురు—త్రాగుటకువలెనే స్నానము చేయుటకును నిర్మల జలమే కావలయును. మనవారు పుణ్యమువచ్చునని నదులలోని బురద నీళ్ళలో మునుఁగుటయే కాక, ఆచారమని తడవు తడిబట్టలను గట్టు కొని కూరుచుందురు. అట్లుచేయుటవలన రోగములువచ్చును. శరీరము నిండ నున్నసూక్ష్మములయిన రంధ్రములగుండ చెమట, మన్ను మొద లయిన కల్మషపదార్థములు సదా పైకి వచ్చుచుండును. శుభ్రముగా దేహమును తోముకొని నీళ్ళు పోసికొని పక్షమున ఆ రంధ్రములు పూడిపోయి చెమట మొదలయినవి తిన్నగా పయికిరాక కురుపులు మొదలగునవి బయలుదేఱును. కాఁబట్టి స్నానము చేయునప్పుడు శరీరమును ముఱికిపోవునట్లు చక్కఁగా తోముకొని, దినమున కొక సారియైనను తప్పకనీళ్ళు పోసికొనుచుండవలెను. ఊరకే దేహము మీఁద నీళ్ళు గ్రుమ్మరించుకొనుచుండుట వలన నేమియుఁ బ్రయోజ నము లేదు. బాలురును దేహదార్ఢ్యము గలవారును ప్రతిదినమును ప్రాతఃకాలమున శీతోదకస్నానము చేయవలెను; బలహీనులును వ్యాధిగ్రస్తులును గోరువెచ్చనినీళ్ళు పోసికోవచ్చును. మిక్కిలివేఁడి నీళ్ళు పోసికొనుట దేహమునకు మంచిదికాదు; కాఁబట్టి పిల్లలు నిద్రపోవుదురని వేఁడినీళ్ళు పోయు దురాచారమును తెలివిగలవా రందఱును మానవలయును.

చంద్ర—మీ రింక నిద్రనుగూర్చి మాత్రమే చెప్పవలసి యున్నది. అదికూడఁ జెప్పుఁడు.

గురు—ప్రతిదినమును రాత్రి పది గడియలకుపఱుండి సూర్యోదయము కాకమునుపే నిద్ర లేవవలెను. సాధారణముగా దినమునకు రెండుజాములనిద్ర చాలును. పగలు నిద్రపోవుట మంచివాడుక కాదు. చిన్నపిల్లల కధికనిద్ర కావలసి యుండును గనుక వారిని పగలు నిద్రపోనియ్యవచ్చును. నిద్రాభంగమువలన తెవుళ్ళువచ్చును. కనుక జాగరములు చేయరాదు.

చంద్ర—ఈచెప్పినవిగాక దేహారోగ్యవిషయ మయి చెప్పవలసిన దేదియు లేదుగదా ?

గురు—ముఖ్యమయిన దింకొకటి యున్నది. ప్రతిదినమును గొంతవఱకు దేహపరిశ్రమము చేయుట యత్యంతావశ్యకము. ఏపని యుంజేయక యూరక కూరుచుండుపక్షమున, దేహము బలహీనమయి వ్యాధులు సంభవించును. ఈహేతువుచేతనే పాటుపడక తిని కూరుచుండెడుధనికులస్త్రీలకన్న పనిపాటులు చేసికొని జీవించు పేదరాండ్రు బలముగలవారుగా నుందురు. కాబట్టి దాసదాసీజనము లున్నవా రయినను తాముండెడు గృహమున పనిపాటులు చేయుచు చిరకాలాయురారోగ్యముల ననుభవింపవలెను.

---

## ఏడవ ప్రకరణము

---

మఱికొన్ని దినము లయినతరువాత చంద్రమతి యొకనాఁడు నిత్యమును వాడుకగా జరిగెడు పాఠములనుజదివి, లెక్కలుచేసికొని వ్రాత కుదురుట కయి గురువుపెట్టిన వరుసడి ప్రకారముగా వ్రాయుచుండెను. ఆవ్రాయుచున్నకాలములో విద్యాసముద్రుఁడు శిష్యురాలిని పరిశీలనతోఁ జూచి యామె ముఖమునందు కొంచెముమార్పు గనిపెట్టి వ్రాఁత యగువఱకును నూరకుండి తరువాత నిట్లనియెను.

గురు—అమ్మాయీ! నీమొగము చూచిన లోపల నీవేమో విచారగ్రస్తురాలవయి యున్నట్లు కనఁబడుచున్నావు. అంతేకాక నీ శరీరమును మునుపటికంటె కొంచెము చిక్కినది. అందునకుఁ గారణ మేమి?

చంద్ర—నన్నుఁ జూచి నిన్న మాయమ్మగారును మీ రడిగి నట్లే యడిగినారు. శరీరారోగ్యమును గూర్చినధర్మములను మొన్న మీరు సెలవిచ్చినది మొదలుకొని యన్నపానాదులవిషయమునను దేహపరిశుద్ధతవిషయమునను నే నెక్కువశ్రద్ధ పుచ్చుకొనుచున్నాను. ఇప్పుడు నాచేతులమీఁదిగజ్జియంతయు బొత్తిగాపోయినది. అట్లుండగా నే నిప్పుడు చిక్కుటకుఁ గారణ మేమయి యుండునో నాకును దెలియ రాకున్నది.

గురు—నీ వేదైనమనోవ్యాధిచేత శుష్కించుచున్నావేమో?

చంద్ర—ఇప్పుడు మీరన్నమాట కర్థమేమో నాకుఁ దెలియ లేదు. కడుపు నిండుటకుఁ గావలసినంత యుక్తమయినభోజనపదార్థ ములు లభింపక పోయినను పడనివస్తువులను తిన్నను దేహమునకు వ్యాధి వచ్చునని యీవఱకు విని యున్నాను; కాని మనస్సునకు వ్యాధి యెందుచేత వచ్చునో, మనోవ్యాధి యేరూపముగా నుండునో నే నూహింపఁజాల కున్నాను. మీ రావిషయ మయి కొంచెము చెప్పెదరా ?

గురు—తగినయాహారాదులుగాని పరిశుద్ధతగాని లేకపోయిన యెడల శరీరమున కేప్రకారముగా వ్యాధిసంభవించునో, ఆత్మకు నదే ప్రకారముగా దానికిఁ గావలసినయాహారమును పారిశుద్ధ్యమును లేక పోవుటచేతను వ్యాధి సంభవించును. ఆత్మకును శరీరమునకును పరస్పర

సంబంధ ముండుటచేత, ఆత్మ కేదియైనను బాధ సంభవించినప్పుడు శరీరమును కృశించును.

చంద్ర—మొన్న నీనడుమను కాలముచేసిన మాదాసివిషయము పై నామనసులో నిజముగానే వ్యసనముగా నున్నది. చిన్నప్పటి నుండియు నెత్తుకొని పెంచినదాని విషయమయి యెట్లు విచారపడ కుండఁగలను? మీ రిప్పుడు చెప్పినట్లు నేను చిక్కిపోవుట కదియె కారణమై యుండును. మీరీవఱకుఁ జెప్పినధర్మము లన్నియు శరీరమును గుఱించినవే గనుక, ఆత్మనుగూర్చిన ధర్మములనుగూడ కొంతవఱకుఁ జెప్పఁగోరెదను.

గురు—ఆత్మ యనఁబడు మనజ్ఞానదేహము వృద్ధిపొందుటకి విద్యయే యాహారము. మనజ్ఞానమునకు సాధన మయినచదువునకి విద్య యని పేరు. జ్ఞానసంపాదనము చక్కఁగాఁ జేయనివారు ఏవిషయమున నెట్లు ప్రవర్తింపవలయునో తెలియక చిక్కుపడిసుఖమునకు దూరు లగుదురు. దేహశుద్ధివలెనే యాత్మశుద్ధియు మనసౌఖ్యము కత్యంతావశ్యకము. మన మాత్మానందము ననుభవింపవలె నన్నపక్షమున, సాధ్యమైనంతవఱకు జ్ఞానాభివృద్ధి చేయుచు చిత్తశుద్ధి గలిగి యుండవలెను.

చంద్ర—జ్ఞానాభివృద్ధికయి విద్యయావశ్యక మంటిరికదా స్త్రీలుచదువవలసిన చదువెట్టిదయి యుండవలెను?

గురు—పురుషులకువలె మీకును ఇప్పుడు నేనునిత్యము చెప్పుచున్న ప్రకారముగా భాషావిషయమైన జ్ఞానమును వృద్ధిపఱచు వ్యాకరణ సాహిత్యములును, వస్తువివేచనశక్తినిగలిగించుగణితము దేశకాలవర్తమానములను దెలుపుచరిత్రములును గావలసియుండు మీపతివ్రతత్వము తిన్నగానుండుటకయి యన్నిటికంటెను ముఖ్యము

నీతిగ్రంథములను చదువవలెను. భగవంతుని మహిమలనుజెప్పెడి పుస్తకములను పాతివ్రత్యధర్మములనుగృహకృత్యములతీరును నేర్పెడి గ్రంథములనుగూడ తప్పకచదువవలెను. ఇవిగాక స్త్రీలే ప్రత్యేకముగా నేర్చుకోవలసిన విషయములును గొన్నికలవు. మీరుకుట్టుపనిని, పాకముచేయువిధమును, శిశుపోషణము మొదలయినవానిని, అవశ్యముగా నభ్యసింపవలయును. భగవంతుఁడు సాధారణముగా పురుషకంఠముల యందుకంటె మీకంఠములయం దెక్కువమాధుర్యమును బెట్టి యున్నాఁడుగనుక, సంగీతశాస్త్రము నభ్యసించి శ్రమపడి పురుషుఁ డింటికి వచ్చినపుడుశ్రావ్యమైనసంగీతములనుపాడి,యాతనికాయాసము కనఁబడకుండఁ జేయవలసినభారము మీయందే యుండును. పురుషులు బయలఁ దిరిగి పని చేయవలసినవారు; మీరో సదా యిల్లు కనిపెట్టుకొని యుండి బిడ్డలు మొదలయినవారి యోగక్షేమములను విచారింపవలసినవారు కాఁబట్టి పిల్లలకు వచ్చు సాధారణమయినరోగములకుఁ జేయవలసినచికిత్సలును, దేహారోగ్యము చెడకుండఁ గాపాడుటకయి చేయవలసినపనులును, ఇంట నెవ్వరయినను గర్భమును ధరించియున్నప్పుడును ప్రసవ మయినప్పుడును జరపవలసినకృత్యములును మీరెప్పుడును నేర్చుకొని యుండవలెను. ఇంతవఱకైనను మీరువైద్యవిషయమును గ్రహించి యుండనియెడల, పురుషుఁ డింట లేనప్పు డకస్మాత్తుగా నెవ్వరికైన నొకజబ్బు వచ్చినప్పుడు తగినపని చేయుటకుఁగాని రోగమును నొప్పియు రాకుండ బిడ్డలను రక్షించుటకుఁ గాని మీరు శక్తురాండ్రు కాకపోదురు.

చంద్ర—ఇప్పుడు చెప్పినది కొంతవఱకుఁ దెలిసినది. మీరు చెప్పినవాటిలోఁ గొన్నిఁ నడతను దిన్నపఱుచుకొనుటకును కొన్ని సంసారసంబంధము లయినగృహకృత్యములను క్రమముగా నిర్వహించు

టకును, ఉపయుక్తములుగా నుండును. ఇఁక నాత్మయొక్క పరిశుద్ధత యనఁగా నెట్టిదో తెలుపుఁడు.

గురు—ఆత్మకు దుఃఖమును తెచ్చెడు దుర్గుణము లేవియు లేనప్పు డది పరిశుద్ధ మయినదశయం దుండును. శరీరమునకు రోగ కారణమైనయపథ్యపదార్థము లెట్టివో యాత్మ కీదుర్గుణము లట్టివే. ఆరోగ్యకర మైనపథ్యపదార్థములవంటివి సుగుణములు. సుగుణము లెప్పుడును సంతోషమును దుర్గుణములు దుఃఖమును తెచ్చును. సత్యము, శాంతత్వము, ధైర్యము, వినయము, దయ, తృప్తి మొద లయినవి యాత్మానందమును దెచ్చెడి సుగుణములు. వీనికి వ్యతిరిక్త ముగా నుండు అనృతము, కోపము, దీనత, గర్వము, క్రూరత్వము, ఆశ మొదలయినవి యాత్మాయాసమును గలిగించెడు దుర్గుణములు.

చంద్ర—ఇప్పుడు మీరు చెప్పిన సుగుణదుర్గుణములనుగూర్చి విశేషించి చెప్పవలసి యున్నదా?

గురు—ఇవి యన్నియు నితరులవిషయమున మనమునడుచుకో వలసిన ధర్మములలోను వచ్చును. అయినను వానివిషయమై యిప్పుడు కొంచెము చెప్పెదను. సమస్తశుభములకును సత్యమే మూలమయినది. మనము ప్రాణాంత మయినయాపద వచ్చినప్పుడుసహితము సత్య మును తప్పరాదు; సర్వధనమును పోవునప్పుడయినను నిజమునే పలుక వలెను. పరలోకహానిమాట యటుండఁగా, మన మించుకయబద్ధ మాడితిమేని యీలోకమునందు సహితము మనమీఁద నందఱకు నమ్మకము పోయి పలునష్టములు సంభవించును.

చంద్ర—మన మేవిషయమందయిన ననృతము పలుకవచ్చునా?

గురు—బొత్తిగా పలుకఁగూడదు. అనృతమునకు మనయొక్క దానిలో నెడ మిచ్చితిమేని, రెండవదానిలోఁగూడ నబద్ధ మాడ బుద్ధి

పుట్టి క్రమక్రమముగా మన సంబంధములకు పుట్టినిండ్లమై దుర్గతిపా లగుదుము.

చంద్ర—సత్యమునుగూర్చి మీ రిప్పుడు చెప్పినదానివలన విచారించి చూడఁగా మన మన్నిసమయములయందును శాంతత్వము మొదలైనవానినే పూని యుండవలయు ననియు కోపము మొదలయిన వాని నెప్పుడును మనలను చేరనియ్యరాదనియు తోఁచు చున్నది.

గురు—అసూయము, దీనత్వము, గర్వము, కాఠిన్యము మొద లయినవానిని ఎప్పుడును మన చెంతకుఁ జేరనీయక పోవలసినను, మన మప్పుడప్పుడు యుక్తరీతిని కోపము మొదలగునొన్నిటిని గనఁబఱు చుచు రావలసి యుండును. ఒక సేవకుఁడుగాని బాలుఁడుగాని నేరము చేసినప్పుడు వానిమీఁద కోపపడకుండిమేని వానిప్రవర్తనమే దుర్మార్గ మయిన దయి వాఁడు చెడిపోవును. కాఁబట్టి క్రూరోద్దేశ మేమియు లేకుండ పరుల బాగుకొఱకు యుక్తరీతిని తగుసమయములయందు మనము కోపము చూపవచ్చును. అదేప్రకారముగా మనము న్యాయమయిన యన్నికోరికలను గోరవచ్చును. అత్యాశనుమాత్రము విడువవలెను.

చంద్ర—తక్కిన సుగుణములను చెప్పవలసిన దేమయిన నున్న నాయందు దనుగ్రహించి చెప్పుఁడు.

గురు—విస్తరించి చెప్పవలసినదిలేదు. శాంతతవలన మనకుఁ గల సుగుణము లన్నియు మఱింతశోభ చెందును; భృత్యజనులును తోడివారును మనమీఁద నధికానురాగము గలవా రగుదురు. ఆప దలయందు ముఖ్యముగా మనము ధైర్యము నవలంబించి యుండ వలెను; అట్టిధైర్యమును విడనాడితిమేని, అందువలన మనకు కూడి వచ్చునది యేదియు లేకపోవుటయే కాక యాపద రెట్టింపుగాఁ దోఁచి

యధికదుఃఖమును కలుగఁ జేయును ; ధైర్యమును పూనుటవలన వచ్చిన యాపదలో సగము తగ్గిపోవును ; వినయము గల్గి మెలఁగిన యెడల సర్వజనులు మనమీఁద మంచియభిప్రాయమును గలవారగుదురు ; అడఁకువవలన మనదుర్గుణములను సహితము పాటింపక యితరులు వానిని సుగుణములనుగానే భావింతురు ; గర్వము కలవారమయి విఱ్ఱవీఁగినయెడల మనసుగుణములుసహితము దుర్గుణములుగానే కనఁబడును. సద్గుణము లన్నిటిలోను దయ మిక్కిలి యుత్కృష్ణమయినది. దానిని మించినధర్మ మింకొక్కటిలేదు. తృప్తి లేకయుండినయెడల మన మనసున కెప్పుడు సుఖమే కలుగదు ; ధర్మకార్యములను జేయుటయందును విద్యను సంపాదించుటయందునుతప్ప సమస్తవిషయములందును మనకు భగవంతుఁడు దయచేసినదానితోనె తృప్తి పొందుచుండవలయును.

---

## ఏడవ ప్రకరణము

మఱిరెండుదినములు గడచినతరువాత ఒకనాఁడు సాయంకాలమున చంద్రమతి చెలికత్తెలతోఁగూడ చదువుకొనుటకయివచ్చి తనగురువుగా రెవ్వరితోనో లోపల రహస్యము మాటాడుచున్నారని విని, ఆయన యీవలకు వచ్చువరకును వేసవికాల మగుటవలన చల్లగాలినిమిత్తము వాకిటిలోనున్న బల్లమీఁద గూరుచుండి, చేతిలోనున్నపుస్తకమును దీసి ప్రాఁతపాఠములను చింతనము చేయుచుండెను. అది సంక్రాంతినెల యగుటచే విసనకఱ్ఱలు చేతఁబూని శిరస్సులనక్షయపాత్రలను ధరించి విష్ణుగీతములను పాడుచు అప్పు డక్కడకు కొందఱు సాతానులు వచ్చి చంద్రమతిని ఏమయిన నిమ్మని బహు

దీనత్వముతో యాచింప మొదలుపెట్టిరి. ఇంతలో విద్యాసముద్రుఁడు లోపలినుండి వచ్చి, చంద్రమతి యేమి చేయునో కనిపెట్టవలయు నని చాటున నిలువఁబడి చూచుచుండెను; ఆమె కొంచెమునే పాలోచించి, పండ్లు కొనుటకయి యింటివద్దనుండి తెచ్చుకొన్నడబ్బును బట్టకొంగునుండి విప్పి, వారిలో పడుచువాండ్ర కెవ్వరికిని నియ్యక యొకముసలివానిచేతిలోఁ బెట్టి పంపివేసెను. అంతట విద్యాసముద్రుఁడు వెలుపలికి వచ్చి, చంద్రమతిని జూచి యావెళ్ళిడివారితో నేమి మాటలాడుచుంటి వని యడిగెను.

చంద్ర—వా రిచ్చటకు వచ్చి తమ కేమైన నిమ్మని నన్ను మిక్కిలి పీడించిరి. ఎల్లవారును పాటుపడవలయుననియు, తమజీవనాధారమై పాటుపడునిమిత్తమే భగవంతుఁ డందఱికిని కాళ్ళుచేతులు మొదలైన యవయవములను ప్రసాదించి యున్నాఁడనియు మొన్న మీరు సెలవిచ్చి యున్నారు. అందుచేత నొకరికొక రియ్యవలసిన యావశ్యకము లేదని నాకు తోఁచినది. అయినను వారిలోనున్న యొకవృద్ధుని జూచినప్పుడు వాని నూరక పంపివేయ బుద్ధిపుట్టక చిఱుతిండినిమిత్తము తెచ్చుకొన్నడబ్బు వానికిచ్చితిని.

గురు—నీవు తెలిసి చేయకపోయినను, ఆముసలివానికే దానము చేయుటవలన మంచిపని చేసితివి. అన్యులనే నమ్ముకొని యుండక తనజీవనార్థమై తానే పాటుపడవలయుట ప్రతిమనుష్యునకును విధియైనను, మహారాజు మొదలుకొని గర్భదరిద్రునివఱకును అన్యోన్యసాహాయ్య మవశ్యముగా కావలసి యుండును. మీరు నిత్యమును భుజించు పంచభక్ష్యపరమాన్నములకు కావలసినపదార్థము లెట్లో బీదవాఁడు త్రాగెడుగంజికయి కావలసినబియ్యము నట్లే పలువురు పాటుపడక లభింపనేరవు. ఒక్కభగవంతునిచేతనే సృజియింపఁబడి

రక్షింపఁబడుచుండుటవలన, జను లందఱును నేకకుటుంబములోనివారి వలె నుండవలెను. ఒకకుటుంబములో సంపాదింపలేని యశక్తుఁడొకఁ డున్నపక్షమున వానిని పోషించుట సమర్థుఁడైనవాని కెట్లు విధి యగునో, భగవత్కుటుంబమయిన యీప్రపంచములోను శక్తిమం తులు శక్తిహీనులను కాపాడుట ముఖ్యకర్తవ్యము. కాఁబట్టి యంగ వైకల్యము వలనఁగాని ముదిమివలనఁగాని రోగమువలనఁగాని పాటు పడనసమర్థులుగానుండు బీదవారికందఱికిని మనచేతనైనసాహాయ్యము తప్పక చేయుచుండవలెను. శక్తిగలిగియు పాటుపడనొల్లక సోమరు లయి యాచనయే జీవనోపాధిగాఁ జేసికొని తిరుగుదృఢగాత్రులకు మాత్రము మన మేమియు నియ్యఁగూడదు. దేశమునకు క్షామము వచ్చినప్పుడుగాని, పరదేశమునుండి మార్గాయాసపడి వచ్చినప్పుడు గాని దైవవశమున నేదియైననాపద వచ్చినప్పుడుగాని, దృఢకాయు లకుసహితము పెట్టవలయును. పాత్ర మెఱిఁగి యీప్రకారముగాఁ జేయుదానమువలననే ఫలము కలుగును. సాధ్య మయినంతవఱకు దానము రెండవవా రెఱుఁగకుండ రహస్యముగా చేయవలెను. పువ్వు చాటున నున్నను దానిపరిమళ మందఱికిని దెలియునట్టుగా, యోగ్యుఁ డెందున్నను వానిగుణములు వెల్లడికాక మానవు. ప్రసిద్ధికొఱకు ముఖ స్తుతులను జేయువారికిని మోసగాండ్రకును జేసెడిత్యాగమునిరర్థకము.

చంద్రు—మన మితరమానవుల విషయమున నడుచుకో వలసిన ధర్మములను జెప్పెద మని మీరు వెనుక వాగ్దానము చేసి యున్నారుగదా? దయచేసి వానినెల్ల నిప్పుడు సమగ్రముగాఁజెప్పుఁడు.

గురు—వెనుక నేను జెప్పిన సత్యము మొదలగునవియు, ఇప్పుడు చెప్పిన దానివిషయమును జనులవిషయ మయిన ధర్మముల

లోనే చేరును. అట్టిధర్మముల నన్నిటిని పూర్ణముగాఁ జెప్పఁ బూను కొన్నచో బహుదినములు పట్టును. సామాన్యముగా జనులవిషయ మయి చేయవలసిన ధర్మములను గొన్నిటినిమాత్ర మిప్పుడు సంగ్ర హముగాఁ జెప్పి, బాధువుల విషయ మయి యాచరింపవలసిన ధర్మ ముల నింకొకసారి చెప్పెదను. తా నెండకును వానకును నోర్చియైన నితరులకు నీడను ఫలములను నిచ్చు వృక్షమువలెనే, యెల్లవారును తాము కొన్నికష్టముల కయిన నోర్చుకొని పరోపకారము చేయుట కయి ప్రయత్నింపవలయును.

చంద్ర—యోగ్యాయోగ్యవిచారము చేయక యెల్లవారికిని నుపకారము చేయుచుండవలయునా?

గురు—మంచివారికిచేయు న్యాయమయిన సాయమే యుప కార మగును గాని శిష్టదుష్టవిచక్షణత లేక చేయునది యుపకారము కాదు. అందుచేతనే దొంగలు మొదలయినవారికి మనము సాహా య్యము చేసినపక్షమున ఉపకారము చేసినవారము కాకపోఁగా శిక్షార్హులము సహిత మగుదుము.

చంద్ర—తక్కిన ధర్మములను గూడఁ జెప్పుఁడు.

గురు—మన మెంతలేమిలో నున్నను పరుల వస్తువులమీఁద చేయి వెయ్యరాదు. దొంగతనము చేసినవారిని ఈలోకమునందు రాజు శిక్షించును. మనము దొంగిలించుచుండఁగా నెవ్వరును చూడ లేదనుకొన్నను, దొంగతన మెప్పుడో బయలఁబడక మానదు. ఒక వేళ దాఁగినను, సర్వజ్ఞుఁడైన భగవంతుని మనము మోసముచేయ లేము. కాఁబట్టి పరలోకమున శిక్షతప్పదు. కాఁబట్టి యెన్ని యాప దలు వచ్చినను ప్రాణావసానము తటస్థించినను చోరత్వము చేయ రాదు, మన కెవ్వరైన నించుక మేలు చేసిరేని, వారుచేసిన మేలును

మఱచిపోక సాధ్యమైనయెడల ప్రత్యుపకారమును చేయవలెను; కృతఘ్నుని నెల్లవారును ద్వేషించి వానికి కీడు గోరుచుందురు. పరుల సంపద మొదలైనవి చూచి మన మెప్పుడును అసూయ పొందరాదు; ఓర్వలేనితనము నిప్పువలెనే తాను జేరినచోట నెల్లను నాశనము కలుగఁ జేయును. ఒరులమేలు చూచి యోర్వలేనివారు రోగము లేకయే బాధపడుచుందురు. మన మేవిషయమునందును ఎవరిని మోసము చేయరాదు; అన్నివిషయములయందును ఋజువుగాఁ బ్రవర్తింపవలయును. మన మెవ్వరికైన న్యాయమైన విషయములం దేమైన వాగ్దానము చేసినచో, ఎన్నిపాట్లు పడియైన మన మన్న మాటను చెల్లింపవలయును; మనము మాటిమాటికి వాగ్దానము చేయక మిక్కిలి జాగ్రత్తగా నుండవలెను. వైరముగాని మైత్రిగాని మాటలవలననే వచ్చును గనుక వాక్పారుష్యమును మాని యితరులతో మాటాడునప్పుడు మిక్కిలి శాంతులమయి యుండవలయును. తెలివిలేనివారు తొందరపడి మనల నేమైన నన్నను ఓర్పు గలిగి మనము సైరణ వహింపవలయును; మన మెప్పుడును వారు లేనప్పుడు పరులదోషముల నొకరితోఁ జెప్పరాదు; వీరిదగ్గఱమాటను వారిదగ్గరను వారిదగ్గఱమాటను వీరిదగ్గఱను జెప్పక యెక్కడిమాట యక్కడనే మఱచిపోవలెను; మన మెల్లవారిని గౌరవము చేయవలయును. మనకంటె నధికులైనవారియెడ భక్తిగలిగి వారు చెప్పెడు న్యాయ మయినపనులయందు లోఁబడి నడువవలెను. మన సేవకులు మొదలయినవారిమీఁద నిష్కారణముగా కోపపడక మంచితనము చేతనే వారిచేత పని చేయించుకొనవలెను. ఏవిషయములయందును మన కాత్రము పనికిరాదు; ప్రతికార్యమును చక్కఁగా నాలోచించి మఱి చేయవలెను. అందఱియందు సమబుద్ధి గలిగి, ఏవిషయమునం

దైన పనులు మన యభిప్రాయ మడిగినచో, నిష్పక్షపాతముతో మనసులోఁగలది నిష్కపటముగా వచింపవలయును. నిర్హేతుకముగా మన మితరుల కెప్పుడు నొప్పికలుగకుండునట్లుగా ప్రవర్తింపవలయును. దైవవశమున నితరుల శరీరములయందుఁ గలిగిన వక్రతలను జూచి మన మెప్పుడును బరిహసింపఁ గూడదు. ఎవ్వరైన మన కనిష్టమైన పనిని జేసినను, పలుకులచేతఁ గాని చూపులచేతఁ గాని యేమియు వికారము కనఁబడనీయఁగూడదు. దంభము మొదలైన యితరదుర్గుణములను మాని, అందఱకును మనమీఁద ప్రీతికలుగునట్లుగా నడవవలయును. మనము మంచిగుణము గలవారమే యైనను, మనము చేయు సహవాసమును బట్టియే జనులు మనగుణము లిట్టివని నిర్ణయింతురు; దుస్సహవాసముచేత మంచివారు సహితము చెడిపోవుచుండుటయు, మంచివారి చెలిమిచేత దుష్టులును బాగుపడుచుండుటయు, మనము నిత్యమును జూచుచున్నాము. కాఁబట్టి సదాదుస్సహవాసము విడిచి సత్సాంగత్యము గలిగి మెలఁగ వలయును.

చంద్ర—సమస్తకార్యముల యందును మన మీలాగునఁ బ్రవర్తింపవలయునని తెలుపువిధమొకటి యేమయిన నున్నదా?

గురు—సత్యము పలుకవలయునని నేను చెప్పకమునుపును నీకాసంగతి తెలియును. నే నబద్ధమును చెప్పుమని నీకు బోధించినను నీవు నామాటలను విశ్వసింపవు. నీకు యుక్తాయుక్తతలను బోధించెడి యంతరాత్మ నీహృదయమునఁ గలదు. అది మనకు ధర్మాధర్మములను బోధించుటయే కాక పాపకార్యములను జేసినపుడు సంతాపమును పుణ్యకార్యములఁ జేసినప్పుడు సంతోషమును గలిగించుచున్నది. ఈమనస్సాక్షికి విరోధము లేకుండ నడుచువాఁడే పుణ్యాత్ముఁడు. స్వవిషయములో దేనిని మన కితరులు చేయవలెనని మనము

కోరుదుమో దానినే మన మితరులకును జేయుచు, దేనిని మన కితరులు చేయఁగూడ దని తలఁతుమో దానిని మానుచుండవలయును. ఇది యొక్కటియే సర్వనీతిశాస్త్రసార మయిన మూలవిధి. అవసరము తటస్థింపనప్పు డందఱును సన్మార్గులే యగుదురు. ఆపదలువచ్చినప్పుడు సహితము వాని కన్నిటికిని నోర్చి ధర్మము తప్పకుండువారుమాత్రమే సానఁబట్టినకొలఁదిని మెఱుఁగెక్కు వజ్రములవలెఁ బ్రకాశించి కీర్తి వహింతురు.

---

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము

---

ఒకనాఁడు చంద్రమతియొక్క చెలికత్తెలలో నొకతె గుజ్జెన కూళ్ళు వండుకొని యాడుకొనుట కయి తెచ్చుకొన్న సెనగపప్పు కొంగుముడి విడిపోయి నేలమీఁద నిసుకలో నొలికిపోయెను. అప్పు డాసమీపముననున్న చెట్టుమీఁదినుండి చూచుచున్న యొకకాకి దిగివచ్చి యాహారపదార్థములు దొరికినవి రమ్మని తెలుపుట కయి కావుకావుగ నార్వనారంభించెను. దాని యభిప్రాయమును గ్రహించి తోడనే దూరముననున్న దాని బంధువర్గ మంతయు వచ్చి నిమిషములో భూమిమీఁద నొక్క గింజయయినను లేకుండ నెత్తుకొని పోయెను. వానిలో నొకకాకి కొన్ని గింజలను నోటఁ గఱచుకొని పోయి, మేతనిమిత్తమయి నోళ్ళు తెఱచుకొని తల్లిరాక చూచి కూయుచు గూఁటిలోనుండి పయికివచ్చుచున్న పిల్లలనోటిలో వానిని బెట్టివచ్చి మరల గింజలు కొనిపోవుచుండెను. అంతసేపును చంద్రమతి యాకాకికి పిల్లలమీఁద గలప్రేమకును, స్వజాతిపక్షుల కెల్లను సాయముచేయవలెనన్న దానియుపకారచింతకును నాశ్చర్యపడి చూచుచుండెను. తరువాత విద్యాసముద్రుఁడు బంధువులయెడ నడచుకో

వలసిన విధమును బోధించుటకు దినో మంచి సమయ మని యెఱిఁగి చంద్రమతితో నిట్లనియె.

గురు—అమ్మాయీ! నీవు కాకులవంక నంత యాశ్చర్యముతో జూచుచున్నా వేమి?

చంద్రి—ఆకాకి తనపిల్లల కంతప్రేమతో నెర పెట్టుచుండుటయు, సెనగబద్దలు తినుటకై యొకకాకి యన్నికాకులను పోగుచేయుటయు నాకు వింతగా నగపడి చూచుచున్నాను.

గురు—అది మనుష్యులుకూడ బంధువుల విషయమున ఈప్రకారముగానే ప్రవర్తింపవలెనని నేర్పుచున్నది. బుద్ధిమంతునకు భగవత్సృష్టిలోని ప్రత్యల్పవస్తువునుండియు నేర్చుకోఁదగిన దెంతో కనఁబడును.

చంద్రి—మీరు వెనుక బంధువులనుగూర్చిన ధర్మములను మఱియొకసారి చెప్పెద మని సెలవిచ్చియున్నారుగదా? ఇప్పు డావిషయమును నాకు చక్కఁగా బోధింప వేఁడెదను.

గురు—మనము సాధారణముగా బంధువు లందరియందును ప్రేమగలవార మయి సాధ్య మయినంతవఱకు వారికి మనచేతనైన సాయమును యుక్తసమయములయందుఁ జేయుచుండ వలయును. అసహాయులమయి పుట్టి మన కిది కావలయునని నైనను జెప్పనేరక ఏడుచుటతప్ప మఱియేమియుఁ జేతకాకుండ నుంకుబాల్యదశ మొదలుకొని మనల నెన్నివిధములనో కాపాడి, మనభావ మెఱిఁగి యాకలి పట్టున నాహారముపెట్టి మనకాలిలో ముల్లుగ్రుచ్చుకొన్నదన్న నిద్రాహారములు లేక పరితపించి చికిత్సచేయించుచు, విద్యాబుద్ధులు చెప్పించి పెంచి పెద్దవారినిజేసిన తల్లిదండ్రుల విషయమున మనము మిక్కిలి కృతజ్ఞత గలవార మయి వారియెడల మిక్కిలి ప్రేమయు

భక్తియుఁ గలిగి, న్యాయమయినవారి యాజ్ఞల నన్నిటిని శిరసా వహించి చేయవలయును; వారు వృద్ధులయినప్పుడును అశక్తులగునప్పుడును వారికి సమస్తోపచారములను జేయుచు వారిని పోషింపవలయును. ఒకగర్భవాసమునఁ బుట్టి, ఒకకంచమునఁ దిని, ఒకమంచమునఁ బరుండి, ఒకయింటఁ బెరిఁగెడుతమ్ములను అన్నలను చెల్లెండ్రను అక్కలను మిక్కిలి యనురాగముతో గారవించి స్వప్నావస్థయందైనను కలహములు లేక మెలఁగవలయును. అత్తలు, మామలు, పినతండ్రులు, పెదతండ్రులు మొదలయిన బంధువులను ప్రేమతో నాదరించుచు వారి మనసు నొవ్వకుండఁ బ్రవర్తింపవలెను. దూర బంధువులకు సహితము ఆపద వచ్చినప్పుడు మంచిమాటలతోను ధనముతోను చేతనయిన సాహాయ్యమును చేయుచుండవలయును; అట్లు చేయుచున్నచో మన కాపద వచ్చునప్పుడు వారును తగిన సాహాయ్యమును జేయుచుందురు.

చంద్ర—ఇప్పుడు మీరు చెప్పినవారు తప్ప మఱియెవ్వరైనను ముఖ్యబంధువు లున్నారా?

గురు—భార్యయు భర్తయుఁ గలరుగాని వారిని బంధువులని చెప్పుటకంటె దేహములు వేఱయినను వారిద్దఱు నొకరే యని చెప్పుట మిక్కిలి యుక్తముగా నుండును. భార్యభర్తయొక్కయర్థశరీరమని యెల్లమతములవారును జెప్పుదురు. వా రేమియు తమలో భేదము విచారింపక సమస్తకార్యములయందు నొక్కటిగాఁ బ్రవర్తింపవలయును. ఒకకుటుంబమున కిద్దఱుయజమాను లుండిన సాగనేరదు గనుక, భగవంతుఁడు భర్తను యజమానునిగాను భార్యను లోఁబడవలసినదానినిగాను సృజియించియున్నాఁడు. రాజుకంటె ప్రజ నొకవేళ బుద్ధిమంతులైనను రాజునకు లోఁబడి నడుచుకొనుట యెట్లువిధాయకమో

కృత్యమో, అట్లే భార్య యొకవేళ భర్తకంటె బుద్ధిమంతురాలుగాను రూపవంతురాలుగాను విద్యావంతురాలుగాను ఉండుట తటస్థించినను పెనిమిటి కడఁగిదే యుండవలయును. ఒకవేళ పురుషుఁడు కోపశీలుఁడయి యక్రమముగా కొట్టినను తిట్టినను తిరుగఁబడక సహనము కలిగి కూడఁగట్టుకొని రావలయును; తొందరపడి భర్త యొకయక్రమమును జేయుచున్నను కోపము తీరినవెనుక మంచిసమయములో మెల్లఁగా హితబోధచేసి మంచిమార్గమునకు దిప్పఁ బ్రయత్నింపవలయును. బయిట శ్రమ నొంది భర్త యింటికి వచ్చునప్పటికి తలదువ్వుకొని మంచిబట్ట కట్టుకొని శుచిగా సుండి, కావలసినవస్తువులను నందిచ్చి యుపచారము చేసి శ్రమ మాన్పవలయునే కాని, ఇరుగుపొరుగులవారలతోడి కలహకథలను గృహమునందలి సంతాపములను జెప్పుచుండ రాదు; ఇల్లు శుచిగా నుంచి జిహ్వ కింపుగా పాకముచేసి నాథునివలన మెప్పువడయఁ జూచుచుండవలెను. నగలనుగాని విలువబట్టలనుగాని తెమ్మని పీడింపరాదు. స్త్రీల కెప్పుడును సుగుణములే యలంకారములుగానిరత్నభూషణములును సరిగవస్త్రములును నలంకారములుగావు. పదిరూపాయలతో నొకబీదకుటుంబము నెలదినములు సుఖముగా జీవింపవచ్చును; వందలకొలఁదికుటుంబములు సుఖజీవనము చేయుట కుపయోగింపఁ దగినసొమ్మును నిష్ప్రయోజనముగా నొకయబల దేహముమీఁద వేసికొని తిరుగుట యేమి న్యాయము? ఇంటికిఁ గావలసినదానిని గడించి తెచ్చుట పురుషులపని; తెచ్చినదానిని పొదుపుగా వాడుకొనుచు తృణ మయినను వ్యర్థముగా పోకుండా జాగ్రతపెట్టుట స్త్రీలపని. కాబట్టి స్త్రీ దూబరతిండితనము మొదలయినచెడువాడుకలను వదలి మితవ్యయము చేయుచుండవలయును. అతిభోజనమువలన నజీర్ణాదిరోగములు పుట్టునట్లు అతినిద్రవలన మాంద్యము, బలహీనత

7

మొదలయినవి గలిగి దేహదార్ఢ్యము తగ్గిపోవును. సోమరితనమును మాని యింటిపనులను స్వయముగా తీర్చుకొనువారి కిట్టికీడు లేమియు మూడదు. ఇనుమును తుప్పుతిన్నట్టే సోమరితనము మనదేహముల సారమును మ్రింగివేయును. తాను మహారాజుకూతు రయినను పెనిమిటికి పరిచారికయే యగును గనుక, తన కెంతమందిపరిచారికలున్నను మగనికిఁ గావలసినయుపచారములను స్త్రీ స్వయముగానే చేయవలయును. స్త్రీ పురుషుని వశ్యునిఁ జేసికొనుటకుఁగలమందులు యోగ్యమయిననడవడికయు ననువర్తనములేకాని వశ్యౌషధములు కావు; అట్టియౌషధములవలన మగలకు మును పున్నప్రేమకూడ పోవుటయే కాక యొకానొకప్పుడు వానివలన భర్తలకు తీఱనివ్యాధులును సంభవించును; కాఁబట్టి స్త్రీ లెప్పుడును మగలకు మరులుమందులు పెట్టుటకు కలలోను బ్రయత్నింపరాదు. పుట్టినింటివా రెంత ధనికులయియున్నను, యుత్తమస్త్రీ భర్తయింటనే యుండఁగోరునుగాని పెనిమిటి బీదవాఁడని పుట్టినింటికి పోఁగోరదు. స్త్రీకి పుట్టినింట దినుపరమాన్నముకన్న భర్తతోడి గంజియే చాలమేలయినది. స్త్రీ తన యింటిగుట్టెప్పుడును బయలఁబడనీక, మన్నించి పెనిమిటి చెప్పినసంగతులను తనమనసు గలిసినవారితోనైనను జెప్పక మిక్కిలి రహస్యముగా నుంచవలెను. వేయేల? పుణ్యవతియైనస్త్రీ యాలోచన చెప్పునపుడు మంత్రివలెను, పనిచేయునప్పుడు దాసివలెను, ఆపదలయందు మిత్రునివలెను, ఉండి, పెనిమిటి కిష్టమయినరీతిని సమస్తవిషయములయందును బ్రవర్తించుచు, అతనియందు ప్రేమయు భక్తియుఁ గలిగి పూవులో తావివలెఁ గలిసి మెలఁగవలయును. ఈచెప్పిన సుగుణముల నన్నిటిని గలిగి పరపురుషునిపొందు స్వప్నావస్థయందును గోరకుండుస్త్రీ పతివ్రత యనఁబడును. నూఱునోములునోచ్చి...

బోవునన్నట్లు, స్త్రీలు చేసిన పుణ్యకార్యము లన్నియు నొక్క సారి వ్యభిచరించినచో నిష్ఫలముగుటయేకాక పాపహేతువు లగును. స్త్రీలకు వ్యభిచారమును మించిన దోషము మఱియొక్కటిలేదు. కాఁబట్టి పరపురుషు లెంతచక్కనివా రయినను వారిని తృణముగా నెంచి, వారిగాలిసహితము తమమీఁద సోఁకకుండఁ బ్రవర్తింపవలయును. వ్యభిచారమువలనఁ బరలోకహానియేగాక యట్టిస్త్రీ యీలోకమునందును నిందలపాలయి మానప్రాణములను బోఁగొట్టుకొనును. మానవంతుఁడు భార్య మరియేనేరము చేసినను క్షమించునుగాని వ్యభిచారమును జేసినప్పుడుమాత్రము సహించి యూరకుండఁజాలఁడు. కాఁబట్టి స్త్రీ యెల్లవిధముల పాతివ్రత్యభంగము రాకుండ కాపాడుకొనుచు రావలెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

---

విద్యాసముద్రుఁడు తాను చంద్రమతికిఁ జెప్పినవిద్యయంతయు కేవల పుస్తకాధారముననే కాదు. అతఁడు చల్లపాటువేళ తఱుచుగా చంద్రమతిని దేవునియొక్క దివ్యహస్తలిఖిత మయినవిచిత్రవస్తుజాతముతో నిండియున్న యుద్యానవనమునకుఁ గొనిపోయి, అచ్చట నేత్రోత్సవము చేయు ఫలవృక్షములను పూలచెట్లను చెవులపండువుగా మధురరుతములుచేయు కోయిల, చిలుక మొదలయినపక్షులను జూపి, వానిమూలమున భగవంతుని వస్తునిర్మాణకౌశలమునునీతులను మనసునకు నాటునట్టుగా సమయోచితముగా పుస్తకసాహాయ్యమున బోధించుదానికంటె విస్తారముగా బోధించుచుండెను. చంద్రమతి చల్లగాలియందు తిరుగుటవలనను దేహపరిశ్రమము చేయుటవలనను గలుగు సుఖసంతోషములను లెస్సగా తెలిసికొన్నదయి, వేయుమంది

పరిచారిక లున్నను తాను వేసికొన్న పుష్పలతలకును పండ్ల మొక్కల కును తానే చిన్నబిందెతో నీళ్ళు పోయుచు తాను పెంచెడు మల్లె చెట్టున నొకపువ్వుపూచినను దానిమ్మచెట్టున నొకకాయ కాచినను వేయుచోట్లనుండి తనకు గంపెడుపూవులును కాయలును వచ్చినప్పటి కంటె విశేషానందమును పొందుచుండెను. ఒకనాఁడు సాయంకాలము గురువుతోడ వచ్చి చంద్రమతి పూఁలంతోఁటలో విహారము చేయు చుండఁగా ఉద్యానపాలకుఁడు మోటగట్టి తోఁటలోని చెట్లకు నీళ్లు పెట్టుచు మోటగూనను వేగముగా లాగఁజాలనందునకయి యెద్దను చేతిలో నున్న వెదురుకఱ్ఱతో నెత్తురు వచ్చునట్లుగాఁ గొట్టెను. ఆసమ యమున చేరువను సంచరించుచున్న చంద్రమతి వానికౄరకృత్యము నకు మిక్కిలి కోపపడి యింకొకపర్యాయ మాయెద్దు నంతక్రూరముగా కొట్టినయెడల తండ్రిగారితో చెప్పి వానిపని తీసివేయించెద నని బెద రించెను. ఆసమీపముననే యుండి చంద్రమతి కేదయినను నూతనవిష యమును బోధింప నాలోచించు చున్నవిద్యాసముద్రుఁ డది సందు చేసికొని యామెయొద్దకు వచ్చి వనపాలకునిమీఁద నేల కోపపడు చున్నా వని యడిగెను.

చంద్ర—నా కీవఱ కెవ్వరును జెప్పకపోయినను, నిష్కారణ ముగా పశువును గొట్టుట నామనస్సునకు తప్పిదముగా తోఁచి వీని మీఁద కోపపడినాను. మనుష్యేతరజంతువులవిషయ మయి మనము నడుచుకోవలసినధర్మములను జెప్పెదమని యీవరకే మీరు సెల విచ్చి యున్నారు. ఇప్పుడు నాయం దనుగ్రహించి చెప్ప వేఁడెదను.

గురు—పశువులు మొదలగుజంతువులు మన యుపయోగము నిమిత్తమే సృజింపఁబడినను మనయొద్ద నున్నంతకాలమును కడుపు నిండ మేఁత వేసి నీళ్ళుపోసి వానిసంరక్షణము చక్కఁగా విచారించుచు

ప్రేమతో నాదరించు చుండుట మనకు విధియై యున్నది. వానిచేత నెప్పుడును శక్తికి మించినపనిని చేయింపరాదు; జంతువులు ముసలితనముచేతఁగాని, అలసటచేతఁగాని, రోగముచేతఁగాని, ఆహారాదుల లోపముచేతఁగాని తిన్నఁగా పనిచేయలేనప్పుడు వేగముగా నడవలేదని యెక్కువపని చేయలేదని వానిని కొట్టుటకంటె క్రూరకృత్యము మఱియొకటి లేదు. కొందఱు పశులవులకు తామే యగ్రపుత్రు లయినట్టుగా మేఁత పెట్టనిదూడలకుసహితము తిన్నగా పాలు వదలిపెట్టక శ్రేష్ఠభాగమునువలె పాలనన్నిటిని పితుకుకొందురు; తిన్నగా మేఁత పెట్టువఱకును దూడలకుఁ గావలసినపాలను వదలివేసి మిగిలినవానినే పితుకుకొనుట మానుషధర్మము. ఆవు, గేదె, ఎద్దు, మేఁక గుఱ్ఱము కుక్క మొదలయినజంతువులు మన కెంతో యుపయుక్తములుగా నున్నవి. అవి లేకపోయినపక్షమున, మన కిప్పు డున్న సౌఖ్యములో సగ మయినను లేకపోయి యుండును. కొందఱుదుర్మార్గులు కప్పలు, మేకలు మొదలయిన సాధుజంతువులను నిష్కారణముగా హింసించు చుందురు. అట్టివానికి హింస చేయుచున్నచో క్రమక్రమముగా దుష్టచేష్టలు పట్టుపడి, మనుష్యులవిషయమునసహితము క్రూరు లయి యట్టివారు చెడిపోదురు. మనము నిర్లక్ష్యము చేసెడు చిన్నజంతువులనుసహితము మనలను సృజించినయీశ్వరుఁడే సృజించి, మనమీఁద వలెనే వానిమీఁదను ప్రేమ యుంచి కాపాడు చున్నాఁడు. కాఁబట్టి వానిని బాధించుటవలన భగవంతునవిషయమున గొప్పయపరాధమును జేసినవార మగుదుము. అందుచేత జీవకారుణ్యము మనకు విధాయకము లైనముఖ్యధర్మములలో నొకటిగా నున్నది. అయినను మనుష్యులలో దుష్టులను శిక్షించుట ధర్మమయినట్లే జంతువులలో సహితము పాము, తేలు, పులి మొదలగువానిని జంపుట ధర్మముగా

నున్నది. కొందఱు పేలు, నల్లులు, తేళ్ళు మొదలయినవానియందు సహితము దయగలవారయి, వానిని జంపక విడిచిపెట్టుదురు. అట్లు చేయుట సరికాదు. మనకు బాధను గలుగఁజేయు జంతువుల నవశ్యముగా నాశనము చేయవలసినదే. తేళ్ళు మొదలయినవానిని చంపుట దోషము కాకపోయినను, వానిని బాధపెట్టి చంపుటమాత్రము మంచిది కాదు. సాధ్య మయినంతవఱకు బాధపెట్టక శీఘ్రముగా చంపివేయవలెను.

చంద్ర—మీయనుగ్రహామువలన నాకిప్పుడు సమస్తధర్మములును తెలిసినవి. ఏవిషయమున నెట్లు ప్రవర్తింపవలయునో లేశమయినను దెలియక గ్రుడ్డిదానివలె వచ్చిన నాకు జ్ఞానోపదేశమును జేసి నన్ను కన్ను దెఱపి రక్షించినారు. మీఋణము నే నెట్లుతీర్చుకోఁ గలుగుదును?

గురు—నేను జెప్పినప్రకారముగా నడుచుకొనుచు ముందు ప్రతిష్ఠ గాంచుటయే నాఋణము తీర్చుట. కేవల ధర్మశ్రవణమువలన నేమియుఁ బ్రయోజనము లేదు; విన్నవానిని మఱచిపోక యనుష్ఠించుట వలన నిహాపరలోకముల రెంటను సమస్తశ్రేయములును కలుగును. కొందఱు సత్ప్రవర్తనము కలిగి మెలఁగుట యేమో కష్టమని భావింతురు. అలవాటు పడినచో నంత సులభమయినపని మఱియొకటి లేదు. జేనెడుపొట్టకయి మహాసముద్రమునుదాఁటి, యెత్తరానిబరువులెత్తుకొని, ప్రాణముల కాసింపక యుద్ధములుచేసి, కష్టపడువారికి సత్యము, శాంతత, భూతదయ, కలిగిమెలఁగుట యసాధ్యమన్న నెవ్వరయిన నవ్వరా? మనస్సునాయాసపెట్టి క్రొత్తఁగా నొకదానినికల్పించి చెప్పుటకంటె, నాలుకచివరనుండి తనంతటతానే యప్రయత్నముగా వెలువడ సిద్ధముగానుండు సత్యమును పలుకుట కష్టమన్న నెవ్వరు

నమ్ముదురు? లోకములో నెల్లవారికిని సాధువులను ప్రేమించుటయు దుష్టులను ద్వేషించుటయు సహజగుణముగానున్నది. ఇప్పుడుమనము చూచుచున్న వారిమాటయటుండఁగా, ఎప్పటివో యున్నట్టు కథల యందుఁ జెప్పఁబడుయోగ్యులను భూషించుచు, అయోగ్యులను దూషించుచున్నాము. మనకట్టి యభిప్రాయముకలుగుటకు యోగ్యులు మనకుఁజేసిన యుపకారమును లేదు; అయోగ్యులుచేసిన యపకారమును లేదు. లోకులు వారివారిని ప్రేమించుటకును ద్వేషించుటకును వారివారి సుగుణదుర్గుణములే కారణములుగా నుండును. లోకములో మనతనువులు శాశ్వతములు గావు గనుక, బ్రతికియుండిన నాలుగు దినములును న్యాయమార్గమునఁ బ్రవర్తించుచు నీలోకమునఁగీర్తియుఁ బరలోకమునందు శాశ్వతానందమును బొందఁబ్రయత్నింపవలయును.

చంద్ర—మీరు నాకుఁ జేసిన యుపదేశము శిలాక్షరమువలె మనసునందు నాటుకొనియున్నది. దీని నెప్పుడును మఱచిపోక యావజ్జీవమును తమయెడల కృతజ్ఞతగలదాననయి యుక్తముగాఁ బ్రవర్తింపఁ బ్రయత్నించెదను.

ఈసంభాషణ మయినతరువాత గురువును శిష్యురాలును, తోఁటనువిడిచి యింటికి వెళ్ళిరి. ఈప్రకారముగా రెండుమూఁడుసంవత్సరములలో విద్యాసముద్రుఁడు చంద్రమతిని సమస్తవిద్యలయందును పారంగతురాలిని జేసెను. ఈలోపలనే చంద్రమతి ప్రవీణులయిన యితర గురువులయొద్ద సంగీతము మొదలయిన స్త్రీలకుపయుక్తము లగువిద్యల నన్నిటినిగూడ నేర్చుకొనెను.

---

# పదవప్రకరణము



ఉశీనరమహారాజుగా రొకనాఁడు కొమా ర్తెతోడ ఆస్థానమండ పమునకు విజయముచేసి సింహాసనాసీనులై యుండి, విద్యాసముద్రుని రావించి నమస్కారపూర్వకముగా నుచితాసనంబునఁ గూరుచుండ నియోగించి, సకలవిద్వజ్జన సమక్షమున చంద్రమతిని విద్యలయందు పరీక్షచేయ నారంభించిరి. ఆమెయు నడిగినదాని కెల్లఁ జక్కనిసదుత్త రములిచ్చి తనప్రతిభను కానిపించిన, ఆమె విద్యావివేకములకును గురుని బోధనశక్తికిని సభవారందఱు నాశ్చర్యమగ్నమానసు లయిరి. అప్పుడు మహారాజుగారు తమకొమార్తెకు విద్యోపదేశముచేసి నీతి మంతురాలినిగాఁ జేసినందునకై విద్యాసముద్రుని బహువిధముల శ్లాఘించి, ఆయనకెప్పుడును ఎదురుచూడనంత ధనమును అమూల్య వస్త్రములను బహుమానముచేసి యొకయగ్రహారమునిచ్చిరి. రాజు గారి గుణగ్రహణపారీణతకును ఔదార్యవిశేషమునకును విద్యాసము ద్రుఁడు పరమానందభరితుఁడయి యర్హవిధమునఁ దనకృతజ్ఞత సూచించుకొన్నివాక్యములను జెప్పెను. అంతటరాజుగారుసభచాలించి సముచితపరివారముతో నిజాంతఃపురమునకు వెళ్ళిరి. మంత్రిమొదలు గాఁగల సభాసదులును తమతమయిండ్లకుఁ బోయిరి.

అప్పటినుండి చంద్రమతి దినదినక్రమమునఁ దానుజదివినవిద్య నభివృద్ధిచేసి, బుద్ధిబలమునఁ బుస్తకములలోఁ జదివి నేర్చుకొన్నదాని కంటెను బదిరెట్లు జ్ఞానమునుబడసి, ఎట్టువంటికఠినపుస్తకము నయి నను చదివి యర్థముచేయును, ఎట్టువంటి చిక్కులెక్క నైన నాలో చించి సరియైన యుత్తరముచ కనుఁగొనను, చక్కనిమృదుశైలిని పద్యములు పాటలు రచియింపను, ఏరాగమునయిన నాలాపనచేసి

వినువారిమనసులు గరఁగునట్లుగా పాడను, ఏదైన నూతనవిషయమును బుచ్చుకొని యింపుగా నుపన్యాసములుచేయను, సమర్థురా లయ్యెను. ఆమెకుఁగల విద్యావివేకములకు మెఱుఁగుదెచ్చెడి వినయాదిసమస్త సద్గుణములచేతను లోకమునందలి కాంతారత్నములలో నామె యసమానురాలుగా నుండెను. అందుచేత నెల్లచోట్లను చంద్రమతియొక్క సుగుణసంపదను విద్యావిశేషమును జనులెల్లరు వేయినోళ్ళ శ్లాఘించి చెప్పుకొనుచుండిరి. ఆమెకీర్తి క్రమక్రమముగా దూరదేశములయందును సహితము వ్యాపించి యెల్లవారలశ్లాఘనకును పాత్రమగుచుండెను. ఈప్రకారముగానే కోసలదేశాధిపతియయిన త్రిశంకమహారాజు పుత్రుఁడయిన హరిశ్చంద్రునియొక్క కీర్తియు సమస్తదేశములయందు నల్లుకొనెను. ఆసేతుహిమాచలమునుగల దేశములయందాయన ధైర్యశౌర్యాదులును, వినయవివేకాదులును, విద్యాకౌశలమును, జెప్పుకొనివారొకరును లేరు. చంద్రమతి పాఠశాలయందుఁ జదువుకొనుచుండునప్పుడే యాతనిసుగుణసంపదను పలుమాఱు గురువులవలనను తదితరులవలనను వినుచుండి తానతనినే వరియింపవలెనని మనసులోఁ గోరియుండెను. వయసు మీఱినకొలఁదిని, ఆయనసచ్చరిత్రమును శ్రవణానందముగా చెలికత్తెలచే వినుట లభించి యాకోరిక యంతకంతకు బలపడి ననలెత్తుచుండెను. హరిశ్చంద్రుఁడును చంద్రమతియొక్క సద్గుణసమృద్ధినివిని యామెనేవివాహమాడవలయునని దృఢనిశ్చయుఁడై యుండెను. ఇట్లు కొంతకాలముజరిగినతరువాత చంద్రమతి మెల్లగా నొకనాఁడు తనయభిప్రాయమును తల్లివద్ద సూచనగాఁ గనఁబఱిచెను. ఆమెయు కొమార్తె యభిప్రాయమును దెలిసికొని, రహస్యముగా నొకనాఁడు భర్తకు విన్నవింపఁగా నతఁడును తనపుత్రికయొక్కమనస్సు యోగ్యపురుషునిమీఁద పోయినందుకుఁ బరమానందభరితుఁ డయి

యౌవనవతియైయున్న యామెను శీఘ్రముగాఁ దగినవరున కిచ్చి వివాహము చేయుట యత్యావశ్యకార్యమని యెంచి, వెంటనే దృఢవ్రతుఁడను బ్రాహ్మణుని బిలిపించి చెప్పవలయుసంగతుల నెల్లను జెప్పి, తనకూఁతును హరిశ్చంద్రున కియ్యఁదలంపు గలిగియుండుటను త్రిశంకమహారాజున కెఱిఁగింపఁబంపెను. ఆమహారాజును తనపుత్రుఁ డావఱకే చంద్రమతిమీఁద మనసుగలిగియున్న సంగతి నెఱిఁగియున్నవాఁడు గనుక; మాఱుమాటాడక సమ్మతించి దృఢవ్రతునకు బట్టలు కట్టఁబెట్టించి పెండ్లికూఁతును జూచుటకయి మఱియొక బ్రాహ్మణు నాతనివెంట నుశీనరుపాలికిఁ బంపెను. ముహూర్తనిశ్చయ మయినతరువాత చంద్రమతీహరిశ్చంద్రులకు మహావైభవముతో వివాహమహోత్సవము జరగినది. సుగుణశ్రవణమే కారణ మయినను, వారు రూపసంపదచేతఁగూడ సుగుణసంపదకుఁ దీసిపోవువారు కారు. ఆదంపతుల సౌందర్యమును కన్నులకఱవుదీఱ చూచినోచుకొన్నవారందఱును కథలయందుఁ జెప్పుకొనుటేకాని నిజముగా రతీమన్మథులు వీరియంతసౌందర్యము గలవారాయని సంశయపడుచుండిరి. లోకములో నెవ్వరికిఁగాని సుగుణాలంకారమే నిజమయిన యలంకారముగాని యది లేని కేవలవిద్యయు రూపమును భూషణములును నలంకారములు గావు. వివాహదినములు వెళ్ళినతరువాత చంద్రమతికిఁ జెప్పవలయుబుద్ధులు చెప్పి, పుట్టినయింటికిని చొచ్చినయింటికిని కీర్తి తేవలయునని బోధించి, తలిదండ్రు లామెతప్పులుచేసినను దిద్దుకొని బుజ్జగింపవలయునని యల్లునకుఁ జెప్పియొప్పగించి, ఆమెను పతితోడ నయోధ్యాపురమునకుఁ బంపిరి. వారిద్దఱును చదువుకొన్నవారగుటచేతను, సుగుణసంపత్తిగలవారగుటచేతను, ఆదంపతులకుఁ గలిగిన యైకమత్యమును పరస్పరానురాగము నొరు లెవ్వరికిని గలిగినవని చెప్పవల్లకాదు. కొంతకాల మయినతరు

వాత త్రిశంకుఁడు రాజ్యభారము నంతను సమర్థుఁడయిన కొమారుని మీఁదనే పెట్టి తానును భార్యయు తపస్సునకై ఋష్యాశ్రమములకు వెడలిపోయెను. అతఁడు ప్రజలనెల్లను తన కుటుంబములోనివారినిగాఁ జూచుకొనుచు, వారిక్షేమముకొఱకే తనశక్తియంతయు నుపయోగించుచు నేరముచేసినవారిని ద్వేషములేక వారిమేలుకొఱకే బిడ్డలను శిక్షించు తండ్రివలె దండించుచు, ప్రజలను నొప్పించి పన్నుగొనకఁ చోరభయరహితముగా నీతిమంతుఁడై రాజ్యపాలనము చేయుచు, మిక్కిలి ప్రజారంజకుఁ డయ్యెను. చంద్రమతియు విద్యావతి గనుక తెలివిగలదై గృహకృత్యనిర్వహణభారమేమియు పతికి తగులకుండ తానే బహుసమర్థతతో నిర్వహించుచు నిర్హేతుకముగా నెవ్వరికిని నేవిధమైన నొప్పియుఁ గలుగకుండ నందఱిని సమదృష్టితోఁ జూచుచు నుండును. దాసదాసీజనులయందు దామె మిక్కిలి దయ కలదయి పెట్టు పోతలలో లోపమురాకుండ కాపాడుటంజేసి భృత్యవర్గమంతయునామె విషయమై తమప్రాణములైన నిచ్చుటకు సిద్ధముగానుండిరి. అంత కని కరముగలదని యామెయెప్పుడును తప్పుచేసినవారి కుచితదండనము చేయక విడిచిపెట్టదు. ఆమెయొద్ద విద్యాగర్వముగానిధనగర్వముగాని లేశమయినను లేదు. బంధువులయెడలను పెద్దలయెడలను మిక్కిలి యడఁకువగలదయి వారికి మెచ్చుపుట్టునట్టుగానడచుకొనును. స్వప్నావస్థయందును అసత్యము పలుకదు. పరపురుషులను సోదరులనుగాను స్త్రీలను తోఁడబుట్టినపడుచులనుగాను జూచుచుండును. పరు లెంత మంచిస్థితిలోనున్న నంత సంతోషించునేకాని యితరులకలిమి కెన్నఁడును నసూయపడదు. సమస్తజంతువులయందును దయగలిగి మెలఁగును. బీదసాదల కెప్పుడును సాయముచేయ నేయాలోచించుచుండును. తన్నెప్పుడును సన్మార్గమునందే నడుచునట్లు చేయవలయునని త్రికాల

ములయందును భగవంతుని ధ్యానించుచుండును. తీరికయైనప్పుడు వ్యర్థకాలక్షేపముచేయక సద్గ్రంథములను జదువుటయందే కాలమును పుచ్చుచుండును. ఈ ప్రకారముగా కొంతకాలము జరిగినపిమ్మట చంద్రమతికి గర్భోత్పత్తియై చక్కనికొమారుఁడు గలిగెను. పుత్త్రి జననము వలన నాదంపతులకుఁ గలిగిన సంతోషమునకు మేర లేదు. తల్లిదండ్రు లాశిశువునకు లోహితాస్యుఁ డని నామకరణము చేసిరి. చంద్రమతియు హరిశ్చంద్రుఁడును సమస్తైశ్వర్యములతోను తులఁ దూఁగుచు కొంతకాలము సుఖ మనుభవించుచుండిరి.

---

## పదునొకండవ ప్రకరణము

---

మహర్షు లందఱు నొకనాఁడు సభ చేసియుండఁగా, ఎప్పుడును సత్యముదప్పని మహానుభావుఁ డెవ్వఁడయిన లోకములో నున్నాఁడా యని వారిలోవారికి వివాదము సంభవించెను. అప్పుడు వశిష్ఠుఁడు మానవకోటిలోనెల్ల నాడితప్పనివాఁడు హరిశ్చంద్రుఁ డొక్కఁడు కనఁబడుచున్నాఁడని యాతని యోగ్యతను శ్లాఘించెను. ఆమాటలను సహింపక యతని ప్రతిపక్షియగు విశ్వామిత్రుఁడు వివిధమాయోపాయములుపన్ని శత్రువులను వంచించి రాజ్యతంత్రమును నిర్వహించుకోవలసిన రాజులలో సత్యసంధు లుందురనుట పరిహాసాస్పదమనియు, సూర్యవంశపు రాజులకెల్లను బురోహితుఁడవగుటచేత పొగడుచున్నావే కాని హరిశ్చంద్రుని బొంకించుట సులభమేయనియు, వశిష్ఠునిఁ గొన్ని హేళనోక్తులు పలికెను. అందుమీఁద రోషమువచ్చి నీవు వేయేండ్లు తలక్రిందుగా తపస్సుచేసినను హరిశ్చంద్రునిచేత నసత్యమాడింపలేవని వశిష్ఠుఁడును, నిమిషములో నాడించెద నని విశ్వా

మిత్రుఁడును పంతములు పలుకుకొని, ఎవ్వరిమాట గెలుచునో వారికి రెండవవారు తాము చేసినతపస్సు నంతను ధారపోసి లేచిపోవునట్లుగా నందఱిముందఱను పందెములు వేసికొని, తమతమ యాశ్రమములకు వెళ్ళి చేరిరి.

కొన్ని మాసములు గడచిన తరువాత హరిశ్చంద్రుఁ డొక్క యజ్ఞముచేసి భూరిదక్షిణ లిచ్చుచున్నాఁడని విని, విశ్వామిత్రుఁ డయోధ్యకువచ్చి సభామండపమున సుఖాసీనుఁ డయియున్న సమయమున నాతనిని సందర్శించెను. అప్పు డామహర్షిని దూరముననుండి చూచి గొప్పవాఁడు వచ్చుచున్నాఁడని సింహాసనమునుండి దిగి యెదురుగావెళ్ళి యర్ఘ్యపాద్యాదు లిచ్చి తీసికొనివచ్చి, అర్హపీఠముమీఁద కూరుచుండఁబెట్టి కుశలప్రశ్నముచేసెను. విశ్వామిత్రుఁడును కొంతసేపు తగినరీతిని ప్రసంగించి, తాను యజ్ఞము చేయఁబోవుచున్నాఁడ ననియు, అందునకుఁ గావలసినధన మంతయు నిచ్చి యజ్ఞఫలమును పొందవలయుననియు, తనవచ్చినకార్యమును జెప్పెను. రాజును రెండవ మాటాడక యజ్ఞమునకు పట్టుధనమంతయు నిచ్చెదనని వాగ్దానము చేసినతరువాత, విశేషవిత్తమును గోరిపుచ్చుకొని నేను మరలవచ్చి తీసికొనుదాఁక ఆవిత్తమంతయు నీయొద్దనే యుండనిమ్మని చెప్పి యొప్పగించి విశ్వామిత్రుఁడు తనదారిని పోయెను.

అరణ్యప్రాంతములయందలి గ్రామములయందు వసించు కాపులందఱును గుంపులుగూడివచ్చి యొకనాఁడు రాజు నిండుకొలువుండి యుండఁగా తమకు కలుగుచున్న మృగబాధను విన్నవించుకొని, దుష్టమృగములను సంహారముచేసి తమ్మును తమపొలములను వాని యుపద్రవమునుండి రక్షింపవలయునని మొఱపెట్టుకొనిరి. ఆమొఱ్ఱ యాలకించి రాజు వారి కభయహస్తమిచ్చి పంపివేసి, వలలుబోనులు మొద

లగు సాధనములతో కుక్కలను తోడుకొనిరమ్మని వేటకాండ్ర కాజ్ఞ యిచ్చి, వినోదమును జూచుటకయి భార్యను కొమారుని వెంటఁబెట్టుకొని వేఁటకయి తానుగూడ బయలుదేరెను.

అట్లు మృగయావిహారార్థియై యరణ్యమునకు వెళ్ళి యారాజు పులులు, అడవిపందులు మొదలయిన ఘాతుకమృగములను గొన్నిఁటిని వేఁటాడి నానావిధ దుష్టమృగములను కుప్పలుగాఁగూల్చిన వేఁటకాండ్రకు బహుమానము లిచ్చి పంపివేసి, సముచిత పరివారముతోఁ గదలిపోయి, ఒకవిశాలస్థలమున పటమందిరము వేయించి మిక్కిలి వనగమనముచేత నలసియున్నవాఁడు గనుక, ఆపూఁటకందు విశ్రమించి భార్యతో సుఖము ననుభవించుచుండెను. భార్య యోగ్యురాలయిన పక్షమున భర్తకు మహారణ్యమయినను దివ్యభవనముగానుండుటయు, అయోగ్యురాలైనయెడల సుందరమందిరమైనను పెద్దయడవివలెనుండుటయు, సహజమేకదా? ఇట్లు హరిశ్చంద్రుఁడు భార్యతో వినోదముగా బహువిషయములు ముచ్చటించుచుండఁగా, లోహితాస్యుఁడు సమీపమున నాడుకొనుచు కొంచెము దూరమున గంతులువేయుచున్న లేడిపిల్లనుజూచి దానిని తనకుఁ దెచ్చియిమ్మని తండ్రి నడిగెను. అతఁడు వెంటనేలేచి లేడిపిల్లను ప్రాణముతోనే పట్టుకొని తెచ్చి కొడుకున కీయవలయు నను నభిప్రాయముతో విల్లును బాణమునుధరించి దానిని వెంబడించెను. అదియు బెదరి మహావేగముతోపాఱి యాతని బహుదూరము గొనిపోయి తుదకు విశ్వామిత్రుని తపోవనములో దూఱఁబోఁగా విసిగి రాజు వింటబాణమును సంధించి దానిమీఁద విడిచెను గాని యది దెబ్బతప్పించుకొని యదృశ్యమయ్యెను. రాజును మృగము వెంబడి నెండలోఁ బరుగెత్తి కడుబడలి దప్పిగొని యాసమీపమున నున్న తటాకములో నీరుద్రాగివచ్చి చెట్టుపుగట్టుమీఁదనున్న మఱ్ఱి

నీడను గూరుచుండెను. అంతలో మంత్రియైన సత్యకీర్తియు చంద్రమతియు లోహితాస్యునితో సపరివారులయి యచ్చటికివచ్చి చేరిరి.

రాజు వచ్చి యచ్చట దిగియున్నాఁ డన్నసంగతి విని విశ్వామిత్రుని వనపాలకురాం డ్రయిన యిద్దఱు మాలజవ్వనులు తామాతని నేమయిన నడిగి తెచ్చుకోవలెనని తంబురలు పట్టుకొనివచ్చి, తమ సామర్థ్యము నంతనుజూపి శ్రావ్యముగా పాడఁదొడఁగిరి. వారిపాట యాహ్లాదకరముగా నున్నందున రాజు వారిచేతఁ గొంతసేపు సంగీతము పాడించి తగిన బహుమానమునిచ్చి పొండని యానతిచ్చెను. ఆపడుచులు రాజుయొక్క దివ్యసుందరవిగ్రహమును చూచినకొలఁదిని కామపరవశురాండ్రై దేహములు తెలియక యుచితానుచితవివేకముపోగొట్టుకొని, రా జియ్యఁబంచినధనము పుచ్చుకోక, ఆయన సంభోగము మీఁదతప్ప తమకు మఱియొకదానిమీఁద కోరికలేదనియు తమయభిమతమును దీర్చి రక్షింపవలయుననియు, సంశయపడక యడిగిరి. అట్టి యక్రమ మయినకోరికను కోరినందున రాజునకు వారిమీఁద నాగ్రహమువచ్చి కోపదృష్టితోఁ జూచుచు తత్క్షణము తన యెదుటినుండి లేచిపొం డని వారి నదలించి పలికెను. ఆచండాలాంగన లంతటితోఁ బోక తమప్రార్థన చెల్లించినంగాని యచ్చటినుండి కదలమని మూర్ఖపుపట్టు పట్టిరి. అందుమీఁద రాజు కోపమాపుకోలేక మండిపడి తుచ్ఛురాం డ్రయినయీమాలపడుచులను కొట్టి సాగనంపుఁ డని భటుల నాజ్ఞాపించెను. వారు వెంటనే తమ స్వామియాజ్ఞను శిరసావహించి యామాతంగకామినులను సమ్మెటలతో మొత్తఁగా, కారుణ్యాంతరంగురా లయినచంద్రమతి మంచిమాటలతో భర్తకోపమును శాంతపఱిచి యాతరుణులను విడిపించి పంపివేసెను. ఆగోసంగికన్నియలును కన్నీరు కాలువలుగట్ట కొప్పులువీడి వీపులమీఁదఁ జీరాడ పెద్దపెట్టున

రోదనముచేయుచు విశ్వామిత్రాశ్రమమువంక నడిచిరి. రాజును వారిని తొందరపడి కొట్టించినందునకై పశ్చాత్తాపముగలవాఁడయి చింతించుచు భార్యయొక్క హితవచనములచేత కలఁక తీఱియుండెను.

---

## పండ్రెండవ ప్రకరణము

---

ఆప్రకారముగా మాలెతలు వెళ్ళి విశ్వామిత్రాశ్రమమును బ్రవేశించి చల్లపాయున వనములో సంచరించుచున్న విశ్వామిత్రుని ముందఱ సాష్టాంగపడి, తమకు హరిశ్చంద్రుఁడు చేసిన యవమానమును దైన్యముతో విన్నవించి గోలుగోలున నేడ్చిరి. అతఁడు వారి యార్తనాదమును విని మండిపడి తోకత్రొక్కిన త్రాఁచువలె లేచి తత్క్షణమే శిష్యగణముతోఁ గూడ బయలుదేఱి క్రోధపాదుగునను పరుషోక్తులు పలుకుచు హరిశ్చంద్రుఁ డున్న ప్రదేశమువంక నడచెను. హరిశ్చంద్రుఁ డామహర్షిని దూరమునుండి చూచి భార్యయుతానును లేచి యెదురుగా వెళ్ళి నమస్కరింపఁగా విశ్వామిత్రుఁడతని నమస్కారమును గైకొనక కన్నుల నిప్పులు రాలఁ జూచుచు నిట్లనియెను.

విశ్వా—ఓరీ నృపాధమా! పూర్వ మెప్పు డయిన రాజులు వేఁటకు వచ్చెడువారు కారా? వా రెన్నఁడయిన నీవలె ఋష్యాశ్రమములకు పీడ కలిగించి యెఱుఁగుదురా? వేఁటాడవలె నన్న నీకు ఘోరారణ్యములు లేకపోయినవా? ఈప్రకారముగా నీవు తపోవనములు ప్రవేశించి యాశ్రమమృగములకు నిష్కారణముగా బాధ కలిగించుచు మాయెడ మహాపరాధమును జేసినవాఁడ వైతివి. అంతే కాక మేము కన్నబిడ్డలవలెఁ జూచుకొనుచున్న మాయుద్యానవన

పాలకుఁ రాంద్రడను నీవేమో యోగ్యుఁడ వని వేఁడవచ్చిన తప్పిదమున
కయి నిష్కరుణుఁడవై కొట్టించి ఘోరపాతకమున కొడిగట్టుకొంటివి.
ఇట్టి నిన్నేమిచేసినను పాపమురాదు.

హరి—స్వామీ! ఎఱిఁగియో యెఱుఁగకయో నేను మీయెడ
మహాపరాధముచేసి మీయాగ్రహమునకు పాత్రుఁడనైతిని. అట్లు
య్యును శరణాగతరక్షకు లగు మీయడుఁగు జొచ్చి కావ వేఁడు
చున్నాఁడను. పాల ముంచినను నీట ముంచినను దేవరవారిదే
భారము.

విశ్వా—నిజమయిన యనుతాపము గలవాఁడ వయి నీవు
మహాదీనత్వముతో వేఁడుచున్నావు గనుక, నీవుచేసిన దారుణకర్మ
మునకు నిన్ను క్షమించినారము. ఇఁకను నీవు మాబుద్ధి విని మాకు
పుత్రికాప్రాయులైన యిద్దఱు కన్నియలను వివాహము కమ్ము.

హరి—నాకుఁగల రాజ్యసంపదలను సర్వము నిమ్మన్ననుఇచ్చె
ద గాని, అగ్నిసాక్షికముగా పరిణయమయిన ధర్మపత్నియుండఁగా
ధర్మమార్గము నవలంబించి చండాలస్త్రీలను వరియింపఁజాలను.

విశ్వా—అట్లయినచో నీ వాడితప్పనివాఁడవు గనుక నీరాజ్య
మును ధనమును మాపాలుచేసి కట్టుబట్టలతో నీవును భార్యయు లేచి
'ండు.

అని విశ్వామిత్రుఁడు పలికినంతట హరిశ్చంద్రుఁడు భార్య యే
మనునో యని యామెవంక చూడఁగా, చంద్రమతి భర్తవంక తిరిగి
త్యము తప్పి యపకీర్తిపొందుటకన్న సమస్తరాజ్యమును మానికి
రపోయుటయే దనకు పరమసమ్మత మని భర్తయొక్క యభిప్రా
మున కనుగుణముగా ప్రోత్సాహవాక్యము పలికెను. తోడనే
జు తన సర్వధనమును రాజ్యమును విశ్వామిత్రునకు ధారాపూర్వ

కముగా దానముచేసి, తరువాత, రాజధానికి వచ్చి జరిగిన యావద్వృత్తాంతమును మంత్రులకుఁ జెప్పి మీరికముందు విశ్వామిత్రుని గొలిచియుండుఁ డని యాజ్ఞ యిచ్చి, పౌరులు మూఁకలయి వచ్చి సంగతివిని దుఃఖించుచు మమ్మెవ్వరి కొప్పగించిపోయెద రని వెంటఁ బడఁగా వారి నోదార్చి వెనుకకుమరలిపొం డని చెప్పుచు, భార్యయు పుత్రుఁడును తోడ నడవఁగా కట్టుబట్టలతో వెడలిపోవుచుండెను. ఇంతలో విశ్వామిత్రుఁడు శిష్యులచేత హరిశ్చంద్రుని మరలఁ బిలిపించి యజ్ఞమునిమిత్తము తాను పూర్వ మడిగి పుచ్చుకొని దాచఁబెట్టిన ధనమును కూడనిచ్చి మఱి కదలుమని నిర్బంధపెట్టెను. ముప్పది దినములు గడువిచ్చినపక్షమునఁ దెచ్చి యిచ్చెదనని రాజు ప్రార్థింపఁగా అతఁ డందున కొప్పుకొని పరమధూర్తాగ్రగణ్యుఁ డైన నక్షత్రకుఁ డను శిష్యుని బిలిచి యీతఁడు గడువులోపల సొమ్మిచ్చువఱకును వీరితోఁగూడ నుండి నీబత్తెముతోడఁ గూడ మావిత్తమును పదిలముగాఁ దీసికొనిరమ్మని యొప్పగించి రాజును బంపివేసెను.

హరిశ్చంద్రుఁడు కాశీపట్టణమునకు వెళ్ళవలె నని భార్యాపుత్త్రులతో బయలుదేఱి యరణ్యమార్గమున నడుచుచుండఁగా నడుమ నడుమ లేనిబడలిక తెచ్చుకొని నక్షత్రకుఁడు తనకాళ్ళు నొచ్చిన వనియు నాలుక యెండిపోవుచున్న దనియు బహువిధముల వారిని దూషించుచు కాళ్ళు పట్టవలసిన దనియు మంచినీరు తెచ్చి యియ్యవలసిన దనియు బాధపెట్టుచుండును. ఆదంపతు లతఁడుపెట్టిన పాట్లకెల్లను లోఁబడి తమకష్టమున కైన నోర్చుకొని యతనికి సమస్తోపచారములును చేయుచుందురు. ఈప్రకారముగా బహుప్రయాసముతో నడచి వారు సాయంసమయమునకు "శేతాళవటము" అనఁబడు నొక గొప్ప మఱ్ఱిచెట్టుకడకుఁ జేరి యారాత్రి యచ్చట విశ్రమింపఁ

దలఁచికొని మునికుమారునకు చిగురాకులతో మెత్తనిపాన్పు నమర్చి తామాసమీపమున కటికినేలను బట్టలు పఱచుకొని శయనించిరి. మిక్కిలి బడలియున్నవారు గనుక చంద్రమతియు నక్షత్రకుఁడును వెంటనే నిద్రపోయిరి; హరిశ్చంద్రుఁడు మనస్తాపముచేత నిద్రపట్టక చీఁకటిపడ్డందున కత్తినిబట్టుకొని వారికి కావలి కాచుచుండెను. ఆచుట్టుపట్ల నివసించు దొంగలలో నొకఁడు వారిని జూచి మఱ్ఱిచెట్టు క్రింద మార్గస్థులు పరున్నారని తనవారితోఁ జెప్పఁగా వారందఱును గుంపుగూడివచ్చి దోఁచుకోవలె నని ప్రయత్నించిరి. హరిశ్చంద్రుఁ డాదారిదోపుడుకాండ్రను దూరమునుండి చూచి వారియుద్దేశము నూహించి వారిమీఁదపడి ధైర్యముతో పోరాడి కొందఱిని చంపియు కొందఱిని గాయపఱిచియు వారినందఱిని పాఱఁదోలెను. అంత కొంతసేపటికి మేఘములు కారుక్రమ్ముకొని యుఱుములతోను మెఱుములతోను కుండలతో దిమ్మరించినట్లుగొప్పవర్షము కురిసెను. ఆవాన కులికిపడిలేచి వణఁకుచున్న నక్షత్రకుని భయముతీర్చి యతనిని చెట్టుమొదటికిఁ జేర్చి, తమబట్టల నాతనికిఁగప్పి తడియకుండఁ జేసి యావధూవరులు కొమారుని నొకరు విడిచి యొకరెత్తుకొనుచు వానలో నిలుచుండి తెల్లవాఱినదాఁక మిక్కిలి శ్రమపడిరి. మఱియొక నాఁడు ప్రయాణమయి సగముదూరము వచ్చునప్పటికి త్రోవలో కూలఁబడి తానిఁక నడవలే నని యు మిక్కిలి దాహ మగుచున్న దనియు నక్షత్రకుఁడు బండతనముచేసి కూరుచుండెను. ఆరాజదంపతులు తమకుమారుని క్రిందదింపి నడిపించుచు మెల్లఁగా నాబ్రహ్మచారి నెత్తుకొని తీసికొనివచ్చి చల్లనినీడ గలయొక మఱ్ఱిచెట్టుక్రింద కూరుచుండఁ బెట్టిరి. అప్పుడు చంద్రమతి తన పయింటచెఱఁగుతో నక్షత్రకునికి విసరుచు శ్రమతీర్చుచుండఁగాఁ హరిశ్చంద్రుఁడు మంచి

నీళ్ళను తెచ్చుటకయి దూరముగా వెళ్ళెను. పిమ్మట నక్షత్రకుఁడు లేచి కూరుచుండి యీప్రకారముగా ప్రసంగమున కారంభించెను.

నక్ష—అమ్మా! నీ వాగర్భశ్రీమంతు లయిన తల్లిదండ్రుల కడుపునఁ బుట్టితివి. చిన్నప్పటినుండియు నిత్యమును పలువురు పరిచారికలు పనులుచేయ కష్టమెట్టిదో యెఱుఁగక బ్రతికితివి. అట్టినీకీయు నను జేసికొని యిట్టి యడవులలో బహుకష్టము లనుభవింపవలసి వచ్చినది.

చంద్ర—ఓ వెఱ్ఱివాఁడా! పెనిమిటితోఁగూడ నున్నందున నా కివియేవియు కష్టములు గావు. మహారాజుకూఁతురైనను భార్య భర్తకు పరిచారికయే. రాజ్యముఁ బోఁగొట్టుకొని యడవులలో తిరుగు చుండుటఁబట్టియే నాకు స్వయముగా పతికి శుశ్రూష చేయుచుండుటకును లభించినది. ఎన్నికష్టములకైనను నోర్చుకొని నీతి తప్పక ప్రవర్తించెడి భర్తదొరకుటంబట్టి లోకములోని స్త్రీలలో నన్నుమించిన ధన్యురాం డ్రెవ్వరును లేరు.

నక్ష—అమ్మా! నీవు నావిషయ మయి పడుచున్నశ్రమకు నా కెంతయు మెచ్చుపుట్టినది. నామాట విని నీవును కొమారుఁడును నావెంట నయోధ్యకు రండు. నేను విశ్వామిత్రునితోఁ జెప్పి నీ కొమారునకు పట్టాభిషేకము చేయించెదను.

చంద్ర—నాకు భర్తతోడిద లోకము. భర్త యెక్కడ నుండునో నా కక్కడనే సమస్తమును గలుగును. భర్త నెడఁబాసి యున్నచో నాకు దివ్యమందిరములు మహారణ్యములుగా నుండును ఇప్పుడు చెప్పినఁ జెప్పితివిగాని యిఁకముం దెప్పుడును నీవు నాతో నిటువంటిమాటలు చెప్పఁబోకు.

అనుచుండఁగా హరిశ్చంద్రుఁడు మధూదకమును తీసికొని వచ్చి నక్షత్రకునికి త్రాగనిచ్చెను. ఇంతలో దవానలము నలుదిక్కుల వ్యాపించి యాకాశమంటు మంటలతో వా రున్నదిక్కున నరణ్యమంతయు కాలుచుండెను. హరిశ్చంద్రుఁ డేదిక్కునకుఁ బోవుటకును, ఏమి చేయుటకును తోఁచక తొందరపడుచుండెను. అంతట చంద్రమతి భర్తకడకు వచ్చి, "మీరు నాకొఱకు కనిపెట్టుకొని యుండక ముందుగా నీబ్రాహ్మణకుమారు నావలికి దాటించి ప్రాణరక్షణమును గావింపఁ బ్రయత్నింపుఁడు; చేత నయినచో లోహితాస్యునిగూడ రక్షింపుఁడు. నాకాయువుండి మీసేవచేయుభాగ్య మున్నచో వెనుక నేనువచ్చి మిమ్ముఁ గలిసికొనెదను. లేదా, యీయగ్నిహోత్రుని కాహారమునై పుణ్యలోకమును బొందెదను" అని చెప్పఁగా హరిశ్చంద్రునకు దుఃఖము వచ్చి, కాలిలో ముల్లుగ్రుచ్చుకొని తిన్నగానడవ లేకున్న భార్యను వదలిపెట్టి వెళ్ళుటకు మనసురాక విచారించుచుండెను. ఇంతలో దైవవశముచేత గాలి మఱియొకవైపునకు తిరిగినందున, మంట వా రున్నచోటినుండి దూరముగాపోయి యడవి యాప్రక్కను కాలు చుండెను. ఇట్లు బహుకష్టములు పడుచు నిత్యప్రయాణములు చేసి వారు పదిదినములలో కాశికాపురము ప్రవేశించిరి.

---

## పదుమూడవ ప్రకరణము

---

హరిశ్చంద్రుఁడు కాశికాపురమును చేరినతరువాత కొన్నిదినములు నిత్యమును మణికర్ణికాదిఘట్టములయందు గంగాస్నానము చేయుచు, విశ్వేశ్వరుని భజించుచు, ఇతరమహాస్థలములనుసేవించుచు

కాలము గడుపుచుండెను. అక్కడ విశ్వామిత్రుఁడును, రాజ్యమును పూర్వపుమంత్రులయందే యుంచి, ప్రజలను న్యాయముగా పరిపాలనముచేయ నియమించి, తాను మాఱువేషముతో హరిశ్చంద్రుని చర్యలు కనిపెట్టుచు నతనివెంబడినే యుండి,సమయమయినప్పుడెల్లను రహస్యముగా శిష్యునకు కర్తవ్యము నుపదేశించుచు, బహువిధ మాయోపాయములు పన్ని యేలాగునైనను రాజును బొంకింపవలెననునుద్దేశముతో కాశీపట్టణమునందే ప్రవేశించి యుండి ప్రచ్ఛన్నముగా మెలఁగుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు నక్షత్రకుఁడు హరిశ్చంద్రునిజూచి "ఓ రాజా! నేటి కొకటి రెండుదినములు తప్ప నీవు పెట్టిననెలదినములగడువును వెళ్ళిపోవచ్చినది. ఈవఱకు నీవుమాకొక్క రూకయిన నిచ్చినపాపమునఁ బోవలేదు. నేను ధనము నియ్యలేనని నీవు మొదటనే చెప్పినపక్షమున, నే నింతకాలము తపస్సంధ్యాద్యనుష్ఠానములు మానుకొని నీతోఁగూడ చెట్లు పుట్టలు పట్టుకొని తిరిగి యాయాసపడుచు వ్యర్థకాలక్షేపము చేయనుగదా? ఇప్పుడయినను నేను ధన మియ్యఁదలఁచుకోలేదు పొమ్మని బొంకినం బోయెదను. ఇఁక నేను నీముందఱ మోమోటపడి గట్టిగా నడుగకయూరకున్నచో మహానుభావు లగు మాగురువులకోపమునకు పాత్రుఁడను కావలసివచ్చును. భార్యనో బిడ్డనో తెగనమ్మి వేగిరము మాధనము మాకిచ్చివేసి మమ్ముఁబంపివేయుము" అని మఱియు బహువిధము లయిననిష్ఠురాలాపములు బలికెను. హరిశ్చంద్రుఁడేమియు నాలోచన పాలుపోక నివ్వెఱఁగంది మాఱుమాటాడక క్రిందు చూచుచు తల వంచుకొని యాతనిపరుషవాక్యము లన్నిటికిని తలయొగ్గి యూరకుండెను. అప్పుడు చంద్రమతి భర్తకు ధైర్యము చెప్పుచు మృదువాక్యములతో నిట్లనియెను.

చంద్ర—ఓప్రాణవల్లభా! మీధనము నైన నే నుండఁగా మీ రీప్రకారముగా ఋణము తీర్చలే మని విచారపడనేల? నన్నెవ్వరికైనను విక్రయించి యాధనముతో ఋణవిముక్తులరయి సత్యము నిలిపి శాశ్వతకీర్తిని పొందుఁడు.

హరి—ఓ మనోనాయికా! ఈప్రకారముగా ములుకులవంటి కఱకుమాటలు నా చెవులలో నాటించి మనస్తాపము గలిగించుట నీకు ధర్మమా? ఎంత కఠినచిత్తుఁ డయినను సమస్తకష్టములనుపడి భార్యను సంరక్షింపవలసినదానికి మాఱుగా స్వప్రయోజనపరుఁడై మీఁది మిక్కిలి భార్య నమ్ముకొనుట కొడఁబడనేర్చునా? అప్పు తీర్పఁగల యుపాయము దొరకకయే చింతపడుచున్న నామనస్సున కిటువంటి యనుచితవాక్యములు పలికి మఱింతచింత కలుగఁజేయకుము.

చంద్ర—నాప్రాణనాయకా! నీపాదములాన! నామాట కాటంకము చెప్పక నాప్రార్థన నంగీకరింపవలయును. సమయము వచ్చినప్పుడు భర్త కక్కఱకురాదేని, అట్టిభార్యతోడి ప్రయోజన మేమి? మీరు కోరకుండ నాయంత నేనే మనఃపూర్తిగా దాసినిగా నమ్ముడుపోయి మిమ్ము ఋణవిముక్తులనుగాఁ జేయ నొప్పుకొను చున్నాను గనుక మీ రెంతమాత్రమును సంకోచపడవలసినపని లేదు. సాధనాంతరము లేనప్పుడు మీకసత్యదోషమును కలిగించి సుఖపడుట కంటె దాసినిగా నుండియైన మీసత్యమును నిలుపఁగలుగుటయే నాకు పరమసమ్మతము.

అని బహువిధముల నొక్కిచెప్పఁగా, హరిశ్చంద్రుఁడు చిట్టచివరకు భార్యయొక్కనిర్బంధమును మానుపుకోలేక భార్య నెవ్వరికైన దాసినిగా విక్రయించుట కొప్పుకొని "మీకు దాసి కావలెనా? మీకు దాసి కావలెనా?" అని యూరిలో పేరుగలవారి నందఱిని పోయి

యడుగుచువచ్చెను. కొందఱు మా కక్కర లేదనియు, కొంద ఱడిగి నంత మొత్తము నియ్యఁజాలమనియుఁ జెప్పియెవ్వరును కొనకపోయిరి. ఇట్లు పలువుర నడిగి విసిగి మరలు చుండఁగా కాలకౌశికుఁ డను బ్రాహ్మణుఁ డొకఁ డగపడెను. అతఁడు గ్రామపురోహితుఁడు; లుబ్ధాగ్రేసరచక్రవర్తి; ఎక్కువవడ్డికి బదు లిచ్చి నిర్దయుఁ డయి యిండ్లను వాకిండ్లను అమ్మించి సొమ్ము రాఁబట్టుకొను చుండును. అతనికి కలహకంటకి యని యొకభార్య కలదు; లోకములోని స్త్రీలలో నెక్కడను అంత గయ్యాళిది యీవఱకు పుట్టినవారిలోను ముందు పుట్టఁబోవువారిలోనుకూడ కనఁబడదు; పనిపాటులు లేక యింట తిని కూరుచుండి మగనిని తిట్టుచుచుండును. అతఁ డెవ్వరిని దాసినిగాఁ దెచ్చినను నిమిషములో పోట్లాడి వెడలఁగొట్టుచుండును గనుక, మగఁడే భార్యకు నికృష్టపరిచారకుఁడుగా నుండెను. ఇట్లు హరిశ్చంద్రుఁడు భార్య నమ్మఁజూపఁగా కాలకౌశికుఁడు సంతోషించి ధన మిచ్చికొన్న పక్షమున నామె తన భార్య పెట్టిన పాట్లకెల్లను లోఁబడియుండునుగదా యని హరిశ్చంద్రుఁ డడిగిన మొత్తమునిచ్చి చంద్రమతిని దాసినిగాఁ గొనెను. మరల ధనము నిచ్చివేసి తనభార్యను తీసికొనిపోవు పద్ధతి మీఁద, హరిశ్చంద్రుఁడు కన్నుల నీరు పెట్టుకొనుచు భార్య నాబ్రాహ్మణున కమ్మివేసెను. ఆబ్రాహ్మణాధముఁడును తాను యాచించి తెచ్చుకొన్న మూటలను చంద్రమతిచేత మోపించుకొని తనయింటి వంక నడచెను. చంద్రమతియు భర్త నెడబాయవలసివచ్చెనుఁ గదా యని కన్నీరు కాలువలుగట్ట రోదనముచేయుచు భర్తను సత్యసంధుని గానే చేయవలయుననియు శీఘ్రకాలములోనే తనకు మరల నతని పాదసేవ చేయుభాగ్యముగు లభింపఁజేయవలయుననియు పరమేశ్వరుని ప్రార్థించుచు బ్రాహ్మణునితో నడవసాగెను. ఒండొరుల నెడఁ

బాయుటచేత నాదంపతుల కిరువురకును నిజమయిన దుఃఖము నాఁటి నుండియు ప్రారంభ మయినది.

ఈప్రకారముగా భార్యనమ్మి సంపాదించినసొమ్ము చేతిలోఁ బోయఁగానే నక్షత్రకుఁడాసొమ్ము తనబత్తెమునకును ఋణములో కొంతభాగమునకును మాత్రమే సరిపోయిన దనియు, తక్కినవి త్తపు మొత్తమునుగూడ నేలాగునైన సంపాదించి యియ్యవలసిన దనియు నిర్బంధపెట్ట నారంభించెను. హరిశ్చంద్రుఁడు తన కింక నుపాయ మేమియు తోఁచక తన్నుఁ దీసికొనిపోయి యమ్ముకొని ఋణశేషమును తీర్చుకొమ్మని యామూర్తబ్రహ్మచారిపాలఁ బడెను. నక్షత్రకుఁడును మంచి దని యొప్పుకొని యారాజచంద్రుని తనవెంటఁ గొనిపోయి వీధులవెంబడిని త్రిప్పి యెల్లవారికిని విక్రయింపఁ జూపుచు నెక్కడను బేరము కుదురనీయక తుదకు వీరబాహుఁ డనువొక చండాలునొద్ద గొప్పమొత్తమును పుచ్చుకొని వానికి భటునిగా నమ్మి వేసెను. వీరబాహుఁడు సొమ్మిచ్చుటకుముందు "నే నింతసొ మ్మిచ్చి కొన్నపక్షమున నితఁ డొకవేళ ఏరాత్రియైనఁ జెప్పకుండ న న్నేమ ఱించి పాఱిపోవునేమో నానొమ్మున కెవ్వరు పూటపడియెద'! రని యడిగెను. హరిశ్చంద్రుఁడు సత్యమును పరిపాలించుకొరకే యిట్టి కష్టముల కెల్లను లోఁబడుచున్నాఁడనియు; అతఁ డొరుల నెప్పుడును మోసము చేయువాఁడు కాఁడనియు, నక్షత్రకుఁ డాతనిచరిత్రమును నమ్మకము పుట్టునట్టుగా మొదటినుండియు వీరబాహునితోఁ జెప్పెను. హరిశ్చంద్రుఁడును తా నన్నమాట తప్పక యెంతటియాపదలు వచ్చి నను సహించి యాతనిని గొలిచియుండెద నని బాసచేసి చెప్పెను. అప్పు డామాలవానికి సహితము హరిశ్చంద్రునియెడలకొంతకనికరము

గలిగి, ఆబ్రాహ్మణుఁ డడిగినసొమ్ము నిచ్చి కొని యాతఁ డెప్పుడయిన తానిచ్చిన ధనమును తనకు మరల నిచ్చుకోఁ గలిగినయెడల వెంటనే యతనిని దాస్యబంధమునుండి విముక్తుని జేసెద నని వాగ్దానము చేసెను. నక్షత్రకుఁడు సొమ్మునంతను పుచ్చుకొని విశ్వామిత్రుని ఋణమును తనబత్తెమును ముట్టిన వని చెప్పి, వారినిరువుర నాశీర్వదించి తనదారిని పోయెను.

## పదునాల్గవ ప్రకరణము

అట్లు నక్షత్రకుఁడు వెళ్ళినతరువాత వీరబాహువు హరిశ్చంద్రుని తనతోఁ దీసికొనిపోయి, తానాపట్టణములో స్మశానవాటిక కధికారిననియు, అక్కడ శవములను దహనముచేయువా రందఱును తన కొకమాడ రుసు మిచ్చి తనయాజ్ఞ పుచ్చుకొన్న తరువాతనే యాపనిని చేయవలయు ననియుఁ జెప్పి, అతనికి వీరదాసనునట్లు పేరుపెట్టి తనకు మాఱుగా దవారాత్రము లందుండి పన్ను గ్రహించుచుండునట్లు నియమించి నిత్యమును తిండికిఁ గావలసిన గింజలనుకొలిచి యిచ్చుచుండెను. హరిశ్చంద్రుఁడును రుద్రభూమియందే యొకగుడిసె వేసికొని కాపురముండి, తన యజమానుఁడిచ్చిన బియ్యమును స్వయముగానే పాకము చేసికొని భుజియించుచు రాత్రింబగళ్ళు స్వామిభక్తి కలవాఁడయి యచ్చటనే కనిపెట్టుకొని యుండి స్వకృత్యమును శక్తివంచనలేక చక్కఁగా నిర్వహించుచుండెను.

అంత నక్కడ చంద్రమతియును హంసనారి యనుపేరున బ్రాహ్మణునియింట నుండి, అతనిభార్య నియమించు నీచపుపనుల

నెల్లఁ జేయుచు, తిన్నఁగా తిండిపెట్టకపోయినను బట్ట యియ్యకపోయినను పరులెవ్వరితోను జెప్పక, ఆబ్రాహ్మణదంపతు లెన్ని కాఱులు మాటలాడినను పడుచు, భయభక్తులు గలిగి వర్తించుచుండెను. బ్రాహ్మణుఁడు లేశ మయినను దయ లేనివాఁడయి లోహితాస్యునొక్కనిని పండ్లు సమిధలు మొదలయినవి తెచ్చుటకయి యెండ యనక వా నసక యడవికి పంపుచుండెను. ఈప్రకారము నారాజకుమారుఁ డొకనాఁడు కొందఱుబ్రాహ్మణకుమారులతోడఁగూడ యరణ్యమునకు వెళ్ళి, పుట్ట యెక్కి యొకమఱ్ఱిచెట్టుయొక్క వాలుడుకొమ్మనుండి యాకులు కోయుచుండఁగా, వల్మీకములోనుండి యొక నల్లత్రాఁచు పయికివచ్చి యారాచకొమారునికాలు గఱిచెను. వెంటనే లోహితాస్యుఁడు "హా! మాతా!" అని కేక వేసి నోర నురుఁగులు గ్రక్కుచు భూమిమీఁద పడి మూర్ఛబోయెను. ఆ బ్రాహ్మణబాలకు లది చూచి భయపడి తత్క్షణమే పరుగెత్తుకొనివచ్చి యేడ్చుచు తల్లి కాసంగతిని జెప్పిరి. వాఁడుకప్రకారముగా కొడుకు వేళ కింటికి రానందున కే విచారపడుచున్న చంద్రమతి పిడుగువంటి యీ చెడువార్తను విని మూర్ఛపోయి మరలఁదెలిసి పెద్దపెట్టున నేడ్చుచు, కలహకంటకి కడకుఁ బోయి పుత్రునివార్త చెప్పి వెళ్ళి చూచివచ్చుటకు సెలవు వేఁడఁగా కఠినచిత్తురా లయినయామదవతి కొన్నికాఱులు ప్రేలి యింటఁగలపను లన్నియు తీఱినదాఁక పోవలదని కసరెను. ఆయుత్తమాంగన పొరలిపొరలి వచ్చుదుఃఖమును మ్రింగి శాంతతతో రాత్రి పదిగడియలవఱకును పనులుచేసి, పిమ్మట కలహకంటకియొద్ద ననుజ్ఞ పుచ్చుకొని గాఢాంధకారములో నొక్కతెయుబయలుదేఱి బ్రాహ్మణ బాలురు చెప్పినయానవాలునుబట్టి వెదకికొనుచు మఱ్ఱిచెట్టు చేరి, ఆసమీపమున నిద్రపోవుచున్నవానివలె నేలఁబడి యున్నకొమారుని

జూచి త్రొమ్ము మోఁదుకొనుచు కొంతసే పేడిచి, ఇంతలో ధైర్యము తెచ్చుకొని ముందు చేయవలసినపని నాలోచించుచు లోహితాస్యుఁడు మృతినొందెనని నిశ్చయము చేసికొని యారాత్రియే దహనసంస్కారము జరగవలెను గనుక, చుట్టుపట్లుడొంకలలో కొన్నిచితుకు లేఱి మోపుగట్టి నెత్తిమీఁదఁ బెట్టుకొని కుమారుని తనభుజముమీఁద మోచుకొని తిన్నగా ప్రేతభూమికి నడచెను. పట్టపగలయిన నెన్నఁడును గృహము బయలుదేఱి యెఱుఁగని యాసుకుమారీమణి నిశా సమయమున నొంటిగా నరణ్యమార్గమున పుట్టెడుదుఃఖముతోను నడిచి, పితృభూమిచేరి తాను తెచ్చిన చిదుకులతో పొదపేర్చి పుత్రకుని దానిమీఁద పెట్టి దుఃఖ మాఁగక యేడ్వఁజొచ్చెను. ఆయేడుపు విని హరిశ్చంద్రుఁడు గుడిసెలోనుండి లేచివచ్చి శవమును దెచ్చినవా రెవరని యడిగెను. తనపేరు హంసనారియనియు, తనకుమారుఁడు పాము గఱచి దేహము తెలియకున్నాఁడనియు, విషవైద్యము తెలిసినయెడల బాలకుని ప్రాణదానము చేయవలయు ననియు, చంద్రమతి యార్తనాదముతోఁ బలికెను. తొట్రుపాటుతో పలికినమాట యగుటచేత భార్యకంఠస్వరమును గుఱుతు పట్టలేక హరిశ్చంద్రుఁడు తాను వీరదాసను కాటికాపరివానిభటుఁడను గాని విషవైద్యుఁడను కాననియు మాడ యియ్యక శవము నక్కడ దహనముచేయ వల్లకాదనియు, గంభీరముగాఁ బలికెను. అతఁ డాయవస్థలో నున్నసంగతి నావఱకు వినియున్నదికాదు గనుకను, అతఁడు దూరమునుండి మాటాడినందునను తనభర్తమాట నామెయు నానవాలు పట్టలేకపోయెను. అప్పుడు చంద్రమతి సమస్తభూమండలమును నేకచ్ఛత్రముగా నేలినమహారాజు యొక్కపుత్రకుని దహనక్రియకై యొకమాడ యైన తేలేనియవస్థ లటస్థించెనుగదా యని యేడ్చెను. ఆయేడుపు విన్నతోడనే యామె తన

భార్యయేమో యని సందేహముపడి మనసుచెదరియు మరలధైర్యము తెచ్చుకొని, మఱింత సమీపమునకు వచ్చి "నీ పట్టిమహారాజుదేవి వైన నీ కింతద్రవ్యాభావము కలుగవలసిన యావశ్యకము లేదే, నీ మెడలో మెఱయుచున్న శతమాన మమ్మియైన నూమాడ యిమ్ము" అని యతఁడు పలికెను. అంత నామె భర్తమాట యానవాలు పట్టి యాతనికి సంభవించిన దురవస్థకును, కొడుకుచావునకును బహువిధముల విలపించుచు, "మునుపు మీతొడలమీఁద పరుండినిద్రపోయెడు ముద్దుకుమారుని లోహితాస్యుని జూడుఁ" డని యాతనిపాదములపైఁ బడవైచి యేడ్వనారంభించెను. ఆమాటలు చెవిని బడినతోడనే గుండెలు పగిలి పుత్రశోకమున దేహము తెలియక యతఁడుక్రిందపడి పోయెను. చంద్రమతి తనదుఃఖమును మఱచి, మగని లేవఁదీసి సేద తీర్చి ధైర్యము చెప్పి, స్వామికార్యమున ద్రోహముచేయుట యర్హాకృత్యము గాదనియు, ఆపదలయందు ధైర్యము వదలి శోకము నొందుట వివేకులకు ధర్మము కాదనియు బోధించి; మాడ లభించు మార్గము నాలోచించి చెప్పుఁడని భర్తను వేఁడుకొనెను. భార్యహితబోధచేత దుఃఖమును మాని ధైర్యమును పూని కొంచెమునే పాలోచించి "నీ వేలాగుననైననీవుకొలువున్న బ్రాహ్మణునికరుణపుట్టునట్టుగా బతిమాలుకొని యొకమాడ వేఁడి తీసికొనివచ్చి యీబాలుని దహించుకార్యము గాదు" మని భార్యను బంపివేసెను. ఆమెయొక్కతెయు చీఁకటిలో రోదనము చేయుచు పురవీధులనుండి వెళ్లుచుండఁగా నొక్కబ్రాహ్మణుఁ డెదురుపడి, ఆమెశోకకారణము నడిగితెలిసికొని, జాలిపడువానివలె నటించి యొకనగలమూట నామెచేతిలోఁబెట్టి తన కక్కఱలేదని యామె చెప్పుచుండఁగా వినక వెడలిపోయెను. ఇంతలో యామెచేతికి నగలమూట నిచ్చిపోయిన బ్రాహ్మణుఁడే మరల వచ్చి

రాచకొమారునిఁ జంపి నగ లెత్తుకొని వచ్చిన పాపాత్మురా లిదిగో పాఱిపోవుచున్న దని రాజభటులు కామెను జూపి త్రోలఁగిపోయెను. తలారు లామె చెప్పుకొనుమాట లెంతమాత్రమును వినకఁ నగలతో నామెను గొనిపోయి శిశుహత్య చేసినదుష్టురాలిని పట్టుకొంటి మని రాజుముందఱ పెట్టిరి. కొడుకును జంపె నన్నకోపముచేత రాజు విమర్శ యేమియుఁ జేయక నామె రాజసభలో మాటాడ నోరాడక యూరకున్ననిరపరాధిని యైనయామెను శిరచ్ఛేదము చేయ నుత్తరు విచ్చి తలారులవెంటఁ బంపివేసెను. వారామెను దీసికొనిపోయి రాజాజ్ఞను జెప్పి తల గొట్టుట కయి వీరబాహున కొప్పగించిరి.

---

## ప దు నే న వ ప్ర క ర ణ ము

---

రాజభటులు చంద్రమతిని దీసికొనిపోయి వీరబాహుని కొప్పగించి రాజాజ్ఞను చెప్పినతరువాతఁ వాఁడామెను తనవారివెంబడిని శిరచ్ఛేదమును చేయుటకయి హరిశ్చంద్రునిపాలికిఁ బంపెను. ఆపట్టణములో నేయుండిజరుగుచున్నయావత్సంగతిని కనిపెట్టుచున్న విశ్వామిత్రుఁ డేమిజరుగునో చూడవలె నని చంద్రమతివెనుకనే ప్రేతభూమికి వెళ్లెను. వీరబాహునిమనుష్యులు చంద్రమతిని గొనిపోయి తమస్వామియాజ్ఞను జెప్పి తమ కాతఁ డిచ్చినయానవాలునుజూపి వారు దూరముగా నిలుచుండిరి. ఆమాటలు చెవినిసోఁకినతోడనే ధైర్యము చెడి కొంతసేపు నివ్వెఱఁగంది యేమి చేయుటకును తోఁచక హరిశ్చంద్రుఁడు కన్నీరునించుచు శిరస్సు వంచుకొని యుండెను. ఆసమయములో చంద్రమతి భర్తకు ధైర్యము చెప్పి, స్వామికార్యము నిర్వహించుట

యవశ్యకర్తవ్యమనియు, మనుష్యులును దేవుఁడునుగూడ మెచ్చునట్లుగా స్వకృత్యమును నిర్వహింపవలయు ననియు, తనమీఁది ప్రేమానుబంధమునుమఱచి ధర్మమునందే బుద్ధి నిలుపవలయుననియు, బహువిధముల బోధించి యొడఁబఱిచి, తనప్రాణవల్లభుఁ డెప్పుడును సత్యమును దప్పక యిహలోకమున నిత్యసుఖమును పొందునట్లనుగ్రహింపవలయునని జగదీశ్వరుని ప్రార్థించి, మనసులోఁ బరమాత్మని నిలిపి నిశ్చలహృదయముతో కత్తిదెబ్బకు మెడయొగ్గి వధ్యశిలమీఁదఁ గూరుచుండెను. హరిశ్చంద్రుఁడును లోపలినుండి పొంగివచ్చుదుఃఖమునాపుకొని, స్వామికార్యము చేయకతప్పదుగదా యని తెగువచేసిఖడ్గమును చేతఁబూని యామెశిరస్సును తెగవేయుట కయి గుఱి చూచి హస్తమును పయి కెత్తెను.

అప్పుడు చూడవచ్చినమూఁకలలోనుండి విశ్వామిత్రుడు పరుగెత్తుకొనివచ్చి హరిశ్చంద్రునిచేయి పట్టుకొని నిలిపి యిట్లనియెను.

విశ్వా—రాజోత్తమా! ఇంతవఱకును నీవెంతో భూతదయ గలవాఁడవనియు పుణ్యచరిత్రుఁడవనియుఁ బ్రసిద్ధిగని తుట్టతుద కిట్టి క్రూరకృత్యమున కొడిగట్టిస్త్రీహత్య చేయఁబూనుట నీవంటివాని కుచితము గాదు. ఉత్తమురాలైన నకులాంగనను జంపుకొని ముందేమి సుఖము ననుభవింపఁ బోయెదవు ? నామాట విని నీ వాకయబద్ధము నాడుము. ఆడినతోడనే నీపుత్రుని బ్రతుకునట్లు చేసి, నీభార్యను క్షమించునట్లు రాజును సమ్మతిపఱిచి నిన్నునీభార్యతోఁగూర్చి నీరాజ్యమంతయు నీకు మరల నిచ్చెదను. ఇఁక మాఱుమాటాడక నేనుజెప్పినట్లు చేయుము.

హరి—ఓ మునిసత్తమా ! నన్నధర్మమునకు లోఁబడు మని బోధించుట మీవంటి సమస్తధర్మవేత్తలకు న్యాయ మగునా ? ధర్మమార్గము విడుచుటచే లభించినస్వర్గ మైనను నాకక్కఱలేదు. హృదయస్థైర్యము చాలక యాపద వచ్చినప్పుడు హరిశ్చంద్రుఁడు ధర్మము తప్పెనని నిందపొంది యనుభవించు తుచ్ఛసుఖము లవి యేటికి ? మీరు నాయం దనుగ్రహించి యిఁకముం దిట్టిమాట లేవియు నాతో సెలవీయకుఁడు. నాచేతిఖడ్గమును వదలి మీరు కొంచెమునే పావలికిఁ జనుఁడు. స్త్రీవధ జరుగుచుండఁగా నొద్ద నుండి చూచుట సర్వసంగములు త్యజించి తపస్వులై యున్న తమ బోటివారికి తగదు.

అని నిశ్శంకముగాఁ బలికిన హరిశ్చంద్రుని నిత్యసత్యప్రభావము నకును ధర్మచింతకును నాశ్చర్యమొంది, ఇఁక నాతనిచేత బొంకింపఁ గలుగుదు ననుతలఁపు కట్టిపెట్టి, ఇట్టిసమయములో నుపేక్షించుట క్రూరకిరాతకృత్య మగునుగాని మానుషకర్మముగాదని నిశ్చయించి, హరిశ్చంద్రునిచేయి పట్టు విడువక విశ్వామిత్రుఁడు తనశిష్యులలో నొకనిచేత వెంటనే యాపట్టణపురాజునకు వర్తమానముపంపెను. కొంత సేపటికి మంత్రులు మొదలగు సమస్తప్రకృతివర్గముతోడను రాజు రుద్రభూమికి వచ్చెను. అప్పుడు సమస్తజనులును వినుచుండఁగా విశ్వా మిత్రుఁడు వాడు చంద్రమతీ హరిశ్చంద్రు లగుటయు, తనకును వశిష్ఠు నకును పంతమువచ్చి వారిచేత నసత్యము పలికింపవలెనని తాను వారి ననేకవిధముల నాపదలుపెట్టి తుదకు బొంకింపలేక పరాజితుఁడగుటయు చంద్రమతి నిర్దోషురా లగుటయుఁ జెప్పి, తానే యర్ధరాత్రసమయ

షునఁ దనశిష్యులచేత రాజాంతఃపురములో కన్నము వేయించి రాజ నందనుని తెప్పించితి ననియు, ఆశిశువుయొక్కయాభరణముల నామె యొడిలో వేసి రాజభటుల కామె నొప్పగించినవాఁడు తనశిష్యుఁడే యనియు, నమ్మకముపుట్టఁ బలికి ఆయర్భకుని దెప్పించి రాజునకు సమర్పించెను. రాజును విస్మితుఁడయి యాదంపతులను విశ్వామిత్రుని బహువిధముల శ్లాఘించి హరిశ్చంద్రుని కౌఁగిలించుకొనెను. అప్పు డక్కడకు చూడవచ్చినవారిలో కాలకౌశికుఁడును వీరబాహుఁడును కూడ నుండఁగా వారి నిద్దఱను రాజసమ్ముఖమునకు రప్పించి విశ్వా మిత్రుఁడు వారియొద్దనుండి గైకొన్నధనమును వారి కిచ్చివేసి చంద్ర మతీహరిశ్చంద్రులను దాస్యమునుండి విముక్తులను జేసెను. పిమ్మట నామహర్షి సర్పదష్టుఁ డయి మూర్ఛితుఁడయి మృతునివలెపడియున్న లోహితాస్యునికడకుఁ బోయి తనయొద్ద నున్నదివ్యౌషధములను బ్రయోగించి యాతనిని సజీవునిజేసి తల్లిదండ్రుల కపరిమితప్రమోద మును కలిగించెను. అప్పు డక్కడకు వచ్చినవారందఱును చంద్రమతీ హరిశ్చంద్రుల ధైర్యస్థైర్యములకునుధర్మపరాయణత్వమునకును వారిని వేయినోళ్ళఁ బొగడఁజొచ్చిరి. కొన్నినాళ్ళలో వారికీర్తి యంతయు లోకమునం దంతటను వ్యాపించెను. అంతట నాకాశీదేశపురాజు చంద్రమతీహరిశ్చంద్రులను దనవెంటఁ గొనిపోయి కొన్నిదినములు తనయింట నుంచుకొని సర్వవిధముల వారిని సత్కరించి, పిమ్మట తన భృత్యజనములను సహాయ మిచ్చి గజాశ్వభటసమేతముగా విశ్వా మిత్రునివెంట వారిని అయోధ్యాపురమునకుఁ బంపెను. వారందఱును కొన్నిదినములలో నయోధ్యాపురమును సుఖముగాఁ జేరిరి. చంద్ర మతీహరిశ్చంద్రులు వచ్చుచున్నా రన్నవార్తను ముందుగానేపౌరులు తెలిసికొని చచ్చిపోయిన తమ ముఖ్యబంధువులు మరల లేచివచ్చి

నట్లుగా నెల్లవారును సంతోషించి, పట్టణ మంతయు నలంకరించిరి; మంత్రులు మొదలగువా రందఱును పరమప్రమోదముతో నెదురుగా వచ్చిరి. విశ్వామిత్రుఁ డారాజదంపతులను రాజమందిరమునకుఁ దీసి కొనిపోయి నగ రలంకరింప నియమించి, బహుతూర్యములు చెలఁగ సమస్త మంత్రి బాంధవ నియోగిజన సమక్షమున మరల హరిశ్చంద్రుని సర్వరాజ్యమునకు పట్టాభిషిక్తుని జేసెను. పట్టాభిషేకమునకు ముందే వశిష్ఠుఁడును వచ్చి యుండెను.

విశ్వా—నీసత్యశీలతను పరీక్షింపఁ గోరి నిన్నును నీభార్యను నేను పెక్కుగడగండ్లను పెట్టినాఁడను. మీయెడ నేను జేసినయప రాధముల నన్నిటిని మఱచిపోయి నన్ను క్షమింపవలెను.

హరి—మీరు నాకు మహోపకారమునే చేసినవారు. మీ కారణముననే లోకములో నాకు సత్యసంధుఁ డనుఖ్యాతి వచ్చినది. మీరు చేసిన యీయుపకారమును నేనెన్నఁడును మఱచిపోను. నాకు బాధ కలిగించితి మని మీరు మనసులో నేవిధమయిన సంకోచమును పొందవలసినపని లేదు.

అని యీవిధముగాఁ గొంతసే పుచితప్రసంగము జరిగిన తరు వాత విశ్వామిత్రుఁడు మనసులో విచారమునుమాని సంతోషమొంది సర్వజనులును చూచుచుండఁగా తానుజేసినతపస్సులో సగమువశిష్ఠు నకుఁ ధారపోసి శిష్యబృందముతోఁ దనయాశ్రమమునకుఁ బోయెను,

తనమాట బోటుగాక గెలిచినందునకై పరమానందభరితుడయి వశిష్ఠుడును తనతపోవనమునకు నడిచెను. హరిశ్చంద్రుడు ప్రజలెల్ల నత్యంతానందము పొంద బహుకాలముసత్పరిపాలనము చేసి, పిమ్మట రాజసూయయాగ మొనరించి దీవులయందుసహితము తనప్రభుత్వము స్థాపించెను. హరిశ్చంద్రుడును చంద్రమతియు పూవునుతావియువలె నత్యంతము గలిసి పరస్పరమును మిక్కిలి యనురాగము గలవారయి వివాద మన్నమాట కలలోనైన నెఱుగక తీఱికగా నున్న కాలమును సద్గ్రంథశ్రవణమునందును లోకోపకారకార్యవిచారమునందును బుచ్చుచుండిరి. లోకములో దంపతు లెవ్వరయిన నైకమత్యమును సన్మార్గప్రవర్తనమును నేర్చుకోవలెనన్నచో వారినిజూచియే నేర్చుకోవలెను. చంద్రమతి తాను చదువుకొన్నదగుటచేత విద్యవలనిలాభములను చక్కగా నెఱిగినదయి, తనతోడ మెలగుస్త్రీల కందఱకును విద్యోపదేశముచేసి హితధర్మబోధ చేయుచుండుటయేకాక తమ రాజ్యమునందంతటను బాలికాపాఠశాలలను స్థాపింపించి స్త్రీలనెల్లను సాధ్యమయినంతవఱకును విద్యావంతులనుగా జేసెను. అందుచేత ఆకాలములో స్త్రీలుకూడ జదివినవారగుటచేత భర్తలుచేయు మంచికార్యములకు ప్రతిబంధకారిణులు గాక మూఢ్యమును మాని సమస్త సత్కార్యములయందును వారి కనుకూలురాండ్రగుచు, నగలు మొదలయిన వ్యర్థదంభమును నిష్ప్రయోజనములని విద్యామహిమచేత దెలిసి వానికొఱకు నాథులను బాధపెట్టక పాతివ్రత్యము గలిగి లోకము మెచ్చునట్లుగా బ్రవర్తించు చుండిరి. భర్తలును గృహకృత్యనిర్వహణభారము కొంత తొలగి మిక్కిలి సుఖులై యుండిరి. ఆకాలములో దంపతులకు గలిగినయొక

మత్యము మఱి యేకాలములోను గలుగలేదు. విద్యావతియుఁ బుణ్యవతియు నయినయొక్క-చంద్రమతివలనఁ గదా లోకమున కంతమేలు కలిగినది ?

సంపూర్ణము

---

బాక్సు ప్రెస్, రాజమండ్రి—1950.

22 స్త్రీపునర్వివాహవిషయిక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 అధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయ చరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

వాస్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# సత్యసంజీవని

ఈ నూతన వచన ప్రబంధము బాలికలకుపయోగమునిమిత్తము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ఏడవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-12-0

[illegible]

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

### ప్రహసనములు

[illegible] సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు

### పద్య కావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ
యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన
నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 [illegible]
10 [illegible]

# సత్యసంజీవని



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

For favour of
Exhibition

For Hithakarani Samaj.

Honi. Secretary



ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

# సత్యసంజీవని

## మొదటి ప్రకరణము

ఒకనాటి మధ్యాహ్నము మూఁడుగంటలవేళ మాణిక్యము తాఁరుచు మెల్లగా మేడమెట్లవద్దకు పోయి యెవ్వరును లేకుండఁజూచి చప్పుడు చేయక మెట్లెక్కి దొంగతనముగా ముత్తవతల్లిగది కేసినడవ నారంభించినది. మాణిక్య మిప్పు డేడుసంవత్సరములయీడుగల బాలిక; తల్లిదండ్రు లిద్దఱును నెలదినములు హెచ్చుతగ్గుగా కాలముచేసినందున మాణిక్యమును, అంతకంటె రెండుసంవత్సరములు పెద్దదైన భ్రమరాంబయు, అన్నగారైన వాసుదేవరావును తల్లితల్లియైనలక్ష్మీదేవమ్మ యొద్దనే పెరుఁగుచుండిరి. లక్ష్మీదేవమ్మ ధనికురాలు గనుకను, పుత్రసంతతి లేనిదిగనుకను, తనయల్లుని దెచ్చి యిల్లఱికముంచుకొని, ఆ కుటుంబమును తానే పోషించుచుండెను. భ్రమరాంబ కొన్ని మాసములక్రిందట పొరుగూర నున్న తనమేనత్తగారి యింటికి వెళ్లి, అక్కడనే బాలికా పాఠశాలలో చదువుకొనుచుండెను. ఇప్పుడు మాణిక్యము చేరఁబోయినది లక్ష్మీదేవమ్మగారి పడకగది; కాని వేసవికాలమారంభ మగుటచేత ఆమె యిప్పు డందు పరుండక గాలికి వసారాలో పరుండుచుండెను. ముత్తవతల్లి యనుమతించి వెళ్ళుమన్నప్పుడు తప్ప మాణిక్యము కాని భ్రమరాంబ కాని యాగదిలోని కెప్పుడును వెళ్ళఁగూడదు. ఇప్పుడు మాణిక్యము వెళ్ళుచున్నరీతి చూడఁగా ముత్తవయనుమతి పొందనట్టు స్పష్టమగుచునేయున్నది. ఆచిన్నది తన్నెవ్వరైనను చూచిపోదురేమో యన్న భీతిచేత ఒకయడుగు ముం

దుకుపెట్టి నిమిషనిమిషమునకును వెనుకవంక బెదరిబెదరిచూచుచు, తన్నెవ్వ రెప్పుడువచ్చి పట్టుకొందురోయని జడిసినట్టు మధ్యమధ్య ఇరుపార్శ్వములును తొంగితొంగి చూచుచు తలుపుచేరెను. అప్పు డామెకంటి కెవ్వరును కనఁబడనందున మెల్లగా తలుపుతీసి చప్పుడు కాకుండ లోపలప్రవేశించి మునికాళ్ళమీఁద నడచి చాపదాటి మంచముప్రక్క నున్నగోడయలమారువద్ద నిలుచుండి చేయిచాచి దాని మూతతీయఁబోయి చేయివడఁకి దేహము పులకరింపఁగా తలుపు తీయుదునా మానుదునా యని కొంచెముసే పనుమానించుచు నిలువఁ బడెను. కాని యాసంశయము కొంచెముసేపటిలోనే తీఱి, ధైర్యము చేసి తలుపుతెఱచి యందులోని యందమయిన ముత్యాలహారమును పయికితీసి చేతిలో పట్టుకొని వెలుతురులోపట్టి దానియందమును చూచి తలయూచి మెచ్చుకొనుచు, "ఒక్కసారి నాకిది వేసికోవలె నని యెంతో ముచ్చటయగుచున్నది. ఇక్కడకు రెండామడదూర ములో నున్నదిగనుక భ్రమరాంబ యిఁక పదునేనుదినములవఱకును ఇక్కడకువచ్చి యిది వేసికొనదు" అని తనలోతాను తలపోయు చుండెను. ఇంతలో మేడమెట్లమీఁద చప్పుడయినట్టు వినఁబడఁగా నులికిపడి, హారమును చటుక్కున మరల గూటిలో పడవేసి యాల కించి యెక్కడను చప్పుడు గానక కొంచెము గుండెకుదిరి తెలతెల పోవుచు మెట్లవద్దకువచ్చిచూచి యెవ్వరిని గానక, వెనుకకు వెళ్ళి ముత్యాలపేరు పయికిఁదీసి మరల తనలోతా నిట్లనుకొనసాగెను.

"అమ్మమ్మ నాకుఁగూడ నిటువంటిదొకటి కొనిపెట్టవచ్చును. ఈసాయంకాలము నాకిది వేసికొనవలెనని యున్నది. ఈచుక్కలరవిక మీఁద నిది యెంతసొగసుగానుండును!" అని మెడకు తగిలించుకొని, అద్దమువద్దకు వెళ్ళిచూచి మొగమురంగుమాఱి భయపడి కొంతసేపు

మాటరాక నిలుచుండి "నాకిది యీవేళ వేసికోవలెనని యెంతో మన సవుచున్నది. నేను వేసికొన్నయెడల నెవరైన చూతురేమో ! పదిల ముగా బట్టలోదాచుకొని తీసికొనివెళ్ళి నేనక్కడకు వెళ్ళినతరువాత ఒక్కసారివేసుకొన్నపక్షమున నెవ్వరును చూడలేరు" అనుకొనుచుం డెను. ఆసమయమునందు పరిచారికయైన 'రామి' వంటయింట నేదో పని చేసికొనుచుండెను; అవ్వగారును పడమటియింటివసారాలోకూరు చుండి మనుమరాలి నిమిత్తము క్రొత్తరవికె కుట్టుచుండెను. అప్పుడు మాణిక్యమును వచ్చిచూచి కూకలువేయువా రెవ్వరును దాపున లేక పోయినను, "నీ విప్పుడు చేయుచున్నపని తప్పుసుమా" అనియెవ్వరో యేకాంతముగా చెప్పుచున్నట్లు మనస్సులోనొకశబ్దమువినఁబడి మనను జల్లుమని గుండెకొట్టుకొనఁగా మాణిక్యము వికారరూపమున నున్నతన విగ్రహము నద్దములో చూచుకొని కన్నులు మూసికొనెను.

మాణిక్యము చదువునందు మిక్కిలి చురుకయినది; ఆమెవద్ద ననేకసుగుణము లున్నవి; విశ్వాసము దాసక్తియు ముత్తవతల్లియందు ప్రేమయు దయయుఁ గలది; కాని యీమెయప్పుడప్పుడుకొంచెమసత్య మాడి ముత్తవను మోసముచేయుచుండును. ఈమోసములు మిక్కిలి యల్ప మయినవే కాని, వానిని దాచుటకయి మఱియొక యసత్యము పలుకవలసి వచ్చుచుండుటచేత ఒక్కతప్పిదము రెండగుచుండెను. లక్ష్మీదేవమ్మ ముసలిదగుటచేతను, ఆమెకు చత్వారమగుటచేత దూర దృష్టి యానకపోవుటచేతను, ఇంట మఱియెవ్వరును కనిపెట్టువారు లేకపోవుటచేతను, చేసినతప్పిదములదాపట్టుపడకతప్పిపోవుచు వచ్చుట వలన మోసము సాగి బొంకుట కవకాశమునుప్రోత్సాహమును కలుగ నారంభించెను. ఈదినము లక్ష్మీదేవమ్మయప్పకోడలైనపూర్ణమ్మ

యొక్క పెద్దకొమార్తె సరస్వతి పుట్టినదిన మగుటచేత వారు పండుగ చేసికొని యాసాయంకాలముతోడిపిల్లలనెల్ల ఆటకును భోజనమునకును బిలిచిరి. అందుచేత ముత్తవ మనుమరాలి నక్కడకు రామివెంట పంపుటకు నిశ్చయించెను. కాబట్టి మాణిక్యము ప్రొద్దుటినుండియు ప్రయాణమునకు ప్రయత్నపడుచు, రామిచేత తలదువ్వించుకొని బొట్టును కాటుకయు నగలును పెట్టించుకొని చీర కట్టించుకొని యెండచల్లపడుటకయి చూచుచుండెను. అప్పు డాచిన్నదాని నవ్వుమొగమును, ఉంగరముల వెంట్రుకలును, విశాలనేత్రములును, చూచినవారికామె యెంతయందగత్తెగా నైన నున్నది! అయినను తానెప్పుడువెళ్ళుదునాయని తొందరపడుచు, ఎంతసేపటికిని ప్రొద్దువాలనందుకు సూర్యునిమీఁద కోపపడుచు, ఊరకే కూరుచుండుటకు తోఁచక భ్రమరాంబవలెముత్యాలహారమును వేసికొన్నయెడల తానేలాగుననుండునో చూడవలెనని బుద్ధిపుట్టి, అవ్వ వడిగి పుచ్చుకొనుటకు సాహసము చాలక ఒక్కసారి వెళ్ళి యూరక చూచివత్తమను నభిప్రాయముతో ముందుగా మేడమీఁది కెక్కెను. ఒకతప్పిదము రెండవదానికెప్పుడును దారితీయునుగనుక దొంగతనముగా పోయి హారముతీసినతరువాత జతకత్తెలతో ఆడుకొనునప్పుడు దానిని ధరించుకోవలెనని యభిలాషకలిగెను. అంతరాత్మ తప్పిద మని చెప్పి భయపెట్టినతరువాత హారమును మరల నెప్పటిచోట పెట్టవలెనని యాలోచించుచుండఁగా నింతలో రామి "అమ్మాయీ!" అని కేక వేసినందున, ఏమిచేయుటకును అవకాశముచాలక రామి వచ్చిచూచి ముత్తవతల్లితో చెప్పునేమోయని తొందరపడి ముత్యాలపేరును చటుక్కునతనయొడిలోవేసికొని "ఒక్కరాత్రి దీనిని నేను వేసికొన్నంత మాత్రముచేత నష్ట మేమియు లేదు. ఈరాత్రిగదిలోపరుండదుగనుక, అమ్మమ్మకు నేను హారముతీసినసంగతి తెలియనే తెలియదు. నేనుతిరిగి

యింటికి రాఁగానే తీసి యథాస్థానమున పెట్టివేసెదను" అని మనస్సును తృప్తిపఱచుకొనుచు మేడమెట్లు దిగివచ్చెను. ఆమె తనమనస్సు నావిధముగా నెంతసమాధానపఱచుకొన్నను హారమామె మొదిలో పడినయుత్తరక్షణమునుండియు మనస్సు నెమ్మదియనునది యెగిరిపోయియున్నదను కలలోను తలఁచియెఱుఁగని భయమును విచారమును మనస్సును వచ్చి చుట్టుకొనెను. ఆమె హృదయములో నేదో యావేదనగానుండి, ఏకారణముచేతనైన తాను చేసినపని బయలుపడునేమో యనుసంశయముచేత ముత్తవతల్లియొద్దకు వెళ్ళి సెలవుపుచ్చుకొనుటకు సహితము లోపల భయపడుచుండెను. అయినను ముత్తవతల్లితో చెప్పకుండ వెళ్ళుటకు వీలుపడదు గనుక సాహసముచేసి ప్రాణములు బిగబట్టుకొని గుడికి మేఁకపోతు వెళ్ళునట్లుగా మెల్లగా నడిచి ముత్తవతల్లియెదుట నిలువఁబడెను. ఆమె తలవంచుకొని రవిక కుట్టుకొనుచు "అమ్మాయీ! ఇంతసే పేమి చేయుచున్నావు?" అని యడిగెను. ముత్తవతల్లి యెంతప్రేమతో నడిగినను నేరముచేసిన మనస్సగుటచేత మాణిక్యము తత్తరపడి మొగము వెలవెలపాఱి యేమిచెప్పుటకును తోఁచక తడఁబడుచు "నేనా!— నేనా!— నేనా!— నేనేమియు చేయుచుండలేదు" అని గద్గదస్వరముతో పలికెను. లక్ష్మీదేవమ్మ మనసు వేఱొకచోట నుండుటచేత మనమరాలిముఖలక్షణాదులేమియు కనిపెట్టక తనపని చూచుకొనుచుండెను. అప్పుడు మాణిక్యము దేహమంతయు చెమ్మటపట్టఁగా కాళ్లువడఁకఁగా చిత్తము పరిపరి విధముల పోఁగా నిలుచుండి మనసులోని యారాటము పోవుదారి గానక "అయ్యో! నేనీహారమును తీసికొనిరాకపోయిన, ఎంతయనుకూలముగా నుండును! ఇప్పుడయినను పరుగెత్తుకొనిపోయి మరల హారమును గూటిలో పెట్టివత్తునా? అనిపలువిధముల చింతించుచుండెను. కొంతసేపటికవ్వగారు తలయెత్తిచూచి "రామీ నీవమ్మాయిని పదిలముగా పూర్ణమ్మగారి

యింటికితీసుకొనివెళ్ళి పిల్లలతో ఆడుకొన్న తడువాత భద్రముగా తీసికొనిరా'' అని చెప్పి మరల తనపనిచూచుకొన మొదలుపెట్టెను. ఇఁక బ్రతికి యీవలఁ బడితి నని సంతోషించి మాణిక్యము వెలుపలికి వచ్చి, రాము యెత్తుకొని తీసికొనివెళ్ళెద నని పలుమాఱు బలవంతపెట్టినను దానిమాటవినక, ఎత్తుకొన్నపక్షమున ముత్యాలపేరు దానికంటపడు ననియో నలిగిపోవుననియో తానే ముందు నడువనారంభించెను. అట్లు నడుచునప్పుడు మాణిక్యమీయొక్కపూటమాత్రిముహారము మెడలో వేసికొని రాత్రి యింటికివెళ్ళినతరువాత ఎవ్వరికిని తెలియకుండ మరల నెప్పటిచోట దాచెద ననియు, అమ్మమ్మతో చెప్పకుండ నిఁకముం దెప్పుడును దీనిని ముట్టుకో ననియు, మనస్సును సమాధాన పఱుచుకోఁ జూచెను గాని లోపలనంతరాత్మ యూరకుండక చేసినకార్యము మంచిది కాదని ఘోషింపుచు మనస్సును బాధింపుచునేయుండెను. అందుచేత నామెమనస్సు వ్యాకులపడి, ఆటకువెళ్ళుచున్నా నన్నయుత్సాహ మేమియులేక త్రోవపొడుగునను క్రిందనూడక నడిచి కాలికి దెబ్బలు తగిలించుకొనుచు, దిక్కులుచూచుచుఁబోయి యెదురుగావచ్చువారిమీఁద పడుచు, త్రోవప్రక్కల నున్నకాల్వలో కాలువేసి పడి లేచుచు, ఏలాగుననో, కాళ్ళీడ్చుచుకొనుచుపోయిపూర్ణమ్మగారియిల్లుచేరెను. అప్పుడు సరస్వతి యెదురుగావచ్చి చేయిపట్టకొని మాణిక్యమును లోపలికితీసికొనిపోఁగా రాము వీధిలో నిలుచుండెను. సరస్వతిమాణిక్యమును లోపలికి తీసికొనిపోవునప్పుడు బుజములమీఁద చేయివైచి తనతల్లి యాడుకొనుటకేమేమియిచ్చినదో, ఆటల కెవ్వరెవ్వరు వచ్చినారో, ఏమేమి యాట లాడదలఁచుకొన్నారో, ఎంతసే పాడుకోవచ్చునో, చెప్పుచు నవ్వుచు పిల్లలాడుకొనుచున్నచోటికి తీసికొనిపోయెను. అప్పు డక్కడ నున్న బాలికలలో కొంద ఱెదురుగావచ్చి మాణిక్యమును కౌఁగిలించు

కొనఁబోఁగా ముత్యములు చితికిపోవు నని భయపడి వెనుకకువెళ్ళి, ఒడిలోనుండి ముత్యాలహారమును పయికి తీసెను.

సర—ఓసీ! నీకు మీయమ్మమ్మ ముత్యాలపేరుకూడ నిచ్చినదా? ఆమెయెంతమంచిది! ఇది సరిగా భ్రమరాంబహారమువలెనే యున్నది.

మాణిక్య ముత్తరమేమియు చెప్పక కొక్కెము తగిలించుకొనుచుండెను.

సర—ఉండు. కొక్కెము నేనుతగిలించెదను. ఈహార మెంతో ముచ్చటగా నున్నది! ఇంతమంచిది నే నెప్పుడును చూడలేదు. మీయమ్మమ్మ యిది నీకిచ్చినదా?

మొట్టమొదట మాణిక్యమున కబద్ధమాడవలెనని యిచ్ఛలేదు గాని ప్రత్యుత్తరమియ్యక యెన్నివిధములతప్పించుకోవలెననిచూచినను మానక సరస్వతి యాప్రశ్ననే మరలమరల వేయుచువచ్చుటచేత విధి లేక "మాఅమ్మమ్మ యిచ్చిన' దని చెప్పవలసి వచ్చెను.

సర—నాకుకూడ నిటువంటిహారము నిచ్చుట కమ్మమ్మ యుండిన నెంతబాగుండును!

అప్పుడువారందఱును చేరి దాగుడుమూతలాడుట కారంభించిరి. ఆనవ్వులలోను, కేకలలోను, చప్పట్లలోను, మాణిక్యముతనవిచారము నంతయు మఱచిపోయి స్వేచ్ఛగా వారితోకలిసి యాడుకొనుచుండెను. ఈప్రకారముగా కొంతసేపు వేడుకజరిగినమీదట హారముమాటమధ్య జ్ఞప్తికివచ్చి సంతోషమంతయుపోయి మాణిక్యము పరుగెత్తుకొనివచ్చు వారిలో నెవరికితగిలి ముత్తెములుచితికిపోవునో యెవరిచేయితగులుకొని దారము తెగిపోవునో యను జడుపుచేత నొక మూల కొత్తిగిలియలసి పోయినట్లు నటించుచు తానిక నాడనని యొకరాతిబండమీఁద కూరుచుండెను. హారము తెగిపోవు ననుభయముచేత దూరముగా కూరు

చున్నను, ఆమె మనసంతయు నాటమీదనేయుండెను; జతకత్తెలు పరుగెత్తుకొని పోవునప్పుడు తానుకూడలేచి వారితో పరుగెత్తజూచును. ఆపాదుకాహారమామె యాదినమున తీసికొనిరాకపోయియుండిన యెడల, ఆటయంతయు ననుభవించి నాఁడామె యెంతయుల్లాసముతోనైన నింటికి పోయియుండును. తోడిబాలికలతోఁగలిసి సంతోషమనుభవింపవలసిన యోగ్యత లేకపోఁబట్టియే కాఁబోలును నాటిదిన మామె కాదుర్బుద్ధి పుట్టినది. అందఱును వేడుకగా నాడుకొనుచుండఁగా మాణిక్యము మాత్రము మొగమున దీనత్వము కనఁబడి ఒంటిగావిచారించుచు కూరుచుండుటచూచి సరస్వతిచేరువకు పోయి చేయిపట్టుకొని యాటకు రమ్మనిలాగెను. మాణిక్యము భయపడుచు మొగమింతచేసికొని చేయి విడువుమని బతిమాలుచు రెండవచేతితో హారమును మాటుకొను చుండెను. ఇంతలో సమీపమున నున్న బాలికలందఱును ఆటవిడిచి పరుగెత్తుకొనివచ్చి చేయియొకరును బట్టయొకరును పట్టుకొని రమ్మని లాగ మొదలుపెట్టిరి. అప్పుడు మాణిక్యము నిలువెల్లను చెమ్మటపట్ట మాటతొట్రుపడ చేయియడ్డముపెట్టి "నాజోలికిరాకుఁడు నేనువచ్చెదను విడువుండి విడువుండి అని కేకలువేయనారంభించెను. ఆసందడిలో నొకచిన్నదాని చేయితగిలి హారము దారము తెగిపోయి ముత్యము లన్నియు నేలమీఁద జలజలరాలెను. ఆముత్యములతోనే కన్నులనుండి బాష్పములురాల మాణిక్యము పెద్దపెట్టున నేడ్చెను. అప్పుడు బాలికలందఱును వెల్లపోయి పట్టువదలి దూరముగా తొలఁగి నిలుచుండిరి.

సర—అమ్మాయీ! ఏడువఁబోకు. నీవునిజము చెప్పినయెడల మీయమ్మమ్మనిమీఁదకోపపడి యిందునిమిత్తమునిన్నుకొట్టదు. హారము ప్రమాదముచేత తెగినదికాని బుద్ధిపూర్వకముగా ఎవ్వరును తెంపలేదు. భయపడకు. పూసలు నేను నీకేరి యిచ్చెదను.

అని యేఁడుచుండెను.

మాణి—అమ్మమ్మ—ముత్యాలు—హారము—

అని యేమో చెప్పఁబోయి నోరురాక యెవ్వరేమి చెప్పినను వినక కడుపు పగులునట్టుగా నొక్కరీతిని వెక్కి వెక్కి రోదనముచేయు నారంభించెను. చెప్పకుండా ముత్యాలసర మేల తీసికొనివచ్చితివా యని యిప్పుడు విచారించిన ప్రయోజన మేదియు లేదు. ముత్తెసరము తెగి కన్నులయెదుటనే పడిపోయియున్నది గనుక ముత్తవతల్లి కాసంగతి తెలియకుండువిధ మేమియు నగపడలేదు. ఆ హారము తనదే యయినపక్షమునను అంతగా విచారింపవలసినపని లేదు; అప్పుడు నిజము చెప్పివేసినయెడల తన్ను ముత్తవతల్లి శిక్షింపదని యైనను ధైర్యముండును. అది తనది కాకపోవుటయే కాక యొకరినడిగి తెచ్చినదయినను కాదు. అది యెవ్వరితోను చెప్పకుండ దొంగతనముగా తెచ్చినవస్తువు ఇంటికి వెళ్లినతరువాత దానివిషయమయి యేమిజరుగునో యేమియు తెలియదు. అటువంటి స్థితిలో మాణిక్యము మన సప్పు డేవిధముగా నుండునో వారువా రూహించుకో వలసినదే కాని చెప్పశక్య మయినదికాదు. అప్పుడు దుఃఖము కొంచెము శాంతించుకొని మాణిక్యము 'నే నీసంగతి చెప్పినయెడల కోపపడును గనుక, అమ్మమ్మతో చెప్పక యీసంగతియెట్లుదాచఁగలను? నేనెంతనిర్భాగ్యురాలను!' అని తలపోయుచుండఁగా దుఃఖముమరల లోపలినుండి పొరలివచ్చెను. అప్పుడు సరస్వతి మొదలయినవా రామె నూరార్ప యత్నించిరి కాని వారిప్రయత్నమువలన కార్యములేకపోయెను. "అమ్మమ్మ కోపపడదు భయపడవల" దని యెన్నిమాటులు చెప్పినను సరస్వతి మాటలామెచెవి దూఱినవికావు. అంతట ముత్తెసరమును లాగిన బాలిక ముందుకువచ్చి "నే నిప్పుడు మీయింటికి నీతో

కూడవచ్చి తప్పిదమంతయు నాదికాని మీమనుమరాలిది కాదని మీ యమ్మమ్మతో చెప్పెదను. భయపడకు" అని నడవసాగెను. అప్పుడు మాణిక్యము తనకు ముత్తవతల్లివలన నేమియు భయము లేదని చెప్పి, పయికి భయపడనిదానివలె కనఁబడుటకు ప్రయత్నించుచు, కన్నుల నీరు తుడుచుకొని, చలికత్తెను వారించి వెనుకకు పంపివేసి, తెగి పోయిన ముత్యాలహారమును కాగితములో మడఁచి యొడిలో పెట్టు కొని త్వరగా లోపలికివెళ్లి భోజనము చేసివచ్చి వాకిటిలోనికి నడిచి రామిని కలిసికొని, మునుపువచ్చినప్పటికంటెను రెట్టింపువిచార ముతో దానివెంట నింటివంక నడచెను.

---

## రెండవ ప్రకరణము

---

ఆరాత్రి యింటికి వెళ్లినతరువాత నెవ్వరికిని కనఁబడకుండనే మాణిక్యము తన గదిలోనికి పోయి పరుపుమీఁద పరుండియుండును గాని త్రోవలో ముత్తవతల్లి దీపమువెలుఁగున కూరుచుండి యేదో పని చేసికొనుచున్నందున, ఆమెవద్దనుండి వెళ్లవలసివచ్చెను. అప్పుడు లక్ష్మిదేవమ్మ మనుమరాలిని చూచి దగ్గఱపిలిచి "అమ్మాయీ! నీ వాటలాడి సుఖముగా వచ్చినావా? నీ వింతశీఘ్రముగా వత్తువని నే ననుకోలేదు" అని వీపుమీఁద చేయివేసి నిమిరెను.

మాణి—ఇప్పుడు తొమ్మిదిగంటలు కాలేదా?

లక్ష్మి—అయినది కాని పిల్లలాటలలో మునిఁగియున్నప్పుడు వారికి గంటలు గింటలు తెలియవు. నీవు మిక్కిలి యలసిపోయినట్టు కనఁబడుచున్నావు. అక్కడిసంగతులు తెల్లవారినతరువాత చెప్పు దువుగాని వెళ్లి పరుండు.

మాణిక్యము పడకగది చేరి మంచ మెక్కి పరుండి యేవేళకు నిద్రపట్టక తనలో "అయ్యో తెల్లవారి నాపని యే మగునో! నేను ముత్యాలహారమును ముట్టుకోకుండ నుండినపక్షమున నెంతహాయిగా నుందును? అమ్మమ్మకు తెలియకుండ దానిని నేనెట్లు బాగుచేయఁ గలుగుదును?" అని యొంటరిగా తలపోయ మొదలుపెట్టెను. అప్పు డాచిన్నదాని మనసులో ఇంతలోనైన చేసినతప్పిదము నొప్పుకొని నిజము చెప్పివేయుట యుక్తము. అని యెవరో చెప్పినట్లు మెల్లఁగా వినఁబడెను. కాని మాణిక్య మామాటలను లక్ష్యముచేయక 'నిజము చెప్పినయెడల, అమ్మమ్మ నన్ను శిక్షింపక వదలిపెట్టదు. కాఁబట్టి నేనేదో సాధన మాలోచించి శిక్ష తప్పించుకోవలెను" అని నిశ్చ యించుకొనెను. ఆమె కప్పుడు తోఁచిన యాలోచన తెల్లవారి యెవ్వరును లేవకమునుపే తాను ముందుగా లేచి ముత్యములు దార మునకు గ్రుచ్చి హారము కూర్చవలెనని తప్ప మరేమియు తోఁచ లేదు. నిద్రపోయి పెందలకడ లేచి యాపని చేయవలె ననెడి యుత్సాహముతో తలగడమీఁద తల మోపెనుగాని యెంతప్రయ త్నము చేసినను కంటికి నిద్ర రాక పఱుపుమీఁద పడి యాప్రక్కను ఆప్రక్కను పొరలుచు, ఎప్పుడు తెల్లవాఱునా యని యెదురుచూడ మొదలుపెట్టెను. మధ్యమధ్య కొంచెము నిద్రపట్టుచు వచ్చినప్పు డెల్లను, అమ్మమ్మ తెగినహారమును చూచినదనియో, తానుపూసలు గ్రుచ్చఁబోయినప్పుడు రంధ్రములో సూది యెక్కలే దనియో, ముత్యములు జాఱి యింటనిండ దొలికిపోయిన వనియో, కలవచ్చి మరల మెలఁకువ వచ్చుచుండెను. ఈప్రకారముగా కలఁతనిద్రపోయి మాణిక్యము తెల్లవారకమునుపే లేచి యిల్లు నిశ్శబ్దముగా నుండుట చూచి యెవ్వరును లేవనందుకు మనసులో సంతోషించి ముత్తవతల్లి

లేవకమునుపే హారము సిద్ధపఱిచి యెప్పటిచోట పెట్టవచ్చునని తలంచె నుగాని దారముపేని ముత్యములు ముందువేసికొని సూదిని గ్రుచ్చ నారంభింపఁగానే తనవద్దనున్న సూదు లేవియు ముత్యముల బొత్తి లలో పట్టనందున మిక్కిలి ఖిన్నురాలయి యేమియు తోఁచక బల వంతముగా గుచ్చఁబోయి రెండుమూడు ముత్యములను పగులఁగొట్టి యేలాగునన్నైన లక్ష్మీదేవమ్మగారి చందుగపెట్టె తెఱచి దానిలోని సన్నసూదులను తీసి పని వేగిరము ముగింపవలె నని తొందరపడి లేచెను. కాని ముత్తవతల్లి చిన్నపెట్టె గదిలోనున్నను తాళముచెవి యామెపరుపుక్రిందనున్నందున దానినెట్లు తెత్తునా యని సంకోచించి తాళముచెవినిమిత్తము వెళ్లినప్పు డామె లేచిన యెడల సర్వమును బయలుపడు నేమో యని భయపడి సూదిలేక హారము బాగుచేయుట యసాధ్య మయినందున నెట్లయిన సాహసముచేసి తాళముచెవి తీసి కొని రావలె నని నిశ్చయించుకొని ధైర్యము దెచ్చుకొని మెల్లఁగా చప్పుడు చేయక నడచి ముత్తవతల్లిపరుపు చేరి యామె గాఢనిద్రలో నున్నందున కపరిమితానందమునొంది పఱుపెత్తి తాళముచెవి పుచ్చు కొని యెవ్వరో శత్రువులు తఱుముకొనివచ్చుచున్నట్టు భయపడుచు వచ్చి పెట్టెతాళముతీసి కావలసినసూది పుచ్చుకొని మరల తాళము వేయఁబోవుచుండఁగా నడవలో నెవ్వరో నడుచుచున్న ట్లడుగుల చప్పుడు వినఁబడెను. అప్పు డాచిన్నది వేగిరపడి వేగిరము తాళము వేయవలె నని తొందరలో తాళము తప్పువైపునకు త్రిప్పి చేతులు వడఁక చేతిలోనిపెట్టె క్రింద వదలిపెట్టెను. అప్పు డందులోనున్న సూదులును, నూలుబంతులును, అంగుటములును, కత్తెరలునుసమస్త వస్తువులును నట్టింట చెదరి నానాముఖములఁ బోయెను. అదిచూచి మాణిక్యము తత్తరపడి దబ్బుదబ్బున వస్తువులన్నిటి నేఱి యుల్లరిగా

పెట్టెలో పడవేసి మూత వేయఁబోఁగా మూత పడకపోయెను; రామి వచ్చి చూచిపోవునేమో యని భయపడి మూత గట్టిగా నొక్కఁగా లోపల నేదో పెళుక్కున విఱిగినట్టు ధ్వని వినఁబడెను. మూత తీసి చూడఁగా లక్ష్మీదేవమ్మగారి దంతముతో చేసిన యంగుటము రెండు ముక్కలయియున్నది. రామివచ్చి తలుపుతీసి లోపల నేదో పని చేయనారంభించినందున, అది యేనిమిషమున వచ్చి చూచిపోవునో యను భీతిచేత నేదోవిధముగా మూతవేసి తాళమువేసి పెట్టె యెప్పటిచోట పెట్టి తాళముచెవి మరల ముత్తవతల్లియొక్క పఱుపుక్రింద పదిలముగా నుంచివచ్చి మాణిక్యము తనపనికి కూరుచుండెను గాని సూదిలో దార మెక్కింపఁబోఁగా చేయి వడఁక మొదలుపెట్టి యాపనికే యెంతోసేపుపట్టెను. సూదిలో దార మెక్కించినతరువాత మనస్సులో నేదో చప్పుడయినట్టు భ్రమించి దిక్కు లాలకించుచు, తలుపువద్దకు వెళ్ళి చూచుచు, హారమును పయికితీసి గుచ్చుచు చీమ చిటుక్కుమన్న చటుక్కున దాని బట్టమూయుచు, ఒక్కవరుస గుచ్చునప్పటికి రామివచ్చి అమ్మగారు చలిదిభోజనమునకు తీసికొని రమ్మన్నారనిపిలిచెను. పని పూర్తికానందుకు విచారముగా నున్నను వెంటనే వెళ్ళకపోయినయెడల ననుమానపడుదు రని యెంచి సగము గుచ్చినహారమును పూసలను పదిలముగా దాచి భోజనమునకువెళ్ళి అవ్వగారు గుమ్మమువద్ద నిలుచుండి యేదో యుత్తరమును చదువుకొనుచుండఁగా మామూలుప్రకార మామెవద్దకు వెళ్ళి కౌఁగిలించుకొనక మెల్లఁగా నోరసిలి దారిచేసికొనిపోయి కంచమువద్ద కూరుచుండెను.

లక్ష్మీదేవమ్మ జాబు చదివినతరువాత మనుమరాలివంక చూచి అమ్మాయీ! నీకోసరమే నేను చూచుచున్నాను. అదియేమి?

నీవు పాలిపోయినట్టు కనఁబడుచున్నావు. నీచేతులు వడఁకుచున్నవి' అని దగ్గఱగా పోయి "ఆటలుబడలికచేత రాత్రి నీకు జ్వరము రాలేదుగదా!' అని కణతలును ముమ్మునుపట్టి చూచుచున్నది.

మాణి—నాకేమియు జబ్బు లేదు—అని గద్గదస్వరముతో చెప్పి మఱింత వడఁక మొదలుపెట్టెను.

లక్ష్మి—ఆటుబయల మంచులో రాత్రి ఆడుకొన్నప్పుడు జబ్బుచేయక మానదు. నీశరీరస్థితి చూచినతోడనే నాకంతయు తెలిసినది. ఈ యుత్తర మెవరియొద్దనుండి వచ్చినదో చెప్పఁగలవా?

మాణి—చెప్పలేను. నీవే చెప్పు.

లక్ష్మి—నీ పినతండ్రి నృసింహారావువద్దనుండి వచ్చినది. అతఁడు నీవిషయముయికూడ వ్రాసినాఁడు. ఆపంక్తులు చదివెదను విను—"మాణిక్యము తిన్నఁగా చదువుకొనుచున్న దని విని మిక్కిలి సంతోషించినాను. అది యీపాటికి అబద్ధములాడుట మానివేసి సత్యసంధురాలయి యుండునని నమ్ముచున్నాను.-"అనిబిగ్గరగా చదివెను.

ఆమాటలు చదివినతోడనే మాణిక్యము సిగ్గుపడి తలవంచుకొనెను. ముత్తవతల్లి పూర్వముచేసిన తప్పిదమును జ్ఞప్తికి తెచ్చినందున మనుమరాలు లజ్జనొందుచున్నదని తెలఁచుకొనెను.

లక్ష్మి—అమ్మాయీ! జరిగిపోయినదానికి విచారింపఁబోకు, నీవు వెనుకచేసిన తప్పిదముల నన్నిటిని నేను మఱచిపోయినాను. ఆవిషయమయి నీమీఁద నాకు కోపము లేదు ఇఁకముందుమాత్ర మెప్పుడును నీ వబద్ధములాడి నన్ను మోసపుచ్చక బుద్ధిగలిగిబ్రతుకు. మీపినతండ్రి తనకుమారుని యుపనయనమునకు మిమ్ములనందఱిని తనయొద్దకు తీసికొని రమ్మని వ్రాసినాఁడు.

మాణి—నాకు బహుసంతోషముగా నున్నది. నేను విజయ నగర మెప్పుడును చూడలేదు. నన్ను తీసికొనివెళ్ళుదువు కాదా!

లక్ష్మి—తప్పక తీసికొనివెళ్ళెదను. వేగిరము భోజనముకానీ. భ్రమరాంబనుకూడ తీసుకొనివచ్చుటకై నేనీదినముననే మనుష్యుని పంపెదను. మీఅప్పవచ్చినతరువాత మనమందఱమునుగలిసి రెండు మూడు దినములలో విజయనగరము మీపినతండ్రిగారింటికి వెళ్ళుదము.

ఆమాటలువిన్నతోడనే మాణిక్యము తెల్లపోయి యావఱకున్న యుత్సాహమంతయుపోఁగా, ఈముత్యాలపేరెప్పుడు బాగుచేయుదునా రేపు భ్రమరాంభ వచ్చి తనముత్యాలహారమును చూడఁబోయిన నాబ్రతుకేమగునా, అని యాలోచించుచు భోజన మయినతోడనే ముందుగా తానాపనిచేసి యీమధ్యాహ్న మవ్వగారుపరుండి లేచులోపల హారము సిద్ధముచేయవలె నని నిశ్చయించుకొని వడివడిగా తిండితినిలేచి యావలికివచ్చునప్పటికి సరస్వతి వీధిలోనుండి పరుగెత్తుకొనివచ్చి మాణిక్యముచేయిపట్టుకొనెను. ఆచిన్నదానిని చూచినతోడనే వెలవెలపోయి రాత్రిహారముమాట ముత్తవతల్లితో నెక్కడ చెప్పిపోవునోయని భయపడుచు చెలికత్తెవచ్చినదని సంతోషించుటకు మాఱుగా తనజతకత్తె తన్నెప్పుడు విడిచిపోవునాయని మాణిక్యము లోపల కోరుచుండెను.

సర—ఓసీ! నీవు తెల్లవారి యేలాగుననున్నావోయని చూడ వచ్చినాను రాత్రిమనయాటలో హారము—

మాణి—(అడ్డమువచ్చి తిన్నఁగా జెప్పనియ్యక) సరస్వతీ! నేను తిన్నఁగానేయున్నాను. రాత్రి మనయాట యెంత యింపుగానున్నది! అంతసంతోషము నాకు మఱియెప్పుడును కలుగలేదు.

సర—అయినప్పటికని నీవెంతో విచారముగానే కనఁబడినావు ఆపాకుముత్యాల—

మాణి—ఓసి! నాక్రొత్తబొమ్మలపుస్తకమునీకుచూపెంచెదను. ఈలాగునరమ్మా. (అని లాగుచున్నది).

లక్ష్మి—(కుట్టు మాని తలయెత్తిచూచి) ఓసీ! సరస్వతీ! ముత్యా లేమిటే?

మాణి—ఏమియులేవు. నీకుట్టుపనిచూచుకో. అమ్మప్పా! ఇదిగో నీనూలుబంతి బల్లకింద్రికి వచ్చినది. పిల్లి దేలాగున కొఱకు మన్నదో చూచినావా?

లక్ష్మి—అయ్యో! నేనెంత జాగ్రతగా నున్నను నూలుబంతి యేలాగుననో క్రిందికిపడిపోయినది. ఎంత తెలివిగలవారికిని కొన్నిసమయములయందు పొరపాటు రాకమానదు.

సర—అవ్వా! నీకే పొరపాటువచ్చినప్పుడు మాణిక్యమునకు ప్రమాదము సంభవించుట సహజమేకదా!

లక్ష్మి—సరస్వతీ! పొరపాటు వచ్చినప్పుడు నేను మాణిక్యము నెప్పుడును తిట్టను. ప్రమాద మెంతటివారికయినను నుండును—ఎవ్వరైన నా కావత్తులపెట్టె నందిచ్చెదరా?

మాణిక్యము కదలలేక మెల్లఁగా నవుగులు పెట్టుచుండఁగా సరస్వతి ముగుపరుగెత్తి పెట్టెతెచ్చి ముందుపెట్టెను. లక్ష్మిదేవమ్మ పెట్టె పుచ్చుకొని, తాళము తియ్యఁబోఁగా చెవి తిన్నఁగాతిరుగక బలవంతముగాపట్టుపట్టి త్రిప్పినప్పటికి చటుక్కున మూఁతపయికిలేచి లోపలివస్తువు లన్నియు చెదరి యల్లరిగా నున్నట్టు కనఁబడెను.

లక్ష్మి—అయ్యో! నాదంతపు అంగుటము! ఈపని యెవరుచేసినారు? ఓసీ మాణిక్యమా? నీవు నా పెట్టెలోనికి పోయినావా?

ఆమాట విన్నతోడనే మాణిక్యము మొగము వెలవెలపాఱి తొందరపడెను. దృష్టి తిన్నఁగాగలవారి కాచిన్నదానిచేష్ట లప్పుడే తెలిసియుండునుగాని, ముసలామెకు దృష్టి తిన్నఁగా ఆనదు గనుక మాణిక్యముయొక్క ముఖభావమును ఆకారవికారాదులును ఆమెకు తెలియకపోయెను.

లక్ష్మి—(కోపదృష్టితో) అమ్మాయీ! నాకు తెలియకుండ నాపెట్టెతీసి వస్తువులన్నియు పాడుచేయుచున్నావా ?

మాణి—(ధైర్యము తెచ్చుకొని) అమ్మమ్మా! నేనేమియు నెఱుఁగను. (అని తప్పించుకొనుటకయి మఱియొకయసత్యము పలుకవలసిన దాయెను.)

లక్ష్మి—(పెట్టె వెదకుకొనుచు) నీవెప్పు డయిన నిటువంటిపని చేసినప్పుడు చూచినయెడల నిన్ను తప్పకకొట్టెదను. అయ్యో! నూలు బంతులన్నియు చెదరి తాఱుమాఱుగానున్నవి. నావెండిపోగు కనఁబడ దేమి? అయ్యో! గ్రహచారమా! (అని పెట్టెవిడిచిపెట్టి విచారింప మొదలుపెట్టెను)

సరస్వతి మంచిదిగనుక పెట్టెలోనివస్తువులన్నిటిని క్రమముగా నమర్చి, అంతలో పాఠశాలకు పోవలసినవేళ సమీపించినందున చెప్పి వెళ్ళిపోయెను. మాణిక్యము మనసులో నుల్లాసముగా లేకపోయినను సరస్వతి వెళ్ళినందుకు సంతోషించెను. అప్పుడు లక్ష్మిదేవమ్మగారు పెట్టెతనయొడిలోనుంచుకొని, అది యెవరుతీసికొని పోయియుందురా యని యాలోచించుచు వెండిపోగునిమిత్తము పెట్టెయంతయు వెతక మొదలుపెట్టెను. కొంతసేపయినతరువాత రామినిపిలిపించి నీ కీపెట్టె సంగతియేమయిన తెలియునాయని బహువిధముల ప్రశ్నలు వేసిచూచి, అది తన కేమియు తెలియదని చెప్పఁగా వింతపడి, ఇదియంతయు పెద్దమాయగా నున్నదని యూరకుండెను.

---

## మూఁడవ ప్రకరణము

సాధారణముగా మాణిక్యము చలిది భోజన మయినతరువాత ముత్తవకు పాఠము లప్పగించి కొంచెముసేపు కుట్టుపని నేర్చుకొని, అవ్వగారి సెలవుపొంది తరువాత మధ్యాహ్నభోజన సమయముదాఁక ఆడుకోఁబోవుచుండును. పాఠము లప్పగించినతరువాత ఆటకు విడిచి పెట్టినకాలములో హారము బాగుచేయవలెనని తలఁచుకొని, వేగిరము పాఠమువప్పగించి పెట్టి పోవలెనని ముత్తవవద్దకు పోయి పాఠ మెప్పు డొప్పగించుకొందువని రెండుమూఁడుసారు లడిగెను. ఆమెధ్యానము మఱియొకదానిమీఁద నున్నందున తిన్నఁగావినిపించుకోక "ఇప్పుడేమి తొందర? కొంచెముసేపు తాళు. అదిమంచముక్రిందపడినదేమో తిరిగి చూడు. ఒకవేళ గోడకన్నములోనికిపోయి యుండునా?" అని వొడి పోగునుగురించి యాలోచించుచుండెను. ఆమె చెప్పినప్రకారముగా మాణిక్యము పోగు వెదకి యెక్కడను కనఁబడలేదనిచెప్పి "అమ్మా! పాఠ మొప్పగించుకోవా" అని మరల నడిగెను.

లక్ష్మి—ఇఁకకొంచెముసేపుండు. నా కాయాసముగా నున్నది. ఒక్కమాఱు మంచముమీఁది కొరిగి లేచి యొప్పగించుకొనెదను. నాపెట్టె దొంగతనముగా నెవరుతీయుచున్నారో తెలిసికోవలెను.

మాణిక్యము పుస్తకము ముందుపెట్టుకొని ముత్యాలహారము సిద్ధము కాకముందు భ్రమరాంబవచ్చినపక్షమున తనపని యేమగునా యని చింతించుచుకూరుచుండెను. ఇంతలోలక్ష్మిదేవమ్మగారు లేచి "పాఠమొప్పగించు ముందుగా నాకుమీఅప్పగారి ముత్యాలహారము కావలెను. అదియెక్కడనున్నదో నీవెఱుఁగుదువుకాదా? పోయిపట్టుకొనిరా" అని పిలిచి చెప్పెను. హారముపేరు చెప్పఁగానే మాణిక్యము

గుండెలు తటతట కొట్టుకొనఁగా "అమ్మా! హారమా?" అని మాటలు తడఁబడ నడిగెను.

లక్ష్మి—అవును. నీఅవ్వగారి ముత్యాలహారము అదిపుట్టిన నాడు మీఅక్కయ్యకు నేనుకొని పెట్టినది. అదినాకు వేరేయొకపనికోస రము కావలెను. పోనీ నీవుతొందరపడుచున్నావు పాఠ మొప్పచెప్పిన తరువాత పోయి తేవచ్చునులే.

అని యొప్పగించుకొనఁగా "ముత్యాలహార" మన్న పేరు చెప్పి నంతమాత్రమున నేయాబాలికమతిపోయి, ఒకటిచెప్పఁబోయి యొకటి చెప్పుచు పాఠమంతయు చెడఁగొట్టెను. ముత్తవతల్లి మనుమరాలి మనోవ్యాకులతకు నిజమయినకారణమేమో తెలిసికొలేక రాత్రిపొద్దు పోయినదాఁక మేలుకొనుటచేత పాఠమురాకపోయె నని యెంచుకొని కొంచెము కోపపడి, మరల చదువుమని పుస్తకము మీఁద పడవేసెను. ముత్యాలహారము బాగుచెయ్యవలె నన్న యభిలాషచేత మరల చదివి నిమిషములో నొక్కతప్పయిన లేకుండ పాఠమప్పగించి, తాను కుట్టవల సినదానిని మహావేగముగా కుట్టివేసిచూపఁగా, ముత్తవ సంతోషించి మనుమరాలిని పోయి యాడుకొమ్మని సెలవిచ్చెను.

మాణిక్యము ముత్తవ్వ హారముసంగతి మఱచిపోయినందున కును తన్ను శీఘ్రముగా విడిచిపెట్టినందునకును పరమానందభరితురా లయి, వెనుకతిరిగిచూడక యొక్కపరుగున మేడమీఁదికిపోయి, తాను పెట్టెలోపెట్టిన పూసలనుతీసిముందువేసికొని, చేతనయినంతవేగముగా సూదితో దారమునకు గ్రుచ్చనారంభించెను. ఆప్రకారము వడిగా రెండుమూడుపేటలు గ్రుచ్చి, కడపటిపేట సగము గ్రుచ్చునప్పటికి ముత్యాలు చాలకపోయెను. ఏమిచేయుటకును తోఁచక, అప్పు డా చిన్నదానికి కలిగిన విచార మింతంతయని చెప్ప నలవికాదు. ఆప్ర

కారముగాఁ గొంతసేపు నివ్వెఱపడియుండి, పోయినముత్యములు వెదుకుటకయి రాత్రియాడుకొన్న పూర్ణముగారియింటికి పోయినకార్యము తేదనుకొని, అమ్మమ్మ నన్ను వీధిలోనికి పంపదు గాని పోనిచ్చిన పక్షమున ముత్యము లమ్మెడియంగడి నేనెఱుఁగుదును కనుక నిఖిపణములో పోయి ముత్యములు కొని హారముపూర్తిచేయుదు నని తల పోయుచుండెను. ఇంతలో లక్ష్మిదేవమ్మగారు మెట్లవద్దకు వచ్చి, "అమ్మాయీ!" అని పిలువఁగా నులికిపడి సగము గ్రుచ్చినహారమును పదిలముగా నొకమూలపెట్టి "ఎందు" కని క్రిందికి దిగివచ్చెను.

లక్ష్మి—నిన్ను నేను మూఁడునాలుగుసారులు పిలిచినాను. ముత్యాలహార మెందుకు తీసికొనివచ్చినావుకావు ?

మాణి—(భయముచేత వడఁకుచు) అమ్మా ! ముత్యాల హారమా? ముత్యాలహారమా?

లక్ష్మి—అవును ముత్యాలహారమే. నీవిప్పు డేమో క్రొత్తగా స్వర్గములోనుండి దిగివచ్చినట్టు మాటలాడుచున్నావు. నాకది యొకపనినిమిత్తము కావలెను. ఆపనియేదో నీకు తెలిసినట్లయిన నీవింతకంటె వేగముగాఁబోయి పట్టుకొనివత్తువు.

మాణి—నేను వెళ్ళి తీసికొనిరానా ?

లక్ష్మి—పరుగెత్తుకొనిపోయి తీసికొనిరా—ఇదిగో నీరవికలును పరికిణీలును కుట్టుపనివాఁడు తెచ్చినాఁడు. నిన్న తెప్పించినబట్ట ముందుగా చింపించి తరువాత వెళ్ళు.

సమయమునకు కుట్టుపనివాఁడు వచ్చుట మాణిక్యమున కెంతో యూరటగా నున్నది. క్రొత్తగుడ్డ చింపుటకును కత్తిరించుటకును తూనిక వేయుటకును చాలసేపు పట్టినది. కుట్టవలసినవిధము చెప్పివేసి లోపలకు పోయి లక్ష్మిదేవమ్మగారు నృసింహారావు వ్రాసినదాని

కుత్తరము వ్రాసికొనుచుండెను. ఈసందడిలో ముత్తవతల్లి హారము మాట మఱచిపోయిన బాగుండు నని మాణిక్యము కోరుచుండెను.

ఆమె యాలాగుననే మఱచిపోయి, ఉత్తరము చేతఁబట్టుకొని వచ్చి 'అమ్మాయీ! ఈయుత్తర మిప్పుడే టపాలో వేసి రావలెను. ఇక్కడికి దగ్గరనే గనుక నీవుపోయి టపాలో వేసివచ్చెదవా? రామిని నీబట్టలు తీసికొనివచ్చుట కయి చాకలిదానియింటికి పంపినాను. నా వెండిపోగు నిమిత్తము నే నెక్కడ వెదకినను కనఁబడలేదు. నేను బల్లలన్నియు తీసినాను; మంచము లన్నియు నెత్తినాను. అది భూమి లోనికి మాయమయినట్టు కనఁబడుచున్నది. అది తీసినవా రెవరో యీసారి తప్పకుండ కనుఁగొనెదను. మనయింట మరియెవ్వరును లేరు. అది తప్పక రామిపనియే యై యుండును.'' అని చెప్పుచు జాబు చేతి కిచ్చెను. నిర్దోషురా లయిన రామిమీఁద ననుమానపడ్డ పుడు మాణిక్యము మనస్సునకు నొప్పిగానుండి జరిగిన సత్యమును చెప్పివేయుద మని బుద్ధిపుట్టినను, మరల నింతలో నిప్పుడు బయటికి పోవుచున్నాను గనుక ముత్యములుకొని హారము బాగుచేయవచ్చు నని మనసు సమాధాన పఱుచుకొని, ఉత్తరమును ముత్యాలహార మును చేతపుచ్చుకొని వీధిలోనికి నడచి, ఊచవలె ముత్యాలయంగ డికి పరుగెత్తును. అంగడికిపోయి లోపల నెవ్వ రున్నారో యని వీధి లోని కిటకిగుండ తొంగిచూచునప్పటికి లోపల సరస్వతి కనఁబడఁగా దేహము కంపమెత్తి, నడవ కాళ్ళాడక సరస్వతి వెడలిపోయిన తరు వాత లోపలికి పోవలెనని తలుపుచాటున నిలుచుండెను. లోపలనున్న వారందఱును నొకరితరువాత నొకరు వెళ్లుచువచ్చిరిగాని యేవేళకును సరస్వతి వెడలిపోవుజాడ కనఁబడలేదు. వేగిర మింటికిపోకున్న ముత్త వతల్లి యేమనునో, ఎవ్వరిని పంపునో యని, లోపల భయముగా

నుండెను. అయినను ముత్యములు కొనకుండపోవుట కిష్టములేదు. ఈప్రకారముగా నాలోచించుచు నిలుచుండఁగా నింతలో లోపలి నుండి యంగడివాని మనుష్యు లొక పెద్దపెట్టెను మోచుకొనివచ్చిరి. మాణిక్యము పరధ్యానములో నున్నందున వారినిచూడక పెట్టెమీఁద పడుటయే కాక చేతిలోని ముత్యాలపేరు జారి దూరముగా పడెను. ఆమనుష్యులు దానిని చూడక పెట్టె దానిమీఁద పెట్టఁగా హారము నలిగి పొడుమయిపోయెను. అప్పుడే సరస్వతికూడ కావలసిన వస్తువు లనుకొని యింటికి పోవుట కయి యంగడిలోనుండి వెలుపలికివచ్చెను.

సర—ఓసీ! మాణిక్యమా! నీ విక్కడున్నా వేమి? నీవేమో బెదరియున్నట్టు కనఁబడుచున్నావు. కారణ మేమి?

మాణి—ఏమియులేదు. ఆపెట్టె తీసికొనివచ్చిన మనుష్యులు నామీఁద పడ్డారు. అంతే మరేమియులేదు.

సర—నీవస్తువేదో పడిపోయిన ట్టున్నది అవునా?

మాణి—నావస్తువు పడిపోయినదా? ఏమియు పడిపోలేదు. నీ కిటువంటియూహ యేలాగున పుట్టినది?

సర—కోపపడకు. నీవు క్రింద చూచుచున్నందున, ఏమో వెతకుచున్నా వనుకొన్నాను. సరే. పోకున్న మంచిదే. నాకు పని యున్నది. పోవలెను.

అని సరస్వతి వెడలిపోయెను. అప్పుడు మాణిక్యము జరగిన సంగతి యామనుష్యులతో చెప్పి పెట్టె యెత్తించవలె ననుకొన్నను, అది నలిగిపోయినది గనుక, ఇఁక నెత్తించిన కార్యము లేదని మరల నూరకుండెను. అంతేకాక యామనుష్యు లేదో పనిమీఁద మరల లోపలికి పోయినారు. వారు మరల నెంతసేపటికి వత్తురో తెలియదు. తా నాపెట్టె నొక్కతెయు నెత్తలేదు. ఇంటికడ అమ్మమ్మ కోపపడు

నన్న భయముచేత వారు వచ్చినదాఁక నిలుచుటకు సాహసింపలేక, హారము నక్కడనే విడిచిపెట్టి యాచిన్నది విచారించుచు, కాళ్ళీడ్చు కొనుచు మెల్లఁగా నింటివంక నురలెను.

---

## నా ల వ ప్ర క ర ణ ము

మాణిక్యము చింతాక్రాంతురాలయి పరిపరివిధముల విచారించుచు నింటికి నడువఁజొచ్చెను. ఆమె చేసిన యొక్క మోసమువలన నెన్నికష్టములు సంప్రాప్త మయినవి! అప్పగారి హారము పోయినది. చేసినతప్పెప్పుడు బయలపడునో యనుభయముచేత లోపలినెమ్మది యంతయు చెడిపోయినది. అప్పుడుసహితము చేసినతప్పిద మొప్పుకొ మ్మని యంతరాత్మ లోపల మెల్లఁగా చెప్ప నారంభించెను. కాని మాణిక్యము "నేను మొట్టమొదటనే నిజము చెప్పివేసినయెడల, నే నెంత సంతోషముగా నుందును! మన చక్కనిముత్యాలపేరుపోయిన దని తెలిసినట్టయిన, అమ్మమ్మ యెంత విచారపడునో! నేనింటికివెళ్లిన తోడనే హారము తీసికొని రమ్మని యడుగును. అప్పుడు నేనుహారము పోయినదని చెప్పవలసి వచ్చును. నేను నిజము చెప్పినను పోయిన హార మిప్పుడు మరలరాదు. అందువలన నాకుమాత్రము చీవాట్లు సంప్రాప్తమయి ప్రయాణము నిలిచిపోవును. నేను చెప్పకపోయిన యెడల, ఎవ్వరును కనుఁగొనలేరు. మాటాడ కూరకుండెదను" అని తలఁచుకొనుచు పోయెను. శ్రీవత్సాంకుఁడును పిల్లలు మిక్కిలి యుల్లాసముతో గంతులువేయుచు సుఖముగా నాడుకొనుచుండిరి; కొందఱు పండ్లు మొదలయినవి కొని సంతోషముతో తినుచుండిరి; మఱికొందఱ ఆటవస్తువులను చేతఁబట్టి కేకలు వేయుచుండిరి. ఈరీతిగా తనతోడి

వారందఱును పోయిగా నుఱుకట చూచి మాణిక్యమునకు మరింత వ్యసనము కలిగెనుగాని రేపుపినతండ్రిగారి యింటికి పోయెదనని మనసు కొంత సమాధానపఱుచుకొనెను.

అయినను చాలసేపంతరాత్మ యూరకున్నది గాదు. ఏమి తలఁచుకొన్నను మనస్సునకు ముందుగా ముత్యాలహారమే స్మరణకు వచ్చుచుండెను. ఇల్లు చేరినతరువాత కూరుచుండఁబోయినను, అడు కొనఁబోయినను, పాఠము చదువఁబోయినను, మరి యేమి చేయఁ బోయినను, నీవు చెప్పినది తప్పిదము సుమాయని యంతరాత్మ చెప్పి వేధింపసాగెను. ఆవల నెంతచప్పుడగుచున్నను, ఎంత సందడిగా నున్నను, అంతరాత్మ నిశ్శబ్దముగా పలుకు ములుకులవంటి పలుకులు లోపల వినఁబడుచునే యుండెను.

మాణిక్యము లోపలికి పోవునప్పటికి ముత్తవతల్లి చావడిలో కూరుచున్నది. దాపునకు పోఁగానే యామె మనుమరాలిని చూచి "ఏమే! అమ్మాయీ! నీవెన్నిమారులు చెప్పినను ముత్యాలపేరు మాట మఱచిపోవుచున్నావు. వేగిరము పోయి తీసికొనిరా" అని చెప్పెను. ఆమాటలు వినఁగానే మాణిక్యమునకు మతిపోయినది. హారము పోయినట్లు తెలియవలసినకాలము సమీపించినది, ఇఁక దాగెడుసదుపాయ మేమియు కనఁబడలేదు. అందుచేత నేమిచేయుదునా దైవమా యని కొంతసేపు చింతించి మాణిక్యము "నేనుపడకగదిలో నుండి హారము తీసికొని పోవుచుండఁగా నెవ్వరును చూడలేదు. నే నిప్పుడు చెప్పకపోయినపక్షమున, అమ్మమ్మ యెప్పుడును నేను తీసినా నని యనుమానపడదు. దానివిషయమై యిప్పుడు నే నేమియు చెప్పను; అందాఁక నూరకుండి నే నూరికి పోయి వచ్చినతరువాత నిజ మంతయు చెప్పివేసెదను" అని నిశ్చయముచేసికొని, వట్టిపెట్టె చేతఁ

బట్టుకొని మెల్లఁగా మేడ దిగివచ్చి, గుండెలు తటతటకొట్టుకొనఁగా తెల్లపోయి సమీపమున నిలుచుండెను. ఎక్కడికో పంపఁదలఁచు కొన్నందున రామి ప్రయాణమునకు సిద్ధముగా దాపున నిలువఁబడి యుండెను.

అప్పుడు లక్ష్మిదేవమ్మ తల యెత్తి చూచి "అమ్మాయీ! పెట్టె తెచ్చినావా? నేనిది యెందుకు తెమ్మన్నానో చెప్పుకో" అని యడిగెను.

మాణి—నేను చెప్పుకోలేను—అని బెదరిబెదరిచూచుచు పెట్టెచేతి గట్టిగా పట్టుకొని మాటలు తడఁబడ నిలుచుండెను.

లక్ష్మి—రత్నసెట్టి యింగడికిపంపి నీకుఁగూడ నిటువంటి హార మొకటి తెప్పించుటకయి రామిని పంపు చున్నాను. ఇప్పుడు నీవు యుక్తముగా నడచుచున్నావు గనుకను, అదిగాక మీపినతండ్రిగారి యింటికి రేపు వెళ్ళుచున్నాము గనుకను, మీయిద్దఱిలో భేదము లేకుండ చేయుటకై తెప్పింపఁ బోవుచున్నాను. అమ్మాయీ! ఏమి? నేను చెప్పిన దేమియు వినఁబడనట్టు నావంక దేటిపాటు చూచుచు నిలుచున్నావు?

ఇప్పుడయినను మాణిక్యము తనవద్దకువచ్చి కౌఁగిలించుకొను నని యామె తలఁచెనుకాని యాచిన్నది దగ్గఱకురాక పెట్టె చేతఁ బట్టుకొని ముత్తవతల్లి మొగమువంక చూచుచు చిత్రపుబొమ్మవలె నిలుచుండి పలుకవేమని ముత్తవతల్లి కేకవేయఁగా "అమ్మా! హారము లేదు. భ్రమరాంబముత్యాలహారము లేదు. పోయినది" అని తడఁబడుచు చెప్పెను.

లక్ష్మి—ఏమీ? పోయినదీ? ఏమిపోయినది? హారము పోవుటకు వీలులేదు. పెట్టె నాచేతి కిమ్ము.

మాణి—అమ్మమ్మా! నిజముగానే పెట్టెలో హారము లేదు. వట్టిపెట్టె యున్నది—అని యేడ్వ మొదలు పెట్టెను.

లక్ష్మి—పెట్టెలో హారము లేదా ? భ్రమరాంబ మరియొక చోట పెట్టినదేమో! నేను మేడమీఁదికి పోయి వెతకుదునా ?

మాణి—అమ్మమ్మా ! మేడమీఁదికి పోయినకార్యము లేదు. అది యక్కడ లేదు—అని వెక్కివెక్కి యేడ్వసాగెను.

లక్ష్మి—అమ్మాయీ! ఏడువఁబోకు. భ్రమరాంబ తనతో కూడ తీసికొనిపోయి యుండును. నేను తీసికొనిపోవ ద్దనుచుండఁగా తీసికొనిపోయినది. అది యెంత దుర్మార్గురాలో చూచినావా? పెట్టె యెప్పటిచోటనే తిన్నఁగా నున్నదా ?

మాణి—ఉన్నది—అని పెద్దపెట్టున నేడ్చెను.

అప్పుడు లక్ష్మిదేవమ్మగారు మనుమరాలిని తనదగ్గఱకు తీసికొని కన్నులనీరు తుడుచుచు "అమ్మాయీ ! హారమునిమిత్తమై యింతగా నేల యేడ్చెదవు ? ముత్యాలహారము రేపే పీపాటికి మరల వచ్చును. అది భ్రమరాంబ పాడుచేసినపక్షమున దానిమీఁద నాకు మహాకోపమువచ్చును." అనిచెప్పి రామివంకతిరిగి "ఓసీ! రత్నసెట్టి వద్ద నటువంటిహారము లనేకము లుండి యుండవచ్చును. నీవు పోయి యొకటి తీసుకొనిరా" అని పంపివేసి తాను పెట్టె పదిలముగా వెదక నారంభించెను. రామి వెళ్ళినతోడనే ముత్తవ తన్నేమయిన నడుగు నేమో యనుభయముచేత, మెల్లఁగాజాఱి తాను మేడమీఁద పరుండు గదిలోనికి పోయి భయముచేతను చలిచేతను మంచముమీఁద ముసుఁగు పెట్టుకొని తానాదుర్మార్గకార్యము నేల చేసిపోతినాయని పశ్చాత్తాపపడ నారంభించెను. నేను కొంచెము దినములు తొందర పడకుండినయెడల నాకుకూడ మంచిహారమువచ్చునుగదా, నేనింతలో

కంఠహారము నేల తీసితి వని విచారించు చుండఁగా, ముత్తవతల్లివద్ద నుండి భోజనమునకు రమ్మని వర్తమానము వచ్చెను. ఇప్పు డమ్మమ్మ వద్దకుపోయి మరల హారముమాట వినవలెనుగదాయని యాచిన్న దానికి మఱింత మనోవేదన కలిగెను. కానిభోజనమువద్ద నామెయా ప్రసంగ మేమియు తీసికొని రాలేదు. ఆమెమన స్సంతయు రేపటి ప్రయాణసన్నాహము మీఁద నున్నది. అంతేగాక హారముమాట మరల తెచ్చి మనుమరాలిమనస్సునకు నొప్పి కలిగించుటకూడ నామె కిష్టము లేదు. కంచముముందుకూరుచుండి భోజనముచేయుచుండఁగా మనుమరాలిముఖమువంక తేఱి పాఱచూచి లక్ష్మీదేవమ్మ. "అమ్మాయీ! నీదేహస్థితి చూడఁగా నాకు భయ మగుచున్నది నీ వేలాగుననో కనఁబడుచున్నావు కారణమేమి?" అని యడిగెను. మాణిక్యము "మఱేమియు లేదు. కొంచెము——" అని సత్యము నాలుకతుదకు రాఁగా నడఁచుకొని యూరకుండెను. లక్ష్మీదేవమ్మ "ముత్యాలపేరు కనఁబడకపోవుటచేత నీకు కొంచెమువిచారముగా నున్నది కాఁబోలును! రేపు భ్రమరాంబ వచ్చినప్పుడు తీసికొని వచ్చును. తిన్నఁగా నన్నము తిను" అని ధైర్యము చెప్పి, మంచము మీఁద పరుండి మనుమరాలిమనస్సులోనిచింత పోవుటకయి నవ్వుచు కథలు చెప్ప మొదలుపెట్టెను. ముత్తవతల్లి చెప్పుకథలచేత హారము కథ మఱచిపోయి మాణిక్యమెప్పటియట్లు సంతోషముతో నుండఁగా, ఆమె కథలు చెప్పుచునే తరువాత గడియ కొక్కొక్కమాటచొప్పున సందర్భము లేకుండ చెప్పుచు కన్నులు మూసికొని మెల్లఁగా కునికెను. మాణిక్యము రేపటిప్రయాణముసంగతి తలఁచుకొని, అప్పగారు వచ్చునని యంతయును గలిసి బండిలో పినతండ్రిగారియూరికి పోదు మనియు, సంతోషించు చుండఁగా నింతలో వీధిలోనుండి సరస్వతి

లోపలికి వచ్చెను. జతకత్తెనుచూడఁగానేమాణిక్యమునకు గుండెలలో దిగులు పుట్టినది, కాళ్ళచప్పుడుచేత కన్నులువిప్పిచూచి ముత్తవతల్లి 'సరస్వతీ! బాగున్నావా?'' అని యడిగినమీఁదట ప్రాణములు బొత్తిగానేకుదుటలేవు. సరస్వతి ''అవ్వా! బాగున్నాను'' అనిచెప్పి మాణిక్యమువంకఁ దిరిగి ''ఓసీ! నీతోనొక్కమాట చెప్పుటకు వచ్చి నాను. నిన్న మన మాడుకొన్నప్పుడు నీవి కొన్ని—'' అని చెప్పఁ బోవుచుండఁగా చెప్పనియ్యక మాట కడ్డము వచ్చి మాణిక్యము ''ఓసీ! నిన్న నీతో చెప్ప మఱచిపోయినాను. రేపు మేమూరికి వెళ్ళు చున్నాము. మాఅప్ప రేపువచ్చును.'' అని తా నూరికి పోవుటసంగ తియు తరువాత తానక్కడ చేయఁ దలఁచుకొన్న కార్యములును ముత్తవతల్లిని మఱపించుటకయి తెంపులేకుండ చెప్ప మొదలుపెట్టెను. ఇంతలో దైవవశముచేత లక్ష్మీదేవమ్మగారు మరల కన్నులు మూసి కొనఁగా నామెకు నిద్రాభంగము కలుగకుండ మాణిక్యము మెల్లఁగా గుసగుసలాడి చెప్పుచుండెను.

అప్పుడు సరస్వతి తనజేబులోనుండి యొక కాగితపు పొట్లమును తీసి ''నిన్నరాత్రి మన మాడుకొన్నప్పుడు తెగిపోయిన హారములోని పూసలుదొరకఁగా పొట్లముకట్టి మాఅమ్మ నీచేతికిచ్చి రమ్మన్నది.'' అని చెప్పి చేతికిచ్చెను. తీసికొనునప్పుడు చేయి తగులఁగా లక్ష్మీదేవ మ్మగారు కన్నువిచ్చిచూచి ''మీఅమ్మ నాకిమ్మన్నదా ?'' అని యడుగఁగా మాణిక్య ముత్తరము చెప్పినదాఁక నవకాశ మియ్యక తానందుకొని ''లేదు లేదు. నాకిమ్మన్నది. నీనిద్రకు భంగము వచ్చుననియే మే మేకాంతముగా మాటాడుకొనుచున్నాము. మే మావలికి పోవుచున్నాము. నిద్రపో'' అని సరస్వతిని లాగెను. సరస్వతి నడుచుచు ''హారముసంగతి మీఅమ్మమ్మతో చెప్పినావా?'' అని

ప్రశ్న వేసెను. లక్ష్మీదేవమ్మగారు నిద్రమబ్బులో సగము విని కన్నులు తెఱవకయే 'హారముమాటా? దానికొఱకు సరసమమీరు విచారించ వద్దు; రేపీపాటికి మరలవచ్చును.'' అని చెప్పియూరకుండెను.

సర—ఓసీ! నీవెంత యదృష్టవంతురాలివే! మాఅమ్మమ్మకు నీమీఁద బహుదయ.

మాణి—(నోరు మూసికొని) మనము అమ్మమ్మకు నిద్రాభంగము చేయుచున్నాము—అని దూరముగా లాగుకొని పోయెను.

''నే నెవరినిద్రకును భంగముకలుగ చెయ్యను. వెళ్ళుచున్నాను'' అని చెప్పి సరస్వతి నడచఁగా నప్పుడు మాణిక్యముగుండె కొంత కుదుటపడెను. తరువాత కొంతసేపటికి లక్ష్మీదేవమ్మగారు నిద్రలేచి మనుమరాలివద్ద పాఠ మప్పగించుకొని కుట్టునేర్పి యాటవిడుపిచ్చెను. ఆయాటలసందడిలోను ప్రయాణముసంతోషములోను మాణిక్యము హారముమాట మఱచిపోయెను గాని మధ్యమధ్య రేపు భ్రమరాంబ వచ్చినతరువాత నేమగునో యని కొంత భయము కలుగుచు వచ్చెను. రాత్రిభోజన మయినపిమ్మట నిద్రపోవుటకు మంచము చేరి పరుండు నప్పటి కాచిన్న దానియారాటము మరల ద్విగుణముగా నారంభించి నది. మఱచిపోదు నన్నను మఱచిపోనియ్యక నిద్రపట్టనియ్యక యంత వఱకును కునుకుపాట్లు పడుచున్న యంతరాత్మ యప్పుడ మేలుకొని చేసినదుష్కార్యమును జ్ఞప్తికితెచ్చి బాధింప మొదలుపెట్టెను. అంతరాత్మ కన్నులకు కనఁబడక యతిసూక్ష్మముగానున్నను, చెప్పెడు మాట పరుల కెవ్వరికిని వినఁబడక పోయినను, ఆశబ్ద మాచిన్నదాని హృదయమున బిగ్గరగా నాటుకొని యెంతప్రయత్నము చేసినను నిద్ర పట్టక తెల్లవారినదాఁక మంచముమీఁద పడి పొరలుచు నిమిషమొక యుగముగా రాత్రి పుచ్చెను. పాప మారాత్రి మాణిక్యమునకు

గలిగిన సంతాపము దేవునికే తెలియును గాని యిట్టి దట్టిదని మనకు వివరింప శక్యమయినది కాదు.

---

## అయిదవప్రకరణము



మఱునాఁటియుదయమున మంచుకురిసి మిక్కిలి చలిగానుండెను. లక్ష్మీదేవమ్మగారు ప్రయాణమునకు కావలసిన సాధన సన్నాహములు చేయుచుండెను. మాణిక్యముకూడ పినతండ్రిగారియింటికి పోవలె ననెడియుత్సాహముచేత ముత్తవతల్లివెంట సందడిగా తిరుగుచుండెను. ఇంతలో చలిదిభోజనములకు వేళ అయినందున మనుమరాలికి కంచములో అన్నము వడ్డించి లక్ష్మీదేవమ్మగారు "రెండు మూఁడుగడియలలో భ్రమరాంబ యింటికి వచ్చును. రాత్రిపడ్డమంచుచేత దానికి బండిలో పడిసెము పట్టునేమో!" అని చెప్పెను. భ్రమరాంబ రెండుగడియలలో వచ్చునన్నమాట వినఁగానే మాణిక్యము గుండెలలో రాయి పడినది. అప్పగారియం దెంతోప్రేమ గనుక మఱి యొకప్పు డయినపక్షమున నెంతో సంతోషముతో నెదురుగా పోయి యుండును. భ్రమరాంబ లేనందున తనతో నాడుకొనువారు లేక ఖిన్నురాలుగా నుండియుండును. అయినను పాడు ముత్యాలహారము మనస్సునకు తీఱనివ్యథ తెచ్చిపెట్టినది. ఆముత్యాలపేరు సంగతి మాణిక్యమునకుతప్ప మఱి యెవ్వరికిని తెలియదు. భ్రమరాంబ వచ్చినతరువాత ముత్యెసరమునిమిత్త మెక్కడెక్కడ వెతుకుదురో భ్రమరాంబ యెంతఅల్లరిచేసి దానికొఱకు మేడ్చునో, కడపట నవరి మీఁద పడునో యని మాణిక్యమునకు మనస్సులో దిగులుగానుండెను. భోజనముచేసి యథాప్రకారముగా విచారించుచుండఁగా దడదడ బండి యొకటి వచ్చి వీథిగుమ్మములో నిలిచెను. దానిలోనుండి భ్రమరాంబ

దిగితచ్చి పిలువఁగానే ముత్తవ పరుగెత్తుకొనిపోయి మనుమరాలిని కౌఁగిలించుకొనెను. రామి పెట్టె మొదలఁగునవి దింపి తీసికొనివచ్చి లోపల పెట్టెను. బండివానికి కూలి యిచ్చి పంపివేయఁగానే భ్రమ రాంబ సంతోషముతో ముత్తవ మొగమువంక చూచి "అమ్మమ్మ! మనము చిన్ననాయనగారియింటికి విజయనగర మెప్పుడు వెళ్లుదుము నేనుచూచినవానిలో నంతమంచియూరు లేదు." అని మాణిక్యమును చూచి, "ఓసీ! చెల్లాయీ! నీవు సంతోషముగానున్నట్టు కనఁబడవు ఎందుచేత?" అని యడిగెను.

లక్ష్మి—పూర్ణమ్మగారియింటి కాడుకోఁబోయిన నాటిరాత్రి నుండియు మాణిక్యము తిన్నగా లేదు. కారణ మేమో నాకు తెలియ కున్నది.

భ్రమ—చెల్లాయీ! చిన్ననాయనగారియింటికి వెళ్ళఁబోవు నప్పుడు నీవు విచారముగా నుండఁ గూడదు. అక్కడ మనకెంత సంతోషముగా నుండునో నీకు తెలియదు. నేను క్రిందటిసారి వెళ్ళి నప్పుడు నాకు బహువినోదముగా నున్నది.

మాణి—అది యెటువంటిస్థలమో చెప్పు. అమ్మమ్మ యెప్పు డును చెప్పలేదు.

లక్ష్మి—దానికేమి తరువాత చెప్పవచ్చును గాని, భ్రమ రాంబా! నేను తీసికొనిపోవద్దని చెప్పుచుండఁగా ముత్యాలహార మెందుకు తీసికొనిపోయినావు?

భ్రమ—నేను ముత్యాలహారము తీసికొనిపోయినానా! నే నెప్పుడయిన నీవు చెప్పినమాట మీఁటి యట్లుచేయుదునా? ముత్యాల పేరు నీవు పెట్టుమన్న యలమారులోనే దిగపెట్టి పోయినాను.

లక్ష్మి—మాణిక్యముచూచివచ్చి, అక్కడ లేదని చెప్పుచున్న దే.

భ్రమ—అక్కడనే తప్పకుండ నున్నది. నేను వెళ్ళి తీసికొని వచ్చి చూపెదను చూడు.

అని మహావేగముతో పరుగెత్తి మేడమీఁది కెక్కి, పెట్టెతీసి చూచి, కొంచెముసేపు క్రిందను మీఁదను వెదకి మరల పరుగెత్తుకొని వచ్చి దీనముఖముతో "అమ్మమ్మా! దాని నెవరు తీసినారు? నీవేమి చేసినావు? నాచక్కనిముత్యాలహారము" అని భ్రమరాంబ కన్నీళ్ళు విడువ నారంభించెను.

లక్ష్మి—నే నేమీ చేయలేదు. ఇదియేమో మాయగా నున్నది. ముత్యాలహారము పోయినది! నిశ్చయముగా పోయినది! ఎవ్వరు నెఱుఁగ మనుచున్నారు.

భ్రమ—అమ్మమ్మా! నేను నిశ్చయముగా నీవిచ్చినపెట్టెలో పెట్టి ముత్యాలపేరలమాఱులో పెట్టినాను. ఎవరో దానిని తీసికొని యుండవలెను. అది యెగసిపోలేదుగదా?—చెల్లాయీ! నీవు తీసిపారవేసినావా?

అనఁగానే మాణిక్యము మొగిమున కత్తివాటు వేసినను నెత్తురులేక మాటలు తడఁబడ "నేనా? అగదిలోని కమ్మమ్మ నన్ను పోనియ్యని సంగతి నీ వెఱుఁగవా?" అని యూరకుండెను.

భ్రమ—నీవు తీసినావో లేదో నాకేసి చూచి నిజముచెప్పు.

అని కన్నులెఱ్ఱచేసి చెల్లెలివంక చూడ మొదలుపెట్టెను. అప్పుడు తల మొదలుకొని పాదమువఱకును మాణిక్యము దేహమంతయు కంపమెత్తఁగా మాట తెచ్చుకొని "నేను తీయలేదు" అని తడఁబడుచు చెప్పెను.

లక్ష్మి—అది తీసియుండదు. హారము మాణిక్య మేమిచేసికొనును? అది పోయినదని తెలియఁగానే పెద్దపెట్టున నేడ్చినది. ఇది దానిపనికాదు.

అయినను భ్రమరాంబమాత్ర మంతటితో తృప్తిపొందలేదు. కాని మాణిక్యము హారముజోలికి పోయినందుకు నిదర్శనము లేవియు లేవు. కాబట్టి మరల వెతకవలెనని నిశ్చయించి భోజనమయిన తరువాత అండటును జేరి పెట్టెలన్నియు తీసియు, బుట్టలు క్రింద ద్రిమ్మరించియు, పరుపులక్రిందను గూళ్ళలోను గొడుగుబల్లమీందను వెదకియు, విసిగి పోయిరి కాని హారముమాత్ర మగపడలేదు. పోయినట్టు తెలిసి వెదకుట మాణిక్యమునకు ప్రాణసంకటముగా నుండెను. అప్పు డంతరాత్మ మేలుకొని మరల హృదయములో "నీవెంతహాని చేయుచున్నావో, అసత్య మాడుటవలన నెంతకష్టము కలుగనున్నదో, నీవుకని పెట్టలేదు. ఇంతట నైన నీతప్పిదముచెప్పుకో. అమ్మమ్మతో హారమువిషయములో జరిగిన దంతయు చెప్పివేసి, ఆమె చేసినశిక్షకు సహించి యూరుకో" అన మాటిమాటికి మొఱపెట్ట నారంభించెను. అప్పుడునయితము మాణిక్యముచేసిన నేర మొప్పుకోలేదు. దుర్మార్గములో ప్రవేశించి దానిలో సాగినడచినకొలందిని దానినుండిమరలుటయెక్కువకష్టముగా నుండును. అప్పుడు ప్రాణము విసిగి వెదకుట చాలించి ముత్తవతల్లియు మనుమ రాలును మరల చావడిలోనికి వచ్చిరి. ఆవల కనుకొన్నట్టు వారి కాదినము సంతోషదినముగానుండలేదు. అవ్వగారు తనపెట్టెయెవ్వరో తీయుటయు దంతపుటంగుటయు పగిలిపోవుటయు, తలంచుకొని విచార పడుచుండెను. భ్రమరాంబ తాను తిరిగి యింటికి వచ్చునప్పటికి తన ముత్యాలహారము నెవ్వరో యెత్తుకొనిపోవుటయు, తా నాహారము నొక్కసారి తప్ప మఱియెప్పుడును మెడలో వేసికొనకపోవుటయు, తన కెవ్వరును మరల కొనిపెట్టరనియు, ఎంచి ఖేదపడం జొచ్చెను. ఆముగ్గు రిలో మాణిక్యము మనోవేదన యింతంతని చెప్ప నలవికానిది. క్రింద చూచుచు గడ్డముక్రింద చేయి పెట్టుకొని కూర్చుచుండి చింతించునప్పు

డాచిన్నదానిగుండెలు పలిగిపోయినట్లు కనఁబడెను. లక్ష్మీదేవమ్మ గారు తనయింట నెవ్వరో దొంగతనముచేసి బొంకుచున్నవా రన్నా రనివిచారపడుచు "నావెండిచుట్టను ముత్యాలహారమునుతీసినదుర్మార్గు లెవ్వరో నేనుచెప్పలేను. ఆదొంగతనము చేసినవారిని భగవంతుఁ డెఱిఁగి యున్నాఁడుగనుక, ఆయన శిక్షింపక మానఁడు" అని చెప్ప నారంభించెను. ఆమాటలు చెప్పుచున్నంతవఱకును మాణిక్యము తల వంచుకొని నేలచూచుచు, చీఁకటి పడినతరువాత పోయి మత్తవ తల్లితో నిజమంతయు చెప్పివేసెద ననుకొనెనుగాని మరల తెల్లవాఱిన తరువాత సర్వము మఱచిపోయి యూరికి పోయి వచ్చినతరువాత చెప్పెదునని యూరకుండెను.

---

## ఆఱవప్రకరణము

మఱునాఁటియుదయమున దంతధావనము చేసికొనుచుండఁగా రామి తలుపు తీసికొనివచ్చి "అమ్మా! ఇదిగో మీవెండిచుట్టు దొరకి నది" అని లక్ష్మీదేవమ్మగారిచేతి కిచ్చెను.

లక్ష్మి—(సంతోషముతో) పోయిననావెండిచుట్టును చూడఁ గానే నాకు ప్రాణములు లేచివచ్చినని. నీకిది యెక్కడ దొరకినది?

రామి—మేడమెట్లవద్ద చావడితుడుచు చుండఁగా దొరకినది. కిటికీవద్ద మీరు కూరుచుండు బల్లక్రోటిక్రింద పడియున్నది.

అప్పుడు లక్ష్మీదేవమ్మగారు రామివంక కన్నులెఱ్ఱచేసి చూచి నదిగాని రామిమాత్రము భయపడక నిజము చెప్పినందున దృఢముగా నిలుచుండెను.

లక్ష్మి—అన్నిసారులు మేము బల్లతీసి చూచినప్పటికిని కనఁబడక పోవుట వింతగా నున్నది.

రామి—(దృఢముగా) ఆసంగతి నాకేమియు తెలియదు. నేనిప్పుడు బల్లక్రింద చీపురుతో తుడుచుచుండఁగా చీపురుకు తగిలి యీవలికి వచ్చినది.

లక్ష్మి—చీపురుతో నీవలికివచ్చిన దేమి? ఎవరో నాపెట్టె తీసిన వారే యీచుట్టుతీసియుందురు. లేకపోయినపక్షమున నాపెట్టెముట్టు కోవలసినపని యేమివచ్చినది? నేఁటియుదయముదాఁక నీకు కనఁబడక పోవుట యేమో నాకువింతగానున్నది. ముత్యాలహారముకూడ తరు వాతనీకే దొరుకునేమో !

ఆదినము లక్ష్మీదేవమ్మగా రెవ్వరితోను మాటాడక మనుమ రాంద్రను ముద్దుసహితము పెట్టుకొనక చిరాకుగానుండెను. ఆమె పరధ్యానముతోనుండి కూరలలో రెండుమాఱు లుప్పువేసెను; గంజి వార్చుచు, అన్నము సగము గంజిలో పడిపోయినను చూడకుండెను. బ్రహ్మరాంబ ముత్తవతల్లిని పలుకరించి ప్రయాణముమాట ప్రసంగిం పఁగా సందర్భములేక యొకదానికొకటి యుత్తరము చెప్పఁజొచ్చెను. భోజనమయినతరువాత ఆమె మనుమరాంద్రనిద్దఱిని మఱియొకచోటికి పంపివేసి చేతిలోనిదారమును సూదియు పెట్టుకొని కుట్టక ముత్యాల హారముసంగతియు వెండిచుట్టుసంగతియునాలోచించుచునొంటిగాకూరు చుండెను. ఆమె యాలోచించినకొలఁదిని ముత్యాలపేరు పోవుటకును వెండిచుట్టు పోవుటకును సంబంధమున్నట్టును, రామి తప్ప మఱియెవ్వ రును సందేహింపఁ దగినవారు లేనట్టును, కనఁబడెను. ఇంతవఱకును రామినడతయందామె కేమియు లోప మగపడలేదు. రామిమీఁద ననుమానమేకాని యీవిషయములో సహితము నిశ్చయముగా

రామియే తీసినదనుటకు స్పష్ట మయినసాక్ష్యములేదు. వెండిచుట్టు తనంతట ఎగిరిరాదుగనుక, ఎవ్వరును తీయకపోయినపక్షమునమఱియె ట్లీవలికి వచ్చినదని యామె తలపోయుచుండెను.

ఈప్రకారముగా తలపోయు చుండఁగా రామి మరల తలుపులు తీసికొనివచ్చి చేతిలోనున్నయొక కాగితపుచుట్టను తనయజమానురాలి ముందుపెట్టి 'నాకిప్పు డొక కాగితపుపొట్లముదొరకినది. అందులోభ్రమ రాంబగారిహారములోనిపూసలవంటి ముత్యములున్నవి' అనిచెప్పెను.

లక్ష్మి—(కాగితము విప్పుచు) భ్రమరాంబహారమా! ఇవి నీకె క్కడనుండి వచ్చినవి ?

రామి—(కొంచెమయిన ననుమానింపక గంభీరముగా) ఉతుకుట కయి మాణిక్యముగారి చొక్కాను నూతివద్దకు పట్టుకొనిపోఁగా జేబులో నుండి జాఱిపడినవి.

ఆమాటలు చెప్పునప్పటి కామెచేతులు వడఁకమొదలుపెట్టి కొన్ని ముత్యములు క్రిందపడెను. ఆమె కొంచెముదిటవు తెచ్చుకొని "ఏమిా! మాణిక్యముచొక్కా? ఏచొక్కా?" అనితొందరగా నడిగెను.

రామి—మీరుతుకుమన్నమాణిక్యముగారి తెల్లపువ్వులచొక్కా ఉతుకుటకు దులుపఁగానే దానిలోనుండి యీచిన్నపొట్లమూడి పడినది.

ఆమాటలు చెప్పినతోడనే లక్ష్మీదేవమ్మగారిమొగము కంద గడ్డవలె నెఱ్ఱపడి, తరువాత క్రమక్రమముగా వర్ణముమాఱి తెల్లపడి పోయెను. అప్పుడామె "రామిా! నీవు నిశ్చయముగా నిజమే చెప్పు చున్నావా? నేను దేని నయినను సహింతును గాని యసత్య మొంత మాత్రమును సహింపను" అని చెప్పెను.

రామి—అమ్మా! నేను సత్యమునే చెప్పినాను. నేను సత్యము కాని దేదియుఁ జెప్పలేదు. ఈచిన్న కాగితము—

లక్ష్మి—అవును! అవును! నీవు మరల చెప్పనక్కఱలేదు. ఇంత కును ఈముత్యము లొకవేళ మనహారములోనివే కాకపోవచ్చును. అయినను మనహారములోనివిలాగున నేయీపూసలు కనఁబడుచున్నవి. అంతేకాక యివి యొకపేటలో సగమువఱకును వచ్చునట్టుకానఁబడు చున్నవి. మాణిక్యము రాఁగానే దానినడిగి తెలిసికొనెదను. రామీ! నీ విప్పుడు పో.

రామిని పంపివేసినతరువాత లక్ష్మిదేవమ్మగా రొక్కతెయుఁ గూరుచుండి యాలోచించుచు "ఇదిమాణిక్యము పనియయియుండదు. నాముద్దులమనుమరా లిటువంటిపని చేయునని నే నెప్పుడును నమ్మఁ జాలను. ఒకటిరెండుమాఱు లబద్ధములాడి కొంచెము మోసముచేసి నామనస్సునకు వెనుక సంవత్సరము క్రిందట కొంచెము నొప్పికలుగఁ జేయుటతప్ప, ఈనడుమ నెప్పుడును అటువంటిపని నేఁ దియు చేసి యుండలేదు. కాదు. మాణిక్యముపనికాదు. నిజముగా మాణిక్యమే యీపని చేసియుండినయెడల, నాహృదయముపగిలిపోదా?" అనుకొను చుండెను. ఆమె మనుమరా లెంతనిర్దోషురాలని భావించుకొన్నను, మనుమరాలి నడిగి తెలిసికొనువఱకును ఆమెమనస్సు కుదుటఁబడి యుండలేదు. ఆమె చీమ చిటుక్కుమన్నను మనుమరాండ్రు వచ్చు చున్నా రేమో యని వీధివంక చూచుచు తొందరపడుచుండఁగా, కొంతసేపటికి వారిమాట వినఁబడెను. భ్రమరాంబ పినతండ్రిగారి యింటివద్దనున్న యుయ్యాలమంచములు, బొమ్మలపందిళ్ళు,ఆటదొడ్లు మొదలయినవానిని గుఱించి చెప్పుచుండెను. మాణిక్యము ముత్యాల పేరుమాట మఱచిపోయి ప్రయాణము మాటలు వినుచు మిక్కిలి

యుల్లాసముగా నుండెను. కాని మఱియొక నిమిషములో నాయుల్లాస మంతయు పోయెను. ఆచిన్నది లోపలికి వెళ్ళినతోడనే ముత్తవతల్లి మనుమరాలిని పిలిచి "అమ్మాయీ! నీ వీముత్యాలపొట్లము సంగతి యేమయిన నెఱుఁగుదువా?" అని యడిగెను. ఆకస్మికముగా నడుగగానే యులికిపడి తెల్లపోయి 'అమ్మా! ఏముత్యాలు!" అని భయముతో నడిగెను.

లక్ష్మి—అమ్మాయీ! భయపడకు. నాదగ్గరకురా, ఇవిభ్రమరాంబముత్యాలహారములోనివిలా గున్నవి. రామి నీచొక్కాజేబులో కనఁబడిన వని చెప్పుచున్నది.

మాణిక్య మప్పుడు తా నెఱుఁగ నని తప్పించుకొనుట కాలోచించుచుండఁగా లోపల నంతరాత్మ లేచి 'నిజముచెప్పియొప్పుకో' లేని యెడల, ఈదోషము కేవల నిరపరాధులమీఁద పడును. అనిబోధింప మొదలుపెట్టెను. అంతటనైన మాణిక్యము సత్య మొప్పుకొనక "అమ్మా! ఏవీ! పూసలు చూడని" మ్మని యడిగెను.

లక్ష్మి—ఇవిగో పూసలు. అవి నిశ్చయముగా భ్రమరాంబ హారములోనివే. దాని కేమియు సందేహములేదు. అవి నీజేబులోని కెట్లు వచ్చినవో నా కిప్పుడు తెలియవలెను.

మాణి—"నాకు తెలియదు" అని సంశయింపక, ఒక యసత్యమువలన మఱియొక యసత్యమును పలుకవలసినదయి, అంతరాత్మ యొక్కమాట నలక్ష్యముచేసి, చటాలున చెప్పివేసెను.

లక్ష్మి—అలాగయినపక్షమున నీజేబులో ఇవి నీవు పెట్టనేలేదు? ఆసంగతి నీకు తెలియనే తెలియదు? నీఅప్పగారి హార మెప్పుడును నీవు ముట్టుకోనేలేదు? కాదా?

లేదని మనుమరాలు చెప్పఁగానే ముత్తవమాణిక్యమును చేరఁ దీసికొని "అమ్మాయీ! మాణిక్యమా! నీవే యీపని చేసియుండినపక్షమున నేనిఁక ముం దెప్పుడును సంతోషము పొందియుండకపోదును. నీవు నన్ను మోసము చేసినందుకు నాగుండెలు పగిలిపోవును. నీవు నిజము చెప్పుటకయి కూడ భయపడుటకు నే నెప్పుడైన నీమీఁద నిష్కారణముగా కోపపడినానా?" అని కన్నులనుండి బొటబొట నీరు కాలువ బుజ్జగింపసాగెను. మాణిక్యమున కేమి చెప్పుటకును ఏమి చేయుటకును తోఁచలేదు. ముత్తవతల్లి తనమీఁద కనఁబఱచిన ప్రేమచేత మాణిక్యమునకు మఱింత వేదన కలిగెను. కాని యాచిన్నది తన్నడిగినప్పుడెల్లను తానావిషయ మేమియు నెఱుఁగననిపట్టుదలతో చెప్పుచూరాఁగా ముత్తవతల్లి సంతోషించి, మనుమరా లబద్ధ మాడినయెడల తనకు ముత్యాలహారము పోయినప్పటికంటెను వేయిరెట్లు హెచ్చుదుఃఖము కలిగియుండునని చెప్పి యోదార్చెను.

నాటిమధ్యాహ్నము లక్ష్మీదేవమ్మగారు రామిని తనగదిలోనికి పిలిచి బిగ్గరగా మాటాడ మొదలుపెట్టెను. ఆ కేకలువినిమాణిక్యము తన పేరుకూడ వినఁబడఁగా నేమో తెలిసికొందమని వచ్చి యీవల తలుపునకు సమీపమున నిలుచుండెను.

లక్ష్మి—రామీ! వెండిచుట్టు తీసికొన్నను నేను సహించియూరకుందును. నీ వాదోషమును నిర్దోషురాలయిన మాణిక్యముమీఁద మోపుటకు ప్రయత్నించుటమాత్రము నేను సహింపలేను. అందువిషయమయి నిన్ను నేను క్షమింపఁజాలను.

రామి—అమ్మా! నేనుముత్యాలహారమునుగాని వెండిచుట్టును గాని తీయలేదు. నాదికానిది చిల్లిగవ్వయైనను నేనెప్పుడును ముట్టుకోలేదు. ఈసంగతి మాఅమ్మకు తెలియును. నాజీవితకాలములో

నేనెప్పుడు నొక్కయసత్యమునైన పలికియెఱుఁగనిమాట కావలసిన యెడల మాతల్లినడిగి తెలిసికొండి.

లక్ష్మి—ఈవఱకు లేకపోయినను నీవిప్పుడబద్ధమాడుచున్నావు. మూర్ఖముగా లేదనుటకంటె చేసినతప్పిద మెందుచేత నొప్పుకోరాదు?

రామి—అమ్మా! నేను నిర్దోషురాలను. చేయనినేరమును నేనెట్లొప్పుకోను?

లక్ష్మి—ఎన్నిసారు లడిగినను మాణిక్యము తా నెఱుఁగనని చెప్పుచున్నప్పుడు ముత్యాలు దానిజేబులో దొరికినవనిచెప్పుటకు నీవెట్లు సాహసించుచున్నావు? ముత్యములు నడచిపోయి చొక్కా జేబులో ప్రవేశించిన వనుకొన్నావా?

అని కేకవేసి కన్నులెఱ్ఱచేసి కోపపడఁగా రామి మాఱుమాట పలుకక మొగమునకు కొంగడ్డముపెట్టుకొని పెద్దపెట్టున నేడువ మొదలు పెట్టెను.

లక్ష్మి—ముత్యాలహార మేమిచేసినావో నీ విప్పటికిని చెప్ప కున్నావు. ఇష్ట మున్నయెడల నిన్నిప్పుడు నేను రాజభటుల కొప్ప గించవచ్చునుగాని నీవు చిన్నదానవు గనుక నీవిషయమయి నేనుదయ తలఁచుచున్నాను. నీవు దయ చూపఁదగినదానవు కాకపోయినను నిన్ను పనిలోనుండిమాత్రము తీసివేసి యింతటితో విడిచిపెట్టు చున్నాను. ఈదినముననే నీవు మాయిల్లు విడిచి వెళ్ళిపో.

ఆమాట లనునప్పటికి మాణిక్యముదేహముకంపమెత్త నారం భించెను. ఇంతలో లోపలినుండి యెవ్వరో వచ్చుచున్నట్టుకాళ్ళచప్పుడు వినఁబడినందున మాణిక్యము పరుగెత్తుకొనిపోయి మంచముమీఁద పడెను. ఆచిన్నది యింతపని జరుగునని యెన్నఁడు ననుకోలేదు. తన సంగతి బయులపడునేమో యని యిప్పుడు మునుపటికంటెను భయ

మిక్కుటము కాసాగెను; తాను చేసినతప్పిదమునకయి నిష్కారణముగా రామి శిక్ష యనుభవింపవలసిన గతి సంభవించినదిగదా యని యు లోపల వ్యథపడఁజొచ్చెను. రామితల్లి బీదదగుటయు, బీదదయినను మురికిగుడ్డలు కట్టుకొనక సదా శుచిగా నుండుటయు, పండ్రెండేండ్ల వయస్సుగల రామితమ్ముఁడు కుంటివాఁ డగుటవలన చంకకఱ్ఱలు లేక నడవలేకుండుటయు, వాఁడు కుంటివాఁడయినను పిల్లలకు ముచ్చటయిన యాటవస్తువులను చేసి యమ్మి యింటికద్దె మొదలయినవానికి తల్లికి సహాయుఁడుగా నుండుటయు, తండ్రి భార్యను బిడ్డలను వదలివేసి దేశాంతరము లేచిపోవుటయు, అంతయు ఆచిన్నదానికి తెలియును. అందుచేత మాణిక్యము కన్నుల నీరుపెట్టుకొని "రామి తప్పిదము చేయునప్పుడు శిక్షించుటచేత అమ్మమ్మ మిక్కిలి నిర్దయురాలుగా కనఁబడుచున్నది. నేనువిజయనగరము చిన్నానాయన గారియింటికి పోయి రాఁగానే, అమ్మమ్మ నన్ను పదిదినములు గదిలో పెట్టి తాళమువేసి శిక్షించినను, నేను నిజ మంతయు తప్పక చెప్పివేసెదను. అప్పుడు రామి మరలవచ్చి యెప్పటియట్ల సుఖముగా నుండును" అని తనలో తాను తలపోయుచుండెను. ఈలాగున ననుకొనుటవలన కొంతసేపు మనస్సున కూఱట గలుగఁగా, కన్నులు తుడుచుకొని మాణిక్యము నెమ్మదిగా నుండెనుగాని, రాత్రి సమీపించినకొలఁదిని ఆచిన్నదాని మనస్సులోనేదో యాందోళనము పుట్టి దుఃఖ మధికము కాసాగెను. తనకు చొక్కా తొడుగుటకును పనులు చేయుటకును పనికత్తె లెవ్వరును లేరు. ఇది యిట్లుండఁగా నింతలో భ్రమరాంబ వచ్చి రామిని పరాభవపఱిచి పంపివేసిన విధమును, అది తాను చూచుచుండఁగా బిగ్గరగా నేడ్చుచు వెడలిపోయిన క్రమమును, వెళ్ళునప్పుడు తనతల్లి సంగతిచెప్పి యీసంగతి విన్నఁగానే

తల్లిగుండెలు పగిలిపోవుననియు సిగ్గుచేత తా నెప్పుడును నలుగురిలో తలయెత్తుకొని తిరుగుటకు వలనులేదనియు చెప్పినధోరణిని, చెప్ప మొదలు పెట్టెను. ఆమాటలన్నియు మాణిక్యమున కన్ని శూలముల వలె హృదయమున నాటుకొని, ఆచిన్నది తనతల పరుపులో గ్రుక్కు-కొని కన్నులనీరు విడువఁజొచ్చెను. కాని యిప్పటికిని తప్పిద మొప్పుకొనుటకు బుద్ధిపుట్టలేదు. ప్రయాణము మానలేకయు, అవ్వగారి కోపమునకు భయపడియు, ఈవఱకే కార్యము బహుదూరము ముదిరినది గనుకను, ఒకపట్టున నొప్పుకోలేక మాణిక్యము త్రొక్కుటపడు చుండెను.



## ఏడవ ప్రకరణము

మాణిక్యము తెల్లవాఱి నిద్రలేచెనుగాని యాచిన్నదాని మనస్సుమాత్ర మెప్పటియట్లుండినది కాదు. రామి యింటు కనఁబడు చుండలేదు. అంతరాత్మలోపల చేరి సదా పొడుచుచున్నందున, ప్రయాణప్రయత్నమువలనఁగాని మఱి దేనివలనఁగాని సంతోషము కలుగకుండెను. ఆచిన్నది బేలమొగముపడి యుత్సాహము లేనిదయి—"అయ్యో! ఒక్కరాత్రి యాపాదుహఁర మేల వేసికొంటినా"—అని పరిపరివిధముల విచారింపసాగెను.

పాఠము లొప్పగించుకొన్నతరువాత ముత్తవతల్లి మాణిక్యమును పిలిచి "అమ్మాయీ! నేనును భ్రమరాంబయు నొకచోటికిఁ బోవుచున్నాము. నీవుకూడ మాతో వచ్చెదవా?" అని యడిగెను.

మాణి—మీతో నేనును వచ్చెదను. నాకు బహుసంతోషముగా నున్నది. మీ రెక్కడికి వెళ్ళుచున్నారు?

లక్ష్మి—అమ్మాయీ! మేము రత్నసెట్టి దుకాణమువద్దకి పోవుచున్నాము. మేము పోయెడుపని నీకును సంతోషకరమైనది గానే యుండును.

రత్నసెట్టిపేరు చెప్పినతోడనే మాణిక్యముముఖము వివర్ణమయి యొక్కనిమిషములో అవలఱకున్న యుత్సాహ మంతయు పోయెను.

లక్ష్మి—రామి దుర్మార్గురా లయి యెత్తుకొనిపోయిన దని మీకు ముత్యాలహారము లేకుండఁజేయుట నాకిష్టము లేదు. మన మిప్పుడు రత్నసెట్టియంగడికి పోయి యతనివద్ద నేమి యున్నవో చూతము. ఇద్దఱికి నొక్కహారము వంతు సెగదుగనుక, మీయిద్దఱికిని చెఱియొకహారమునుకొని పెట్టవలెనుకాఁబోలును! ఏమే? అమ్మాయీ!

మాణి—(గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు గద్గదస్వరముతో) అమ్మమ్మా! అక్కఱలేదు. నాకు హార మక్కఱలేదు. భ్రమరాంబకు మాత్ర మొకటి కొనిపెట్టు చాలును.

లక్ష్మి—(చిన్నిమనుమరాలిని ముద్దుపెట్టుకొని) నీవు మంచి దానవు. అటువంటియన్యాయము నేను నీకెప్పుడును చేయను. నీకు కూడ తప్పక కొనిపెట్టెదను. రామి నూరక వదలివేసినందుకు నాకు విచారముగా నున్నది. మనము దానిని రాజభటుల కొప్పగించెద మని బెదరించినపక్షమున జడిసి నిమిషములో ముత్యాలహారము తెచ్చి మనది మన కిచ్చివేసి యుండును. అసత్యము లాడువారికి శిక్ష కాక మానదు గనుక దాని కెప్పుడో శిక్ష కలుగునుగాని కలుగకపోదు.

ఆమాట వినఁగానే మాణిక్యమునకు లోపలినుండి భయమును పడఁకును పుట్టుకొనివచ్చి దేహము కంపమెత్తసాగెను. అప్పుడు మనుమరాండ్ర నిద్దఱిని వెంటఁబెట్టుకొని లక్ష్మీదేవమ్మగారు రత్నసెట్టి యంగడికి ప్రయాణమాయెను. వారు నడఁచినకొలఁదిని మాణిక్యము

గుండెలు తటతటకొట్టుకొన మొదలుపెట్టెను. సరస్వతి యెక్కడ యెదురుపడునో, ఒకవేళ దుకాణములోనికి వచ్చునో, హారముసంగతి యంతయు నెక్కడబయలుపడునో, అని ఆచిన్నదానిమనస్సు పిచపిచ లాడుచుండెను. సరస్వతియీవుపిల్ల యెవతె దూరమునుండి కనఁబడి నను వెనుకజంకి బెదరుచూపులు చూచుచుండెను. వారు దుకాణము చేరఁగానే మాణిక్యము ముత్యాలహార మక్కడ నున్నదేమో యని యరుగువంకఁ జూచెనుగాని యక్కడ హారముగాని పెట్టెలుగాని యేమియు లేకపోవుటవలన, కొంచెము గుండె కుదిరి యుండెను. అది యెవ్వరో తీసికొనిపోయి యుందురుగనుక నిర్భయముగా నుండవచ్చు నని కొంచెము సంతోషించి ధైర్యముతో కొట్టులో నడుగు పెట్టెను. అక్కడవస్తువులు కొనవచ్చినవా రనేకు లున్నను సరస్వతిమాత్రము లేదు. అందుచేత మఱింత ధైర్యము వచ్చి మాణిక్యము తనచుట్టు నున్నవస్తువులవంక స్వేచ్ఛగా ముచ్చటపడి చూచి బేర మాడుచు ముత్యాలహారము వచ్చునని సంతోషముగా నుండెను.

రత్నసెట్టి స్వయముగానే కంఠహారము లన్నియు తీసి చూప మొదలు పెట్టెను. అవి మిక్కిలి యంద మయినవి గనుక, ఒకదాని కంటె నొకటి సొగసుగా కన బడి యెంతసేపు చూచినను చూడనే మన సగుచుండెను. ఈసమయములో రత్నసెట్టిచేతిసమీపమున నలిగి పోయినకాగితపుపొట్లమొకటి మాణిక్యముకంటి కగపడెను. దాని మీఁద స్పష్టముగా "పూర్ణమ్మ" యనుపేరు పెద్దక్షరములతో కనఁబడు చున్నందున దానిలోపల నేమున్నదో మాణిక్యమున కప్పుడే పొడ కట్టెను. వెనుకటిదినమున ముత్యములు కొనుట కయి తాను వచ్చి నప్పుడు దురదృష్టవశముచేత పడిపోయినముత్యాలహార మిప్పుడు నలిగి యుండియు తనమీఁద సాక్ష్య మిచ్చి తన్ను చిక్కుకఁగొట్టినపగ

సాధించుకొనుట కయి సిద్ధముగా నున్నట్లు కనఁబడెను. దానిని చూచినతోడనే మాణిక్యమునకు కలిగినభయ మింతంతని చెప్ప శక్యము కాదు. చిరిగిపోయిన కాగితపుసందులోనుండి కొన్నిపూస లీవలికి కనఁబడుచుండెను. భ్రమరాంబయు లక్ష్మీదేవమ్మగారును సమీపముననే యున్నందున వారిలో నెవరికంటఁ బడునో తనగు ట్టెక్కడ బయలపడునో యని గుండెలు తటతట కొట్టుకొనసాగెను. అంతేకాక రత్నసెట్టి కీహారమునుగూర్చి తెలియునేమో, తనము త్తవ తల్లికి చూపుటకొఱకే యక్కడ నుంచియున్నాఁడేమో, అనికూడ లోపల మఱింత భీతిగా నుండెను. కంఠహారము లన్నియు చూచిన తరువాత లక్ష్మీదేవమ్మగారు నాకు కావలసిన విటువంటివి గావు. ముత్యాలహారములు కావలె నన్నప్పుడు రత్నసెట్టి 'యిటువంటిదా?' అని కాగితపుపొట్లముపైపునకు చేయి చాపఁగానే మాణిక్యముప్రాణ ములు పీచుపీచు మనసాగెను. అతఁ డావంక చేయి చాచి మఱియొక మూట తీసి ముత్యాలపేరులు చూప మొదలు పెట్టెను. మాణిక్య మెప్పు డీగదిలోనుండి లేచిపోదుమాయని తొందరపడినకొలఁదిని బేర మాలస్యమయి యెప్పటికిని కొట్టు విడిచిపెట్టి పోవుదారి కానఁబడన ట్టుండెను. కొంతసేపటి కామె ముత్యాలహారములు రెండును సులోచ నములజోడును దంతపుఅంగుటమును కొని యీవలకు వచ్చినమీఁదట మాణిక్యముగుండె కుదుటఁబడి నోటివెంబడిని మాటవచ్చి కొంచెము నవ్వుమొగ మగపడెను. లక్ష్మీదేవమ్మగారును హారము కొని యిచ్చి నందుకు సంతోషముగా నున్న దనుకొని అమ్మాయీ! ఇది నీవు పోఁగొట్టుకొన్నయెడల మరల నెప్పుడును కొనిపెట్టను. కాఁబట్టి దీనిని భద్రముగా నుంచుకొమ్ము'' అని చెప్పెను. ఇంటికిపోఁగానే హారము లను పదిలముగా పెట్టెలో వేసి తాళము వేయుమని భ్రమరాంబ చెప్పెను.

ఇల్లు చేరినతరువాత ప్రయాణముసంగతి తలఁచుకొని మనుమరాండ్రు సంతోషపడుచు గవ్వలాటకు మొదలుపెట్టిరి. అప్పుడు మాణిక్యము తనమనసులో సుఖముగా విజయనగరము పోవచ్చుననియు, సరస్వతి రొంపచేత బాధపడుచున్నది గనుక తాము బయలుదేఱులోపల రాదనియు, అవ్వగారికిని తనమీఁద ననుమానము కలుగలేదనియు, భ్రమరాంబకు పోయినహారము మరల వచ్చినదనియు, తలఁచుకొని యుల్లాసముగా నుండెను. అంతరాత్మసహితము మునుపటివలె నంతగా బాధించుచుండలేదు. నిష్కారణముగా రామియొక్క జీవనమునకు భంగము కలిగినదిగదాయని కొంతవిచారముగా నుండెనుగాని మత్తవ దీర్ఘక్రోధము కలదికాదు గనుక తిరిగి వచ్చినతరువాత మరల పిలిపించి పని యియ్యవచ్చునని మనస్సు సమాధానపఱుచుకొనుచుండెను. ఇంతలో లక్ష్మీదేవమ్మగారి బాల్యసఖయైన విశాలాక్షి యనునామె వచ్చి కూరుచుండి తా నొక ముఖ్యమయిన పని గలిగి మాటాడవచ్చితి నని చెప్పి సంభాషింప మొదలుపెట్టెను. ఈమెయే మొట్టమొదట రామివిషయమయి లక్ష్మీదేవమ్మగారితో చెప్పి పని వేయించినది. ఇప్పు డామె రామిని గుఱించి మాటాడుటకొఱకే వచ్చినది.

విశా — నేను రామిని బాల్యమునుండియు నెఱుఁగుదును. దానికంటె యోగ్యురాలును సత్యసంధురాలును నాకు మఱియొకతె కనఁబడలేదు. ఇందులో నేదో మీ దేపొరపా టయియుండును.

లక్ష్మి — (కోపము తెచ్చుకొని) దానిని యోగ్యురా లనవలసినదే! అందుచేత నేకాఁబోలును నాపెట్టెతీసి దానిలోని వెండిచుట్టపహరించి భరించుకోలేక భయముచేత మరల నిచ్చివేసినది.

విశా—రామి తీసినట్టు నిదర్శనమేదియు లేదు. నీవెప్పుడైన రామి తీయుచుండఁగా నెవ్వరైనఁ జూచినారా?

లక్ష్మి—ఎవ్వరును చూడలేదు. ఎవ్వరును జూడకుండ నెట్లు తీయవలెనో దానికి తెలియును. ముత్యాలహారము తీసినప్పుడుకూడ నెవ్వరును చూడలేదు. అయినను ముత్యాలహారము రామియేతీసినది. రామి తియ్యకపోయినయెడల మఱియెవ్వరు తీయుదురు?

విశా—(కొంచెముసేపాలోచించి) అయినను రామితీసినదని నేననుకోను. రామి తాను తీయలేదని ప్రమాణముచేసిచెప్పుచున్నది. అది యసత్యముపలుకఁగా నేనెప్పుడును వినియుండలేదు. కొంచెము కాలములోనే సత్యముబయలుపడి రామినిర్దోషురాలని నీవే తెలిసికొందువని నాకు నమ్మకమున్నది.

లక్ష్మి—ఎవ్వరును తీయకుండ వస్తువులు తమంత నడిచిపోవు. నామనుమరాండ్రు తీసికొందురని నీవు చెప్పఁజాలవుకదా? భ్రమరాంబ గ్రామములోనే లేదు. మాణిక్యము తనదికానివస్తువు ముట్టుకోదని నేను రూఢిగా నమ్మెదను.

ఈమాటలనునప్పటికి మాణిక్యము చేతులు వడఁక మొదలుపెట్టి పందెము వేయుటకు చేతులాడక యుండెను.

విశా—నీమనుమరాండ్రు తీసినారని నేనెంతమాత్రమును చెప్పలేను. తగినంత నిదర్శనములేనిదే రామిమీఁద దోషమువోపి దాని నపఖ్యాతిపాలుచేసి యావజ్జీవమును వేఱొకచోట జీవనము పుట్టకుండునట్లు పంపివేయుట క్రూరముగా నున్నదని నాయభిప్రాయము. దానికిప్పుడు పదియేనవ సంవత్సరము.

లక్ష్మి—దానివయస్సెంతయినను నాకు విచారములేదు. అబద్ధములాడువారిని మాయింట నుంచుకొనుట నాకిష్టము లేదు.

విశ్వా—తల్లి గొప్పయాపదలలోనుండి యొక్కపూట తిండికే జరగకుండనున్న యిటువంటి సమయములో పంపివేయుట నాకు న్యాయముగా తోచదు.

లక్ష్మి—అది దానితప్పిదమేకాని నాదోష మేదియు లేదు. రామితల్లిని నేనే కొందటి కొప్పగించినాను. బయలపోయి పనిచేసికొని బ్రతుకవచ్చును.

విశా—అది యిప్పు డిల్లువిడిచి పోవల్లకాదు. ఆటవస్తువులు చేసి విక్రయించి గడించుచుండెడు దానికొడుకు కుంటివెంకడు వ్యాధిగ్రస్తుడయి యున్నాడుగనుక వానినివిడిచి వెళ్ళవల్లకాదు. వాడు నెలదినములనుండి బొత్తిగా మంచమెక్కినాడు. ఇప్పటిస్థితినిబట్టి వానికిరోగము కుదురునని నాకుతోచదు. పాపము! వాడు సంపాదించెడిది యింటిఅద్దె మొదలయినవానికి సరిపోవుచుండెను. వాడు మిక్కిలి మంచివాడు; ఒక్కనిమిషమయినను వ్యర్థపుచ్చక యేదో యొకపని చేయుచుండెడివాడు.

భ్రమ—అనేకపర్యాయములు రామికూడ అదేప్రకారము చెప్పగా విన్నాను. చెల్లాయీ! వాడు పగలెల్లను కూరుచుండి చిత్రమయిన ఆటబొమ్మలు చేయుచుండుననియు, తల్లిబయలికి వెళ్ళినప్పుడు చంకకఱ్ఱలతో నడిచి పనిచేయుచు ఇంటికి కావలికాచుచుండుననియు, తల్లితిరిగి వచ్చునప్పటికి పొయి మంటచేసి సమస్తము అమర్చువాడనియు, రామిచెప్పినమాటలు నీకు జ్ఞాపకములేదా? ఆకుంటివానిని గూర్చి మనమేమో విన్నాము. అవి అన్నియు చెప్పగలవా?

మాణిక్యము నోటినుండి స్పష్టముగా పయికిరాకుంట నేవో తడబాటుమాటలు కొన్నిచెప్పి అప్పగారిని మరల ఆటకు మరలింప ప్రయత్నించెను.

భ్రమ—నీవు గడియగడియకు వారివంకఁజూచి చెవియొగ్గి వారి మాటలు వినుచు పరధ్యానముతో నుండుచున్నప్పుడు ఆడిన ప్రయోజనములేదు. నేను ఆ కుంటివానిసంగతి వినవలెను. విశాలాక్షమ్మ గారూ! వానినిగురించి మరికొంత చెప్పెదరా?

విశా—వానికి వ్యాధి ఆరంభమయినప్పుడు మొదటిదినము మంచముమీఁద మెల్లఁగా కూరుచుండి, ఆటవస్తువులు చేయుటకుతన పనిముట్లు తెచ్చియిమ్మని తల్లి నడిగినాఁడు. తల్లిబీదదనియు తాను పనిచేయనియెడల జీవనము జరగదనియు వానికిచక్కఁగా తెలియును. అయినను వాఁడశక్తతవలన పని తిన్నగా చెయ్యలేక కొంచెముసేపు కట్టచెక్కి తేపు చేసెదనని పనిముట్లు క్రిందపడవేసినాఁడు. కాని ఆ రెండవదినము వాఁడు పనిముట్లపేరే తలపెట్టలేదు. ఆపనిముట్లన్నియు నట్టింటపడి పొరలాడుచున్నవి. వాఁడిక ముందెప్పుడును పనిచేయకయే పోవచ్చును.

భ్రమ—(కన్నుల నీరు కార్చుచు) వాఁడు చచ్చిపోవునని మీకు తోఁచుచున్నదా?

విశా—నాకాలాగుననే తోఁచుచున్నది. నాలుగు దినముల క్రిందటి వఱకును వాని దేహము స్వస్థపడి వాఁడు మరల పనిచేసికో వచ్చునని మాకందఱికిని ధైర్యముండెను. రామి యవమానము విన్నప్పటినుండియు వానిగుండెలు పగిలిపోయి, బెంగపెట్టుకొని వాఁడంతకంతకు కృశించుచున్నాఁడు. వాఁడు బ్రతుకుటదుర్ఘటమని వైద్యుఁడు చెప్పుచున్నాఁడు.

"ఓమాణిక్యమా! ఇదియంతయునీవుచేసినదుర్మార్గము. రామి నిర్దోషురాలని నీవెఱుఁగుదువు. ముత్యాలహారము తీసిన వాఁడెవరో నీకు తెలియును. నిజమొప్పుకొని యింతటనైనను చేసిన నేరమేల

చెప్పివేయకున్నావు?'' అని యంతరాత్మ లోపల పొడువనారంభించెను.

విశా—వానితల్లి తెలివితక్కువపనిచేసినది. రామి సంగతి వానితో చెప్పకూడదు. వాఁడు మిక్కిలి జబ్బుపడియున్నందున వాని మనస్సున కామాటలు గాలమువలె నాటుకొన్నవి. వానికంతటితో మతిపోయి రాత్రి తెల్లవాఱినదాఁక తెలివిలేక తప్పుమాటలాడ మొదలు పెట్టినాఁడు. వాఁ డాయవస్థలో మంచముమీఁద లేచి కూరుచుండి హారము తనకుతప్పక దొరకుననియు, రామి దానితీసికొనిపోయి మరల పెట్టెలో వేయఁగానే లక్ష్మీదేవమ్మగారికోపము పోవు ననియు కేకలు వేయుచు ముత్యాలహారమునిమిత్తము మంచమంతటనుతడవ మొదలు పెట్టెను. పుల్లచికప్రుడకలవలెనున్న చేతులతో వాఁడు దిండ్లు మెల్లఁగా కదలించి వెదకఁబోయినప్పుడు నాకెంతో జాలివేసినది. అప్పుడు రామియు తల్లియు పట్టుకొని వానిని మరల పరుండఁబెట్టిరి కాని వాడు తెల్లవారినదాఁక కొంతసేపు తన్ను వెదకనిచ్చినయెడలహారము తెచ్చి యిచ్చెద నని చెప్పుచు, మఱికొంతసేపు రాజభటులు వచ్చినట్టును దొంగతనము చేసినందున కయి రామిని పట్టుకొని తీసికొనిపోవుచున్న ట్టును భావించి రామి నిర్దోషురా లనియు దానిని తీసికొని పోవల దనియు హారము దొరకిన దనియు వడఁకుచు పలవరింపు చుండెను.

ఈమాటలు చెప్పునప్పుడు మాణిక్యముయొక్క యంతరాత్మ యింతం తనకాని బాధ పెట్ట మొదలుపెట్టినందున మాణిక్యము మొగ మున కొం గడ్డము పెట్టుకొని యేడువ నారంభించెను. "నామూల ముగా నిరపరాధి యయినకుంటివాఁడు చావుబ్రతుకులమీఁద నుండఁ గా నే నెట్లు బంధువులయింటికి పోయి సుఖముగా నుండఁగలను? నేను నిజ మిప్పు డమ్మమ్మకు చెప్పివేసెదను.'' అని నేలవంక చూచి "నే నేమి చెప్పను? ఏప్రకారముగా మొదలుపెట్టను?'' అని విచారించి

ముత్తవతల్లి వంక తిరిగి మెల్లఁగా మాట తెచ్చికొని "అమ్మమ్మా!" అనెను. ఇంతసేపును విచారముగా నుండి యామె యేమోఆలోచించు చున్నందున మనుమరాలి హీనస్వర మామెకు వినఁబడలేదు. అప్పుడు మాణిక్యము గొంతు సవరించుకొని "అమ్మమ్మా!" అని మరల పలుఁ బోయెనుగాని మాటరాక మునుపటికంటెనుస్వరము గొంతులోనడఁగి పోఁగా విశాలాక్షమ్మ వెళ్ళినతరువాత చెప్పవచ్చునని యూరకుండెను.

విశాలాక్షమ్మ వెంటనే వెడలిపోయినది. కాని మాణిక్యము మాత్రము ముత్తవతో నిజము చెప్పలేదు. చెప్పినయెడల ముత్తవతల్లి కెంత కోపము వచ్చునో యేమిచేయునో యని యొకభీతి కలిగెను. అదిగాక ప్రయాణమునిమిత్తము బండి కుదిర్చి సిద్ధముగా నుంచి యున్నారు. కాఁబట్టి యిప్పుడు చెప్పివేసినయెడల ప్రయాణమునకు భంగము వచ్చును గనుక మరల రాఁగానే చెప్పివేయవచ్చునని మాణిక్యము తలఁచకొనెను. కాని యాచిన్నదాని మనోవేదన యింతంతని వర్ణింపతరము కాదు. అంత యవమానముపొంది పేరు చెడిపోయి తిండికిలేక తమ్ముఁడు చావుబ్రతుకులమీఁద నున్నరామి మనస్సుకూడ నింతకంటె సుఖముగా నుండెను. అంతరాత్మ బిగ్గరగా నిందించు చున్నట్లు వినఁబడుచున్నందున, ఆమాటలు ముత్తవతల్లి కెక్కడ వినఁబడునోయని మాణిక్యము వడఁకఁజొచ్చెను. అందుచేత దూరముగాపోయి యేమియుతోఁచక యీసంగతి మఱచిపోవలె నని పుస్తకము విప్పెనుగాని పుస్తకమునం దక్షరములు కనఁబడక కుంటి వానిరూపము మనస్సునకు పొడకట్టి వానిమంచమువద్ద తల్లి కూర్చు న్నట్టును, రామి యేడ్చుచున్నట్టును, కన్నులముందర కనఁబడెను. ఆచిన్నది యెక్కడకు పోయినను అంతరాత్మ వెంబడించి "రామి నిర్దోషురాలు. నీవే దుర్మార్గురాలవు" అని చెవిలో పోరుచుండెను.

---

# ఎనిమిదవ ప్రకరణము

మధ్యాహ్నము నిద్రనుండి భ్రమరాంబ యులికిపడి లేచి "ఓసీ చెల్లాయీ! వేగిరము లే మన మాలస్య మగుదుమేమో!" అని మాణిక్యమును లేపెను.

మాణి—(కన్నులు నలుపుకొనుచు) రామి యింకను పిలుచుకొని పోవుటకు మనవద్దకు రాలేదు. మన మాలస్యము కాము.

భ్రమ—రామి యెక్కడనుండి వచ్చును? నీవు పలవరించుచున్నా వేమో నాకంఠహారము దొంగిలించినందుకు అమ్మమ్మ రామిని పనిలోనుండి తీసివేసి సాగనంపుటయు, దానివిషయ మయి వచ్చి యింతసేపును విశాలాక్షమ్మగారు మాటాడి పోవుటయు నీవు మఱచిపోయినావా యేమి?

మాణి—అవునవును. నీవు నన్ను నిద్రలో చటాలున లేపినందున పరాకుమాటలు వచ్చినవి.

భ్రమ—నేనుమాత్రముహారమురామితీసికొన్నదనుకోను. అది యేమూలనో మనము వెతుకనిచోట పడియుండి యెప్పుడో దొరకును.

మాణిక్య మామాటల కేమియు ప్రత్యుత్తరము చెప్పక ముత్తవ వద్దకు వెళ్ళిపోయెను. ఆమెయు ప్రయాణసందడిలో నుండి వస్తువులను చక్కబెట్టుచు మనుమరాలిని చూచి తొందరగా "అమ్మా! మీరిద్దఱు వేగిర మన్నము తిని సిద్ధముగానుండుండి; కొంచెముసేపటికెల్లను బండి వచ్చును. అని చెప్పెను. వారిరువురును చెప్పినప్రకారము నిమిషములో భోజనము చేసివచ్చి ప్రయాణమునకు సిద్ధపడి బండినిమిత్తము క్షణ మొకజాముగా నెదురు చూచుచుండిరి. వీధిలో నేమి చప్పుడయినను బండి యేమోయని పరుగెత్తుకొనిపోయి చూచి

వచ్చుచుండిరి. ఈప్రకారముండఁగా వీధిలోనుండి యెవ్వరోలోపలికి వచ్చుచున్నట్టు కిఱ్ఱుచెప్పులచప్పుడు వినఁబడి మాణిక్యము పరుగెత్తు కొనిపోయి కిటికీలోనుండి తొంగిచూచి భయపడినదానివలెచటాలున వెనుకకు వచ్చెను.

లక్ష్మి—అమ్మాయీ! లోపలికి వచ్చుచున్నవా రెవరు?

మాణి—రత్నసెట్టి.

లక్ష్మి—అతని కిప్పుడు మనతో నేమిపని వచ్చినది? హార ములవెల నే నప్పుడే యిచ్చివేసినానే!

అనుచుండఁగానే రత్నసెట్టి వచ్చి యెదుర నిలువఁబడెను. అతఁ డాపగిలిపోయినముత్యాలహారము నిచ్చివేయుట కయి తీసికొని వచ్చెను. "పూర్ణమ్మ" యనుపేరు స్పష్టముగా కనఁబడుచున్నపొట్లమతనిచేతిలో కనఁబడఁగానే మాణిక్యము కొందరపుట్టి మాట రాక వడఁక మొదలు పెట్టెను.

రత్న—లక్ష్మీదేవమ్మగారూ! ఈముత్యాలహారము మీది కాఁబోలును. ఈహారమును మాకొట్టుముందర పాఱవేసికొన్నది మాణిక్యమని నాకు నేఁటియుదయమువఱకును తెలిసినది కాదు.

లక్ష్మి—ఏమి హారము?

రత్న—(పగిలిపోయిన ముత్యాలహారము పొట్లములోనుండి తీసి పయికెత్తి చూపి) ఇదిగో! ఈహారము. తాను పెట్టె తీసికొని వచ్చునప్పుడు మాణిక్యము తనమీఁద పడినదనియుఁ పెట్టెనుక్రిందపెట్టి మరల నెత్తినప్పుడు దానిక్రింద ఈముత్యాలపేరు కనఁబడిన దనియు, మాకొట్టులోని మనుష్యుఁడు చెప్పుచున్నాఁడు.

లక్ష్మి—దానికిని దీనికిని ఏమి సంబంధము న్నది? మాణిక్యము మీమనుష్యునిమీఁదపడి యుండవచ్చును. అందుచేత హారము మాణిక్యము పడ వేసినట్టు ఏమి నిదర్శనము?

రత్న—పూర్ణమ్మగారు చెప్పకుండినయెడల నే నిది మాణిక్య ముదని యెఱుఁగకయేపోదును. ఈకాగితముమీఁద ఆమెపే రున్నం దున నే నిది మొట్టమొదట పూర్ణమ్మగారియింటికి తీసుకొనిపోయి నాను. ఆమె ఇది మీవద్దకు తీసికొనిపోయి యిమ్మనిచెప్పి, ఇది మాణిక్యముదని రెండుమూడు సారులు చెప్పినది.

లక్ష్మి—భ్రమరాంబదని నీయభిప్రాయము కాఁబోలును!

రత్న—పూర్ణమ్మ మాణిక్యముదని నిశ్చయముగా చెప్పినది. ఆమెది పొరపాటయి యుండవచ్చును. మాసరకులపెట్టెలను సవరించు నప్పుడు మాణిక్యము కిటికిలోనుండి తొంగిచూచుచుండఁగా నేను స్పష్టముగా చూచినాను. ఆసమయమునందే యొకవేళ ముత్యాల పేరు పాఱవేసుకొని యుండవచ్చును.

లక్ష్మి—మాణిక్యము మీకిటికీలోనుండి తొంగిచూచి యుండ వచ్చును. అంతమాత్రముచేత మాణిక్యమే హారము పడవేసినట్లు నీవెట్లు చెప్పఁగలవు?

రత్న—నేను కొట్టుతీసివచ్చినాను. మీతో వాదమాడుటకు నాకుతీఱదు. మీహారమని తెలిసి తీసికొనివచ్చినాను నేను పోవలెను.

అని హారమూ మె చేతిలోపడవేసి తనదారినిపోయెను. మాణిక్య మును పీడవిఱుగడమైనది గదాయని సంతోషించి ప్రయాణమున కయి మరలఁ బండిసంగతి యాలోచింప మొదలుపెట్టెను. లక్ష్మీదేవమ్మ హారమును చేతఁబట్టుకొని దిగ్భ్రమనొంది మరల మరల చూచుచు విజయనగరము వెళ్ళివచ్చినతరువాత దీనివిషయమయి విమర్శించెదనని

దానిని బల్లమీఁద పడవేసెను. ఇంతలో సరస్వతివచ్చి మాణిక్యము చేయిపట్టుకొని "ఓసీ ! నాతో చెప్పకయే యూరికి పోవలె ననుకొన్నావా ? నేను రొంపచేత బాధపడుచుండియు మీ రూరికి వెళ్ళుచున్నారని విని చూచిపోవచ్చినాను." అని పలుకరించెను. సరస్వతి మొగము చూడఁగానే మాణిక్యమునకు లోపలినుండి భయము పుట్టుకొనివచ్చి శరీరమంతయు చెమట పట్టనారంభించెను. వీలయినయెడల మాణిక్యము హారమును బల్లమీఁదనుండి వెంటనే తీసివేసియుండును కాని ముత్తవతల్లి యింకను దానిమీఁదనే దృష్టియుంచి మరలమరల చేతితో పట్టుకొని చూచుచు వింతపడుచున్నందున దానిని తీసి దాఁచుటకవకాశము చిక్కలేదు.

మాణి—సరస్వతీ! నీపడిసె మెట్లున్నది!

సర—కొంచెము నిమ్మళముగా నున్నది. అందుచేతనే మా అమ్మ నిన్నొక్కసారి పోయి చూచిరమ్మని సెలవిచ్చినది. (అని బల్ల వంక చూచి) ఓసీ! నీముత్యాలహారముతో మరల నేమిపని చేసినావు? మాయింటివద్ద నిది యీప్రకారముగా చితికిపోలేదే!

భ్రమ—సరస్వతీ! మీయింటివద్దనా? నాముత్యాలహారము మీయింటి కెందుకు పోయినది?

సర—ఇది నీదా? ఆసంగతి నాకు తెలియలేదు. ఇది నేను మాణిక్యము దనుకొన్నాను. ఇటువంటిదే యొకటి మాయింట రాత్రి యాడుకొన్నప్పుడు మాణిక్యము వేసికొనివచ్చినది.

భ్రమ—నీవు పరాకు పడినావు. ఆవఱకు మాణిక్యమునకు ముత్యాలహారము లేదు. అమ్మమ్మ నిన్ననే కొనియిచ్చినది అవునుకాదా? చెల్లాయీ!

మాణిక్యము దానికేమియు మాఱుమాట చెప్పక తెల్లపోయి అపరాధమే రూపము దాల్చినట్లు నిశ్చేష్టురాలయి యుండెను.

సర—ఆదినము మాణిక్యము తప్పక హారము వేసికొని వచ్చినది. అమ్మకూడ నిశ్చయముగా చూచినది. మాణిక్య మది తన కమ్మమ్మ యిచ్చిన దని చెప్పినది—ఓసీ! నీ వాలాగున మాతో చెప్పలేదా?

మాణిక్యము నోటినుండి మాట యేమియు రాలేదు. ఈసంభాషణ మొదటినుండియు శ్రద్ధతో వినుచున్న లక్ష్మీదేవమ్మగారు కుర్చీకిఁ జేరగిలఁబడి వడఁక మొదలు పెట్టెను.

సర—(లక్ష్మీదేవమ్మగారివంక తిరిగి) అవ్వా! హారము తెగిపోవుట మాణిక్యము తప్పిదము గాదు. ఇటులో నరసింహము చేతఁ బట్టుకొని లాగినాఁడు. అది యీచేత దారములు తెగి పూసలు క్రింద పడిపోయినవి. మఱునాఁడు నాకుదొరకిన పూసలన్నియు నేరి కాగిత పుపొట్లములోకట్టి మాణిక్యమునకు తీసికొనివచ్చి యిచ్చినాను— ఓసీ! నేను తెచ్చి నీకియ్యలేదా?

మాణిక్య మిప్పుడును మాఱుమాట చెప్పలేదు. మాణిక్యము యొక్క దొంగతన మంతయు బయలఁబడినది. తనతప్పిదమును దాఁచుటకొఱకు గూర్చిన యబద్ధములన్నియు వ్యర్థము లయిపోయినవి. ఒక్కబొంకువలనను ప్రయోజనము కలుగలేదు. ఇంతస్పష్టముగా తెలిసినతరువాత నేర మొప్పు డొప్పుకొనుటవలనను కార్య మగపడలేదు. అంతరాత్మ చెప్పినట్టే యిప్పుడు నిజముగా జరిగినది. ఆబాలిక మనస్సున కిప్పు డవమానమును శిక్షయు తప్ప మఱియేదియు కనఁబడుచుండ లేదు.

సర—అవ్వా ! నేను పూసలు తీసికొనివచ్చినప్పుడు భోజనము చేసి నీవప్పుడే కొంచెము కునుకుచున్నావు. నీకు నిద్రాభంగ మగు నని మాణిక్యము నన్ను బిగ్గరగా మాటాడనియ్యలేదు. ఆపూసలు మాత్రము తీసికొని జేబులో వేసికొన్నది. ఈహారము రెండవ పర్యాయము పగిలిపోయినదని నాకప్పుడు తెలియలేదు—ఓసీ ? ఇది మరల నెందుచేత చితికిపోయినదే ?

ఈమాట లనుచుండఁగా వీధిలోనుండి వంటచేసెడు బోనకత్తె వచ్చి "అమ్మా! బండివచ్చినది! వేగిరము రమ్మని బండివాఁడు తొందర పెట్టుచున్నాఁడు" అని చెప్పెను. ఆమాట వినిపించుకొనక యామె యూరకుండెను. ఆమాటలే వంటలక్క మరల చెప్పఁగా లక్ష్మీదేవమ్మగారు మెల్లఁగా కుర్చీమీఁదినుండి లేచి "మేము విజయనగరమున కిప్పుడు వెళ్ళము. ప్రయాణము మానుకొన్నాము బండియక్కఱలేదు. పొమ్మని చెప్పు. నీవు పెట్టెలు తీసికొనివచ్చి లోపల పెట్టు." అని చెప్పి మాణిక్యమువంక తిరిగి "ఓసీ ! నీవు నాగొంతుకకోసినావు" అని కన్నులనీరు తెచ్చుకొని పసిబిడ్డవలె నేడువనారంభించెను. ఆ యేడుపు వినుటకంటె మాణిక్యమునకు చావయినను మేలుగాతోఁచెను. బండిగుమ్మమువద్దకు సిద్ధముగా వచ్చినప్పుడు ప్రయాణముమాని తిరిగి పంపివేయుటకూడ వ్యసనకరముగానే యుండెనుగాని ప్రేమగల ముత్తవతల్లికి తనమోసమువలనఁ గలిగిన మనోవ్యథముందఱ ఆ వ్యసన మేమియు కనఁబడక ముత్తవతల్లివిషయము మయి గొప్పదుఃఖము కలిగెను.

మాణి—(ఏడ్చుచు) అమ్మమ్మా! నన్నుక్షమించు. ఆరొక్క రాత్రిమాత్రము వేసికొని మరల నెప్పటిచోట పెట్టవలెనని హారము తీసినాను. అది నాదురదృష్టముచేత తెగిపోయి కొన్నిపూసలు పోయి

నందున ముత్యములు కొనవలె నని రత్నసెట్టి కొట్టువద్దకు వెళ్ళినాను. అప్పుడు కొట్టువాఁడు నామీఁద పడ్డందున హారముజారి పెట్టెక్రింద పడి నలిగిపోయినది. తప్పుచేసినందుకు నాకు తగినశిక్ష అయినది. అని పెద్దపెట్టున నేడ్చెను.

లక్ష్మి—నీకింకను శిక్ష కావలెను. నీవెంతికయినను తగిన దానవే. నేనిప్పుడు మాటలాడలేను. నాదేహము కంపమెత్తుచున్నది. నీవు నాకన్నులయెదుటనుండి లేచి పో.

మాణిక్య మేమియు బదులుచెప్పక కన్నులమీఁద గుడ్డవేసికొని మెల్లఁగా దొడ్డిలోనికి పోయెను. ఎటుచూచినను విచారమే కలుగ నారంభించెను. ప్రయాణమునకయి యీవల పెట్టినపెట్టె లీవలనే యున్నవి. ఆచిన్నదాని మనోవ్యథ యాచిన్నదానికే తెలియవలెను. ఇంతవఱకును బొంకినబొంకులయొక్కయు చేసినమోసము యొక్కయు ఫల మనుభవింపవలసినసమయ మిప్పుడు వచ్చినది.

---

## తొమ్మిదవ ప్రకరణము

తరువాత మాణిక్యము పడకగదిలోనికి పోయి మంచము మీఁద చేరి దుప్పటి మొగమున కడ్డముపెట్టుకొని బిగ్గరగా నేడువ మొదలుపెట్టెను. ఆశాభంగ మయినందునను తనసంగతి బయలబడి నందునకును మితిమీఱినదుఃఖము కలిగి, ఆచిన్నది యలసటవచ్చి యేడువలేనంతవఱకును వెక్కివెక్కి యేడ్చుచుండెను. ఇంతలో భ్రమ రాంబ కన్నులు నలుపుకొనుచు దీనముఖముతో లోపలికి వచ్చెను. ఆవఱకేడ్చి యున్నందున భ్రమరాంబకుకూడ కనుపొట్ట లుబ్బి యుండెను. అప్పుడాచిన్నది గద్గదస్వరముతో "చెల్లాయీ! అని పిలిచి

'నిక్కంటిగా అమ్మమ్మ తనగదిలోనికి రమ్మని చెప్పుచున్నది. అయ్యో! నీవొంటిగాపోయి యెట్లుసహింపఁ గలుగుదువు? నీవింత దుర్మార్గురాల వగుదువని నేనెన్నఁడును తలఁచి యుండలేదు." అని కన్నులనీరు పెట్టుకొనెను.

మాణి—(ఏడ్చుచు) "నేను దుర్మార్గము చేయవలె ననుకోలేదు. ముత్యాలహారము పెరిగిపోయినందున దానిని దాచుట కయి యొకయబద్ధమును పలుకవలసినదాన నయినాను. అమ్మమ్మ నన్నిఁక క్షమించదు. మన మెవరమును విజయనగరము వెళ్ళము కాఁబోలు" అని మొగమునకు కొంగడ్డము పెట్టుకొనెను.

భ్రమ—"బండి యింటికి వచ్చినతరువాత ప్రయాణము మానుకొనుట వ్యసనకరముగా నున్నది. కాని నేనందునిమిత్త మేడువ లేదు. అమ్మమ్మనిమిత్తమయి యేడ్చుచున్నాను." అని యావల చెప్పలేకపోయెను.

మాణి—అమ్మమ్మ కేమి?

భ్రమ—(ఏడ్చుచు) అమ్మమ్మ యెంతో ఖేదపడుచున్నది. నీవిన్నిసారులు మోసముచేసి యిన్నికల్లలుపలికినందు కామెతన గుండెలుపగిలిపోయినవని చెప్పి, "ఇఁక నేనీముత్యాలహారమును చూడలేను నాయెదుటనుండి తీసికొని పొమ్మని వంటలక్క కాజ్ఞాపించెను. చెల్లాయీ! నీవు మొదటనే నిజము చెప్పివేసినయెడల, ఈమనోవ్యధ లేకుండ మనమందఱు మెంతసుఖముగా నుండియుందుము!

ఈమాటలు చెప్పినప్పుడు మాణిక్య మెంత సిగ్గుపడి భ్రమరాంబచెప్పినది సత్యమే యనియు, తనదోషమువలననే యీకుటుంబ సంతాపమంతయు కలిగెననియు, తాను ముత్తవతల్లిని మోసముచేసి యీప్రకారముగా బొంకకపోయినపక్షమున ఇప్పటి వ్యాకులపాటునకు

కారణమే లేకపోయియుండు ననియు, తలంచెను. ఎంతో సుఖ మను భవింపవలె నని యెదురుచూచుచున్నదినమే యిప్పుడు దుఃఖప్రద ముగా నయినది. బండి యెక్కిపోవుచు నవ్వుచు తుళ్ళుచు సంతో షముతో మాటాడుచుండుటకు మారుగా మూలకూరుచుండి యొకరి మొగము లొకరు చూచుకొనుటకు సిగ్గుపడుచు నొంటిగా దుఃఖపడ వలసిన దుర్గతి సంప్రాప్త మయినది. ఇప్పు డెందుకు హారమునుతీసి తినాయని చింతిల్లిన కార్యములేదు. మొట్టమొదట హారమును పెట్టె లోనుండితీయకయే యుండవలసినది. ఒకవేళ తీసినను హారము తెగి నప్పుడయినవచ్చి ముత్తవతల్లితో చెప్పివేసియుండినయెడల కొంచెము కూకలువేసి హారము బాగుచేయించి యుండును గాని యంతకంటె హానికలుగకుండును. అప్పుడుకాకపోయినను హారము బొత్తిగా నలిగి పోయినప్పుడు చెప్పివేసినను మేలుగ నుండును. అటుతరువాతముత్తవ తల్లి పెట్టెతెమ్మన్నప్పుడు చెప్పినను విశేషనష్టము కలుగకపోవును. కట్టకడపట రామిని పంపివేసినప్పుడు నిజముచెప్పినను నిష్కారణముగా రామిజీవనమునకు భంగము కలుగుటయు కుంటివానికి ప్రాణోపద్ర వము వచ్చుటయు తప్పిపోయియుండును. ఆవల విశాలాక్షమ్మగారు వచ్చినప్పుడుగాని మఱియెప్పుడయిననుగాని చేసినతప్పిద మొప్పుకొన్న యెడల ముత్తవతల్లి మనస్సునకంత యాయాసము కలుగకపోయి యుండును. నిజము పరులవలన బయలుపడుటకంటె ముందుగా మనుమరాలినోటనే తెలిసినపక్షమున ముసలామెకు కొంతయూరట కలుగును. అట్లేదియు చేయలేదు. అంతరాత్మ యెన్నివిధముల పోరు చున్నను దాని వాక్య ముపేక్షచేసిన పాపఫల మిప్పు డనుభవింపవల సిన గతి సంభవ మయినది. ఒక యసత్యమువలన నెందఱి కెన్నివిధ ముల మనోవేదన కలిగినదో చూడుడు. వారు వెళ్ళకపోవుటవలన

# తొమ్మిదవ ప్రకరణము

విజయనగరములోనున్న నృసింహారావుగారికికూడ ఆశాభంగము కలిగినది.

ఇంతలో వంటలక్క వచ్చి "అమ్మమ్మగారి సెల వయినది" అని మాణిక్యమును పిలువఁగా, ఆచిన్నది తాను చేసిన యపరాధమునకు సిగ్గుపడుచు మెల్లఁగా పోయి ప్రేమాస్పదురా లయినయమ్మవగారియొక్క మొగమువంక నైనను చూడఁజాలక తలవంచుకొని యొకమూలదూరముగా నొదిగి నిలుచుండెను.

లక్ష్మి—ఓసీ! నావత్తులపెట్టె యెవరు తీసినారో, అంగుట మెట్లు పగిలినదో తెలిసికోవలె నని పిలిపించినాను. ఇప్పుడు జరిగినదానివలన నీ వొక్కతవే యీసంగతి యెఱుఁగుదు వని నాకు నిశ్చయముగా తెలియును.

అంతవఱకు వచ్చినతరువాత దాఁచిన కార్యము లేదు గనుక తాను సూదినిమిత్తమయి వత్తులపెట్టెను తీయుటయు, తొందరగా మూఁత వేయఁబోయినప్పుడు లోపలవస్తువులు పట్టకపోవుటయు అంగుటము పగిలిపోవుటయు, ఎవ రయినచూచిపోదు రేమోయని తాను భయముతో మేడమీఁదికి పరుగెత్తుటయు, అంతయు మాణిక్యము గద్గదస్వరముతో చెప్పివేసెను.

లక్ష్మి—నీవు చేసినయకార్య మంతయు చూచినవా రొక రున్నారు. అని గంభీరముగా పలుకఁగా మాణిక్యము తొట్రుపడి, రామి తప్ప మఱియెవ్వరును క్రిందలేరనియు, రామియే చూచియుండిన పక్షమున నిజ మప్పుడే చెప్పివేసి యుండుననియు, తలఁచియున్నందున తెల్లఁబోయి "ఆచూచినవా రెవరు?" అని మెల్లఁగా నడిగెను.

లక్ష్మి—(గాంభీర్యముతో) భగవంతుఁడు. నీవు నన్ను సులభముగా మోసము చేయవచ్చునుగాని, ఆయనను మోసపుచ్చుట నీకు

శక్యము కాదు. ముత్యాలహారము తీసినప్పుడు మొట్టమొదట నీ వీసంగతి యెందుకు తలఁచుకొలేదు. నీవు చేయుపనిని పయిని భగవంతుఁడు చూచుచున్నాఁ డనియు, నీము త్తవతల్లివిషయమునను అప్పగారివిషయమునను చేసినయపరాధముకంటె భగవంతునివిషయమున గొప్పయపరాధము చేసి పాప మొడిగట్టుకొనుచున్నా ననియు, నీవప్పు డెందుకు మఱచిపోయినావు? నీవు పాతకములలో నెల్లను ఘోరపాతకమయినయసత్యమున కొడిగట్టి మోసముచేసినావు. ఒకపాపకార్యమునకు సాహసించినవారు మఱియొకపాపకార్యమునకు వెనుకతీయరు. కాఁబట్టి యదేప్రకారముగా నీవును ఒకదోషమును కప్పిపుచ్చుటకయి మఱియొకదోషమును చేసి పాతకురాల వయినావు. ముత్యాలపేరు తెగిపోయినప్పుడు దానిని మఱుఁగుపఱుచుట కయి యొకటివెనుక నొకటిగా పెక్కుకల్లలు పలికి, నీ వెంతహాని చేసినావో యెఱుఁగకున్నావు. అసత్య మాడి నీ విప్పుడు భగవదనుగ్రహమునకు దూరురాల వయినావు. నీకెప్పుడును ఏవిధ మయినయపకారమును చేసి యెఱుఁగనినిర్దోషురాలి మంచినడవడికి భంగముతెచ్చి, వ్యాధిగ్రస్తుఁడయి యున్నదానితమ్మునకు బహుదినములు మిక్కిలిమీఱినవ్యథను తెచ్చిపెట్టినావు. మన మూరికిపోయి పదునుగుదినములలో అచ్చట పొందవలసినవేడుక కంతకును విఘాతము కలిగించి, నేను జీవించి యున్నంతవఱకును ముందు ని న్నెప్పుడును నమ్మకుండునట్లు చేసికొన్నావు.

మాణి—అమ్మమ్మా ! నేనప్పు డసత్యము లాడవలెనని యెంతమాత్రము నుద్దేశింపలేదు. ఒక్కరాత్రిమాత్రముముత్యాలహారము వేసికొని మరల నెప్పటిచోట పెట్టవలె నసుకొన్నాను. అమ్మమ్మా ! నీవు న న్నెప్పుడు నమ్మననిమాత్రము చెప్పఁబోకు.

లక్ష్మి—నీయందు నమ్మకము పుట్టినను, అది యెంతోకాల మునకుఁగాని పుట్టదు. నేను పెద్దదాన నయినాను. నిన్ను జాగ్రత్తగా కనిపెట్టలేను. నీవు నన్ను మోసము చేయుచుండుటచేత, ఈప్రకార ముగా సాగనిచ్చినయెడల ముందు బొత్తిగానే చెడిపోవుదువు. కాఁబట్టి నిన్ను సాధ్యమయినంత శీఘ్రముగానే మీపినతండ్రిగారియింటికి పంపి వేసెదను.

ఆమాట చెప్పినతోడనే మాణిక్యమున కెంతో వ్యసనముకలిగి మాఱుమాట చెప్పలేక యేడువ మొదలు పెట్టెను. తప్పిదము చేసి నందున ఇంటినుండి పంపివేసిరన్న నెంత యవమానముగా నుండునో వారివారిమనసులకే తెలియును. ఇఁకముం దాచిన్నదానిమాట యెవ్వ రును నమ్మరు. ఆచిన్నదానియం దెవ్వరికిని గౌరవ ముఁడదు. ఆది యంతయు నొక్కయసత్యము పలికినందువలన కలిగినఫలము.

లక్ష్మి—మనము బయలుదేరనందుకు కారణ మీవఱకే మీ పినతండ్రి నృశింహారావుకు వ్రాసివేసినాను. నిన్ను మాతోడ వెంటఁ బెట్టుకొని మీపినతండ్రియొద్దకు పోవుటకు నాకుసిగ్గుపాటుగా నున్నది. నీవు చేసినదుర్మార్గమువలన నాకును భ్రమరాంబకును ఎంతో చిన్న తనముగానున్నది. మేమందఱమునుకలిసి సంతోషముగా నుండవలసిన వేడుక దినములలో నిష్కారణముగా మాకందఱకును దుఃఖమును తెచ్చి పెట్టినావు. నీవు చేయవలసిన పని నాకొక్కటి కనఁబడుచున్నది. నీవు చేసినతప్పిదము నిమిత్తమయి నీవు నిజ మయినపరితాపమును పొందవలెను. అమ్మమ్మకు కోపము వచ్చినదనియు, ప్రయాణము తప్పి పోయిన దనియు,పరితాపపడిన కార్యము లేదు. అసత్య మాడి దేవుని యెడ మహాపరాధమును జేసితినిగదా యని మనసు నొవ్వ పశ్చాత్తాప డవలెను. నేను శిక్షించిపోదు నేమో యని తప్పిదమును దాఁచుటకే

ప్రయత్నించుచుంటివికాని అందువలన భగవంతునిదృష్టియందు పాపకార్యమును చేయుచున్నాననియు, అసత్యమాడినందున కాయున వలన శిక్ష కలుగుననియు నీవు లేశమాత్రమును తలంపలేదు. ఈయపరాధమును క్షమించుటకయి నీవు మొట్టమొదట నీశ్వరుని వేడుకొని తరువాత ముందెప్పుడును ఇటువంటి దుశ్చేష్ట మరల చేయకుండునట్లు నిశ్చయము చేసికోవలెను. నీవిఁక ముందెప్పుడును సత్యమునే పలుకవలె నని ప్రతిజ్ఞ చేసికొమ్ము. నీవల్పశిక్షను తప్పించుకొనుటకయి బొంకుటకు ప్రయత్నించినపక్షమున, నీవు కల్లలకు పుట్టినిల్లవయి యెల్లకాలమును బాధపడవలసి వచ్చును. ఒక్కకల్లను పలికి దానిని దాఁచుటకు ప్రయత్నించుటవలన మితిమీఱినమనోవ్యథయును నలుగురిలోను తలవంపులును కలుగుట నీ కనుభవమయినదికదా? నీవు మొదటనే నిజము చెప్పివేసి యుండినయెడల, ఈయవమానమంతయు తప్పిపోయి యుండునుగదా?

మాణి—నేను ముత్యాలహారము తీసిననిమిషము మొదలుకొని నామనస్సంతయు చెడిపోయినది. అప్పటినుండియు నాకొక్క నిమిషమును నెమ్మదిలేదు. సంతోషము నిచ్చువస్తువు లన్నియు వింతగా దుఃఖప్రదములుగా మాఱిపోయినవి.

లక్ష్మి—పరులు శిక్షింపక పోయినను పాపము చేసినవారికి మనస్సులో వేదన పుట్టి శిక్ష తనంతనే కలుగుచుండును. అందులో కల్లలాడువారికిని దొంగతనము చేయువారికిని ముఖ్యముగా కలుగును. అట్టివారి కెక్కడ చూచినను భయమును మనోవ్యాకులతయు కలుగుచుండును. అసత్యమాడువా రెంతయుక్తిగా మారుయోపాయములు పన్ని జాగరూకులై యున్నను, ఎక్కడనో కొంచెముసందుండి నిజము బైలపడి పరిభవమున కది మార్గమగును. నిన్న మనము

విజయనగరమునకు ప్రయాణమయి బండిని వీధిలో నిలిపినప్పుడు, నా కింక భయము లేదు, తప్పించుకొన్నా ననుకొన్నావు;నీవు ముత్యాల హారమును తీసితివని యెవ్వరును అనుమానమయినను పడలేదు. నీ వది దాటిపోయినది యెవ్వరును పట్టుకోలేరని సంతోషించుచుంటివి. ఇట్లుండగా క్షణకాలములో నిజమెట్లు బైలపడినదో నీవాలోచించు కొమ్ము. నీకు నిన్న కలిగినమనోవ్యధతో పోల్చి చూచినప్పుడు నీవు చేసినపనిని ఒప్పుకొనుటవలనఁ గలిగెడుశిక్ష యీబాధలో నూఱవపా లయినను ఉండదు. ముత్యాలహారము పోయినందుకు వచ్చెడుకోపము కంటె నీవు నిజము చెప్పినందుకు నా కెక్కువ సంతోషము కలిగి యుండును. చేసిన నేర మొప్పుకొని క్షమార్పణము చేయవలసినకాలము మించిపోయినది. పట్టుపడినతరువాత నేర మొప్పుకొన్న కార్యము లేదు. ఇఁక నీవు చేసినపాపఫలమంతయు పూర్ణముగా ననుభవింప వలసినదే.

మాణి—అమ్మగారూ! నీవు నన్నేమి చేసినను చేయుదువుగాని నన్ను నీవద్దనుండిమాత్రము పంపివేయకు. ఇఁక నేను బ్రతికియున్నంత కాలమును ఎప్పుడును అసత్యము చెప్పను.

అని యేడువ మొదలుపెట్టెను.

లక్ష్మి—ఓసీ! నిన్ను నేనిఁక నమ్మలేను. ఇఁకముందు నీ మీఁద నాకు విశ్వాసము పుట్టునో లేదో నీనడతనుపట్టి యుండును. నీవింకను పసిదానవు; నీవుబ్రతికి బట్టకట్టినపక్షమున, నీనడత బాగు చేసికొనుటకు ముందు కావలసినంతకాల మున్నది. నీవొక్కసంవత్స రము పూర్తిగా కల్లయన్నమాట లేకుండ ప్రవర్తించినపక్షమున నీ మీఁద నాకప్పుడు నమ్మకము పుట్టుట కారంభమగును. అట్టుపిమ్మట

నీమీఁద నాకు మరల దయపుట్టి, మనమందఱమును సుఖముగానుండ వచ్చును.

ఒక సంవత్సరము మాణిక్యమున కొక మహాయుగముగా కనఁబడెనుగాని సంవత్సర మయినతరువాతనైనను తనమీఁద ముత్తవకు మరల ప్రేమ కలుగు నన్నయాశచేత కొంత సంతోషము కలిగెను. లక్ష్మీదేవమ్మగారు చెప్పినదప్పుడాచిన్నదాని మనసులో శిలాక్షరము వలె నాటుకొన్నది. తాను కల్లలాడి భగవంతునియెడను, తనయంతరాత్మయెడను, తనకు శైశవమునుండియు నీతి బోధించి బుద్ధిచెప్పచు వచ్చినముత్తవతల్లియెడను, అపరాధము చేసినసంగతి మనస్సునకు స్పష్టముగా బోధపడెను.

కల్లలాడి మోసము చేసినందుకు మాణిక్యమునకు తగినంత పరాభవము కలిగినను, రామికి కలిగినయవమానముమాత్ర మింకను తీఱలేదు; ఆకుంటివాఁడు వ్యాధిబాధితుఁడయి యింకను చావుబ్రతుకులమీఁదనే యుండెను. వానిస్థితి యెట్లున్నదో తెలిసికోవలెనని మాణిక్యమునకు కొండంతకోరిక యున్నదికాని, ఆపేరు తలపెట్టుటకు సిగ్గుపడుచుండెను. అయినను కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని, గద్గదస్వరముతో వానిసంగతి యేమయినను తెలిసినదాయని ముత్తవతల్లిని విచారించి, రామిని మరల పిలిపించెదవా అని యడిగెను.

లక్ష్మి—వాని దేహములో నిమ్మళముగా నున్నను, నీవుచేసిన మేలువలన కాదు. యుక్తసమయమున నిజము బయలుపడకుండినపక్షమున వాఁడు చచ్చియే యుండును. నిర్దోషిమీఁద దొంగతనము మోపుట సామాన్య మయిన పనికాదు. అయినను విశాలాక్షమ్మ వచ్చి వాండ్రవిషయమయి మాటాడినప్పుడు నీవు దగ్గఱనుండి వినుచుండియు నీవు కాఁగా రాతిగుండె చేసికొని నిజము చెప్పివేయక

నిరపరాధులు నీదోషమువలన బాధపడుచుండఁగా సహింపగలిగితివి గాని మఱియొకరు సహింపఁగలరా? నీసంగతి తలఁచుకొనఁగా నా కాశ్చర్య మగుచున్నది. నీవు సుఖముగా విజయనగరమునకు పోయి కూరుచున్నప్పుడు ఆకుంటివాఁడు చచ్చినపక్షమున నీకేట్లుండునో! నీవు తరువాత మఱియెప్పుడయినను సుఖ మనుభవింపఁగలుగుదు నను కొన్నావు కాఁబోలును!

ఆకుంటివాఁడు చావుబ్రతుకులమీఁద నున్నప్పుడు సహితము సత్యముచెప్పక తాను విజయనగరమునకు పోవలెననుకొనుట నిశ్చయమే గనుక, మాణిక్యము మాటాడ నోరురాక సిగ్గుపడి యూరకుండెను.

లక్ష్మి—నీవు రామి కెంతయపకారము చేసినావో నీమనస్సు నీకు చెప్పుచుండలేదా? నీవు చేసిన యపరాధము క్షమింప వేఁడుకొని రామివిషయములో నీవేమయిన మేలుచేయవలెనని నీకుతోఁచలేదా?

మాణి—"అమ్మమ్మా! నే నేమిచేయఁగలను?"

అని తలవంచుకొని హీనస్వరముతో పలికెను.

లక్ష్మి—నీవిప్పుడు నాతోఁగూడ రామి గుడిసెవద్దకు వచ్చి నన్ను మన్నింపు మని దానినడిగి, జరిగిపోయినదానివిషయములో నీ వెంత వ్యసనపడుచున్నావో దానితో చెప్పవలెను.

ఆమాట చెప్పినతోడనే మాణిక్యము కడుపులో నేదో భీతి పుట్టి దేహమంతయు వడఁక నారంభించెను. రామియింటికి పోయిన తోడనే దానితల్లి తనమీఁద కోపపడి తన్ను తిట్టుననియు, మంచము మీఁదనున్న కుంటివాఁడుకూడ తాను రామివిషయమై చేసినద్రోహము తడవి తన్ను దూషించు ననియు, ఆచిన్నదాని మనస్సునకు పోడకట్టి, ఇంతమందివద్దకు పోయి వారందఱియెదుటను నేను దోషి

నయి నిలువఁబడి, చేసిన మోసము నెట్లొప్పుకోఁ గలుగుదునా యని యాచిన్నది తలపోయుచుండెను.

లక్ష్మి—(మనుమరాలివంక చూచి) రామివద్దకు పోవుటకును నీకు మనసు గొలుపకున్నదా?

మాణి—లేదులేదు. నేను రామియింటికిపోయి వారందఱి యెదుటను నాతప్పిద మొప్పుకొనుటకన్న రామి నిక్కడకు పిలిపించిన పక్షమున నేను—నేను—నేను—అని చెప్పలేక యేడువ మొదలు పెట్టెను.

లక్ష్మి—ఏమి! పాప మానిరపరాధులు నిష్కారణముగా నీమూలమున బాధపడుచున్నప్పుడు సత్యముచెప్పక దాఁచుటయే కాక, నీవిప్పుడు వారిని క్షమింప వేఁడుకోవలసినప్పుడుకూడ ఇష్టపడక చేసినపనిని ఒప్పుకొనుటకే వెనుక తీయుచున్నావుగా?

మాణి—అమ్మమ్మా! నేను నీవెంట రామియింటికివచ్చెదను రామి నానేరము క్షమించుటకును నీకు నామీఁద దయపుట్టుటకును నీ వేమిచేయుమన్నను చేసెదను.

అప్పుడు వారిద్దఱునుకలసి రామియింటికిబయలుదేఱిరి. త్రోవ పొడుగునను మాణిక్యము భయముచేత వడఁక మొదలుపెట్టెను. వా రాగుడిసెను సమీపించినప్పు డాచిన్నదిముత్తవ తల్లిచాటున నిలుచుండి వారిమొగములు చూడలేక సిగ్గుతోతలవంచుకొని యుండెను. వారు బీదవారయినను వారిగుడిసెలోపల మిక్కిలి శుచిగా నుండెను; విచారముగాలేక వారందఱిముఖములును వికాసముగానే యుండెను. రామి తనయందు దోషములేదని లోకమునకు తెలిసినందునకే పరమానందభరితురా లయియుండెను. వారి నవ్వుమొగములుచూచి కొంత ధైర్యమువచ్చి, ఆసమయములో మాణిక్య మేమో చెప్పఁ

పోఁగా రామి యొూచిన్నదానిచేయి పట్టుకొని కన్నులనీరు విడుచుచు 'అమ్మాయీ! మావద్ద నీవేమియు చెప్పవలసినపని లేదు. జరిగిపోయిన దానివిషయమయి నీ వేమియు చెప్పకు'' అని చెప్పెను.

లక్ష్మి—అట్లుకాదు. మీరా విషయమయి కొంత వినవలెను. తాను చేసినపని నిమిత్తమయి మాణిక్య మిప్పుడు మిక్కిలి వ్యసన పడుచున్నది. ఆసంగతి నీతోను నీతల్లితోనుకూడ చెప్పించుట కయి దానిని నేనిక్కడకు తీసికొనివచ్చినాను.

మాణి—రామీ! నన్ను నీవు క్షమించెదవా? మీవిషయ మయి యింత యపచారము చేసినందుకు నాకు బహుదుఃఖముగా నున్నది.

అని ముత్తవచాటున నిలువఁబడి నేలచూచుచు చెప్పెను.

రామి—అమ్మాయీ! నాకు నీమీఁద కోపములేదు. నిన్ను నామనఃపూర్తిగా క్షమించినాను. అన్నియు క్రమముగా నున్నప్పుడు మనము వెనుకసంగతి మరల త్రవ్వక మఱచిపోవలెను. నీవాసంగతి తలపెట్టకు. నాతమ్ముఁడును కొంచెము బాగగుచున్నాఁడు. వాఁ డీప్రొద్దున లేచి మంచముమీఁద కూరుచుండఁ గలిగినాఁడు. కొన్ని దినములలో యథాప్రకారముగా లేచి తిరుగవచ్చును.

అప్పగా రట్లు చెప్పినను కుంటివెంకఁడింకను మిక్కిలి బలహీనముగానే యున్నాఁడు. వాఁడు మంచముమీఁద లేచి కూరుచుండుటయే కష్టముగా నున్నది. లక్ష్మిదేవమ్మగారు వానియొద్దకుపోయి వానిపథ్యమునకు కావలసిన వస్తువులను పంపెద నని చెప్పి వానినోదార్చి యుత్సాహము కలుగఁజేసెను. మాణిక్యమునకు వానికి నెమ్మదిగా నుండుటవలన సంతోషము కలిగెను. అప్పుడు తనకీనడుమ పినతండ్రి పంపినరెండురూపాయలమాట స్మరణకువచ్చి మాణిక్యమా

రెండురూపాయలును వానికి పంపెద ననియు, వానికి బట్టలు కొని యియ్యవలసిన దనియు చెప్పెను.

ఆమఱునాఁటినుండియు రామిని మరల యథాప్రకారముగా తమయింటికి రమ్మని లక్ష్మీదేవమ్మగారు చెప్పి యింటికి వచ్చినతరువాత మాణిక్యము మనస్సుమఱింత సంతోషముగానుండి ఆచిన్నదముత్తవతోను అప్పగారితోను స్వేచ్ఛగా మాటాడ మొదలుపెట్టెను. మాణిక్య మిచ్చిన రెండురూపాయలతోను మరినాలుగు రూపాయలు చేర్చి లక్ష్మీదేవమ్మగా రాబీదకుటుంబమునకు పంపెను. ఆకుంటి వానిదేహము క్రమక్రమముగా స్వస్థపడి వాఁడెప్పటియట్ల కుంటుచు తిరుగనారంభించెను. మాణిక్య మప్పటినుండియు మోసములును కల్లలను మానివేసి, బుద్ధికలిగి చదువుకొనుచు యుక్తప్రవర్తనము కలిగి మరల ముత్తవగారి యనుగ్రహమునకు ప్రేమకు పాత్రురాలయినది.

ఈకథను చదివెడిబాలిక లందఱును తా మెప్పుడును కల్లలాడక, ఒకవేళ తమ కట్టిదుర్బుద్ధి పుట్టినను కల్లలాడుటవలన మాణిక్యమునకును నిర్దోషులయిన యితరులకును కలిగినకష్టమునుమనస్తాపమును తలఁచుకొని తమబుద్ధిని మరలించుకొనుచు, యోగ్యతాప్రవర్తనము గలిగి సుఖముగా బ్రతుకుదురుగాక!

---

బాక్సుప్రెస్, రాజమండ్రి.—1950

స్త్రీల కుపయోగించు కథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దాన కేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞీ చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 కన్యా[illegible]సంవాదము
([illegible])

6 నీతికథామంజరి ప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరకర్తృత్వ [illegible]ములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహ[illegible]
[illegible]

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ- దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయుగలరు.

శాస్త్ర ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930

# చమత్కారరత్నావళి



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

వెల 0-12-0

కీర్తిశేషులయిన రావుబహద్దూరు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వబ్రహ్మచర్య
2 విచిత్రవివాహము
3 మహాబధిర
4 పునస్స్మరణము
5 బలాత్కారగానవినోదం
6 కలహప్రియా
7 మహామహోపాధ్యాయ
8 యోగనిద్రా
9 మహావంచక
10 అసహాయశూర
11 కలిపురుషశనైశ్చరవిలాసము
12 వేశ్యాప్రియా
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొదటిభాగం
16 ,, రెండవభాగం
17 ,, మూడవభాగం

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహారధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసురవిజయము)
4 మహారణ్యపురాధిపత్యము
5 ప్రహ్లాద
6 సత్యహరిశ్చంద్ర
7 దక్షిణగోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృతనాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కల్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాలవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనిసువర్తక చరిత్రము

### వచనప్రబంధములు

### పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు ప్ర॥ భా॥
2 డిటో ద్వి॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారతసంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథకవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

శ్రీ

# చమత్కార రత్నావళి



గ్రంథకర్త:

## కందుకూరి వీరేశలింగం పంతులు

For favour of Exhibition

For Hithakarani Samaj

Hon. Secretary

నాల్గవ కూర్పు
౧

ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

కాపీరైటు] [రిజిష్టర్డు

## ఈ నాటకమునందు వచ్చుపాత్రములు.



### పురుషులు

ధర్మపాలుఁడు—చోళమండలపురాజు.
వర్ధమానుఁడు—పాండ్యదేశమునందలి మధురాపురవు వర్తకుఁడు.
పెద్దవసంతకుఁడు—వర్ధమానునకును చారుమతికిని గలిగినకవలబిడ్డలలో నొకఁడు.
చిన్నవసంతకుఁడు—వర్ధమానునకును చారుమతికిని గలిగినకవలబిడ్డలలో నొకఁడు.
పెద్దలక్ష్మణుఁడు—పెద్దవసంతకుని సేవకుఁడు, చిన్నలక్ష్మణునిసోదరుఁడు.
చిన్నలక్ష్మణుఁడు—చిన్నవసంతకుని సేవకుఁడు; పెద్దలక్ష్మణుని తోడఁబుట్టినవాఁడు.
కాంచనగుప్తుఁడు—ఒకవర్తకుఁడు; పెద్దవసంతకుని మిత్రుఁడు.
విశ్వకర్మ—కంసాలి.
ధనమిత్రుఁడు—చిన్నవసంతకునిమిత్రుఁడగు ఆంధ్రదేశపువర్తకుఁడు.
దుర్గాదాసు—భూతవైద్యుఁడు.
భద్రుఁడు—ద్వారపాలకుఁడు.
శ్వేతవాహనుఁడు—కారాగృహాధికారి.
కొందఱుభటులు, పౌరులు, మొదలగువారు.

### స్త్రీలు

చారుమతి—వర్ధమానుని భార్య; వసంతకులతల్లి.
సీత—పెద్దవసంతకుని భార్య.
సుభద్ర—సీత చెల్లెలు.
ప్రభావతి—కాంచీపురమునందలి యొక స్త్రీ.
గౌరి—పెద్దలక్ష్మణుని భార్య.
ఒక పరిచారిక.

---

# చమత్కారరత్నావళి



## ప్రథమాంకము



ప్రథమరంగము—కాంచీపురము, సభామందిరము.

[ధర్మపాలమహారాజుగారు సింహాసనాసీనులయి యుండఁగా భద్రుఁడను ద్వారపాలకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

భద్రు—(చేతులు జోడించుకొని) ధర్మపాలమహాప్రభూ! దేవరవారి కేదో ముఖ్యాంశము నివేదింపవలసియుండి కారాగృహాధికారియైన శ్వేతవాహనుఁడు భటులతోడవచ్చి తమసందర్శనార్థమయి వాకిట వేచియున్నాఁడు. ఆజ్ఞ యయ్యెనేని, ఆతనిని స్వామి సమ్ముఖమునకు తోడితెచ్చెదను.

ధర్మ—మంచిది. ఆలాగున చేయుము.

భద్రు—మహాప్రసాదము దేవా! (అని వెళ్ళి కారాగృహాధిపతి మొదలగు వారిని వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడు)

శ్వే—(నమస్కరించి) స్వామీ! దేవరవారికొక్కవిన్నపము చేయవలసియున్నది. సెలవయ్యెనేని విన్నవించుకొనియెదను.

ధర్మ—నీవు మాతో మనవిచేసుకోవలసినదేమో మనవిచేసికోవచ్చును.

శ్వేత—చిత్తము. ఈపాత్రిఃకాలమున పాండ్యదేశపు వర్తకుఁడయిన యీతఁడు మన పురవీధులలో తిరుగుచుండఁగా రాజభటులీతనినిపట్టుకొని నావద్దకు తీసికొనివచ్చినారు. ఏలినవారి యుత్తరువు నిమిత్తమయి యీతని నిక్కడకుఁ గొనివచ్చినాఁడను.

ధర్మ—(వర్తకునివంక దృష్టివఱచి) ఓయీ! నీపేరెవరు?

వర్త—నాపేరు వర్ధమానుఁడు. స్వామీ! నాకు శీఘ్రముగా మరణదండనమును విధించి నేటితో నాకష్టములను గట్టెక్కింపుఁడు.

ధర్మ—ఓయీ! నీవు మాయెదుట మఱేమియుఁ బలుకఁ బోకుము. ఒక్కనికొఱకయి పాక్షికబుద్ధి వహించి మాదేశపుశాసనముల నెన్నటికిని మేము మీఱఁగలవారము కాము. అక్రమముగా నిచ్చికొమ్మన్న ధనము నిచ్చుకోలేకపోయిన మాత్రముచేత నాఁడా ప్రకారముగా మీరాజు క్రూరుఁడయి న్యాయమార్గమున సంచరించుచున్న మాదేశవర్తకుల నందఱిని చంపించినప్పటినుండియు మా హృదయమునందు మీదేశస్థులవిషయమయి లేశమయినను దయయను మాట పుట్టకున్నది. ఆప్రకారముగా మీదేశపువారికిని మాదేశపువారికిని విరోధము పుట్టినప్పటినుండియు అక్కడ మీవారును ఇక్కడ మావారును సభలుచేసి యిఁకముందొకరి దేశములోనొకరెవ్వరును వాణిజ్యము చేయకుండుటకయి కట్టుపాటుల నేర్పఱచుకొన్నారు. అంతేకాక మీదేశపువాఁ డెవఁడయినను మాదేశమునందెక్కడఁ గనఁబడినను తత్క్షణమే ప్రాణసంరక్షణార్థమయి వేయివరహాల నిచ్చినచో తప్ప లేనియెడల నాతని సొత్తంతయు దొరతనమువారి యధీనము చేసికొని యాతనిని సంహరింపవలయునని శాసనమొకటి యేర్పఱచుకొన్నాము. ఇప్పుడు నీయొద్దనున్న సొమ్మంతయు ఎక్కువ వెలకు విక్రయించినను నూఱువరాలకంటె తక్కువయే వచ్చును గనుక నేఁడు నీకు చావునిశ్చయము.

వర్ధ—దురంతములయిన చింతల ననుభవించి యనుభవించి యీమనుగడమీఁద రోఁతపుట్టియున్న నాకిప్పుడు చావన్న పరమ సంతోషముగానున్నదే కాని లేశమయినను భయముకలుగుచుండ లేదు.

ఈదినమున నస్తమించెడు సూర్యునితోఁగూడ నాదుఃఖమును నస్తమిం చునుగనుక మీరిట్లుచేయుట నాకు మహోపకారము చేయుటయే.

ధర్మ—ఓయి వణిజుఁడా! ఎఱిఁగి యెఱిఁగి మధురాపురవర్తకుల కెల్లను ప్రత్యక్షమృత్యువైన యీ కాంచీపురమున ప్రవేశింప నేలసాహసించితివి? ఇంతసాహసమున కొడిగట్టిన నీరాక కేదియో ప్రబల కారణ ముండకమానదు. కాఁబట్టి మీ దేశమును విడిచి మా దేశమున కేలవచ్చితివో కొంచెము చెప్పుము.

వర్ధ—దురదృష్టవంతుఁడనైన నాకు నాచరిత్రమును చెప్పుకొనుటకంటె విశేషభారమగునపని మఱియొకటిలేదు. అయినను దేవర యంతటివారు నావంటి యభాగ్యుని మన్నించి యడిగినప్పుడు మాధ్యముచేసి చెప్పక నిరాకరించుట ధర్మముకాదుగనుక నావిపత్తు లాత్మదోషమువలనఁ గలుగక దైవవశమువనే వచ్చినవని లోకమునకంతకును తెలియుటకయి నన్ను నాదుఃఖము చెప్పనిచ్చినంతవఱకు నామర్దశలను వినిపించెదను వినుండు—నేను మధురాపురమున నొక సద్వంశమున జన్మించి, వాణిజ్యమువలన జీవనముచేయుచు, కులీనయు గుణవతియు సౌందర్యవతియు నగు చారుమతియను సుందరిని వివాహము చేసికొని, ఆమెతోఁగూడ కొంతకాలము సకలసౌఖ్యములు ననుభవించుచు సుఖజీవనము చేయుచుంటిని. అంతట వ్యవహారధర్మమునుబట్టి నేను సింహళద్వీపమునకు వెళ్ళవలసివచ్చినందున, గర్భిణియైయున్న భార్య నింటనే దిగవిడిచి యోడనెక్కిపోయి యక్కడనే వ్యాపారము మీద ఆఱుమాసములవఱకు నుంటిని. అటుతరువాత నింకను కొంత కాలమక్కడనే యుండవలసినట్టు తటస్థించినందున దుస్సహమయిన పతివిరహమునకు తాళఁజాలక పలుమాఱు వర్తమానములఁ బంపుచు వచ్చిన ప్రాణసమానురాలయిన నాభార్యనుకూడ నాయొద్దకే పిలి

పెంచుకొంటిని. అక్కడకు వచ్చిన కొన్నిదినములలోనే నా భార్య ప్రసవమయి దివ్యసుందరవిగ్రహములు గల యిద్దఱు కవలపిల్లలను గనియెను. వారిద్దఱును అచ్చునఁ బోసినట్లు భేదమెంతమాత్రమును లేక యేకరీతిగా నున్నందున, ఒకరినుండి యొకరి నానవాలుపట్టుట యసాధ్యముగా నుండెను. ఆదినముననే దైవయోగముచేత మేము దిగియున్న సత్రములోనే కాపురమున్న యొక బీదదానికికూడ సరిగా నొక్కరీతిగానున్న యిద్దఱు కవలపిల్లలు పుట్టిరి. వారి తల్లిదండ్రులు నిరుపేదలౌటచేత వారు తమబిడ్డల నమ్మఁజూపగా, నాకొమాళ్ళవద్ద నీడుజోడుగానుండి యాడుకొనుచు సేవచేయుచుండుట కక్కఱకువత్తురనియెంచి, వాండ్రనుకూడఁగొని కన్నబిడ్డలవలె పెంచుచుంటిమి. స్వభావముచేత రూపములయందిసుత్తును భేదములేనివారికి నామములచేతమాత్ర మెంతయుభేదము కల్పింపవలెనని యెంచి, నా కొమాళ్ళకిరువురకును వసంతకులనియు సేవకులకిద్దఱకును లక్ష్మణులనియు నామకరణములు చేసితిమి. అటువంటి ముద్దుమూటగట్టు కొమాళ్ళు గలుగుటవలన పట్టరాని గర్వముకలదయి యెప్పు వారిని తీసికొనిపోయి బంధువులకెల్లను జూపుచునాయుచు సంతోషముతో నాభార్య ప్రతిదినమును దేశమునకు వెళ్ళుదమురమ్మని నన్ను ప్రయాణములు చేయునారంభించెను. అహోరాత్రములు చెవి నిల్లుకట్టుకొని పోరుచుండఁగా నేనా పోరు పడలేక తుదకు విధిలేక యొప్పుకొని కష్టపడవలసిన యోగముండి యిష్టములేకయే యొకదినమున నోడనెక్కి సపరివారముగా బయలుదేఱితిని. ఎటువంటిదుస్సమయమున నిల్లువిడిచితిమో కాని మేము లంకవిడిచి క్రోసెడు దూరము నరుగు రాకముందే భయంకరమయిన గాలివాన యారంభమయినది. అది యంతకంతకు ప్రబలి మహాభయావహమయినందున నావికులు నిరాశులయి తమ

యోడను రక్షించుకొను మార్గము నుగానక ప్రతినిమిషమును గాలి దెబ్బకు పగిలిపోవ సిద్ధముగానున్న యోడతో మమ్ము వదలిపెట్టి తమ ప్రాణములను దక్కించుకొనుటకయి యోడయొక్క ప్రక్కలనుగట్టి యున్న చిన్నపడవలలో నెక్కిపాఱిపోయిరి. నామట్టుకు నాకు చావన్న నంతభయము లేకపోయినప్పటికిని దగ్గఱ జేరి కంటికి నేలకును నేకధారగా గోలుగోలున నేడ్చుచున్న భార్యను, భయమెటువంటిదో యెఱుగకపోయినను తల్లియేడుపుచూచి వేడుకకొఱకు కన్నకడుపు దహించుకొని పోవునట్లు పెద్దపెట్టున రోదనముచేయుచున్న పిల్లలనుజూచి, వారి నిమిత్తమయి నామనస్సు తాపురాతులోని నీరువలె తల్లడిల్లసాగెను. ఈప్రకారముగా కొంతసేపు వారిరక్షణోపాయమును వెదకుటకయి దీర్ఘాలోచనలో మునిగియుండి కడకొక్కయుపాయము నాలోచించి గాలివానలు పుట్టునప్పుడు పనికివచ్చుటకయి పడవవాండ్రు నిలువచేసి కొన్న చాపకొయ్యలలో నొకదానికి చిన్నవసంతకు నొకచివరను చిన్నలక్ష్మణు నొకచివరనుగట్టి నడుమను నేను కట్టుకొంటిని. అప్పుడు దుఃఖసముద్రములో మునిగియున్న నాభార్యనుకూడ నేనుజేసి నట్లే చేయుమని బోధింపఁగా నామెయు మిగిలియున్న చిన్నవాండ్ర నిరువురను చెఱియొకచివరను మఱియొక చాపకొయ్యకుకట్టి తాను మధ్యకట్టుకొనెను. కీడులో మేలు దైవమనుగ్రహించి నాకప్పుడా యుపాయమును తోపించినందున, అప్పుడే మృతినొందక నాకష్టకథలను మీవంటివారికి చెప్పుచుండుటకయి భూమిమీఁద నీలాగున బ్రదికితిని. మేమిరువురమును ప్రాణాధికులయిన కూనబిడ్డల మీఁదనే కన్నులుపెట్టుకొని ప్రవాహవేగమునుబట్టి పడవ పోయినట్లెల్ల రామనాథపురమునకేసి కొట్టుకొనిపోవుచుంటిమి. ఇంతలో మబ్బువిడిచి పోయి కన్నులు మిఱుమిట్లుగొనునట్లుగా ఆకాశమధ్యమున సూర్య

బింబము కనఁబడెను; అవలికావరించియున్న చీఁకట్లన్నియు నిమిష ములో మాయమాయెను; కొండపొడుగున లేచు తరంగములన్నియు వణఁగి సముద్రము నిశ్చలముగా నుండెను; సముద్రమునంతనుఅల్ల కల్లోలముగాఁజేసిన వాయువంతయు శాంతించెను. అప్పుడు మాకు ముందు దూరమున రెండునావలుః కనఁబడెను. ఆనావలు చేరువకు రాకముందే—(గద్గదస్వరముతో) ఇఁక నేమియు నేను చెప్పజాలను. దీనినిబట్టి దానిని మీరూహించుకొనుఁడు.

ధర్మ—ఓయి వృద్ధుఁడా! ఈప్రకారముగా కథను నడుమ త్రెంపివేయక కడముట్ట చెప్పుము. మేము నిన్ను క్షమింపలేకపోయి నను నీకథవిని జాలినైనను పొందుదుము.

వర్ధ—ఆనావలు దగ్గఱకు రాకముందే మేమున్న యోడ యొక పర్వతమును గొట్టుకొని దారుణధ్వనితో ముక్కముక్కలుగా పగిలి పోయెను. ఆయుక్షేపముచేత మేము చాపకొయ్యల నంటిపట్టుకొని నీళ్ళపయిన తేలి కొట్టుకొనిపోవుచుంటిమి. నేనునాప్రాణముతో పాటు మఱియిద్దఱ ప్రాణములను గూడ కాపాడవలసినవాఁడ నగుటచేత, నాభార్యకును తక్కినవారికిని నేనేమియు తోడుచూపలేకపోతిని. అం దుచేత నాభార్య యిరువురపిల్లలతోను ప్రవాహవేగము ననుసరించి మఱియొకవైపునకు కొట్టుకొనిపోవుచుండెను. అయినను వారుచూపు మేరదూరములో నుండఁగానే యెవ్వరో చిన్నపడవలోవచ్చి వారి నెక్కించుకొని కొంతసేపటిలో దృష్టిపథమును దాటిపోయిరి. వారి నట్లు తమపడవలో నెక్కించుకొన్నవాండ్రు రామనాథపురమునుండి చేపలఁబట్టుటకయి వచ్చిన పల్లెవాండ్రయి యుందురని నేనూహచేసి కొంటినిగాని, ఆతీసినవారెవరో తరువాత వారిగతి యేమైనదో యె న్నివిధముల ప్రయత్నముచేసినను నేటివఱకును నాకు తెలియుటనే

లేదు. హా దైవమా! వారెట్టి యాపదలపాలయి యెక్కడ కష్టపడు చున్నారో గదా!

ధర్మ—ఓయి వెఱ్ఱివాఁడా! వారినిమిత్తమయి నీవు విచార పడుచున్నావే కాని నీకు రాఁబోవుచున్నగతిని నీవు విచారించుకొనకున్నావు. అటుతరువాత నేటివఱకు నేమి జరిగినదో వివరముగా తెలుపుము.

వర్ధ—వారు సుఖముగా పడవలో నెక్కించుకోఁబడఁగా కన్నులార చూచితినిగనుక, నాప్రియపుత్రునిని భృత్యునిని ఏలాగునయిన బ్రతికించుకోవలెనని సముద్రతరంగములతో పోరాడుచుండుట తప్ప నా కప్పుడు మాఱుచింత లేకపోయెను. ఈప్రకారముగా సముద్రములోఁబడి ముందుకు వెనుకకు అలలీడ్చినట్లెల్ల పోవుచు తిరుగుడు పడుచుండ, దైవికముగా నాసమయమున నాదారిని పోవుచున్న యోడపయి నున్నమనుష్యులు దూరముననుండి మమ్ముఁజూచి తమయధికారికి చెప్పఁగా నతఁడును సదయహృదయుఁడయి యోడను మాదగ్గఱకు పట్టించి మమ్ముం దెక్కించుకొనియెను. పడవవాండ్రందఱును మునుపు నన్నెఱిఁగినవారగుటచేత సమస్తవిధముల నన్నాదరించి సకలోపచారములను జేయుచు సుఖముగా మమ్ము మధురాపురమునకుఁ గొనిపోయి విడిచిపెట్టిరి. ఇల్లుచేరినతరువాతసంసారము మీఁది విరక్తిచేత నేనుమరలవివాహము చేసికోక, క్రమక్రమముగా దుఃఖమునంతను మఱచిపోయి ప్రాణములనన్నిటిని నాచిన్నకుమారుని మీఁదనే పెట్టుకొని, ఒకవిధముగా కాలము గడవుచుంటిని. ఇట్లు కొంతకాలము జరుగఁగా నాబహిఃప్రాణమైనద్వితీయపుత్రుఁడు పదునెనిమిదిసంవత్సరముల వయస్సు గలవాఁడయి తనతల్లి యేమయినదని యొక్కనాఁడు నన్నడిగెను. నేనును కన్నీరుకాలువలుగట్ట నడచిన

సర్వవృత్తాంతమును పూసగ్రుచ్చిన ట్లతనికి వినిపించితిని. అదివిన్నది మొదలుకొని యుతనిచిత్త మంతయు తల్లిని సోదరుని వెదకుటమీఁద పోయి, తనవలెనేయున్నను పోఁగొట్టుకొని విచారించుచున్నభృత్యుని తనకుతోడిచ్చి వారిని వెదకఁ బంపుమని నన్ను ప్రతిదినమును పీడింపసాగెను. భార్యాపుత్రుల సమాచారము తెలిసికోవలె నని మనసులో నాకెంతో యపేక్ష గలిగి యుండియు వారినిమిత్తమయి యీయున్న యొక్కకుమారునినికూడ పంపివేసి యొక్కఁడను నుండ మనసొప్పక యిదిగో రేపుపంపెద నదిగో మాపుపంపెదనని యొక పట్టున సమ్మతింపక కొంతకాలము జరపితిని. ఆపిమ్మట దినదిన క్రమమున పుత్రునినిర్బంధ మెక్కువ కాఁగా, అతనిప్రార్థనను త్రోసి వెయ్యలేక తుదకెట్లో సమాధానపడి వెళ్ళి వేగిరము రా ననుమతించితిని. నాకొమారుఁడును సేవకుఁడును నన్నువదలివెళ్ళినతరువాత ప్రతిదినమును వారిరాకకయి యెదురుచూచుచు, నేఁడువచ్చెదరో రేపువచ్చెదరో యని స్వప్నావస్థయందునుసహితము వారినే తలఁచుకొనుచు నెంతో కష్టముమీఁద రెండుసంవత్సరములవఱకును నోర్చుకొని యుండి, అప్పటికిని వచ్చుజాడ కానరానందున నిఁకనింటకాలు నిలువక మేరమీఱిన పుత్రస్నేహమున బయలుదేఱి రెండుసంవత్సరములనుండి క్రమముగా మళయాళము, కన్నడము, కొంకణము, ఘూర్జరము, మాళవము, నేపాళము, బంగాళము మొదలయిన దేశములనెల్ల వెదకి యుందెందును వారిని గానక, అచ్చటనుండి దక్షిణాభిముఖుఁడనయి యుత్కలదేశముమీఁదుగా నాంధ్రదేశము ప్రవేశించి యం దించుకయు వారిజాడ తెలియక విసిగి వేసరి వారియాశ నిరాశ చేసికొని యింటివంక మరలివచ్చుచు, మనుష్యసంచారము గలదేశములలో దేనిని వెదకకుండ విడిచిపెట్టిపోవబుద్ధిపుట్టక, చావున

కయిన నొప్పుకొని కడ కీదేశము చొచ్చితిని. ఈదినముతో నిచట నాకథాశేష మైనది. నాకిప్పుడు మఱి యేమియు విచారము లేదు. గాని నాపుత్రకళత్రాదులు జీవముతో నున్నా రన్నశుభవార్త నా చెవిని బడిన సంపూర్ణసంతోషముతో నీదేహమును విడుతునుగదా యనిమాత్రము చింతపడు చున్నాను.

ధర్మ—రాజనకాసహిత మలంఘ్యమయిన మాదేశ రాజ శాసనమునకు విరుద్ధము కాకుండెనేని సంతోషపూర్వకముగా మే మీవఱకే నిన్ను క్షమించి విడిచిపెట్టి యుందుము. రాజశాసన మీ విషయములో నెంతో క్రూరముగా నున్నది; మేమేమి చేయుదుము? మేము చేసిననిబంధనలను మేమే తగవుమాలి యతిక్రమించుట మా గణ్యతకు తగినపని కాదని నీకును తెలియునుగదా? న్యాయమును బట్టి మాచట్టముల విధులప్రకారము నిన్నిప్పుడే చంపింపవలసినది మాకర్తవ్యకృత్యమయినను, ఏదియెట్లయినను విచారింపక నీకు మే మొక్కయుపకారమునుమాత్రము చేయ నిశ్చయించుకొన్నారము. నీయావచ్ఛక్తిని వినియోగించి యేలాగున నైన నీసాయంకాలము లోఁగా ఈగ్రామములో నెవ్వారియొద్దనైన బదులుచేసిగాని యెవ్వారి నైన వేడికొనిగాని తెచ్చియపరాధము విధించినధనమును చెల్లింపుము. నీకీదినము గడువిచ్చినారము; పొమ్ము. ఆప్రకారముగా చేయఁగలిగితి వేని నీవు బ్రదుకుదువు; లేదేని, ఈసాయంకాలముతో నీదేహము నీది కాదు.—(కారాగృహాధికారివంకఁదిరిగి) ఓశ్వేత వాహనా! కావలితో నీ వీతనివెంటనుండి కోరినచోటికెల్లనుతీసికొని పొమ్ము.

శ్వేత—చిత్తం మహాప్రభూ!

ధర్మ—మే మిప్పు డంతఃపురమునకు విజయంచేసెదము. సాయంకాల మీతని తీసికొని మీరు మరల రండి.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)

వర్ధమా—(తనలో) అయ్యో! కాని దేశములో దిక్కుమాలిన పక్షివయి చచ్చిపోవుచున్నానుగదా! ఇక్కడ నన్నెఱిఁగినవా రెవ్వరున్నారు! ఒక్కవిదేశీయుని నమ్మి దండుగ చెల్లించుటకై యింత సొమ్ము దానరూపమునఁగాని ఋణరూపమునఁగాని మొగమెఱుఁగనివాఁడెవ్వఁడిచ్చును! నన్నింత సేపు బ్రతుకనిచ్చిన నాకంత యధిక వేదన కలిగించుటయే కాని యుపకారము చేయుట కాదు.

(అని కారాగృహాధికారివెంట నడిచెను.)

---

ద్వితీయరంగము—ఒక బహిరంగ ప్రదేశము.

[చిన్నవసంతకుఁడును చిన్నలక్ష్మణుఁడును, ధనమిత్రుఁడనువర్తకుఁడును ప్రవేశించుచున్నారు.]

ధన—ఆంధ్రదేశములో మనకిద్దఱకును గలిగిన మైత్రినిబట్టి నీకొక్క హితోపదేశము చేయుచున్నాను. నీవు మధురాపురవాసుఁడనని యెవ్వరితోను నవక, ఆంధ్రదేశస్థుఁడనని చెప్పకొమ్ము. నీవు పాండ్యమండలపువాఁడవని తెలిసినపక్షమున నీసొమ్మంతయు రాజు దండుగ పుచ్చుకొనును. గ్రహచారముచాలక యిక్కడకు వచ్చినందునకయి యీదినముననే పాండ్యదేశవర్తకుఁ డొకఁడుపట్టుకోఁబడి యున్నాఁడు. పాపము! అతఁడు తనప్రాణరక్షణార్థమయి తగినంతధనము నిచ్చుకోలేకపోవుటచేత సూర్యాస్తమయములోపల రాజశాసనమునుబట్టి రాజభటు లాతనిప్రాణములు తీసివేయుదురు. నీవు

నాదగ్గఱనుంచిన సొమ్మిదిగో పుచ్చుకొమ్ము. (అని యొకమూటను తీసి యిచ్చుచున్నాఁడు.)

చిన్నవసం—(పుచ్చుకొని) లక్ష్మణా! నీవీసొమ్ము తీసికొని పోయి నేను తిరిగివచ్చినదాఁక మనము దిగినసత్రమువద్ద పదిలముగా కనిపెట్టి యుండుము. భోజనసమయములోపల నేనీపట్టణము నాలుగు మూలలును తిరిగి యిందలివిశేషములనుచూచి వచ్చెదను. నేనిప్పుడు మార్గాయాసముచేత బడలియున్నను, ఇక్కడివింతలను జూచువఱకును నాకు విశ్రాంతిపొందఁ బుట్టకున్నది.

చిన్నలక్ష్మ—నీమాటలనుబట్టి నిన్నెవ్వరో ఆనవాలుపట్టి నిన్నుపట్టుకొని చెరసాలలో పెడుతారు. నీకేల వెళ్ళు.

(అని నిష్క్రమించెను.)

చిన్నవసం—ధనమిత్రా! చిన్నప్పటినుండియు నాదగ్గఱ మిక్కిలి చనువగుటచేత సంకోచింపక హాస్యవచనములను పలికివీఁడు నన్నునవ్వించి నామనసులో విచారముగా నున్నప్పుడు వినోదము కలిగించుచుండును. నాతోకూడ నీవు కొంచెముసేపు తిరిగి పట్టణము చూపింపఁగలవా? మనమిద్దఱమును గలిసివెళ్ళి యీపూట మాబసలోనే భోజనము చేయుదము.

ధన—ఈపూటకు నన్నుక్షమించి వదలిపెట్టవలెను. ఈవఱకే నేనొకవర్తకునియింటికి భోజనమునకు వచ్చెదనని వాగ్దానముచేసి యున్నాను. నేనిప్పుడు వెంటనే వెళ్ళవలెను. నేను మధ్యాహ్నము మరల వచ్చి చీఁకటి పడువఱకును నీతోకూడ నుండి యీపట్టణము నందలి విచిత్రములనెల్లను నీకు చూపెదను.

చిన్నవసం—మంచిది. నీవువెళ్ళుము. మాదేశస్థునినెవ్వరినో పట్టుకొన్నారని విన్నప్పటినుండియు నామనసులో నేలాగునను

యున్నది. ఇక్కడక్కడ కొంచెము తిరిగి యిప్పుడే నేనును వెళ్ళి యిల్లుచేరెదను.

ధన—నీమనసువచ్చినట్లు చేయము. నేను పోయివచ్చెదను.

(అని వెళ్లుచున్నాఁడు.)

చిన్నవసం—(తనలో) అయ్యో! ఒకజలబిందువు మహాసముద్రములోఁ బడిన మఱియొక జలబిందువును వెదకి పయికి తీసికొని వచ్చుటకయి పనిపూని యందు ప్రవేశించి యామహార్ణవములో తానుగూడ కనఁబడకయడఁగిపోయినట్లు, మందభాగ్యుడనైన నేనును తప్పిపోయినయన్నను తల్లిని వెదకుకునని బయలుదేఱి యిల్లు విడిచి వాకిలివిడిచి యీనానాసంఘములోఁబడి కానిదేశములో పరిభ్రమించుచున్నాఁడను.—అదుగో లక్ష్మణుఁడు వచ్చుచున్నాఁడు!

[పెద్దలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

లక్ష్మణా—అప్పుడే వచ్చినావేమి?

పెద్దలక్ష్మ—అప్పుడేనా! ఇప్పటికే నేనెంతో ఆలస్యంగా వచ్చినాను. దేవరవారు యింటికి వేగిరం వేంచేయక పోవడంచేత, యింటికాడ అన్నమూ కూరలూ చల్లారిపోయినవి. మీకీవేళభోజనం మీఁద ధ్యానం లేనట్లున్నది. మీకేమి? మీస్థితి చూస్తే మీ రెక్కడనో దిట్టంగా విందారగించినట్లు తోస్తూవున్నది. మీ కోసం వుసూరుమని యింటికాడ పడి ఆకలితో మలమల మాడి మేము చస్తూవున్నాము.

చిన్నవసం—ఈప్రసంగ మింతటితో చాలించియిప్పుడునీ చేతి కిచ్చిన సొమ్మెక్కడ పెట్టివచ్చినావో ముందుగా నాతో చెప్పు.

పెద్దల—కూలివాడి కిమ్మని యిచ్చిననాలుగు డబ్బులూనా! నాకెందుకు! నేను వాడి కప్పుడే యిచ్చి పంపివేసినాను.

చిన్నవసం—నే నిప్పుడు మనసులో నేమియు నుల్లాసముగా లేను. నాసుందర నిక ముద్దులుకుడువక సొమ్మేమి చేసినావో నిజము చెప్పు. మన మీాయూరికి క్రొత్తవారమయి యుండఁగా, అంతసొమ్మెలాగున నొకరిని నమ్మి యొప్పగించి వచ్చినావు!

పెద్దల—ఇప్పుడు నాతో పరియాచక మాడుతూవున్నారా యేమిటి? కావలిస్తే భోజనా లయినతరువాత నెమ్మదిగా కూర్చుండి కావలసినంతసేపు మీామనసువచ్చినట్టు హాస్యా లాడుకోవచ్చును. అమ్మగారు మిమ్మల్ని వేగిరం తీసుకురావలసిన దని నన్ను పంపించి నారు. మిమ్మలిని వేగిరంతీసుకువెళ్ళపోతే, ఆమెగారు నాపనిపట్టి స్తారు. తరువాత మీాదోషంచేత నేను దెబ్బలు తినవలసివస్తుంది, వేగిరంరెండి.

చిన్నవసం—(కోపదృష్టితో) ఓరీ! లక్ష్మణా! ఇటురా భద్రము! హాస్యమున కిది సమయముకాదు. ఈమాటలన్నియూ సమ యమువచ్చినదాఁక దాచుకొని, ముందుగా నీచేతికిచ్చిన ధనమేమయి నదో నాకుచెప్పు.

పెద్దల—నాచేతికా! నాచేతికి మీారు ధనం యెందుకిచ్చారు!

చిన్నవసం—ఓరీ తస్కరశ్రేష్ఠుఁడా! ఈలాగున దయచేసి కొంచెముసేపు నీమర్కటచేష్టలు కట్టిపెట్టి నీమీాఁదపెట్టినపని యేమి చేసినావో చెప్పు.

పెద్దల—నామీాఁదపెట్టినపని మిమ్మల్ని భోజనానికి యింటికి తీసికొని వెళ్ళడమే. అమ్మగారున్ను ఆమెచెల్లెలున్ను మీాకోసం కని పెట్టుకొనివుంటారు. రండి వెళుదాము.

చిన్నవసం—నీచేతికిచ్చిన వేయివరాలును సురక్షితముగా నెక్కడదాచివచ్చినావో యీసారి నిజముగాచెప్పు. చెప్పనిపక్షమున,

నామనస్సులో నెమ్మదిలేనప్పుడీప్రకారముగా మేలమాడుచున్నందుకు నీతలకాయ పగులగొట్టెదను.

పెద్దల—నావద్ద వేయివరాలు లేవుగాని దేవరవారు తలమీద వేసినవీ దేవిగారు బుజాలమీద వేసినవీ మొయ్యిలేకుండా వెయ్యి దెబ్బలున్నవి. కావలిస్తే వాటినన్నిటినీ వడ్డీతోకూడా మీకు తీర్చగలను.

చిన్నవసం—ఆ! అమ్మగారు బుజములమీద వేసినవా? నీకెక్కడ నేయమ్మగారున్నారురా నిర్భాగ్యుడా!

పెద్దల—ఏయమ్మగారా! తమభార్యగారు. తమరువచ్చిందాకా భోజనంచెయ్యకుండా కనిపెట్టుకొనివుండి తమరిని వెదకి తీసుకొనిరమ్మని నన్ను పంపించిన అమ్మగారు. ఇప్పుడు తెలిసిందా?

చిన్నవసం—నాకేమియు తెలియదు. నీ అమ్మగారిని గృహమునుకూడ తగులబెట్టిరా. నాకిల్లును లేదు భార్యయును లేదు. కొంచెమైనను భయములేకుండ నన్నీలాగున మొగముమీదనే మొగతాళి చేయ మొదలుపెట్టినావా? నిన్నేమిచేసెదనో చూడు.

(అని నెత్తిమీద కొట్టుచున్నాడు.)

పెద్దల—(చేయడ్డముపెట్టి) ఇదేమిటి? నన్ను నిష్కారణంగా కొడుతూవున్నారు? నన్నుపోనిండు. (అని పారిపోవుచున్నాడు).

చిన్నవసం—(తనలో) ఈపాపాత్ముడేదోమాయోపాయము చేసి నాధన మపహరించి నాపని కాజేయుదలంచినాడు. ఇది పంచమహాపాతకుని పట్టణమని మున్నెప్పుడును వినుచుందును. అది యిప్పుడు నిజమయినది. నిమిషములో కన్నులుగప్పి యింద్రజాలముచేసి వస్తువుల నపహరించువారును, క్షణములో మతులుమార్చి మోసము చేసి చూచినదానినెల్ల మాయముచేయువారును, మాటలతో బయల

పందిళ్లు వేసి యీటి చేతిలో స్వర్గము కనఁబఱిచి ధనములాగువారును, ఈపట్టణమునిండ కుప్పతిప్పలుగా నున్నారట! ఇదియేసత్యమయ్యె నేని నేటితో నేను చెడిపోయినాను. నేటి కాలమునకు-గా ధనమునకు తెక్కలు వచ్చి దానికిని నాకును ఋణము చెల్లిపోయి నావద్దనుండి అదియెగిరి పోయినది కాఁబోలును! నేనును చప్పున సత్రమువద్దకుపోయి వాఁడక్కడ నున్నాఁడేమో వెదకి పట్టుకొనెదను. (అని వెళ్ళుచున్నాఁడు)

---

## ద్వి తీ యాం క ము

ప్రథమరంగము — పెద్దవనంతరని గృహము

[సీతయు, సుభద్రయు, ప్రవేశించుచున్నారు]

సీత—సుభద్రా! ఇదేమి? నాప్రాణేశ్వరుఁడున్ను రాలేదు; నాప్రాణేశ్వరుని వేగిరం వెదకి తీసుకురమ్మని పంపిన భృత్యుఁడున్నూ జాడలేదు. ఇప్పుడు రెండుజాములు దాటిపోయింది.

సుభ—ఎవరైనా అతణ్ని భోజనానికి పిలుచుకొనిపోయినారేమో! అతడు యింటికి రాకుండానే మధ్యదారిలోనుంచే వెళ్ళివుండవచ్చును. భోజనానికివచ్చే వేళ మించిపోయింది. ఇఖమనం కనిపెట్టుకుని వుండనక్కరలేదు; భోజనంచేతాములే. మగవాళ్ళుపరమస్వతంత్రులు; వాళ్ళేమిచేసినా మనమేమీ అనకూడదు.

సీత—మనకులేని స్వాతంత్ర్యము మగవాళ్ళకుమాత్ర మెందుకుండవలెను? నేనెక్కడకయినా వెళ్ళి వక్కదినము వేళకు యింటికి రాకపోతే వారూరుకుంటారేమో!

సుభ—మనవలె మగవాళ్ళు యింట్లోకూర్చుండవలసినవాళ్లు కారు. వాళ్ళు బయిటతిరిగి పనిచేసి కుటుంబపోషణానికయి ధనము

వృద్ధి కష్టపడి సంపాదించి తేవలసినవారు. అందుచేతనే వారికి స్వేచ్ఛ అధికంగావున్నది. వారేమిచేసినా మనం తప్పుపట్టక వారి కణగివుండవలెను. సృష్టిలోవున్న సమస్తజంతువులున్ను ఆడవి మొగ వాటికి లోబడివుండడం నైజం.

సీత—రేపు నీకు పెళ్ళయి నీమొగుడు వేళకు యింటికి రాక తిప్పలుపెడితే నీవప్పుడేమి చేస్తావు?

సుభ—అతడు యింటికి వచ్చేవరకూ శాంతంవహించి కని పెట్టుకుని వుంటాను.

సీత—యితరులవిషయంలో మాట లెన్నైనా చెప్పవచ్చును. స్వవిషయంలో మాత్రం చెప్పినట్టు నడుచుకోవడం బహాకష్టం. తన విషయంలో యెదటివారు నేరంచేసినప్పుడు నీవుచెప్పిన శాంతమూ గింతమూ అవతలకు నడుస్తవి. నీకునిజంగా మగడువచ్చి యీప్రకారంగా నిన్ను బాధపెట్టినప్పుడు నీవెంతశాంతం వహిస్తావో మేము చూడకపోములే.

సుభ—నేను వివాహం చేసుకోకముందే మగడికి లోబడి వుండడం నేర్చుకుంటాను. నాశాంతం నీకు కనపర్చడానికయినా నేను శీఘ్రంగా వివాహ మాడుతాను—అడుగో లక్ష్మణుఁడు వస్తూ వున్నాఁడు. నీభర్తకూడా వెనుక వస్తూవుండి వుండవచ్చును.

[పెద్దలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

సీత—నీయజమానుడుగా రెంత దూరములో వున్నారు?

పెద్దల—నాయజమానుఁడు నాకుజానెడు దూరంలోవున్నాఁడు; ఆయనచేతులు మరీచేరువకు వచ్చినవి. రెండుచేతులూ టబటబ నాతలమీఁద పడ్డవి. ఇవిగో నాదౌడలుకూడా సాక్ష్య మిస్తూవున్నవి చూడు. (అని వంగి దౌడచూపుచున్నాఁడు)

సీత—నీగీర్వాణము కట్టిపెట్టి తెనుగులో చెప్పు. ఆయన నీతోమాట్లాడినారా? నీవాయనమనస్సు కనిపెట్టినావా?

పెద్దల—ఆయనమనస్సంతా నాశిరస్సుమీద కనబడ్డది. ఆయనమనసేమోకాని చెప్పినమాట వక్కటినాకు తెలిసిందికాదు.

సుభ—నీకర్థం తెలియకుండా అత డంత అస్పష్టంగా మాట్లాడినాడా?

పెద్దల—కావలసినంత స్పష్టంగానే మాటలాడినాడు; నాతలమీద దెబ్బలు మరింత స్పష్టంగా కనబడ్డవి. ఆడినమాటలుమాత్రం నాకర్థం కాలేదు.

సీత—ఆయన యింటికి వస్తూవున్నారేమో చెప్పు. ఆలస్యంగా వస్తే భార్యకేమయినా కోపంవస్తుందని సందేహిస్తూవున్నారని తోస్తుంది.

పెద్దల—ఏసందేహమూ లేదు. నీభర్తకు పిచ్చియెత్తింది.

సీత—ఓరినిర్భాగ్యుడా! పిచ్చియెత్తిందీ!

పెద్దల—పిచ్చికాకపోతే వెఱ్ఱి. యేదోవకటియెత్తింది. తప్పకుండా నీమొగుడికి మతిపోయింది. నేను యింటికి భోజనానికిరమ్మంటే నావెయివరహాలూ యేమిచేసినా వంటాడు; నేను భోజనసమయమయ్యా అంటే, తాను నాసొమ్మంటాడు; అన్నం చల్లారిపోయిందంటే, నీచేతి కిచ్చినధనం తెమ్మంటాడు; అతనికి డబ్బుపిచ్చయెత్తింది. అమ్మగారు కనిపెట్టుకొని వున్నారయ్యా అంటే, నేనేఅమ్మగారినీ యెరగను నీఅమ్మగారిని తీసుకువెళ్ళి తగలబెట్టి రమ్మన్నాడు.

సుభ—ఎవ రన్నారు?

పెద్దల—యెవరా? నాయజమానుడున్ను నీబావగారున్ను

అయిన వసంతకుఁడుగారు, నేను యిల్లూయెరగను పెళ్ళాన్నీ యెరగను యేమియెరగను పొమ్మన్నాఁడు. నేను నోటితో మీావర్తమానం తీసుకుని వెళ్ళితలతో కావలసినన్ని దెబ్బలు మీాకు ప్రత్యుత్తరంతీసుకుని వచ్చినాను.

సీత—నిర్భాగ్యుఁడా! నీవు మళ్ళీవెళ్ళి నీయజమానుణ్ని యింటికి తీసుకుని రా.

పెద్దల—మళ్ళీవెళ్ళి మళ్ళీ దెబ్బలు తిని రావడానికా? యిక నేను వెళ్లను. యీాసారి మరివకరిని పంపు.

సీత—మాటుమాటాడకుండా వెళ్ళు వెళ్ళకపోతే నీతల బద్దలుకొడతాను.

పెద్దల—యివేళ మీాయిద్దరిమధ్యనూ నాతలకాస్తా పగిలి పోతుంది. పగలకుండా వుండడానకి దేవుడు నాకు యినపతలనయినా పెట్టినాడు కాడు.

సీత—అట్టేవాగక వెళ్ళిపో నీయజమానుణ్ని వేగిరం తీసుకురా.

పెద్దల—వెళ్ళితీసుకురమ్మని యిక్కడ నీవు తన్నుతావు; వెళ్ళి యీామాటలు చెపితే అతడు అక్కడ తన్నుతాడు. మీాయిద్దరి మధ్యనూ నాకు చావు వాొసింది. యీామాటు నేను చావకుండా బొతికివస్తే నావంటిమీాఁద చర్మంవుండదు. (అని వెళ్ళుచున్నాఁడు.)

సుభ—ఛీ! వూరుకో నీముగంచూస్తే నీవు బొత్తిగా ధైర్యము లేనిదానివలె కనపడుతూవున్నావు.

సీత—నేను యింట్లో ఆయనకోసం కనిపెట్టుకొని వుండి చూడుతూవుండగా, మరి యెవత్తో ఆయనదావున చేరి సంతోషిస్తూ వుంటే నే నెట్లా సహించి వూరుకోగలను? నాముగంకాంతి తరిగి

వాడబారినట్టు కనపడుతూవుంటే దాని కతఁడే కారణము. నా ముగం నిజంగా సౌందర్యం చెడి చిన్నపోయివుంటే; అతడు మళ్ళీ వచ్చి వక్కసారి చల్లనిచూపు చూడడంతోటే నాసుఖం యధాప్రకారంగా అవుతుంది.

సుభ—నీవు లేనిపోనిఅనుమానం వకటి మనసులో పెట్టుకొని వృధాగా ఖేదపడుతూ వున్నావు. నీఅనుమానం వదిలిపెట్టు.

సీత—మానాభిమానాలు లేనివాళ్ళు యిటువంటిసంగతులు లక్ష్యంచెయ్యక వూరకుండగలరుగాని నేనెలాగు వోర్చివుండగలను? నేనెఱుఁగుదును; ఆయనదృష్టి నిశ్చయముగా మరియెవ్వతెమీదనో పారింది. లేకుంటే, యింతసేపాయన యింటికి రాకుండా యెందుకు వుంటారు? నాకోసం చేయిస్తూవున్న చంద్రహారం యీదినం తీసుకు రాకుండా రానని నాతో చెప్పివెళ్ళినారు. ఆయన నందుచేతనే యింటికి రాకుండావున్నా రనుకుందా మంటే, నేను వర్తమానం పంపించి నప్పుడు తనకు భార్యా అక్కరలేదని యెందుకు కోపపడుతారు? యిప్పుడు నాసౌందర్యం ఆయనకు హృదయరంజకముగా లేనందున, యీప్రకారంగా నేను దుఃఖపస్తూనే ప్రాణం విడుస్తాను. (అని యేడ్చుచున్నది.)

సుభ—నీవంటి తెలివిమాలినవాళ్ళెవరూ లేనిదే వట్టిజారత్వ శంక పెట్టుకొని తిన్నగా సుఖంపలేక తీరి కూర్చుండి యేదో మనో వ్యధ బెట్టుకొని కృశిస్తూవుంటారు. వారు చెప్పినమాటలు నిజమో అబద్ధమో కనుక్కొని నీముఖున్ని వెంటఁబెట్టుకొని వస్తాము రా.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు)

---

## ద్వితీయరంగము—సత్రపువీధి



[చిన్నవసంతుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చిన్నవసం—(తనలో) నేను లక్ష్మణుని చేతికిచ్చినసొమ్ము జాగ్రత్తగా నున్నదనియు, వాఁడిదివఱకే సత్రమువద్ద నేకనిపెట్టుకొనియుండి యిప్పుడే నాకోసర మావలకు వెళ్ళినాఁడనియు, సత్రాధికారి చెప్పుచున్నాఁడు. ఇతఁడు చెప్పినమాటలను బట్టిచూడఁగా మొట్టమొదట నేను సొమ్మిచ్చి పంపినతరువాత లక్ష్మణుఁడు నాతో మాటాడనట్టే కనఁబడుచున్నది. అదుగో లక్ష్మణుఁడును వచ్చుచున్నాఁడు.

[చిన్న లక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ఏమి? ఇప్పుడు నీ వెనుకటిధోరణి యేమయిన మానితివా? ఇంకను అలాగుననే యున్నావా? నీకు దెబ్బలు కావలసియున్న పక్షమున, నాతో మరల పరియాచకము లాడుము. నీవు సత్రము యెఱుఁగవు కావా? నీచేతికి నేను సొమ్మేమియియ్యలేదు; నన్నింటికి భోజనమునకు పిలుచుకొని రమ్మని నిన్ను మీయమ్మగారు పంపినారు; నా యిల్లు మంగళవారపు పేటలో నున్నది. ఇంత మతిలేకుండ నాతో మాటాడుటకయి నీకేమయిన మతిభ్రమ కలిగినదా యేమి?

చిన్నల—నా వెనుకటిధోరణి యేమిటి? ఆప్రకారంగా మీతో నేనెప్పుడు మాట్లాడినాను?

చిన్నవస—ఇంతకుముందే — ఇంకను గడియయైనను కాలేదు.

చిన్నల—మీరుసొమ్మిచ్చి నన్ను సత్రమువద్దకు పంపినది మొదలుకొని మళ్ళీ నేను మీ మొగమయినా చూడలేదు.

చిన్నవసం—ఓరి దుర్మార్గుఁడా! నేను నీచేతికి సొమ్మేయియ్య లేదన్నావు; ఎవరో అమ్మగారనియు భోజనమనియు చెప్ప మొదలు పెట్టినావు. నాకు కోపము తెప్పించినందుకు ఫలము నీకనుభవ మయినదా?

చిన్నల—మీకు యీలాగు పరమానందం యెత్తుకొన్నందుకు నాకు బహుసంతోషంగా వున్నది. ఈహాస్యాని కర్థమేమో నాకు తెలిసిందికాదు. దయచేసి విప్పిచెప్పండి.

చిన్నవసం—నన్నింకను మరల నగతాళి చేయుచునేయున్నావా? మీదిమిక్కిలి నేనే నీతో హాస్యమాడుచున్నానని యెదురు నామీదనే నేరము వేసెదవా? అర్థమిదిగో విప్పి చెప్పెదను పట్టు.

(అని కొట్టుచున్నాఁడు.)

చిన్నల—దైవంతోడు, వూరుకోండి. మీహాస్యంఅంతకంతకు ముదురుపాకంలో పడుతూవున్నది. నేనేమి నేరంచేసినానని నన్ను మీరీప్రకారంగా కొట్టినారు?

చిన్నవసం—కొంచెము చనువిచ్చి నీతో నేనప్పుడప్పుడు వేళాకోళాములాడుచు వచ్చుచున్నానని నన్నులోకువచేసి సమయముగుర్తెఱుఁగకుండ నెక్కడచూచిననక్కడ నేనాతో పరిహాసములకు మొదలుపెట్టి నన్ను బొత్తిగా తెలివితక్కువ వానిక్రింద కట్టివేసినావు. ఏపని చేసినను సమయమెఱిఁగి మఱిచేయవలెను. ప్రతికార్యమునకును యుక్తసమయ మొకటి యుండును. ఆసమయ మెఱుఁగక అసమయములో చేసినపని యేదియు రాణించదు. నీవిఁకముందు నాతో నెప్పుడయిన హాస్యమాడ తలఁచుకొన్నపక్షమున, నామనను కనిపెట్టి మఱి హాస్యము చేయుము. లేకున్న నీనెత్తి వాఁచుఁగొట్టి నీవు సమయజ్ఞత నేర్చుకొనునట్లు చేసెదను.

చిన్నల—ముందలాగే చేస్తునుగాని యిప్పుడు నన్నెందుకు కొట్టినారో చెప్పండి.

చిన్నవ—ఎందుకా? మొట్టమొదట సమయము తెలియకుండ హాస్యమాడి రెండవసారి యిప్పుడు మరల పరిహాసకము మాడుచున్నందుకు—అదుగో దూరమునుండి మనలను చేసైగచేసి అపిలుచుచున్నవా రెవరు?

[సీతయు, సుభద్రయు ప్రవేశించుచున్నారు.]

సీత—ఓప్రాణనాయకా! ఇది యేమిపాపము! ఎన్నడూ చూడనివానివలె వింతపడి నా మొగముకేసి ఆలాగున బెదరి బెదరి చూస్తూవున్నావు! ఎవ్వరో మరవక పుణ్యాత్మురాలు నీకడకంటా తానికి పాత్రురాలయింది కాబోలును. నేనిప్పుడు సీతనూగాను నీభార్యనూగాను! నా మాటలే నీచెవుల సంగీతంకంటెనూ మధురంగా వున్నవనీ, నాచూపులే అమృతప్రవాహమును వెదచల్లుతూ వున్నవనీ, నాహస్తస్పర్శయే మలయమారుతంకంటెనూ చల్లగా వున్నదనీ, నేను చేసినపాకమే అమృతోపమానంగా వుండి జిహ్వాలేచివచ్చుననీ, చెప్పినకాలం వెళ్ళిపోయింది. అటువంటిస్థితి అంతా మారిపోయి యింతలోకే నన్ను నీవే మరచిపోవడం యేలాగు తటస్థించినది? ఓప్రాణనాథా! నన్నువిడనాడి దుఃఖపెట్టబోకు. నామీందిమునుపటిమోహ మంతా యేగంగలో కలిసింది? చేసుకొన్నయిల్లాలిని కాదని అన్యమోహనాంగిమీద నీవలపు నిలుపడానికి నీకేలాగు మనస్సు వచ్చినది! నేనే నిన్ను కాదని కొంచెం పయిజాడలో ప్రవేశించినట్టు నీచెవిని బడినపక్షమున నీమనస్సు కెంతనొప్పికలుగుతుంది? నీకు సమర్పణ చేసియున్న యీదేహాన్ని కాను దేవుడిమన్నోధచేత పరపురుషసంపర్కానికి పక్కమాటు లోబరచినపక్షమున, నీవు నా

మొగంమీద వుమ్మివేసి, నన్ను కాలితోతన్ని, నావీపుచర్మం వలిచి వేయవా! భార్యవిషయంలో ద్రోహం తలవక నీవూ నిర్దోషివిగా వుండి నన్నూ దుఃఖాలపాలు చేయక రక్షింపుము.

చిన్నవసం—ఓసుందరీ! నీవింతసేపటినుండియు మాటాడు చున్నది నాతోనా? మఱియొకరితోనా? నీవెవరవూ నే నెఱుఁగను. ఈ కాంచీపురమునకు నేను క్రొత్తవాడను. నే నీగ్రామమునకు వచ్చి తిన్నగా జాముసేపయినను కాలేదు. నీప్రసంగమును వాలకమును నాకు వింతగా నున్నవి! ఇంతసేపును నీవు మాటాడినమాటలలో నొక్క ముక్కయినను నాకర్థము కాలేదు.

సుభ—బావా! వూరుకో నీకిప్పుడీప్రపంచ మంతా మారి పోయినది! మాఅప్పగారిని యీవిధంగా బాధపెట్టడానికి నీ వెప్పుడు నేర్చుకొన్నావు? భోజనానికి నిన్నింటికి తీసుకురమ్మని యీమె లక్ష్మణుని నీవద్దకు పంపినది కాదా?

చిన్నవసం—లక్ష్మణునా?

చిన్నల—నన్నా?

సీత—అవును నిన్నే నీవు మళ్ళీవచ్చి నిన్నతఁడు కొట్టినాడనీ యిల్లు లేదన్నాడనీ భార్యలేదన్నాడనీ నాతో చెప్పినావు.

చిన్నవసం—ఈసుందరితో నీవు మాట్లాడినావా? మీ కప్పుడు జరిగినసంభాషణ యెందువిషయము?

చిన్నల— నేనా? నేనా? ఇప్పుడు తప్ప యిదివఱ కెన్న డున్నా నేను యీబిడమొగ మయినా చూడలేదు.

చిన్నవ—ఓరి దుర్మార్గుఁడా! నీవబద్ధ మాడుచున్నావు. ఇందాఁక నంగడివీధిలో సరిగా నిప్పుడీమె చెప్పినమాటలే నీవు నాతో చెప్పినావు.

చిన్నల—నేను జన్మం యెత్తినతరువాత యెవ్వడున్నూ యీమెతో మాట్లాడలేదు.

చన్నవ—ఈబిడ కేమో దేవతావేశ ముండిననేకాని యీమె మనలను పేరులుపెట్టి యేలాగున పిలువఁగలిగినది?

సీత—యజమానుడున్నూ సేవకుడున్నూ యేకమయి యేదో మాయవేషం వన్నుకొని ఆడదాన్ని నన్ను నిష్కారణంగా యేడిపించడం మీకున్యాయంకాదు. ఓప్రాణనాయకా! నీవు కల్పవృక్షము వంటివాడవు. నేను నీసమీపమున నాటిన మల్లికాలతవంటిదానను. నీమీద అల్లుకోవడానికి నాకువక్కతెకే క్రమమైనస్వతంత్రంవున్నది. నేను నిన్నుచుట్టుకొని వున్నప్పుడే నీకు శోభ యెక్కువగా వుంటుంది. కల్పవృక్షా న్నంటుకొని మఱి యేదైనా పెరిగితే అది బదనికగాని మఱివకటికాదు. అది వున్నట్టేవుండి క్రమక్రమముగా తా నాశ్రయించి వున్నదాన్నే నిస్సారంచేసి నాశనం చేస్తుంది. కాఁబట్టి అటువంటిది వుట్టడంతోటే మొదలంటా తీసివెయ్యవలెను.

చిన్నవ—ఈమె నాతోనే మాటాడుచున్నదా! ఈచెప్పేదిడంతయు నావిషయమేనా? నేనీమెను స్వప్నములో వివాహమాడినానా యేమిటి? లేక నేనిప్పుడు నిద్రపోవుచుండి యీమె, చెప్పేడు మాటలు వినుచున్నానా? స న్నేభూత మావహించినదోకాని నా కన్నులను చెవులనుగూడ మోసము చేయుచున్నది! ప్రత్యక్షముగా జరుగుచున్న యీయింద్రజాల మేమో తెలిసికొనువఱకును నే నీమె మాటకు మాటాడక లోఁబడి యూరకుండెదను.

సుభ—లక్ష్మణా! నీవువెళ్ళి వేగిరం వడ్డనచేసి యింటికాడ సిద్ధంగా వుందు మని చెప్పు.

చిన్నల—భూతభయం లేకుండా వుండడానికి నేను చిన్నప్పుడు

నేర్చుకున్నమంత్రం జపం చేసుకుంటాను. ఇది తప్పకుండా దయ్యాల దేశము. మేము దయ్యాలతోనూ, భూతాలతోనూ, పిశాచాల తోనూ, కామినీలతోనూ మాట్లాడుతూ వున్నాముగాని మనుష్యులతో మాటాడడం లేదు. మే మీరాకాసులు చెప్పినట్టు వినకపోతే మమ్మల్ని పీడించి పీక్కుతింటవి.

సుభ—నీలో నీ వేమో ప్రేలుకుంటూ నేను చెప్పినదానికి బదులు చెప్పవేమి? ఓదుంగా? మొద్దా! శిలా! నిన్నే మాటాడు.

చిన్నల—వీళ్ళు మంత్రశక్తిచేత నన్నేదో మగివకజంతువుగా మార్చివేసినారు. స్వామీ! నేనిప్పుడు నీకు లక్ష్మణున్నిగానే కను పడుతూవున్నానా?

చిన్నవస—నీవు నీలాగున నేవున్నావు. నేనును నాలాగున నే యున్నా ననుకొని యెదను.

చిన్నల—మనమిద్దరమూ మనస్సులోనూ రూపములోనూ కూడా మారిపోయినాము స్వామీ!

చిన్నవసం—నీరూపము యథాప్రకారముగానే యున్నది.

చిన్నల—లేదు. వీళ్ళు నన్నిప్పుడు కోతినిచేసిఆడిస్తూవున్నారు.

చిన్నవస—నీవేజంతువుగానైనా మారినపక్షమున నీవు గాడిదవుగా మారినావుగాని మఱియొక జంతువుగా మారలేదు.

చిన్నల—అవును. వీళ్ళు నాచేత గడ్డితినిపించి నామీద యెక్కి సవారిచేస్తూవున్నారు. నేను గాడిదనేకాకపోతే వాళ్ళునన్ను యెరిగివున్నట్టే వాళ్ళను నేనున్ను యెరిగివుందును.

సీత—(చిన్నవసంతకుని చేయిపట్టుకొని) రండిరండి. యజమానుడున్నూ భృత్యుడున్నూ చేరి నన్ను వేళాకోళం చేస్తూవుంటే కంట్లోవేలుపెట్టుకొని యేడుస్తూ చూస్తూ వూరకుండడానికి నేను

పెట్టిదాన్నికాను. భోజనానికి దయచెయ్యండి. (అని లాగుచున్నది) లక్ష్మణా! నీవు గుమ్మముదగ్గరవుండి నేనున్ను నాప్రాణనాథుడున్ను లోపల భోజనంచేస్తూవున్న కాలంలో యెవరినీ లోపలికిరానియ్యకు. నాభర్తగారికోసం యెవరైనావచ్చి నిన్ను తలుపుతియ్యమంటే, లోపల భోజనంచేస్తూవున్నారు తలుపు తియ్యడానికి వల్లకాదని చెప్పి పంపివెయ్యి. యెవరికయినా తలుపుతీస్తే నీతలకాయ బద్దలుకొడు తాను.

చిన్నల—వసంతిక! నేను గుమ్మంకాడ కావలివుండనా?

సీత—ఎవరినైనాలోపలికి రానిచ్చినావంటే తప్పకుండా నీ తల పగలకొడుతాను.

సుభ—వసంతిక! వేగిరం నడువు. ఇప్పటికే భోజనానికి చాలా ఆలస్యం అయింది. (అని యందఱును వెళ్ళుచున్నారు)

---

## తృతీయాంకము

### ప్రథమరంగము—వసంతుని గృహము ముందు

[పెద్దవసంతకుడును, పెద్దలక్ష్మణుడును, విశ్వకర్మయును స్వర్ణకారుడును, కాంచనగుప్తుడను వర్తకుడును ప్రవేశించుచున్నారు]

పెద్దవసం—విశ్వకర్మా! నన్నిప్పుడువదిలిపెట్టవలెను. నేనింటి కాలస్యంగా వెళ్ళినప్పుడు నాభార్య మిక్కిలి కోటికోటలాడుచుండును. చంద్రహార మీపూట సిద్ధమగునేమోయని యింతసేపటి వఱకును మీయింట్లో నున్నాననియు, సాయంకాల మదిమెఱుగు పెట్టి తీసికొనివచ్చెదననియు నాభార్యతో చెప్పు—ఇక్కడ వీడొకడున్నాడు. వీడంగడివీధిలో నన్ను కలిసికొన్నాడట! నేను తన్ను

కొట్టినానట! తనచేతికేమో వేయివరాలనిచ్చినా నన్నాడట!—ఓరి తాగుబోతా! నీ మాటలకర్థమేమి?

పెద్దల—మీరు మీమనసువచ్చినట్లు చెప్పండి. నే నెఱిగిందేమో నే నెఱుగుదును. నన్ను మీరు తప్పకుండా కొట్టినారు.

పెద్దవసం—నీవు గాడిదవుగా కనపడుచున్నావు.

పెద్దల—మీచేత దెబ్బలుతిని వూరుకోవడంవల్ల నే నాలాగే కనపడుతూవున్నాను. గాడిద నైతే నేను మిమ్మల్ని తన్నవలసినది; అట్లా చేసినట్లయితే మీరు జాగ్రతగా వుందురు.

పెద్దవసం—తలుపు వేసియున్నది. మనలను లోపలికి రానిమ్మని పిలువు.

పెద్దల—ఓమాలీ! ఓడామోదారా! ఓరి రామా! ఎవరు లోపల? తలుపు తియ్యండి.

చిన్నల—(లోపలినుండి) యెవడురావాడు తెగ అరుస్తూ వున్నాడు? నీకేమి మతిపోయిందా యేమిటి? వెళ్ళిపో.

పెద్దల—తలుపువద్ద కావలివున్నవాడెవడో. మన ప్రభువుగారు వీధిలో నిలుచున్నారు. వేగరం తలుపుతియ్యి.

చిన్నల—(లోపలినుండి) అతడు యెక్కడనుంచివచ్చాడో మళ్ళీ అక్కడకే నడవమను. వెళ్ళకపోతే నిలుచోలేక అతనికాళ్ళ నొప్పులు పెడతవి.

పెద్దల—ఆలోపల మాట్లాడేవారెవరో తలుపుతియ్యండి.

చిన్నల—(లోపలినుండి) మంచిది. నీవుయెందుకు వచ్చినావో చెప్పితే నేను చెప్పవలసినమాట తరువాత చెవుతాను.

పెద్దవసం—ఎందుకా? భోజనమునకు; నే నీదినమున భోజనము చెయ్యలేదు.

చిన్నల—ఈదినము నీకిక్కడ భోజనందొరకదు. మరి వక రోజురా.

పెద్దవసం—నీవెవఁడవు? నాయింటికి నన్ను రానీకున్నావు?

చిన్నల—ఈవేళకు నేను కావలికాచేవాణ్ని నాపేరు లక్ష్మ ణుఁడు.

పెద్దల—ఓరిదొంగా! నాపనిమాత్రమేకాకుండా నాపేరు కూడా దొంగిలించినావు! యీవేళకు లక్ష్మణుఁడవైతే మఱికొంత సేపటికి నీవు గాడిదవుకూడా అవుతావు.

సుభ—(లోపలినుండి) లక్ష్మణా! గుమ్మముదగ్గిర ఆఅల్ల రేమిటి? కేకలువేసేవారిని పంపివెయ్యి.

పెద్దవసం—ఎవఁడురా? ఎంతపిలిచినను తలుపుతీయకున్నాఁడు

చిన్నల—(లోపలినుండి) ఎంతచెప్పినా పోకుండా గుమ్మం కాడ కేకలువేసేవా రెవరురా?

పెద్దవసం—నేను వసంతకుఁడను. తలుపుతీయుము.

చిన్నల—(లోపలినుండి) వసంతకుఁడు సీతతో లోపల భోజ నము చేయుచున్నాఁడు. నేను తలుపుతియ్యను వెళ్ళిపో.

పెద్దవసం—(తనలో) వసంతకుఁడు సీతతో లోపల భోజనము చేయుచున్నాఁడేమి! నాభార్యతో లోపల మఱియెవ్వఁడో యు న్నాఁడు! (బిగ్గరగా) లక్ష్మణా! గునపము తీసికొనిరా.

పెద్దల—తలుపు బద్దలయ్యేటట్టుగా గట్టిగా గుద్దండి.

పెద్దల—కాదుకాదు గునపము తీసికొనిరా తలుపు బద్దలుకొట్టి లోపలికి వెళ్లుదము.

చిన్నల—(లోపలినుండి) ఏది తలుపు బద్దలుకొట్టు. నేను తలుపు బద్దలుకొట్టినవాడితల బద్దలుకొడుతాను.

శాంత — శాంతము వహించు, అటువంటిపని యెన్నడును చేయఁబోకుము. అట్లు చేయుటచేత నీవెరవ్వఁబడి యింతవఱకును నీభార్య విషయమయి మంచియభిప్రాయముగలజనులకందఱికిని సందేహము కలిగించినవాఁడ వగుదువు. నీవేమియు ననుమానపడఁబోకు, నీభార్య మిక్కిలి బుద్ధిమంతురాలనియు, గుణవంతురాలనియు, మహాపతివ్రత యనియు, చిరకాలానుభవమువలన నీకు తెలిసియేయున్నది. ఇప్పుడు తలుపు తీయకపోవుటకును కారణమేమో ఆవల నీకామెల్లగా విన్నవము చేయును. నామాట విని శాంత మవలంబించు మనమందరమును గలిసి యీపూట ప్రభావతిగారియింట భోజనము చేయుదము రండి. సాయంకాలము నీవొంటరిగావచ్చి తలుపుతీయ నందుకు కారణమడిగి తెలిసికొందువుగానిలే. ఇప్పుడు నీవు బలవంతముగా తలుపు బద్దలుకొట్టి లోపలికి వెళ్ళినపక్షమున జనులు దాని కనేకార్థములు చేయుదురు; అందుచేత నీవు పోయిన తరువాతకూడ అపకీర్తి శాశ్వతముగా నుండిపోవును.

పెద్దవసం — నీవింతగా చెప్పుచున్నావుగనుక నీమాట విని మరలెదను. ప్రభావతి మిక్కిలి యోగ్యురాలు; బహు చమత్కారముగా సంభాషించును; భోజనమునకు వెళ్ళినవారిని మిక్కిలి ఆదరణ చేయును. అవును మన మక్కడకు భోజనమునకు వెళ్ళుదము. — విశ్వకర్మా! ఈనాటికి చంద్రహారము సిద్ధమయి యుండవచ్చును; నీ వింటికివెళ్ళి వేగిరము నావద్దకు తీసికొనిరా. నాభార్య యీప్రకారముగా నవమానపరిచినదిగనుక దానిని వంచనచేయుటకయి యీచంద్రహారమును దూరకేమైనను ప్రభావతికిచ్చెదను. వేగిరము వెళ్లు.

విశ్వ—నాలుగు గడియలలోపల చంద్రహారమును తీసికొని వచ్చి మిమ్ము కలిసికొనెదను.

పెద్దవసం—అలాగున చేయుము. నన్ని ప్రకారముగా పరిభవించినందుకు ధననష్టమున కయిన నొప్పుకొనియెదను.

(అందఱును వెళ్లుచున్నారు.)

---

ద్వితీయరంగము. గృహాంగణ ఫలి వీధివాకిలి.

[సుభద్రయు చిన్నవసంతకుఁడును ప్రవేశించుచున్నారు.]

సుభ—వసంతకా! నీవీప్రకారముగా పెనిమిటి కుండవలసిన ధర్మమును మఱచిపోవచ్చునా! నాఅప్పగారిని ధనం నిమిత్తమే పెండ్లాడిన పక్షమున, ఆధనమునిమిత్తమయినా తిన్నగాచూడు. నీ ప్రేమ మరివకచోట వున్నపక్షమున, ఆపని దొంగతనంగా చెయ్యి. నీలోపల వున్నఅభిప్రాయం పయికి తెలియనియ్యక మనసులో నయినా దాచుకో. చల్లని మాపుచూచి, తియ్యగా మాట్లాడి, నీకృత్రిమము కనపడకుండా నైనా వుంచు. నీ మనసులో యేదోషంవున్నా పయికయినా వేషం బాగావెయ్యి. చాటున నీయిష్టంవచ్చినట్లుచేసినా అది పయికి కనపర్చవలసిన అవసరం యేమున్నది? లోపల ద్రోహం చెయ్యడమేకాకుండా పయికికూడా అప్రియంగా మాట్లాడుతూవుంటే, నీవు రెండుదోషాలు చేసినవాడవవుతావు. దుశ్చేష్టలుపరుషవాక్యములవల్ల రెట్టింపుగా బాధపెడతవి. అయ్యో! మా అప్పస్థితి చూస్తే నాకెంతో విచారంగా వున్నది! ఆడవాళ్ళముగనుక మేము యేమాటచెపితే ఆమాటలే నమ్ముతాము; మమ్మల్ని మాటలచేతనైనా సంతోషపెట్టి నిజంగా మామీఁద ప్రేమవున్నట్టయినా నటించరాదా? ఎలాగయినా లోపలికివచ్చి మాఅప్పగారికి ధైర్యంచెప్పి

నోడార్చి భార్యవని పిలువు. నీ మంచిమాటలవల్ల ఒకరిదుఃఖం పో గొట్టఁ గలిగినప్పుడు మనసులో లేనిది కొంచెంచెప్పడం పాపంకాదు.

చిన్నవసం—ఓ ప్రియురాలా! నాపేరు నీవెఱఁగినను నీపేరు నే నెఱుఁగను గనుక నిన్నాలాగున పిలిచినందుకు క్షమించు. మాయలును వేషములు నుపదేశించుటకు నీవు మహోపాధ్యాయురాలవుగాఁ గనఁబడుచున్నావు! మనసులో నొకటి యుంచుకొని పయి కొకటి మాటాడుమని నాకు నేర్పుచున్నావా? సత్యమునే పలుకుట కల వాటుపడిన నా నిర్మలమయిన మనస్సును సత్యమునుండి మళ్ళించుట కయి యేలవృథా శ్రమపడియెదవు? నీవు దేవుఁడయి నామనస్సును క్రొత్తగా సృష్టించఁగలశక్తి నీకు వచ్చినట్టయితే, అప్పుడు నా మతి మాఱునేమో గాని యిప్పుడు న్యాయమార్గమునుండి అవగింజంతయు మళ్ళదు. ఇప్పుడు నేనున్నప్రకారముగా నీ యప్పగారెంత కన్నుల వెంబడిని నీరు గార్చినను నాభార్య కాదనియు, ఆమెను నే నెప్పుడును వివాహము చేసికొలేదనియు నేను దృఢముగా నెఱుఁగుదును. నా ప్రియురాలా! నీ యప్పగారి కన్నీటిసముద్రములో నన్ను ముంచి వేయుటకు ప్రయత్నింపకు. నీ వొకవేళ నిన్ను వరించుమని కోరిన యెడల నే నొప్పుకొందును. నీ ముంగురులను ఉరిత్రాళ్ళతో నన్ను కట్టివేయుము, నే నిప్పుడు నిన్ను భార్యగా పరిగ్రహించి నీకుబద్ధుఁడ నయి యుండెదను.

సుభ—నీకు పిచ్చియెత్తిందాయేమిటి? ఆలాగున మాట్లాడుతూ వున్నావు!

చిన్నవసం—నాకు పిచ్చియెత్తలేదుగాని కొంతవఱకు మతి భ్రమించినది. ఎందుచేతనో మాత్రము నేను చెప్పలేను.

సుభ—ఆమతిభ్రమ నీదృష్టిదోషంవల్ల నే సంభవించినది.

చిన్నవసం—అదృష్టిదోషము నీ చేరువనుండి సూర్యకాంతి వలె మిఱుమిట్లుగొలుపునీరూపమును జూచుటవలన నేసంభవించినది.

సుభ—నీవు నాకేసిచూడక యెవరికేసిచూడవలెనో వారికేసి చూడు. నీదృష్టిదోషం నిమిషంలో పోతుంది.

చిన్నవసం—ప్రియురాలా! చీఁకటివంక చూచుటకంటె కన్నులు మూసికొనుట యుత్తమము.

సుభ—'ప్రియురాలా!' అని నన్నెందుకు పిలుస్తావు! ఆ పేరుతో నా అక్కగారిని పిలువు.

చిన్నవసం—నీయక్క కేవలము సోదరియే.

సుభ—నాకు సోదరియే.

చిన్నవసం—కాదు నాకును. నీవే నాకు ప్రియురాలవు. నీవే నా ప్రాణమునకు ప్రాణమవు.

సుభ—ఇదంతా నాసోదరివిషయంలో వుండవలెను. ఇది వఱకు లేకపోయినా అలావుండవలెను.

చిన్నవసం—నాప్రియురాలా! నీవే నాప్రియురాలవని చెప్పాను. నేను నీవాఁడను; నాప్రేమ నీమీఁదనున్నది. నా జీవితకాలమును నీతోఁ గడపెదను. ఇంకను నీకును వివాహము కాలేదు. నాకును వివాహము కాలేదు. నన్ను పాణిగ్రహణము చేసికొమ్ము.

సుభ—ఈపాటి యీమాటలుచాలించు. మాఅక్కనునీవద్దకు తీసుకువస్తాను. ఆమెతో మంచిమాటలాడి ఆమెనుసమాధానపఱుచు.

(అని వెళ్ళుచున్నది)

[లోపలినుండి చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

చిన్నవసం—అదేమిలక్ష్మణా! అంతవేగముగా పరుగెత్తుకొని వచ్చుచున్నావు!

చిన్నలక్ష్మ—మీరు నన్నెరుగుదురా! నేను లక్ష్మణున్నా! నేను మీ సేవకుణ్ణా! నేను నేనా!

చిన్నవసం—నీవులక్ష్మణుఁడవే. నీవు నాసేవకుఁడవే. నీవునీవే.

చిన్నల—నేనుగాడిదను; నేనుఆడదాని దాసుణ్ణి నేను నేనుకాను.

చిన్నవసం—ఆడుదాని దాసుఁడ వెట్లయినావు! నీవు నీవు కాకపోవుటయేమి!

చిన్నల—దేముడితోడు. నేను నేనుకాను. నేనొక స్త్రీ వాణ్ణి—ఎవర్తో నామీఁద పడుతుంది; నాదగ్గరకు వస్తుంది; నన్ను తనవాణ్ణంటుంది.

చిన్నవసం—నీ వేలాగున తనవాఁడవన్నది!

చిన్నల—నన్ను మృగంక్రింద కట్టివేసి నన్ను తనవాణ్ణిగా చేసుకొన్నది. నేను పశువునని నాఅభిప్రాయంకాదు; అదిశుద్ధపశువు గనుక దానికి మొగుణ్ణయితే నేను పశువును కాకపోతానా!

చిన్నవసం—అది యెటువంటిది!

చిన్నల—బహు పెద్దమనిషి. పగలుచూస్తే రాత్రి కలలోకి వస్తుంది, అది కట్టుకున్న బట్టలు బండెడు కర్రలుపెట్టి తగలబెట్టినా తగులడవు. దాని వంటినున్న చమురుతో యీవూరంతా అయిదు రోజులు దీపాలు వెలిగించుకోవచ్చును.

చిన్నవసం—అది బహు యోగ్యురాలా!

చిన్నల—పెద్దమనిషిఅంటే నాఅభిప్రాయం అదికాదు. అది పొడుగెంతో వెడల్పు అంతేవున్నది. అది భూదేవివలె గుండ్రంగా వున్నది. దానిపేరు గారట!

చిన్నవసం—అదియే భూదేవి యయిన పక్షమున పర్వతము లెక్కడనున్నవి!

చిన్నల—పిరుదులే పెద్దపర్వతాలు.

చిన్నవసం—మరి సముద్రములేవి ?

చిన్నల—కళ్ళూ చెవులూ మహాసముద్రాలు.

చిన్నవసం—నదులేవి ?

చిన్నల—రోమకూపాలలోనుంచి వచ్చే చెమట వెయ్యినదుల పెట్టుగా వున్నది.

చిన్నవసం—అడవులేవి ?

చిన్నల—తలంతా యీతదుప్పలాగువుండి మహారణ్యంగా కనపడుతుంది. ఆగ్రామదేవత, అనూకాలమ్మ, ఆరాక్షసి నన్ను తన మొగుడంటుంది; నాపేరుపెట్టి పిలుస్తుంది; నన్ను కౌగలించుకోవచ్చే టప్పటికిభూతమని జడిసి తప్పించుకొని పారిపోయివచ్చి యివతలఁబడి ప్రాణాలు దక్కించుకున్నాను.

చిన్నవసం—ఇఁక మన మిక్కడ నుండఁగూడదు. తత్క్షణము వెళ్ళి యెంత కేవునకయినను సరే యొకబండిని కుదుర్చుకొనిరా. మన కెంత చచ్చుయెడ్లబండి దొరకినను, ఈ రాత్రి మన మీ గ్రామములో నిద్రచేయఁగూడదు. నీవు మరల వచ్చినదాఁక నేనంగడివీధిలో తిరుగు చుండెదను. వేగిరమువచ్చి నన్ను కలిసికో. ఈ గ్రామములోని వా రందఱును మనల నెఱిఁగియు మన మొక్కరినిఎఱుఁగకయున్నప్పుడు మన మతిశీఘ్రముగా మూటయుముల్లెయుకట్టుకొని లేచిపోవలసినదే.

చిన్నః—పెళ్ళామనని నన్నుపట్టుకొన్న బ్రహ్మరాక్షసి చేతులోనుంచి తప్పించుకోవడం కలిగితే పెద్దపులినోట్లోనుంచి తప్పిం చుకొన్న లేడిలాగు పరుగెత్తుతాను. (అని వెళ్లుచున్నాఁడు.)

చిన్నవసః—(తనలో) ఈపట్టణములో దయ్యాలపోతులుతప్ప మఱి యెవ్వరును కాపుర ముండరు. కాఁబట్టి యీయూరు విడిచి నే

నెంతవేగిరము వెళ్ళిన నంతమంచిది. నన్ను మగఁడని పిలిచిన దాని పేరు దలఁచుకొన్న నాదేహము కంప మెత్తుచున్నది. అయినను సౌందర్యరాశి యైనయామె చెల్లెలుమాత్రము తన మృదుమధుర వాక్యములచేతను విలాసముచేతను హావభావాదులచేతను నామన స్సును తనవశము చేసికొన్నది.

[చంద్రహారముతో విశ్వకర్మ ప్రవేశించు చున్నాఁడు.]

విశ్వ—వసంతకా!

చిన్నవ—అవును నాపేరు వసంతకుఁడే.

విశ్వ—ఆసంగతి నాకు బాగా తెలుసును. ఇదుగో మీరు తెమ్మన్న చంద్రహారము. మెఱుగుపెట్టడం వేగిరం కాకపోవడంచేత యింతసేపాలస్య మయింది.

చిన్నవ—నీయిష్ట మేమి? నేనిది యేమి చెయ్యను?

విశ్వ—మీకోసం చేసినాను మీయిష్టం వచ్చినట్టు చేసు కోండి.

చిన్నవ—నాకోసరమే చేసినావా? నే నెప్పుడును చేయుమన లేదే.

విశ్వ—ఒకమాటు కాదు; రెండుమాట్లు కాదు; యిరవై మాట్లు చెప్పినారు. ఇది మీయింటికి వేగిరం పట్టుకొనివెళ్ళి మీ భార్యను సంతోషపెట్టండి. నేను సాయంకాలం భోజనంవేళకు మీ యింటికి వచ్చి దీనిసొమ్ము పట్టుకువెళుతాను.

చిన్నవ—కొంచెము నేపుండి సొమ్మిప్పుడే పుచ్చుకో లేక పోయినపక్షమున నీకు చంద్రహారమును నేనునుకూడ మరల కన పడము.

విశ్వ—(చిఱునవ్వు నవ్వి) నాసొమ్మెక్కడికీ పోదు. మీరు మహాచిత్రమయినమనుష్యులు. నేనిప్పుడు వెళ్ళిపోతాను.

(అని వెళ్ళుచున్నాఁడు.)

చిన్నవ—(తనలో) నాకీమాయయేమో తెలియకుండ నున్నది. ఇంత మంచిచంద్రహారము నూరక యిచ్చెదనన్నప్పు డెంత తెలివితక్కువవాఁడును తన కక్కఱలే దనఁడు. ఈప్రకారముగా వీధులలో బంగారుగొలుసులు దొరకుచున్నప్పుడు, ఇక్కడ నెవ్వరును కష్టపడనక్కఱలేదు. నేనంగడివీధికి వెళ్ళిలక్ష్మణునికొఱకయి యెదురు చూచుచుండెదను. వాఁడు బండి కుదుర్చుకొని వచ్చినపక్షమున, అక్కడనుండియే వెళ్ళిపోయెదను. (అని వెళ్లుచున్నాఁడు.

---

## చతుర్థాంకము.

ప్రథమరంగము—పురవీధి.

[ఒకవర్తకుఁడును, విశ్వకర్మయు, ఒకరాజపురుషుఁడును ప్రవేశించుచున్నారు.]

వర్త—నేను నీకు సొమ్ము బదులిచ్చి సంవత్సరము దాటి పోయినది. అప్పటినుండియు నేను నిన్నేమియు సొమ్మునిమిత్తమయి తొందరపెట్టలేదు. నేనిప్పు డకస్మాత్తుగా హస్తినాపురమునకు వెళ్ళవలసినపని తటస్థించి యవశ్యముగా సొమ్ము కావలసివచ్చినదిగాని లేనిపక్షమున నేనిప్పుడుసహితము సొమ్మునిమిత్తము నిన్నింత నిర్బంధపెట్టకయేపోదును. కాఁబట్టి వెంటనే సొమ్మిచ్చివేయుము. లేనిపక్షమున, ఈరాజపురుషుఁ డిప్పుడు నిన్నుపట్టుకొని ధర్మస్థానమునకు తీసికొని వెళ్లును.

విశ్వ—నేను నీకు బాకీవున్నంతసొమ్ము నాకు వసంతకుఁడు యివ్వవలసివున్నది. నిన్ను కలుసుకోవడానికి ఒకగడియయుండే నే నతనికి చంద్రహారం యిచ్చినాను. అయిదుగంటలవేళ నాకతఁడు సొమ్ము యిచ్చివేస్తాడు. నన్ననుగ్రహించి ఒక్కపర్యాయము నీవతని యింటిదాకా నాతోకూడా నస్తే నీసొమ్ము నీకిచ్చివేసి నాపత్రంనేను పుచ్చుకుంటాను.

[పెద్దవసంతకుఁడును, పెద్దలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

రాజపుత—మీా రాయునయింటికి వెళ్ళవలసినత్రోవ తప్పి పోయింది. అదుగో వసంతకుఁడే యిలాగు వస్తూవున్నాఁడు.

పెద్దవ—నేను కంసాలియింటికి వెళ్లెదను; ఈలోపుగా నీవంగ డికివెళ్ళి పేకబెత్తమొకటికొని తీసికొనిరా. నన్ను మధ్యాహ్నము లోపలికి రాకుండ తలుపు వేయించినందుకయి నీయజమానురాలిని, తలుపు తీయనందునకయి పరివారమును, శిక్షింపవలెను. అదుగో విశ్వకర్మ వచ్చుచున్నాఁడు. నీవు వేగిరము వెళ్ళి బెత్తము కొని యింటికి పట్టుకొనిరా.

పెద్దల—ఒక్కబెత్తము కాదు; మీాకు కావలిస్తే వెయ్యి బెత్తాలుకొని తీసుకువస్తాను. (అని వెళ్ళుచున్నాడు.)

పెద్దవ—నిన్ను నమ్మికొన్నవాఁడు చక్కఁగా నేబాగుపడును. నేను నీకొఱకును చంద్రహారముకొఱకును నీమాటను నమ్మికొని యెంతోసేపు కాచుకొనియున్నాను. ఎంతసేపు కనిపెట్టుకొనియున్నను నీజాడగాని చంద్రహారముజాడగాని కనపడలేదు. చంద్రహారము వేగిర మిచ్చినపక్షమున నీతో పని యుండదని మొగము చాటువేసి నావా యేమి!

విశ్వ—మీాహాస్య మిప్పుడు మానివెయ్యండి. బంగారం యెంతయెత్తో యేవన్నో, కూలి యెంతో, అంతా వద్దువాౕసి యిదుగో తెచ్చినాను. మీారు యివ్వవలసిన మొత్తమంతా నేనీయన కివ్వవలసినదానికంటె మూడురూపాయలు యెక్కువగా వుంటుంది. ఈయన దూరదేశము వెళ్ళవలసి యీాసొమ్ముకొరకు నిలిచివున్నాఁడు. వేగిరం సొమ్మిచ్చి మమ్మల్ని పంపివెయ్యండి.

పెద్దవ—ఇప్పుడు నేను సొమ్మక్కడకు తీసికొని రాలేదు; అంతేకాక నాకు గ్రామములో కొంచెముపని యున్నది. నీవీయనను మాయింటికి తీసికొనివెళ్ళి, చంద్రహారము నాభార్యచేతికిచ్చి నే నిమ్మన్నానని సొమ్మడిగి పుచ్చుకో. ఒకవేళ నేనును మీారక్కడ నుండఁగానే రావచ్చును.

విశ్వ—అలాగయితే చంద్రహారము మీారే తీసుకు వస్తారా?

పెద్దవ—నేను తీసికొని వెళ్ళను. ఒకవేళ నేను వేగిరం రాకపోదునేమో నీవే తీసుకొని వెళ్ళు.

విశ్వ—మంచిది నేన తీసికొని వెళుతాను. చంద్రహారం యిప్పుడు మీాదగ్గిర వున్నదా?

పెద్దవ—నాదగ్గఱ లేకపోయిన నీదగ్గఱ నున్నది. ఇప్పుడునీవద్ద లేనిపక్షమున సొమ్ము లేకుండ నీవు మరల వచ్చినదారిని వెళ్ళవలసి వచ్చును.

విశ్వ—దయచేసి చంద్రహారం వేగిరం యిప్పించండి. ఈయన సిద్ధంగా ప్రయాణం కట్టుకొనివచ్చినాఁడు. ఆలస్యంచేస్తేముహూర్తం మించిపోతుంది. వేగిరం పంపించవందుకుయీాయననన్ను దూషిస్తారు.

పెద్దవ—సరి! సరి! వ్యవహారము చక్కఁగానే కుదిరినది. అన్నప్రకారముగా చంద్రహారము నీవు తీసికొనిరావందునకయి నేను

కూకలు వేసిపోదు నని తప్పించుకొనుటకై నీవీపన్నుగడ పన్నినావు. నీవు ముందుగానే యచ్చట కారంభించనియెడల, వేళకు తీసుకొని రానందునకు నేను నిన్ను తిట్టుదు ననుకొన్నావా?

వర్త—కాలము వ్యర్థముగాపోవుచున్నది. శీఘ్రముగా నన్ను పంపివేయవలెను.

విశ్వ—అయన నన్నేలాగుతొందర పెడుతున్నారో విన్నారా! చంద్రహారము—

పెద్దవ—కంఠశోష యెందుకు! నాభార్యచేతి కిచ్చి సొమ్ము పుచ్చుకో.

విశ్వ—రండిరండి. ఇంతకుమునుపే మీచేతికి చంద్రహార మిచ్చినానుగదా! ఆచంద్రహారమయినా లేకపోతే మఱివకవస్తువు యేదైనా ఆనవాలిచ్చి పంపండి.

పెద్దవ—ఛీ పో. నీవు నరన మతివిస్తారము చేయుచున్నావు. చంద్రహార మెక్కడ నున్నది! ఏదీ నన్ను చూడనిమ్ము.

విశ్వ—నాకవతల కావలసినంతపనివున్నది. యీప్రకారంగా మీతో పరాచకము లాడుతూ కూర్చోవడానికి నాకు తీరుబడిలేదు. నాకు మీరు సరియైనప్రత్యుత్తరం యిస్తారా యివ్వరా! లేకపోతే మిమ్మల్ని యీరాజపురుషుడికి వప్పగిస్తాను.

పెద్దవ—నీకు నేను ప్రత్యుత్తర మియ్యవలెనుగా! ఏమని ప్రత్యుత్తర మిమ్మన్నావు!

విశ్వ—చంద్రహారంనిమిత్త మీరు నాకివ్వవలసినసొమ్మిచ్చి వెయ్యండి.

పెద్దవ— నీవు చంద్రహారమిచ్చినదాక నీకు నేనుసొమ్మియ్య నక్కఱలేదు,

విశ్వ—గడియసేపటిక్రింద మీకిచ్చివేసినాను.

పెద్దవ—నీవు నాకిచ్చ్యలేదు; నీ వామాటయే మరల మరల ననుచుండుటవలన నా గౌరవమునకు లోపము తెచ్చుచున్నావు.

విశ్వ—లేదనడంవల్ల నాపరపతికే మీరు భంగం కలిగిస్తూవున్నారు. మీమాట నిజమనితోస్తే నా కెక్కడయినా పరపతి వుడుతుందా?

వర్త—ఓయి రాజపురుషా! క్రమప్రకారముగా నీ వీ కం సాలిని పట్టుకో.

రాజ—దొరతనమువారి యుత్తరవుప్రకారముగా నీవు ధర్మస్థానమునకు నడువు. తిరుగుబాటుచేస్తే నీకు శిక్ష అవుతుంది.

విశ్వ—యిందువల్ల నాకు మానభంగంవస్తుంది. నాబదులుగా సొమ్మివ్వడాని కయినా వప్పుకోండి. లేకపోతే నాపరువు పోయే టప్పుడు మీపరువుమాత్రం వుంచుతానా? ధర్మంయిచ్చి మిమ్మల్ని కూడా యీరాజపురుషుడిచేత పట్టుకునేటట్టు చేస్తాను.

పెద్దవ—నాకియ్యని వస్తువునకయి సొమ్మిచ్చుటకు నే నెన్నడయిన నొప్పుకొందునా? ఓ బుద్ధిహీనుఁడా! నీ చేతనైనపక్షమున నన్నుకూడ పట్టుకొనునట్లు చేయుము.

విశ్వ—ఓరాజపురుషా! నీ ధర్మం యిదుగో నా ఫిర్యాదు ప్రకారంగా ఈయనను పట్టుకొని న్యాయస్థానమునకు తీసుకొపరా. ఇంత బహిరంగముగా నన్నవమానపరచినందుకు ఈయన మర్యాద మాత్రము నేను నిలువుతానా!

రాజ—ఇతని అభియోగము మీరు విన్నారా? మీరు కూడ ధర్మస్థానమునకు నడవండి.

పెద్దవ—నేను జామీనిచ్చువఱకును నీకు లోబడియెదను.—

ఓరీ! నీదుకాణములోనున్న బంగారమంతయు ఈవ్యవహారములో పోయి నీకు ముష్టిచెంబు చేతికి వచ్చునులే.

విశ్వ—కానీలే. మీ బెదరింపు చూదాము. ఈపట్నం రాజు యేలుతూవున్నాడుగాని ముండ యేలడం లేదు. వ్యవహారంలో గెలిచి మీవద్ద వడ్డీతో కూడా సొమ్ము పుచ్చుకుంటానుగాని వదిలి పెట్టను.

[చిన్నలక్ష్మయ్య ప్రవేశించుచున్నాడు.]

చిన్నల—మథుర వెళ్ళడానికి బండి సిద్ధంగా వున్నది; నేను మీకోసం మంచిబండి కుదిర్చి వచ్చినాను. మీరు రావడమే అవశిష్టం, సెలవయితే మనసామాను బండిలో వేయిస్తాను.

పెద్దవ—నీకు పిచ్చి యెత్తినదా యేమి! మథుర వెళ్ళుట కేబండి సిద్ధముగా నున్నది!

చిన్నల—మీరు నన్ను కుదుర్చుకొని రమ్మన్నబండి.

పెద్దవ—నీవు త్రాగుబోతువుగా కనబడుచున్నావు! నిన్ను బెత్తము తెమ్మని పంపినాను.

చిన్నల—కాదండి. మీరు నన్ను బండికోసమే పంపినారు.

పెద్దవ—ఇప్పుడు నీతో వివాదమాడుటకు నాకుతీరదు. నేను చెప్పినమాటలు తిన్నగా వినుచుండుట్కై తరువాత నీకు బుద్ధి చెప్పెదను. మాఱుమాటాడక తిన్నగా సీతయొద్దకు వెళ్ళి, ఈతాళపుచెవి దాని చేతికిచ్చి, నగలపెట్టిలో పట్టుగుడ్డతో కట్టినరూపాయలమూట వేగిరము నేనిమ్మన్నానని చెప్పి పట్టుకొనిరా రాజభటులు నన్ను పట్టుకొన్నారనియు, ప్రాతిభావ్య మియ్యనియెడల నన్ను కొట్టులో పెట్టుదురనియుఁ జెప్పు. మాఱుమాట చెప్పక పరుగెత్తు—రాజపురుషా! సొమ్ము వచ్చులోపల మనము మెల్లఁగా నడచుచుందము;

రమ్మని. (వర్తకుడును, విశ్వకర్మయు, రాజపురుషుడును, పెద్దవసంత కుడును వెళ్ళుచున్నారు.)

చిన్నల—సీతయింటికా మళ్ళీ వెళ్ళడము! అక్కడికివెళితే గారి నన్ను మొగుణ్ణని మళ్ళీ పట్టుకుంటుంది. ఈమాటు దాన్ని వది లించుకొని రాలేను. నాకు యిష్టం లేకపోయినా వెళ్ళమన్నచోటికి వెళ్ళక తప్పదు. సేవకు లెప్పుడూ పరాధీనులు.(అనివెళ్ళుచున్నాడు)

---

ద్వితీయాంకము — పెద్దవసంతకుని గృహమునందు.

[సీతయు, సుభద్రయు, ప్రవేశించు చున్నారు.]

సీత—సుభద్రా! ఆయన నిన్నాప్రకారంగా నీమీద మోహాంకనపతిచేమాట లన్నారా? ఆయన మనస్ఫూర్తిగానే ఆలా గన్నారో, లేక హాస్యానికే అన్నారో చూపులవల్లనూ ముఖచేష్టల వల్లనూ నీవు బాగాకనిపెట్టినావా? ఆయన గంభీరంగా చూచినాడా? తెల్ల తెల్ల పోయి చూచినాడా? మొఖం విచారంగా వున్నదా? సంతోషంగా వున్నదా! అతనిమన స్సేమైనా ముఖలక్షణమునుబట్టి తెలుసుకో తగివున్నదో లేదో చెప్పు.

సుభ—అతడు మొట్టమొదట నీవు తనకు భార్యవే కా వన్నాడు.

సీత—నన్ను వివాహమే చేసుకోలేదన్నాడుగా! ఏమిపాపము పండినదీ!

సుభ—అటుతరువాత తా నీవూరికి క్రొత్తవాణ్ణని ప్రమా ణము చేసినాడు.

సీత—అంత అప్రమాణానికికూడా లోబడ్డాడుగా!

సుభ—అప్పుడు నేను నీపక్షంగా మాట్లాడినాను.

సీత—అతఁడేమిచెప్పినాఁడు?

సుభ—నీమీఁద ప్రేమ వుంచవలసిందని నేను వేడుకుంటే తాను నామీఁద ప్రేమవుంచుతాననినన్ను వేడుకోమొదలుపెట్టినాఁడు

సీత—అతఁడు యేమిషమీఁద నిన్ను మోహిస్తా నన్నాడు?

సుభ—సౌభాగ్యుఁడయినవరుఁడొక వధువు నాశ్రయించినట్టు గానే. నాకేమిషా కనఁపడలేదు. అతఁడు మొట్టమొదట నాసౌందర్యము వర్ణించి, తరువాత నాసంభాషణ పొగడినాఁడు.

సీత—నీవు నాదగ్గర కపటంవిడిచే చెప్తూవున్నావా? నీ వేమైనా దురుద్దేశంతో—

సుభ—శాంతించు. నీ వలాగంటిమాట లనఁబోకు.

సీత—ఇంతవఱకు జరిగినతరువాత నేనేలాగు శాంతంవహించగలను? నామనసు వూరుకుందామన్నా నానోరు వూరుకుండదు. అతఁడు నీతిమాలినవాఁడు: క్రూరుఁడు; ద్రోహి; పాతకుడు; చండాలుఁడు; అతని మొగం చూడరాదు.

సుభ—అటువంటివాడినిమిత్తము ఆశపడఁ యెందుకు? ఎవత్తో అతని కాశపడ్డదని అనుమానపడడం యెందుకు? అటువంటి దుర్మార్గుఁడు వదిలిపోవడమే నీకు క్షేమం.

సీత—నామనస్సు నావాక్కువలె లేదు. నోరు తిడుతూవున్నా మనస్సు అతనికోసమే ఆశపడుతూవున్నది.

[చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—(రోఁజుచు) ఇదుగో తాళంచెవి. నగలపెట్టెలో రూపాయలమూట—వేగిరం పట్టుకు రా!

సుభ—అలాగున వగరుస్తున్నా వేమి?

చిన్నల—వేగిరం పరుగుత్తుకొని రావడంవల్ల.

సీత—నీయజమాను డెక్కడ? ఆయన సుఖంగా వున్నారా?

చిన్నల—లేదు. ఆయన చిక్కులో పడ్డాడు. యమకింకరుడి వంటివాడెవడో అతణ్ని పట్టుకొని తీసుకుపోతూ వున్నాడు; మెళ్ళో బిళ్ళ వున్నది; అక్కడికి వెళ్ళి మళ్ళీవదిలి రాను; నాకుభయంవేస్తూ వున్నది.

సీత—భయంవదిలి తిన్నగా చెప్పు ఏమిజరిగినది?

చిన్నల—ఏమిజరిగిందో నాకు తెలియదు. నాయజమానుణ్ని రాజపురుషుడు పట్టుకొని తీసుకొని వెళుతూ వున్నాడు.

సీత—ఏమీ!ఆయనను పట్టుకున్నారా? ఎవరిఫిర్యాదుమీద?

చిన్నల—ఎవరి ఫిర్యాదుమీద పట్టుకున్నారో నాకు బాగా తెలియదు. ఆయనను రాజభటుడు తీసుకొని వెళుతూ వున్నాడు. నాకది బాగా తెలుసును. విడుదల కావడానికి నగలపెట్టెలో వున్న సొమ్ము నీవు యిస్తావా లేదా?

సీత—సుభద్రా! పెట్టెతాళం తీసి రూపాయలమూట పట్టుకొనిరా. (అని తాళముచెవి యిచ్చుచున్నది.)

సుభ—(పుచ్చుకొని) ఇప్పుడేవస్తాను. (అని వెళ్ళుచున్నది.)

సీత—అద్భుతంగావున్నది! నాకు తెలియకుండా ఆయన అప్పెక్కడ చేసినారు? ఏదైనాపత్రం వ్రాసి యిచ్చినారా?

చిన్నల—పత్రం కాదు నగ-నగ.

సీత—యేమినగ?

చిన్నల—నా కదంతా నీతో చెవుతూ కూర్చోవడానికి అవకాశం లేదు. వేగిరం వెళ్ళవలెను. నేను యిందాకా బయలుదేరేటప్పటికే రెండుఘంటలు అయింది; ఇప్పుడప్పుడే వంటిఘంట వేసినారు.

సీత—యేమి? నీకోసం కాలం వెనక్కు పోతూవున్నది.

కాబోలును! నేను యిదివర కెప్పుడూ రెండుఘంటలు వేసినతరువాత వంటిఘంట వెయ్యడం వినలేదు.

చిన్నల—రాజభటులు పట్టుకుంటే తప్పకుండా కాలమంతా మారిపోతుంది.

సీత—కాలానికి రాజభటులఆజ్ఞ యేమిటి!

చిన్నల—నీవు వినలేదా యేమిటి? రాజభటులను చూస్తే దొంగ వెనక్కు పాఱిపోతాడు. కాలమూ దొంగవంటిదే. అది యెవ్వరికీ తెలియకుండా మెల్లిగా వచ్చివున్నట్టేవుండి మనుష్యులనే యీలోకంలోనుంచి యెత్తుకుపోతుంది. అలా దొంగతనం చేసేటప్పుడు రాజభటులను చూస్తే కాలంమాత్రం వెనుకకు పోదా?

[రూపాయలమూటతో సుభద్ర ప్రవేశించుచున్నది.]

సీత—లక్ష్మణా! అదుగో రూపాయలమూట. జాగ్రతగా తీసుకుని వెళ్ళి తక్షణం నీ యజమానుణ్ని వదిలించి యింటికితీసుకునిరా. సుభద్రా! నామనసులో యెలాగో వున్నది. లోపలకువెళుదాముదా.

(అని వెళ్లుచున్నారు.)

చిన్నల—(తనలో) దేవుడా! వీళ్ళచేతులలో పడక యిప్పటికి బ్రతికి యివతల పడ్డాను. ఇక యిక్కడ నిలవకుండా పరుగెత్తుతాను.

(అని వెళ్లుచున్నాడు.)

తృతీయరంగము—వీధి.

[చిన్నవసంతకుడు ప్రవేశించుచున్నాడు.]

చిన్నవస—(తనలో) నన్నెప్పుడో యెఱిఁగినవారివలెనే యిక్కడివారందఱును నాకు దండము పెట్టుచున్నారు; అందఱును నన్ను పేరుపెట్టి పిలిచి పలుకరించుచున్నారు; కొందఱు నాకు సొమ్మియ్య వచ్చుచున్నారు; కొందఱు భోజనమునకు పిలుచుచున్నారు;

కొందఱు తమకు నేను చేసినయుపకారమునకని వందనములు చేయుచున్నారు; కొందఱు కానుకకయి మంచిమంచివస్తువులను దెచ్చి చూపుచున్నారు. ఇంతకుమునుపే యొకకుట్టుపనివాఁడు నన్ను తన యింటికి పిలుచుకొనిపోయి, నానిమిత్తమయి కొన్నవని కొన్నిపట్టుగుడ్డలనుచూపి, నాశరీరమునుబట్టి కొలఁత పుచ్చుకొన్నాఁడు. ఇదంతయు చూడఁగా నీపట్టణములో మళయాళమంత్రగాండ్రు తప్ప మఱి యెవ్వరును కాపుర ముండనట్టు కనఁబడుచున్నది.

[చిన్నలక్ష్మణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిన్నల—నన్ను తెమ్మనిపంపిన రూపాయ లివిగో; మీ రా యమదూతను వదల్చుకున్నారా?

చిన్నవ—ఇవి యెక్కడి రూపాయలు? ఏయమదూత?

చిన్నల—యమలోకంలో వుండే యమదూత కాదు; భూలోకంలోవుండే యమదూత. నన్నపాటిపులిచర్మం మెడలో వేసుకుని వూళ్ళోవాళ్ళప్రాణాలన్నీ తీస్తాడూ—అతఁడు. ఇందాకా పిశాచం లాగున మిమ్ము పట్టుకొని తీసుకు వెళుతూ వున్నాఁడు.

చిన్నవ—నీమాట లేమియు నాకు తెలియలేదు.

చిన్నల—ఇదే తెలియలేదా? నాకు స్పష్టంగా తెలుస్తూ వున్నవి. మెళ్ళోతోలికి వెండిబిళ్ళ వేసుకొనితిరుగుతాడు; అప్పువుచ్చుకొని యెగఁబెట్టినవాళ్ళనూ, నేరాలు చేసినవాళ్ళనూ, తన కేమీ యివ్వనివాళ్ళనూ పట్టుకుంటాడు: అతణ్ని మీరు యెరగరా?

చిన్నవ—రాజభటుఁడని నీ యభిప్రాయమా యేమి?

చిన్నల—అవు నతఁడే.

చిన్నవ—నీపిచ్చిమాటలింతటితో కట్టిపెట్టు. ఈదినమున వెళ్లెడి ఓడ యేదైనదొరకినదా? మనమీరాత్రిప్రయాణమై వెళ్ళవచ్చునా?

చిన్నల—బండికుదిరి సిద్ధంగా వున్నది. మీదేశాలస్య మని రెండుగడియలక్రిందనే మీతో వచ్చి చెప్పలేదా? అప్పుడు బంట్రోతు మిమ్మల్ని తీసుకు వెళుతూవుండడంచేత తొందరలోవుండి తిన్నగా జవాబు చెప్పినారు కారు. మిమ్మల్ని విడుదల చేయించుకోవడానికి తెమ్మన్నరూపాయ లివిగో.

చిన్నవ—వీని మతిపోయింది. నేనును మతిపోయిన వాని వలెనే కనపడుచున్నాను. మే మిక్కడ మాయలలోపడి తిరుగు చున్నాము. మాపాలిటి భాగ్యదేవతవచ్చి న మ్మీమాయాపత్సముద్రములోనుండి పయికి లేవదీసి గట్టున పడవేయ వలెనుగాని మా యంతట మేము లేవలేము.

[ప్రభావతి ప్రవేశించుచున్నది.]

ప్రభా—వసంతకా! మంచిసమయానికి కనపడ్డావు. సీకు కంసాలి కనపడ్డట్టున్నాడు. అదేనా నాకిస్తానన్న చంద్రహారము?

చిన్నవ—పిశాచమా! నన్ను మోసముచెయ్యక వెళ్ళిపో.

చిన్నల—అయ్యో! ఈమె పిశాచమా?

చిన్నవ—ఈమె పెనుభూతము.

చిన్నల—ఈవిడ భూతాలకన్నిటికీ ముత్తవతల్లిలాగు కనపడు తూవున్నది.

ప్రభా—యివేళ యజమానుడున్నూ సేవకుడున్నూకూడా మహా ఉల్లాసంగావున్నారు! నాతోవస్తారా? సాయంకాలంకూడా మాయింట్లోనే భోజనము చేస్తురుగాని.

చిన్నల—వెళ్ళవద్దు. వెళితే యీదయ్యం మనల్ని పట్టుకుని వదలదు; మెల్లకాలం పీల్చి పిప్పిచేస్తుంది.

చిన్నవ—ఓసి దయ్యమా! నన్ను భోజనమునకు రమ్మను

చున్నావా! నేను రాను వెళ్ళిపో. నీవు దయ్యాలపోతువు.

చిన్నల—అలాగయితే మనకేదో దయ్యాన్ని పంపుచేస్తుంది, మంత్రిం పారకుండా పళ్ళు పీకించి వెయ్యవలెను.

ప్రభా—మీరు మధ్యాహ్నం భోజనాలవేళ పుచ్చుకొన్న నా వుంగరం నాకిచ్చివెయ్యండి. వెళ్ళిపోతాను; లేకపోతే నావుంగరం లోని వజ్రానికి బదులుగా మీ రిస్తానన్న చంద్రహార మయినా యివ్వండి. నేను వక్కనిముషం యిక్కడవుండను.

చిన్నల—దయ్యా లెక్కడయినా కుంభం పొయ్యవలసినదనీ దిగదుడువు పెట్టవలసినదనీ కోరుతవిగాని నగలు పెట్టమని కోరవు. ఈచండి దురాశా పాతకురాలు గనుక చంద్రహారం తెమ్మంటూ వున్నది.

ప్రభా—మాటాడరేమి! మీరు మంచివారు; మోసం చెయ్యరు; నావుంగరమైనా చంద్రహారమయినా యేదోవకటి యియ్యండి.

చిన్నవ—ఓసి శిఖండీ! నా దేహము మండుకొనిపోవుచున్నది. మాటాడక వెళ్ళిపో—లక్ష్మణా! మనము వెళ్ళుదమురా.

చిన్నల—మంచివారికి మాటాడక పోవడమే మందని కాలికి బుద్ధి చెప్పడం చూచినావా!

(అని యిద్దఱును పరుగెత్తుచున్నారు.)

ప్రభా—(తనలో) సందేహంలేకుండా వసంతకుడికి పిచ్చి యెత్తింది; లేకపోతే యీపరికారంగా మాట్లాడడు! నలభయివరహాలు చేసే నావుంగరం పుచ్చుకొని వానికి బదులుగా చంద్రహారం యిస్తా నన్నాడు. ఇప్పుడు రెండింట్లో యేదీ లేదంటూవున్నాడు. ఇంతేకాకుండా మధ్యాహ్నం భోజనంచేసేటప్పుడు తన్ను లోపలికి రాని

య్యకుండా తనయింటితలుపులు వేసినారని పిచ్చికథవకటి చెప్పినాడు. యితనిపిచ్చ తెలుసుకొని పెళ్ళాము బుద్ధిపూర్వకంగానే తలుపులం వేయించి వుండును. నే నిప్పుడు తిన్నగా అతనియింటికి వెళ్ళి పిచ్చ చేత నాయింట్లో ప్రవేశించి బలవంతముగా నావుంగరం యెత్తుకొని పోయినాడని పెళ్ళాముతో చెప్పివస్తాను. యీసంగతి చెప్పితే నా వుంగరంపోయినా దానివెల నలభైవరహాలయినా వస్తవి.

(అని వెళ్ళుచున్నది.)

---

చతుర్థరంగము—వసంతకుని గృహసమీపమున వీధి

[పెద్దవసంతకుడును, ఒకరాజభటుడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—నీవేమియు భయపడనక్కఱలేదు; నేనుపారిపోను; సాయంకాలములోపల నే నియ్యవలసినసొమ్మిచ్చి నిన్ను పంపెదను. ఈదినమున నాభార్య నామీద కొంచెము కోపముగా నున్నది. అందుచేత నేను పంపినవర్తమానము వేగిరము నమ్మినది కాదు కాబోలును! ఈపట్టణములో రాజభటులు నన్ను ఋణమునిమిత్తమయి పట్టుకొన్నా రన్నమాట యామెచెవులకు వింతగా వినబడి నమ్మనర్హము కాకదిగా నుండును.

బెత్తము పట్టుకొని యింతలో పెద్దలక్ష్మణుడు
ప్రవేశించుచున్నాడు.]

అదుగో నేను పంపినసేవకుడు వచ్చుచున్నాడు; అతడు సొమ్ము తీసికొని వచ్చియుండును—ఏమి? నేను తెమ్మన్నది తీసికొని వచ్చినావా?

పెద్దల—ఇదుగో బెత్తము తీసుకొని వచ్చినాను. (అనియియ్య బోవుచున్నాడు.)

పెద్దవ—ఇది కాదు. సొమ్మెక్కడ నున్నది?

పెద్దల—సొమ్ము నాదగ్గర లేదు; బెత్తం కొన్నవాడి కిచ్చి వేసినాను.

పెద్దవ—ఓరి భ్రష్టుఁడా! బెత్తము కొన్నవానికి నాలుగు వందలరూపాయలమూట యిచ్చినావా!

పెద్దల—నాలుగువందలరూపాయలమూట నేమిటి?

పెద్దవ—ని న్నెందుకు పంపినాను?

పెద్దల—నన్ను బెత్తమునిమిత్తం పంపినారు; బెత్తం తెచ్చి నాను.

పెద్దవ—చిన్నగా ఁడిగినమాటకు సదుత్తరము చెప్పనందు కిప్పుడీబెత్తము నీవీపుమీఁద విఱుగవలెను. (అనికొట్టుచున్నాఁడు.)

రాజభటుఁడు—మీరు కోపమానిశాంతం వహించవలెను.

పెద్దవ—ఆపదలో నున్నవాఁడను నేనా శాంతము వహించ వలసినది?

పెద్దల—ఏమిటండీ? అలాగు—

రాజభ—వూరుకో; నోరుముయ్యి.

పెద్దల—నామీద కోపపడకపోతే ఆయనను కొట్టకుండా చెయ్యరాదా?

పెద్దవ—మొండిశిఖండీ! పరమనిర్భాగ్యుఁడా! నీకు తెలివి లేదురా?

పెద్దల—నాకు తెలివి తప్పివుంటే యీదెబ్బలు తెలియక నైనాపోను.

పెద్దవ—నీకు దెబ్బలు తగిలినవని తెలిసికొనుటలో తప్ప మఱియెందులోను నీకు తెలివి లేదు. నీవు గాడిదవు.

పెద్దల—నేనుగాడిదనే; యెంతవోర్పు గలిగి పనిచేస్తూవున్నా నాకు దెబ్బలు తగులుతూ వుండడంచేత నేను గాడిదనే.

[సీతయు, సుభద్రయు, దుర్గాదాసనుమాంత్రికుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—అదిగో నాభార్యవచ్చుచున్నది; ఎదురుగావెళ్లుదము రండి.

పెద్దల—అమ్మా! చేతిలో బెత్తంచూచి జాగ్రతగా వుండు; దగ్గిరకు వస్తివా దెబ్బలు తగులుతవి. నాజ్యోతిషం నమ్మి దూరంగా వుండు;

పెద్దవ—నీవింకను నోరు మూసికొనవా?

(అని కొట్టుచున్నాఁడు.)

ప్రభా—నీవిప్పు డేమి చెవుతావు? నీ మొగుడు పిచ్చివాడవునా కాడా?

సీత—ఆయన చేస్తూవున్నదుర్మార్గం చూస్తే మరివకలాగు వూహించడానికి వీలు లేకుండా వున్నది.—దుర్గాదాసుగారూ! మీరు మంత్రవేత్తలుగదా? నా పెనిమిటిని పట్టుకున్నభూతాన్ని వదిలించి యథాప్రకారంవుండేటట్టుచేస్తిరా మీకు మంచిబహుమానంచేస్తాను.

సుభ—యెంతవికారంగా మనకేసి యెఱ్ఱబారి చూస్తూ వున్నాఁడో చూడు.

ప్రభా—అతికోపంచేత యెలావణకుతూవున్నాఁడో చూడు.

దుర్గా—నీచెయ్యి నాచేతికిచ్చి నాడి చూడనీ.

పెద్దవ—ఇదిగో చేయిచూడు. (అని చేయిచాపి) అవకతవక మాటలు ప్రేలినపక్షమున, ఈ చెయ్యినీదౌడ శుద్ధిచేయును. జాగ్రత్త.

దుర్గా—చేతిలో భూతనాడి ఆడుతూవున్నది. ఈయన దేహ

న్నాశ్రయించి వున్నవో భూతమా! నీపేరు చెప్పి వేగిరం వదిలి పో. వేగిరం వదిలి వెళ్ళని పక్షానికి నామంత్రశక్తిచేత నిన్ను సీసాలో దింపి మారణహోమం చేస్తాను.

పెద్దవ—ఊరుకో దయ్యాలపోతా! వూరుకో నాకు పిచ్చ యెత్తలేదు.

దుర్గా—నేనెరుగుదును; మీకు పిచ్చ కాదు; మీదేహాన్ని గ్రహంపోకి యిలా బాధపెడుతూ వున్నది. త్రిపురసుందరినైనా, భ్రమరాంబనైనా, జ్వాలానృసింహమునైనా, శరభసాళ్వమునైనా ప్రయోగించి నిమిషంలో మీకు గ్రహబాధలేకుండా చేస్తాను.

పెద్దవ—ఓరి పరమచండాలుండా! వీరందఱును నీకీప్రకార ముగా బోధించి నిన్నిక్కడకు తీసుకొని వచ్చినారా? ఈయేడుపు మొగవు నిర్భాగ్యురాలు తలుపులు బిగించివేసి నన్ను లోపలికి రాని య్యక ఎవనినో లోపల పెట్టుకొని సిగ్గులేక నాయింట నీప్రకార ముగా భోజనము చేసినది?

సీత—ఓప్రాణనాథా! ఈనాధ్యాహ్నం నీవు నాతో కలిసి మనయింట్లో భోంచేసిన సంగతి భగవంతుడికి తెలుసును; నాకు తెలుసును.

పెద్దవ—ఓసిగ్గుమాలినదానా! ఏమనుచున్నావు? నీయింట భోజనము చేసినానా?

పెద్దల—స్వామీ! నేను నిజం చెపుతాను. మీరు యీదినం యింటికాడ భోజనం చెయ్యలేదు.

పెద్దవ—ఇంటితలుపులు వేసివెయ్యలేదా?

పెద్దల—అవును వేసివేశారు. నేను కళ్ళారా చూచినాను.

పెద్దవ—నన మొంత పిలిచినను తలుపు తియ్యలేదు కాదా?

పెద్దల—అవును, మనం యెంతపిలిచినా తలుపు తియ్యలేదు.

పెద్దవ—లోపలనుండికూడ నెవ్వరో తలుపు తీయువలదని కేక వేసినారు కారా?

పెద్దల—అవును, లోపలనుంచికూడా యెవరో తలుపు తియ్య వద్దని కేక వేశారు, నేను చెవులారా విన్నాను.

పెద్దవ—గుమ్మమువద్ద కావలి యున్నవాఁడు నన్ను తిరస్కరించి కానిమాట లాడలేదా?

పెద్దల—అవును గుమ్మంవద్ద కావలి వున్నవాడు మిమ్మల్ని తిరస్కారంచేసి మిగలమాట లాడినాడు.

పెద్దవ—నా కందుచేత కోపమువచ్చి గిరుక్కునమరలి నే నక్కడనుండి మఱియొకచోటికి పోలేదా?

పెద్దల—అవును అక్కడనుండి తత్క్షణం కోపంవచ్చి వెళ్ళిపోయినారు. ఆ వాంశానికి నావళ్ళంతాసాక్ష్యంయిస్తూవున్నది. భార్యా గారిమీాదవచ్చిన మీాకోపం నావంటిమీాద యెక్కడిపడితే అక్కడల్లా కనపడుతూవున్నది.

సీత—ఈయుబద్ధాలలో నీవుకూడా యేకంకావడం కూడానా

దుర్గా—వాడికి సిగ్గూభిడియమూా లేదు. యజమానుణ్ని పిచ్చ వాణ్నిచేసి మఱింత ఆడిస్తూవున్నాఁడు.

పెద్దవ—కంసాలివాఁడు నన్నుపట్టుకొనునట్లు చేయుటకు నీవు వానికి సహాయురాలవయినావా?

సీత—అయ్యో! నేనేపాపమూా యెరగను. ఇంకా మీారు నగల పెట్టెలోవున్న రూపాయలమూాట యిమ్మన్నారని లక్ష్మణుఁడు వగరుస్తూ పరుగెత్తుకొనివస్తే మిమ్మల్ని విడిపించడానికి వెంటనే సొమ్మిచ్చి పంపినాను.

పెద్దల——నాచేతికి సొమ్మా! నాచేతికి చిల్లిగవ్వ యివ్వ లేదు——యీవిడ అన్నీ అబద్ధాలే ఆడుతూవున్నది. అయ్యా! ఈవిడె మాటలేమీ నమ్మబోకండి.

పెద్దవ——నీవు సొమ్మునిమిత్తమయి యింటికి వెళ్ళనైన వెళ్ళినావా?

సీత——వీడు నాదగ్గిరకువచ్చి అడిగినాడు; నేను సొమ్ము వీడి చేతిలో పెట్టినాను.

సుభ——నేనుచూస్తూవుండగా సొమ్ము వీడిచేతికిచ్చింది. నేనే పెట్టెతాళంతీసి యీపాపులమూట తీసికొనివచ్చినాను.

పెద్దల——ఓస్వామీ! నేను యేమీయెరుగను. నన్ను బెత్తం కొనడానికితప్ప మరెక్కడికీ మీరు పంపలేదు. నాకు దేవుడూ బెత్తం యిచ్చినవాడుతప్ప మరియెవరూ సాక్షులులేరు ఆడవాళ్ళబద్ధాలాడ తారు; వాళ్ళను నమ్మరాదు.

దుర్గా——అయ్యా! నీ కీపిచ్చ యేమిటి? యజమానుడికీ సేవకు డికీ యిద్దరికీకూడా దెయ్యంపట్టింది. వాళ్ల చూపులవల్లనే నాకంతా తెలిసింది. వీరిద్దరినీ పట్టుకొని చేతులూ కాళ్ళూకట్టి చీకటిగదిలో పెట్టవలెను.

పెద్దవ——ఈదినము నీవు నన్నెందుకు తలుపువేసి లోపలకు రానిచ్చినావుకావు?——ఓరీ! నీచేతికిచ్చినసొమ్ము నీవెందుకు తీసికొని వచ్చి యిచ్చినావుకావు?

సీత——ప్రాణేశ్వరా! నిన్ను వెలపలపెట్టి నేనెంతమాత్రము తలుపు వేయించలేదు.

పెద్దల——స్వామీ! నిజంగా నే యీమె సొమ్ము నాచేతికియ్య లేదు. మనంయింటికి వెళ్ళినప్పుడు తలుపు వేయించిందని నేను

నిజం వప్పుకోవడంలేదా?

సీత—ఓరి పంచమహాపాతకుఁడా! నీవు రెండుసంగతులలో నూకూడా ఘోరమయిన అబద్ధమాడుతూవున్నావు.

పెద్దవ—ఓసి మాయలమారిత్తా! అన్నిసంగతులలోను నీ వబద్ధమాడుచున్నావు. నడివీధిలో నన్నవమానపఱచుటయేకాక మీఁదిమిక్కిలి పీంఁడ్రనందఱిని కూడుకొనివచ్చి, సిగ్గులేక నాకేసి తేటిపాఱచూచుచున్నావా? ఈరెండుచేతులతోను నీగుడ్లు రెండును నూడఁదీసి క్రింద పెట్టెదను. (అని మీఁదికి వచ్చుచున్నాఁడు. అప్పుడిద్దఱుమగ్గురతనిని పట్టుకొనుచున్నారు.)

సీత—పట్టుకోండి; పట్టుకోండి; నాదగ్గరకు రానియ్యకండి; కట్టిపెట్టండి.

దుర్గా—భూతావేశంచేతమాయిద్దరికీలోంగకుండా వున్నాడు, మీరుకూడా సహాయుండండి.

సుభ—అయ్యో! పాపము! అతఁడేప్రకారంగా, తెల్లపోయి వికారవుచూపు చూస్తూవున్నాఁడో!

పెద్దవ—ఏమి మీరందఱునుజేరి నన్ను హత్యచేసెదరా యేమి?—ఓ రాజభటుఁడా! నీకావలిలోనున్న నన్ను పీండ్రందఱును కొట్టి విడిపించి తీసికొనిపోవుచుండఁగా చూచుచు నూరకుండెదవేమి?

రాజభ—అయ్యా! మీరీయనను వదిలిపెట్టండి. నాకావలిలో వుండఁగా మీరీయన నెవ్వరూ ముట్టుకోకూడదు.

దుర్గా—ఇతనికికూడా వళ్ళు తెలియకుండావున్నది. యితణ్ని కూడా పట్టుకొని కట్టిపెట్టండి. (ఇద్దఱు లత్స్మణుని కట్టుచున్నారు.)

సీత—ఓయిరాజభటుఁడా! నీవెందుకడ్డంవస్తావు! పిచ్చివాడీప్రకారంగా బాధపడుతూ అందరినీ కొట్టఁబోతూవుంటే చూడ

డానికి నీకు సంతోషంగావున్నదా యేమిటి?

రాజభ—ఈయన నాశావలిలో వున్నాఁడు; ఈయనను వదిలిపెట్టితే యీయన బాకీవున్నసొమ్ము నేను యిచ్చుకో వలసి వస్తుంది.

సీత—బాకీమొత్తం యెంతో చెప్పినపక్షముకు నేను యిచ్చి వేస్తాను; ఆవిషయంలో నీవేమీ జడియనక్కరలేదు. నాతో యింటికిరా—ఓభూతవైద్యుఁడా! నీవుకూడా వెళ్ళియీయనను భద్రంగా లోపలిగదిలో పెట్టించు. ఈరోజు మాకు గొప్పదుర్దినము.

పెద్దవ—ఓసి పాపాత్మురాలా!

పెద్దల—నీమూలంగా నన్నుకూడా కట్టిపెట్టినారు.

పెద్దవ—చండాలుఁడా! నీవేనాకు పిచ్చియెత్తించుచున్నావు.

పెద్దల—వృథాగా మిమ్మల్ని కట్టిపెట్టితీసుకుని వెళుతూవుంటే లోబడివూరుకుంటారా? ఇదివరకు పిచ్చిలేకపోయినా యిప్పుడు పిచ్చెత్తించుకొని యీ దయ్యాలన్నీ వదిలి పారిపోయేటట్టు కేకలు వెయ్యండి.

సుభ—పాపము! యెంత అసందర్భంగా మాట్లాడుతూ వున్నారు! వీరినిద్దరినీ దైవం రక్షించుగాక!

సీత—మీరీయిద్దరినీ యింటికి తీసుకువెళ్ళండి.—సుభద్రా! నీవు నాతోవుండు. (దుర్గాదాసును;సహాయులును, పెద్దవసంతకుఁడును పెద్దలక్ష్మణుఁడును వెళ్లుచున్నారు.)

సీత—ఓయీ! యెవరిబాకీనిమిత్తం యీయనను పట్టుకున్నారు?

రాజభ—ఎవరో విశ్వకర్మ అనే కంసాలి బాకీనిమిత్తం నీ ఘాతునిషిని యెరుగుదువా?

సీత—మెరుగుదును; బాకీమొత్తం యెంత ?

రాజభ—నూఱువరహాలు.

సీత—ఆసొమ్ము యెందుకోసం బాకీ వున్నారు ?

రాజభ—నీపెనిమిటి చేయించిన చంద్రహారం నిమిత్తం.

సీత—ఆయన నాకోసం చంద్రహారం చేయిస్తూ వున్నానని చెప్పినారుగాని తీసుకుని రాలేదు.

ప్రభా—నీమొగుడు మధ్యాహ్నం కోపంతో మాయింటికి వచ్చి నావుంగరం పట్టుకొని వెళ్ళినాడు. ఇప్పు డాయన వేలిని వున్నది ఆవుంగరమే. ఆయనను వీధిలో చూచినాను.

సీత—అయివుండును. నేనుమాత్రం చంద్రహారం చూడలేదు—ఓభటుడా! కంసాలి యెక్కడ వున్నాడో నావద్దకు తీసుకునిరా. నిజం అతనివల్ల కనుక్కొని సొమ్ము యిచ్చివేస్తాను.

[చేతిలో కత్తితో చిన్నవసంతకుఁడును, చిన్నలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

సుభ—హా! దైవమా! రక్షించు. వాళ్ళు మళ్ళీ వదల్చుకొని వీధిని పడ్డారు.

సీత—ఈసారి కత్తులు దూసుకొని వచ్చినారు. వారిని మళ్ళీ పట్టుకొని కట్టిపెట్టడానకి సహాయం రమ్మని అందరినీ పిలవండి.

రాజభ—పారిపొండి. వాళ్ళిద్దరూ మనను చంపివేస్తారు.
(రాజభటుఁడును, సీతయు, సుభద్రయు, పాఱిపోవుచున్నారు.)

చిన్నవసం—మనకత్తులు చూచి వారు బెదరినారు.

చిన్నవ—యిందాకా మిమ్మల్ని మొగుడని వెంబడించినది యిప్పుడు హాడిలి మీదగ్గరనుంచి పాఱిపోతూ వున్నది.

చిన్నవసం—ఇఁక మనకు భయము లేదు. సత్రమువద్దకు వెళ్ళి మనసామానుపట్టుకొనిరా. ఈరాత్రి బండిఎక్కి వెళ్ళిపోవచ్చును.

చిన్నల—యీరాత్రికి మనం యిక్కడవున్నా వుండవచ్చును. వాళ్ళు మనకేమీ కీడు చెయ్యరు. వాళ్ళు మనతో అనుకూలంగా మాట్లాడుతూవున్నారు; మనకు బంగారం యిస్తూవున్నారు. ఈ వూళ్లోవాళ్ళందరూ నాకు బహుమంచివాళ్లుగా కనపడుతూవున్నారు. నన్ను మొగుడని పట్టుకొన్న ఆగ్రామదేవతమూలంగా గాని లేకపోతే యెల్లకాలమూ నాకు యీవూళ్ళోనే వుండవలెనని వున్నది.

చిన్నవసం—మనకు లక్షవరహాలు వచ్చినను నేనీరాత్రి యీ గ్రామములో నుండను. మనసామాను పట్టించుకొని వత్తమురా.

(అని యిద్దఱును వెళ్ళుచున్నారు.)

---

పంచమాంకము



ప్రథమరంగము—మఠసమీపమున వీధి

[వర్తకుఁడును, విశ్వకర్మయు ప్రవేశించుచున్నారు.]

విశ్వ—నామూలంగా మీప్రయాణం నిలిచిపోయినందుకు బహువిచారంగా వున్నది. అతఁడు శుద్ధఅన్యాయానికి వడిగట్టి యివ్వ లేదంటూవున్నా నే నతనిచేతికి చంద్రహారంయిచ్చినానని ప్రమాణం చేసి చెప్పగలను.

వర్త—అతనికి యీపట్నంలో అంత గౌరవం యెందుచేత వచ్చినది?

విశం—అందరున్నూ అతణ్ని బహుగౌరవంగా చూస్తారు; అతను మహామంచివాడు; అబద్ధమన్నమాట అతనినోటినుంచి రాదు; అతని పేరు చెపితే యెంతపరపతి ఐనా పుడుతుంది. యీగ్రామంలో అతనితో సమానులు మరియెవరూ లేరు. యేరాత్రివేళ యేమనిషిచేత అతడు శాస్త్రవర్తమానం పంపినా తమధనంఅంతా అతణ్నినమ్మి పంపేటంత గురి అందరికీ అతనియందు వున్నది.

వర్త—మెల్లిగా మాట్లాడు; అదుగో అతఁడు వస్తూవున్నాఁడు

[చిన్నవసంతకుఁడును, చిన్నలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

విశ్వ—అవును. అతఁడు తన కియ్యలేదని ప్రమాణముచేసిన దాచంద్రహారమే. అతఁడు దగ్గిరకు రానీ; అదుగుతాను—ఓవసంతకా! నాకీ అవమానమున్నూ శ్రమానున్నూ యెందుకు కలగచేసినావో నాకు అద్భుతంగా వున్నది; ఇప్పుడు మీరు యింత బహిరంగంగా మెడలో వేసుకొని వీధిలో తిరుగుతూవున్న యీచంద్రహారము లేదనడము మీకుమాత్రం సిగ్గుచేటుకాదా? నన్ను వృథాగా నలుగురిలోనూ పరాభవపరచడమే కాకుండా యీపెద్దమనిషికికూడా లేనిపోనిఆయాసం కలుగచేసినారు. మనవివాదమూలంగా గాని లేకపోతే యీయన యీపాటి ప్రమాణముయి వెళ్ళిపుండును. నావద్ద పుచ్చుకున్న చంద్రహారం యిది యిప్పుడు మీరు లేదనఁగలరా?

చిన్నవసం—అవునిది నీవే నాచేతి కిచ్చినావు కాఁబోలును! నీ వియ్యలేదని నే నీవఱ కెప్పుడును అనలేదే.

వర్త—అవును మీరు లేదన్నారు; లేదని అప్రమాణంకూడా చేసినారు.

చిన్నవసం—నేను లేదనుమండఁగా గాని ప్రమాణం చెయ్య గాఁగాని యెవరువిన్నారు?

వర్త—నాయొక్క యీరెండుచెవులున్నూ విన్నవి. ఇఁక మాటాడక వూరుకో పెద్దమనుష్యులలో తిరగనేర్చినవాడవు. యిటువంటి అబద్ధమాడి సిగ్గులేకుండా తిరుగుదువని యెలాగు వీధులోతలయెత్తుకుని తిరుగుతూవున్నావు?

చిన్నవసం—నామీఁద అటువంటి దోషారోపణను చేయుటచేత నీవు పచ్చిదొంగవుగా కనఁబడుచున్నావు. మగవాఁడవయి నీవు నాతో దెబ్బలాటకు వచ్చిన పక్షమున, నాయుధార్థతయు మర్యాదయు నీకు నిమిషములో కనఁబఱచఁగలను.

వర్త—తిరిగితే మొగంమీఁదచెప్పు. నీవంతకంటెను దొంగవని నేను కనుపరుస్తాను. (వారు దగ్గఱకు వచ్చుచున్నారు.)

[సీతయు, సుభద్రయు, ప్రభావతియు, మరికొందఱును ప్రవేశించుచున్నారు.]

సీత—ఆగు—అతని కేమీ హానిచేయకు—అతఁడు పిచ్చవాఁడు—కొందఱు ముందరికివెళ్ళి చేతులోకత్తిలాగుకోండి—లక్ష్మణున్నికూడా పట్టుకొని కట్టిపెట్టి యిద్దరినీ మాయింటికి తీసుకునిరండి.

చిన్నల—అయ్యో! పరుగెత్తు పరుగెత్తు. అదుగో మఠం; అందులోదూరి తలుపులు లోపల వేసుకుందాము లేకపోతే వీళ్ళు మనని బ్రతకనియ్యరు.

(చిన్నలక్ష్మణుఁడును, చిన్నవసంతకుఁడును, మఠములోనికి వెళ్లుచున్నారు)

[మఠములోనుండివచ్చి యోగిని ప్రవేశించుచున్నది.]

యోగిని—జనులారా! అల్లరిచేయకండి మీరిక్కడ కెందుకు గుంపుగా చేరినారు?

సీత—మతిచాంచల్యం కలిగి నా పెనిమిటిని యిక్కడనుంచి తీసుకువెళ్ళడానికి మనుష్యుల్ని లోపలకు రానీ. మేమతణ్ని గట్టిగాకట్టి పెట్టి వైద్యంచేయించడానికి యింటికి తీసుకుపోతాను.

విశ్వ—ఈయనకు మతి చలించినదని యిదివరకే అనుకున్నాను.

వర్త—ఈయనతో దెబ్బలాటకు సిద్ధమయినందుకు నాకిప్పుడు విచారంగావున్నది.

యోగిని—యెంతకాలంనుంచి యితఁడీస్థితిలో వున్నాఁడు?

సీత—వారం దినములనుంచి యీయన పరధ్యానంగానూ, విచారంగానూ, వ్యాకులంగానూవుండి వెనకటికంటె యేమోభేదంగా కనిపిస్తూవచ్చినారు. కాని యీరోజువరకూ యింతచేటులేదు. మరీ యీమధ్యాహ్నంనుంచీ వళ్లుతెలియకుండా లేచిపోయినారు.

యోగిని—అవశాత్తుగా యితనిధన మేమయినా విస్తారంగా పోయిందా? ఎవరైనా ప్రాణమిత్రుడు కాలంచేసినాడా? ఇతనిదృష్టి యెవత్తెయిూదికైనా పాఱి అక్రమంగా పరస్త్రీకోసం పరితపిస్తూవున్నాఁడా? వయస్సులో వున్నవాళ్ళు అందగత్తెఅయిన కొత్తదాన్ని చూడడంతోనే దానిమీద కన్ను వేసి సాధారణంగా పిచ్చియెత్తి తిరుగుతూవుంటారు. ఈమూడింట్లో నీ మొగుడి పైత్యభ్రమకు యేది కారణమయి వుండవచ్చును?

సీత—వకవేళ అయితే నీవు కడపట చెప్పినదితప్ప మరియేదీ కారణమయి వుండదు. ఈయన తరుచుగా యింటికాలస్యంగా వస్తూవుండడంచేత యెవతెవలలోనో పడి యిల్లూవాకలీ మరచి తిరుగుతూవున్నాడని వూహిస్తాను.

యోగి—ఆపని చేసినందు కయి నీవతణ్ని కూకలు వెయ్యవలసింది.

సీత—నేనుమాత్రం యూరుకున్నానా! కూకలు వేస్తూనే వున్నాను.

యోగి—నీవు తగినంతగట్టిగా కూకలువేసినట్టు తోచదు.

సీత—భార్య మొగుణ్ని కూకలువెయ్యతగినంత గట్టిగా కూకలువేస్తూనే వచ్చినాను.

యోగి—వకవేళరహస్యంగాకూకలు వేసేదానవు కాబోలును.

సీత — రహస్యంగా మాత్రమే కాదు; బహిరంగంగా కూడాను.

యోగి—అయితే చాలినంత కాదా.

సీత—అలాగయితే నిజం చెపుతాను. ఇఖ ఆయనతో నాకు రెండో ప్రసంగమే లేదు. రాత్రి పరున్నప్పుడు నిద్రపట్టిందాకా చెవి దగ్గరచేరి యీసంగతినే గొణుగుతూ వుండేదాన్ని; భోజనమువద్ద కూడా యీసంగతి చెప్పకుండా ముద్ద మింగనిచ్చేదాన్నిగాను; మే మిద్దరమూ వంటిగావుంటే యిదితప్ప మరిఒకసంగతి మాటాడేదాన్ని కాను; అతడు పదిమందిలో వుండేటప్పుడయినా యీ ధోరణే తెచ్చి యెత్తిపొడుపుమాట లంటూనే వుండేదాన్ని. నేనుయెప్పుడూ యీ విషయమయ్యే చీవాట్లుపెడుతూ వుండేదాన్ని.

యోగి—నీవాడే మాటలమూలంగానే నీమొగుడికి పిచ్చ యెత్తింది. లేనిపోనిఅనుమానం పెట్టుకొని అహోరాత్రములు చెవి దగ్గర చేరి విరామం లేకుండా సాధిస్తూవుండే భార్యమాటలు వెఱ్ఱి యెక్కకుండా యెక్కువవిషంగా వుండి యెటువంటి పరమ శాంతుడికయినా నిమిషంలో పిచ్చియెత్తిస్తవి; నీపోరుచేత అతడు రాత్రిళ్ళు నిద్రకుకూడా మొగంవాచినట్టు తోస్తుంది; రోజూ కలత నిద్రపోయేవాడికి మతి చలించిపోవడం అంతఆశ్చర్యం కాదు; నీవాడే

మాటలతో తిన్న అన్నం కడుపునపట్టక నీరయిపోయి వున్నదను. ఈ ప్రకారం నిద్రాహారాలు లేక యిల్లు అడివిగా నున్నప్పుడు రోగా గాలూ యెందుకు రాకుండా వుంటవి ? జారత్వశంకచేత యిదంతా నీవు చేసుకున్న దోషఫలమే. కాబట్టి స్వయంకృతాపరాధము నీవు నీవే అనుభవించవలెను.

సుభ—అతఁడు యెంత అక్రమంగా ప్రవర్తిస్తూ వచ్చినాగానీ మాఅప్పమాత్రం అతణ్ని మంచిమాటలతోనే బోధిస్తూ వచ్చినది; అంతేగాని తూలుమాట యెప్పుడూ నోటరానియ్యలేదు—(మెల్లగా) ఆమెతప్పితమంతా నీమీదనే మోపి చివాట్లుపెడుతూవుంటే బదులు చెప్పకుండా వూరుకుంటా వేమి ?

సీత—(మెల్లగా) ఆమె అంతా నానోటనే పలికించి నన్ను నోరెత్తకుండా చేసింది. నేనేమి చెప్పఁగలను? (బిగ్గరగా)—మీరు లోపలికి వెళ్ళి అతణ్ని పట్టుకోండి.

యోగి—మీరు యెవరూ లోపలికి వెళ్ళకూడదు.

సీత—అలాగయితే మీవాళ్ళ నెవళ్ళనయినా నాపెనిమిటిని యివతలకు తీసుకునివచ్చి నాకు వప్పగించుమను.

యోగి—అది వల్లగాదు. ఇది పవిత్రమయినమఠం గనుక అతను దీనిలో శరణొందినాడు; అందుచేత నేను అతణ్ని మంచి మాటలతో స్వస్థచిత్తుణ్ని చేసేవరకూనీకువప్పగించను. నాప్రయత్నం వ్యర్థమయితే అప్పటిమాట చూతాము; యీలోగా వదలిపెట్టను.

సీత—నాపెనిమిటికి పరిచర్య చెయ్యడం నాకువిధిగనుక, నా పెనిమిటివద్ద నేనే కనిపెట్టుకునివుండి నేనే పథ్యపానాదులు పెట్టి వుపచారం చేస్తాను; మరివకరిని నమ్మి నేను అతణ్ని విడిచిపెట్టను; కాబట్టి నన్ను యింటికి తీసుకువెళ్ళనీ.

యోగి—కొంచెం శాంతించు. అతణ్ని మళ్లీ యెప్పటిమనిషిని చెయ్యడానికి మందులూ మూలికలూ మంత్రాలూ అన్నీ ప్రయోగించి నాశాయశక్తులా పనిచేసేవరకూ నేను అతణ్ని విడిచిపెట్టను. యోగినిని గనుక కష్టంలో వున్నవాళ్ళకు సహాయం చెయ్యడం నాకు ధర్మము. అతణ్ని యిక్కడ నావశంలో వుంచి నీవు వెళ్ళిపో.

సీత—నా పెనిమిటిని విడిచిపెట్టి నేను వెళ్ళను. మొగుణ్నీ పెళ్ళాన్నీ యెడబాపడం నీవంటి పుణ్యవ్రతంలో ప్రవేశించినదానికి ధర్మం కాదు.

యోగి—నే నతణ్ని వదలిపెట్టను; మాటాడక వెళ్ళిపో (అని లోపల తలుపు వేసికొనుచున్నది.)

సుభ—యీ అన్యాయం నీవు రాజుతో వెళ్ళి మొఱపెట్టుకో.

సీత—వెళదామురా, నేను ఆయన కాళ్ళమీద సాష్టాంగ పడి, నా ప్రార్థనలవల్లనూ కన్నీళ్ళవల్లనూ ఆయన మనసు కరిగించి స్వయంగా యిక్కడకువచ్చి యీ యోగినిచేతులలోనుంచి నా పెనిమిటిని విడిపించి యిచ్చేవరకూ కాళ్లమీదనుంచి లేవను.

వర్త—యిప్పుడు దగ్గరదగ్గరగా అయిదుగంటలుకావచ్చింది. యింకా కొంచెంసేపటికి యీమఠంవెనకాల వున్నవధ్యభూమికి వెళ్లడానికి రాజుగారు స్వయంగానే యీదోవను వస్తారు.

విశ్వ—యెందుకోసము!

వర్త—యీపట్నంతాలూకు శాసనాలకు విరుద్ధంగా యీ వూరికి వచ్చినందునకయి వక మఘరాపురవర్తకణ్ని ముసలివాణ్ని వురి తీయించడానికోసము.

విశ్వ—అదుగో వారు వస్తూవున్నారు. అతణ్ని వురితియ్యడం మనం చూతాము.

సుభ—రాజు యీమరం దాటి వెళ్ళకముందే నీవు ఆయన పాదాలమీద పడు.

[ధర్మపాలమహారాజును, సేవకులును, వర్ధమానుడును, గారాగృహాధికారియు, రాజభటులును ప్రవేశించు చున్నారు.]

ధర్మ—'ఏధర్మాత్ముఁడయినను వచ్చి యీతనిప్రాణరక్షణార్థము ధనమిచ్చి పుణ్యము కట్టుకొన్న పక్షమున, ఈతనిని విడుదల చేయుదుము' అని మాఱియొకసారి గట్టిగా చాటించుము. మన మీతని కీపాటియుపకారమును జేయుదము.

సీత—ఓ మహాప్రభో! యీరోగిని నాకు చేసినఅన్యాయం విచారించి నాకు న్యాయం దయచేయించవలెను.

ధర్మ—ఆకు మిక్కిలి పుణ్యాత్ములు, బహుపూజ్యులు: నీవిషయములో నేమియు అక్రమము చేసియుండరు.

సీత—ఓమహారాజా! అనుగ్రహించి నామొరాలకించండి. వసంతకుడుగారు నాకు భర్త; యేలినవారు చేసిన నమ్మకములను బట్టి నేనాయనను వివాహం చేసుకొన్నాను; నామరదృష్టంచేత ఆయనకు యీరోజున అకాత్తుగా పైత్యభ్రమకనిపించి మాకుటుంబానికంతా గొప్పవిపత్తు సంప్రాప్తమయింది. ఏమికాలకర్మదోషం చేతనో కాని తనతోపాటు యేకకాలమునందే పిచ్చియెత్తినతనసేవకుణ్ణి వెంటవేసుకొని వూరిమీదపడి ఆయన కనపడ్డయిల్లెల్లాదూరి వుంగరాలూ నగలూ చేతికి వేదిదొరికితే అదెల్లాయెత్తుకునస్తూ అందరికి అప్రియంచేస్తూవున్నాడు. వగపన్యాయం నేను ఆయనను కట్టి పెట్టించి యింటికిపంపించి, అదివరకాయన అక్కడక్కడ చేస్తూ వచ్చిన నష్టానికి సొమ్ముసవరించి వారిని సమాధానపరుస్తున్నాను. ఆయన యెలాగోకాని తప్పించుకొని మళ్ళీవీధినిబడి తన సేవకుడునూ

తానున్నూ కత్తులు దూసుకొనివచ్చి మమ్ము తఱిమినారు. తరువాత మేము చాలామందిని సహాయంచేసుకొనివచ్చి మళ్ళీ కట్టిపెట్టడానికి వెంబడించేవరకు వారు పరుగెత్తుకొనిపోయి యీమఠంలో పడ్డారు. మేమాయనను యింటికి తీసుకపోదామంటే యీయోగిని మాకడ్డం వచ్చి తలుపులు లోపల వేసి మమ్ము లోపలికి వెళ్ళనూ వెళ్ళనియ్యదు; తానాయనను యివతలకు పంపనూ పంపదు. దీనులమయిన మా మొఱ్ఱాలకించి దేవరవారేలాగయినా ఆమె వానిని యివతలికి పంపేటట్టు ఆజ్ఞచేసి పతిభిక్షపెట్టి రక్షించవలెను.

ధర్మ—విస్తారకాలముక్రింద నీభర్త మాయొద్ద నొక సేనానాయకుఁడుగా నుండి నాకు మిక్కిలి యుపకారము చేసినాఁడు. అప్పుడు నిన్నతనికి వివాహము చేయించి మేముచేయఁదగినప్రత్యుపకారమంతయుఁచేసి మేమాతని బహువిధముల గౌరవించినారము.—మీలో కొందఱువెళ్ళి మఠద్వారమువద్ద నిలుచుండి పిలిచి యోగినిని మాయొద్దకు తీసికొనిరండు; మేమాతగవుతీర్చి మఱియిక్కడనుండి వెళ్లెదము.

[ఒకపరిచారిక ప్రవేశించుచున్నది.]

పరి—అమ్మా! పరుగెత్తుకొనివెళ్ళి వేగిరం నీప్రాణాలు దక్కించుకో. అయ్యగారున్నూ సేవకుఁడున్నూకూడా వదిలించుకొని ఇంట్లోవున్న పరిచారికలనందరినీ కొట్టి, భూతవైద్యుణ్ని కట్టిపెట్టి గడ్డానికి నిప్పంటించినారు; అతడు గడ్డంకాలి యేడుస్తూవుంటే ఆర్పుతామని మొగంనిండా బురదవేసికొట్టి నిప్పార్పినారు. మనయజమానుడు శాంతించుమని అతనికి బోధచేస్తూవుండగా, లక్ష్మణుఁడు కత్తితీసుకుకొని వచ్చి అతనితల రేవురేవులుగా గొరిగినాడు. వెంటనే

మీరు యెవరినైనా పంపితేనే తప్ప వారిద్దరూచేరి మంత్రగాణ్ని చంపివేస్తారు.

సీత—ఓసిపిచ్చిదానా నోరుముయ్యి నీయజమానుడున్నూ సేవకుడున్నూ యిక్కడనే వున్నారు. నీవు చెప్పినదంతా అబద్ధం.

పరి—అమ్మా! మీతోడు నేను నిజం చెపుతూవున్నాను. నామాట నమ్మండి. అతణ్ని నేనుమాటి తిన్నగా నిముషమయినా అయివుండదు. ఆయన నీపేరుపెట్టి పిలిచి యెక్కడవున్నావని కేకలు వేస్తూ, నీవు కనపడిన పక్షానికి నీముఖంనిండా గింట్లుపెట్టి నిన్ను విరూపిని చెయ్యకపోతే తనపేరు మాఱుపేరు పెట్టుమని వొట్టుపెట్టు కుంటూవున్నాడు. (లోపల పెద్దవసంతకుఁడు కేక వేయుచున్నాఁడు.) అమ్మా! ఆలకించు! ఆలకించు ఆయనమాటలు వినఁబడుతూవున్నవి. ఇక్కడ నిలువకు; పరుగెత్తు.

ధర్మ—జడియకు. ఈలాగునవచ్చి నీవు నావెనుక నిలుచుండు— ఈ బెలుపుచ్చుకొని కాచుకోండి.

సీత—అయ్యో! అతఁడు నాభర్తే. అతఁడు యెలా కనపడకుండా వచ్చినాడో చూడండి. ఇంతకు మునుపు యితఁ డీమఠంలో ప్రవేశించడం చూచినాము· ఇప్పు డప్పుడే అక్కడవున్నాఁడు! అతఁడు ఇప్పుడక్కడి కేలావచ్చినాడో వూహించడానకైనా వీలులేకుండా మహాద్భుతంగా వున్నది.

[పెద్దవసంతకుఁడును పెద్దలక్ష్మణుఁడును ప్రవేశించుచున్నారు.]

పెద్దవ—న్యాయము దయచేయండి ఓమహారాజా! న్యాయము దయచేయండి. చిర కాలముక్రిందట నాదేహమున నెత్తురు వఱదలుగట్ట గొప్ప గాయములు తగిలినను సాహసముచేసి మీకడ్డపడి

నిప్పుడు త్రాగి మత్తుగొనియుండలేదు; కోపముచేత నొడలు తెలి యకయు నుండలేదు; నాకు చిత్తోన్మాదమును గలిగి యుండలేదు. ఈదినము నేను భోజనమునకు రాకుండ ఇది తలుపులు లోపల గడియ వేసినది. ఈకంసాలికూడ కుట్రలో చేరియుండని పక్షమున, ఇతఁడు నాతో నున్నాఁడుగనుక నాపక్షమున సాక్ష్యమియ్యవచ్చును. ఇతఁడు మాతోఁగూడ కొంతదూరమువచ్చి ప్రభావతి యింటివద్దను చంద్ర హారము తీసికొనివచ్చెదనని చెప్పి తనయింటికి వెళ్ళినాఁడు; కాంచన గుప్తుఁడును నేమును గలిసి ప్రభావతియింటివద్ద భోజనముచేసినాము. మాభోజన మాయినతరువాత నతఁడక్కడకు రానందున కొంతసేపు చూచి నేనితనికొఱకు వెళ్ళినాను. నేనితనినివీధిలో కలిసికొన్నప్పుడు ఈపెద్దమనుష్యుఁడుకూడ నితనితో నున్నాఁడు. అప్పుడే అసత్యవాది యైన యీ స్వర్ణకారుఁడు నేనీదినమున తనవద్దనుండి చంద్రహార మును పుచ్చుకొన్నానని ప్రమాణముచేసినాఁడు. ఆచంద్రహారము నేనెఱుఁగనిసంగతి భగవంతునికి తెలియును. దానినిమిత్తము యితఁడు నన్ను రాజభటున కొప్పగింపఁగా, నేనుకోఁబడి సొమ్ము నిమిత్తమై నానేవకుడైన వీనిని మాయింటికిఁబంపినానుగాని వీఁడుసొ మ్ములేక వట్టిచేతులతోనే మరల వచ్చినాఁడు. నేనింటికివెళ్ళి సొమ్మి భటునివశమున నిచ్చిపంపెదనని రాజపురుషులను సమాధానపఱచి వచ్చుచుండఁగా త్రోవలో నాభార్యయు, దాని చెల్లెలును, మఱి కొంత అల్లరిమూఁకయు మాకెదురుపడిరి. వారు తమతో దుర్గాదా సను ఎముకలగూడువలెనున్న యొక జీవచ్ఛవమునుకూడ తీసికొని వచ్చిరి. ఆవడనీచుఁడు తాను భూతవైద్యుఁడనని వేషము వేసికొని నానాడియు చూపులును పరీక్షించి నాకు భూతము సోఁకినదని అఱ చినాఁడు. వెంటనే అందఱును నామీఁదపడి నన్నుకట్టిపెట్టి, తీసికొని

వెళ్ళి, నా సేవకునినిగూడ త్రాళ్ళు వేసికట్టిమాయిద్దఱిని మాయింటనే యొక చీకటిగదిలో పెట్టినారు. నేను పండ్లతో కొఱికి కట్లుత్రెంపుకొని యీసంగతి మొఱపెట్టుకొనుటకు తక్షణమే యేలినవారి దర్శనమునకు పరుగెత్తుకొనివచ్చినాను. ధర్మస్వరూపులయిన దేవరవారు నాకీదినమున సంభవించిన మానభంగమునకును శ్రమకునుతగిన ప్రతిక్రియ చేయవలెను.

విశ్వ—మహాప్రభూ! ఈయన యీరోజు యింటికాడ భోజనం చెయ్యలేదనిన్నీ యింటితలుపులు వేసి వేసినారనిన్నీ యింతవరకు మాత్రం నేను సాక్ష్యం యివ్వగలను.

ధర్మ—అతఁడు నీయొద్దనుండి చంద్రహారమును పుచ్చుకొన్నాఁడా లేదా?

విశ్వ—పుచ్చుకున్నాఁడు మహాప్రభూ! ఈయన యిక్కడికి పరుగెత్తుకొనివచ్చినప్పుడు యీయనమెడలో చంద్రహారంవీరందరూ కూడా చూచినారు.

వర్త—అంగడివీధిలో నీవు మొదట చంద్రహారం యెరగనని ప్రమాణంచేసి తరువాత, నీవింతకుమునుపే యిక్కడపుచ్చుకొన్నట్టు మళ్ళీ నీనోటితో వప్పుకోవడం నేను చెవులారా విన్నాను. అందు మీఁద నాకు కోపంవచ్చి నీతో యుద్ధమునకు సిద్ధంకాఁగా, జనుల గుంపునుజూచి నీ పీమతంలోదూరి యెలాగో గారిడీచేత నీవామూల నుంచి ప్రత్యక్షమయినావు.

పెద్దవ—ఈపూట సమీపమునకు నేన్నాఁడును రానులేదు. నీవు నాతో యుద్ధమునకు సిద్ధముకానులేదు. దైవసాక్షిగా నేను చంద్రహారము పుచ్చుకోనులేదు; నీవు నిష్కారణముగా నామీఁద దోషారోపణము చేయుచున్నావు.

ధర్మ—మీరందఱును ఒకదానికొకటి సంబంధించకుండ మాటాడుచున్నారు! మీరందఱును త్రాగియున్నారని నాకు సందేహముకలుగుచున్నది. ఇతఁడీయింటఁ బ్రవేశింపఁగా మీరు చూచియుండినపక్షమున; ఇతఁడిక్కడనేయుండి యుండును. ఇతనికి మతిచలనము గలిగియుండినయెడల, ఇతఁడింత శాంతతతో సహేతుకముగా మాటాడియుండఁడు. ఇతఁ డింటికడ భోజనము చేసెనని నీవు చెప్పుచున్నావు; ఇంటివద్ద భోజనము చేయలేదని యీకంసాలి చెప్పుచున్నాఁడు!—ఓరీ! నీవేమి చెప్పెదవు!

పెద్దలక్ష్మి—స్వామీ! యీయన యీదినం యీప్రభావతి యింటివద్దనే భోజనం చేసినారు.

ప్రభా—ఈయన మాయింటికాడనే భోజనం చేసినారు; అప్పుడు నావేలిది యీవుంగరంకూడా పుచ్చుకున్నారు.

పెద్దవసం—అవును. నీమాటనిజమే. ఈమెయొద్ద నే నీయుంగరమును పుచ్చుకున్నాను.

ధర్మ—ఇతఁ డీమఠములోనికి వెళ్ళుచుండఁగా నీవు చూచినావా!

ప్రభా—నేను నిశ్చయంగా చూచినాను మహాప్రభో!

ధర్మ—ఇదంతయు నత్యద్భుతముగా నున్నది. నీవువెళ్ళి యోగినిని మాకడకు పిలుచుకొనిరా—నాకు చూడఁగా మీ కందఱికిని పిచ్చియెత్తినట్టు తోఁచు చున్నది.

(ఒకసేవకుఁడు వెళ్ళుచున్నాఁడు.)

వర్ధ—మహాప్రభూ! నేనొక్కమాట వీనితో మాటాడుటకు నాకనుజ్ఞ యిచ్చెదరా? సొమ్మిచ్చి నాప్రాణమును కాపాడఁగలవాఁ డిందులో నొకఁ డున్నట్టు కనఁబడు చున్నాఁడు.

ధర్మ—నీ వెవ్వరితో నేమి మాటాడవలెనో నిర్భయముగా మాటాడవచ్చును.

వర్ధ—అయ్యా! మీ పేరు వసంతకుఁడును, మీయొక్క సేవకుని పేరు లక్ష్మణుఁడును కాదా?

పెద్దల—ఈఘడియవఱకు నేనీయన సేవకుణ్నాయి నలక్ష్మణున్నే ఈయనయు వసంతకుఁడే.

వర్ధ—నిశ్చయముగా మీయిద్దఱును నన్ను స్మరణకుఁ దెచ్చుకొని యుందురు.

పెద్దల—మిమ్మల్ని చూస్తే మాయిద్దరిసంగతీ మాకు స్మరణకు వస్తూవున్నది. మీవలెనే మేమున్ను కొంచెంసేపటికింద కట్లల్లో వున్నాము. మీరున్నూ నావలెనే దుర్గాదాసుగారిచేత వైద్యం చేయించుకున్నారా యేమి?

వర్ధ—నీవు నావంక వింతపడి చూచుచున్నావేమి? నీవు నన్ను చక్కఁగా నెఱుఁగుదువు.

పెద్దవసం—ఇప్పుడు తప్ప నేను నాజీవితకాలములో నిన్నెప్పుడును జూచి యుండలేదు.

వర్ధ—దుఃఖముచేత నారూపముమారిపోయి యుండవచ్చును నాకంఠస్వరమునైన గుఱుతు పట్టినావా?

పెద్దవసం—లేదు.

వర్ధ—లక్ష్మణా! నీవో?

పెద్దల—లేదు. నేనూ ఆనవాలు పట్టలేను.

వర్ధ—నాకంఠధ్వనికూడ మీ రెఱుఁగరా? ఓ కాలమా! ఈనాలుగుసంవత్సరములలోనే నాకన్నకొడుకుసహితము నామాట నానవాలు పట్టలేకుండునట్లుగా నాకంఠస్వరమునుగూడ పూర్ణముగా

మార్చి వేసినావా? వార్ధకముచేతను దుఃఖములచేతను నేనెంతమారి పోయినను, నాదృష్టిమాత్రము నాకన్నులను విడిచిపెట్టక నీవు నా కొమారుఁడవని చూపుచున్నది. నేనెట్లు మఱియొకలాగుననుకోఁగలను?

పెద్దవసం—నాతండ్రిని నేనెప్పుడును చూచి యుండనేలేదు.

వర్ధ—కుమారా! నాలుగుసంవత్సరములక్రిందట నీవు నన్ను మధురాపురములో విడిచిపెట్టి వచ్చినావు. ఒకవేళ నిట్టిమరవస్థల నున్న నన్ను తండ్రినని యొప్పుకొనుటకు సిగ్గుచేత నీ విట్లనుచున్నావేమో?

పెద్దవ—ఈమహారాజును నన్నెఱిగిన వీరందఱును చిరకాలమునుండి నేనిక్కడనే యున్నాననియు, నేనెప్పుడును మధురాపురమునకు వెళ్ళ లేదనియు సాక్ష్య మియ్యఁగలరు.

ధర్మ—ఓయివృద్ధుఁడా! పదినేను సంవత్సరములనుండి మేమీతనికి ప్రాపకులముగా నున్నాను. ఈకాలములో నీతఁ డెప్పుడును మధురాపురమునకు వెళ్ళి యుండలేదు. వృద్ధత్వముచేతను కష్టముల చేతను నీమతిపోయి నీ వీలాగున భ్రమపడి యుందువని మే మనుకొనియెదము.

[చిన్నవసంతకునితోను, చిన్నలక్ష్మణునితోను, యోగిని ప్రవేశించుచున్నది.]

యోగిని—ఓమహారాజా! అన్యాయము సంభవించిన యీ మనుష్యుణ్ణి రక్షింపుఁడు. (అందఱును జూచుటకు గుంపు కూడుచున్నారు.)

సీత—నాకిద్దఱుభర్తలు కనఁబడుతూ వున్నారు! నాకళ్ళకు భ్రమగప్పినదా యేమి?

ధర్మ—వీరొకరికొకరు ప్రతిబింబములవలె నున్నారు. వీరిలో నిజమయినవాఁ డెవఁడో యెవరు నిర్ణయింపగలరు?

చిన్నల—లక్ష్మణున్ని నేను. యీరెండోవాణ్ని అవతలకు పంపివెయ్యండి.

పెద్దల—నేనులక్ష్మణున్ని నన్నిక్కడ వుండనియ్యండి.

చిన్నవ— మీరు వర్ధమానులా? లేక ఆయనప్రతిబింబమా?

చిన్నల — ఓహో! నాపెద్దయజమానుఁడు! ఈయనను ఈప్రకారంగా కట్టి యెవ రిక్కడకు తీసుకువచ్చినారు?

యోగిని—యెవరుతీసుకువస్తేనేమి? నే నీయనకట్టువిడిపించి మళ్ళీభర్తను సంపాదించుకొంటాను. ఓపుణ్యాత్మా! పూర్వము చారుమతి అనేభార్యను వివాహం చేసుకుని ఆమెవల్ల యిద్దఱుకవల పిల్లవాళ్ళను కన్న వర్ధమానులు మీరేనా? ఈచారుమతితో మాటాడండి.

వర్ధ—నే నిప్పుడు స్వప్నావస్థలో లేనిపక్షమున నీవు నిశ్చయముగా చారుమతివే. నీవుచారుమతివే యయినయెడల, అప్పుడునీతో గూడ సముద్రములో తేలిబ్రతికిన పుత్రుఁ డెక్కడనున్నాఁడో చెప్పు.

చారుమ—నమ్మా నాకొడుకునూ సేవకుఁడయిన లక్ష్మణున్నీ తమపడవలలో యెక్కించుకొన్న చేపలవాళ్లు దుర్మార్గంచేసి పిల్లలిద్దరినీ బలాత్కారంగా నాదగ్గిరనుంచి తీసుకుపోయి యెవరికో అమ్ముకొన్నారు. తరువాత వారిస్థితి యేమైనదో నాకు తెలియదు. నేను చిరకాలం అక్కడవుండి తరువాత యీపట్టణంచేరి నాలుగేళ్ళనుంచి యీమఠంలో యోగినినిగా వున్నాను.

దృ:

ధర్మ—ఇతఁడీప్రాతఃకాలమునఁ జెప్పినకథ యిప్పుడు నిదర్శనముగా కనఁబడుచున్నది. ఈయిద్దఱు వసంతకులు నేకరీతిగా నున్నారు; ఆప్రకారముగానే యీయిద్దఱు లక్ష్మణులునుకూడ నచ్చునఁ బోడిచిన ట్లొకవిధముగా నున్నారు. దైవవశముచేత నకస్మాత్తుగా కలిసికొన్న వీరిద్దఱును వీరిజనకులు.—వసంతకా! నీవు మొట్టమొదట రామనాథపురమునుండియే కాదా కాశహస్తితీసికొని రాఁబడినావు?

చిన్నవ—నేను కాను. నేను మధురాపురమునుండివచ్చినాను.

ధర్మ—నీవు దూరముగా నిలుచుండు. మీలో నెవరెవరో నాకీభేదము తెలియకుండ నున్నది.

పెద్దవ—రామనాథపురమునుండి వచ్చినవాఁడను నేను మహాప్రభూ!

పెద్దల—ఈయనతోకూడా వచ్చినది నేను.

పెద్దవ—మమ్మిక్కడకు తీసికొనివచ్చి దేవరవారి కొప్పగించినది మీ మేనమామగారైన సుబలుఁడను మహావీరుఁడు. పల్లెవాండ్రవద్దనే మమ్మాయనకొని పెంచినారు.

సీత—మీయిద్దరిలో నెవరు యీమధ్యాహ్నం నాతో భోజనంచేసినారు?

చిన్నవ—నేను.

సీత—మీరు నాభర్తగారు కారా?

పెద్దవసం—అతఁడు నీభర్త కాఁడని నేను రూఢిగా చెప్పఁగలను.

చిన్నవసం—నేనును మధ్యాహ్న మీమాటయే యీమెతోఁ జెప్పినాను; ఈమె నామాట నమ్మినదికాదు.—ఓసుభద్రా! నేను

మధ్యాహ్నము నీతో నేమిచెప్పినానో స్మరణకు దెచ్చుకో; ఆ మాట నిజముచేయుటకు సమయమువచ్చుచున్నది.

విశ్వ—మీకు నావద్దపుచ్చుకొన్న చంద్రహారమదే.

చిన్నవ—అవును. ఎవరుకాదన్నారు?

పెద్దవ—ఈ చంద్రహారము నిమిత్తము నీవు నన్ను రాజభటుల కొప్పగించితివి.

విశ్వ—అవును కాబోలును.

సీత—నేను లక్ష్మణుని చేత మీకు ధనం పంపినాను. వాడు మీకిచ్చినాడు కాడు.

పెద్దవ—లేదు. నాచేత నీవు సొమ్ము పంపలేదు.

చిన్నవ—ఈరూపాయలమూట నాసేవకుఁడు తెచ్చి నాచేతి కిచ్చినాడు. మన మొకరిసేవకుని నొకరిసేవకునిగా భ్రమించుటవలన ఈచిత్రములన్నియు పుట్టినవి.

పెద్దవ—ఈధనము నేను నాతండ్రి ప్రాణరక్షణముకొఱ కిచ్చెదను.

ధర్మ—నీధనదాన మక్కఱలేకయే నీతండ్రికి మేము ప్రాణదానము చేసినారము.

ప్రభా—ఆవజ్రపుటుంగరము మీవేలిది నాది.

పెద్దవ—అవును. నీయుంగరమిదిగో నీవుపుచ్చుకో.

(అని యిచ్చుచున్నాఁడు)

చారు—ఓమహారాజా! దేవరవారు మాతో యీమఠంలోకి విజయంచేసి, సావకాశంగా సూపభోజనం చేసి, కొంచెం సేపు మా గృహావాసం చెయ్యవలెనని వేడుకొంటూవున్నాను. యీరోజున యిక్కడ పోగయి నానావిధాలుగా శ్రమపడ్డవారందరూ కూడా

లోపలకు దయచెయ్యవలెను; మేము మిమ్మల్నందరినీ సమాధానం చేసి పంపుతాను. ఓపుత్రులారా! మిమ్మల్ని యెడబాసి యిరవై సంవత్సరాలైనది; యింతకాలమునకు యెప్పుడూ యెదురుచూడనిదే మనమందరమూ వక్కచోట కలుసుకున్నాము గనుక లోపలికివెళ్ళి కొంచెంసేపు సల్లాపసౌఖ్యం అనుభవింతాము రండి.

ధర్మ—మిక్కిలి సంతోషముతో లోపలకువచ్చి మీసంభాషణవిని వేడుకపొందెదము.

(రాజును, చారుమతియు, వర్ధమానుఁడును, ప్రభావతియు, వర్తకుఁడును, విశ్వకర్మయు, పరిజనమును వెళ్ళుచున్నారు.)

చిన్నల—అయ్యా! బండిమీద యెక్కించడానికి తీసుకొని వెళ్ళిన మీసామాను పట్టించుకురానా!

పెద్దవ—నాది యేసామాను బండిమీఁద నెక్కించినావు!

చిన్నల—సత్రమువద్దనున్న మీసరకులు.

చిన్నవ—వాఁడు నాతో చెప్పుచున్నాడు. లక్ష్మణా! నీ యజమానుఁడను నేను. అవి తరువాత తీసికొని రావచ్చును. మాతో లోపలికి రా. ముందు నీసోదరుని కౌఁగిలించుకొని మీరిద్దఱునుకలిసి లోపలికిరండి. (పెద్దవసంతకుఁడును, చిన్నవసంతకుఁడును, సీతయు, సుభద్రయు, లోపలికి వెళ్ళుచున్నారు.)

చిన్నల—నీయజమానుడి యింటికాడ కొండంతమనిషివకత్తె కనపడ్డది. అది నన్నుచూచి నీ వనుకున్నది; నా వదినెగారు కాఁబోలును!

పెద్దల—యెలాగు భ్రమపుట్టకుండా వుంటుంది! సరిగ్గా నీవు నా అద్దంలో నీడలాగు వున్నావు. నీరూపాన్నిచూస్తే నేనూ అంద గాణ్నే అని తోస్తుంది. మనంకూడా లోపలకు వెళుదాము రా.

చిన్న—నీవు పెద్దవాడవు. ముందర నీవు నడువు.

పెద్దల—ఆభేదం మనకుతప్ప యెవరికీ తెలియదు. అందరికీ తెలియడానికి యేమిచేశాం!

చిన్నల—అందరికీ తెలియడానికి తరువాత ఉపాయమేమైనా ఆనవాలు వేసుకుంటాము. అందాకా నీవు ముందర నడువు.

(అని వెళ్లుచున్నారు.)

సంపూర్ణము.

———:o:———

బాళ్స ప్రెస్, రాజమండ్రి 1950.

22 స్త్రీ పునర్వివాహ వి॥ద్వి॥ వి॥
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సం॥
24 స్త్రీపునర్వివాహభూతవర్త మానస్థితులు

ఉపన్యాసములు–జీవితచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయ మహాసభ దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహారాధనవిమర్శనము
4 ఉపన్యాస మంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 జనకరాజు నవరత్నంగారి జీవచరిత్రము

సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహవ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక–విగ్రహము
5 నీతిచంద్రిక–సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమ స్త్రీ చరిత్రములు
9 జీసస్ చరిత్రము

ఆంధ్రకవుల చరిత్ర

పదియవ సంపుటము

పూర్వకాలపు కవులు 1వ భా॥
మధ్యకాలపు కవులు 2వ భా॥
ఆధునిక కవులు 3వ భా॥

స్వీయ చరిత్రలు

పదునొకండవ సంపుటము

1, 2 భాగములు కలసి

N. B. పై గ్రంథములన్నియు వాల్యూములుగాను, విడిగాను, కొనవచ్చును.

వలయువారు:—**కార్యదర్శి, హితకారిణీ సమాజము,**
**రాజమహేంద్రవరము,**
అని వ్రాసిన బడయగలరు.

బాన్సు ప్రెస్, కలర్ ప్రింటర్సు అండ్ బాన్సు మేకర్సు, రాజమండ్రి.

# సతీమణీవిజయము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
1950

[వెల రు. 0-4-0

శ్రీ రాజశేఖర విద్యాభూషణ రావుబహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥ భా॥
2 ,, రెం॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్

# సతీమణీవిజయము



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
1950

కాపీరైటు

# ఇందువచ్చు పాత్రములు.

చంద్రకేతుఁడు—కోసలదేశపురాజు.

వీరసేనుఁడు—చంద్రకేతునకులోఁబడిన లక్ష్మణపురసంస్థానాధీశుఁడు.

విక్రమసేనుఁడు—వీరసేనునికుమారుఁడు; సతీమణిభర్త.

సౌజన్యనిధి—చంద్రకేతుని మంత్రులలో నొకఁడు.

ధన్వంతరి—సతీమణితండ్రి: ఘనవైద్యుఁడు.

సునంద—వీరసేనుని రాణి; విక్రమసేనునితల్లి.

సతీమణి—ధన్వంతరి కూఁతురు; విక్రమసేనునిభార్య.

గుణవతి—చందనావతి కూఁతురు.

చందనావతి—కాశీనివాసురాలైన సుగుణవతితల్లి.

---

# సతీమణీవిజయము

పూర్వకాలమునందు కోసలదేశమును తన కయోధ్యాపురము రాజధానిగా సూర్యవంశపురా జయిన చంద్రకేతుఁడు పాలించుచుండెను. అతనిపాలనమునకు లోఁబడి యనేకసంస్థానాధిపతు లాతనికి కప్పము కట్టుచు సేవించుచుండిరి. ఆసామంతరాజులలో లక్ష్మణపురసంస్థానాధీశ్వరుఁ డయినవీరసేనుఁ డొకఁడు. అతఁ డాకస్మికముగా మృతినొందినందున, తత్పుత్రుఁ డయినవిక్రమసేనుఁడు చిన్నతనములోనే రాజ్యమునకు వచ్చెను. చంద్రకేతునకు వీరసేనునియందు మిక్కిలి ప్రేమ గనుక, అతని మరణవార్తను విన్నప్పుడు దుఃఖించి యాతనిపుత్రుని విద్యాబుద్ధులు చెప్పించి బాగుచేయ వలె ననెడియుద్దేశముతో వెంటనే రాజధానికి రమ్మని విక్రమసేనుని కాజ్ఞ పంపెను. విక్రమసేనుఁడు భర్తృమరణ దుఃఖితయైయున్న తల్లియొద్ద కూరుచుండి యుండఁగా సౌజన్యనిధి యనునాతఁడు రాజాజ్ఞను పట్టుకొని యయోధ్యనగరమునుండి వచ్చెను. కోసలదేశపు రాజు లాకాలమునందు నిరంకుశప్రభువు లగుటనందున వారియాజ్ఞోల్లంఘనము చేయుట ప్రాణాపాయకర మని యెఱిఁగిన దయి సాధ్వీమణి యైనయాసునంద పుత్రునియం దెంతప్రేమగలదయినను రాజాజ్ఞను మీఱ సాహసింపక పుత్రవియోగము సహింపలేక నాఁటిదినము తనభర్త మరల మృత్యువశుఁ డయినట్లు దుఃఖించుచు వెంటనే కొమారు నాతనివెంటఁ బొమ్మని యుత్తరువు చేసెను. అప్పుడు సౌజన్యనిధి మంచిమాటలతో నామెకు కొంతదుఃఖోపశమనము చేసి, పుత్రవియోగమునకు శోకింపకుండ బుద్ధిచెప్పి, చంద్రకేతుఁడు దయార్ద్రహృదయుఁ డనియు, విక్రమసేనునకు తండ్రిలేనిలోపము లేకుండ నతఁడు

పితృప్రతినిధినై పితృవాత్సల్యముతో సర్వవిధముల కాపాడుదుననియు, రాజొకయసాధ్యవ్యాధిచేత బాధపడుచున్నందున తండ్రియెడలఁ గలిగియుండిన సౌభ్రాత్రమునుబట్టి యిప్పు డీవిక్రమసేనుని పిలిపింప వలసివచ్చె ననియు, చెప్పి యామె నోదార్చెను. అప్పు డామె రాజున కసాధ్యవ్యాధి కలిగినందునకయి వ్యసనపడి, తన చెంతనున్న సతీమణి యనుచిన్నదాని నాతనికి చేతితోఁ జూపి, ఈచిన్నదాని తండ్రియే యిప్పుడు జీవించియుండిన పక్షమున రాజుయొక్క వ్యాధిని తప్పక కుదుర్చు నని చెప్పి, ఈచిన్నది ఘనవైద్యుఁ డని జగత్ప్రసిద్ధికెక్కిన ధన్వంతరికూఁతు రనియు, అతఁడు తనయవసానకాలమునందు తల్లి లేని బిడ్డయైనయీసతీమణిని తన కప్పగించినందున నాఁటినుండియు తా నీచిన్నదానిని పుత్రికాప్రేమతో పెంచుచుంటి ననియు తల్లి దండ్రుల సుగుణములు పట్టుపడుటచేత బహుబుద్ధిమంతురా లయి యీచిన్నది యెల్లవారిచేతను మంచి దనిపించుకొనుచున్న దనియు సతీమణియొక్క చరిత్రమును కొంత మాటల ధోరణిని చెప్పెను. ఆమె యీమాటలు చెప్పుచున్నంతసేపును సతీమణి తల వంచుకొని నిలు చుండి కన్నుల నీరు పెట్టుకొనుచుండెను. అదిచూచి సునంద పోయిన వారినిమిత్తమయి యడేపనిగా దుఃఖించుట మంచిదికాదని చెప్పి యాచిన్నదాని నూరడించెను.

అప్పుడు విక్రమసేనుఁడు తల్లిని జూచి తనప్రయాణమునకు సెలవు వేఁడఁగా ఆమె కుమారుని బహువిధముల దీవించి కన్నులనీరు కాలువలుకట్ట ప్రేమాస్పదుఁడై యున్నయాచిన్నవానిని సౌజన్యనిధి కొప్పగించి "నాయనా! ఈచిన్నవాఁ డీనాఁటి కెన్నఁడును తల్లిదండ్రులను విడిచి పరులయొద్ద నొంటిగా మెలఁగినవాఁడు కాఁడు. లోక వ్యవహార మెఱుఁగనియీబాలకుని కెల్ల బుద్ధి చెప్పి మంచివానినిగా

దిద్దుకొందునో మీదే భారము.” అని చెప్పి వెళ్ళుటకు సెలవిచ్చెను. ఆచిన్నవాఁడు వెళ్ళునప్పుడు సతీమణినిజూచి, “నిన్ను పుత్రికాప్రేమతో జూచుచుండెను నాతల్లిగారి సంరక్షణము నెప్పుడును నీ వేమఱక నేను దగ్గఱలేనిలోపము కనఁబడకుండఁ జేయుము” అని చెప్పి తల్లి నప్పగించెను.

సతీమణి చిరకాలమునుండి మనసులో విక్రమసేనుని కామించి యుండెను. ఇంతకుముందు దాచిన్నది తలవంచుకొని యేడ్చినది విక్రమసేనుఁడు తన్నువిడిచిపోవుననియే కాని తండ్రినిమిత్తముకాదు. ఆమె తండ్రియందు మిక్కిలి ప్రేమకలదే యయినను, విక్రమసేనుని యందామెకుఁ గలప్రేమ యంతకంటె నధికమయినది. తనకు ప్రేమాస్పదుఁడయి కన్నుల యెదుటఁ గానఁబడుచున్న యతఁడు తన్నుఁబాసి శీఘ్రముగానే వెడలిపోవ నున్నాఁడని తలఁచుకొనుట వలనఁ గలిగిన యీపెద్దదుఃఖములో, ఎప్పుడో మరణమునొంది రూపాదులుసహితము తిన్నగాస్మృతికి రాక సగము మఱచి యున్న యీ తండ్రివిషయ మయినదుఃఖము తోఁచక యడఁగిపోయెను.

సతీమణికి చిరకాలము నుండి విక్రమసేనునిమీఁద ననురాగము కలదుకాని యామె తాను బీదకుటుంబమున పుట్టినదాన ననియు, అతఁడు మహావంశమునఁ బుట్టి కిరీటాధిపత్యమున కర్హమయినవాఁడనియు, మాత్రము మనసులో నెప్పుడును మఱచియుండినదికాదు. ఆమె తనపూర్వులు సుప్రసిద్ధులు కాకుండుటయు నాతనిపూర్వులందఱును రాజ్యభారధూర్వహులయి యుండుటయుఁ దలపోసి, ఆతనికిని తనకును గలయంతరమును విచారించి నిరాశచేసికొని, ఆకాశమునందున్న చంద్రునిఁ గామించుట యెంతప్రయోజనకరమో తా నాతని కామించుటయు నంతేప్రయోజనకర మని భావించి సిగ్గుపడు

విడుచుచు, భార్యగాఁ గాకపోయినను సేవకురాలుగా నయిన నుండి యాతనిసేవయందే తనదినములు గడపవలె నని నిశ్చయించుకొనెను. అతఁడును తనభర్త యనునన్నయాశ యామెమనస్సులో లేకపోయినను, నవ్వుమొగముతోను నొసలమ్మోదలను మించిన కురులతోను తేనియ లొలుకుమాటలతోను సదా యతఁడు కన్నులయెదుర మెలఁగుచుండుటచేత నామె కొకవిధ మయినయానందము కలుగుచుండెను. అందుచేత నిప్పు డాతనివిగ్రహ మామెమనస్సున పాదుకట్టి యామె హృదయమును దుఃఖసముద్రములో ముంచివేయఁ జొచ్చెను.

ధన్వంతరి యమోఘము లైనకొన్నిదివ్యౌషధములను దప్ప మరణకాలమునందుఁ దనకొమారితకు మరేదియు నిచ్చిపోలేదు. ఆదివ్యౌషధములలో నొకటి కోసలదేశపురాజగుచంద్రకేతుఁడు బాధపడుచున్నదీర్ఘరోగమున కమోఘ మగునమందు. సౌజన్యనిధి సునందతో రాజరోగమునుగూర్చి చెప్పినప్పుడు తనప్రియుఁడు పోఁ బోవుచున్న యయోధ్యానగరమునకు దానుగూడ పోయి రాజునకు చికిత్సచేసి రోగనివారణము చేయుటవలన లాభము పొందవలయునన్న యూహ సతీమణియొక్క హృదయమునం దంకురించెను. అయినను రాజవైద్యులందఱును రాజుయొక్క వ్యాధి యసాధ్య మయిన దని నిశ్చయించినతరువాత లేఁతవయస్సులో నున్నయొక్కసుందరి పోయి తా నావ్యాధిని నిర్మూలింపఁ జేసెద నని చెప్పినపక్షమున, తనయొద్ద నున్న దివ్యౌషధమహిమ యెట్టిదయినను రాజును దదాస్థానవైద్యులును నమ్మి పనిచేయనిత్తురా యన్న సంశయముమాత్ర మామెమనస్సును బాధించుచుండెను. కాని యామె యంతటితో నిరుత్సాహురాలు కాలేదు. ఆమె కాదివ్యౌషధమునందున్న దృఢవిశ్వాసమునుబట్టి తన్ను రాజునకు చికిత్సచేయ సంగీకరించినపక్షమున నతఁడు తప్పక స్వస్థ

తను పొందు ననియు, అందువలనఁ దన యదృష్టము పండి తనకు విక్రమసేనుని రాణి కాఁగలభాగ్యము పట్టినను పట్టవచ్చు ననియు, నమ్మి తా నేలాగున నయిన నయోధ్యకుఁ బోవలె నని నిశ్చయము చేసికొని యుండెను.

ఇట్లుండఁగా విక్రమసేనుఁ డయోధ్యకుఁ బోయినకొంతకాలమునకు దాసియొకతె సునందయొద్దకు వచ్చి సతీమణి తనలో తాను మాటాడుకొనుచుండఁగా పొంచియుండి వినె ననియు, ఆమాటలవలన నాచిన్నది విక్రమసేనుని కామించియున్నట్లును తా నాతని నిమిత్తమయి యయోధ్యకు పోఁదలఁచి యున్నట్లును తెన కర్థమయ్యెననియు ఆమెతోఁ జెప్పెను. ఆమాటలు విని యామె యప్పు డేమియు ననక సతీమణిని దనతో నొక్కసారి మాటాడిపొమ్మని చెప్పుమనిమాత్రము దాసితో చెప్పి దానిని పంపివేసెను.

ఇట్లు దాసిని పంపివేసి యొంటిగా నుండి సతీమణిసంగతినిదలఁచుకొన్నప్పు డామెకు తాను పడుచుతనములో వీరసేనుని కామించిన నాటిచర్యలు స్మరణకు వచ్చి యౌవనదశలో తానునట్టియవస్థనేపడితి ననియు, కేతకీకుసుమమును కంటకము లంటియుండునట్లుగా యౌవనదశను కామపీడ యాశ్రయించి యుండుట నైసర్గిక మనియు, అది యప్పుడు దోషముగాఁ దోఁచకపోయినను మానవదేహమునుధరించిన వారికెల్ల నీదోష ముండునదియే యనియు, తలపోయు చుండెను. ఈప్రకారముగానాలోచించుకొనుచున్నసమయములో సతీమణియామె వద్దకు వచ్చెను. ఆచిన్నది కనఁబడఁగానే సునంద "సతీమణీ! నేను నీకు తల్లినని నీ వెఱుఁగుదువుగదా" అనెను. అనఁగానే వెలవెలపోయి సతీమణి "అమ్మా! నీవు నాయజమానురాలవు" అని యూరకుండెను. 'నీవు నాకూఁతురవు. నేను నీకు తల్లిని. నామాటల కులికిపడి ఆలా

గున నావంక తెల్లబోయి చూచుచున్నావేమి?" అని యామె 'తల్లి' యన్నమాట రెట్టించి పలికెను. అందుమీఁద సతీమణి తాను విక్రమసేనుని కామించినమాట సునంద గ్రహించిన దేమోయని భయపడి, మనస్సు తొందరపడ చూపులు చంచలింప, "అమ్మా! నన్ను క్షమింపుము. మీరు నాకు తల్లియు కానేరరు; మీకు నేను కూఁతురను కానేరను. లక్ష్మణపురాధీశ్వరుఁడు నాకెట్లు సోదరుఁడగుట సంభవించును?" అని యాచిన్నది మాట తడఁబడ పలికెను. 'కూఁతురవు కాకపోయిన నీవు నాకోడలవు కావచ్చును. కూఁతురు, తల్లి, అన్న మాటలు నీమనస్సున కింపుగా నుండకపోవుటనుబట్టి నాకోడలవనియే నీయభిప్రాయ మనుకొనెదను. ఓసతీమణీ! నాకుమారుని మీఁద నీకు ప్రేమ గలదా?" అని యామె యడిగెను. అడిగినమాట కుత్తరము చెప్పక సతీమణి "అమ్మా! నాతప్పు క్షమింపుఁడు" అని భయముతో పలికెను. సునందయు నంతతో నూరకుండక "ఓసతీమణీ! నాకుమారునిమీఁద నీకు ప్రేమ గలదా" అని యడిగిన ప్రశ్ననే మరల నడిగెను. "అతనిమీఁద మీకు ప్రేమ లేదా" అని ప్రశ్న వేసి యాచిన్నది యడిగినమాట కుత్తరము చెప్పక తప్పించుకొనుటకయి ప్రయత్నించెనుగాని సునంద యంతటితో విడిచిపెట్టక "సతీమణీ! నాయొద్దను నీవెట్లు దాచుటకయి ప్రయత్నింపక నీ మనస్సులో నున్నది చెప్పివేయుము. నీనోరు చెప్పకపోయినను నీచేష్టలు నీకుఁ గలవలపును బట్టబయలు చేయుచున్నవి" అని స్పష్టముగా చెప్పివేసెను. అందుపైని సతీమణి యామెపాదములమీఁదఁబడి తనమనస్సునందలి తగులము యొప్పుకొని, ముఖమున లజ్జాభయములు తోఁప వినయపూర్వకముగా క్షమింప వేఁడుకొని, ధనవ్యత్యాసమును బట్టి విక్రమసేనుని వరించుటకు నాకు గలయనర్హతను దెలుపుటయే కాక

తానుకాపాడించి యున్నసంగతి యాతనికి తెలియ దన్నమాటకూడ చెప్పివేసెను. అప్పుడు సునంద "నీ వీమధ్య నయోధ్యాపురమునకుఁ బోవ నుద్దేశించుకోలేదా?" అని యాచిన్నదాని నడిగెను. సౌజన్యనిధి రాజుయొక్క రుగ్నతను జెప్పినప్పుడు తనమనస్సులో నట్టియుద్దేశము పుట్టినమాట వాస్తవమే యని సతీమణి యొప్పుకొనెను. "అయోధ్యాపురమునకు నీవు పోఁదలఁచుకొన్న దందుకొఱకా? ఓ సతీమణీ! నీవు నాతో నిజము చెప్పుము." అని యామె యాచిన్నదానినినిర్బంధముగా నడిగెను. అడుగఁగానే సతీమణి "అమ్మా! నాకయోధ్యాపుర యాత్రావిషయ మయినబుద్ధి పుట్టుటకయి మీకుమారుఁడే కారణము. అతఁడే నాహృదయపీఠమునందు నిలిచి యుండకపోయినపక్షమున, అయోధ్యపేరును మందుపేరును రాజుపేరును నేను తలపెట్టక పోయియే యుందును." అని యున్నది యున్నట్లు ధారాళముగాఁ జెప్పివేసెను. తనయిష్టమునుగాని యనిష్టమునుగాని తెలుపక సునంద యాచిన్నది చెప్పిన దంతయు విని, కడపట "నీ కామౌషధమహిమ యం దంతనమ్మక మున్నదా?, యనిమాత్ర మడిగెను. అప్పుడు సతీమణి యాదివ్యౌషధము తనతండ్రియొద్ద నున్న మహౌషధములలో నెల్ల నుత్తమోత్తమ మైన దనియు, అది యతఁడు చిరకాలము మహాత్ముల నాశ్రయించియు స్వానుభవము నుపయోగించియుకష్టపడి సంపాదించిన సిద్ధౌషధ మగుటచేత దానియోగము నెవ్వరికిని జెప్పక మరణకాలమునందు ప్రాణాధికురా లయినతనకు రహస్యముగా నుపదేశించె ననియు, ఆమెకు నమ్మకము పుట్టునట్లుగాఁ జెప్పెను. ఆమాటలు విన్నపిమ్మట సునంద కొంచెమునే పాలోచించి ధన్వంతరియొక్క మరణసమయమునందు తా నాతనికొమారితయొక్క యోగక్షేమముల విషయ మయి సాధ్యమయినంతశ్రద్ధ వహించెద నని వాగ్దానము

చేసియుండుట తలంచుకొని రాజుయొక్క క్షేమమునుగూడ ముఖ్యముగాఁ గోరియున్నదిగాన సతీమణియొక్క ప్రయత్నమునకు ప్రతిబంధములు కల్పింపక, అయోధ్యకు పోయి యథేచ్ఛముగా పనిచేయుటకయి యాచిన్నదానికి సెల విచ్చి ప్రయాణమునకు వలయుధనమును తగినపరివారమును గూడ సమకూర్చెను. అందుకు సతీమణి పరమానందభరితురాలయి యామెకు నమస్కారములుచేసి యామెచే ననేకాశీర్వచనములను పొంది, రాజున కారోగ్యమును గలిగించి యభీష్టఫలసిద్ధిని పొందు మని యామెవలన కడపటిదినమునను బడసి, అయోధ్యకుఁ బోవుటకు బయలుదేఱెను.

సతీమణి కొన్నిదినములలో సుఖముగా నయోధ్యచేరి, సౌజన్యనిధియొక్క సాహాయ్యముచేత శీఘ్రకాలములో రాజసందర్శనము చేయఁ గలిగెను. కాని యాచిన్నదానిప్రయాణముమాత్ర మంతటితో సఫలము కాలేదు. ఆయువతివలన నౌషధము పుచ్చుకొనుటకు రాజొకపట్టున నొప్పుకొనలేదు. ఆమె తాను లోకప్రసిద్ధుఁడైన ధన్వంతరియొక్క కూఁతురనియు, ఆమందు తనతండ్రి యావజ్జీవమును ధారపోసి శ్రమపడి సంపాదించిన తిరుగులేని సంజీవనౌషధమనియు, చెప్పి యాయమూల్యౌషధప్రయోగముచేత మూఁడుదినములలో వ్యాధి లొంగకపోయినపక్షమున తనప్రాణముల నిచ్చెద నని శపథము పలికినమీఁదట తుదకు రాజాయౌషధసేవచేయుట కంగీకరించెను. కాఁబట్టి మూఁడుదినములలో రాజువ్యాధియైనను పోవలెను సతీమణితలయైన పోవలెను. నిజముగా వ్యాధియు నిర్మూలించినపక్షమున, కావలసిన వస్తువాహనముల నన్నిటి నిచ్చుటయే కాక యామె కోసలదేశములో నెవ్వనిఁ గోరునో యాపురుషుని భర్తగాను ననుగ్రహించినట్లుకూడ రాజు వాగ్దానము చేసెను. రాజును

స్వస్థునిగాఁ జేయుటవలన సతీమణి యపేక్షించినదియు వరలాభమే కాని ధనవస్తువాహన సమృద్ధి కాదు.

సతీమణి కాయౌషధమునందుఁ గలనమ్మకము వ్యర్థము కాలేదు. మూడుపూటలు సేవించునప్పటి కెల్లను రాజుయొక్క శరీర స్థితిలోఁ గొంతగుణ మగుపడెను; మితిపెట్టినమూఁడుదినములును మందు పుచ్చుకొనునప్పటికి రోగము నిశ్శేషముగా కుదిరి రాజునకు సంపూర్ణారోగ్యము కలిగినది. అప్పుడు రాజు నిర్భరానందపరవశుఁ డయి తనయాస్థానమునందుఁ గలరూపయౌవనగుణసంపన్ను లయిన రాజపుత్రుల నందఱిని రావించి వారిని సతీమణికిఁ జూపి, ఇష్ట మున్న యెడల వీరిలో నొక్కరిని భర్తగా వరింపవచ్చు నని చెప్పెను. ఆమె మనోవల్లభుఁడయినవిక్రమసేనుఁ డాగుంపులోనే యున్నందున, భర్తృవరణమునం దామెకు కష్టములేకపోయెను. అందుచేత సతీమణి "యితఁడే నావల్లభు" డని విక్రమసేనునిజూపి అతనితో "ఓ ప్రాణ నాయకుఁడా! నేను మిమ్ముఁ బరిగ్రహించెద నని సాహసించి చెప్పఁ జాలను; నన్నే మీకు సమర్పించుకొనుచున్నాను. నాయావజ్జీవమును నన్ను సేవకురాలినిగాఁ గ్రహించినాసేవనంగీకరింపుఁడు" అని చెప్పెను. అంతట రాజాతనిని జూచి "ఓ విక్రమసేనా! నీ వీచిన్నదానిని భార్యనుగా స్వీకరింపుము. ఈమెయే నీకు ధర్మపత్ని" అని యాజ్ఞాపించెను. అప్పుడు విక్రమసేనుఁడు సందేహింపక చంద్రకేతునితో సతీమణి బీదయింటి వైద్యునికూఁతు రనియు, తండ్రిపోయినప్పటినుండియు తమ యింటనే యుండి తనతల్లి సంరక్షణలో పెరిగిన దనియు, అందుచేత తమ కాచిన్నది పరిచారికవలె నుండినదనియు, చెప్పి యామెను పాణిగ్రహణము చేసుకొనుటకు తన కిష్టములేదని తెలియఁజేసెను. అతఁడు చూపిన తిరస్కారభావమును పలికిన నిరాకరణవచనమును మనస్సున

నాటుకొనఁగా సతీమణి రాజువంకఁ జూచి "ఓదేవా! ఏలినవారి దేహము స్వస్థపడినందుకు నాకు సంతోషముగా నున్నది. నాకంతే చాలును. తక్కినవిషయ మయి దేవర శ్రమపడవలసినపని లేదు." అని విన్నవించెను కాని రాజు తనయాజ్ఞోల్లంఘన మెవ్వరును చేయరా దని చెప్పి, ఆదినముననే పురోహితుని రప్పించి వారిరువురకును బలవంతముగా విధ్యుక్త మయినవివాహమును జేయించెను. ఆవివాహమువలన వధూవరులలో విక్రమసేనునకును మనస్సునకు సుఖము కలుగలేదు ; సంసారము చక్కఁబడు నన్నయాశ లేకపోవుటచేత సతీమణికిని సంతోషము కలుగలేదు. ఆమె ప్రాణత్యాగమున కయిన నొప్పుకొని యభీష్టసిద్ధిని పొంది కోరినభర్తను వరించినను, భర్తనిప్పించుటవలె భర్తయొక్కయనురాగము నిప్పించుట కోసలాధీశ్వరుని చేతిలో లేనందున ఫలానుభవము లే దనియు యందనిమ్రానిపండు తన దనుకొనుదానివలె గ్రుక్కిళ్ళుమ్రింగుచు చూచి సంతోషింపవలసినదాయెను.

విక్రమసేనుఁడు వివాహముకాఁగానే భార్యను జూచి తా నయోధ్యను విడుచుట కయి రాజువద్ద సెలవు పొందు మని చెప్పెను. ఆమె రాజును ప్రార్థించి కోరినప్రకారముగా సెలవిప్పింపఁగానే విక్రమసేనుఁడు భార్యను జూచి, వివాహ మాకస్మికముగాఁ జరిగినందున తనమనస్స్వాస్థ్యము చెడిపోయిన దనియు, అందుచేత తాను దూర దేశయాత్ర పోనుద్దేశించుకొన్నాఁడ ననియు, చెప్పి, ఆమెను తనతల్లి యొద్దకు పోయి యుండవలసిన దని యాజ్ఞాపించెను. అందుమీఁద నాయువతి మనస్సులో ఖేదపడి, దుఃఖముపయికి కనఁబడనీక భర్తను జూచి ధైర్యముతో "ఓప్రాణేశ్వరా ! నే నెప్పుడును తమయాజ్ఞకు బద్ధురాలనే. జన్మముచేత మీతో సమానురాల నయ్యెదు భాగ్యము

నా కీశ్వరుఁడు కలిగింపక పోయెనుగదా యని సదా పరితాప పడుచు మీా విధేయసేవకురాల నయి యీశరీరములో జీవమున్నంత వఱకు మీాయనుగ్రహమును సేవను గోరి వేచియుండెదను'' అని చెప్పి కన్నులనీరు నించెను. ఆమెయొక్క మాటలుగాని కన్నీరుగాని యాతని కఠినహృదయమును కరఁగింపలేకపోయినందున, అతఁడు కొంచెమయి నను జాలిపడనివాఁడయి మాఱుమాట చెప్పక తాను పోనుద్దేశించు కొన్న దేశముపేరయినను భార్యతోఁ జెప్పక యామెను విడిచి పోయెను.

భర్తయొక్క యాజ్ఞానుసారముగా సతీమణి లక్ష్మణపురమత్త వారియింటికి వచ్చెను. ఆమె రాజప్రాణమును కాపాడి కోరినభర్తను పొందియే స్వగృహమునకు వచ్చినను, విచారగ్రస్తురాలయి నిరుత్సాహముతో దీనురాలయి యత్తగారిపాలఁ బడవలసినదాయెను. ఆమె భర్తృగృహము చేరునప్పటికి కక్కడకు హృదయభేదనము చేసెడు పిడుగువంటి యుత్తరమొక్కటి విక్రమసేనునివద్దనుండివచ్చియుండెను.

ఉత్తమురా లయిన యానునంద తనకుమారుఁడు కోరితెచ్చు కొన్న యుత్తమకులీనురా లయిన కోడలి నాదరించినట్టే సతీమణి నాదరించి మంచిమాటలు చెప్పి కొడుకు చేసిన యనాదరణ మఱచు నట్లుగా నాచిన్నదాని నోదార్చెను. కాని యామెచేసిన యాదరము వలన సతీమణి మనస్సులోసంతోషింపక, "అత్తా! నాప్రాణనాథుఁడు దేశములపా లయిపోయెను. ఇఁక నే నాధన్యుని నవ్వుమొగమును జూడను గాఁబోలును!'' అని కంట తడిపెట్టెను. అప్పుడామె కొమా రుఁడువ్రాసిన యుత్తరమును దీసి "నాచేతియుంగర మెప్పుడు నీచేతికి వచ్చునో నన్నప్పుడుమాత్రమే భర్తయని పిలువుము. ఆయప్పు డనె డుకాల మెప్పుడును రాకుండు నని నేను నమ్మెదను'' అని దానిలో

భార్యనుగూర్చి యత్తఁడు వ్రాసినభాగమునుజదివెను. ఆమాటలువినఁగానే గుండెలు పగిలి యాచిన్నది "ఇది వజ్రకఠిన మయినవాక్యము" అని పలుకుచు మొదలునఱికిన కదళీతరువువలె నేలఁ గూలఁబడెను. అప్పుడు సునంద కోడలిని కౌఁగిలించుకొని లేవనెత్తి శాంతత వహింపవలసిన దని ధైర్యము చెప్పుచు "నాకొడు కిప్పుడు దేశాంతరము పోయినందున నీవే నాబిడ్డ" వని యనునయించి దుఃఖోపశమనము చేసెను. కాని మనస్సున కూరట కలుగక, సతీమణి నేల చూచుచు బొటబొట కన్నీరు కార, భర్తయుత్తరమును చేతఁబట్టుకొని చూచి "నాకు భార్య లేనంతవఱకు నాకు కోసలదేశములో నేదియు లేదు అన్న వాక్యమును జదివెను. ఆమాట లందున్నవా యని యత్తగారు ప్రశ్న వేసెను. ఉన్నవని చెప్పి కోడ లాపయిని నోట మాటరాక చిత్రప్రతిమవలె నిశ్చేష్టురాలయి యూరకుండెను.

మఱునాఁటి ప్రాతఃకాలమున సతీమణి యెక్కడ వెదకినను కానఁబడలేదు. ఆచిన్నది యిల్లు విడిచి వెళ్ళునప్పు డొకయుత్తరము వ్రాసి యొకదాసిచేతి కిచ్చి, అది తాను వెళ్ళినతరువాత సునందచేతి కిమ్మని చెప్పిపోయెను. ఈయుత్తరములో విక్రమసేనుఁడు తనయిల్లును దేశమును విడిచి దూరదేశములపా లగుటకు తాను కారకురా లయినందున కెంతయుఁ జింతించుచున్నా ననియు, తాను జేసినయీపాపమును పోఁగొట్టుకొని లోకనిందను తొలఁగించుకొనుటకయి విశ్వేశ్వరస్వామిసందర్శనార్థము తానిప్పుడు కాశీయాత్ర పోవుచున్నా ననియు, అతఁ డంతగా ద్వేషించుచున్నభార్య మరల రాకుండ దేశాంతరము పోయిన దని తెలిపి విక్రమసేనుని స్వగృహమునకు రప్పించి సుఖపడున ట్లు చేయవలసిన దనియు, అత్తగారిపేర వ్రాసెను.

అయోధ్యాపురమును విడిచినతరువాత విక్రమసేనుఁడును తిన్నగా కాశీపురమునకే పోయి, కాశీదేశపురాజువద్ద సేనలో కొలువు కుదిరి, ఆరాజునకును మగధదేశపురాజునకును జరిగిన యుద్ధములో తనశూరత్వమును గనఁబఱచి తనరాజునకు గెలుపు కలిగించి మహాప్రసిద్ధుఁడయి యుండెను. ఇట్లుండఁగా సతీమణి దేశము విడిచిపోయిన దనియు, ఇఁక నీవు స్వగృహమునకు వచ్చి సుఖముగా నుండవచ్చు ననియు, అతనికి తల్లివద్దనుండి యుత్తరము వచ్చెను. ఆయుత్తరమును జూచుకొని యతఁడు స్వదేశమునకుఁ బ్రయాణ మగుచున్నసమయములోనే సతీమణియు యోగినీవేషముతోఁ బోయి కాశీపురమున ప్రవేశించెను. సతీమణి కాశీపురము చేరి యాపట్టణములో యాత్రార్థము వచ్చినయితరదేశపుస్త్రీలకు బసలు మొదలయిన విచ్చి యాదరణచేసెడి పుణ్యాత్మురా లయినయొకస్వజాతివితంతువు కల దని విని ఆమెయింటికిఁ బోయెను. ఆమెయు సహజసౌజన్యముతో పరదేశము నుండి వచ్చినయాసతీమణిని సత్కరించి, తనయింట భోజనవసతులు కల్పించి యాదరించెను. ఆమె భోజనము లయినతరువాతసతీమణితో నానావిషయములనుగూర్చి మాటాడుచు, నేటిసాయంకాలము రాజుయొక్క సేన లూరిబయలను రెండువ్యూహములుగాఁ జేరి కృత్రిమ యుద్ధమును జేయఁబోవుచున్నవి చూడవచ్చెదవా యని యడిగెను. ఆమె యాప్రసంగములో తమ రాజుసేనలో కోసలదేశపురాజపుత్రుఁ డొకఁడు సేనాధిపతిగా నున్నాఁడనియు, అతనిపేరు విక్రమసేనుఁ డనియు, అతఁ డీమధ్యను జరిగినయొకయుద్ధములో నసమానశౌర్యమును జూపి మహాపరాక్రమశాలియని పేరుపొందె ననియుకూడఁ జెప్పెను. ఆమాటలు విన్నపిమ్మట సతీమణికి రంగభూమికి రమ్మని వేఱుగఁ బిలువవలసిన యావశ్యకమే లేకపోయెను. అప్పుడు వారిరువు

రును సేనావ్యూహమును జూచుటకు బయలుదేఱిరి. వారు పోవు నప్పుడు త్రోవపొడుగునను విక్రమసేనునిగూర్చియే ప్రసంగించుకొను చుండిరి. రంగభూమి చేరినతరువాత విక్రమసేనునిమొగము చూచు నప్పటికి సతీమణి కొక్కసారిగా సంతోషమును దుఃఖమునుగూడ కలి గెను. అప్పు డారాజవితంతువు సతీమణిని జూచి 'ఇతఁడు చక్కని వాఁడు కాఁడా?' అని యడిగెను. "అవు నతఁడు మిక్కిలి చక్కని వాఁడే. ఇతనియందు నా కెంతో యిష్టముగా నున్నది." అని సతీ మణి ప్రత్యుత్తరము చెప్పెను. ఆవితంతువు మరల వచ్చునప్పుడును సతీమణితో విక్రమసేనుని కథలనే చెప్పఁజొచ్చెను. అయోధ్యానగర ములో నాతనికి బలవంతముగా వివాహము చేయుటయు, అతఁడు నిర్దయుఁడయి చేసికొన్న భార్యను విడిచిపెట్టి వచ్చి యచ్చట సేనలో కొలువుకుదురుటయు, లోనుగాఁ గలతనదురదృష్టకథను జెప్పుచున్న ప్పుడు సతీమణి శాంతభావమును వహించి శ్రద్ధతో వినుచుండెనుగాని యామె యాకథను మార్చి క్రొత్తకథను జెప్ప నారంభింపఁగానే యందలిప్రతిపదమును మనస్సులో శూలమువలె నాటుకొనఁగా సహ నము వహించి వినలేకపోయెను.

ఇప్పు డామె యారంభించినకథ విక్రమసేనుఁడు తనకొమార్తెను మోహించుటను గుఱించినది. విక్రమసేనుఁడు సతీమణిని వివాహము చేసికొనుట కిష్టము లేనివాఁడయినను, బొత్తిగా వివాహ మాడుటకే యిష్టము లేనివాఁడు కాఁడు. అతఁడు కాశీనగరమునందు సతీమణి బస యిచ్చి యాదరించినచందనావలియొక్కయింటిసమీపమునందు వాసము చేయుచున్నందున, ఆమెపుత్త్రియైనగుణవతి యనుపేరు గల రూపవతియైనయువతిని మోహించెను. అందుచేత నతఁడు గుణవతి యొక్కగుణరూపలావణ్యాదులనుగూర్చి పద్యములు చెప్పి చదువుచు,

చందనావతియింటికి కప్పుడప్పుడు వచ్చి గుణవతి యనుసార్థకనామము గలయామెకుమారీరత్నమును తన్ను వివాహ మాడు మని ప్రార్థించు చుండును. అతనికి విధ్యుక్తముగా వివాహము చేయఁబడిన ధర్మపత్ని జీవించి యున్న దని యెఱిఁగిన దయినందున, గుణవతి యాతనిప్రార్థన నంగీకరింపక యాతని కెంతమాత్రమును ప్రోత్సాహము కలిగింప కుండెను. గుణవతి చిన్నప్పటినుండియు తల్లిదండ్రులయొక్కమంచి శిక్షలోఁ బెరిగిసద్వర్తనము నేర్చుకొన్నది. ఆమెతల్లి యైనచందనావతి యిప్పు డంత ధనికురాలుగా నుండక పోయినను గొప్పవంశమునఁబుట్టి పూర్వము విశేషభాగ్య మనుభవించి యుండినది. ఆమెతండ్రియు కాశీరాజుసేనలో నాయకుఁడుగా నుండి వీరమరణము నొందెను. చందనావతి యీసంగతు లన్నిటిని సతీమణితోఁ జెప్పి, తనకొమారిత యొక్కగుణసంపదను గొంత శ్లాఘించి, ఆమె కట్టిసుగుణములు కలుగుటకు తాను చిన్నప్పటినుండియుఁ జెప్పిన విద్యాబుద్ధులు కారణము లని చెప్పిఁ కట్టకడపట విక్రమసేనుఁడు మఱునాఁటియుదయకాలము నందే కాశీకానగరమును విడిచి వెడలిపో నున్నందున నొక్కసారి యీరాత్రి దర్శన మయిననిచ్చి క్షణకాలముమాటాడ ననుగ్రహింప వలసినదని యతఁడు గుణవతికిఁ బలుమాఱుసందేశములు పంపు చున్నాఁడనికూడఁ జెప్పెను.

ఈకథను వినుటవలన సతీమణిమనస్సున కెంతో నొప్పి కలిగినను, ఆమె యంతటితో నిరుత్సాహురాలుగాక యిందువలనఁ దన భర్తయొక్కపొందును గలిగించుకోవచ్చునని యొకయుపాయ మాలోచించుకొని, తానే భర్తచేత విడిచిపెట్టఁబడిన సతీమణిననియు తన్నే యాతని కయోధ్యరాజు బలాత్కారముగా వివాహము చేయించెననియుఁ జందనావతితోఁ జెప్పి, "నాయందు దనుగ్రహించి మీదను

మీపుత్రికయు నేటిరాత్రి విక్రమసేనునిరాక కంగీకరించి, గుణవతీ స్థానమున నన్నుంచవలయును" అని యామెను దైన్యముతో వేడుకొనెను. తా నీమాలువేషము వేసికొని భర్తృసందర్శనము చేయం గోరుట యేలాగున నయినం దానాతనివ్రేలియుంగరమును గైకొనవలయు ననియు, అయుంగరమును దనయొద్దనుండి తీసికోం గలిగినపక్షమున త న్నాతఁడు భార్యనుగా నంగీకరించెదనని యుత్తరము వ్రాసెననియు, సతీమణి యామెతో వివరముగాం దెలిపెను.

కొంతవఱకు భాగ్యహీనురాలయిన సతీమణియొక్క దుర్దశను వినుటచేత జాలిపుట్టియు కొంతవఱకు భర్తృసమాగమమును సమకూర్చినపక్షమున నామె యిచ్చెద నన్నబహుమానమునందాశ పుట్టియు చందనావళియు తత్పుత్రి యగుగుణవతియు సతీమణి కీవిషయమునం దమచేతనయిన సాహాయ్యమునంతను జేసెదమనియొప్పుకొనిరి. అందుచేత వెంటనే యామె వారిచేత విక్రమసేనునకు సతీమణి స్వదేశములో మరణము నొందినట్లు చూచినవారు వచ్చిచెప్పిరని వర్తమానము పంపించి, ఆరాత్రివచ్చి గుణవతినిజూచి మాటాడిపోవచ్చునని తెలియం జేయించెను. ఇట్లు చేయించుటలో సతీమణియొక్క ముఖ్యోద్దేశము భార్యయొక్క మరణవార్త నిశ్చయముగాం దెలిసెనేని యతఁడు తప్పక గుణవతిని వివాహమాడుటకు సంశయింపక యంగీకరించు ననియు, ఆయంగీకారసమయమునందు గుణవతీవేషముతో నున్న తా నాతనివలన వాగ్దానముమాత్రమే కాక వాగ్దానముతోంగూడ నుంగరమును సహితము పొందవచ్చు ననియు, తప్ప వేఱేమియుం గాదు. ఆయుంగర మెట్లయినం దనచేతం జిక్కినా యతఁడు తప్పక తనకు దక్కినవాఁడే యని యామెకు దృఢవిశ్వాసము గలదు.

పంపిన సందేశప్రకారముగా నతఁడు రాత్రి చీఁకటిపడిన తరువాత నొంటిగా గుణవతిని సందర్శించుటకయి చందనావతి యింటికి వచ్చెను. అతనితో సంభాషించుటకయి గుణవతి వేషము వేసికొని యావఱకే సతీమణి గుణవతియొక్క గదిలో సిద్ధముగా దీపపుక్రీనీడను బల్లమీఁద గూరుచుండియుండెను. అవి యన్నియు గుణవతినుద్దేశించి పలికిన వని యామె యెఱిఁగిన దయినను, విక్రమసేనుఁ డప్పటిప్రసంగములోఁ బలికిన యనురాగసూచకము లయినవాక్యములును శ్లాఘనలును సతీమణికప్పుడు కర్ణరసాయనములుగానుండెను. సతీమణియొక్క మృదుసరసవచనములును నాగరికతావిలాసమును సెగపొంతఁ జేర్చిన వెన్నవలె నాతనిహృదయమునపూర్ణముగా కరఁగించినందున, విక్రమసేనుఁ డణుమాత్రమును సంకోచింపక తనకట్టిరసికజనాగ్రగణ్యురాలి చెట్టఁబట్టఁగలిగినభాగ్యము సంభవించినయెడల లోకములోఁ దనయంతటిధన్యుఁ డింకొకఁ డుండబోఁ డని నిశ్చయముగా నమ్మి యామెను పాణిగ్రహణము చేసికొనుటకును యావజ్జీవమును ప్రాణతుల్యముగాఁ బ్రేమించుటకును ఎన్నెన్నో బాసలు చేసెను. అదియంతయుభావిశుభసూచకమని భావించుకొని సతీమణి యాతఁడన్నప్రకారముగా జరుగునుగాక యని కోరుచుండెను.

విక్రమసేనుఁడు తనభార్యయైన సతీమణి తెలివితేటలుగల యంతటిసరసురాలని యెంతమాత్రమును గుర్తెఱిఁగినవాఁడు కాఁడు. ఆమెయోగ్యతలోఁ గొంతయైనను గనిపెట్టినవాఁడయియుండినయెడల ఈవఱ కామె నీప్రకారముగా ననాదరము చేసియుండఁడు. నిత్యమును జూచుచుండుటచేత నాతని కతిపరిచయమువలన నామెముఖసౌందర్యమునందు లక్ష్యము లేకపోయెను. తఱుచుగాఁ జూచుచుండుటచేత

సుందరవస్తువులయందుసహితమనాదరమును తృణీకారభావమును గలుగుచుండుటలోకస్వభావమేకదా! భయభక్తులుగలభృత్యురాలయి యాతనియెదుట నెప్పుడును స్వేచ్ఛతో మాటాడియుండక పోవుటచేత విక్రమసేనునకామెరసికత్వమును కౌశలమును గనిపెట్టుటకీవఱకెన్నడును నవకాశమేకలుగలేదు. తనభావిభాగ్యమంతయు నిప్పటిసంభాషణముయొక్క పర్యవసానముమీఁదనే యాధారపడి యుండునని యెఱిఁగినదగుటచేత సతీమణి యిప్పుడు తన వాక్చమత్కారమును రసికత్వమును పూర్ణముగాఁ గనఁబఱచి క్షణకాలములో నాతనిని సమ్మోహపఱచి వశ్యుని జేసికొనెను. అప్పుడు విక్రమసేనుఁడు కామపరవశుఁడయి యామెనుదక్క లోకములో మఱియెవ్వరిని భార్యనుగాఁజేకొననని ప్రమాణముచేసి తనమీఁద గలయవ్యాజానురాగమునకు గురుతుగా సతీమణి తనకిమ్మని కోరినముద్దుటుంగరము నామెవ్రేలికిఁబెట్టి ఆమెయుఁ గలప్రేమకు జ్ఞాపకచిహ్నముగా తనకు రాజు మెచ్చి బహుమానముచేసిన యమూల్యాంగుళీయకము నామె యియ్యఁగా దానిని గౌరవముతోఁబుచ్చుకొని తనవ్రేలినిధరించుకొనెను. ఇట్లు పరస్పరానురాగసూచకము లయినయాభరణములను స్వీకరించి వలపు తెలిపెడు మాటలతో విడువలేక విడువలేక యావధూవరు లొండొరుల నెడఁబాసినతరువాత విక్రమసేనుఁడామెవద్ద సెలవుగైకొని మఱునాఁటి ప్రాంతఃకాలముననే స్వదేశమునకు ప్రయాణ మయిపోయెను. తానేర్పఱుచుకొన్న యుపాయము పూర్ణముగా నెఱవేఱుటకయి వారల సాహాయ్య మావశ్యకముగాఁ గావలసి యున్నందున సతీమణి గుణవతిని తల్లియైన చందనావతిని దనవెంట నయోధ్యానగరమునకు వచ్చునట్లు ప్రార్థించి యొడఁబఱిచెను. వా రాపట్టణము చేరునప్పటికి రాజంతకుముందే భర్తృవియోగము నొందియున్న సునందనుజూచి పరామర్శించి వచ్చునిమిత్తము లక్ష్మణపురమునకుఁ బోయె నని తెలియ

వచ్చెను. ఆసంగతి విన్నతోడనే సతీమణి వారిని వెంటఁగొని తత్క్షణమే బయలుదేఱి నిత్యప్రయాణములతో లక్ష్మణపురము వచ్చిచేరెను.

చంద్రకేతుమహారాజిప్పుడుమంచియారోగ్యదశయందుండెను. తన రోగనివారణమునకు హేతుభూతురాలయిన సతీమణియెడల నారాజున కింకను కృతజ్ఞత మిక్కిలిబలముగానే యున్నందున, అతఁడు సునందయొక్క పరామర్శ కాఁగానే మొట్టమొదట సతీమణియొక్క ప్రశంసనేతెచ్చి యామెయొక్కగుణసౌందర్యాదులను గొంతసే పభివర్ణించి యట్టివంటితరుణీరత్నమును విక్రమసేనుఁడు కేవలబుద్ధిహీనతచేతనే విడనాడుకొనెనని చెప్పెను. అందుమీఁద సునంద తనదుఃఖమాఁగక కోడలిమీఁది ప్రేమచేతఁ గలిగినశోకము సముద్రతరంగమువలె హృదయములోనుండి పొరలిపొరలిరాఁగాసతీమణియొక్కసుగుణసముదాయమును దలఁచుకొని రోదనము చేయనారంభించెను. అప్పుడు రాజామె నోదార్చి తానదియంతయు ఆవఱకేమఱచి క్షమించితినని చెప్పి యామెకు దుఃఖోపశమనముచేసెను. కాని దయార్ద్రహృదయుఁడయిన సౌజన్యనిధిమాత్రము దుఃఖమును సహింపలేక, వివేకహీనుఁడయిన విక్రమసేనుఁడు తనమందభాగ్యముచేత నారీరత్నమయిన సతీమణి కవజ్ఞచేసి భార్యయెడను తల్లియెడను రాజునెడలను మహాపరాధియయ్యెననియు, ఎవ్వతెనిరుపమానసౌందర్యము లోకమునంతను భ్రమగొల్పఁజాలెనో, యెవ్వతెసరసవాక్యములెల్లవారినిచిత్రప్రతిమలవలెఁ జేయఁజాలెనో యట్టివంటి కులాలంకారమయిన పతివ్రతాతిలకము వేయేండ్లు తలక్రిందుగా తపస్సుచేసినను లభింపదనియు, బహువిధముల విలపింపఁజొచ్చెను. అప్పుడు రాజాతనిని జూచి విచారపడవలదని బోధించి, చేయిజాఱినవస్తువును దలఁచుకొనిదుఃఖపడుటవలన మనోవేదన పెరుగుటతప్ప వేఱుకార్యములేదని నీతికఱపి, విక్రమసేను

నుద్దేశించి యతఁ డెక్కడ నున్నాఁడని యడిగెను. వెంటనే విక్రమసేనుఁడు రాజు సమక్షమునకు వచ్చి యాతనిపాదములమీఁదఁ బడి మ్రొక్కి, తానునిష్కారణముగా తనభార్యను పెట్టినక్లేశకయిచింతాక్రాంతుఁడయి వ్యసనమును దెలుపఁగా, ఆతనితండ్రియెడలఁ గల సుహృద్భావమునుబట్టియు తల్లియెడలఁ గలగౌరవమునుబట్టియు రాజాతనినిక్షమించి పుత్రవాత్సల్యముతో మన్నించెను. కాని రాజుతాను సతీమణికి బహుమానముచేసినయుంగరము విక్రమసేనుని వ్రేలిని కానఁబడఁగానే రాజునకావల నాతనియందున్నయనుగ్రహమంతయు పోయి క్షణకాలములో నాగ్రహముగా మాఱెను. ఆయుంగరమును రాజు సతీమణి కిచ్చినప్పుడామె తన కేదయిన ప్రాణాంతోపద్రవము వచ్చినప్పుడు విపద్రక్షణార్థమయి రాజువద్దకుఁ బంపినదక్కఁ దన బొండెలో జీవ ముండఁగాఁ దానాయుంగరము నెప్పుడు నెడఁబాయనని యనేకప్రమాణములు చేసెను. ఆయుంగరము నీ కెక్కడనుండి వచ్చినదని రాజడిగినప్పుడు వివాహదినము మొదలుకొని తానెప్పుడును మరల సతీమణిని జూడలేదనియు, తన కీయుంగరము నొకరాత్రివేళ నొకసుందరి చీఁకటిలో నిచ్చినదనియు, నమ్మరానికథ నొకదానిని విక్రమసేనుఁడు చెప్పెను. విక్రమసేనునకు భార్యయందిష్టము లేని సంగతి రాజెఱుఁగునుగాన, ఆమాటలచేత మఱింత యనుమానము గలవాఁడై "ఇతఁడు సతీమణిని జంపెనని నాకు సందేహము కలుగుచున్నది. ఈతనిని పట్టుకొనుఁడు" అని రాజు తనభటుల కాజ్ఞాపించెను. ఈసమయములోనే గుణవతి తనతల్లితోఁగూడఁ బ్రవేశించి విక్రమసేనుఁడు తన్ను వివాహమాడెదనని వాగ్దానముచేసియున్నాఁడు గావునఁ దన్నాతఁడు వివాహము చేసికొనునట్లు శాసింపవలసినదని రాజుతో విజ్ఞాపనము చేసికొనెను. అప్పుడు రాజుకోపమునకు భయ

పడి విక్రమసేనుఁడు తా నాచిన్నదానిని పెండ్లియాడెదనని యెప్పుడును వాగ్దానము చేసియుండలే దని చెప్పెను. అందుమీఁద గుణవతి తన మాటలు సత్యమని చూపుటకయి యీతఁ డిచ్చినయుంగరమును జూడుఁడని సతీమణి తనచేతి కిచ్చినయుంగరమును జూపెను. అంతే కాక యీమె తన్నాతఁడు వివాహము చేసికొనెద నని దైవసాక్షిక ముగా ప్రమాణము చేసినప్పు డిప్పుడాతనివ్రేలి నున్నయుంగరమును దా నాతని కిచ్చితినని కూడఁజెప్పెను. అందుమీఁద రాజుయొక్కయను మానము మఱింతబలపడి రాజభటులనుబిలిచి యీమెనుగూడఁ బట్టు కొనుఁ డని యాజ్ఞాపించి, "సతీమణియొక్క యుంగరము మీ కెట్లు వచ్చినదో మీరు నిజము చెప్పకపోయినపక్షమున మీయిద్దఱితలలును గూడఁ దీయించెదను." అని గుణవతి విక్రమసేనుని జూచి కోప దృష్టితోఁ బలికెను. అప్పుడు తమ కాయుంగరము నమ్మినవారి నిచ్చ టకుఁ దీసికొనివచ్చుటకయి తనతల్లికి సెలవిం డని గుణవతి రాజును వేఁడుకొనెను. రా జామెప్రార్థన నంగీకరింపఁగా చందనావతి వెలు పలికిఁ బోయి వెంటనే సతీమణిని దనవెంటఁ దీసికొనివచ్చెను.

అప్పుడు సాధ్వీమణి యైనసునంద తనకొడుకునకు సంభవించిన విపత్తునకయి చింతించుచు సతీమణి నతఁడు నిజముగానే చంపియుండు నని భావించుకొన్నది గాన, చిన్నప్పటినుండియుఁ బుత్రికావాత్సల్య ముతోఁ బెంచి పెద్దదానిని చేసిన ప్రేమాస్పదురా లయిన ముద్దుల కోడలు వచ్చి యెదుట నిలువఁబడఁగానే పట్టరానిసంతోషము గల దాయెను. ఆకస్మికముగాఁ గలిగినసంతోషములో రాజును దాను జూచెడుదానియందే నమ్మకము లేనివాఁడయి "నాయెదుట నిలుచున్నది విక్రమసేనుని భార్యయా?" అనియడిగెను. తనభర్తయుఁ దన్ను భార్యనుగా నంగీకరించనందున సతీమణి రాజునుజూచి "మహాప్రభూ! ఈసేవకురాలు విక్రమసేనునియొక్కభార్యారూపధారిణి గాని నిజ

మయినభార్యకాదు,'' అని ప్రత్యుత్తరము చెప్పెను. అప్పుడు విక్రమ సేనుఁడు "క్షమింపుము నాకు భార్యారూపధారిణివియు భార్యవును రెండునుగూడనీవే'' అనిబిగ్గరగాఁజెప్పెను. 'ఓ ప్రాణేశ్వరా ! నాఁటి రాత్రి నే నీచిన్నదాని వేషము వేసికొని మీతో మాటాడినప్పుడు మీరు నన్నెంతో దయతో నాదరించితిరి. ఇదిగో మీరు వ్రాసిన యుత్తరమును జూడుఁడు'' అని సతీమణిసంతోషముతోఁ జదువుచుఁ "మీరు 'నాచేతియుంగర మెప్పుడు నీచేతికి వచ్చునో, నన్నప్పుడు మా త్రమే భర్త యని పిలువుము.' అని వ్రాసితిరి. మీరన్నట్లు మీచేతి యుంగరము నాచేతికి వచ్చినది. ఆరాత్రి మీచేతినుండి యుంగరము పుచ్చుకొన్నదానను నేనేకాని యీగుణవతి గాదు. ఇప్పు డయిన మీరు నన్ను మీరు కోరుకొన్నభార్యనుగా నంగీకరించెదరా?'' అని యడిగెను. "ఆరాత్రి నాతో మాటాడి వాక్యామృతముచేత నావీను లకు విందుచేసినది నీవే యని స్పష్టపడిచినయెడల, నిన్నెప్పుడును ప్రేమించుచు నీకు దాసుఁడ నయ్యెదను'' అని యతఁ డుత్తరము చెప్పెను. గుణవతియు నామెతల్లియు ఈయంశమును స్థాపించుటకే యిక్కడకు వచ్చి యున్నారు గాన, ఆసత్యమును ఋజువుచేయుట యామె కతిసులభ మాయెను. అప్పుడు రాజు గుణవతి సతీమణికిఁ జేసినతోడ్పాటున కెంతయు సంతోషించి, ఆమెగుణసంపత్తిని బహు విధములఁ గొనియాడి, ఆమెకుఁగూడఁ దగినభర్తను సమకూర్చుట కయి వాగ్దానము చేసెను. పితృదత్త మయినసిద్ధౌషధము ధన ధాన్యములకంటెను వస్తువాహనములకంటెను నమూల్య మయిన దని యిప్పుడు సతీమణి కనుభవ మయ్యెను. ఆయౌషధప్రభావముచేతనే యిప్పుడామెలక్ష్మణ సంస్థానాధీశ్వరునికి ప్రియభార్యయు, సునందకు ముద్దులకోడలును, అయి నిరంతరసుఖసంతోషముల కునికిపట్టయ్యెను.

స ం పూ ర్ణ ము

---

బాక్సు ప్రెస్, రాజమండ్రి—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆరవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని.

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

### ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

### తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

### పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

### పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు కావలసినవారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

ఫాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# సుమిత్రచరిత్రము



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
1950

[వెల రు. 0-4-0

శ్రీ శ్రీశైలనరావు బహద్దూరు
# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# సుమిత్రచరిత్రము.




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు





ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

**1950**



కాపీరైటు

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు

సుమిత్రుఁడు—సింహళద్వీపపు రాజు
చంద్రవర్మ—మలయాళదేశపు రాజు
మంజువాణి—సుమిత్రుని రాణి
బహుమానుఁడు—సుమిత్రుని సభికులలో నొకఁడు
కృష్ణుఁడు—సుమిత్రుని పుత్రుఁడు
సత్యసారుఁడు—సుమిత్రుని పుత్రుఁడు
చతురాస్యుఁడు—సుమిత్రుని భృత్యులలో నొకఁడు
వక్రచిత్తుఁడు—సుమిత్రుని సభయందలి ప్రభువు
మిత్రవింద—వక్రచిత్తుని భార్య మంజువాణిసఖి
మాలిని—మంజువాణిదాసి
రామవర్మ—చంద్రవర్మకొమారుఁడు
ప్రమతి—సుమిత్రుని కొమార్తె

వీరుగాక గొల్లవాఁడు మొదలగు మఱికొందఱు వత్తురు.

# సుమిత్రచరిత్రము

పూర్వకాలమున సింహళద్వీపమును సుమిత్రుఁడను రాజు పాలించుచుండెను. ఆయనకు రూపవతియు, గుణవతియు నగు మంజువాణి యనురాణిగలదు. వారిరువురును పరస్పరానురాగము గలవారయి యపార మయిన సుఖము ననుభవించుచుండిరి. ఈయుత్తమనాయకామణితోడి ప్రణయముచేత, ఆతనికి బాల్యసఖుఁడును సహపాఠియు నయిన చంద్రవర్మ యను మలయాలదేశపురాజును మరలఁ జూచి యాతనికిఁ దన ప్రియభామినియొక్క సద్వర్తనమును జెప్పవలెనని యప్పుడప్పుడు పుట్టుఅభిలాషతప్ప వేరుకోరిక యేమియు లేకయుండెను. సుమిత్రుఁడును చంద్రవర్మయు పిన్ననాఁటినుండియు నొక చోటనే యేకముగాఁ బెరిగిరి; కాని వారితండ్రుల మరణానంతరమునఁ దమతమ దేశముల నేలుట కయిఁ యెడఁబాయవలసి వచ్చినందున, వారు తఱచుగా బహుమానములను, ఉత్తరప్రత్యుత్తరములను, ప్రియపూర్వకము లయిన క్షేమవార్తలను బంపుకొనుచుండినను బహుసంవత్సరములనుండి యన్యోన్య ముఖావలోకనములు మాత్రము లేకయుండిరి.

ఇట్లు కొంతకాలము జరుగఁగా సుమిత్రుఁడు తన్నొకసారివచ్చి చూచిపొమ్మని మిత్రునకు మాటిమాటికి వర్తమానములు పంపుచు వచ్చినందున, మళయాళమునుండి బయలుదేఱి చంద్రవర్మయుఁ బరిమిత పరివారముతో మిత్రసందర్శనార్థమయి సింహళద్వీపమునకువచ్చెను. ఈసమావేశమువలనఁ జిరకాల మెడఁబాసియుండి యాకస్మికముగాఁ గలిసినయామిత్రుల కిరువురకును గలిగినయానంద మింతింత యని

చెప్ప నలవి కాదు. రాకరాకవచ్చిన తన చిన్ననాఁటిమిత్రునకు సకలోపచారములను జేయుచుఁ జక్కఁగాఁ బరామర్శింప వలయు నని భార్యకు బోధించుటయే కాక, తన ప్రాణసమానుఁ డయిన బాల్యమిత్రుఁడు సరసనుండి చూచుచుండఁబట్టి యిప్పటికదా నాసౌఖ్యము పరిపూర్ణత గాంచె నని సుమిత్రుఁడు మనసులోఁ బరమానందభరితుఁ డయియుండెను. మిత్రు లిద్దఱును పూర్వకాలమును గూర్చి ముచ్చటించుచు, బాల్యావస్థయందుఁ దాము చదువుకొన్న సంగతులను, చిన్ననాఁటి యాటపాటలను, తోడిబాలురతోడఁ గూడి విహారమునకుఁ బోయినప్పుడు నడచినచర్యలను దలఁచుకొని యానందించుచు, వారిసల్లాపములయం దెల్లప్పుడును నుల్లాసమును గనఁబఱచుచు సమీపమున నుండు మంజువాణితో వేడుకగాఁ జెప్పుచుండిరి. ఇట్లు కొంత కాలము సుఖముగా జరిగినతరువాత చంద్రవర్మ తనదేశమునకు వెళ్ళుటకయి ప్రయాణము కాఁగా భర్తకోరికప్రకారము మఱికొంతకాలముండి వెళ్ళు మని యాతనిని మంజువాణి ప్రార్థించి చెప్పెను.

ఈయుత్తమకాంతయొక్క సంతాపదినములు నాఁటితోఁ బ్రారంభ మాయెను. సుమిత్రుఁ డెంతప్రార్థించినను నిలువ నొడఁబడనివాఁడు మంజువాణియొక్క మృదుమధురవాక్యములచే మనసు కరఁగినవాఁడై దీనత్వముతో వేఁడికొనునామెప్రార్థనను త్రోచిపుచ్చ లేక చంద్రవర్మ మఱికొన్నివారములవఱకును తన ప్రయాణమును మానుకొనెను. తన మిత్రునియొక్క సుగుణసంపదయును తన యిల్లాలియొక్క సత్స్వభావమును జిరకాలానుభవమువలన లెస్సగాఁ దెలిసియున్నవాఁ డయ్యును, వేళావిశేషముచేత సుమిత్రుఁడు భార్యయందును మిత్రునియందును నిగ్రహింపరానియసూయ గలవాఁ డయ్యెను. పెనిమిటియొక్క యాజ్ఞచేత నాతనిస్త్రీ తని బడయుటకొఱకే

యీకాంత దినదినమును జంద్రవర్మ విషయ మయి చూపుచువచ్చిన శ్రద్ధయంతయు దురదృష్టవంతుఁ డైన యానృపాలునియొక్క మనోవేదనాభివృద్ధికే తోడుపడసాగెను. సుమిత్రుఁడు పూర్వము ప్రియకాంతయెడ నెంత ప్రేమ గలవాఁడును ప్రియమిత్రునియెడ నెంతదయ గలవాఁడు నయి యుండెనో యిప్పు డంతయీర్ష్యయు నిర్దయత్వమును గలఘోరరాక్షసుఁడుగా మాఱి, తనసభికులలో నొకఁడగు బహుమానుని బిలిపించి, రహస్యముగా నాతనితోఁ దనకుఁ గలిగిన యనమానమును జెప్పి, చంద్రవర్మను విషప్రయోగము చేసి చంపుమని యుత్తరువు చేసెను.

బహుమానుఁడు దూరాలోచనగలవాఁడును మిక్కిలియోగ్యుఁడును కాఁబట్టి తనరాజు పెట్టుకొన్నసందేహమునకు లేశమయినను అవకాశము లేదని యెఱిఁగినవాఁడయి, విషముపెట్టుటకు మాఱుగాఁ దనప్రభువుయొక్కయాజ్ఞను ఆయనకు నివేదించి, సింహళద్వీపమునుండి తప్పించుకొని యాయనతోడఁ గూడ వెడలిపోవుట కొప్పుకొనెను. చంద్రవర్మయు బహుమానునిసాయముచేతఁ దనరాష్ట్రములో సుఖముగాఁ బ్రవేశించెను. అప్పటినుండియు నక్కడ రాజసభలోఁ బ్రధానుఁడుగా నుండి, బహుమానుఁ డారాజునకు ముఖ్యమిత్రుఁడును అత్యంతప్రియుఁడును నయి యుండెను.

బహుమానుఁడు పాఱిపోవుటచేత మండిపడి, రాజు మఱింత కోపముతో రాణి యున్నయంతఃపురమునకు తత్క్షణమే నడచి,అక్కడ తనముద్దులతనయుఁ డైనకృష్ణుఁడు తల్లితో వేడుకగా నేదోకథ చెప్పుచుండఁగా వినుచుఁ గూర్చున్నభార్యను జూచి, కుమారుని రెక్కపట్టుకొని యావలకీడ్చి, భార్యను చెఱసాలయందుఁ బెట్టఁబంచెను. కృష్ణుడు మిక్కిలి పసివాఁ డయ్యును తల్లియందు మిగుల ప్రేమగలవాఁడయి

యుండెను. కాఁబట్టి తల్లిని ఆప్రకారముగా అవమానపఱిచి కారాగృహమునకుఁ బంపుచుండఁగాఁ జూచినప్పుడు, గుండెలు పగిలిపోయి మనసులో దిగులు పెట్టుకొని, ఆహారనిద్రాదులు మాని దినదినక్రమమున క్షీణించి తుదకు మరణావస్థను బొందునంతటి స్థితిలోనికి వచ్చెను. రాజును తనరాణిని చెఱసాలకు పంపివేసి, చతురాస్యుఁడును సత్యసారుఁడును అనునిద్దఱుభృత్యులను బిలిపించి, మీరు తిరువనందపురమున నున్నదుర్గగుడికిఁ బోయి మంజువాణికి నామీఁద మోహము కలదో లేదో, తెలిసికొని రండని పంపెను.

రాణి కొంచెముకాలము చెఱసాలలో నున్నపిమ్మట, ఆమెకు కూఁతురు పుట్టెను. ముద్దులమూటగట్టు నాచిన్నకూఁతును జూచికొనుచుండుటవలనఁ గొంత యూరటచెంది ఆమె "నాకన్నతల్లీ ! నీ వెంత నిర్దోషురాలవో నేను నంత నిర్దోషురాలనేసుమీ" యని యాచిన్నదానిని జూచి పలికెను. ఆపట్టణతాలూకమునకు రాజబంధుఁడైనవక్రచిత్తునిభార్య మిత్రవింద యనునామె ప్రియసఖిగా నుండెను. ఆబిడ రాణికి కూఁతురు గలిగిన దన్నవార్తను విన్నతోడనే యామె యున్న చెఱసాలకుఁ బోయి, అక్కడ నామెకుపచారమునిమిత్తముంచఁబడిన మాలిని యనుపరిచారికం గాంచి "మాలినీ! రాణిగారు నాయందు నమ్మకముంచి కోవూర్తిను నావశమున నిత్తురేని, ఆచిన్నదానిని తండ్రియైనరాజుసన్నిధానమునకుఁ గొనిపోయి చూపెద నని నీవు వెళ్ళి యామెతోడ మనవి చేయుము. ఆచిన్నదానిని చూచుటవలన నైన నాతనికి మనసు కరఁగి రాణిమీఁద దయవచ్చునేమో యెవ రెఱుఁగుదురు?" అని చెప్పెను. మాలినియు మిత్రవిందను జూచి "తల్లీ మీరు సెల విచ్చినదాని నిప్పుడేపోయి రాణిగారితో విన్నవించెదను. ఆమె నేఁటియుదయకాలమున నే యాపసిబిడ్డను గొనిపోయి రాజుసాద

ములమీఁదఁ బడవైన సాహసించెదుపుణ్యాత్ము రా లెవ్వ రైనదొర కునాయని విచారింపఁ జొచ్చినది,'' అని పలికెను. ఆమాటలకు సంతోషించి, "మాలినీ! రాజుగారిసమక్షమున నేన దనపక్షమున ధైర్యముతో వాదించెదనని రాణిగారితో జెప్పుము.'' అని మిత్రవింద చెప్పెను. నిరపరాధిని యైనరాణిగారికి మహోపకారమును జేయఁ బూనుకొన్న నీకు శాశ్వతసుఖము కలుగునుగాక యని మిత్రవిందను దీవించి, రాణిగారితో సర్వమువిన్నపము చేసియామె ప్రీతిపూర్వకముగా నిచ్చినయాబాలికను పొత్తులలోఁ గొనివచ్చి, మాలిని యాపుణ్యవతి యొక్క చేతిలోఁ బెట్టెను.

అప్పుడు పుట్టినయాపిల్లను పొత్తులలోఁ బెట్టుకొని నడచి, రాజు కోపమునకు భయపడి పోవల దని నిర్బంధించు నిజనాథుని వాక్యములనుసహితము లక్ష్యముచేయక, మూఁకలలోనుండి త్రోవ చేసికొని రాజుసన్నిధికిఁ బోయి,మిత్రవింద యానెత్తురుగందునుఆయన పాదములమీఁదఁ బడవైచి, మోమోటమి లేక యావఱకు రాజు చేసిన క్రూరకృత్యమును గర్హించి, యేదోషము నెఱుఁగని పిల్లను తల్లిని దయతోఁ జూడుమని బహువిధముల వేఁడుకొని, జాలిపుట్టునట్టుగా రాణిపక్షముగాఁ గొంతతడవు ప్రసంగించెను. ఆమె న్యాయనిష్ఠురము లాడి హితము చెప్పినకొలఁదిని రాజున కంతకంత కాగ్రహము బలిసి యామెను దన యెదురనుండి కొనిపొమ్మని యాపి పెనిమిటితో నుత్తరువుచేసెను. మిత్రవింద వెళ్లినపుడు పిల్లది యొంటిగా నున్నప్పుడు శిశువుయొక్క యసహాయతను జూచిన నైన నొకవేళ జాలిపుట్టునేమో యని యాబిడ్డను తండ్రి కాళ్ళసమీపముననే దిగవిడిచి పోయెను. ఆమెకొలువుఁ బాసి వెళ్ళినతోడనే దయాశూన్యుఁ

డయిన యాతండ్రి వక్రజిత్తుని బిలిచి 'నీ వీబిడ్డను గొనిపోయి సముద్రమునుదాటి నిర్జనవనములో దిగఁబెట్టి ర"మ్మని యాజ్ఞాపించెను.

వక్రచిత్తుఁడు ఉత్తమాంగన మైనమిత్రవిందవంటివాఁడు కానందున తనస్వామియాజ్ఞను శిరసావహించి యానిమిషమున నేయొకపడవ నెక్కి, ముందుగా నెక్కడ నిర్మానుష్యమైన యడవి కనఁబడునో యక్కడనాచిన్నదానిని పాఱవేయవలె నను నుద్దేశముతో బయలు దేఱెను. రాజు రాణిమీఁద మహాకోపముతో నున్నవాఁడు కాఁబట్టి, దేవతావాక్యమును దెచ్చుట కయి వెళ్ళియుండినసత్యసారుఁడును చతురాస్యుఁడును వచ్చుటకైనఁ గనిపెట్టుకొనియుండక, యీలోపుగానే కన్నకూఁతురుగతిని మూర్ఛపోయి తేటి కన్నకడుపు దహించుకొనిపోవ రాణి విలపించుచుండఁగా తనసభలోని ప్రముఖుల యొక్కయు మంత్రులయొక్కయు సమక్షమున బహిరంగముగా భార్యనేరమును విచారణ చేయుటకయి యామెను రప్పించెను. ఆమె చేసిననేరమును విమర్శించుట కయి దేశములోఁ గలగొప్పవారును, న్యాయాధికారులును, మంత్రులును రావింపఁబడిరి. అప్పుడు వారందఱి యెదుటను నీసమంతయు దోషములేనియామహాపతివ్రతన్నము మహాపరాధము చేసినదానివలె దీనత్వముతో నిలువఁబడి వారుచెప్పు తీర్పును వినుట కయి యెదురుచూచుచుండెను. ఇంతలో సత్యసారుఁడును చతురాస్యుఁడును సభామంటపము ప్రవేశించి, పదిలముగా ముద్రవేసి భద్రపఱిచి తెచ్చిన దేవతావాక్యములుగలయుత్తరమును సగౌరవముగా రాజునకు సమర్పించిరి. అప్పుడు రాజుయొక్క యాజ్ఞానుసారముగా సభికులలో నొకఁడు ముద్రను విడఁగొట్టి, అందులోని వాక్యము లందఱకు వినఁబడునట్లుగా నీప్రకారము చదివెను—

"మంజువాణి కేవలము నిరపరాధిని; చంద్రవర్మ కళంకరహితుఁడు;

బహుమానముఁడే నిజమైన భృత్యుఁడు; సుమిత్రుఁడు నిష్కారణముగా జారత్వశంకను బెట్టుకొన్న క్రూరుఁడు; ఇప్పుడు చంపఁ బంపఁబడిన కూఁతురు దొరకకపోయినయెడల రాజు సంతులేనివాఁ డయి మృతి నొందును.''—రాజు అమాటలయం దెంతమాత్రమును విశ్వాస ముంచక, ఇదియంతయును రాణియొక్క మిత్రులచేత పన్నఁబడిన తంత్ర మని పలికి, న్యాయాధిపతి కభిముఖుఁ డయి నీవు రాణిని విమర్శించుట కారంభించు మని యాన తిచ్చెను. భూపతి యీమాటలు పలుకుచుండఁగానే, ఒకసేవకుఁడు కొలువుకూటమునకుఁ బరుగెత్తు కొనివచ్చి రాజుగారి పుత్రుఁడైనకృష్ణుఁడు తనతల్లిని ప్రాణాంత శిక్షను పొందించుట కయి విమర్శ చేయుచున్నా రని విని వ్యసనము చేతను సిగ్గుచేతను దేహమును మఱచి యాకస్మికముగ మృతినొందె నని చెప్పెను.

ప్రియనందనుఁడైనకృష్ణుఁడు తనకుసంభవించినదురవస్థ కయి కుంది ప్రాణములు విడిచినాఁడన్నవార్త చెవిసోఁకినతోడనే మంజువాణి మొదలునఱికినయరఁటిచెట్టువలె నేలమీఁదఁబడిమూర్ఛపోయెను. పుత్ర మరణవార్త రాజహృదయమునకు శూలమువలె నాటినందున, అభాగ్యురాలైనయిల్లాలియందుఁ గొంతకనికారము జనించి, రాజు తత్క్షణమే మిత్రవిందను ఆమెపరిచారికలను బిలిచి రాణిని ఆవలకుఁ దీసికొనిపోయి శైత్యోపచారములు చేసి మూర్ఛఁ దేర్పుఁ డని యాజ్ఞాపించెను. రాణినావలకుఁ గొనిపోయిన కొంతసేపటికి మిత్రవింద మరలఁ జనుదెంచి, ఆమె మరణము నొందెనని చెప్పెను.

సుమిత్రుఁడు భార్య మరణము నొందెనని విన్నప్పుడు, ఆమె విషయమయి తాను చేసినక్రూరకృత్యములను చింతించి పశ్చాత్తాప పడఁ జొచ్చెను. తానామెను పెట్టినబాధలవలననే యామెమనసు వికల

లక్ష్యము కొందెననియు, ఆమె నిరపరాధిని యనియు నిప్పుడు తలఁచెను; ఉన్నయొక్క మాఱుఁడును మరణము బొందినాఁడు. కాఁబట్టి చంపఁ బడినకూఁతురు మరల దొరకనిపక్షమునఁ దాను సంతానము లేకుండ మృతిపొందవలసినది వాస్తవముగాఁ గనఁబడఁబట్టి యిప్పు డాదేవతా వాక్యములయందును నమ్మకము తోఁచెను; కాఁబట్టి తనపోయినకూఁతురునిమిత్తమయి తనరాజ్యమునైనను విడిచిపెట్టవలెనని నిశ్చయించుకొని రాత్రిందివములు దుఃఖసముద్రములో మునిఁగియుండి, బహుసంవత్సరములు వ్యసనముతోను దీర్ఘవిచారముతోను రాజు కాలమును గడపుచుండెను.

వక్రచిత్తుఁడు రాజపుత్రికనెక్కించుకొనిపోయినపడవ గాలివానవలనఁ గొట్టుకొనుపోయి, చంద్రివర్మ రాజ్యము చేయుచున్నమలయాళదేశతీరమునే చేరెను. వక్రచిత్తుఁ డక్కడదిగిఁ కాపుకావుననేడ్చుచున్నయాపసిపిల్లను దయచాలి యొకచోట విడిచిపెట్టి తనపడవవైపునకు వెళ్లెను. కాని 'సింహళము నచ్చట దిగవిడిచి వచ్చినా' నని సుమిత్రునితోఁ జెప్పుట కయి సింహళద్వీపమునకు మాత్ర మాతఁడు మరల రాలేదు. ఆతఁడు వెనుకఁదిరిగి తనపడవలోనికి వెళ్ళుటకయి పోవుచుండఁగా, చేరువయడవిలోనుండి యొకవ్యాఘ్రము వచ్చి యాతనిపయికి దూఁకి, మెడ పట్టుకొని చంపి తనప్రభువుయొక్క దుర్మార్గ మయినయాజ్ఞను నెఱవేర్చవచ్చినకై తగినశిక్షను చేసిపోయెను. రాణి యాచిన్నదానిని రాజుకడకంపినప్పుడు సాధ్యమయినంత యందముగాఁ గనఁబడునట్లు చేసి మఱి పంపినది. కాఁబట్టి, యిప్పు డాచిన్నది యమూల్యవస్త్రములతోను రత్నఖచితము లయిన స్వర్ణాభరణములతోను అలంకరింపఁబడి యుండెను. వక్రచిత్తుఁడును తాను బైలుదేఱి వచ్చునప్పుడు ఒకకాగితముమీఁద 'ప్రమతి యని

వ్రాసి దాని నాచిన్నదానివస్త్రమున కంటించిపోయెను. ఆకాగితము మీఁదనే ఆమెది గొప్పవంశమనియు దైవవశమున దుర్దశప్రాప్తించిన దనియు సూచించుపదములుకూడఁ గొన్ని వ్రాయఁబడి యుండెను గాని యవి స్పష్టముగాఁ దెలియఁదగినవిగా నుండలేదు.

మేఁకలను మేపుటకై యాయరణ్యమునకు వచ్చిన గొల్లవాఁ డొక్కఁడు ఆచిన్నదానియేడుపు విని దయార్ద్రహృదయుఁడై దాపునకు వచ్చి చూచి, పిల్లదాని నెత్తికొని యింటికిఁబోయి పెంచుటకై తనభార్య కిచ్చెను. ఆగొల్లదియు పిల్లదానిని తనకుమార్తెలకన్నను ప్రేమతోఁ బెంచుచుండెను గాని, యాగోపకుటుంబమువారు తమ యొక్కనిరుపేదతనమునుబట్టి సర్వాభరణములతో నాచిన్నది తమకు దొరకినసంగతిని దాఁచవలసినవారైరి. కాఁబట్టి ఆగొల్లవాఁడు తన భార్య యెక్కడనుండి వచ్చెనో యెవ్వరికిని తెలియకుండుట కయి కుటుంబముతోఁగూడ తానుండుప్రదేశమును వదలివేసి, ఆ దేశమునకు రాజధాని యైనయనంతసేనమునకు సమీపమున నున్నపల్లె చేరి, ప్రమతియొక్కనగలలోఁ గొన్నిటినివిక్రయించి పశువులమందలను గొని యచ్చట విశేషధనవంతుఁడుగా నుండెను. వాఁడు ప్రమతిని తన కూఁతునుగానేభావించుకొని పెంచుచుండెనే కాని, ఆమె రాచకూఁతు రన్నమాటను లేశమైన నెఱిఁగినవాఁడు కాఁడు. ఆమెయు సంవత్సరక్రమమునఁ బెరిఁగి, యంతికంతకు సౌందర్యవతియై యౌవనదశను పొందెను. అమె గొల్లపిల్లలు సాధారణముగా నేర్చుకొనుదానికంటె విశేషవిద్యను నేర్చుకొన్నది కాకపోయినను, ఆమె స్వభావసిద్ధములైన తెలివితేటలను నడవడికను జూచినవా రందఱును చిన్ననాఁటి నుండియు నామె రాజమందిరములోఁ బెరిఁగినది కా దని యెంచుట కవకాశము లేనివారుగా నుండిరి.

మలయాళదేశపురా జైనచంద్రవర్మకును రామవర్మ యనుపేరు గల కొమారుఁ డొక్కఁడే యుండెను. అతఁ డొకనాఁడు వేటకుఁ బోయి ఆగొల్లవాని యింటిసమీపమునుండి వచ్చుచు గుమ్మములో నిలుచున్న ఆచిన్నదానిని జూచి ఆమెయొక్కరూప లావణ్యాదుల కద్భుతపడి, మోహపరవశుఁ డయ్యెను. అతఁడు తత్క్షణమే మాఱువేషము వేసికొని కందర్పుఁ డనుపేరున నాగోపగృహమునకుఁబోయి నాఁడు మొదలుకొని తెలుచుగా వానియింటికి రాకపోకలు చేయుచుండెను. చంద్రవర్మయు దనకొమారుఁడు మునుపటివలె నిల్లుపట్టక తిరుగుచుండుట చూచి సందేహపడి, అతని జాడలను కనిపెట్టుటకై దూతలను నియమించి, వారివలనఁ దనపుత్రుఁడు గోపకామినిమీఁద మనసుతగిలియుండుటను దెలిసికొనెను. చంద్రవర్మ వెంటనే తనప్రాణమిత్రుఁడైన బహుమానుని రప్పించి, ఆసంగతి యంతయు నతనితోఁ జెప్పి, పరిమతితండ్రి యైనగొల్లవానియింటికిఁ దనతోఁగూడ రమ్మని కోరెను.

చంద్రవర్మయు బహుమానుఁడును ఇద్దరును మాఱువేషములు వేసికొని గొల్లవాండ్రు ఇందోత్సవము జరిగించుచున్న సమయమున నావృద్ధగోపకునిమందిరముదగ్గరకు వెళ్ళిరి. వా రిరువురును క్రొత్తవారేయైనను, ఇంద్రోత్సవసమయమున వచ్చినవారి నందఱిని ఆదరింతురు కాఁబట్టి, గొల్లవాఁడు వారికతిథిసత్కారములు చేయుటయే కాక యుత్సవములోఁ బ్రవేశించిన తనతోడఁగూడ నానంద మనుభవింపఁ బ్రార్థించెను. ఆనందభరితు లయి యెల్లవారును తుళ్ళుచు కేరుచు నుండిరి. కులమువా రందఱును బంతులుసాగి కూరుచుండిరి; ఎక్కడఁ జూచినను ఉత్సవమునకు వలయుసంభారములు కూర్పఁబడుచుండెను; చిన్నపిల్లలును పిల్లవాండ్రును గృహముముందఱ నున్న

పచ్చికబయలిమీఁద గంతులువేయుచు కేరుచుండిరి. వారికంటెపెద్ద వాండ్రు గుమ్మమువద్దకు వచ్చిన మన్నారువానియొద్ద బొమ్మసామానులను ఇత్తడి నగలను అద్దములను గొనుచుండిరి.

ఈప్రకార మందఱును సందడిగానుండఁగా రామవర్మయు ప్రమతియు అక్కడ నడుచుచున్న వేడుకలయందుఁ బొద్దుపుచ్చుటకంటె నన్యోన్యమును సరససల్లాపములతో కాలక్షేపము చేయుటకయి మిక్కిలి కౌతూహలము కలవారయి యాసమ్మర్దముపొంతకుఁ బోవక దూరముగా నొక రహస్యస్థలమునఁ గూరుచుండిరి. తన కొమారుడు తన్నెంతమాత్రము నానవాలుపట్టుటకు వలనుగాకుండ మాఱువేషము వేసికొనియుండుటచే రాజును వారిరువురసంభాషణములు వినఁబడు నంత సమీపమునకు వెళ్ళియుండెను. ఆచిన్నది తనకొమారునితో మాటాడిన వాక్యములు పౌరుషములు కాకపోయినను మిక్కిలి మధురములుగా నున్నందున రాజునకుఁగలిగిన యద్భుతమునకుఁ బరిమితి లేదు. అప్పుడు రాజు బహుమానునివంకఁ జూచి "హీనజాతివారిలో నింత సౌందర్యవతిని వినియుఁ గనియు నుండలేదు; నేను కనిపెట్టినంత వఱకు ఈచిన్నదాని మాటలలోను ప్రవర్తనలోను హీనజాతిదని యూహించుటకుఁ దగినయాధార మేదియుఁ గనఁబడలేదు." అని చెప్పెను. "నిస్సంశయముగా నీకన్య గోపకులమునకెల్లను రాణియైయుండు" నని బహుమానుఁడు మాఱు పలికెను.

అప్పుడు రాజు ముసలిగొల్లవానికడకు వచ్చి "ఓయీ! నీ కొమార్తెతో మాటలాడుచున్నయాచిన్నవాఁ డెవఁ"డని యడిగెను. "అతనిపేరు కందర్పుఁడు, తనకొమార్తెమీఁద ప్రేమగల దని చెప్పుచున్నాఁడు, అతనికి నాకూఁతును వివాహము చేసికొనుయోగముండెనేని ఆతఁడెప్పుడును కలలోనైన నెదురుచూడని లాభముతోఁడఁ

గూడ నామెరాఁగలదు" అని, అమ్మఁగా మిగిలిన ప్రమతియొక్క యాభరణముల లనిభావమునం దుంచుకొని వాఁడు పలికెను. ఆగొల్ల వాఁడు నాఁడట్లు నగలుకొన్ని విక్రయించి పశువులమందలను కొన్న తరువాత, శేషించిన నగలను వివాహకాలమునం దల్లున కరణముగా నిచ్చుటకయి పదిలపఱిచి యుంచెను.

రాజు తరువాతఁ దనకొమారునివంక మరలి, "ఓచిన్నవాఁడా! ఇదియేమి? ఎంతో వేడుకగా నడుచుచున్న యీయుత్సవమును నిరాకరించి నీమనసు మఱిదేనిమీఁదనో లగ్నమయినట్లు తోఁచుచున్నది. నేను యౌవనదశలోనున్నప్పుడు, నామనసు తగిలినమగువల కెన్నెన్నియో సూడిదల నిచ్చుచుండెడివాఁడను. వినోదకరము లయిన వస్తువులనమ్మువాఁ డట్లు దగ్గఱనుండియే పోవుచున్నను, నీవొక్క వస్తువునైనఁ గొనిపెట్టకపోవుట యొంతయు వింతగా నున్నది" అని మాఱుగొంతుకతోఁ బలికెను. ఆరాచకొమారుఁడు తాను తండ్రితోనే మాటాడుచున్నమాటను లేశమైన నెఱుఁగఁడు కాఁబట్టినిశ్చయముగా "ఓయివృద్ధుఁడా! అటువంటివస్తువుల నామె గౌరవింపదు; ఈప్రమతి నావలన నపేక్షించు పెద్దసూడిద నాహృదయాంతరాళము లోనే దాఁచిపెట్టఁబడి యున్నది"అని ప్రమతివంకఁ దిరిగి "నావలెనే పూర్వ మెప్పుడో నీవంటిమోహనాంగిని కామించి, తిరిగియున్న యీముసలివాఁడు వినుచుండఁగా నామనసు తెలిపెదను. ఓప్రమతీ పరాకు లేక వినుము" అనిపలికెను. అంతలో నూరకుండక యతఁడు దయచేసి మావివాహనిర్ణయమును జూడు" మని పలుకుచు, తాను ప్రమతితోఁ జేసిన వివాహవిషయమైన వాగ్దానమునకు సాక్షిగా నుండవలసినదని యావృద్ధుని నడిగెను. రాజంతట మాఱువేషమునుదీసివేసి నిజస్వరూపముతో కొడుకును గద్దించుచు "వివాహవిమోచనమును

జూచెద” నని పలుకుచుఁ వెట్టిగొల్లవానియింటఁ బుట్టినయీకులహీనురాలిని వివాహము చేసికొన సాహసించినందునకయి పలువిధముల నిందించి ప్రమతివంకఁ జూచి “యింకముం దెప్పుడైన నీవు నాకొమారుని మరల నిక్కడకువచ్చుట కంగీకరించితివేని నిన్నును నీతండ్రియైన ముసలిగొల్లవానినిగూడ క్రూరముగాఁ జంపించెద” నని బెదరించెను. తత్క్షణమే బహుమానునితోఁ దనకొమారుని వెంటఁ బెట్టుకొనిరమ్మని చెప్పి, మహాకోపముతో రాజు తాను ముందుగా మందిరమునకు బోయెను.

రాచబిడ్డయొక్క స్వభావము దాఁగియుండదు కాఁబట్టి రాజు వెళ్ళినతరువాత ఆతనిదూషణభాషణములవలనఁ గోపమువచ్చినదయి ప్రమతి, “మన కందఱకును హాని ప్రాప్తముకానున్నను, నేనప్పు డేమియు భయపడలేదు; ఒకటిరెండుమాటలు రాజును పలుకరించి ఆయనతో మీరాజభవనముమీఁద ప్రకాశించుసూర్యుఁడే సంకోచపడక మాకుటీరనిలయముమీఁద సహితము ప్రకాశించుచు మిమ్మును మమ్మును సమానదృష్టితో నేచూచుచున్నాఁడనిస్పష్టముగా మొగముమీఁదనే యనవలె ననుకొంటి” నని పలికి, పిమ్మటవిచారగ్రస్తురాలయి “యీవఱకు నేనేమో కలగనుచున్నానుకాఁబోలు! ఇప్పుడు మేలుకొన్నాను. యీవిషయమై యింక మనసున కేమియు బాధ కలుగఁ జేయను. నన్ను విడిచి మీదారినిపొండి; నేను నామేఁకలపాలు పితుకుకొనుచు నాపాట్లు నేను పడుచుండెదను” అని నిస్పృహతోఁ బలికెను.

దయార్ద్రమానసుఁడైనబహుమానుఁడుప్రమతియొక్క యనువర్తనమునకు ధైర్యమునకును మెచ్చుపుట్టి, మోహాంధకార నిమగ్నుఁడై యున్న రాజనందనుఁడు జనకుని యాజ్ఞామాత్రమునఁ బ్రాణసమానయైన యామానినిని విడువఁగలవాఁడుకాఁడని రూఢిగా నెఱిఁ

గినవాఁడు కాన, ఏలాగుననైన నాకామకీ కాముకుల నేకీభవింపఁజేయు మార్గమును వెదకి యందువలనఁ జిరకాలమునుండి తనమనసులోనున్న యొకయాలోచనను ఈడేరుచుకొనవలె నని నిశ్చయించెను. సింహళ ద్వీపాధినాథుఁ డగుసుమిత్రుఁడు నిజముగాఁ బశ్చాత్తప్తుఁడయి యున్నాఁ డన్నసంగతి బహుమానుఁడు చిరకాలముక్రిందనే యెఱిఁగి యుండెను. ఇప్పుడు బహుమానుఁడు చంద్రవర్మకు ప్రియమిత్రుఁడుగా నుండినను, తన పూర్వప్రభువును జన్మభూమిని మఱియొకసారి పోయి చూడవలె ననునాశనుమాత్రము బొత్తిగా వదలిపెట్టిన వాఁడుకాఁడు. కాఁబట్టి రామవర్మను ప్రమతిని తనతోఁడ సింహళద్వీపమునకు రావలసినదనియు, అచ్చట సుమిత్రుని మధ్యవర్తిత్వమునఁ జంద్రవర్మ వలన క్షమాపణమునువడసి వివాహమున కనుమతిని పొందువఱకును మిమ్ముఁ గాపాడుట కారాజు నొడఁబఱిచెద ననియుఁ జెప్పెను.

ఈయాలోచనకు వారిద్దఱును సంతోషముతో నంగీకరించి నందున బహుమానుఁడే ప్రయాణమునకుఁ గావలసిన సర్వసామగ్రిని సిద్ధముచేసి యావృద్ధగోపకునిగూడఁ దమతో వచ్చుట కొడఁబఱి చెను. ఆగోపవృద్ధు ప్రమతియొక్క మిగిలియున్న యాభరణములను, ఆమెచిన్ననాఁటి బట్టలను, ఆబట్టలకంటించియున్న కాగితమునుగూడఁ దనతోఁ గొనిపోయెను. కొన్నాళ్ళు సముద్రముమీఁద సుఖయాత్ర చేసినతరువాత, వారందఱును క్షేమముగా సుమిత్రుని రాజధానికివచ్చి చేరిరి. పోయినభార్యను కొమార్తెను దలఁచుకొని మనోవ్యాధితోఁ బరితపించుచున్నసుమిత్రుఁడు బహుమానుని నత్యంతప్రేమతో నాద రించి, పరమప్రమోదముతో రామవర్మకును అతిథిసత్కారము నెఱపి గౌరవించెను. బహుమానుఁడు తీసికొనిపోయి రామవర్మయొక్క కాఁబోవురాణియని కనఁబఱచిన ప్రమతిమీఁదనే రాజు దృష్టియుం

తయు నుండెను. ఆమెయందుఁ దనపోయినభార్యయొక్క పోలిక కనఁబడినందున, ఆయన కప్పుడు క్రొత్తగా దుఃఖము లోపలినుండిబయలుదేఱి "నే నట్లు కఠినచిత్తుఁడనై చంపింపకుంటినేని, నాకూఁతురు నిటువంటి చక్కనికన్నియయే యగునుజుండీ" యని కంటఁ దడిపెట్టెను. ఆవెనుక రాజు రామవర్మవంకఁదిరిగి "ఉత్తముఁడైన నీతండ్రియొక్క చెలిమిని నిష్కారణముగాఁ బోఁగొట్టుకొంటిని; ప్రాణాధికుఁడైన యాతని నేలాగుననైన నొకసారిచూడవలె నని నాకెంతో యభిలాషమున్నది" అని పలికెను. ఆచిన్నదానిని రాజంతశ్రద్ధతోఁ జూచుటయు తనకూఁతు రెప్పుడో చిన్నతనములోఁ దనయాజ్ఞచేతనే యడవులలో విడిచిపెట్టఁబడిన దని చెప్పుటయు విచారించి యాగొల్లవాఁడు చిన్నదానిని విడిచిపెట్టిరన్న కాలమున విధమును ఆమెగొప్పవంశమందుఁ బుట్టినదాటకు సాక్ష్యమిచ్చు తనకుదొరకిన యమూల్యవస్త్రాభరణములను దలఁచుకొని మనసులోఁ బరిపరివిధములఁ జింతింపసాగెను. ఆసంగతు లన్నిటిని బాగుగ విమర్శించి వాఁడు రాజుపోయినదనుకొనుచున్న కుఁతురే యాప్రమతియని నిశ్చయము చేసికొనెను.

అప్పుడు రామవర్మయు, ప్రమతియు, బహుమానుఁడును, మిత్రవిందయు, అందఱును గూరుచుండియుండఁగా ఆముసలి గొల్లవాఁడు తనకుప్రమతి దొరకినవిధమును, ఆమెనుగొనివచ్చి విడిచినమనుష్యుని పెద్దపులిపట్టుకొనఁగాఁ దానుజూచుటయుఁ జెప్పి, ఆసమయమున బ్రమతికిఁ గట్టఁబడిన విలువవస్త్రమును మెడయందున్న కంఠాభరణమును బట్టకుఁగట్టియున్న కాగితమును గొనివచ్చి రాజుముందఱఁ బెట్టెను. వానిని జూచినతోడనే మిత్రవింద యావస్త్రమును నగయు మంజువాణి తనకూఁతున కలంకరించినవే యనియు ఆకాగితముమీఁది వ్రాత తన మగనియక్షరములే యనియు, ఆనవాలుపట్టెను. అప్పు డక్కడనున్న

వారి కందఱికిని సందేహము నివర్తియయి, ఆమె సుమిత్రునిపుత్రిక యనుమాట విస్పష్టమాయెను. పోయినదనుకొనుచున్న కూఁతురు దొరకినది కాఁబట్టి దేవతావాక్యప్రకారము రాజుయొక్కవంశము భూమిమీఁద నిలిచినదన్న సంతోషమును, భర్తపోయినాఁడన్న దుఃఖమును, మిత్రివిందను గొంతతడవు నిశ్చేష్టురాలినిగాఁ జేసెను. ప్రిమతి తనకొమార్తెయే యమునసంగతి తెలిసినతోడనే తనబిడ్డను చూచుకొనుటకుఁ దల్లికి ఋణములేకపోయెఁగదాయని దుఃఖించి, యేమో చెప్పదలఁచుకొని "నీతల్లి నీతల్లి—"అనుమాటలు దక్క మఱియేమియుఁ బలుకలేక కొంతతడవు నిర్వాఁగొంది యుండెను.

రాజాప్రకారము సంతోషములోను దుఃఖములోనుమునిఁగి యుండఁగా మిత్రవింద సమీపమునకువచ్చి సుప్రసిద్ధుఁడగు నొకశిల్పకారునిచేక్రొత్తగాచేయించిన మంజువాణియొక్క విగ్రహ మొక్కటి తనయింట నున్నదనియు, దానిపని యేలినవారు మాగృహమునకువచ్చి చిత్తగింతురేని నిజముగా మంజువాణియే యక్కడనున్నదనుకొనునంత విచిత్రముగానున్నదనియు రాజుతో మనవిచేసెను. రాజుతనభార్యయొక్క రూపమును జూడవలెనని యత్యాసక్తుఁడయి యున్నందునను, ప్రిమతి తానెప్పుడును జూచి యెఱుఁగని తల్లియాకార మేప్రకారముగా నుండునో కనవలెనని యతికుతూహలయయి యున్నందునను, అందఱును గలిసి యక్కడకు వెళ్ళిరి. ఆవింతయైన విగ్రహమున కడ్డముగానున్న తెరనుదీసి మిత్రివింద చూపఁగానే, అచ్చముగా విగ్రహము మంజువాణిని బోలియున్నందున రాజునకు దుఃఖ మాఁగక మనసులోనుండి పొరలిపొరలి రాసాగెను. కాఁబట్టి కొంతసే పాతఁడు మాటాడుటకును కదలుటకును శక్తుఁడుగాక చిత్రిప్రతిమవలె నిలువఁబడి యుండెను.

మిత్రవింద యప్పుడు రాజున కభిముఖురాలయి "మహాప్రభూ! మీరు నిశ్చేష్టులయి యుండుట చూడఁ బనివానిశిల్పకలా కౌశల్యమున కత్యద్భుత పడుచున్నట్లు కనుపట్టుచున్నారుగాన, నేను మిక్కిలి ప్రమోదించుచున్నాను. ఈవిగ్రహము కేవలము శ్రీ రాజ్ఞి గారివలె నుండలేదా?" అని యడిగెను. రాజును తుదకు హృదయము పదిలపఱుచుకొని, "నిస్సందేహముగా నేను మొట్టమొదట నామెను వరించినప్పు డేప్రకారముగా నున్నదో యిప్పుడు నదేప్రకారము గంభీరముగా నిలుచున్నది. కాని మంజువాణి నిజముగా నీవిగ్రహము కనుపట్టునంతవయస్సు చెల్లినది కాదు" అని చెప్పెను. "అట్లయినచో మంజువాణి యిప్పటివఱకును జీవించియుండిన నిప్పు డేరీతినుండునో యారీతినే విగ్రహమును సిద్ధముచేసిన పనివానియొక్క నేర్పును మనము మఱింత మెచ్చుకోవలసియున్నది. దేవరవారు చూడఁగాఁ జూడఁగా విగ్రహము కదలుచున్న దనికూడ భ్రమింతురేమో యని భయ మగుచున్నది. ఇఁక తెర వేయనిండు" అని మిత్రవింద మరల బలికెను. "తెర వేయఁబోకు బహుమానుఁడా! చూడు—నీకది శ్వాసము విడుచుచున్నట్లు కనఁబడలేదా? దాని కనురెప్పలయందు చలన మున్నట్లుకూడఁ గనుపట్టుచున్నది" అని రాజు బహుమానునకుఁ జూపెను. ఇంతలో మిత్రవింద "దేవరవారి కిప్పుడు గలిగిన సంతోషమునుబట్టి విచారింపఁగా అది జీవించియున్నదని సహితము తలంతురు. ఇప్పుడు నేను తెర వేయవలెను" అనెను. రాజు "మిత్రవిందా! ఇరువది సంవత్సరము లయినను నన్నాలాగుననే తలఁచునట్లు చేయుము. ఇప్పుడును ఆదివ్యసుందర విగ్రహమునుండి యూపిరివచ్చుచున్నట్లే నాకుఁ గనఁబడుచున్నది. ఎంతవింతయులియైనను విగ్రహమున కూపిరివచ్చునట్లు చెక్కఁగలుగుదునా? దానిని పోయి యొక్క

సారి ముద్దుపెట్టుకొనెదను; మీరెవ్వరును బరిహసింపకుఁడు" అని మోహపరవశుఁడయి పలికెను. "దేవా! తాళుఁడు. ఆమెపెదవికి వేసిన యెఱ్ఱరంగింకను పచ్చిగానే యున్నది; మీరు ముద్దుపెట్టుకొందురేని మీపెదవి కంటుకొనును. నేను తెర దిగవేయుదునా?" అని మిత్రవింద యడిగెను. "వద్దువద్దు" ఇరువదియేండ్లయినను ఆలాగుననే యుండనిమ్ము" ని రాజు వేఁడుకొనెను.

ఈసంభాషణము నడుచుచున్నంతతడవును మోకాలిమీఁద నిలువఁబడి నోరు కదలింపక సావధానముగా జననియొక్క నిరుపమానమైన విగ్రహమువంకనే చూచుచున్న ప్రమతి "నాప్రియమాత వంకఁ జూచుచు, ఎంతకాల మయిన నీప్రకారముగానిలుచుండఁగల" నని పలికెను. అంతట మిత్రవింద రాజువంకఁ జూడ్కి నిగిడించి, 'యీయాలోకనసౌఖ్యమును గొంతసేపు మఱచి తెరవైనను వేయ ననుజ్ఞయియ్యుఁడు; లేదా యింతకంటె నద్భుతము నొకదానిని జేసెద నందుకైన సమ్మతింపుఁడు. నిశ్చయముగానే నేనీవిగ్రహమును కదలునట్లు చేయఁగలను; అంతయేకాదు—దేవరవారి సెలవయ్యెనేని, పీఠమునుండి దిగివచ్చి మీహస్తము పట్టుకొనునట్లుసహితము చేయఁగలను. కాని నేనాలాగునఁ జేసినపక్షమున, నేనేదో క్షుద్రదేవతయొక్క యుపాసనవలనఁ జేయుచున్నా నని మీరు తలంతురు.— కాదని నేను ప్రమాణము చేయఁగలను" అని చెప్పెను. ఆమాటలకు రాజు విస్మయపడి, "నీవామెచేత నేమిచేయింపఁగలవో దానినంతను జేయింపుము; కన్నులపండువుగాఁ జూచెదను. విగ్రహము చరించునట్టు చేయుదానికి మాటాడునట్టుకూడఁ జేయుట కష్టముకాదు కాఁబట్టి ఆమెచేత నీవేమి పలికించినను గూడఁ గర్ణరసాయనముగా విన(గల" నని పలికెను.

ఈపనికొఱకు కావలెనకే మిత్రవింద సిద్ధముచేసి యుంచినవాద్యములును సంగీతములును మంగళధ్వనులతో మ్రోగసాగెను. చూచువారందఱును అద్భుతరసాక్రాంతు లగునట్లుగా విగ్రహమప్పుడు పీఠము నుండి దిగివచ్చి, చేతులతో సుమిత్రునికంఠమును కౌఁగిలించుకొని, భర్తకును కూఁతుకును శుభములు ప్రసాదించుటకయి భగవంతునిఁ బ్రార్థించుచు, మాటాడసాఁగెను. ఆవిగ్రహ మట్లు సుమిత్రుని నాలింగనము చేసికొనిఁ వల్లభుని పుత్రికను దీవించినందున కంత యాశ్చర్యపడ వలసినపని లేదు—నిజముగా ఆవిగ్రహము జీవించి యున్న రాణియే.

వెనుకటియాపత్సమయమున రాణిప్రాణములను గాపాడుటకు మఱియొకయుపాయము తోఁచనందున, మిత్రవింద యప్పుడు రాణి కాలము చేసిన దని రాజుతో గొప్పయసత్యమును జెప్పెను. నేఁడు ప్రతిమ దొరికిన దన్నశుభవార్తను వినువఱకును తాను జీవించి యున్నట్టు రాజునకుఁ దెలియుట యిష్టము లేనిదై, మంజువాణి యప్పటినుండియు యోగ్యురా లయినమిత్రవిందతోఁ గలిసి యన్యు లెఱుఁగకుండ నామెయింటనె తలదాఁచుకొని యుండెను. ఆమె రాజు తనవిషయమునఁ జేసినయాపదలను నాఁడే మఱచి పోయినను, నోరు లేనిపసిపిల్లవిషయ మయి చేసినక్రూరకృత్యములనుమాత్రము మఱచి పోఁగలిగినది కాదు.

పోయిన దనుకొన్నభార్య జీవించుటయు, చిన్ననాఁడే యెడఁ బాసినకూఁతురు గృహము చేరుటయు, విలోకించి దీర్ఘకాలము విచారములపాలయి యున్నయారాజప్పుడు పొందినయానందమునకు మితము లేదు. ఏమూలఁ జూచినను సంతోషవాక్యములును మంగళ

తూర్యములును దప్ప మఱియేమియు వినఁబడలేదు. సంతుష్టాంతరంగులైనయాదంపతులు హీనజాతినాతిగా నెన్నఁబడినప్పుడుసహితము తమకూఁతును వరించినందు కయి రామవర్మను ఆమెను వాత్సల్యముతో బెంచి పెద్దదానిని జేసినందున కయి గొల్లవానిని బహువిధముల గొనియాడిరి. తాము చేసినప్రయత్నము లన్నియుఁ దుద కనుకూలముగా ఫలించినందున బహుమానుఁడును మిత్రవిందయు నమందానందము నొందిరి. ఎవ్వరును ప్రతీక్షింపని యీసంతోషములో నేదియు లోపము లేకుండఁ జేయుటకోయనఁ జంద్రవర్మసహిత మప్పుడు వచ్చి రాజమందిరమును జొచ్చెను. ఆతఁడు మొట్టమొదటఁ గొడుకును బహుమానుఁడును గనఁబడక పోయినప్పుడు ఆవఱకే బహుమానుఁడు స్వదేశమునకుఁ బోవఁగోరి యున్నసంగతి నెఱిఁగినవాఁడుగాన వారిరువురును సింహళద్వీపములో దొరకుదురని యూహచేసి, సాధ్యమయినంతశీఘ్రముగాబయలుదేఱి, సుమిత్రునిజీవితకాలములోనెల్లను మిక్కిలిసుదిన మయినయీసంతోషసమయముననే యచ్చట నుట్టిపడెను,

చంద్రవర్మ వారితోఁగూడ సంతోషము ననుభవించుటయే కాక, అక్రమముగాఁ దనమీఁద జారత్వశంకను మోపినసుమిత్రుని యపరాధమును మన్నించి బాల్యములో నాతనితో నెంతమైత్రి గలిగి యుండెనో యిప్పుడును మరల నంతమైత్రి గలవాఁడాయెను; చంద్రవర్మ ప్రమతిని తనకొడుకునకుఁ జేసికొనకు ననిరాకరించుచున్నభయ మిప్పు డేమియులేదు. ఇప్పు డామె కులహీనురా లయినగొల్లపడుచు గాక, సింహళద్వీపరాజ్యమున కుత్తరాధికారిణి యైనరాజయువతి యాయెను, కాఁబట్టి ప్రమతికిని రామవర్మకును మహావైభవముతో

వివాహమహోత్సవము జరగెను. చిరకాలము కష్టపరంపర ననుభవించిన సుకృతాత్ములైన మంజువాణియొక్క శ్రమ యంతయు నాఁటితో నివారణ మయినందున ఆమె పుత్రికతోను అల్లునితోను గలిసి సకలసంపదలతోను దులఁదూఁగుచు బహుకాలము సమస్త సౌఖ్యముల ననుభవింపు చుండెను.

సంపూర్ణము.

---

బాక్సు ప్రెస్, రాజమండ్రి—1950.

## రా. బ. కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు

### స్త్రీలకుపయోగించుకథలు

**అయిదవ సంపుటము**

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

### స్త్రీలకుపయోగించుపుస్తకములు

**ఆఱవ సంపుటము**

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రహాపదీసంవాదము (మాతృభాష పితృభాష)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

### ఉపన్యాసములు

**ఏడవ సంపుటము**

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల ధర్మాకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయకప్రదమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

### ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

### తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

### పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

### పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.

బాస్య ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# రఘు దేవ రాజీయము

షేక్స్పియరుయొక్క "పెరికిల్సు" అను నాటక కథ

ననుసరించి



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

మూడవ కూర్పు

ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-5-0

శ్రీ త్రి శే ష శై న రా వు బ హ ద్దూ రు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

### ప్ర హ స న ము లు

ఒకటవ సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

### నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధి పత్యము
5 ప్రహ్లాద నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వ చ న ప్ర బం ధ ము లు

### ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ
యాత్రలు మొ॥ భా
2 ,, రెం॥ భా
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన
నైషధవ
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహః
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్‌గిల్పిన్
10 [illegible]

# రఘుదేవరాజీయము.



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు

For favour of
Exhibition





ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

# ఈ కథయందు వచ్చు పాత్రములు



రఘుదేవరాజు—కళింగదేశపురాజు; ప్రభావతియొక్క భర్త.

కృష్ణగజపతిమహారాజు—ఓఢ్రదేశపురాజు.

నరసింహరాజు—రఘుదేవరాజుయొక్క మంత్రి.

ధనపాలుఁడు—కురంగేశ్వరపుర పరిపాలకుఁడు. కుటిలాలకభర్త.

రాజవాహనుఁడు—కొండవీటిసీమరాజు; రఘుదేవరాజుమామ.

మధుదాసుఁడు—రఘుదేవరాజుయొక్క భృత్యుఁడు.

జలవేగుఁడు—రఘుదేవరాజుయొక్క యోడలోని సేవకుఁడు.

ధన్వంతరి—ప్రభావతిని బ్రతికించిన ఘనవైద్యుఁడు.

వక్రచిత్తుఁడు—కుటిలాలకయొక్క పరిచారకుఁడు.

సుగుణప్రియుఁడు—బృందావనపురపరిపాలకుఁడు; సాగరికభర్త.

ప్రభావతి—రఘుదేవరాజుభార్య; రాజవాహనునికూఁతురు.

మంజుభాషిణి—ప్రభావతి పరిచారిక, సాగరికయొక్క దాది.

కుటిలాలక—ధనపాలునిభార్య.

సాగరిక—రఘుదేవరాజుకూఁతురు; సుగుణప్రియుని భార్య.

— 6

...కాసుర విజయం

4 మహారణ్య...

5 ...

# రఘుదేవరాజీయము.

పూర్వకాలమందు రఘుదేవరాజను రాజోత్తముఁడు కళింగ దేశమును పాలించుచుండెను. ఆకాలమునందు కళింగదేశపు రాజులు గజపతు లనఁబడెడి యోఢ్రదేశపు రాజులకులోఁబడినవారయి వారికి కప్పము కట్టుచుండిరి. రఘుదేవరాజుయొక్క రాజ్యారంభదినములలో దుష్టుఁ డయిన కృష్ణగజపతిమహారాజు ఓఢ్రదేశమునకు రాజుగా నుండెను. ఈకృష్ణగజపతిమహారాజు రహస్యముగాఁ జేసినయొక దుష్కృత్యమును రఘుదేవరాజు కనిపెట్టి వెల్లడిచేసినందున, ఆమహారాజా రాజుమీఁదఁ బట్టరానియాగ్రహము గలవాఁ డయి యాతనిని సుఖులయి యున్నయాతనిప్రజలను బాధించి నాశనము చేయవలెనని ప్రయత్నించుచుండెను. రఘుదేవరాజు ఈవార్తను విని తాను మహా ధైర్యశాలి యయి తనప్రాణములను లక్ష్యముచేయనివాఁ డయినను తనమూలమున నిష్కారణముగా తనప్రజలకు బలవంతుఁ డయిన దుష్టమహారాజువలన బాధ కలుగఁబోవుచున్న దని పరితపించి వారి రక్షణమునకు తగినవెర వాలోచించి, అప్పటికి తాను దేశమును విడిచిపోయి యాతనియాగ్రహము తగ్గువఱకును మఱియొకరాజ్యములో ప్రచ్ఛన్నముగా నుండి వెనుక వచ్చుట పరమోపాయ మని నిశ్చయించి, ప్రజలక్షేమమునిమిత్త మయి బుద్ధిపూర్వకముగా రాజ్యమును విడువఁదలఁచుకొనెను. ఇట్లు నిశ్చయముచేసికొని తన మనోనిశ్చయమును తనపినతండ్రి కుమారుఁడును మంత్రియు నయిన నరసింహరాజునకుఁ దెలిపి, తన ప్రవాససమయమునం దాతఁడు రాజ్యపాలనము చేయుచుండునట్లు నియమించి యెంతో కష్టముమీఁద నాతని నొడఁబఱిచి రాజ్యభార మంతయు సమర్థుఁ డయిన మంత్రి

మీఁదఁబెట్టి, ఆకాలమునందు వేగిదేశములో కాటకము సంభవించి యుండుట యెఱిఁగినవాఁడు కావునఁదానెక్కిన యోడనిండ ధాన్యము నెక్కించుకొని కళింగపట్టణమును విడిచి యోడలో సముద్రముమీఁద కురంగేశ్వరపురమునకు బయలు వెడలెను. ఇట్లు బయలువెడలి కొన్ని దినములలో ఆపట్టణమునందు దిగి, ఆపురజనుల సాహాయ్యమునిమిత్తమయి యీశ్వరునిచేతఁబంపఁబడిన దేవదూతయోయన్నట్లుయుక్త సమయమునఁబోయి, క్షామపీడితులయి యున్న పురజనులకు ధాన్యాదులు పంచిపెట్టి వేలకొలఁది జనులప్రాణముల కాపాడెను. అందుచేత కురంగేశ్వరపుర పరిపాలకుఁ డయిన ధనపాలుఁ డాతనియెడల మిక్కిలి గౌరవమును కృతజ్ఞతయు కలవాఁ డయి యాతని నెంతో యాదరముతో జూచుచుండెను. రఘుదేవరా జాపట్టణమునందు చిరకాల ముండకమునుపే యాతఁ డక్కడ నున్నవార్త కృష్ణగజపతిమహారాజు తనచారులవలనఁ గనిపెట్టె ననియు, చారులావార్తను దెలుపఁగానే క్రూరాగ్రేసరుఁ డయినయామహారా జాతనిని జంపి వచ్చుట కయి విశ్వాసు లయిన తన భృత్యులను మాఱువేషముతో రహస్యముగా బంపియున్నందున నచ్చట నుండుట క్షేమకరము కాదనియు, తెలిపెడి యుత్తరమొక్కటి స్వదేశమునుండి వచ్చిచేరెను.ఆయుత్తర మాతఁడు చదువుకొని వెంటనే ప్రయాణ మయి తనదానమువలన లాభము పొందిన బీదజను లందఱును బహువిధముల దీవించుచు విలపించుచు వెంబడింప బయలుదేఱి మరల నోడనెక్కి దానిని దక్షిణపువైపునకు బట్టించి సముద్రయాత్ర చేయనారంభించెను. ఓడ సముద్రము మీఁద రెండుదినములు ప్రయాణముచేసినతరువాత దైవికముగా గొప్పగాలివానవచ్చి యోడ పగిలి యొక్క రఘుదేవరాజుతప్ప నం దున్నవారందఱును దేహములను సముద్రమున కొప్పగించి పరమ

పదమును బొందిరి. ఈశ్వరానుగ్రహమువలనరఘు దేవరాజుమాత్రము ప్రాణాపాయమును బొందక పగిలి తేలుచున్న యొకబల్ల చెక్కను పట్టుకొని యీఁది సముద్రతరంగములవలన దిగంబరుఁడై యొకయొడ్డు చేరెను. ఇట్లు తీరముచేరి తెన్నుగానక యే దేశమో యెఱుఁగకయిసు కలోఁబడితిరుగు చుండఁగాఁ గొంతసేపునకు చేపలను బట్టుకొనుటకయి వచ్చినబెస్తవాండ్రాతనిజూచి కనికరించి తమబట్టలలో నొకదాని నాత నికి కట్టుకొనిచ్చి తమయిండ్లకుఁ దీసికొనిపోయి యాతనికన్నముపెట్టిరి. భోజనమయి కూరుచున్నతరువాత చేపలవాం డ్రాతనితో తమది కొండవీటిసీమ యనియు, తమ దేశపురాజుపేరు రాజవాహనుఁడనియు, జను లాతనిధర్మపరిపాలనమునుబట్టి యాతనిని కలియుగధర్మరాజని పిలుతు రనియు, చెప్పిరి. ఈప్రకారముగా సంభాషణము జరుగు చుండఁగా ప్రసంగవశమున వా రాతనితో తమరాజునకుగుణవతియు సౌందర్యవతియు యౌవనవతియు నయినప్రభావతియనియెడుకొమార్తె యొకతె గలదనియు, రేపటిదిన మామెస్వయంవరమహోత్సవము జరుగఁబోవుచున్న దనియు, అందునిమిత్తమయి నానా దేశములనుండి రాజులును శూరు లయినరాజపుత్రులును వచ్చుచున్నా రనియు బాహుయుద్ధమునం దండటి నెవ్వఁడు గెలుచునో యామహాశూరుని నామె చెట్టపట్టు ననియుకూడఁ దెలిపిరి. ఈమాటలు వారు చెప్పు నప్పుడు తనబాహువీర్యమును గనఁబఱచుట కిది యొకమంచిసమ యము తటస్థించినదిగదాయని సంతోషము కలిగెను. కానిదుర్భేద్య మయిన తన కవచము సముద్రములో పడిపోయినందునకయి మన స్సులోఁ గొంత వ్యధయుఁ గలిగెను. అయినను నతఁ డెట్లయిన రాజ ధానికిఁ బోయి తనయుద్ధపాండిత్యమును నైపుణ్యమును జూపవలెనని నిశ్చయించుకొని యందువిషయ మయి యాలోచించు చుండఁగా

మఱియొకచేఁపలవాఁడు వచ్చి తనవలలోఁ బడినదని యొకకవచము దెచ్చి యాతని కిచ్చెను. అతఁడు దానిని పరీక్షించి యోడ పగిలిపోయి నప్పుడు సముద్రము పా లయినతనయమూల్యకవచమే యది యగుట దెలిసికొని పరమానందభరితహృదయుండయి తనమేలుకొఱకు దైవమే మరల దానిని బంపె ననుకొని "ఓదైవమా ? నీకు వందనము చేయు చున్నాను. ఈకవచము నాతండ్రి ప్రియపూర్వకముగా నాకిచ్చినదగుట చేత దీని నెప్పుడును నేనెడఁబాయ కుండెడివాఁడను. ప్రాణపద మయినయీకవచమును కుపితుఁడయి యున్నప్పుడు సముద్రుఁ డక్ర మముగా నపహరించియు, నిప్పుడు శాంతుఁడయి మరల నాకిట్లుపంపి వేసినందుకు నేనెంతయు కృతజ్ఞుఁడనయి యున్నాఁడను. నాతండ్రి నా కిచ్చిన యీయుత్తమధనము మరల నాకు లభించినందున నే నీయోడ పగులుట శోకయాపదనుగా భావింపను" అని తనలోఁదాను పలికెను.

ఇట్లతఁ డాడిన మంతయు సంతోషముతో నుండి రాత్రి సుఖ నిద్రచేసి మఱునాఁడు తెల్లవాఱినతరువాత లేచి సమయకృత్యములను దీర్చుకొని కవచమును ధరించుకొని తనభాగ్యమును పరీక్షించుటకయి రాజధాని యైనమోటుపల్లె యనుసముద్రతీరపట్టణమునకుఁ బోయెను. అవఱకే యక్కడ స్వయంవరమహోత్సవమునకు వలసిన సమస్తసన్నా హములును చేయఁబడెను; రాజపుత్రులు తమతమపౌరుషములను గనఁ బఱచుటకయి రంగస్థలమును సంసిద్ధము చేయఁబడెను. అప్పుడు నానాదేశములనుండి వచ్చియున్నరాజపుత్రు లందఱును రాజవాహ నుఁడు సభ తీర్చియుండఁగా రంగమధ్యమునందుఁ బ్రవేశించి ప్రభావతి సమక్షమున విలువిద్యయందుఁ గల తమతమనేర్పులను జూపసాగిరి. రూప గుణ శౌర్యాదులచేత నసమానుఁడయినరఘుదేవరాజనువారి మధ్యను జొచ్చి తనబాణవిద్యాకౌశలమును సభవా రందఱును

నద్భుతపడునట్లుగాఁ జూపి యొక్కొక్కనినేతాఁకి యెల్లవారును మేలు మేలని మెచ్చ ద్వంద్వయుద్ధమునం దొకరితరువాత నొకరినిగా రాజపుత్రుల నందఱి నోడించి నిరుపమానబలశాలి యయి రణరంగమున సింహమువలె నిలుచుండెను. అతనిశౌర్య ధైర్యసౌందర్యముల కాశ్చర్యపడి తండ్రియనుమతితో సభామధ్యమునుండి లేచి భద్రగజయానముతో నడిచివచ్చి ప్రభావతి ధవళపుష్పములతోఁ గూర్పఁబడిన విజయమాల నాశూరపురుషునికి తమునందు వైచెను. ఇట్లు కృత్రిమ యుద్ధమునందు రాజపుత్రుల నందఱిని మించినతరువాతమాత్రమేకాక రణరంగమునఁ బ్రవేశించి నవ్వుమొగమును శాంతరూపమును జూపి నప్పటినుండియుఁ బ్రభావతిమన సాతనియందే తగిలి యుండెను. ఆమె సుందరవిగ్రహసందర్శన మయినప్పటినుండి రఘుదేవరాజున కామె మీఁద నపరిమితానురాగము కలిగెను. పరస్పరముఖావలోకనము వలనను గుణగ్రహణము వలనను నొండొరులకుఁ దమలో గలిగిన యవ్యాజానురాగమును గనిపెట్టియు, అతని బలశౌర్యాదుల కానందించియు, గుణసంపదను మెచ్చియు, అతనియొక్కకులగౌరవాదుల నెఱుఁగనివాఁడయినను రాజవాహనుఁడు తనకొమార్తెను శౌర్యాలంకారుఁ డయినయామహాపురుషున కిచ్చి వివాహము చేయుటకు నిశ్చయించెను. కృష్ణగజపతిమహారాజుయొక్క దౌష్ట్యమునకు వెఱచి రఘుదేవరాజు తనయున్నతపదమును జెప్పక మఱుఁగుపఱిచి తా నొక సామాన్యరాజపుత్రుఁడ ననిమాత్రమే చెప్పినను, తనకూఁతునకాతని యందుఁ గలిగిన దృఢానురాగమును గనిపెట్టి యాతని నల్లునిగా గ్రహించుటకు రాజవాహనుఁ డణుమాత్రమును వెనుకతీయలేదు.

ఇట్లు వివాహ మయినకొన్నిమాసములకు తరువాత తనశత్రువైనకృష్ణగజపతిమహారాజు చచ్చెననియు, తనచిరకాలప్రవాసముచేత

తన దేశములోని ప్రజ లత్యాతురులయి శీఘ్రకాలములో తమరాజు స్వదేశమునకు మరల వచ్చి రాజ్యభారమును వహింపనిపక్షమున నరసింహరాజును పట్టాభిషిక్తుని జేసి తమకు రాజునుగా గ్రహించెద మని తొందర పడుచున్నా రనియు, రఘుదేవరాజున కొకయుత్తరము వచ్చెను. నరసింహరాజునే సింహాసన మెక్కింపవలయునని జనులు సన్నాహపడుచున్నను, అతఁడు ప్రభుభక్తియు విశ్వాసమునుగలవాఁడు గాన తాను వారిప్రార్థనల నంగీకరింపక జనులయుద్దేశమును తనప్రభువయిన రఘుదేవరాజునకుఁ దెలిపి వెంటనేస్వదేశమునకు బయలుదేఱి వచ్చి రాజ్యపరిపాలనము వహింపవలసిన దని యుత్తరము వ్రాసెను. ఆయుత్తరములోనిసంగతులను విన్నతరువాత మామగా రయినరాజవాహనుఁడు తనయల్లుఁడు సామాన్యరాజపుత్రుఁడు గాక మూర్ధాభిషిక్తుఁ డయినమహారా జయినందున కపరిమితానందమును పొందెను. కాని తనయల్లుఁడు భార్యను వెంటఁబెట్టుకొని స్వదేశమునకు ప్రయాణము కాఁగా నతఁడు మహారాజగాక తానింతవఱకును ననుకొనుచున్నట్టు సామాన్యరాజపుత్రుఁడే యయినపక్షమున నెంతో యనుకూలముగా నుండునుగదా యని యల్లునియొక్కయు కొమార్తెయొక్కయు వియోగమును తలఁచుకొని విచారింపసాగెను. అంతేకాక యప్పటికి ప్రభావతి గర్భవతియై యున్నందున బాలాలిని సముద్రముమీఁద పంపుట కిష్టము లేనివాఁడయి కూఁతురును తనయొద్ద నుంచి పోవలసినదని రాజవాహనుఁ డల్లుని ప్రార్థించెను. రఘుదేవరాజును కడుపుతో నున్నభార్యను ఓడమీఁద దీసికొనిపోవుట కిష్టములేనివాఁ డయి ప్రసవమగువఱకును పుట్టినింటనే యుండవలసిన దని భార్యతో బహువిధముల బ్రతిమాలి చెప్పెను. కాని యామె తనకు భర్తయందుఁ గల ప్రేమాధిక్యమునుబట్టి యాతని నొక్కనిమిష

మయిన విడిచియుండుట కిష్టములేని దయితా నత్తింటనే నిల్చెదనని పట్టుపట్టి యెంతచెప్పినను వినక భర్తవెంట ప్రయాణ మయ్యెను. కొంతకాలహరణము చేసినపక్షమున భార్యమనసు తిరుగునేమోయని యాతఁడు మఱిరెండు మాసము లక్కడనుండియు భార్యయొక్క మనోనిశ్చయ మంతకంతకు మఱింత దృఢపడుచున్నందునను తనదేశ ప్రజల నిర్బంధ మెక్కువగుచు వచ్చినందునను తుట్టతుదకు నిండు గర్భిణియైయున్న భార్యను వెంటఁగొని మామగారి సెలవును పొంది రఘుదేవరాజు సముద్రముమీఁద స్వదేశమునకుప్రయాణ మాయెను.

ఇట్లు బయలుదేఱి యోడమీఁద కొంతదూరము పోయినతరువాత పెద్దగాలి యారంభమయి యంతకంతకు హెచ్చి సముద్రమును అల్లకల్లోలముగాఁ జేయఁజొచ్చెను; సముద్రతరంగములు పర్వతోపమానములుగా లేచి యూరంతయోడను కొబ్బరిచిప్పవలె నల్లలాడించుచుండెను; ఆకాశము చిల్లిపడ్డట్లు సంతతధారగా వర్షము కురియ నారంభించెను. ఇటువంటి గాలివానలో దాదియైన మంజుభాషిణి గదిలోనుండి శిశువును చేతులతో నెత్తుకొనివచ్చి రాజును సమీపించి దీనముఖముతో "స్వామీ! రాణియైన ప్రభావతి యీ సముద్రక్షోభమునకు భయపడి మూర్ఛపోయి యీస్త్రీశిశువును ప్రసవించి ప్రాణమును విడిచినది. పోయిన రాణికయి పరితాపపడక యామె తమప్రతిబింబమునుగా విడిచిపోయిన యీముద్దులకూఁతుమ జూచుకొని యూఱడిల్లుము" అని కన్నుల నీరు కార్చుచు పసిపాపను పాదములవద్ద పడవైచెను. భార్యయొక్కమరణవార్త చెవిసోఁకినప్పుడాతనికిఁ గలిగిన మనోవేదన యింతంత యని వర్ణించుటకు వేయినోళ్ళున్నవానికైనను శక్యము కాదు. అతఁడు కొంతసేపు నోట మాట రాక నివ్వెఱపడియుండి కొంచెము మాటాడుశక్తి రాఁగానే "ఓ

యీశ్వరుఁడా! ఇట్టివంటిప్రియమూల్యవస్తువును నాకు దయచేసి ప్రాణతుల్యముగా ప్రేమించునట్లుచేసి యింతలోనే వేల యెడఁబాపితివి!" అని బిగ్గరగా నేడ్వఁజొచ్చెను. అప్పుడు మహాభామిని చల్లనిమాటలతో నాతని హృదయతాపము కొంతశాంతిల్లునట్లుగా "ఓరాజేంద్రా! ఊరడిల్లుము. చనిపోయిన ప్రియురాలిచిహ్నముగా నిలిచియున్న యీచిన్నదానిముద్దు మొగమును జూచిస్తైనను దుఃఖోపశమనము చేసికొమ్ము. నీప్రియురాల మయినయీబాలికకొరకు మయినను ధైర్యము నవలంబించి నీమగతనము గనఁబఱుపుము. ఆఁడుదానివలె వావిడిచి విలపించుట నీవంటిపురుషరత్నమునకు తగునా?" అని దుఃఖశమనము చేయుచుండెను. అప్పుడు రాజాశిశువును చేతులలోఁ బట్టుకొని "ఓపసిపాపా! నీవిట్టిసంక్షోభసమయమునందు పుట్టినను నీబ్రతుకు శాంత మయినదిగా నుండునుగాక! జన్మసమయమునందు రాజపుత్రిక కెప్పుడును సంభవింపని యనాదరము నీకిప్పుడు సంభవించినను, ముందయినను నీస్థితి కష్టరహితమును సుఖప్రదమును నగునుగాక! నీవనుభవింపఁబోయెడుప్రపంచసుఖము లన్నిటిని అడఁచి వేయఁదగిన యీమాతృవియోగదుఃఖము నిన్ను సుఖహీనురాలినిగాఁ జేయకుండునుగాక!" అని యాశీర్వదించెను.

అతఁడీప్రకారముగా పుత్రికను ముద్దిడుకొనుచు పత్నీవియోగమునకు దుఃఖించుచుండఁగా నావికులు రాజువద్దకు వచ్చి, గాలివాన తగ్గక హెచ్చుగుచుండుటను రాజునకు నివేదించి, ఓడలో శవమున్నంతవఱకును గాలివాన తగ్గదన్నమూఢవిశ్వాసము మనసులో నుంచుకొని యాసంగతిని చెప్ప నోరాడక ఓమహారాజా! మీరు ధైర్య మవలంబింపుఁడు. ఈశ్వరుఁడు మిమ్ము రక్షించునుగాక!"యని యూరకుండిరి. "నేను కావలసినంత ధైర్యమును పూని యున్నాను

ఈగాలివానకు నే నెంతమాత్రమును భయపడను. ఇది నాకుఁ జేయ వలసినహాని నంతను జేసినది. ఇఁక మఱేమి చేయఁగలదు ? అయినను నేనీశిశువునిమిత్తమయి యీగాలివాన తగ్గవలె నని కోరుచున్నాను" అని యతఁడాపడవవాండ్ర కుత్తరము చెప్పెను. అందుమీఁద వాండ్రు "అయ్యా ! గాలి యంతకంతకు హెచ్చుచున్నది ? సముద్రతరంగము లాకాశము నంటుచు మేఘములలోనినీటితో వియ్య మందుచున్న వన్నవి. మనయోడలోశవ మున్నంతవఱకును మనల నీజలసంక్షో భము విడువదు. కాఁబట్టి యేలినవారు దయచేసి మృతురా లయిన రాణిదేహమును సముద్రములో విడిచిపెట్టుఁడు" అని ప్రార్థించిరి. వాండ్రకుఁ గలమూఢవిశ్వాసము సహేతుక మయినది కా దని యెఱిఁ గియు వాండ్రమనసు నొప్పింప నిష్టము లేనివాఁడయి యాలాగున నే చేయుద మని చెప్పి "ఓరాణీ ! నీ వెంత భాగ్యహీనురాలవు! అయ్యో! నీకు సముద్రముపాలు కావలసినయోగ మున్నదా?" అని తనలో పరి తపించుచు, ఇఁక కడచూపు చూచి రావలెనని యామె యున్నగది లోనికి పోయి మొగమువంక తేఱిపాఱఁజూచుచు "ఓప్రియురాలా ! రాజపత్నికి నీ కెంత దుర్దశ సంభవించినది! ఈపురిటింటిలో సామాన్య జనుల కుండెడుకుంపటియు మంత్రసానియు నైనను నీకు లేకపోయెను గదా ? మనకు ప్రతికూలుఁడు గా నున్నయీవాయుదేవుఁడు దీపము లనుసహితము మార్చివేసినాఁడు. దహనసంస్కారమయినను చేసి నీఋణ మును తీర్చుకోలేక నీసుకుమార మయినశరీరమును నేనిప్పుడు చేతు లార సముద్రములో త్రోయవలసినవాఁడ నగుచున్నాను," అని నిమిషకాల మూరకుండి పరిచారిక యైనమంజుభాషిణిని జూచి ఓ మంజుభాషిణీ ! ఈశిశువును పఱుపుమీఁద నుంచుము; నేనుచూచు చుండెదను. నీవుపోయి మధుదాసునితో కలమును కాగితమును పరి

మళద్రవ్యములను నగలపెట్టెను దీసికొనిరమ్మని చెప్పు. ఓడపయిని గట్టియున్న దోనెలలో నొకదానిని దింపి సిద్ధముగా నుంచు మని జల వేగునితోఁ జెప్పిరమ్ము" అని యాజ్ఞాపించి దానిని పంపివేసెను. కొన్నినిమిషములలో సేవకు లాతఁడు చెప్పినప్రకారముగా చేయఁగా దోనెలో నొకపట్టుపఱుపును వేసిప్రభావతి నందుమీఁద పరుండఁబెట్టి యామె దేహమునిండ పరిమళద్రవ్యములు వేసి యామెపయిని మంచి విలువగలపట్టుచీరను కప్పియొకప్రక్కనామె ధరించుకొనునగలపెట్టెను బెట్టి యొకకాగితముమీఁద నామెకులగోత్రనామములను సముద్రమధ్యమున సంభవించినయవస్థను తెలిపి యీదోనె నెవ్వరయిన గూడ తటస్థించిన పక్షమున వారీనగలను పుచ్చుకొని యీమెకు దహన సంస్కారము జరపవలయునని వ్రాసి యాకాగితమును పెట్టెలోఁబెట్టి యాదోనెను స్వహస్తములతో త్రాళ్ళమీఁద మెల్లగా సముద్రములో దింపెను. వారు చూచుచుండఁగానే యాదోనె నీటిమీఁద తేలి పడమటిదిక్కునకు కొట్టుకొనిపోవ నారంభించెను. అంతరువాతనూడ గాలి విస్తారముగా నున్నందున కళింగపట్టణము చేరువఅకును గాలి దెబ్బకు సహించి యోడలో శిశు వుండలేదని యెంచుకొని పాలిప్పించి సంరక్షించుటకయి కురంగేశ్వర పురమునందు తనమిత్రుఁడయిన ధన పాలునియొద్దఁ దనపుత్రికను విడిచిపోవ నిశ్చయించి యోడ నాపట్టణమునకుఁ జేర్పుఁడని నావికుల కాజ్ఞాపించెను. ఇంతలో గాలివానయు శాంతించినందున వారాయోడను శీఘ్రకాలమున నేకురంగేశ్వరపురపు రేవునఁ జేర్చిరి. అప్పుడురఘు దేవరా జొకచిన్నపడవలో తనపుత్రికను దాదియైనమంజుభాషిణినిఎక్కించుకొనిపోయి పట్టణముచేరి, తానప్పుడు కఅవుసమయమునందుఁ జేసినయుపకారమును దలఁచి ధనపాలుఁడు ధనపాలుని భార్యయైన కుటిలాలకయు తల్లిపోయిన యీశిశువునుతప్పక

సంరక్షింతు రన్ననమ్ముకముతో ధనపాలునియింటికిఁ బోయెను. ఆతనిరాకను విని ధనపాలుఁడెదురుగావచ్చి విశేషగౌరవముతో రఘుదేవరాజును పుత్రికాసహితముగా అంతఃపురములోనికిఁ గొనిపోయెను.

అప్పు డారాజు తనవివాహకథను సముద్రమధ్యమునఁ దనకు సంభవించిన మహావిపత్తును జెప్పఁగా, ధనపాలుఁడు మిక్కిలి ఖేదపడి "నీరాణితోఁగూడ కలిసివచ్చి మాగృహపావనము చేయఁగా ధన్యుల మయ్యెడు భాగ్యము దేవుఁడు మాకు కలుగఁజేయకపోయెనుగదా." అని విచారింపఁ జొచ్చెను. అప్పుడు రఘుదేవరాజు 'ఓమిత్రుఁడా! దైవతంత్రమును తప్పించుట కెవ్వరికిని శక్యము కాదు. మనముమనసు నొచ్చునట్లుగా శోకించి దైవమును దూషించినందువలన నేమిప్రయోజనము కలుగును. మనము ముందు జరగవలసినకార్యమును చూచుకొనవలెను. సముద్రములో పుట్టినందున నేనీచిన్నదానికి సాగరిక యని నామకరణము చేయుచున్నాను. ఈచిన్నదానిని నేనిప్పుడు మీవశము చేయుచు దీనిని మీరు పుత్రికావాత్సల్యముతో సంరక్షణ చేసి దీనికి రాజపుత్రికకర్హము లయినవిద్యాబుద్ధులను జెప్పింపవలయు నని మిమ్ము వినయపూర్వకముగా ప్రార్థించుచున్నాను." అని కొమార్తెను ధనపాలుని కొప్పగించి సమీపమున నున్నకుటిలాలకవంకఁ జూచి 'అమ్మా! ఈచిన్నదానిని మీపాలఁ బడవేయుచున్నానుగాన దీనిని మీరు పెంచి పెద్దదానిని జేసి నన్ను ధన్యుని జేయవలెను" అని ప్రార్థించెను. కుటిలాలక యామాటలకు సంతోషించి రాజుతో "ఓ మహారాజా! నాకును నొకకొమార్తె యున్నది. నాకడుపునఁ బుట్టిన యాచిన్నది సహితము నీపుత్రికకంటె నాకు ప్రియతరురాలుగా నుండదు. నావర్తనము ముందు మీకేవిశద మగును." అని ప్రత్యుత్తర మిచ్చెను. ధనపాలుఁడును తనపత్నివలెనే మంచి

మాటలు చెప్పుచు "ఓరాజా! నీదాతృత్వమువలన క్షామసమయము నందు నాజనులకుఁ గలిగిన పోషణమును నే నెప్పటికిని మఱువను. ఈపట్టణపు ప్రజలు నాఁటనుండియు ప్రతిదినమును నీక్షేమము నిమిత్తము త్రికాలములయందును దేవుని ప్రార్థించుచున్నారు. నీ వప్పుడు చేసినపోషణ మంతయు ముందు నీవు నీబిడ్డయందుఁ జూచి సంతోషింపఁగలవు. ఒకవేళ నీపుత్రికవిషయమున నే ననాదరము చేసినను నీత్యాగమువలన దేహములు నిలుపుకొన్న యీప్రజలు నన్ను బ్రతుకనిత్తురా? అట్టివంటి కృతఘ్నునిఁజూచి దైవము సహించునా?" అని యనేకములయిన యుపచారవాక్యములు పలికెను. అంతట రాజు తనకొమార్తెయొక్క సంరక్షణము క్రమముగా జరుగునన్న ధైర్యముతో, ఆపసిబాలికను ధనపాలునకును కుటిలాలకకును నొప్పగించి వారియొద్ద దిగవిడిచి కొమార్తెయొక్క సంరక్షణము నిమిత్తము దాది యైనమంజుభాషిణినిగూడ వారియొద్దనే యుంచి, తాను మరల ప్రయాణమయి యోడలోనికి పోఁబోయెను. అంతకు వారియొద్ద సెలవుపుచ్చుకొనునప్పుడు పితృవియోగదుఃఖము సాగరికకేమియుఁ దెలియదు గాని మంజుభాషిణిమాత్రము తనప్రభువు నెడబాయుటకు దుఃఖింపఁజొచ్చెను. రాజాపరిచారిక నోదార్చి "ఓమంజుభాషిణీ! ఇది యేడ్చుటకు సమయము గాదు. ఈచిన్నదానిసంరక్షణ మేమఱకుండుము. ఈచిన్నరాణి ముందు మీపెద్దరాణిపోయిన లోపము లేకుండ నిన్నాదరించును" అని యుత్సాహము కలిగించి పరివారసహితముగా కదలిపోయెను.

ప్రభావతి దేహమును దోనెలో పెట్టివిడిచిపెట్టిన మఱునాఁడు ప్రాతఃకాలమున ధన్వంతరి యనుపేరుగల వైద్యశిఖామణియొకఁడు బృందావనపట్టణసమీపమున సముద్రతీరమునందు తనసేవకులతోఁ

గూడ మందుల కక్కఱకువచ్చెడి యొకవిధ మయినమత్స్యపుచిప్పల నిమిత్తమయి తిరుగుచుండెను. అప్పు డాతనిభృత్యులలో నొకఁ డొడ్డునకు సమీపమున నీటిలో నొకదోనె యుండఁగాఁ జూచి యజమానునితోఁ జెప్పఁగా, అతఁడు తనతక్కినపరిజనులనుకూడఁ బిలిపించి వారిసాహాయ్యముచేత దోనెను దరికి లాగించెను. దోనె నొడ్డుకు లాగించి, దానిలో దిగి చూడఁగానందులో నొకహంసతూలికాతల్పముమీఁద నున్నసౌందర్యవతి యైనయొకయువతియొక్క దేహమును ప్రక్క నొక్కపెట్టెయును గానవచ్చెను. అప్పుడతఁ డాపెట్టెకే తగిలించియున్న తాళపుచెవిని బుచ్చుకొని పెట్టెతాళము తీసి చూడఁగా దానిలో నమూల్యము లయినయాభరణములును మడచియుంచిన నొకయుత్తరమును గానఁబడెను. అతఁ డాయుత్తరమును విప్పి చదివి యామె కళింగదేశాధీశ్వరుఁ డయినరఘుదేవరాజురాణి యగుటయు సముద్రమధ్యమునం దాపత్తు సంభవించుటయుఁ దెలిసికొని యాశ్చర్యపడి, రఘుదేవరాజునెడల మిక్కిలి జాలిపడినవాఁ డయి "ఓ రాజా! నీవు ప్రాణముతో నున్నయెడల నిటువంటి దివ్యసుందరవిగ్రహము గలరాణిని బోఁగొట్టుకొన్నందునకయి గుండెలు పగిలి యెంతపరితపించుచుందువో కదా! అని నిట్టూర్పు విడిచెను. ఇట్లా ఘనవైద్యుఁడు క్షణకాలము విచారించి యామె మొగమువంక నిపుణముగా జూచి ముఖమునందు కళ తప్పియుండకుండుట కనిపెట్టి దేహములో ప్రాణ మున్న దేమో యని సందేహపడి "అయ్యో! వారు తొందరపడి యీదేహమును సముద్రములో విడిచిరిగదా" యని వ్యాకులపడుచు, భృత్యులచేత శవము నొడ్డునకు పట్టించి చితుకులు పోగుచేయించి సమీపమున మంటచేయించి దేహమును కాపించి శరీరము పయిని తనయొద్దనున్న యౌషధమును దేనినో రాచుచు, వేఁక

చూచుటకయి చుట్టును మూఁగిన భృత్యజనుల నందఱిని చల్లగాలి యామె దేహమున సోఁకునట్లు దూరముగా తొలఁగిపోవ నియమించి తాను చెంతఁ గూరుచుండి మృదుమధురస్వరముతో కర్ణరసాయనముగా సంగీతమును పాడుచుండెను. ఇట్లు గడియసేపు చేయునప్పటి కామెకు కనుఱెప్పలు కొంచెము కదలి ముకుపుటములనుండి మెల్లగా శ్వాసము రా నారంభించెను. ఆమె భయముచేతను ప్రసవించినబడలికచేతను, మూర్ఛపోయినది గాని నిజముగా మృతినొందలేదు. ఆమె మూర్ఛను జూచి చేరువనున్నవా రందఱును మరణ మని భ్రమించి రాజును తొందరపెట్టఁగా నతఁడామెశరీరమును మహాదుఃఖముతో సముద్రమునందు త్రోయవలసినవాఁ డయ్యెను. ఇట్లు ధన్వంతరిచేసిన శీతలోపచారములు మొదలయినవానిచేత ప్రభావతి తేఱుకొని మెల్లగా కన్నులు విప్పి చూచి "ఇప్పుడు నేనెక్కడనున్నాను? నాప్రాణనాథుఁ డెక్కడ నున్నాఁడు? ఇది యేలోకము?" అనియడిగి మరల కన్నులు మూసికొనెను. నిమిషకాలములో నామె మరల కన్నులు తెఱచి ధన్వంతరివంకఁ జూడఁగా నతఁడు మెల్లమెల్లగా నామెకు సంభవించిన దుర్దశ యంతయు తెలియునట్లుచేసి, మరల మూర్ఛ మునుఁగక తాళఁ గలవన్న ధైర్యముతోఁ జినతరువాత రాజువ్రాసిన కాగితమును పెట్టెలోనుంచిన నగలను జూపెను. ఆమె యాకాగితమును మరలమరలఁ జూచి "ఇది నిశ్చయముగా నాప్రాణేశ్వరుఁడు వ్రాసినదే. ఓడలో నెక్కినసంగతి చక్కగా జ్ఞప్తియందున్నది. కాని నేనెక్కడ ప్రసవమయితినో నాబిడ్డగతి యేమయ్యెనో నాకు లేశమయినను తెలియదు. ఇఁక మరల నాప్రాణనాథుని యీకన్నులతోఁ జూచెడుభాగ్యము నాకు సంభవింపనేరదుగనుక, ఈప్రపంచసుఖములను విడిచి నేను యోగినినయి యేదయిన నొకదేవతాసన్నిధానమునం దుండెదను." అని

చెప్పెను. "అమ్మా! నీ విప్పుడు చెప్పినట్లు చేయుటకే నీమనోనిశ్చయ మయినయెడల, ఇక్కడకు సమీపమున నున్న బెజవాడయందలి కనక దుర్గయాలయములో నీవుయోగినివిగా నుండవచ్చును. నామేనకోడ లొకతె నాయాజ్ఞచొప్పున నీకక్కడ నుపచారము చేయుచుండును," అని ధన్వంతరి చెప్పెను. అతఁడు చెప్పినదాని కామె కృతజ్ఞతా పూర్వకముగా నంగీకరింపఁగా, ఆమె దేహము తిన్నగా స్వస్థతపడిన తరువాత నతఁడు ప్రభావతిని బెజవాడకుఁ గొనిపోయి కనకదుర్గ యాలయములో విడిచెను. ఆమె యక్కడ యోగిని యయి సర్వభో గములను పరిత్యజించి మృతుఁడయ్యె ననుకొనుచున్న భర్తనిమిత్త మయి దుఃఖించి కృశించుచు పారమార్థికచింతతో దినములు పుచ్చు చుండెను.

ఇక్కడ ప్రభావతి పతిభక్తితో కృశించి కాలము గడుపు చుండఁగా, అక్కడ రఘుదేవరాజు సురక్షితముగా స్వదేశమును జేరి మరల రాజ్యభారమును వహించి మరణము నొందిన దనుకొనుచున్న రాణినిమిత్తమయి లోపల విచారపడుచు మరల వివాహముచేసికొనక ప్రజాపాలనము చేయుచుండెను. ఒక్కసారియైనను తల్లి కనులార చూచి సంతోషింప నోచుకోని యాతనికూఁతురు కురంగేశ్వరపుర మునందు ధనపాలునియింట రాజపుత్రిక కర్హమయినరీతిగా పెరుఁగు చుండెను. ధనపాలుఁడు తనమిత్రునియందుఁ గలప్రేమాభిమానముల చేత మంచివిద్వాంసుల నియమించి మహాశ్రద్ధతో విద్య చెప్పించుచు వచ్చినందున, మేధావియైనసాగరిక పదుమూఁడు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటి కామె కాకాలములో నున్న పండితు లెవ్వ రును విద్యలో సమానులు కా రని జనులు చెప్పుకొనునంత పాండిత్య మును సంపాదించెను. నృత్తగానవిద్యలయం దప్సరస్త్రీ లామె వద్దనే

విద్య నభ్యసింపవలసినవా రని ను లనుకొందురు; వివిధవర్ణములు గల పట్టుదారముతో నామె బట్టలమీఁద కుట్టిన తీఁగలను పువ్వులను మృగపక్ష్యాదులను జూచి యవి నిజ మయిన లతాపుష్పాదులని చూచినవా రెల్లరు భ్రమించుచుందురు; ఆమె చేసిన పాకమును రుచి చూచినయెడల, అన్నహితము చెప్పిన రోగులుసహిత మతిభోజనప్రియు లగుదురు. ఈప్రకారముగా నందలు సద్భుతిపమునట్లుగా నానావిద్యల యందును కళలయందును సుగుణసంపదయందును నిరుపమానురా లగుచువచ్చిన కొలఁదిని ధనపాలుని భార్యయైనకుటిలాలకయామెకుగర్భ శత్రురాలుకాసాగెను. కుటిలాలకయొక్క కొమార్తె సాగరికతోసమాన వయస్కురాలయినను సమానముగా నేవిద్యాభ్యాసముచేయుచున్నను, ఈచిన్నదంత ప్రతిభావంతురాలు కాకపోవుటచేత శోభిల్లకుండుటయు నెల్లవారును సాగరికనే శ్లాఘించుచుండుటయుఁ జూచి కుటిలాలకయసూయాగ్రస్తురాలయి సాగరిక తనయింట నున్నంతకాలమును తన కొమార్తె శోభ కెక్కదని తలఁచి యేలాగుననైనను సాగరికను వదలించుకొని తనకొమార్తెకు గౌరవమును ప్రసిద్ధిని తెప్పింపవలెనని నిశ్చయించుకొని యందుకుఁ దగినయుపాయము నాలోచించుచుండెను. ఈలోపలనే సాగరికను మిక్కిలి విశ్వాసముతోఁ బెంచుచున్నమంజుభాషిణి కాలము చేసినందున, కుటిలాలకకు మఱింత మంచియవకాశము కలిగెను. మంజుభాషిణినిమిత్తము బెంగ పెట్టుకొని సాగరిక విచారించుచుండఁగా కుటిలాలక తనకు మిక్కిలివిశ్వాసి యైనవక్రచిత్తుఁడనుసేవకుని బిలిచి యేమిషమీఁద నయినను సాగరికనుదూరముగాఁ బిలుచుకొనిపోయి చంపిరమ్మని యాజ్ఞాపించెను. వాఁడెంతటి నిర్దయుఁడైన కఠినచిత్తుఁడైనను గుణరాశి యైనసాగరికను నిష్కారణముగా చంపుటకు మనసొలుపనివాఁడయి అటువంటియుత్తమ

శోకురాలి నెట్లు చంపఁగలనని యామె తోఁచనెను. అట్టువంటియుత్తమ చరిత్రగల దయినందుననే సాగరిక దేవలోకములో నుండఁదగినది గాని పాపభూయిష్ట మయినయీభూలోకములో నుండఁదగినది కాదని యామె వానిమాటకుత్తరము చెప్పి సమాధానపఱిచి తనయాజ్ఞను వెంటనే చెల్లింపనిపక్షమున నేమోచేయించెదనని బెదరించెను. వాఁడేమియు ప్రత్యుత్తరము చెప్పక యాలోచించుకొనుచుండెను. అప్పుడు దాదియైనమంజుభాషిణికొఱకు శోకించుచు సాగరిక యక్కడకు వచ్చెను. ఆమెరూపము కనఁబడఁగానే కుటిలాలకకు మఱింత కోపము వచ్చి, వానివంకఁ జూచి "నేను చెప్పినపనిని చేసెదవా చేయవా యొక్కమాటతోఁ జెప్పు" మని యామె వానిమీఁద తీవ్రపడి యడిగెను. వాఁడును చేసెదనని యుత్తరము చెప్పెను. ఇంతలో "పుట్టినప్పుడే నడిసముద్రములో విడిచిపోయినతల్లివలెనే నీవును నన్నిప్పుడు దుఃఖసముద్రములో విడిచిపోతివా? ఓ మంజుభాషిణీ! నన్ను ప్రేమించువారందఱు నొకరొకరే యీలోకమును విడిచి పోవుచుండుటచే నాకీప్రపంచము దుఃఖసాగరమువలెనున్నది; అనుకొనుచు సాగరిక యామెసమీపమునకు వచ్చెను. అప్పుడు కుటిలాలక తానామెమీఁద నెంతో ప్రేమగలదానివలె నటించుచు "ఓసాగరికా! ఇది యేమి నీవొంటిగా విలపించుచున్నావు. నీసోదరి యిప్పుడు నిన్నువిడిచి యెక్కడకుపోయినది? మంజుభాషిణినిమిత్తము విచారపడఁబోకు. నేను జీవించి యుండఁగా నీకు మంజుభాషిణి లేనిలోప మెన్నఁడైనఁ గలుగునా? నీగోడువుచేత చంద్రబింబమువంటి నీముఖము కంది రూపు చెడిపోయినది. ఈవక్రచిత్తునితోఁ బోయి నీవు కొంచెముసేపు సముద్రపుటొడ్డున చల్లగాలిలో తిరిగితివా నీమనోవ్యధ పోయి యుత్సాహము కలుగును. పోయిరమ్ము" అని పలికి వక్రచిత్తునివంకఁ దిరిగి

'ఓరీ! నీవిప్పు డీసాగరికను చేయి పట్టుకొని సముద్రతీరమునకుఁ దీసి కొనిపోయి కొంచెముసేపు త్రిప్పి రమ్ము" అని యాజ్ఞాపించెను. "అమ్మా! సముద్రతీరమునకుఁ బోవుట కిప్పుడు నామన స్సుల్లాసముగా లేదు" అని సాగరిక వానివెంట పోక నిలిచెను. అప్పు డేలాగుననైన సాగరికను వక్రచిత్తునివెంటఁ బంప నిశ్చయించి కుటిలాలక యామె చేయి పట్టుకొని "బిడ్డా! నీయందును నీతండ్రియందును మా కెంతో గౌరవము కలదు. నీతండ్రి యిక్కడకు నేఁడు వచ్చునో రేపువచ్చునో యని ప్రతిదినమును మేమెదురు చూచుచున్నాము. మే మీావఱ కాయనకు నీవు సౌందర్యరాశి వగుచున్నావని వ్రాయుచున్నందున వచ్చునప్పటికి నీ వీలాగున వన్నెతఱిగి యుందువేని తప్పక యతఁడు నీసంరక్షణమును మేముతిన్నఁగా చేయుచుండ లే దనుకొనఁడా? నామాట విని సముద్రపుటొడ్డునకు పోయి వన్నె తఱిగి యున్ననీముఖ వర్చస్సు మరల నెప్పటివలె కలుగునట్లు చేసికొమ్ము." అని నొక్కి చెప్పెను. ఆమె యంత నొక్కిచెప్పుచున్నప్పు డామెమాటనుతీసి వేయ లేక సాగరిక "నామనస్సున కిష్టములేకపోయినను పోయివచ్చెదను" అనిచెప్పి వక్రచిత్తునివెంట బయలుదేఱెను. వారు కొన్ని యడుగులు నడిచినతరువాత కుటిలాలక వెనుకకు దిరిగిపోవుచు వక్రచిత్తుని బిలిచి నేను చెప్పినమాట మఱచిపోకుమీా" అని హెచ్చరించెను. కాని యామాటల కర్థము సాగరికను చంప మఱవకు మనుటయని యాచిన్న దాని కణుమాత్రమును సందేహాము కలుగలేదు.

సముద్రతీరమునకుఁ బోయి సముద్రమువంకఁ జూడఁగానే సాగరికకు తనజన్మకథ స్మరణకు వచ్చినందున, తాను జన్మించినప్పుడు గాలివానపట్టి సముద్రమల్లకల్లోలముగా నుండుటయు, తనతల్లిమర ణమునొందుటయు, తనతండ్రి ధైర్యమును విడువక పడవవాండ్ర

నుత్సాహపఱచుటయు ఆమె తాను మంజుభాషిణివలన విన్నరీతిగా వక్రచిత్తునితోఁ జెప్పుచుండెను. అప్పుడా క్రూరచిత్తుఁడామె చెప్పెడు కథను వినక నడుమను నిలిపి యామెతో శీఘ్రముగా దేవుని ప్రార్థించు కొమ్మని చెప్పెను. ఆమాట వినఁగానే యామెకు లోపల భయము కలిగెను గాని యామాటలయర్థమును మాత్రము తిన్నగా గ్రహింప లేక వానిని జూచి, "దేవుని నేల ప్రార్థింపుమనుచున్నావు?" అని యడిగెను. "నీకు దేవుని ప్రార్థింపవలెనని యున్నపక్షమున కొంచె మవకాశ మిచ్చెదను. దేవతలు నీప్రార్థనలను శీఘ్రముగానే గ్రహింపఁగలరు గాన నీవు చేసెడు ప్రార్థనలను నిమిషకాలములో ముగింపుము. నాపనిని నేను వేగముగా నెరవేర్చెద నని శపథము చేసియున్నాను" అని యా కఠినహృదయుఁ డుత్తరము చెప్పెను. అందుమీఁద నామె మఱింత భయపడి "నన్ను చంపెదవా యేమి? నిష్కారణముగా నన్నేల చంపెదవు?" అని యామె మాటలు తడఁబడ పలికెను. "నాయజమానురాలిని సంతోషపెట్టుటకు" అని చెప్పి వాఁడూరకుండెను. "అయ్యో! నన్నామె యేల చంపింపవలెను? ఆమెకు నే నెప్పుడును రవ్వంతయు నపకారము చేసియెఱుఁగనే, ఎప్పుడును నే నామెవిషయమయి యొక్క చెడ్డమాటనయినను పలుకలేదు. ఆమెకే కాదు లోకములోని యితరజంతువునకును గూడ బుద్ధిపూర్వకముగా నెప్పుడును నేనణుమాత్రమును కీడు చేయలేదు. ఒక్కసారి మాత్రమెఱుఁగక యొక్క పురుగును ద్రొక్కి తరువాత దాని నిమిత్తమయి యెంతో దుఃఖించినాను. అట్టివంటి నన్ను చంపించుట కయి యామె యెడల నేనేమి యపరాధము చేసితిని?" అని యామె పలుకుచుండెను. వాఁడామాటలు చెవిని బెట్టక "ఇప్పుడు నాకృత్యము నాకు నియమించినపనిని వెంటనే నెరవేర్చుటకాని దానివిషయమయి

నీతో వాదమాడుట కాదు'' అని యామెను జంపుటకయి యొరలో నుండి కత్తిని పయికిఁ దీయఁబోవుచుండెను. ఈసమయములో నావఱకొక యోడలో వచ్చి యొడ్డున దిగి యున్న యోడదొంగ లాకస్మికముగా నక్కడకు వచ్చి తమ్ముఁజూచి భయపడి నిలుచున్న వక్రచిత్తుఁడు చూచు చుండఁగానే సాగరిక నెత్తుకొనిపోయి తమ యోడలో నెక్కించుకొని నిమిషములో తెరచాప లెత్తి పాఱిపోయిరి. సాగరిక నెత్తుకొని పోయిన యోడదొంగలు సముద్రములో మహావేగమునఁ బోయి బృందావనపురసమీపమునందలియొకపల్లెకు చేరువను దిగి యామెను బృందావనపురములోని యొకక్షత్రియునకు విక్రయించిరి. ఆమెను కొన్నయతఁడు విశేషధనికుఁడు గాక సామాన్యస్థితిలో నున్నవాఁడయినందున సాగరికయు తక్కువస్థితిలోనే యున్నను కొంతకాలములోనే యామెగుణసంపదయు సౌందర్యమును తెలివియు పట్టణమునందంతటను వెల్లడి కానారంభించెను. ఆమె యితర బాలికలకు సంగీతమును కుట్టుపనియు నేర్పి ధనమార్జించి తన్ను కొన్న యజమానునకును యజమానుని భార్యకును ఇచ్చుచువచ్చినందున వారంతకంతకు ధనికులు కాసాగిరి. ఆమెప్రసిద్ధి యంతకంతకు విస్తారముగా వ్యాపించుచు వచ్చినందున బృందావనపురపరిపాలకుఁ డయిన సుగుణప్రియుఁ డనురాజకుమారుఁడు తానామెను జూచుటకయి స్వయముగా వారి యింటికి బోయి పురజనులస్తుతికి పాత్రమయియున్న యామెవిద్యాబుద్ధులను వినయమును సంతతోత్సాహశీలతను గనిపెట్టి సంతోషించి, ఆమెతోడి సంభాషణమువలన నపరిమితానందమును పొందినవాఁడయి, బీదవారిలో నంతవివేకమును విద్యాకౌశలమునుగల చిన్నది యుండుట కత్యాశ్చర్యపడి యామె యెవ్వరో యున్నతవంశసంభూతురాలయి యుండవచ్చునని మనసులో ననుకొని, ఆమెతో ''నీవింకముందుకూడ

నీయిప్పటిగుణసంపదను కర్మాభిరతిని విడువకుండెడుపక్షమున, నీ కిఁక మీఁదట నాయొద్దినుండి వచ్చెడుసందేశము నీమేలుకొఱకేయయి యుండును'' అని చెప్పి వెడలిపోయెను. అప్పుడా మెవంశకథ నెంతమాత్రమును తెలిసికోలేనివాఁడయినను రూపలావణ్యములయందు మాత్రమే కాక విద్యావివేకసౌజన్యాదులయందుఁ గూడ నామె నిరుపమానురాలుగా నుండుటకని పెట్టి యామెను వివాహమాడి తనకు రాణినిగాఁ జేసికొనుటకు మనస్సులో సంకల్పము చేసికొనెను. తనవంశవృత్తాంతమునుగూర్చి యడిగినప్పుడెల్లను మౌనము దాల్చి కన్నుల నీరు పెట్టుకొనుచు వచ్చెనేగాని సాగరిక యొక్కసారియైనను తనతల్లిదండ్రులనుగూర్చియు వంశమునుగూర్చియు నొక్కమాటయుఁ జెప్పినదికాదు.

ఇక్కడ కురంగేశ్వరపురములో వక్రచిత్తుఁడు తనరాణియైన కుటిలాలకయొక్క కోపమునకు భయపడి తానుసాగరికను చంపిపీనుఁగును సముద్రములో పాతిపెట్టివచ్చితినని చెప్పి యొకకోడినిచంపి దాని రక్తమును రక్తముతో తడసినకత్తిని దెచ్చి కుటిలాలకకుఁ జూపెను. ఆదుష్టాత్మురాలా క్రూరునికిరాతకృత్యమున కెంతో సంతోషించి వానికి బహుమానమిచ్చిపంపివేసి, సాగరిక యాకస్మికముగా నంతఃపురములో పాముకఱచి చచ్చినట్లు ప్రవాదముకలుగఁజేసి తనభర్త నాటిమధ్యాహ్నము రాజకార్యముమీఁద గ్రామాంతరమునకుఁబోయి యప్పటికి రాకుండుట తనకు శుభసూచకముగా భావించుకొని మనస్సులో సంతోషించి, అదిమంచిసమయమని యారాత్రియే సాగరిక శరీరమునకు దహనసంస్కారము చేయించినట్లు విశ్వాసులయినవారిచేత రహస్యస్థలమునందు తంతునడిపించి, తానుమహాశోకాక్రాంతురాలయి యున్నట్లుగా లేనిదుఃఖమును నటించుచు నంతఃపురమంతయు మాఱుమోయునట్లుగా తెల్లవాఱినదాఁక పెద్దగొంతుతో రోదనముచేయు

చుండెను. తెల్లవాఱినతరువాత నామెభర్త యింటికి రాఁగా వారిద్ద ఱునుగలిసి యాచిన్నదానిగుణరూపాదులను దలఁచుకొని మరల క్రొత్తయేడుపున కారంభించిరి. సాగరిక కపరకర్మలు చేయించిదాన ధర్మములు చేయించినతరువాత నామెకు పుణ్యలోకములు కలుగుట కొఱకును తమ కామెయందుఁగల యనురాగమును లోకమున కెఱుక పఱుచుటకొఱకును వా రామె దేహమును దహనము చేసినస్థలమునం దొక దివ్య దేవాలయమును గట్టించిరి. ఇట్లుజరిగినకొన్నిమాసములకు రఘుదేవరాజు తనకొమార్తెను జూచి వెంటఁబెట్టుకొనిపోవుటకయి తనకు పరమవిశ్వాసియు మంత్రియు నయిన నరసింహరాజుతోఁ గలిసి యోడమీద కళింగపట్టణమునుండి బయలుదేఱి కురంగేశ్వరపురము నకు వచ్చెను. పుట్టినతరువాత ప్రథమమాసములోఁదక్క మఱియెప్పు డును జూడని ప్రాణాధికురా లయినజనిత్రైకపుత్రి నెప్పుడు చూతునా యని యెంతో వేడుకపడుచు నతఁడు ధనపాలుని గృహముచొరఁగానే దంపతులు లేడ్చుచు నెదురుగావచ్చి పిడుగువంటిసాగరికయొక్కమరణ వార్త నాతనిచెవులఁ బడవేసి తాము కట్టించిన దేవాలయమును జూపిరి. చిరకాలమునుండి చూడకున్నపుత్రికను జూచి యామెతోడి సల్లాపసౌఖ్యము ననుభవించి యెంతో సంతోషపడవలె ననుకొన్న యాతనియాశకు భంగమురాఁగా నతఁడొక్కనిమిషమైనను దుఃఖా వహమయిన యాపట్టణమునం దుండలేక భోజన మయినను జేయక యే వెంటనే వెనుకమరలి దుస్సహదుఃఖముతో మరలనోడలోనెక్కి రామే శ్వరయాత్రనిమిత్తమయి దక్షిణమున కోడనడుపుఁ డని నావికులకాజ్ఞా పించెను. స్వభావముచేత నాతఁడెంతధైర్యశాలియైనను సముద్రతరంగ ములవలె లోపలినుండి పొరలిపొరలి వచ్చుచున్నదుఃఖమునాపుకొనుట కయి యతఁ డెంతప్రయత్నము చేసినను దుఃఖాక్రాంత మయియున్న

యాతని మనస్సుమాత్ర మాతనికధీనముగాక మతిచెడఁగొట్టి యాతని జడునివలెఁజేసెను. ఆయుత్తరక్షణము మొదలుకొని యతఁడు పరమాప్తుల నయినను కన్నుఁ దెఱచి చూడలేదు; ప్రాణబంధులతో నైనను నోరువిప్పి మాటాడలేదు; తనదేహమున చీమ ప్రాఁకినను గోఁకికొన నెఱుఁగక దుఃఖపరవశుఁ డయి యుండెను.

రామేశ్వరమునకుఁ బోవుదారిలో నావికు లోడను బృందావనపురసమీపమున రేవులో నిలిపి; ఆహారపదార్థములను మంచినీళ్ళను తెచ్చుకొనుట నిమిత్తము చిన్నపడవలో పట్టణమునకుఁ బోయిరి. అప్పుడాపురాధీశ్వరుఁ డయిన సుగుణప్రియుఁడు విచిత్రరూపముగల సుందరమయిన యోడయొక్కటి రేవులోనికి వచ్చిన దనియు దాని నిర్మాణ మత్యద్భుతముగా నున్న దనియు విని దానిని చూచుటకయి తానువిహారార్థ ముపయోగించెడుచిన్ననావ నెక్కి యోడవద్దకుఁ బోయెను. నరసింహరాజు బృందావనపురపరిపాలకునిరాక విని యాతనిని తమయోడలో నెక్కించి యాదరించి, చూడఁదగినవింతలనాతనికిఁ జూపి యీయోడ కళింగపట్టణమునుండి వచ్చు చున్న దనియు కళింగదేశాధీశ్వరుఁ డయినరఘుదేవరా జోడలోపల నున్నవాఁ డనియు, అతఁడు తనభార్యయొక్కయు పుత్రికయొక్కయు మరణముచేత శోకవివశుఁడయి యేడుదినములనుండి నిద్రాహారములు లేక యెవ్వరితోను మాటాడక యున్మత్తునివలె నున్నాఁడనియు, చెప్పి రాజున్నగదిలోనికిఁ దీసికొనిపోయి యాతనిని జూపెను. సుగుణప్రియుఁ డారాజుయొక్క దాతృత్వాదిసుగుణములను విన్నవాఁడు గాన మనస్సులో ఖేదపడి రాజుసమీపమునకుఁ బోయి యాతనిమీఁద చేయివైచి "దేవా! ఈశ్వరుఁడు మీకిప్పుడు చిత్తస్వాస్థ్యమును దయచేయునుగాక! దేవరవారి సందర్శనార్థమయి బృందావనపురపరిపాలకుఁడువచ్చియున్నాఁడు.

దేవర యొక్కసారి మాటాడి యాతనిని ధన్యుని జేయఁదగును" అని పలుకరించెను. ఆరాజు కన్నులు తెఱచి చూచుచుండెనుగాని సుగుణ ప్రియునిమాటలు విన్నట్లుగాని యాతనిరాకను గ్రహించినట్లుగానికనఁ బడలేదు. అందుమీఁద నతఁడు సహజమృదుమధురస్వరముగల సాగ రిక వచ్చి శిలలుకరగునట్లు గానముచేసియు తేనెలొలుకునట్లుగాసంభా షించియు తనప్రావీణ్యమును జూపినయెడలనితనికి మనస్స్వాస్థతమరలఁ గలుగ వచ్చు ననుకొని, మంత్రియనుమతితో నామెను కొన్నిగడియల కాలములో నోడనెుద్దకురప్పించెను. అక్కడనున్నవా రామెయొక్క దివ్యసుందరవిగ్రహమును వినయవచనములను జూచి సంతోషించి యామెయిప్పుడు తక్కువస్థితిలో నున్నను రాణి నాదరించిన ట్లాదరించి గౌరవముచేసిరి. చూచినవారందఱు నామెయోగ్యతను ప్రశంసించు చుండఁగా సుగుణప్రియుఁడు మనస్సులో సంతోషించి యామెగుణ సంపదను తానుగూడ కొంతశ్లాఘించి, ఆమెయొక్కకులగౌరవము విశదమయి యుండినయెడల తా నీవఱకే యామె నిల్లాలినిగాఁ జేసి కొనికృతార్థత నొంది యుండునని చెప్పెను. అయినను సుగుణప్రియుఁ డామెకు గొప్పయింటఁ బుట్టినస్త్రీలకుఁ జేయఁదగనగౌరవమును చేయుచు, "ఓ సౌభాగ్యవతీ! ఈయోడలో నొకమహారాజు దుఃఖ సముద్రములో మునిఁగి చిత్తస్వాస్థ్యము లేక యున్నాఁడు. నీనేర్పు నంతను గనఁబఱచి యాతని నిప్పుడు స్వస్థచిత్తుని జేసి మరలఁ బ్రజ లలోఁ బడవేయవలె" అని ప్రార్థించెను.

అందుమీఁద నామె తనచేతనైనప్రయత్నము చేసిచూచెదనని యాతనితోఁ జెప్పి, రాజున్నగదిలోతానును తనపరిచారికయుఁదక్క మఱి యెవ్వరును లేకుండఁ జేయవలెనని వారిని ప్రార్థించెను. వా రందుకు నంగీకరించి తా మందఱును గదిలోనుండి యీవలికివచ్చి

యొక్కయామెనుమాత్రము పరిచారికాసహితముగా లోపలికి బంపిరి. దుఃఖములో నున్నవారి కంతకంటెను దుఃఖకర మయిన యితరులకష్టవార్తను జెప్పినపక్షమున కొంతదుఃఖశాంతి కలుగు నని యెఱిఁగిన దయి, శోచనీయ మయినతనవిపద్వార్తను రాజుచెవుల వేయఁదలఁచు కొన్న దయి అందఱికిని దఱను పూర్వ మంతగొప్పదశలో జన్మించి మహాగౌరవముతో పెరిగినతనయొక్క యిప్పటిహీనావస్థను జెప్పుటకు సిగ్గుపడిన దయి వారి నండఱిని వెలుపల నుండ వేఁడుకొనెనేగాని వేఱు హేతువుచేతఁ గాదు. ఆమె రాజున కభిముఖురాలయి నిలువఁబడి మెల్లగా శాలివ్యానాదముతో తాను జన్మించినది మొదలుకొని నేఁటి వఱకును తనకు సంభవించినకష్టపరంపరను వరుసగా జాలిపుట్టి రాయి వంటిమనసయినను కరఁగి పాఱునట్లుగా విన్నవింప నారంభించెను. ఆకష్టవార్తలు చెవిని బడినకొలఁదిని మనసు కరఁగుచువచ్చి యామె దుఃఖములో తనదుఃఖ మడఁగిపోవఁ జొచ్చినందున రా జప్పుడు మూసిన కన్నులను దెఱచి యామె మొగ మొక్కసారి చూచెను. ఆమెముఖమును జూడఁగానే యాతనిదృష్టి కామెముఖపద్మమునందు మృతురాలయినభార్యయొక్క ముఖలక్షణము లన్నియు గానరాఁగా, అతఁడు "ఈకన్యయందు నాప్రియభార్యయొక్కరూపచిహ్నములన్నియునచ్చున పోసినట్లు కానవచ్చుచున్నవి. నేటివఱకును జీవించి యుండినయెడల నాప్రియపుత్రికయు నిట్టివంటిరూపరేఖావిలాసములు గలదియై యుండును. విండ్లవంటి యీకనుబొమ్మలును, తామరరేకుల నపహసించెడుయీవాలుగన్నులును, సంపూర్ణచంద్రబింబమును సిగ్గుపఱిచెడియీముద్దుమొగమును, అచ్చముగానారాశియొక్కయంగములను బోలి యున్నవి." అనుకొని "ఓబిడ్డా! నీవాసస్థల మేది? నీతల్లిదండ్రు లెవ్వరు? నావలెనే నీవును కష్టముల ననుభవించినట్లును, నీకష్టములు

నాకష్టములకు తీసిపోవునవి కావట్టును, ఇప్పుడు చెప్పిన ట్లున్నావే ఇట్లు నిజముగా చెప్పితివా?'' అని యడిగెను. ''అయ్యా! దుఃఖ పూరిత మయి యున్న నాహృదయము చెప్పనిచ్చినంతవఱకు నట్టివంటికష్టవార్త లనే కొన్నిటిని దేవరముందర విన్నవించితిని'' అని యామె మాఱు పలికెను. అప్పుడు రాజామెవంకఁ దిరిగి ''ఓ చిన్నదానా! నీకథను మరలఁ జెప్పుము. నాకున్న సహనములో వేయవవంతు నీకున్నట్లు నాబుద్ధికి గోచర మయినయెడల, అబలవయ్యును నీదుఃఖములను నీవు పురుషునివలె ధైర్యముతో సహించితి వనియు నేనే యాడుదానివలె ధైర్యమును విడిచితి ననియు నొప్పుకొనెదను. నిన్నుఁ జూడఁగా నోర్పంతయు రూపము వహించి నాయెదుట నిలుచున్నట్లు కానఁబడుచున్నది. ఓబిడ్డా! నీవె రెవరు? నిన్ను ప్రార్థించెదను నాచెంతఁ గూరుచుండి నీవృత్తాంతమును మరలఁ దెలుపుము'' అని దీనముగా వేడఁ జొచ్చెను. ఆమె తనపేరు సాగరిక యని చెప్పఁగానే యతఁడత్యద్భుత పడి, ఆపేరు లోకసామాన్య మయినది కాకుండుటయు సముద్రములో పుట్టిన దని సూచించుటకయి తనకొమార్తెనిమిత్తము తాను కల్పించిన దగుటయు తలపోసి యేమియు తోఁచక ''ఓ దేవతలారా? నా మీఁద కోపము మీకింకను దీఱక నన్ను పరిహసించుటకయి యిప్పుడీకన్యకను మీరు పంపితిరా?'' అని వెట్టిగా మాటాడసాగెను. ''అయ్యా! మీరు శాంతత వహించి నేను చెప్పునది కడవఱకును వినవలెను. నడుమనడుమ మీరీలాగున తొందరపడెదుపక్షమున నాకథను జెప్పక నిలిపివేసెదను'' అని యామె యూరకుండెను. ''ఓబిడ్డా! నడుమను త్రెంపివేయక నీకథ సాగనిమ్ము. నేను శాంతత వహించి వినెదను. నీపేరు సాగరిక యని చెప్పి నాకెంత యద్భుతమును కలిగించినావో నీవు తెలిసికోలేకున్నావు,'' అని యతఁ డామెవృత్తాంత

మును వినుట కతికుతూహలుఁ డయి యుండెను. "నాకీపేరును రాజో త్తముఁ డయిననాజనకుఁ డనుగ్రహించి పెట్టెను." అని యామెకథ చెప్ప మొదలుపెట్టెను. "ఓబిడ్డ! నీవు రాజపుత్రికవా? నీపేరు సాగరిక! నీవు నిజముగా మనుష్యకన్యకవా? లేక మానవరూపమును ధరించిన దేవతవా? నీ వెక్కడ జన్మించితివో, సాగరిక యనుపే రేల వచ్చినదో; వేగిరము చెప్పుము" అని యతఁ డాత్రపడఁ జొచ్చెను. "సముద్రముమీఁద పుట్టుటచేత నాకు సాగరిక యనుపేరు వచ్చినది. నాతల్లి యొక్కకిరీటాధిపతి కూఁతురు; నన్ను కన్ననిమిషమునకెల్లను నాతల్లి లోకాంతరగతురా లయ్యెనని నాతో మంజుభాషిణి యెప్పు డును జెప్పి యేడ్చుచుండెడిది. నాతండ్రి నన్ను కురంగేశ్వరపురమునం దుంచెను. ధనపాలునిభార్య నన్ను హత్యచేయ యత్నించువఱకును నే నక్కడనే యుంటిని. కాని కొందఱు దొంగ లక్కడ కాకస్మికముగా వచ్చి నన్ను చంప యత్నించు చున్నక్రూరాత్మునిచేతిలోనుండి నన్ను విడిపించి నాప్రాణములు కాపాడి నన్నీబృందావనపురమునకుఁ దెచ్చిరి. అయ్యో! శాంతి వహించి వినుఁడు. మీ రిట్లేల కన్నుల నీరు పెట్టుకొనె దరు? నేను మిమ్ము మోసము చేయుచున్నా ననుకొనుచున్నా రేమో! నేను నిశ్చయముగా రఘుదేవరాజుకూఁతురను. ఆరఘుదేవమహారాజే యిప్పుడు జీవించి యుండినపక్షమున——" అని యామె చెప్పుచుండఁగా రఘుదేవరా జంతట సంతోషమును పట్టఁజాలక, దేహమంతయుపుల కించి కంపమొంద నాకస్మికసంతోషముచేత భయపడి, సాగరిక చెప్పిన కథ నిజ మగునా కాదా యన్నసందేహముచేత చిత్తముఁ గలంగి దో శన మొంద బిగ్గరగా "ఓ భృత్యులారా! నన్ను రక్షింపుఁడు" అని కేక వేసెను. తమరాజుమాటవినఁబడఁగానే పరమసంతోషమునుపొంది భృత్యు లందఱు నొక్కసారిగా రా జున్నగదిలోనికి పరుగెత్తుకొని

పోయిరి. రాజు వారిలో మంత్రివంకఁ జూచి "ఓనరసింహరాజా! నా వెన్ను చఱువుము ; నా దేహము నొప్పింపుము ; న న్నొక్క దెబ్బ కొట్టుము. లోపలినుండి సంతోషసముద్రము పొంగివచ్చి నాశరీరమును పగిల్చి వేయుచున్నట్లున్నది. సముద్రమున పుట్టి కురంగేశ్వరపురము నందు చచ్చి మరల సముద్రమునందు దొరకిన యోచిన్నదానా! ఇటు వచ్చి నన్ను కౌఁగిలించుకొమ్ము. ఓనరసింహరాజా! చేతులు జోడించి కృతజ్ఞతాభివ్యంజకముగా దేవునికి నమస్కారములు చేయుము. ఇది మనసాగరిక. ఓబిడ్డ! ఓదీర్ఘాయుష్మంతురాలా ! నాదీవన లంగీక రింపుము. ఓనరసింహరాజా! ఘోరతరా లయిన కుటిలాలకచేతిలో చచ్చి యుండవలసినదే కాని మనభాగ్యముచేత సాగరిక యక్కడ చావునకుతప్పి బ్రతికినది. ఇప్పుడు నీకు రాణియయి యున్న యీామెను చేతులు జోడించి సగౌరవముగా నీ వంగీకరింపుము ... తనకథ యంతయు పూసగ్రుచ్చినట్లు చెప్పును" అని ఆచేరువ నున్నసుగుణ ప్రియుని జూచి "ఇతఁ డెవరు?" అని యడిగెను. "ఇతఁడు బృందావన పురాధినాథు డయినసుగుణప్రియుఁడు. దేవరివారియొక్క మనోవ్యాకు లతను విని దర్శనము చేయుటకయి యితఁ డిక్కడకు వచ్చినవాఁడు" అని నరసింహరాజు చెప్పెను. అప్పు డారాజు సుగుణప్రియుని జూచి "మిత్రుఁడా! నాయాలింగనముల నంగీకరింపుము" అని ప్రీతిపూర్వక ముగా పలికెను. అతఁడును సముచితసల్లాపము చేయుచుండఁగా రా జాకాశమువంకఁ జూచి చేతులు జోడించి "ఓ యీశ్వరుఁడా ! నా పుత్రికను దీర్ఘాయురారోగ్యవతినిగాఁ జేయుము" అని ప్రార్థించి నర సింహరాజును జూచి "ఈసంగీత మెక్కడిది?" అని యడిగెను. "నాకు వినఁబడలేదు." అని నరసింహరాజు మాఱుపలికెను. "ఇదిగో ఈదిక్కున స్పష్టముగా వినఁబడుచున్నది. ఆలకింపు" అని యతఁడు

చేయిచాపి తూర్పుదిక్కును చూపఁగా నరసింహరాజాలకించి యా దిక్కున సంగీతము లేకుండుట కనిపెట్టి, అపరిమితసంతోషముచేత మనసు చెదరి యుండుటనుబట్టి రాజున కట్లు తోఁచుచున్న దని యెఱిఁగి, అట్టిసమయమునందు కా దని మాట కడ్డుమాట చెప్పుట క్షేమకరము కా దని "అవును సంగీతము వినఁబడు చున్నది." అనితల యూఁచెను. అంతట రాజు కన్నులు మూఁతలువడ కునుకుపాట్లుపడుచు తనకు నిద్రవచ్చు చున్న దని చెప్పి దిండు తలక్రిందఁ బెట్టుకొని పఱుపు మీఁద పరుండి గాఢనిద్రపోయెను. సాగరికయు తండ్రివద్దఁ గూరుచుండి పైటచెఱఁగుతో విసరుచు కనిపెట్టియుండెను. నిద్రపోవుచున్న కాలములో రాజున కొకవింతయైన స్వప్నమువచ్చెను. ఆకలలోనతఁడు తనకు బెజవాడ కనకదుర్గప్రత్యక్షమయితన్నా దేవాలయమునకురమ్మని యాజ్ఞాపించినట్లును, దేవాలయములో దేవతాసన్నిధానమున పీఠము ముందు నిలువఁబడి తనకష్టకథను భక్తిపూర్వకముగా విన్నవించిన పక్షమున గొప్పమేలు కలుగు నని యాదేవి యానతిచ్చినట్లును, తానట్లు చేసెద నని హస్తములు ముకుళించి మ్రొక్కుకొన్నతరువాత దేవి దీవించి యంతర్హితురా లయినట్లును, పొడగని మేలుకొనెను. అతఁడు మేలుకొని చూచునప్పటికి మనస్సులో నున్నపూర్వపువ్యసన మంతయు పోయి దేహము జవసత్త్వములుకలదగుటయేకాక మనస్సును మిక్కిలి యుత్సాహము కలదిగా నుండెను. అందుచేత నాతఁ డాయుత్సాహమున కంతకును కనకదుర్గయొక్క వరప్రసాదమే కారణ మని భావించుకొని యాస్వప్నవృత్తాంతము నంతను వారికిఁ దెలిపి తాను వెంటనే బెజవాడకు పోవ నుద్దేశించి యున్నా నని తనమనోనిశ్చయమును వారితోఁ జెప్పెను.

అప్పుడు సుగుణప్రియుఁడు రెండుమూఁడు దినములు తనయింట నుండి యతిథిసత్కారమును పొంది గృహపావనము చేసి పోవలసిన దని రాజును బ్రార్థింపఁగా, రఘుదేవరాజాతనిప్రార్థన నంగీకరించి సపరివారముగా నోడ్డునకు పోయి బృందావనపురములో మూఁడుదినము లాతని గృహమునందు విందుగానుండెను. ఆమూఁడుదినములలోను బీద దశలో నున్నప్పుడుసహితము తా నెంతో ప్రేమించి గౌరవించుచుం డిన సాగరియొక్క తండ్రి యైనరాజశ్రేష్ఠుని సంతోషపెట్టుట కయి సుగుణప్రియుఁడు ప్రతిదినమును వింతలయినభక్ష్యభోజ్యములను వివిధము లయిన వినోదములను బహువిధములయిన యుత్సవములను సమకూర్చెను. రాజాతనియభిప్రాయమును గ్రహించి దారిద్ర్య దశలోసహితము తనకొమార్తెను తిరస్కారభావముతోఁజూడకయాద రించిన యాసుగుణప్రియుని తన కల్లునిగాఁ జేకొనుటకయి సంకోచ పడకుండెను; ఆతని భర్తనుగా గ్రహించుట కయి సాగరికయు విము ఖురాలు కాకుండెను. కాని రఘుదేవరాజుమాత్రము వివాహనిశ్చ యము చేయుటకుముందుగా తా మందఱును గలిసి బెజవాడ కనక దుర్గాలయమునకు పోవలయు ననియు తరువాత నేసుమూహూర్తము నిశ్చయింపఁబడు ననియుఁ జెప్పెను. అందుమీఁద వాఱందఱును మెట్టను ప్రయాణ మయి మూఁడుదినములో సురక్షితముగా బెజవాడ జేరిరి.

బెజవాడకు పోయి రఘుదేవరాజు పరివారసహితముగా కనక దుర్గయాలయములో ప్రవేశించినప్పుడు రాజుభార్య యైనప్రభావతిని బ్రతికించిన వృద్ధుఁ డయిన ధన్వంతరి పీఠమునకు సమీపమున నిలు వఁబడియుండెను; యోగిని యయి యా దేవత కర్చకురాలుగానున్న ప్రభావతి పీఠమున కెదురుగా నిలుచుండెను; బహుసంవత్సరముల

నుండి భార్యానిమిత్తమై వ్యాకులపడుచుండుటచేత రాజురూపము విస్తారముగా మాఱిపోయినను, ప్రభావతి దూరముననుండి చూచియే భర్తనానవాలుపట్టి యాతఁడు పీఠముసమీపమునకు వచ్చి మాటాడ నారంభించినప్పుడు కంఠస్వరముకూడ గురుతుపట్టి యాతఁడు చెప్పుచున్నమాటల నద్భుతప్రమోదములతోను శ్రద్ధతోనువినుచుండెను, అతఁ డప్పుడు దేవతానమస్కారముచేసి చేతులు జోడించి ఫాలతలమునఁజేర్చి దేవత కెదురుగా నిలువఁబడి "ఓమహాదేవీ! నీయాజ్ఞను చెల్లించుట కయి నే నిక్కడకు వచ్చియున్నాను. నాచరిత్రమును నీ సెలవుప్రకారముగా నీకు విన్నవించెదను. ప్రసన్నురాల వగుము. నేను కళింగదేశాధిపతిని. శత్రుభీతిచేత స్వరాజ్యము విడిచి దేశసంచారము చేయుచు మోటుపల్లెలో ప్రభావతియను సుందరిని వివాహమాడినాను. ఆమె సాగరిక యనుస్త్రీశిశువును ప్రసవించి సముద్రమధ్యమున నోడలో స్వర్గస్థురా లయ్యెను. ఆతల్లిలేనిబిడ్డ కురంగేశ్వరపురములో కుటిలాలకయొద్ద పెరుగుచుండెను. ఆమెకు పదునాలుగు సంవత్సరముల ప్రాయము వచ్చునప్పటికి కుటిలాలక యాచిన్నదానిని చంపింపఁదలచెను. కాని యామెపాలిటి భాగ్యదేవత యామెను బృందావనపురమునకుఁ గొని తెచ్చి విడిచినది. నే నాపురమార్గమున నోడలో సముద్రముమీఁద పోవుచుండగా నాభాగ్యదేవతయే యీ కన్యను మరల నేనున్న యోడలోనికిఁ జేర్చినది. ఈమె యచ్చట తనవృత్తాంతమునుజెప్పి తాను నాకూఁతు రగుట తెలియునట్లుచేసినది అని తన యావద్వృత్తాంతమును సంగ్రహముగా నేకరువుపెట్టెను.

ఆమాటలను వినుచున్న ప్రభావతి హృదయములోనుండి మేరమీఱి పొంగిపొంగివచ్చుచున్న సంతోషతరంగములలో మునిఁగిపోయి తిన్నఁగా మాటాడశక్తురాలుగాక గద్గదస్వరముతో "ఓరఘుదేవ

రాజా! నీవు నీవు—'' అని మూర్ఛపోయెను.'' ఈమె కేమియాపద వచ్చినది.? అయ్యో! ఈకాంత చచ్చిపోవుచున్నది! అన్నలారా! రక్షింపుడు'' అని రఘుదేవరాజు కేకవేసెను. ''ఓరాజా! నీవిప్పు డీ దేవతాసన్నిధానమున చెప్పినదంతయు నిజమయినపక్షమున, ఈమె నీభార్య'' అని ధన్వంతరి చెప్పెను. ''పుణ్యుడా! కాదుకాదు. నా భార్యను నే నీరెండుచేతులతోనే యోడలోనుండి సముద్రములో విడిచినాను'' అని రాజు దృఢముగాం జెప్పెను. అప్పుడు ధన్వంతరి తానొకదినమున మందువస్తువులనిమిత్తమయి ప్రాతఃకాలముననే బృందావనపురసమీపమున సముద్రతీరమున తిరుగుచుండుటయు. అప్పుడొడ్డున కొకదోనె కొట్టుకొనిరాంగా దానిలోం జూచినప్పుడు మూర్ఛితురాలయియున్న యువతిని నగలపెట్టెయు కానంబడుటయు, తానామెను సజీవితురాలిని జేసి తెచ్చి యీదేవాలయములో నొప్పగించుటయు మొదటినుండియు జరిగినదంతయుం జెప్పెను. ఇంతలో ప్రభావతి మూర్ఛతేరి ''ఓ దేవా! మీరు రఘుదేవమహారాజులు కారా? మీరూపు మాయనరూపమువలెనే యున్నది; మీకంఠస్వర మాయనకంఠస్వరమువలెనే యున్నది. గాలివాన, ప్రసవించుట,మృతినొందుట, అన్నమాటలను మీ రప్పుడు సెల వియ్యలేదా;'' అని యడిగెను.''ఇది మృతినొందినప్రభావతికంఠస్వరమా, అని యతం డద్భుతపడి చూచుచుండెను. ''అపును అమృతినొందినప్రభావతిని నేనే. నేను మృతినొందితిననియు సముద్రములో మునింగితి ననియు మీరు భ్రమ పొందినారు'' అని యామె సందేహనివృత్తి చేసెను. అప్పుడు రాజు మహాశ్చర్యమగ్నమానసుడయి యవ్యాజభక్తితో ఓకనకదుర్గా! నీ వెంత సత్యసంధురాలవు!'' అని చేతులుకోడించెను. ''ఓ మహారాజా! మిమ్ము నేను ముందుగా గుఱుతుపట్టినాను.

మీ వ్రేలి నున్న యీయుంగరము మనము మోటుపల్లెను విడుచునప్పుడు నాతండ్రి కన్నీరు విడుచుచు మీచేతిని పెట్టినది'' అని యామెగుఱుతులు చెప్ప మొదలు పెట్టెను. ''ఇఁక చాలును. ఓ దేవతలారా! మీ రిప్పు డనుగ్రహించినమహోపకారమువలన వెనుకటియాపద లన్నియు వినోదకథలయిపోయినవి. ఓప్రభావతీ! ఇటువచ్చి నాగాఢాలింగనములలోను సంతోషసముద్రములోను నీ వీసారి నిజముగా మునిఁగిపొమ్ము'' అని భార్యను కౌఁగిలించుకొనెను.

అప్పుడు సాగరిక ''నాహృదయ మిప్పుడు తల్లికౌఁగిటఁ జేర నన్ను త్వరపెట్టు చున్నది. ఆహా! ఏమి నాభాగ్యము!'' అని వంగి దుర్గకు నమస్కారము చేయు చున్నది. ''ఓహృదయేశ్వరీ! సముద్రమధ్యమున నీవు వహించినభార మయి యుండి నీగర్భమునఁ బుట్టి నీ కండ మైనయీసాగరిక యెట్లు దేవతా ప్రార్థనము చేయు చున్నదో చూడు'' అని కొమార్తెను తల్లికిఁ జూపెను. ''ఓపుత్రీ! నీవుదీర్ఘాయుష్మంతురాల వగుము మనుము. ఇప్పుడు స్త్రీలలో నెల్ల నేను ధన్యతమురాల నయినాను'' అని కొమార్తెను చేతులుచాచి యక్కునఁ జేర్చి కౌఁగిలించుకొని ముద్దాడుచుండెను. ఈప్రకారముగా జనని కొమార్తెను కౌఁగిలించుకొని యానందబాష్పములలో తేలియాడు చుండఁగా, రఘుదేవరాజు పీఠమునకు సాష్టాంగ నమస్కారముచేసి ''ఓమహాదేవీ! మాయందు సంపూర్ణానుగ్రహ ముంచుము. నీవు చేసిన యీపరమోపకారమును నే నెప్పుడును మఱవక నిత్యమును నిన్నారాధించుచుండెదను'' అని కృతజ్ఞతాపూర్వకముగా మరల మరల వందనములు చేసెను. ప్రభావతియు సాగరికయు కూడ పీఠమునకు సాగిలఁబడి తమకృతజ్ఞతను దెలిపిరి. దేవతా సమక్షమునందే యీసంతోషసమయములో రాజప్పుడు ప్రభావతియొక్క యనుమతిని

పొంది సాగరికను సార్థకనామధేయుం డయిన సుగుణప్రియున కిచ్చి వివాహముచేయుటకు వాగ్దానము చేసెను.

ఇట్లుసర్వజనసంతోషకరముగా చిరకాలవియోగము నొంది యున్న భార్యభర్తలును పుత్రికయు నొక్కచోట సమావేశ మయి యనిర్వాచ్య మయినసల్లాపసౌఖ్యము ననుభవింపం గలిగిరి. నీతియు సద్వర్తనమును గలవారికి నడుమ నెన్నియాపదలు వచ్చినను ధైర్య ముతోసహించి యీశ్వరానుగ్రహమునే నమ్ముకొని యున్నయెడల తుదకు కొండలవలె వచ్చి మీఁద పడినయాపద లన్నియు మంచు వలె విడిపోయి నిరుపమాన సుఖసంతోషములు కలుగునని చూపుచు లోకమునకు సహనమును సద్వర్తనమును నేర్పుటకు వీరొకదృష్టాంత భూతులుగా నున్నారు. నరసింహరాజు సత్యశీలతయు రాజభక్తియు విశ్వాసమును గలవారిలో నగ్రగణ్యుఁడుగానున్నాఁడు, అతఁడు ; తన కప్రయత్నముగా రాజ్యమురానున్ననునిరుపమానరాజ్యవైభవమును తృణప్రాయముగా నిరాకరించి ప్రవాసముపా లయియున్న రాజును వెదకి తెప్పించి సింహాసన మెక్కించుట యెంతశ్లాఘాపాత్ర మయిన ఘనకార్యముగా నున్నది! ప్రభావతికి ప్రాణదానము చేసినధన్వం తరియొక్కయద్భుతచర్యను విచారింపగా మనుష్యుఁడు ప్రపంచ తత్వవిషయమున సత్య మయినజ్ఞానము కలవాఁ డయియున్నపక్ష మున లోకమున కెంతో యుపకారము చేయవచ్చునని తెలుచున్నది కదా! అంతతరువాత వారందఱును బృందావనపురమునకుఁ బోయి సాగరికయొక్క వివాహమును మహావైభవముతో జరపిరి. అక్కడ కొన్నిమాసము లున్నతరువాత సాగరికనుభర్తయొద్దవిడిచి యారాజ దంపతులు స్వరాజ్యమును జేరి కళింగపట్టణమునందు చిరకాలము రాజ్యసంపదల ననుభవింపుచుండిరి. ఈలోపల కురంగేశ్వరపురము

నందు కుటిలాలక చేసినదుష్కృత్యము వెల్లడికాఁగా తామసమయ మునం దన్నదానముచేసి తమప్రాణములు కాపాడినమహోపకర్త యొక్కపుత్రికనునిష్కారణముగాఁ జంపించినందున కందలిప్రజలాగ్రహపరవశు లయి యొకనాఁటిరాత్రి రాజమందిరమునకు చిచ్చుంటించిరి. ఆయగ్నిసంక్షోభమునందు మహాపరాధిని యైనకుటిలాలకమాత్రమే కాక సహవాసదోషముచేత నిర్దోషు లయినయామెభర్తయు పుత్రికయుకూడ కాలి దేహములు విడిచిరి. కొంతకాలము పనికివచ్చినను దుష్ప్రవర్తనము చిరకాలము సుఖప్రద మయినదిగా నుండనేర దని చూపుటకు కుటిలాలకను నిదర్శనముగాఁ జెప్పవచ్చును. కాఁబట్టి యీకథను జదువతటస్థించినవా రసత్యమువలనను మోసమువలనను దౌర్జన్యమువలనను తమ కొకవేళ సంపదకాని యితరలాభముకాని కలిగినను తామట్టితుచ్ఛలాభముల కాసపడక యిహపరసుఖదాయక మయిన సద్వర్తనమును విడువక న్యాయమార్గముననే సుఖపడుటకు సదా ప్రయత్నింతురుగాక !

స ం పూ ర్ణ ము.

---

బాకర్స్ ప్రెస్, రాజమండ్రి—1950.

## స్త్రీల కుపయోగించుకథలు

### అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

### ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రహాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

### ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాంశములు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవ చరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

చింతన్న ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930

# కురంగేశ్వర వర్తకచరిత్రము



ఇది

"షేక్స్పియర్" అను మహాకవివిరచిత

"మర్చెంటు ఆఫ్ వెనిస్" అను నాటకకథ ననుసరించి,

కందుకూరి-వీరేశలింగముచే

రచియింపఁబడినది.



ప్రకాశకులు:

హితకారిణీసమాజమువారు

రాజమహేంద్రవరము

1919.

# కురంగేశ్వరవర్తకచరిత్రము.

ఇది

"షేక్స్పియర్" అను మహాకవియొక్క

"మెర్చెంటు ఆఫ్ వెనీస్" అను నాటకకథ ననుసరించి


కందుకూరి-వీరేశలింగముచే


రచియింపఁబడియె.

For favour of Exhibition


For Hitakarini Samaj



5 వ కూర్పు 500

ప్రకాశకులు:

హితకారిణీసమాజము,

రాజమహేంద్రవరము.

1949.

దీనివెల 4 అణాలు.

# ఈనాటకమునందు వచ్చు పాత్రములు.



దుష్టబుద్ధి—ఒకబౌద్ధవర్తకుఁడు.

సత్యకీర్తి—ఒకహిందూవర్తకుఁడు.

మానసారుఁడు—సత్యకీర్తిమిత్రుఁడు.

వసుమతి—మానసారునిభార్య.

దృఢచిత్తుఁడు—మానసారుని చెలికాఁడు.

చతురిక—దృఢచిత్తునిభార్య; వసుమతిచెలికత్తె.

వాచాలుఁడు—ఒకన్యాయవాది.

సమయజ్ఞుఁడు—న్యాయవాది వేషము వేసికొన్న వసుమతి.

సుబుద్ధి—దుష్టబుద్ధియల్లుఁడు.

ఈచెప్పినవారుగాక రాజును, సభికులును మఱికొందరును వత్తురు.

స్థలములు:—

కురంగేశ్వరము—ఒకపట్టణము; ఇందు దుష్టబుద్ధి మొదలగువా రుండిరి.

నీలపల్లె—వసుమతియు, చతురికయు, ఉన్నయూరు.



# కురంగేశ్వరవర్తక చరిత్రము.



కురంగేశ్వర*మను పట్టణమున దుష్టబుద్ధియను బౌద్ధుఁ డొకఁడు కాపురముండెను. అతఁడు హిందూవర్తకుల కెక్కువవడ్డికి బదులిచ్చి, దానివలన గణనాతీతమయిన రొక్కమును గడించెను. ఆదుష్టబుద్ధి మిక్కిలి కఠినచిత్తుఁడుగనుక తానప్పిచ్చిన వారియొద్దనెల్ల క్రూరముగా ధనము రాఁబట్టుకొనుచుండెను. అందుచేత నాతనియందు సామాన్యముగా యోగ్యులయినవారికందఱికిని అనిష్టముగా నుండెను. వారిలోను ముఖ్యముగా సత్యకీర్తియను వర్తకున కాతనిపేరన్నఁ దలకంటగించును. బాలుఁడయిన యావర్తకుఁడు ఆపన్నులయియున్నవారికి ఋణములిచ్చి, వారియొద్దనెప్పుడును వడ్డినిపుచ్చుకొనువాఁడు కాఁడుగనుక, దుష్టబుద్ధికిని సత్యకీర్తియందు మహాకోపముండెను కాఁబట్టి లుబ్ధశిరోమణి యైన యాబౌద్ధునకును దానశీలుఁడయిన యాహిందువునకును గర్భశత్రుత్వము కలిగియుండెను. అంగడివీధిని దుష్టబుద్ధియొక్కపొడ కనఁబడినప్పుడెల్లను, ఆతని నిర్దాక్షిణ్యమును, ధనాకర్షణమునకై చేయు నిర్బంధములను పేర్కొని మొగముముందఱనే సత్యకీర్తి యాతనిని దూషింపుచుండును. అప్పు డాబౌద్ధుఁ డాదూషణభాషణముల కెల్ల నోర్చుకొని మాఱు మాటాడక పయికి శాంతాత్మునివలె నటించునుగాని, లోపల నేలాగుననైన పగఁదీర్చుకొనవలెనని చింతించుచుండెను.

ఆకాలపువారిలోనెల్ల సత్యకీర్తి మిక్కిలిదయాళుఁడును, సంపన్నుఁడును, పరోపకారము చేయుటయందెప్పుడును విసుగు చెందనివాఁడును, అయియుండెను. వేయేల? పూర్వకాలపుహిందువులయందున్న సుగుణములన్నియుమూర్తీభవించియాతనియందేనివాసముగానుండెను. ఆపట్టణము

* దీనినే యిప్పుడు కోరంగి యందురు.

నందుంచువారందఱును నాతనిమీఁద ప్రాణముగానేయుండిరి; కాని యా తనికి ప్రాణాధికుఁడయిన మిత్రుఁడు మానసారుఁడనువాఁడు. అతనికి పితార్జితమయిన ధనము విశేషముగా లేకపోయినందున, తన స్వల్ప మయినయాదాయమునకు మించినవ్యయముచేయుచు కొలఁదికాలములో నించుమించుగా యావద్ధనమును వెచ్చ పెట్టెను. గొప్పవంశమునందు పుట్టి యౌవనవంతులయి యుండువారందఱును తక్కువరాఁబడిగలిగి యున్నప్పు డీప్రకారముగానే చేయుదురుగదా ? మానసారునకు ధనము కావలసినప్పుడెల్లను, సత్యకీర్తి సాయము చేయుచుండును. వారి యిద్దఱి మైత్రియుఁ జూచి వారికి దేహములే వేఱుగాని ప్రాణములొక్కటియే యయియున్నట్టు కనఁబడుచుండెను.

ఒకనాఁడు మానసారుఁడు సత్యకీర్తియొద్దకువచ్చి, తనకు ప్రాణ పదమయియున్న ధనవంతురాలగు కన్యనొక్కదానిని వివాహమగుట వలన మరల భాగ్యవంతుఁడను కావలెనన్న యిచ్ఛయున్నదనియు, కొంత కాలముక్రిందట కాలముచేసిన యామెతండ్రి పోవునప్పుడు కూఁతునకు విశేషవిత్తమునిచ్చిపోయెననియు, ఆమెతండ్రియొక్క జీవితకాలములోనే తానామెయింటికి వెళ్ళుచువచ్చినపుడు నోరుమెదల్పక చూపులచేతనే యామెతనమీఁదిమోహము బయలుపఱుచుచు వచ్చెననియు, చెప్పి అట్టి శ్రీమంతురాలిని వివాహమగుట పెండ్లికూఁతువారితో సరితూఁగఁజాలి నంతస్థితి తనకిప్పుడు లేదుకాఁబట్టి మూఁడువేలరూపాయలను బదులిచ్చి యీవఱకుఁ జూపినయనుగ్రహములో దీనినిసహిత మొకదానినిగాఁ జేర్పవలెననియు, ప్రార్థించెను. ఆసమయమున మిత్రమనోరథమును ఈడే ర్చుటకుఁ జాలిన సొమ్ము సత్యకీర్తిచేతిలో సిద్ధముగాలేకపోయెను; తన యమూల్యవస్తువులతోనిండియున్న యోడలుకొన్ని శీఘ్రముగా రావలసి యున్నందున, ఆపట్టణములో కోటీశ్వరుఁడుగా నుండి లోకులకు హాదుకగా ఋణములిచ్చుచున్న దుష్టబుద్ధియొద్దకుఁబోయి, ఓడలోని సర

కుల తాకట్టుమీఁద బదులుచేసి తెచ్చి కోరినసొమ్మిచ్చెదనని చెప్పెను.

అప్పుడు సత్యకీర్తియు మానసారుఁడును గలిసి దుష్టబుద్ధియింటికిఁ బోయిరి. వారిలో సత్యకీర్తి దుష్టబుద్ధినిజూచి నీమనసువచ్చినంతవడ్డి నిర్ణయించుకొని మూఁడువేల రూపాయలు బదు లీయవలసిన దనియు, ఇప్పుడు సముద్రముమీఁదనున్న యోడలువచ్చినయుత్తరక్షణముననే వాని లోని సరకులనువిక్రయించి వడ్డితోఁగూడ లెక్కచూచి ఋణమంతయుఁ దీర్చివేసెదననియు, అడిగెను. అందుమీఁద దుష్టబుద్ధి తనమనసులోఁ దానిట్లు చింతింపసాగెను. "ఈతనినొక్కసారి యేలాగునైనను నాచేతి లోఁ జిక్కించుకోఁ గలిగితినా, నాపూర్వద్వేషమంతయు నిస్సందేహముగా వడ్డితోడఁగూడఁ దీర్చుకొందును; మాబొద్దులపేరన్న నీతఁ డసహ్యపడును; వడ్డినిపుచ్చుకొనకయే బదుళ్ళిచ్చి నాకు నష్టమును గలిగించును; నేను నాకష్టార్జితముమీఁద సంపాదించుకొన్న న్యాయమయిన ధనమునకు అధర్మవృద్ధియని పేరుపెట్టి నాధనమును నన్నును వర్తకుల ముందఱ నిందించుచుండును. ఇటువంటివానిని నేనిప్పుడు వదలిపెట్టితినా, మాజాతివారికందఱకునపకారముచేసినవాఁడనగుదును." అని తనలోఁ దానేమొగొణుగుకొనుచు నడిగినమాటకాదుష్టబుద్ధి ప్రత్యుత్తరమీయక పోవుటజూచి, సొమ్ముకొఱకత్యాతురుఁడయి యున్నవాఁడు కాఁబట్టి సత్యకీర్తి "ఓదుష్టబుద్ధీ! నేను నిన్నేమడిగితినో విన్నావా? నీవు సొమ్ము బదులిచ్చెదవా ? లేదా ?" అని మరల హెచ్చరించెను. అందు మీఁద "ఓయీ! సత్యకీర్తీ! నీవు నాధనమునుగూర్చియు నావ్యాపార మునుగూర్చియు వర్తకశాలలలో బహిరంగముగా ననేకపర్యాయములు నన్ను దూషించి యున్నావు. మాజాతివారి కెల్లను శాంతత సహజ గుణము కాఁబట్టి, నీవెన్నియన్నను నేను వానికెల్లను సహించి యూరక కుండుచు వచ్చినాను. అందుమీఁద నన్ను 'నాస్తికుఁడా' 'గొంతుకోతలు కోయుకుక్కా' యని కానిమాటలాడి, నాబట్టలమీఁద నుమ్మివేయుటయే

కాక, నన్ను కుక్కను తన్నినట్టు తన్నునసహితము తన్నితివి. అంత చేసియు మరల నిప్పుడు నాసాహాయ్యమునే యపేక్షించి నాయొద్దకు వచ్చి 'దుష్టబుద్ధీ? నాకు బదులిమ్మ'ని వేడుచున్నావు. కుక్కయొద్ద నెక్కడనైన ధనముండునా? కుక్క యెప్పుడయిన మూడువేల రూపాయలిచ్చుట సాధ్యమగునా? నీకు నేనిప్పుడు వంగినమస్కారముచేసి, 'మహాప్రభూ! మీరు కడచిన బుధవారమునాడు నామీద నుమ్మివైచితిరి మఱియొకనాడు కుక్కయని సెలవిచ్చితిరి—మీరుచేసిన యీ మర్యాదలకొఱకా మీకునేను బదులీయవలసినది?' అనియడుగుచున్నాను." అని మాఱుచెప్పెను· "నేనిప్పుడుసహితము నిన్నాపేరుననేపిలిచి, మరల నీమొగముమీఁద నుమ్మివైచి తన్నునసహితమును తన్నెదను. నేనడిగిన సొమ్మును బదులియ్యఁదలఁచుకొంటివేని,మిత్రునకిచ్చినట్టియ్యక శత్రువునకిచ్చినట్టిమ్ము. నేను మాట తప్పిపోయినయెడల, నిర్దాక్షిణ్యముతో నీయిష్టమువచ్చిన దండుగను పుచ్చుకోవచ్చును." అని సత్యకీర్తి పలికెను. దానిమీఁద దుష్టబుద్ధి "నీవెంత యాగ్రహావేశమునొందియున్నవాఁడవో చూడు. నీవెట్టివాఁడవైనను నీతో మైత్రి చేసికొని, నీదయను సహితము పడయవలయునని నేనాశపడియున్నాను. కాఁబట్టి నీవు నాకుఁజేసిన యవమానమంతయు నేఁటితో మఱచిపోవుచున్నాను. నీయొద్ద గవ్వయైనను వడ్డిపుచ్చుకొనక నీకుఁగావలసిన ధనమిచ్చి నీయక్కఱతీర్చి పంపెదను. నిమిషమోపికపెట్టుము." అనిచెప్పెను. పయి కెంతో యనుగ్రహపూర్వకములుగానున్న యెప్పుడు నెదురుచూడని యీవినయవచనములకు సత్యకీర్తి యద్భుతపడుచుండఁగా, దుష్టబుద్ధి మఱింతకుత్రిమ వినయము నభినయించుచు, ఆయౌదార్యమునంతను సత్యకీర్తియొక్క యనుగ్రహ సంపాదనముకొఱకే చూపుచున్నట్టు నటించుచు, 'నీవుకోరిన రూపాయలను బదులిచ్చి దానిమీఁద వడ్డిగైకొన'నని మరలఁ జెప్పెను; కాని సత్యకీర్తి తనతోఁగూడ నొక న్యాయవాదియొద్దకు వచ్చి, అతని

సమక్షమున 'గడువునాటికి సొమ్మియ్యలేకపోయినపక్షమున నాశరీరములో దుష్టబుద్ధి కోరినభాగమునుండి సేరుమాంసమును గోసి యియ్యగలవాఁడ'నని వేడుకకొఱకొక పత్రమునుమాత్రము వ్రాసి చేవ్రాలు చేసి యియ్యవలెనని కోరెను.

“నీవు కోరినది యింతేకదా? అంతటితో నీవిఁకఁ దృప్తి పొందియుండుము. నీ కోరికప్రకారము పత్రమునువ్రాసి చేవ్రాలు చేసియిచ్చి బౌద్ధునియందును గొంతభూతదయ కలదని యింతటినుండి యొప్పుకొనెదను” అని సత్యకీర్తిచెప్పెను. మానసారుఁడు తనకొఱకయి యిట్టిపత్రముమీఁద వ్రాలుచేయవలదని చెలికానిని బహువిధములఁ బ్రార్థించెను. గాని, సత్యకీర్తి యాతనిమాటలువినక 'పత్రములోని గడువురాకముందే యియ్యవలసినదానికంటెఁ బెక్కు మడుంగుల ధనముతో నా యోడలు తప్పకవచ్చి చేరునుగాన చేవ్రాలుచేయక మాన'నని పట్టుపట్టెను. వారిప్రసంగమును వినుచున్న దుష్టబుద్ధి, “ఓహో! ఈహిందూమతస్థు లెంతసంశయాత్ములు! తమ మనసులో కపటముండును గనుక, ఎదుటివారిమనసులోను నదేప్రకారముగా నుండుననుకొందురు. మానసారుఁడా! దయచేసి నాకీయొక్కమాటకు ప్రత్యుత్తరముచెప్పు. ఒకవేళ నతఁడు గడువునాఁటికి సొమ్ము చెల్లింపలేకపోవుననుకో— ఒడంబడిక ప్రకారము జరిగినయెడల నాకేమిలాభము కలుగును? ఒకమనుష్యుని దేహమునుండి నిర్బంధముగా తీసికొన్న సేరుమాంసము, సేరు మేకమాంసమంత వెలయైనను జేయదు. అంతప్రయోజనకరమును గాదు. అతని స్నేహమును సంపాదించుకోవలెనని నేనీయుపకారమును జేయఁబూనుకొన్నాను. అతనికిష్టముండి యంగీకరించినను మంచిది; అంగీకరింపకపోయిన నంతకంటెను మంచిది” అనిపలికెను.

ఆబౌద్ధునియొక్క దుస్స్వభావమును పూర్తిగా నెఱిఁగినవాఁడు గనుక, అతఁడెన్నితీయని నమ్మకపుమాటలు చెప్పినను లోపల నాతనిని

విశ్వసింపక మానసారుఁడు తననిమిత్తము యిటువంటి ఘోరమయిన యొడంబడిక కొప్పుకొని లేనియుపద్రవమును దెచ్చిపెట్టుకొవలదని పలు దెఱఁగుల మిత్రునకుబోధించెను. కానియాతఁడెంతమారము చెప్పినను వినక, ఆబొద్దుఁ డట్టిపత్రమునుగోరుట పరియాచకమునకుఁగాని మఱి యొకందుకుఁగాదనుకొని, తుదకు సత్యకీర్తి బొద్ధుఁడు కోరినప్రకార ముగా పత్రమువ్రాసియిచ్చి సొమ్ముపుచ్చుకొనెను.

మానసారుఁడు పెండ్లిచేసికొన యత్నించుచున్న ధనికురాలయిన యాకన్నియది కురంగేశ్వరమునకు సమీపముననుండు నీలపల్లెయను గ్రామము; ఆమె పేరు వసుమతి. ఆమెవిద్యాబుద్ధులయందును రూపగుణ సంపదలయందును నసమానురాలుగానుండెను. ముందు తనప్రాణముల మీఁదికి వచ్చుననియైన భయపడక సత్యకీర్తిమిత్రకార్యార్థమయి శత్రుని వేఁడుకొని తెచ్చి ధనసాహాయ్యము చేసినందున మానసారుఁడు సముచిత పరివార సహితుఁడయి మహావైభవముతో తరలివెళ్ళి, తన మిత్రుఁడైన దృఢచిత్తునితోడఁగూడ నీలపల్లెచేరెను మానసారుఁడెల్లవిధములఁ దన కుఁ దగినవరుఁడుగాఁ గనఁబడినందున, వసుమతి నిమిషమయిన నాలస్య ముచేయక యాతని భర్తగాఁ బరిగ్రహింప సమ్మతించెను.

మానసారుఁడు తన్‌స్థితి నించుకయు వసుమతికడదాఁచక, తాను విశేషవిత్తవంతుఁడను గాననియు, తాను సత్కులమునందుఁ బుట్టినందు వలనను తనపెద్దలు సుప్రసిద్ధులయినందువలనను గలిగిన యాధిక్యము తప్ప మఱియొక్క యాధిక్యమేమియుఁ దనయొద్ద లేదనియు, ధారాళ ముగా నొప్పుకొనెను. మగని భాగ్యమునకయి లేశమయిన నాశపడవల సినయక్కఱలేని యావసుమతి ఆతనియందుఁగల సుగుణసంపదను జూచియే కామించినదిగనుక, అందుమీఁదనామె శృంగారలజ్జలు కాన్పింప నమ్రతతో 'నేనే మీధనమును కాఁబోవుచున్నాను. కాఁబట్టి మీకా ధనమునందుకంటె ఈప్రాణధనమునందే యెక్కువగౌరవముండునేని, నేనే

పదివేలయంతలు అమూల్యమగు దానినిగాను సహస్రగుణములఁ దద్ధనాధికురాలనుగాను, కాఁజాలుదునని తలఁచుచున్నాను' అని చెప్పి, ఆత్మప్రశంస యర్హము కాకపోవుట చింతించి చమత్కారముగా "నే నధికవిద్యావంతురాలను బుద్ధిమంతురాలను ప్రపంచానుభవమహితురాలను గాకపోయినను మీవలన నింక నేర్చుకోఁదగినంత వయస్సు ముదిరినదానను గానుకాఁబట్టి నాముగ్ధహృదయమును మీయధీనము చేసి సమస్తకార్యములయందును దానిని మీయాజ్ఞానుసారముగా నడపింపఁగల" నని పలికి మరల మానసారునివంకఁజూచి "ప్రాణనాయకా! నన్నును నాసొత్తునుఁగూడ మీకుసమర్పించి, అన్నిటిని మీవానినిగాఁజేయుచున్నాను. నిన్నటివఱకును ఈదివ్యభవనమునకును ఈభృత్యవర్గమునకును నేనే సర్వస్వతంత్రురాలనైన యజమానురాలను; నేఁడు మొదలుకొని యీసుందరమందిరమునకును ఈసేవకలోకమునకును మీరే యధికారులు—ఈయుంగరముతోఁడఁగూడ నాపాణిగ్రహణమును జేయుఁడు" అని, తనచేతి ముద్దుటుంగరమునుదీసి విభునిచేతికిచ్చెను. తనవంటి యల్పస్థితిమంతుని ధనాఢ్యురాలయిన యావసుమతి యంత యనుగ్రహపూర్వకముగాఁ బరిగ్రహించిన రీతినిజూచి, అద్భుత ప్రమోదమగ్నమానసుఁడయి మానసారుఁడు తన్నట్లు గౌరవించిన యామానవతి విషయమయిన తనకృతజ్ఞతను సంతోషమును దెలుపఁజాలక మాటలు తడఁబడఁ దనయనురాగమును కృతజ్ఞతను సూచించు మాటలేమో సగముసగము వచించి, ఉంగరమును చేతనందుకొని తాను దాని నెప్పుడు నెడఁబాయనని దృఢముగా వాగ్దానముచేసెను.

దృఢచిత్తుఁడును వసుమతియొక్క చెలికత్తెయైన చతురికయును దగ్గఱనుండి చూచుచుండఁగా, మానసారుడు వసుమతి భర్తనుగా స్వీకరింతునన్నప్పుడు వధూవరులనిద్దఱను నాశీర్వదించి యా దృఢచిత్తుఁడు ఆసుముహూర్తమునందే తానుగూడ వివాహముచేసికొనుటకయి యనుజ్ఞ

యుండవని యడిగెను. ఇప్పుడు నీవు భార్యను సంపాదించుకోఁగలుగుదు వేని, నీవివాహమునుకూడ నేకకాలమునందే జరుగుట మాకుఁ బరమ సంతోషకరమ'ని మానసారుఁడు నవ్వుచుఁ బలికెను.

అంతట దృఢచిత్తుఁడు తనకు వసుమతి చెలికత్తెయైన చతురిక మీఁద మనసు తగిలియున్నదనియు, తనప్రియసఖ మానసారుని వల్లభుని గాఁ గైకొన్నయెడలఁ దానును నన్నుభర్తనుగానంగీకరించెదనని యామె వాగ్దానము చేసినదనియు, చెప్పెను. ఆమాట వాస్తవమేగదాయని వసుమతి చతురికనడిగెను. లోకనంగీకారము కాదేని వాస్తవమేయని చతురిక మాఱుచెప్పెను. వసుమతి హృదయపూర్వకముగా నొప్పుకొన్నందున, 'మావివాహ మహోత్సవమునకు మీవివాహమువలన మఱింత శోభ గలుగునుగదా' యని మానసారుఁడు మందహాసము చేసెను.

ఆకాముకీకాముకులట్లు నిరుపమానసౌఖ్యము ననుభవింపుచుండఁగా, సత్యకీర్తివద్దనుండివచ్చిన సందేశహారుఁడు తెచ్చిన జాబులోని పిడుగువంటి దుర్వార్తవలన వారి యానందమునకు నడుమ భంగము గలిగెను. మానసారుఁడు జాబును చేతఁబుచ్చుకొని విప్పిచదువఁబూనునపుడు తెల్లపోయి చేతులువడఁకించుచుండఁగా ప్రాణమిత్రుఁడెవఁడైన లోకాంతర గతుఁడయినాఁడని యాలేఖయందు వ్రాయఁబడి యున్నదేమో యని వసుమతి భయపడఁజొచ్చెను. మీమనస్సునకంత నొప్పి కలిగించిన యాజాబులోని విషయములేవియని వసుమతి ప్రశ్నచేసినపుడు, 'జీవితేశ్వరీ! ఈవఱకు మనుష్యులు కాగితముమీఁద వ్రాయఁగలిగినవానిలోనెల్ల మిక్కిలి యప్రియములుగానున్న వాక్యము లీజాబునందున్నవి. మొట్టమొదట నీతో మాటాడినపుడు నాస్థితిగతులనెల్ల మఱుఁగుపెట్టక నీతోఁజెప్పియున్నానుగదా? ఏమియు లేనిదానికంటెను నధమమైనదొకటి నాకుగలిగియున్నదనికూడ నీకప్పుడే చెప్పవలసియుండెను. అది యేదంటివేని— 'ఋణము' అని, తాను సత్యకీర్తియొద్ద సొమ్ముబదులు పుచ్చుకొనుటయు

ఆసత్యకీర్తి తననిమిత్తము దుష్టబుద్ధియను బౌద్ధునియొద్ద నప్పుచేసి గడువునాటికి సొమ్మీయలేనియెడల నాతనిశరీరములోనిమాంస మొక సేరు బౌద్ధుఁడు కోరినచోటనుండి కోసియిచ్చునట్టుపత్రము వ్రాసి సొమ్ము తెచ్చి తనకిచ్చుటయు, గద్గదస్వరముతోఁ జెప్పి జాబు క్రిందఁబడవైచెను. అప్పుడు వసుమతి యాజాబును చేతఁబుచ్చుకొని యీ ప్రకారముగాఁ జదివెను.—'ప్రియమిత్రుఁడా! నాయోడలన్నియుఁ బోయినవి; నేను బౌద్ధునకు వ్రాసియిచ్చినపత్రము గడువుమించినది; యుక్తకాలమున సొమ్మీయలేకపోతిని గనుక, నాచావు నిశ్చయము. మరణ సమయమున నిన్నుఁజూచుట నాయభిమతము. అయినను నీ సౌఖ్యమును పూర్ణముగా ననుభవింపుము. నీకు నాయెడఁగలప్రేమ త్వరపెట్టకపోయిన యెడల, నాజాబు నిన్నిచ్చుటకు వచ్చుటకు బలవంత పెట్టకపోవునుగాక!'—అని చదివి, వసుమతి 'ఓప్రాణనాయకా! క్షణమైననుకాలాలస్యము చేయక మిత్రరక్షణార్థమై పొండి. నాప్రియవల్లభుని మూలమున తత్ప్రాణ సమానుఁడైన మిత్రున కొక్కయాపదరాకముందే, ఆతఁడు బాకి పడియున్న ధనముకంటె నిరువదిరెట్లు సువర్ణమునయినను గొనిపోయి విడిపించుకొనిరండి. ధనమునకెంతమాత్రము నాశపడక మిమ్మేరీతిని వరించితినో, అదేప్రకారముగామిత్రరక్షణతత్పరులైయున్న మీయభిమతము సిద్ధించుటకై యెంతసొమ్మైన వెనుకముందులుచూడక ధారవిడిచెదను.' అని, మరలనాతనివంకఁదిరిగి 'సర్వస్వము మీమనసువచ్చునట్లు వినియోగింప మీకే స్వత్వమును గలిగించుటకై,మీరు బైలుదేఱకముందే మిమ్మువివాహమగుటనాయభీష్టము'అనిపలికెను. ఆమెకోరికప్రకారమా దినముననే వారికిరువురకును వివాహకార్యము విధ్యుక్తముగా నడచెను. ఆనిమిషముననేదృఢచిత్తునకును చతురికకునుఁగూడ వివాహము జరిగెను. వివాహతంత్రము సమగ్రముగా నెఱవేఱిన మరచటి నిమిషముననే, మానసార్థుఁడును దృఢచిత్తుఁడును బయలుదేఱి, అతిత్వరితముగా కురంగే

శ్వరమును బ్రవేశించి, అందు మిత్రుఁడు చెఱసాలయందుఁ బెట్టఁబడి యున్నాఁడన్న దుర్వార్తను హృదయములు పగులునట్లుగా వినిరి. సొమ్మిచ్చుటకు మితిపెట్టినకాలము దాఁటిపోయినందున, దయాశూన్యుఁడైన యాబాధ్యుఁడు మానసారుఁడు తీసికొనిపోయిన ధనమునంగీకరింపక, తనకు సత్యకీర్తియొక్క దేహమునుండి సేరుమాంసమే కావలయునని మూర్ఖముగా పట్టుపట్టెను. ఈఘోరవ్యవహారము కురంగేశ్వర పురాధీశ్వరుని యెదుట విమర్శింపఁబడుటకు నొకదినము నిర్ణయింపఁబడెను. మానసారుఁడు మిన్ను విఱిగి పడ్డట్టు ఏమియుఁదోఁచక, మిత్రునకేమివిపత్తు వచ్చునోయని భయపడుచు, విచారణచేయ నిర్ణయింపఁబడిన దినము నెదురుచూచుచుండెను.

వసుమతి పెనిమిటి నెడఁబాయునప్పుడు, ధైర్యముచెప్పి మీరు తిరిగి వచ్చునపుడు మీ ప్రాణమిత్రుని విడిపించి తప్పక తీసికొని రావలయునుజుండీ' యని పయికిఁ జెప్పెనుగాని, లోపల మాత్రము సత్యకీర్తిగతి యేమగునోయని భయపడుచునే యుండెను. పెనిమిటిని బంపివేసి తానొక్కతెయు నొంటిగాఁగూర్చున్నప్పుడు, తానేవిధముననైనను దనహృదయేశ్వరునియొక్క ప్రాణమిత్రుని ప్రాణమును రక్షించి విడిపించుటలో ముఖ్యకారకురాలుగానుండుటకు సాధనముకలదాయని యాలోచించు చుండెను. పెనుక మానసారుని దాను పరిణయము కాఁదలఁచినప్పుడు సర్వకార్యములయందును అతని బుద్ధి ననుసరించియే నడుచుకొనెదనని చెప్పినను, పెనిమిటియొక్క చెలికాఁడు విపద్దశనొంది యున్న యీ సమయములోఁ దన శక్తియం దెంతమాత్రమును నవిశ్వాస ముంచక, స్వబుద్ధితోనే చక్కగా నాలోచించి తాను కురంగేశ్వరమునకుఁబోయి యచ్చట సత్యకీర్తిపక్షమున వాదించవలెనని నిశ్చయించుకొనెను. వసుమతికి న్యాయసభలో న్యాయవాదిగా నున్న పూచాలుఁడను బంధువొకఁడు కలఁడు; ఆమె తనపతియొక్క స్నేహితుని

వ్యవహారపు స్వభావమును దెలుపుచు నాతని పేర నొక జాబువ్రాసి, ఆవిషయమయి యాలోచన చెప్పుమని యడుగుటయె కాక తాను బంపిన మనుష్యుని వశమున నిచ్చి సభలో న్యాయవాదులు వేసికొను వస్త్రములు మొదలయినవానిని కూడఁ బంపుమనికోరెను. వాచాలుని యొద్దకుఁ బంపఁబడిన మనుష్యుఁడు తిరిగివచ్చునపుడు తనతోఁ గూడ పూర్వోక్తవ్యవహారములో నడిపింపవలసిన చర్యలుగుఱించి యాలోచన గల యుత్తరములను, న్యాయవాదివేషము వేసికొనుటకుఁ గావలసిన వస్త్రాదికమును సమస్తమును గొనివచ్చెను.

తరువాత వసుమతి తానును చతురికయుఁ బురుష వేషములు వేసికొని, న్యాయవాదులుతొడుగుకొనెడి యంగీని తానుతొడుగుకొని, చతురికను దనయొద్దనుండు లేఖకునిగా నేర్పఱిచి వెంటఁ బెట్టుకొని, తత్క్షణమే ప్రయాణమయి విచారణ జరగఁబోవు దినముననే పోయి కురంగేశ్వరమును జేరెను. కురంగేశ్వరప్రభువును మంత్రులునుగూర్చుండి యుండఁగా నిండుసభలో నా వ్యవహారముయొక్క విమర్శయారంభము కాఁగానే, వసుమతి న్యాయస్థానమునందుఁ బ్రవేశించి వాచాలుని యొద్దనుండివచ్చిన యుత్తరమునొకదానిని ప్రభువుచేతికిచ్చెను. దానిలోఁ బ్రసిద్ధుఁడయిన యాన్యాయవాది తానే సత్యకీర్తి పక్షమున వచ్చి వాదించవలసియుండెను గాని దైవికముగాఁ దనకు దేహములో రుగ్ణత గలిగినందున వచ్చుటకు వలనుపడకపోయినందునకు మన్నించి తాను బంపిన సమర్థుఁడయిన యీసమయజ్ఞుఁడను చిన్నవానిని తనమాఱుగా నంగీకరించి, యాతనివాదమును వినవలయునని ప్రభువును బ్రార్థించెను. న్యాయవాది వేషము వేసికొని యా వస్త్రములతోను విలువగలతలగుడ్డతోను అచ్చముగా న్యాయవాదివలెనే కనఁబడుచున్న వసుమతియొక్క దివ్యసుందర విగ్రహమునుజూచి యాశ్చర్యపడుచు, రాజు వాచాలుని ప్రార్థనమంగీకరించి సత్యకీర్తిపక్షమున వాదముచేయుట కుత్తరువిచ్చెను.

ఆపయుని వ్యవహారముయొక్క ముఖ్యవిచారణ మారంభింపఁబడినది. వసుమతి నలు వంకలు కలయఁ జూచి యొకదిక్కున కఠినహృదయుఁడగున బౌద్ధుని మొగమును పొడగనెను; ఆప్రజాసంఘములో మానసారునికూడఁ జూచెనుగాని యాతఁడు మాఱువేషము వేసికొని యున్న యామెను బొత్తిగా నానవాలు పట్టలేక పోయెను. అతఁడు మిత్త్రునికి సంభవించిన యాపదను దలఁచుకొని భయపడుచు, వ్యవహార మేప్రకారముగా ముగియునోయని యుల్లము డోలాందోళనము నొంద సత్యకీర్తి ప్రక్కనే నిలువఁబడియుండెను.

వసుమతి తాను నిర్వహింపసాహసించిన యీదుష్కరకార్యము యొక్కప్రాముఖ్యమునువిచారించి దానబలయయ్యును ప్రబలధైర్యమును బూని, దార్ఢ్యముతో నీప్రకారముగా కార్య నిర్వహణమునకుఁ బూనుకొనెను:—ఆమె ప్రప్రథమమున దుష్టబుద్ధిని సేర్కొని, పత్త్రములోని యొడంబడిక ప్రకారము సత్యకీర్తి యొక్క దేహమునుండి యొక్క సేరు మాంసమును బుచ్చుకొనుటకు కురంగేశ్వరపుర రాజశాసనమును బట్టి యాతనికి సంపూర్ణ స్వాతంత్ర్యము కలిగియుండుట నొప్పుకొని, దుష్టబుద్ధియొక్క రాతిగుండె యొక్కటితప్ప నెటువంటి కఠిన హృదయమయినను కరఁగునట్టుగా మృదు మధుర వాక్యములతో దయాగుణము యొక్క మహిమను వర్ణించి, తాపము నొందిన భూమిని జల్లపఱచుటకయి పయినుండి పడెడువర్షధారలవలెనే దయయు భగవదనుగ్రహము వలన మనకు లభించినదనియు, దానికి దాతను ప్రతిగ్రహీతను గూడ కృతార్థులనుజేయు శక్తి కలదనియు, దానిని గలిగి యుండుట దైవలక్షణముగాన రాజాధిరాజులు సహితము దయనే తమరాజ్యపీఠములకంటెను గొప్పదానినిగాఁ బరిగణింతురనియు, ఈభూరాజ్యపరిపాలనమున న్యాయముయొక్క కాఠిన్యము దయారసముచేత మార్దవ పఱచఁబడిన కొలఁదిని అది దైవపరిపాలనముయొక్క సామీప్యమును బొందుచుండు

ననియు, చెప్పి, మన మందఱమును దయఁ జూడుమని భగవంతునిఁ బ్రార్థించెదముగాన ఆప్రార్థననుబట్టియే మనముసహిత మితరులయెడ దయగలిగి యుండవలెనను నీతిని నేర్చుకోవలసినదన్న మాటను జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్మని దుష్టబుద్ధికి బోధించెను. పత్రములోని నిబంధనప్రకారము జరగింపవలసినదన్నమాట తప్ప మఱియొక్కమాట యా బౌద్ధుని నోటి నుండి రాకుండెను. 'పత్రమున వ్రాసియిచ్చినప్రకార మాతఁడిప్పుడు ధనము నియ్యలేఁడా ?' యని వసుమతి ప్రశ్న వేసెను. తత్క్షణమే మానసారుఁడు బదులుపుచ్చుకొన్న మూఁడువేలరూపాయలను మాత్రమేకాక బౌద్ధుఁడు కోరినయెడల నెన్ని రెట్లధనమైనను దానిచ్చుటకు సిద్ధముగా నున్నాఁడని చెప్పెను. కాని దుష్టబుద్ధి తనకు సొమ్మక్కఱ లేదనియు, పత్రములో వ్రాసిన ప్రకారముగా సత్యకీర్తి యొక్క దేహము నుండి మాంసమునే యిప్పింప వలయుననియు పట్టుతోఁ బలికెను. అప్పుడు మానసారుఁడు బాలుఁడైన యా న్యాయవాదినిజూచి సత్యకీర్తియొక్క ప్రాణమును గాపాడుటకై కొంచెముధర్మశాస్త్రము మార్పించుటకై ప్రయత్నము చేయుమని వేడుకొనెను. ఒక్కసారి స్థాపింపఁబడిన ధర్మ శాస్త్రము లెప్పుడును మార్పఁబడఁగూడదని వసుమతి గాంభీర్యముతోఁ బలికెను. న్యాయశాస్త్రమును మార్పఁ గూడదని వసుమతి చెప్పటవిని, ఆన్యాయవాది తనపక్షముగామాటాడు చున్నాఁడనుకొని "ధర్మదేవతయే వచ్చి వ్యవహారమును దీర్చుచున్నది ! ఓన్యాయవాదీ ! నిన్ను నే నెంతని గౌరవింతును ! ఏండ్లచే నీవెంతయుఁ జిన్నవాఁడవే యైనను బుద్ధిచేత నెంత పెద్దవాఁడవై యున్నావు !" అని దుష్టబుద్ధి సంతోషింప సాగెను.

అప్పుడు వసుమతి పత్రమును దన్నుఁజూడనిమ్మని దుష్టబుద్ధినడిగి పుచ్చుకొని, మొదటి నుండియుఁ గడవఱకును జదివిన తరువాత, "ఈ పత్రములోఁబెట్టిన గడువు మించినది. దీనినిబట్టి యీ బౌద్ధునకు సత్య కీర్తియొక్క వక్షస్థలమునుండి సేరు మాంసమునుగోసి పుచ్చుకొనుటకు

న్యాయశాస్త్ర ప్రకారముగా నధికారముగలదు." అనిపలికి, దుష్టబుద్ధి వంక మరలి "దయచేసి సొమ్ముపుచ్చుకొని, పత్రమును జింపి వేయుటకు నాకు సెలవిమ్ము" అని యడిగెను. క్రూరకర్ముఁడయిన యా దుష్టబుద్ధి యామాటలవలన వీసమంతయు దయపుట్టినదికాదు వాఁడు మోమోటమి లేకుండ "ఇంకఁ బ్రతికియున్నవారి జిహ్వాగ్రమేదియు నామనోనిశ్చయమును మార్పఁజాలదని, ఆత్మసాక్షిగా ప్రమాణము చేసెద" నని తెలియఁ జెప్పెను. అంతట వసుమతి సత్యకీర్తినిజూచి "ఇఁకఁ జేయవలసినకార్యము లేదు; నీఱొమ్మును కత్తిగొప్పగించుటకు సిద్ధముగా నుండవలె" ననిపలికి, దుష్టబుద్ధి సేరుమాంసమునుకోసికోవలెనని యత్యాతురతతోఁ దనకత్తిని నూఱుచుండఁగా మరల సత్యకీర్తిని 'నీవు చెప్పవలసినదేమయిననున్నదా' యని యడిగెను. సత్యకీర్తి నిస్పృహతో మెల్లఁగా "నే నీవఱకే మనస్సులోఁ జావు నిశ్చయముచేసికొని యున్నానుగాన, వేఱుగఁ జెప్ప వలసినదేమియు లేద" ని తెలిపి, మానసారునివంకఁదిరిగి "నీహస్త మొక పర్యాయము నాచేతి కిమ్ము. నీకు సమస్త శుభములు గలుగును గాక ! నీనిమిత్తమయి నే నీయాపదను బొందుచున్నానని లేశమయినను జింత పడఁబోకు. ఉత్తమురాలయిన నీభార్యకు నన్నువిన్నపముచేసి, నీయెడల నాకెట్టిస్నేహమున్నదో యామెకుఁదెలుపుము" అనిచెప్పెను ఆమాటల కతిదుఃఖముతో "సత్యకీర్తీ! నేనువివాహముచేసికొన్నభార్య నిశ్చయముగా నాకుఁ బ్రాణతుల్యురాలగును; కాని నాప్రాణమును, భార్యయు, ఈ ప్రపంచమంతయుఁగూడ నీ ప్రాణముకంటె నా కెక్కువవి కావు; నిన్ను విడిపించుటకయి వానినన్నిటిని నిక్కడ నీఘోర రాక్షసునకు బలి పెట్ట వలసినను పెట్టుదును" అని మాఱుచెప్పెను.

ఆవాక్యములను దగ్గఱనుండివినుచున్న దయార్ద్రహృదయురాలైన యావసుమతి, సత్యకీర్తియంతటి యకృత్రిమానురాగముగల మిత్రుని యెడఁగల ప్రేమాతిశయమును దెలుపుటకయి తనపెనిమిటి యటువంటి

మాటల నుపయోగించినందునకు మనసులో నెంతమాత్రమును వేఱువిధ ముగా భావింపక, చిఱునవ్వునవ్వుచు మానసారుఁడా! నీభార్యయే యిచటనుండెనేని, నీవిప్పుడు చేసినప్రతిజ్ఞ ననుమోదించి యూరకుండక పోవునుజుమీ" యనెను. తనమిత్రుఁడు చేసినదానినెల్లను దానును జేయఁగోరుచుండు దృఢచిత్తుఁడు, మానసారునివలెనే తానును జెప్పఁ దలఁచుకొని, లేఖకుని వేషము వేసికొని వసుమతి ప్రక్కనుగూరుచుండి వ్రాయుచున్న చతురిక వినుచుండఁగా "నాభార్యయందును నాకత్యంత ప్రేమగలదు; పశుప్రాయుఁడైన యీబొద్దుని దుర్బుద్ధిని మరల్చుటకయి స్వర్గలోకములోనున్న యేదేవతనైనను నామెవెళ్ళి వేఁడుకోఁగలిగెనేని, ఆమెను బుణ్యలోకమునకైనఁ బంపుదు" నని పలికెను. 'ఈమాటను నీ వామెమొగము వెనుక ననుచున్నావుగనుక సరిపోయినది గాని, లేక పోయినయెడల నీకును నీభార్యకును నెంతకలహముజరుగునో' యని చతురిక నవ్వుచుఁ బలికెను. ఇంతలో దుష్టబుద్ధి 'మనము కాలము వ్యర్థ పుచ్చుచున్నాము; నాయందనుగ్రహించి వేగిరము తీర్పుచెప్పఁడు' అని యత్యాతురముగాఁ గేకవేసెను. అప్పుడు న్యాయసభలో నున్నవారంద ఱును నేమి జరగఁబోవునోయని విచారించుచు నిశ్శబ్దముగానుండిరి; ఆసమయమున అచ్చట నున్నవారిలో సత్యకీర్తి విషయమయి ఖేద పడనివా రొక్కరును లేరు.

అప్పుడువసుమతి 'మాంసమునుతూచుకొనుటకు త్రాసుసిద్ధముగా నున్నదా?' యని యాబొద్దునినడిగి, 'దుష్టబుద్ధీ! నెత్తురువరదలుకట్టి సత్య కీర్తి మరణముపొందకుండ నీవువైద్యునొకని దగ్గఱనుంచుకోవలెనుజుమీ' యనిచెప్పెను. దుష్టబుద్ధి చేసినప్రయత్నమంతయు సత్యకీర్తి చావవలె ననియే గనుక, 'పత్రములో ఆసంగతి వ్రాయఁబడియుండలేద'ని బొద్దుఁడు పలికెను. 'అవును. ఆప్రకారముగాపత్రములో వ్రాయఁబడి యుండలేదు. అయిననేమి? అంతమాత్రము ధర్మార్థముగాఁ జేయుట నీకుమంచిదికాదా?'

అని వసుమతి మాటుపలికెను. అందుమీఁద 'ఆప్రకారముపత్రములో లేదు; నాకు కనఁబడలేదు' అను మాటతప్ప, బౌద్ధుఁడు మఱియొక మాటనుపలుకఁ గలిగినవాఁడుకాఁడు. అంతయుచూచి వసుమతి 'సత్యకీర్తి దేహములోని సేరుమాంసము నీది. రాజశాసనమందున కొప్పుచున్నది; సభవారును నంగీకరింతురు. ఆమాంసమును నీవాతని యొమ్ము దగ్గఱ నుండియే కోసికోవచ్చును. ధర్మశాస్త్రమందున కంగీకరించుచున్నది; సభ వారు నొప్పుకొందురు.' అని చెప్పెను. అందుమీఁద సంతోషించి దుష్ట బుద్ధి 'ఓ న్యాయవాదీ ! నీవే నిష్పక్షపాతముగల బుద్ధిశాలివి. ధర్మ దేవతయే యీరూపమునవచ్చి తగవు దీర్చుచున్నది !' అని, తన పెద్ద కత్తినినూఱి పదునుపెట్టుచు, అత్యాతురతతో సత్యకీర్తి మొగముమీఁదఁ దృష్టిపఱపి 'రా; సిద్ధముగానుండు' అని పిలిచెను.

అట్లనుచుండఁగా వసుమతి 'బౌద్ధుఁడా ! కొంచెముతాళు; మఱి యొకమాట చెప్పవలసియున్నది. ఈపత్రముప్రకారముగా నీకొక్క నెత్తురుబొట్టునకును నధికారములేదు; సేరుమాంసమని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. ఆసేరుమాంసమును నీవు కోసికొనునప్పుడు రక్తబిందు వొక్కటియైనను క్రిందఁబడినపక్షమున, రాజశాసనమునుబట్టి నీచర స్థిర రూపములైన ద్రవ్యము సర్వమును కురంగేశ్వరప్రభుత్వమువారికిఁ బోవును' అని చెప్పెను. నెత్తురురాకుండ సత్యకీర్తియొక్క దేహమునుండి సేరుమాంసమును గోసికొనుట మిక్కిలి యసాధ్యము గనుక, పత్రములో వ్రాయఁబడినది మాంసమేకాని నెత్తురుకాదని బుద్ధిమంతురాలయిన వసుమతిచేసిన యర్థమువలన సత్యకీర్తికి ప్రాణరక్షణము కలిగెను. సర్వజన సంతోషజనకముగా నటువంటి యుపాయము నాలోచించిన పిన్నవయసుగల యాన్యాయవాదియొక్క బుద్ధికౌశలము నెల్ల వారును మెచ్చుకొని యద్భుతపడసాగిరి; సభామందిరముయొక్క యన్ని దిక్కులనుండియు నొక్కసారిగా నభివందనవచనములు బయలు వెడలి

మిన్నుముట్టెను; తోడనే దృఢచిత్తుఁడు లేచి నిమిషముక్రిందట దుష్టబుద్ధి పలికిన మాటలతోనే 'న్యాయదాతా! నీవే నిష్పక్షపాతముగల బుద్ధిశాలివి, బౌద్ధుఁడా! చూడు. ధర్మదేవతయే యీరూపమునవచ్చి తగవు తీర్చుచున్నది.' అని కేకవేసెను.

దుష్టబుద్ధి తనదుర్వ్యవసాయము విఫలమైనదిగదాయని తెలిసికొని నిస్పృహాత్వము సూచించు చూపుతో 'సొమ్ము పుచ్చుకొనెద'నని చెప్పెను. తలఁవన్ని తలంపుగా సత్యకీర్తికి రక్షణము కలిగినందున అపరిమితానందము నొంది 'యిదిగో సొమ్ము'ని మానసారుఁ డొక్క కేకవేసెను. కాని వసుమతి యాతని నివారించి, 'తొందరపడవలసిన పని లేదు. శాంతించుము. ఈబౌద్ధుఁడు మాంసమును పుచ్చుకోవలసినవాఁడే కాని మఱియొకటి పుచ్చుకోవలసినవాఁడు కాఁడు—ఓదుష్టబుద్ధీ మాంసము కోసికొనుటకు నీవునీప్రయత్నములోనుండుము. కాని రక్తబిందు వొక్కటియైనను పడకుండ జాగ్రత్తగానుండవలెను. నీవుమాంసము కంటె చిన్నమెత్తయినను తక్కువకాని యెక్కువకాని కోయఁగూడదు. వడ్లగింజయెత్తు తక్కువకాని యెక్కువకాని యున్నను, వెండ్రుకవాసి త్రాసుమొగ్గినను, కురంగేశ్వరపుర రాజశాసనమునుబట్టి నీసొత్తంతయు దొరతనమువారి పాలగుటయేకాక నీవు మరణదండనమును సహితము పొందవలసివచ్చును. అనిచెప్పెను. దుష్టబుద్ధి యామాటలువినిపించుకోక 'నాసొమ్మిచ్చివేసి, నన్నుఁ బంపుఁడు' అని యడిగెను. 'ఇదిగో సొమ్ము నాదగ్గఱ సిద్ధముగానే యున్నద'ని మానసారుఁడు సొమ్మియ్యఁబోయెను.

దుష్టబుద్ధి సొమ్మును బుచ్చుకోఁబోవుచుండఁగా వసుమతి మరల వారించి, 'ఓయీ! బౌద్ధుఁడా! ఆగు. ఇప్పుడు నీజుట్టు నాచేతిలోనున్నది. కురంగేశ్వర ధర్మశాస్త్రమునుబట్టి తత్పురనివాసి నొకనిని నిష్కారణముగాఁ బ్రాణముగొనఁ బ్రయత్నము చేసినందువలన నీ యావద్ధనమును ప్రభుత్వమువారికిఁ జేరుటయేకాక నీప్రాణదానముచేయుట సహితము

రాజుగారి యనుగ్రహముమీఁద నిలిచియుండును. కాఁబట్టి యిప్పుడా రాజుగారి పాదములమీఁదఁబడి క్షమింపఁబ్రార్థింపుము' అని చెప్పెను. అతఁడు దానికేమియు బ్రత్యుత్తరము చెప్పకమునుపే ప్రభువందుకొని 'హిందువునకును బౌద్ధునకునుగల తారతమ్యము నీకుఁ దెలియుటకయి, మమ్ము నీవు క్షమింపుఁడని వేఁడకమునుపే నీకుఁ బ్రాణదానము చేసినారము. నీధనములో సగము సత్యకీర్తికిని, తక్కినసగమును మాత్రము దివాణమునకును పోవును' అని దుష్టబుద్ధివంకఁజూచి పలికెను. అంతట నుదారుఁడైన యాసత్యకీర్తి లేచి 'యిప్పుడు దుష్టబుద్ధి తనమరణానంతరము తనకున్న ధనమును కూఁతునకును నల్లునకును నిచ్చెదనని వ్రాసియిచ్చెనేని, నాభాగమును దుష్టబుద్ధికి వదిలివేసెద' నని చెప్పెను. దుష్టబుద్ధికొక్కతెయే కూఁతురుండెను. ఆకూఁతురు తండ్రి సమ్మతి లేకయే సత్యకీర్తికి మిత్రుఁడైన సుబుద్ధియనువానిని వివాహముచేసికొనెను. అందుమీఁద దుష్టబుద్ధికిఁ గోపమువచ్చి తన మరణానంతరము కూఁతునకును నల్లునకును దనసొత్తు చెందకుండ మఱియొకరికి వ్రాసియిచ్చుటకయినిశ్చయించుకొని యుండెను. తాను పగ సాధింపవలెనని చేసినప్రయత్నము వ్యర్థమగుటయుఁ దనసొత్తుకూడఁ బోవ సిద్ధముగా నుండుటయుఁజూచి, యాబౌద్ధుఁడు సత్యకీర్తి చెప్పినదాని కొప్పుకొని 'నేనిప్పుడు మనస్స్థిమితములేక యున్నాను. కాఁబట్టినన్నింటికిఁ బోనిండి. పత్రమును వెనుకనుండి పంపుఁడు; నాసొత్తులో సగము నామరణానంతరము నాకూఁతునకుఁ జెందునట్టువ్రాసి చేవ్రాలు చేసెదను' అని చెప్పెను. అట్లయిన నీవింటికిఁబోయి చేవ్రాలుచేసి పంపుము; నీవు చేసిన దుర్మార్గమునకు నీవునిజముగాఁ బశ్చాత్తాపపడి హిందువవుగా మాఱుదువేని, నీవు దివాణమునకు దండుగగా నియ్యవలసిన సగము ధనమునుకూడ దొరతనమువారు మన్నించి నీకే విడిచిపెట్టెదరు' అని రాజు సెలవిచ్చెను.

అంతట రాజు సత్యకీర్తిని విడిచిపెట్టి సభ చాలించునప్పుడు, చిఱుత ప్రాయముగల యాన్యాయవాదియొక్క బుద్ధిని నేర్పును మిక్కిలి శ్లాఘించి, ఆతనిని తనయింటికి విందునకు రమ్మని పిలిచెను. వసుమతి తన పెనిమిటికంటె ముందుగా నీలపల్లె వెళ్ళి చేరను ద్దేశించుకొన్నది గనుక, 'దేవరవారికి నాయెడఁ గలిగిన యనుగ్రహమునకయి యనేకాభి వందనము లొనర్చుచున్నాను; నాకు నిమిషములమీఁద వెళ్ళవలసిన పని యున్నదిగాన నామనవి చిత్తగించి నన్నీసారికి విడిచిపెట్టవలయు'నని రాజును ప్రార్థించెను. రాజును 'మీపంక్తిభోజనము దొరక నందునకు నాకు మహావిచారముగా నున్న'దని పలికి, సత్యకీర్తి వెపునకుఁ దిరిగి 'ఓయీ! ఈ గృహస్థునకు నీవు గొప్ప బహుమానమిమ్ము; నామనసులో నీవెంత యిచ్చినను నీతని ఋణము తీర్చుకోలేవని తోఁచుచున్నది' అని పలికెను.

అప్పుడు రాజును సభికులును కొలువువిడిచి వెళ్ళిరి; తరువాత మానసారుఁడు వసుమతిని జూచి 'ఓమహాత్మా! నేనును నామిత్రుడైన సత్యకీర్తియు నీబుద్ధిసంపదవలన నేఁడు విపత్సముద్రమునుండి తప్పించు కొని యీవలఁ బడఁగలిగినారము. మేమీబొద్దునకు బాకియున్న మూఁడు వేల రూపాయులను నాయుం దనుగ్రహించి మీరంగీకరింతురని వేఁడు కొనుచున్నాను' అని చెప్పెను. 'మీరు చేసిన యుపకారమునకును పడిన కష్టమునకును మీకెంత యిచ్చినను, మీ ఋణము లేశమైనను తీఱదు' అని సత్యకీర్తి పలికెను.

వారెన్నివిధములఁ బ్రార్థించినను వసుమతి వారివలనఁ గాసైనను గ్రహింప నొప్పుకొనలేదు; కాని, 'మావలన నేమియు గైకొనకపోవుట మాయెడఁగల వాత్సల్యమునకు లోపము కలిగించుట'యని వారిరువురును బహువిధములఁ బ్రార్థించి నిర్బంధపెట్టినందున, వారిమాటకు తీసివేయ

లేక తుదకు మానసారుని చేతియుంగరము నిమ్మని యడిగెను. అది వసుమతి పాణిగ్రహణసమయమున వరునకిచ్చినయుంగరము. ముఖ్యముగా వసుమతి యాయుంగరమునే తనకిమ్మని కోరుటకుఁ గల కారణము, ఉంగరము తన చేతఁజిక్కినమీఁదట మానసారునిఁ గలిసికొన్నతోడనే నవ్వులాటలకై యేదో యొక వినోదమును జరపవలెననికాని మఱియొకందునకుకాదు. ఆయుంగరము మానసారునిచేత నుండఁగాఁ జూచినప్పుడు వసుమతి 'ఈయుంగరమునిచ్చెదవేని, మీమీఁది ప్రేమచేత నంగీకరించెదను గాని మఱియేమియుఁ గైకొన' నని చెప్పెను. తానెప్పుడు నెడఁబాయఁ గూడని యాయొక్కవస్తువునే న్యాయవాదియడిగినందునకు మనసులో నెంతయు వ్యాకులపడి, తొట్రుపాటుతో అది తనభార్య యిచ్చిన బహుమతి యగుటచేతను తనజీవితకాలములో నెప్పుడును దాని నెడఁబాయనని ప్రమాణము చేసియుండుటచేతను ఆయుంగరమును మాత్రిమియ్యఁజాలననియు దానికంటె మిక్కిలి వెలగల మఱియొక యుంగరము నిచ్చెదననియుఁ జెప్పెను. అందుమీఁద వసుమతి కోపమువచ్చినట్లభినయించుచు మొగము ముడుచుకొని 'బిచ్చగాఁ డడిగినప్పుడు చెప్పవలసిన ప్రత్యుత్తరమును జెప్పినా'వ'ని కొలువు వెడలిపోయెను. 'మిత్రుఁడా! నామీఁది ప్రేమయును నావిషయమున యాతఁడు చేసిన మేలును నీభార్య కోపముతో సమానమైనవని యెంచుకొని నామాటవిని యుంగరము నాతనికిచ్చివేయు'మని సత్యకీర్తి మానసారునితోఁ జెప్పెను. మానసారుఁడు తానంతకృతఘ్నుఁడుగాఁ గనఁబడినందున కెంతయు సిగ్గుపడి, మాఱుమాటాడక వెంటనే యుంగరమును దృఢచిత్తునిచేతికిచ్చి వసుమతి యొద్దకుఁ బంపెను; అప్పుడు లేఖకునివలె నటించుచున్న చతురిక తాను గూడ వివాహసమయమునఁ బెనిమిటి కొకయుంగరము నిచ్చినదియౌకాన దానిని తనకిమ్మని దృఢచిత్తునినడిగెను. ఔదార్యమునందుఁ దనమిత్రుని కంటెఁ దాను దక్కువవాఁ డనిపించుకొనుట కిష్టములేనివాఁడు యతఁ

డడిగినతోడనే యుంగరము నిచ్చివేసెను. అతఁడు వెళ్ళినతోడనే యా సుందరులు తమలోఁదాము నవ్వుకొని, తామింటికి వెళ్ళినతరువాత నుంగరముల పోఁగొట్టుకొన్నందునకు నాథులమీఁద నేమియారోపింత మాయని యాలోచించి, మఱియొక స్త్రీ కివ్వతెకో మోహాముచేత నిచ్చివేసితిరని నెపపెట్టుటకు నిశ్చయించుకొనిరి.

ఒక ఘనకార్యమును నిర్వహించినప్పుడు మనసులో నొకవిధమైన యానందము పుట్టుచుగాన, వసుమతి తనయూరికిఁ బోవునప్పుడు మిక్కిలి యుత్సాహాము కలదియై యుండెను; అందుచేత నామెకుఁ బ్రతివస్తువును సంతోషజనకముగా నుండెను. ఆమెకంటికిఁ జంద్రుఁ డెప్పుడును అంత కాంతితోఁ బ్రకాశించినట్టుకనఁబడ లేదు. ఆమనోహరమైనచంద్రబింబము మేఘములలో మఱుఁగుపడియున్నప్పుడు, తనగృహామునుండికనఁబడుచున్న దీపము మిక్కిలి రమణీయముగా నుండుటచూచి, చతురికవంకఁ దిరిగి 'మనగృహామున వెలుఁగుచున్న యాదీపముయొక్క కాంతినిజూచినావా? ఆచిన్న దీపముయొక్క వెలుతు రెంతదూరము వ్యాపించు చున్నది! అజ్ఞానాంధకార బంధురమై యున్న యీలోకములో నీలాగుననే సత్కార్యమును బ్రకాశించును' అనిచెప్పి, యింతలో నొకసంగీతము విన రాఁగా 'ఈగానముపగటిపూటకంటె మిక్కిలిమధురముగానున్నదిసుమీ' యని పలికెను. ఈప్రకారము సరససల్లాపములు చేయుచు వసుమతియు చతురికయు గృహామునఁబ్రవేశించి, పురుషవేషములు దీసివేసితమమొప్పటి స్త్రీవేషములను ధరించుకొని, తమ పతులయొక్క రాకకు ప్రతీక్షించు చుండిరి. వారును సత్కీర్తిని వెంటఁబెట్టుకొనివచ్చి శీఘ్రముగానే యిల్లు చొచ్చిరి. మానసారుఁడు తనప్రియమిత్రుని వసుమతికిఁజూపినందున,ఆమె కుశలప్రశ్నముచేసి యతిథిసత్కారములతో నాదరించుచుండెను. ఇంతలో గదిలోనొకమూలను చతురికయు భర్తయు జగడమాడుచున్న ధ్వని విన వచ్చెను. 'అప్పుడేకలహాము? కారణమేమి?' యని వసుమతి యడిగెను.

"పుని 'నన్నెప్పుడును విడవఁబోకు' మని వ్రాసియున్న యొక చిన్న యుంగరమునకై యీపోట్లాటయంతయు సంభవమైన" దనిదృఢచిత్తుఁడు చెప్పెను. 'ఆయుంగరముమీఁద వ్రాసియున్న యక్షరములతోను దాని వెలతోను ప్రయోజనమేమి? నేనాయుంగరమును నీకిచ్చినప్పుడు దానిని ప్రాణముతోఁగాని యెడఁబాయనని బాసచేసినావు. ఇప్పుడు నీవెవ్వనికో యొక్క న్యాయవాదిక్రింది లేఖకున కిచ్చినానని చెప్పుచున్నావు. నాకుఁ దెలియును. నీవెవ్వతెకో యొక స్త్రీకిచ్చినావు' అని చతురిక పలికెను. 'నీతోడు! నేనొక చిన్నవానికే యిచ్చినాను; అతఁడు నీయంతపొడుగున నీవలెనేయున్నాఁడు; తనప్రౌఢవాదముచేత సత్యకీర్తియొక్క ప్రాణములను గాపాడిన న్యాయవాదియొద్ద నతఁడు లేఖకుఁడు. అతఁడు తాను పడిన కష్టమునకుఁ బ్రతిఫలముగా నుంగరమునిమ్మని యడిగినందున, నాజిహ్వతో లేదనలేకపోయినాను' అని దృఢచిత్తుఁడు మాఱుచెప్పెను. 'దృఢచిత్తుఁడా! నీభార్య మొట్టమొదటఁ బ్రియపూర్వకముగా నిచ్చినబహుమానవస్తువునే యిట్లు చేయుటచేఁ దప్పిదమంతయు నీయందే యున్నది. నాప్రియవల్లభుఁడైన మానసారునకు నేనొకయుంగరము నిచ్చినాను; ప్రపంచము మునిఁగిపోయినను దానినాతఁడు మఱియొకరికిచ్చునా?' యని వసుమతి యేమియు నెఱుఁగనిదానివలెఁబలికెను. దృఢచిత్తుఁడు తన తప్పిదమునకు క్షమార్పణగానుండునని యెంచుకొని 'ముందుగానే మానసారుఁడు తనయుంగరము నా న్యాయవాదికిచ్చివేసినాఁడు. ఈ వ్యవహారములో నాతనికడనుండి కష్టపడి వ్రాసిన చిన్నవానికి నేనుంగరమును దరువాతనే యిచ్చినాను' అని నిజము చెప్పివేసెను.

ఆమాటలువిని వసుమతిమిక్కిలికోపముగలదానివలె నభినయించి, ఉంగరము నన్యుల కిచ్చివేసినందునకు మానసారుని నిష్ఠురములాడుటయే కాక యుంగరముపోయినజాడను చతురిక దెలుపుచున్నదిగానఁ దనదియు నొక స్త్రీవశముననే యున్నదనిపలికెను. తనప్రియభామిని కంతకోపము

తెప్పించినందునకుఁ జింతాక్రాంతుఁ డయి మానసారుఁడు 'నాతోడు ! నేనాయుంగరము నేస్త్రీకిని నియ్యలేను. మూఁడువేల రూపాయల నియ్యఁబోయినను పుచ్చుకోక యుంగరము నడిగిన ధర్మశాస్త్రజ్ఞుఁడైన యాన్యాయవాదికే యిచ్చినాను. మొట్టమొదట నేనాయుంగరము నియ్యనన్నప్పుడాతఁడు మొగమింతచేసికొని చిఱచిఱలాడుచు లేచి పోయినాఁడు. ప్రాణనాయికా ! నేనేమిచేయుదును ? నేనప్పుడందఱికిని కృతఘ్నుఁడనుగా కనఁబడినందునకు సిగ్గుపడి, అతనివెనుక నుంగరమును బంపివేసితిని. ఈ యపరాధమును మన్నింపుము. నీవేయక్కడ నున్న పక్షమున, నన్నాయుంగరమును న్యాయవాదికిచ్చివేయుమని వేఁడుకొందువని తలఁచెదను' అని యత్యాతురుఁడయి పలికెను.

'అయ్యో! ఈకలహములకెల్లను గారణమునేనేకదా' యని సత్యకీర్తి చింత నొందసాగెను. అట్లయినను మీయెడ నాకెంతమాత్రమును గోపములేదు; మీరీవిషయమునలేశమును జింతింపవలదు' అని వసుమతి యాతనినూఱార్చెను. 'మానసారునినిమిత్తమయి నేనొకసారినాశరీరము నిచ్చివేసినాను; నీపెనిమిటి యెవ్వరికుంగరమునిచ్చెనో యాతఁడు చేసిన సాయమువలననే మరలజీవములతో నుండఁగలిగితినికాని, లేనియెడల నేనీపాటి మృతుఁడనయి యుండవలసినవాఁడను. నీభర్తయిఁకముందెప్పుడును నీకిచ్చినబాసతప్పకుండ నాశరీరమును పూటపెట్టెదను' అని సత్యకీర్తి నమ్మికముచేసెను. 'అతనికినీవు పూటపడుదువేని, ఈయుంగరము నాతనికిచ్చి పూర్వపుదానికంటె దీనిని బదిలముగా నుంచుకొనునట్టు చేయుము' అని వసుమతి యుంగరము చేతికిచ్చెను.

మానసారుఁడాయుంగరమును జూచినప్పుడు, అదిముందు దానాన్యాయవాదికిచ్చినదే యయినందున నిర్వాఁబోందియుండెను. అప్పుడు తానే న్యాయవాదియగుటయుఁ జతురిక తనయొద్ద లేఖకుఁడగుటయు

వసుమతిచెప్పెను. తనభార్యయొక్క బుద్ధిసాహసములవలననే సత్యకీర్తి యొక్క ప్రాణములు కాపాడఁబడెనని తెలిసికొన్నప్పుడు, మానసారుఁ డద్భుతప్రమోదమగ్నమానసుఁ డయ్యెను.

వసుమతి సత్యకీర్తిని మరల నాదరించి, దైవికముగాఁ దన చేతఁ జిక్కిన యాతని జాబులను జేతికిచ్చెను; ఆజాబులను విప్పిచూచునప్పటికి, ఇంతవఱకును బోయినవనుకొనుచున్న సత్యకీర్తియొక్క యోడలు సుఖముగావచ్చి రేవుచేరినవన్న శుభవార్త వానియందుఁగనఁబడెను. మొదట వ్యసనకరముగా నున్నవన్నియుఁ గడపట సంతోషకరముగా ముగిసినందున నెల్లవారునుబరమానంద భరితులయిరి. అప్పుడు భార్యలను భర్తలానవాలు పట్టలేకపోయినందునకును, ఉంగరము విషయమయి వారు పన్నిన పన్నుగడకును, ఒండొరుల మొగములనుజూచినవ్వుకొనిరి. అంతట దృఢచిత్తుఁడు తాను బ్రతికియున్నంత కాలము 'చతురిక యొక్క యుంగరమును గాపాడుటయందుఁ బుచ్చుకొనునంతశ్రద్ధను మఱియొక విషయమునందుఁ బుచ్చుకోన'ని చెప్పి యందఱను నవ్వించెను.

సంపూర్ణము.



శ్రీరామముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1949.

# కళావతీ పరిణయము




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ శేషశైలనారాయణబహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

## వచనప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# కళావతీపరిణయము.



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు

In favour of
Exhibition

...uni Samaj.



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

## ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

---

రాజవాహనుఁడు—ఘూర్జర దేశపు రాజు.

కళావతి—రాజవాహనుని కూఁతురు; విజయసారుని భార్య.

సౌజన్యనిధి—కళావతి పురుష వేషము వేసికొన్నప్పటిపేరు.

లీలావతి—రాజవాహనుని ప్రథమ భార్య.

మంజుభాషిణి—రాజవాహనుని ద్వితీయ భార్య; కళావతిసవతితల్లి

చంద్రవర్మ—మంజుభాషిణి యన్నకొడుకు.

విజయసారుఁడు— కళావతి వరియించినభర్త.

మిత్రదాసుఁడు — విజయసారుని మిత్రుఁడు; రాజవాహనుని పరిచారకుఁడు.

కుటిలాస్యుఁడు — మాళవ దేశస్థుఁడు; విక్రమసింహుని సేనాధిపతులలో నొకఁడు.

వంశవర్ధనుఁడు—రాజవాహనుని యాస్థానమునం దుండెడి యొక ప్రభువు.

బలవర్ధనుఁడు — రాజవాహనుని పెద్దకొడుకునకు వంశవర్ధనుఁడు పెట్టిన పేరు.

వీరసేనుఁడు—రాజవాహనుని పెద్దకుమారుఁడు.

గుణవర్ధనుఁడు—రాజవాహనుని రెండవకొడుకునకు వంశవర్ధనుఁడు పెట్టిన పేరు.

విక్రమసేనుఁడు—రాజవాహనుని రెండవకుమారుఁడు.

విక్రమసింహుఁడు—మాళవ దేశపు రాజు.

దృఢసేనుఁడు—మాళవరాజుయొక్క ప్రధానసేనాధిపతి.

# కళావతీపరిణయము



పూర్వకాలమునందు రాజవాహనుఁ డనురాజు ఘూర్జరదేశమును పాలించుచుండెను. ఆతనిజ్యేష్ఠభార్య యైనలీలావతి యొక పుత్రికను, ఇద్దఱుపుత్రులను, కని వారి శైశవదశయందే కాలధర్మము నొందెను. వారిలో కొమార్తెయైన కళావతి తండ్రియొద్దనే పెరుగుచుండెను గాని, పెద్దవానికి మూడుసంవత్సరములును చిన్నవానికి సంవత్సరమును ప్రాయ మున్నప్పుడు పుత్రులనిద్దఱిని ఎవ్వరో యెత్తుకొనిపోయిరి. ఆపుత్రులగతి యేమయినదో వారినిదొంగిలించినవా రెవ్వరో రాజునకుమాత్ర మెంతప్రయత్నముచేసినను తెలియలేదు. అందుచేత రాజు తన కొమార్తెకే రాజ్యమునిచ్చి యల్లునిని కొమార్తెను తన యొద్దనే యుంచుకొనుటకు నిశ్చయించుకొనియుండెను.

అటుతరువాత కొంతకాలమునకు రాజు మంజుభాషిణి యను దానిని మరల వివాహము చేసికొనెను గాని యామె కుత్సితురాలై సవతికూఁతురైన కళావతియెడల మిక్కిలి క్రూరురాలయి ప్రవర్తింప మొదలుపెట్టెను. ఆమెమనసులోపల కళావతిని ద్వేషించుచున్నను తనమనోభావము బయలపడనియ్యక పైకి చిన్నదానియందు ప్రేమ గలదానివలె నటించుచు తియ్యనిమాట లాడుచుండును. కళావతి నేలాగుననైన తన యన్నకొమారుఁడైన చంద్రవర్మ కిచ్చి వివాహము చేయించి, రాజవాహనుని యనంతరమునందు రాజ్య మాతని పాలుచేయింపవలయు నని యామె మనసులో నొకయూహ కలదు. రాజునకు కొమార్తెయం దున్నప్రేమాతిశయమునుబట్టి తప్పిపోయిన కుమాళ్ళు మరలదొరకనిపక్షమున తనరాజ్యము నతఁడు తప్పక కొమార్తెకే యిచ్చునని యామె యీవఱకే తెలిసికొని యుండెను.

అయినను తండ్రియంగీకారమునుపొందకయే కళావతి తనతండ్రికిఁగాని, రాణియైన మంజుభాషిణికిఁగాని తెలియను సహితము తెలియకుండ విజయసారుఁ డనువానిని రహస్యముగా గాంధర్వవివాహమున భర్తనుగాఁ జేసికొనెను.

విజయసారుఁ డాకాలమునం దున్న రాజపుత్రులలో నెల్లను మిక్కిలి విద్యాధికుఁడు గాను, గుణాతిశయము గలవాఁడు గాను, ఉండెను. విజయసారునితండ్రి రాజవాహనునిసేనలో నొకనాయకుఁడుగా నుండి, రాజుపక్షమున నిలిచి ధైర్యసాహసములతో పోరాడి యొకయుద్ధమునందు శత్రువీరులచేత చంపఁబడెను. అతఁడు పోవునప్పటికి భార్య గర్భవతియై యుండి, మగఁడుపోయినదుఃఖముచేత నానాటికి కృశించి మగశిశువును గని పురిటిదినములలోనే లోకాంతరగతురా లయ్యెను. ఆశిశువుయొక్క నిరాధారత్వమును జూచి జాలిపడి, ఆతనితండ్రి తనవిషయమున కనఁబఱిచిన ప్రభుభక్తిని స్వామికార్యనిర్వాహకత్వమును విచారించి రాజవాహను డాశిశువును తన యంతఃపురమునకు రప్పించి, అక్కడనే తనబిడ్డలతో సమానముగా పెరుఁగునట్లు చేసి విద్యాబుద్ధులు చెప్పించెను. అందుచేత కళావతియు విజయసారుఁడును పసితనమునుండియు నొక్కచోటనే పెరిగి, ఒక్క గురువువద్దనే విద్యాభ్యాసము చేయుచు వచ్చుటచేత, ఆటపాటలు మొదలుకొని సమస్తవిషయములయందును పరస్పరమైత్రి గలవారయి యుండిరి. బాల్యమునందు వారిలోఁగలిగిన యన్యోన్యమైత్రియు ప్రేమమును వయసుతోఁగూడ వృద్ధియగుచు వచ్చినందున, పెద్దవారయిన తరువాత వా రెవ్వరితోను జెప్పక రహస్యముగా గాంధర్వవిధిప్రకారముగా వివాహము చేసికొనిరి.

మంజుభాషిణి తనసవతికొమార్తెయొక్క చర్యలను కనిపెట్టుటకయి సదా వేగులవారిని నియమించి యుండుటచేత కళావతియొక్క రహస్యమేలాగుననో తెలిసికొని ఆమెవివాహవార్తను వెంటనే తనభర్తకు తెలియఁబఱిచెను. కొమార్తెస్వగౌరవమును విచారింపక సేవకపుత్రుని వివాహమాడిన దన్నమాట చెవిసోఁకఁగానే రాజు భగ్గున మండిపడి, తత్క్షణముననే విజయసారుఁడు దేశము విడిచిపోవునట్లాజ్ఞాపించి, ఇఁక ముం దాతఁ డెప్పుడును స్వదేశమునకు రాకుండునట్లు ఖండితముగా నుత్తరువుచేసెను. రాజాజ్ఞ నతిక్రమింపక విజయసారుఁ డాదినముననే యుజ్జయినీనగరమునకు పోవుటకయి ప్రయాణ మయి యుండెను. ఈలోపల రాణి తనకొమార్తెకు సంభవించిన భర్తృవియోగమును గూర్చి దుఃఖపడుచున్నదానివలె నటించుచు, స్వకార్యలాభముకొఱకామెయనుగ్రహమును పొంద నెంచి, విజయసారుఁడు స్వదేశమును విడిచి పోవుటకు ముందుగా రా జెఱుఁగకుండ దంపతుల కిద్దఱకును యేకాంతస్థలమునందు సమావేశము కలుగఁజేసెద నని చెప్పి కళావతి నోదార్చెను. ఈసమావేశమును గలుగఁజేయుటవలన కొమార్తెయొక్క దయను సంపాదించి, మంచిదానివలె నటించుచు మాయవేషము వేసి తండ్రియనుమతి పొందక చేసికొన్న దగుటచే మొదటి వివాహము శాస్త్రవిరుద్ధ మయినదనియు చెల్లఁగూడని దనియు సమయము చూచి యామెమనసున కెక్కునట్లుగా బోధించి యొప్పించి ఆమెబుద్ధిని మరలించి యెట్లయిన తనమేనల్లుని వివాహము చేసికొనునట్లు చేయవలెనని యుద్దేశించెను.

రాణి యేర్పఱిచిన యేర్పాటు ప్రకారముగా కళావతియు విజయసారుఁడును రహస్యస్థలమున సమావేశమయి యన్యోన్యానురాగము తేటపడునట్లుగా మాటాడుకొన్న మాట లెన్నియైనను

గలవు. కడపట విడిచిపోవునప్పుడు కళావతి తనవ్రేలినున్న రత్నఖచిత మయిన యుంగరమును దీసి యిది తనకు తల్లి ప్రేమతో నిచ్చినదని చెప్పుచు విజయసారుని వ్రేలికి తొడిగి దీనిని తన జ్ఞాపక చిహ్నముగా యావజ్జీవమును విడువక ధరింపవలసినదని వేడుకొనెను. విజయసారుఁడును తన దేహములో ప్రాణముండఁగా దాని నెప్పుడును విడువనని వాగ్దానముచేసి, తనమెడనున్న పచ్చలపదకమునుదీసి కళావతికంఠమునఁ దగిలించి దాని నెప్పుడును విడువక తనయెడఁగల ప్రేమకు సూచకము గా పదిలముగా కాపాడ వలసిన దని ప్రార్థించెను. అటుతరువాత వారు యావజ్జీవమును ఒండొరులమీఁది ప్రేమను విడువకుండునట్లును స్వప్నావస్థయందును పరస్పర ద్రోహమును తలఁచుకొనకుండునట్లును ప్రమాణములు చేసికొని మహాదుఃఖముతో తుదకొండొరులను విడిచి పోయిరి. కళావతి వియోగదుఃఖమునకు తాళలేక భర్తనుతలచుకొని సదా పరితపించుచు రాజాంతఃపురమునం దొంటిగా దిన మొకకల్ప ముగా కాలము గడుపుచుండెను. విజయసారుఁడును కాళ్ళు ముందు కును మనస్సు వెనుకకును నడువ భార్యావియోగమునకు దుఃఖించుచు విధిలేక యెట్లో యుజ్జయినీనగరమునకు వెడలిపోయెను.

ఉజ్జయినీనగరమును చేరినతరువాత విజయసారుఁ డక్కడ నానాదేశములనుండి వచ్చియున్న రాజపుత్రులతో సహవాసము చేయుచు నొకవిధముగా దినములుపుచ్చుచుండెను. ఇట్లుండఁగా నొక నాఁ డారాజపుత్రులలో నాయాదేశముల స్త్రీలవిషయమున ప్రసంగ ముకలిగి, వారు వారు తమతమదేశపుస్త్రీలను భార్యలను పొగడ మొదలుపెట్టిరి. అప్పుడు విజయసారుఁడు తనహృదయమునుండి యెప్పు డును నెడఁబాయకున్న తనప్రియభార్యను దలఁచుకొని, లోకము నందలి సుందరులలో తనభార్యయంతటి పతివ్రతయు గుణవతియు

వేఱొక్కటెయుండ దని వారితో దృఢముగా వాదించెను. ఆసమయమునం దక్కడనున్న రాజపుత్రులలో నొక్కఁడైన కుటిలాస్యుఁ డనువాఁడామాటలకు సహింపలేక, తనజన్మస్థాన మయినమాళవదేశములోని స్త్రీలకంటె నొకఘూర్జరాంగన యధికురా లన్నవాక్యమునకు రోషము కలవాఁడయి, విజయసారునివంకఁ దిరిగి "నీభార్యయొక్క పతిభక్తినిగూర్చి నాకు నమ్మకము కలుగకున్నది"అని పలికెను. ఆమాటలమీఁద ఘర్షణ పెరిఁగి కొంతసేపు వాదము జరిగినపిమ్మట విజయసారుఁడు తనభార్యయొక్క పాతివ్రత్యమును పరీక్షించుటకయి కుటిలాస్యుని ఘూర్జరదేశములోని తనవాసస్థాన మయినసౌరాష్ట్రపురమునకుఁ బంపుటకును, ఆతఁడు పోయి సర్వప్రయత్నములును జేసి యేవిధముచేత నైనను కళావతియొక్క చిత్తమును లోఁగొని యామెను వశపఱచుకొని తానిచ్చివచ్చిన పచ్చలపదకమును తెచ్చినపక్షమున తన కామె ప్రేమపూర్వకముగా నిచ్చినముద్దుటుంగరము నాతనికిచ్చి వేయుటకును, ఒప్పుకొనెను. కుటిలాస్యుఁడును తా నామెను వశపఱచుకొని పదకము దీసికొనిరాలేకపోయినపక్షమున తా నాతనికి పదివేలరూప్యము లిచ్చున ట్లొడఁబడెను. ఈప్రకారముగా నొండొరులు పందెములు వేసికొని శపథములు పలుకుకొన్నతరువాత, కుటిలాస్యుడు వెంటనే యుజ్జయినీనగరమును విడిచి ఘూర్జరదేశమునకు ప్రయాణమయిపోయెను. విజయసారుఁడు తనభార్యయొక్క నడ్తయందత్యంత విశ్వాసము కలవాఁడు గనుక పందెమును తప్పక తానే గెలిచెదనని దృఢముగా నమ్మియుండెను. కుటిలాస్యుఁడు కొన్నిదినములలో సౌరాష్ట్రపురమును జేరి యామెభర్తవద్దనుండి వచ్చినట్లు కళావతికి వర్తమాన మంపఁగా, ఆమె యత్యంతాదరముతో నాతని రప్పించి క్షేమవార్త లడిగి భర్తృసఖుఁడని మిక్కిలియాదరించి గౌరవించెను.

కాని యాతఁ డామెమీఁద తనకు వలపుగలిగినట్లు తేటపఱుపఁగానే యామె యాతనిని గడ్డిపఱకవలెఁ జూచి నిరాకరింపసాగెను. ఆమెను వశ్యురాలినిగాఁ జేసికొనుట కయి ప్రయాసపడుటవలన ప్రయోజన మేమియు నుండ దని యాతఁడును శీఘ్రముగానే తెలిసికొనెను.

అయినను తానేలాగునన్నైనపందెమును గెలువవలెనన్నయాశ మాత్ర మాతనిహృదయమును విడువక బాధింపఁజొచ్చెను. అందుచేత కుటిలాస్యుఁడు న్యాయబుద్ధిని విడిచి, ఏమాయోపాయమో పన్ని విజయసారుని వంచించి పందె మేలాగునన్నైన గెలువవలె నని నిశ్చయము చేసికొని, కళావతియొక్క పరిచారికలకు కొందఱికి లంచమిచ్చి వారిని వశపఱుచుకొని వారిసాహాయ్యమున నొకనాటిరాత్రి సంజ కడ కళావతియొక్క పడకగదిలో ప్రవేశించి మంచముక్రింద దాఁగి యుండెను. యథాప్రకారముగా కళావతిభోజనముచేసివచ్చి మంచము మీఁద పరుండి నిద్రపోయినదాఁక మంచముక్రిందనే దాఁగియుండి, ఆమె గాఢముగా నిద్రపోయిన తరువాత చప్పుడుకాకుండ మెల్లఁగా లేచివచ్చి, గదిలో నున్నవస్తువులు మొదలైనవాని నన్నిటిని నిపుణ ముగా పరిశీలించిచూచి, తాను చూచినదానినెల్లనుకాగితముమీఁద వ్రాసికొని, తరువాత కళావతి శరీరమును పరీక్షించి యామె మెడ మీఁద నొకపుట్టుమచ్చ యుండుట కనిపెట్టి, కడపట విజయసారుఁ డిచ్చిపోయిన యామెమెడలోని పచ్చలపదకమును మెల్లఁగా కొలికి వెడలించి తీసి బట్టకొంగున ముడివైచుకొని, రెండవవా రెఱుఁగ కుండ గది వెడలిపోయెను. ఆక్రూరుఁ డాతెల్లవాఱుజాముననే బయలుదేఱి యుజ్జయినీనగరమునకుఁ బోయి, అక్కడ విజయసారుని జూచి కళావతిని లోఁబఱుచుకొని తానామెతో నొకరాత్రి శయన గృహమునఁ గడపితి ననియు తన కామె పచ్చలపదకము నిచ్చె

ననియు గొప్ప చెప్పుకొనెను. విజయసారుఁ డామాటలు నమ్మక పోయెను.

కుటిలాస్యుఁడు—వివరముగా నే నానవాళ్ళు చెప్పినప్పుడయిన నీవు నామాటలు నమ్మెదవా? ఆమెగదిలో సరిగంచులత గలిగినమెత్తె పట్టుమేలుకట్టు కట్టఁబడి యున్నది. గోడలకు భారతయుద్ధమును వివరించుపటములు తగిలింపఁబడి యున్నవి.

విజయసారుఁడు—సత్యమే కాని యీసంగతులు నీవు కన్నులతో చూడకయే యితరులవలన విని తెలిసికొని యుండవచ్చును.

కుటి—ఆగదికి దక్షిణపువైపున రెండుగవాక్షము లున్నవి. వానితలుపులమీఁద విచిత్రవర్ణములతో మిక్కిలి మనోహరములయిన నెమళ్ళును హంసలును వేయఁబడి యున్నవి.

విజ—ఇదియు నీవు పరులవలన వినియే యుండవచ్చును. ఆచిత్రపఠిమలసౌందర్య మూరివారి కందఱికిని నిత్యప్రసంగముగా నుండును.

కుటి—(కొంగుముడి విప్పి పచ్చలపదకమును పయికిఁ దీసి) ఈపదకము నయిన నీ వెఱుఁగుదువా? నాకారాత్రి యామె యిచ్చిన దిదియే. ఆమె దీనిని తనమృదుహస్తములతో కంఠమునుండి తీసి నామెడను తగిలించినప్పటి యామె శృంగారచేష్ట యిప్పటికి నాకు కన్నులఁగట్టిన ట్లున్నది. పూర్వ మొకప్పుడు తనకు దీనియం దత్యంతగౌరవ ముండె నని చెప్పుచు దీని నామె తనమెడనుండి తీయునప్పుడు నే నామెమెడమీఁద నెడమవైపున చింతాకంతపుట్టుమచ్చను గూడ ప్రత్యక్షముగాఁ జూచితిని నీ వింక నయిన నామాటయందు విశ్వాస ముంచెదవా?

ఈకడపటివాక్యములను వినుచున్నంతసేపును విజయసారుని మనస్సు సందేహముతోను దుఃఖముతోను కొట్టుకొనుచుండెను. ఈప్రసంగము ముగిసినతరువాత నతండు కొంచెముసే పాలోచించి కళావతి తనయెడల ద్రోహము చేసినమాట సత్య మని నిశ్చయము చేసికొని, ఆమెమీఁద పట్టరానికోపము గలవాఁ డయి యాగ్రహావేశముచేత దేహము కంపమొంద, ఆమెను కొన్ని దూషణోక్తులు పలికి, ఆమెవద్దనుండి పచ్చలపదకమును దెచ్చినపక్షమున, దా నిచ్చెదనన్న యారత్నఖచిత మయిన యుంగరమును కుటిలాస్యునకిచ్చివేసెను. ఇంతవఱకును ప్రాణాధికముగాఁ జూచుకొనుచున్న యా యుంగరము నాతని కిచ్చి పంపివేసి, కళావతిమీఁదఁగలిగిన యాగ్రహమునకు శాంతిగానక కోపోన్మాదముతో వెంటనే తనప్రాణమిత్రుఁడును కళావతియొక్క పరిచారకులలో నొకఁడు నయిన మిత్రదాసుఁడనువానికి తనవిషయ మయి యామెచేసిన ద్రోహకార్యమునంతను వివరముగా వ్రాసి, ఆమెను సోమనాథపట్టణమునకు యాత్రకయి వచ్చి భర్త తనవెంటఁ దీసికొనిపోవుచున్నమిషమీఁద నిల్లు వెడలించి త్రోవలోఁ జంపివేయుమని యుత్తరమువ్రాసెను. అప్పుడే కళావతి పేరకూడ నొకయుత్తరమునువ్రాసి దానిలో తా నామె ముద్దుమొగమును జూడక ప్రాణములు నిలుపఁజాల ననియు, తాను మరల స్వదేశములో నడుగుపెట్టినయెడల మరణదండనము విధింతు ననియు రా జాజ్ఞాపించినను ప్రియురాలి నిమిత్తమయి సోమనాథపురమునకు సాహసించి వచ్చెద ననియు, అక్కడకు మిత్రదాసునివెంటఁ దప్పక రావలయు ననియు, విజయసారుఁ డామెకు నమ్మకము పుట్టునట్టుగా మోసపుమాట లనేకము లాయుత్తరములో వ్రాసెను. ఆమెమాయ యుమర్మము నెఱుఁగని నిష్కపటస్వభావురాలు గనుకను, లోకము

లోని సమస్తపదార్థములకంటె భర్తమీఁదనే యెక్కువ ప్రేమగలది గనుకను, భర్తసందర్శనము నిమిత్తమయి తనప్రాణములనయినను విడువ తెగించియున్నది గనుకను, అణుమాత్రము ననుమానపడక యాయుత్తరములోని మాట లన్నియు సత్యము లని నమ్మి, మిత్రదాసుని త్వరపెట్టి యారాత్రియే యామె సోమనాథపట్టణమున కాతని తోడ ప్రయాణమయి యిల్లు విడిచిపెట్టెను.

వా రారాత్రి యిల్లువిడిచి నిత్యప్రయాణములు చేయుచు దాదాపుగా సోమనాథపురమునకు సమీపమునకుఁ బోయినతరువాత మిత్రదాసుఁడు విజయసారున కెంతమనసు గలిసిన మిత్రుఁ డయినను క్రూర మయిన యాతనియాజ్ఞను నిర్వహింప నిష్టములేనివాఁ డయి దారిలో తనమిత్రుఁడు వ్రాసిన యుత్తరములోని సంగతుల నామెకుఁ జెప్పెను. ప్రాణాధికుఁడుగా నెంచుకొనుచున్న భర్తను గలిసికొనుట కయి పోవుచుండుటకు మాఱుగా తానాభర్తయొక్క యాజ్ఞచేత నిష్కారణముగా చంపఁబడుట కయి పోవుచుండుట తెలిసికొన్నప్పు డామె మనస్సునకుఁ గలిగిన వ్యథ యింతంతని చెప్పుట కలవిగాదు. ఆమనోవేదనకు సహింపలేక యామె ప్రాణములు విడుచుటకు యత్నింపఁగా, మిత్రదాసుఁ డామె నోదార్చి ధైర్యముచెప్పి, అట్టిసాహసకార్యమును జేయక భర్త తనతప్పిదమును దెలిసికొని పశ్చాత్తాపపడు కాలము వచ్చువఱకు వేచియుండవలసిన దనియు, ఈలోపల మరల తండ్రిగారి గృహమునకు తనవెంబడిని రావలసిన దనియు, ఆమెను బహువిధముల బోధించి బతిమాలుకొనెను. ఎంతచెప్పినను తండ్రిగారిగృహమునకు వచ్చుట కామె యంగీకరింపక, తన్ను భర్తయెంత యనాదరము చేసి చంపింపఁ దలఁచుకొన్నను తానుమాత్ర మాతని

మీఁద ప్రేమను మానఁజాల ననియు, అందుచేత తా నుజ్జయినికి పోయి యాతనిపాదసందర్శనము చేసి యాతని సన్నిధానముననే ప్రాణములు విడిచెదననియు, తనమనోనిశ్చయమును మిత్రదాసునితోఁ జెప్పెను. అతఁ డప్పుడు చేయునది యేమియు లేక యామె నిశ్చయమును ద్రిప్పుటకు సమర్థుఁడు గాక, యౌవనవతియైన సుందరి యొంటిగా ప్రయాణముచేయుట యపాయకర మని బోధించి పురుషవేషము వేసికొనునట్లామె నొడఁబఱిచి తగినపరికరములనన్నిటి నొడఁగూర్చెను. ఆమె పురుషవేషము వేసికొన్నతరువాత సర్వరోగహర మని చెప్పి రాణి తనకిచ్చినయౌషధము నొకదాని నామెచేతికిచ్చి, మార్గాయాసముచేత దేహము స్వస్థత తప్పినపక్షమున దాని నుపయోగింపవలసిన దని చెప్పి, తాను శీఘ్రముగా నంతఃపురము చేరకపోయిన పక్షమున రాజు తనమీఁద ననుమానపడు నన్నభయముచేత నామెయొద్ద సెలవు గైకొని మిత్రదాసుఁడు మరల సౌరాష్ట్రమునకుఁ బోయెను. కొన్ని దుష్టజంతువులకు పెట్టుట కయి విషము కావలె నని యాస్థాన రాజవైద్యుని నడిగి పుచ్చుకొని, రాణియైనమంజుభాషిణి యా యౌషధమును విజయసారునితోను కళావతితోను మిత్రత గలవాఁడయి తనప్రయత్నములకు విఘాతము కలుగఁజేయుచున్నాఁ డన్నద్వేషముచేత నాతని కిచ్చెను. కాని యారాజాస్థానవైద్యుఁడు రాణియొక్క దుస్స్వభావమును చక్కఁగా నెఱిఁగినవాఁ డగుటచేత నామెను నమ్మి నిజమయిన విషౌషధము నియ్యక పుచ్చుకోఁగానే విషమువలెఁ గానఁబడి మత్తు కలుగఁజేసి పుచ్చుకొన్నవారిని కొన్నిగంటలకాలమువఱకును మృతులవలె నగపడునట్లు చేసెడియొకవింతమందు నిచ్చెను. సర్వరోగహరమయిన దివ్యౌషధమని చెప్పి రాణి యనుగ్రహపూర్వకముగా నిచ్చినట్లు నటించిన యామందునే యిప్పుడు మిత్రదాసుఁడు సదుద్దేశముతో

కళావతికిచ్చి, ఆమెను బహువిధముల దీవించి, ఆమెను దారిపోడుగు నను రక్షించుట కయి బహుదేవతల ప్రార్థించి, వెనుకకు మరలెను.

కళావతి పురుషవేషముతో నరణ్యమార్గమునఁ బ్రయాణము చేయుచు నొకనాఁడు దైవవశముచేత చిన్నతనములో దొంగిలింపఁ బడిన తన తమ్ము లున్నస్థానమునకే వచ్చి చేరెను. ఆచిన్నవాండ్రి నపహరించిన వంశవర్ధనుఁడనువాఁడు రాజవాహనునియాస్థానమునందు మన్ననగల ప్రభువుగానుండి, శత్రువుల కుతంత్రములు నమ్మి రాజు స్వామిద్రోహినిగా భావించి తన్ను నిష్కారణముగా రాష్ట్రమునుండి వెడలగొట్టించిన పగను సాధించుట కయి రాజపుత్రుల నిద్దఱి నెత్తు కొనివచ్చి తాను రహస్యముగా వాసముచేయుచున్న యరణ్యములోని యీగుహయందే వారినుంచి పెంచుచుండెను. అతఁ డాబాలురను మొట్టమొదట రాజుమీఁదగలపగను దీర్చుకొను నిమిత్తమే దొంగి లించి తెచ్చినను, వారియం దత్యంతప్రేమ గలవాఁ డయి వారిని తనకడుపునఁబుట్టిన బిడ్డలవలెనే పెంచుచు, మిక్కిలి శ్రద్ధతో వారికి విద్యాబుద్ధులు నేర్పుచు, పెద్దవారిని జేసెను. వారును రాజపుత్రు లయినందున సహజముగా వచ్చిన ధైర్యసాహసములను గలవా రయి ఆహారార్థము నిత్యమును వేఁటాడమరిగినవా రగుటచేత శరీరదార్ఢ్య మును చుఱుకుఁదనమును గలవా రయి, తమ బలపరాక్రమాదులను జూపి ప్రసిద్ధిపొందఁ గలుగుటకయి తమ్ము యుద్ధములకు నడుపుమని నిత్యమును తమ పెంపుడుతండ్రిని బలవంతపెట్ట మొదలుపెట్టిరి. భాగ్య వశముచేత వీరు నివసించెడి యీగుహకే కళావతివచ్చుట సంభవిం చెను. ఆమె సోమనాథపట్టణమునకుఁబోయి యక్కడనుండి భర్తృ సందర్శనార్థ ముజ్జయినికి బోవలె నని బయలుదేరిదారితప్పి, ఆఁకలి తోను శ్రమతోను గొంతసే పరణ్యమధ్యమునఁ దిరిగి, అం దెక్క

దను నిలువ తావుగాని యాహారముగాని గానక తుద కీగుహను జూచి, దానిలోపల ధనము పుచ్చుకొని యన్నము పెట్టువా రెవ్వరైన దొరకుదురేమో యన్నయాశతో లోపలఁ బ్రవేశించెను. ఆమె యెంత పురుషవేషము వేసికొని పయికి ధైర్యమును నటింపఁ బ్రయత్నించు చున్నను, స్వభావముచేత నబల యై మొదటినుండియు సుకుమారముగా పెరిఁగియున్నయామె కాయల్పకాలపురుషవేష మాకస్మికముగా ధైర్యమును కష్టముల కోర్చుసామర్థ్యమును గలిగింప లేకపోయెను. ఆమె గుహ చొచ్చి చూచునప్పటికి లోపల నెవ్వరును లేరు. కాని యం దొకపాత్రలో పాకముచేసిన మాంసముమాత్రముండెను. దుస్సహ మయినక్షుద్బాధచేత నామె యడిగి పుచ్చుకొనుట కయి యితరులు వచ్చినదాఁక తాళలేక, ఆమాంసము నొకయాకులో వడ్డించుకొని తినుచు, ఇట్లు చింతించెను. "అయ్యో! మనుష్యునిజీవన మెంత ప్రయాసకర మయినది! నాకుఁ గలిగినమార్గాయాస మింతంతని చెప్పశక్యము కాదు. రెండుదినముల నుండి నాకు భూమియే పాన్పగుచున్నది. పర్వతాగ్రమునుండి మిత్రదాసుఁడు చూచినప్పుడు మిక్కిలిసమీపముగాఁ గానబడిన సోమనాథపుర దేవాలయ మిప్పు డంతకంతకు దూర మగుచున్నట్లు తోఁచుచు, ఎంత నడిచినను దూరము తెలుగకున్నది. నాశరీరప టుత్వము నన్ను విడిచినను భర్తృసందర్శనాభిలాషమాత్రము విడువక నాదేహములో ప్రాణములను నిలిపి నాకు ధైర్యమును గఱపి ప్రయాణమునకుఁ బురికొల్పుచున్నది. ఓహో! నాప్రాణవల్లభా! విజయసారా! నీవు కఠినహృదయుఁడవయి నా కెంత ద్రోహమును దలఁచినావు!"

ఈప్రకారముగా నామె తనలో తాను తలఁచుకొనుచున్నసమయములో తమ పెంపుడుతండ్రితోఁగూడ వేఁటకుఁ బోయి యుండిన

ఆమెసోదరు లిద్దఱును వేఁటనుండి యింటికి వచ్చిరి. వారిలో నొకనికి బలవర్ధనుఁ డనియు రెండవవానికి గుణవర్ధనుఁ డనియు వంశవర్ధనుఁడా నామములు పెట్టెను. గాని వారినిజమయిననామధేయములు పెద్దవానికి వీరసేనుఁడనియు చిన్నవానికి విక్రమసేనుఁడనియు చిన్నతనములో తండ్రి యుంచెను. కాని యీబాలురుమాత్రము తమనిజమయినపేరు లేనో తమతండ్రి యెవ్వరో యెఱుఁగక వంశవర్ధనునే తండ్రినిగా భావించుకొను చుండిరి. వంశవర్ధనుఁడు ముందుగా గుహలోప్రవేశించి కళావతిని జూచి ఆచిన్నవాండ్రను లోపలికి రాకుండ నిలిపి "అన్న లారా! మీరు లోపలికి రాకుఁడు. ఏదోవనదేవతమనయాహారమును తినుచున్నది" అనెను. రాజపుత్రు లిద్దఱు నొక్కసారిగా "లోపల నేమున్నది?" అని యడిగిరి. వంశవర్ధనుఁడు "గుహలోపల నెవ్వఁడో యొకదివ్యపురుషుఁడో సిద్ధపురుషుఁడో కూరుచుండి యున్నాఁడు" అని చెప్పెను. పురుషవేషమును ధరించి యున్నకళావతి నిజముగా నతని దృష్టి కంత చక్కఁగానే కానఁబడెను. వారికంఠధ్వనులు వినియామె గుహలోనుండి లేచి వెలుపలికివచ్చి వారినిజూచి 'ఓసహోదరులారా! నా కేమియు హానిచేయకుఁడు. నేను మీగుహలో ప్రవేశింపకముందు మీవద్ద ధనమిచ్చి కొనిగాని వేఁడుకొనిగాని యాహారము పుచ్చుకో వలె ననియే యుద్దేశించి యుంటిని. కాని క్షుద్బాధ నన్ను మీరు వచ్చువఱకును తాళియుండకుండఁ జేసినది. క్షమింపుఁడు. నేను నట్టింట ధనము క్రుమ్మరించి పోయినను ముట్టుకొనువాఁడను గాను. ఇదిగో నేను తిన్నయాహారమునిమిత్తము మయి మీ కొకరూప్యము నిచ్చు చున్నాను. ఈసమయమున మీరిక్కడకు రాకయుండినను నేను భోజన మయినతరువాత మీనిమిత్తమయి యీరూప్యమును లోపల విడిచి యీయన్నదాతలను రక్షించుటకయియీశ్వరుని ప్రార్థించియే

యావల పోయి యుందును.'' అని రూప్యమును వారి చేతిలో పెట్టెను. వారు దానిని పుచ్చుకొననొల్లక మరల నిచ్చివేసిరి. అది చూచి స్త్రీస్వభావముచేత పిరికిదైన కళావతి వారివంకఁ దిరిగి 'సోదరులారా! నామీఁద మీకు కోపమువచ్చినట్లున్నది. నేను జేసినయపరాధము నిమిత్తమయి మీరు నన్నిప్పుడు చంప దలఁచుకొన్నను నేనీనేరమును జేయకుండినయెడల నేనప్పుడే చచ్చి యుందును.''

వంశ—నీపే రేమి? నీ వెక్కడకు పోవుచున్నావు?

కళావతి—నా పేరు సౌజన్యనిధి. మాళవదేశమునందు నాకొకయాప్తబంధుఁ డున్నాఁడు. ఆతనిని జూచునిమిత్తమయి బయలుదేరి పోవుచు దారిలో దుష్పురుషవశుఁడనై యీయపరాధమునకు లోఁబడవలసినవాడ నయినాను.

వంశ—ఓ సౌజన్యనిధీ! మేము వసించుచున్నయరణ్యమును బట్టి మేము మూర్ఖుల మయినకొండవాండ్రమనియు మాహృదయములు క్రూరము లయిన వనియు తలఁపఁబోకుము. నీవిక్కడకుమంచి వేళకు వచ్చితివి. ఇప్పుడు సాయంకాల మగుచున్నది. ఈరాత్రినీవు మాతోఁగూడ నుండి మావలన నతిథిసత్కారమును బొంది మేము ప్రీతిపూర్వకముగాఁ బెట్టెడుభోజనము నంగీకరించి సుఖనిద్రచేసి తెల్లవాఱినతరువాతఁ బొమ్ము—ఓ బాలకులారా! మీ రీయతిథి నాదరింపుఁడు.

అప్పు డామె సహోదరు లయినయాయిద్దఱుచిన్నవాండ్రును వినయపూర్వకము లయినమంచిమాటలు చెప్పుచు ఇఁకముందామెను తమజ్యేష్ఠసోదరునిగా భావించుకొనెద మని పలుకుచు, చేయిపట్టుకొని కళావతిని గుహలోనికిఁ దీసికొనిపోయి కూరుచుండఁబెట్టిరి. వారామె నట్లు కూరుచుండఁబెట్టి తాము వేఁటాడి తెచ్చినలేడిమాంసమును

ఫలములను, తేనెను, ఆమెముందుఁ బెట్టిరి. కొంతసేపు సుఖసల్లాపము జరిగినమీఁదట ఆచిన్నవాండ్రు తాము తెచ్చినమాంసమును పాకము చేయుటకయి లేవఁగా కళావతి తానును వారికి సహాయురాలయి యద్భుతముగా పాకముచేసి పాకశాస్త్రమునందుఁ దనకుఁ గలనిపుణత్వము నంతను గనఁబఱిచెను. సాధారణముగా గొప్పరాజులకడుపునఁ బుట్టినబిడ్డలు పాకశాస్త్రము నెఱిఁగి వంటచేయుటయందు సమర్థురాండ్రుగా నుండకపోయినను, కళావతిమాత్రము తక్కినవిద్యలతోడి పాటుగా పాకశాస్త్రమునుగూడ నభ్యసించి నానావిధములపాకములు చేయుటకు నేర్చుకొనెను. ఆమె వంటచేయుచు మనోహరముగాపాట పాడుచున్నప్పు డాచిన్నవాండ్రాపాట విని "ఇతఁడు భూమికి దిగి వచ్చిననారదుఁడో తుంబురుఁడో" యని యాశ్చర్యపడఁజొచ్చిరి. ఆమె నవ్వుమొగమును జూచునప్పుడు వారిలోవారు "ఈతఁ డెంత నవ్వుచు మాటాడు చున్నను ముఖచర్యనుబట్టి చూడఁగా నీతని మనస్సులో నేదో దీర్ఘవిచార మున్నట్లు తోఁచుచున్నది" అనుకొనిరి.

ఆమెయం దున్న సుగుణగౌరవముచేతనో పయికిఁ దెలియక పోయినను లోపల నున్నబంధుత్వసంబంధముచేతనో ప్రథమదర్శనక్షణము మొదలుకొని యాసోదరుల కామెయందు మేరమీఱినయనురాగము కలిగెను. ఆమెకు వారియెడఁ గలిగినప్రేమకును పరిమితి లేదు. ఆమెమనసంతయు ప్రాణవల్లభుఁ డయినవిజయసారునిమీఁదికే పోకయుండినపక్షమున, వారిలోఁ గలిగినయన్యోన్యమైత్రికిని వాత్సల్యమునకును కళావతి తనజీవితశేషమునంతను వారితోఁ గలిసి యీగుహయందే గడపుటకు సంతోషపూర్వకముగా నభిలషించియుండును. తగినంతవిశ్రాంతినిపొంది బడలికతీఱి ప్రయాణముచేయ శక్తురాలగువఱకును వారియొద్దనే యుండుటకయి యామె వారిప్రార్థనమీఁద

నంగీకరించెను. రాత్రి భోజనముచేసి సుఖనిద్ర పొందినతరువాత తెల్ల వాఱి లేచి యన్నదమ్ములు వేఁటకు పోఁబోవునప్పుడు వా రామెను గూడఁ బిలిచినను, దేహ మస్వస్థముగా నున్నందున నామె వారి వెంట పోలేకపోయెను. అడవిలో నడచినయాయాసమును పెనిమిటి త న్ననాదరణ చేసినందువలనఁ గలిగినదుఃఖమును జేరి యామె యస్వస్థతకు కారణ మయ్యెను. అంతట వా రామెయొద్ద సెలవు పుచ్చుకొని త్రోవపొడుగునను కళావతియొక్క రూపమును గుణము లను ప్రశంసించుచు వేఁటనిమిత్తము పోయిరి.

వారు వెళ్ళినకొంతసేపటికి మిత్రదాసు డిచ్చినయాపథము మాట స్మరణకు వచ్చి, కళావతి యాయాపథమును వేసికొని క్షణ కాలములో శవమువలె పడిపోయెను. ఆదినమున వెంటనేకొన్నిమృగ ములు పడినందున వానిని తీసికొని వంశవర్ధనుఁడు బలవర్ధనుఁడును గుణవర్ధనుఁడును మరలి శీఘ్రముగానేవచ్చి యిల్లుచేరిరి. వారిలో బలవర్ధనుఁడు ముందుగా గుహలోనికిఁ బోయి చూచి, ఆమె యలసి నిద్రించుచున్నదని యెంచి, వడిగా నడిచినయెడల నిద్రాభంగము కలుగునని మెల్లమెల్లఁగా నడుగులిడుచువచ్చి తమ్మునితోఁజెప్పెను. అతఁడును చప్పుడు కాకుండ నడచిపోయి చూచి యామె శ్వాసము విడుచుచున్నజాడ గానక సందేహపడి, అన్నగారిని తండ్రిని లోపలికిఁ బిలిచెను. వా రందఱును పోయి పరీక్షించిచూచి యామెమృతినొందె నని నిశ్చయము చేసికొనిరి. అప్పుడాసోదరు లిద్దఱును తామామెతో నొక్కనాఁటిమైత్రినే గలవా రయినను, ఆబాల్యస్నేహము గలవారి వలె నామెనిమిత్తము విలపింప మొదలుపెట్టిరి.

అప్పుడు వంశవర్ధనుఁడు వారి నూఱడించి కొంతవఱకు దుఃఖ శాంతి చేసి శీఘ్రముగా శవము నిల్లు వెడలించుప్రయత్నము చేయ

వలె నని చెప్పెను. అప్పు డేడుపు చాలించి వారు ముగ్గురును శవమును మోచుకొనిపోయి, ఒకశమీకవృక్షమునీడను పచ్చికమీఁద మెల్లఁగా శవమును దింపి, పయిని పుష్పములు పత్రములు మొదలయినవి కప్పి, ఆమె కాత్మరక్షణము కలిగింపవలె నని యీశ్వరుని ప్రార్థించి, చింతాక్రాంతులయి యాప్తబంధువును పోఁగొట్టుకొన్నట్టు విలపించుచు నింటికి వచ్చిరి.

వారు వెళ్ళిపోయిన కొంచెముసేపటికి మందుయొక్క పటిమ తగ్గిపోయి తెలివివచ్చి, కళావతి తనమీఁద గప్పఁబడియున్న యాకులను పువ్వులను విదలించుకొని, మెల్లఁగా లేచి కూరుచుండి యది స్వప్నావస్థయని భ్రాంతినొంది, తనలో దా నిట్లు తలపోయ మొదలుపెట్టెను. "అయ్యో! ఇంతవఱకును నే నొకగుహలో నున్నట్టును, అక్కడ దేవతలుబోలిన యిద్దఱు చిన్నవాండ్రతోఁ గలిసి వంటచేసినట్టును, తలఁచియుంటిని. ఇంతలో నే నిక్కడ కెట్లువచ్చితిని? ఈపువ్వులు మొదలయినవినామీఁద కెట్లువచ్చినవి? ఇదియేమిభ్రాంతి" అని యాలోచించి, మరల గుహావద్దకు పోవుటకు మార్గమునుగాని, గుహలోనున్నవారియొక్క జాడనుగాని, ఎంతమాత్రమును దెలిసికొలేక యదియంతయు పగటికలయయి యుండుననని నిశ్చయించుకొనెను. ఇట్లు కొంతసే పక్కడ దిగ్భ్రమనొందియుండి, ఆమెయాలోచనయంతయు తనపురుషవేషముతోఁ బోయి భర్తను జూడవలె నని యుండుటచేత దారి యేలాగునననైన కనుఁగొని సోమనాథపురమునకుఁ బోవలె నని ప్రయాణమయి లేచి మెల్లఁగా నడువసాగెను.

ఈలోపల నాకస్మికముగా నెవ్వరును ననుకొనివింతసంగతి యొకటి సంభవించెను. కొంతకాలమునుండి రాజవాహనునకును మాళవదేశపురాజయిన విక్రమసింహునకును పొలిమేరనుగూర్చి

వివాద మున్నందున మాళవరా జెవ్వరికి దెలియకుండఁ దన ప్రధాన సేనానాయకుని సేనలతో ఘూర్జరదేశముమీఁదికి యుద్ధయాత్రకుఁ బంపెను. అట్లు దండెత్తివచ్చిన మాళవరాజుసేన యాసమయమునందు కళావతితిరుగుచున్న యరణ్యములోనే విడిసియుండెను. అచ్చటికాసేన తోఁగూడ విజయసారుఁడును వచ్చియుండెను. అతఁడు మాళవసైన్యముతోఁ గలిసివచ్చినను, ఘూర్జరసేనతోఁగూడి తన్ను దేశమునుండి వెడలఁగొట్టినరాజుపక్షమున నిలిచి స్వదేశరక్షణార్థ మయి పోరాడవలె నన్న దేశాభిమానముతోనే యిచ్చటికి వచ్చెను గాని శత్రువులతోఁ గలిసి తనరాజుతో యుద్ధము చేయవలె నన్నయూహతో రా లేదు. విజయసారుఁ డిప్పటికిని కళావతి తనయెడల ద్రోహముగలఁ చెననియే నమ్మియుండెను. మిత్రదాసుఁడు తనయాజ్ఞను చెల్లించినట్లును కళావతి మృతినొందినట్లును ఉత్తరము వ్రాసినందున తానంత ప్రేమతోఁజూచుచుండిన ప్రియురాలు మరణము నొందుటయు తన్మరణమునకు తానే కారకుఁ డగుటయు మనస్సునకు మిక్కిలిభారముగాఁ దోఁచి విజయసారునకు ప్రాణము దుర్భరముగా నుండెను. అందుచేత నతఁడు ప్రాణమునం దాశ లేక యుద్ధమునందు చంపఁబడికానిస్వదేశమునకు మరల వచ్చినందునకయి రాజుచేతవధింపఁబడికాని దేహము విడువవలె నన్ననిశ్చయముతోనే యీదేశమునకు వచ్చెను. సోమనాథపురమునకు పోకమునుపే కళావతి దారిలో మాళవసేనానాయకులలో నొకనిచేతఁ జిక్కి, అతనిచేతఁ దమ ప్రధానసేనానాయకుఁ డయిన దృఢసేనునకు కానుక చేయఁబడెను. దృఢసేనుఁడును పురుషరూపధారిణియై యున్నయాకళావతియొక్క యాకారమును వర్తనమును మిక్కిలి హృద్యములుగా నున్నందున, సౌజన్యనిధి యన్న పేరుతో నున్నయామెను తనవద్ద ముఖ్యపరిచారకునిగా నుంచుకొని మిక్కిలి యాదరముతోఁ జూచుచుండెను.

మాళవరాజుయొక్క సేన తనరాజధానిమీఁదికి వచ్చుచున్న దన్నవార్త విని రాజవాహనుఁడు సాధ్యమయినంతశీఘ్రముగా సేనాసన్నాహము చేసికొని ప్రయాణభేరి వేయించి యుద్ధసన్నద్ధుఁ డయి యాసేన నెదుర్కొనుటకు బయలుదేఱెను. ఇట్లు బయలువెడలిన రెండుసేనలును వచ్చి యీయరణ్యములోనే యొండొంటిని గలిసికొనెను. అప్పుడు బలవర్ధనుఁడు గుణవర్ధనుఁడును వచ్చి శత్రుసేనలతో యుద్ధము చేయుట కయి తమరాజుయొక్క సేనలోఁ జేరిరి. యీవనమధ్యస్థులయి యున్నయీచిన్న వాండ్రిద్దఱును తమతండ్రిపక్షమున యుద్ధము చేయఁబోవుచున్నామని లేశ మయిన నెఱుఁగనివారయినను యుద్ధరంగమునందు తమధైర్యశౌర్యములనుగనఁబఱుపవలెనని యతికుతూహలము గలవారయి యుండిరి. వారితోడఁగూడ వృద్ధుఁడైనవంశవర్ధనుఁడును బోయి రాజుసేనతోఁ గలిసెను. అతఁడు రాజునకు కొడుకులతోడివియోగమును గలిగించి తాను దుఃఖము కలుగఁజేసినందున కయి చిరకాలమునుండి మనస్సులో పశ్చాత్తాపపడుచుండి తాను వయఃకాలములో మహాశూరుఁ డయి యున్నందున రాజున కీయుద్ధరంగమున సహాయుఁ డయి యుపకారముచేసి తాను జేసినయుపకారమునకు ప్రతీకారము చేయవలె నన్న పరిశుద్ధచింతతో సంతోషపూర్వకముగా రాజవాహనునియొక్క దండుతోఁ జేరెను. అప్పు డుభయసైన్యములకును ఘోరయుద్ధ మారంభ మయ్యెను. ఆయుద్ధమునందు విజయసారునియొక్కయు వంశవర్ధనునియొక్కయు బలవర్ధన గుణవర్ధనులయొక్కయు నిరుపమానమైనయసహాయశూరత్వమువలనఁ గాని, లేకపోయినయెడల ఘూర్జరులకే యపజయముగలిగి రణరంగమునందు రాజవాహనుఁడు నిహతుఁడయియుండును. ఆ నలుగురుమహాశూరులును వీరత్వము రూపముదాల్చిన ట్లడరి పోరాడి

రాజున కడ్డపడి యతని ప్రాణములను కాపాడి, శత్రువీరులను పాఱఁదోలి ఘూర్జరులకు విజయము కలుగునట్లు చేసిరి. యుద్ధమునందు సహితము తానుకోరినమరణము దొరకనందున విజయసారుఁడు యుద్ధము ముగిసినతరువాత రాజవాహనుని యుద్యోగస్థులలో నొకనికి లోఁబడి, దేశము వెడలనడఁచినతరువాత మరల వచ్చిన యపరాధమునకయి విధించెడుమరణశిక్షను పొందుట కిష్టపడి సంసిద్ధుఁడ నయియున్నానని చెప్పెను. పురుషవేషముతో నున్న కళావతియు ఆమె యజమానుఁడయిన దృఢసేనుఁడును, మాళవరాజుసేనలో నొకదళవాయిగానున్న యామె యొక్క పూర్వశత్రువైన కుటిలాస్యుఁడును, సైనికులచేతపట్టుకోఁబడి కారాబద్ధులుగాఁ జేయఁబడుటకై రాజయినరాజవాహనుని యొద్దకు తీసికొనిరాఁబడిరి. ఈయుద్ధగృహీతులు రాజసమ్ముఖమున నున్నప్పుడే మరణదండనము విధింపఁబడుటకై విజయసారుఁడు రాజువద్దకుఁ గొని రాఁబడెను. వింతయైనయీసమయమునందే తమపరాక్రమమువలన రాజునకుఁ జేసినమహోపకారమున కర్తలై మెసబహుమానమును పొందు నిమిత్తమయి బలవర్ధనగుణవర్ధనులతోఁగూడ వంశవర్ధనుఁ డక్కడికు రావింపఁబడెను. మిత్రదాసుఁడు రాజపరిచారకులలో నొకఁడైనందున, ఆసమయమునందతఁడుగూడ రాజసన్నిధానమునందే యుండెను. కాఁబట్టి యిప్పుడు విజయసారుఁడును, కళావతియు, ఆమె నూతనయజమానుఁ డయినదృఢసేనుఁడును, మిత్రకార్య తత్పరుఁడైన మిత్రదాసుఁడును, మిత్రద్రోహియైనకుటిలాస్యుఁడును, రాజుయొక్క పుత్రు లయినబలవర్ధనగుణవర్ధనులును, వారిని దొంగిలి కొనిపోయిన వంశవర్ధనుఁడును అందఱును రాజుసమక్షముననే వేఱువేఱుకోరికల తోను భయములతోను నిలిచియుండిరి.

ఇట్లందఱును గుండెలు తటతటకొట్టుకొన నిశ్శబ్దముగా నిలిచి యుండఁగా వారిలో మాళవసేనాధిపతి యైనదృఢసేనుఁడు నోరు విప్పి మాటాడుటకు మొదటివాఁడయ్యెను. కాపువేషము వేసికొనియున్నను విజయసారునిజూచి కళావతియానవాలుపట్టెనుకాని పురుషవేషముతో నున్నయామెనుమాత్ర మతఁడు గుఱుతుపట్టలేకపోయెను. ఆమె కుటిలాస్యుని గుఱుతుపట్టి తనయుంగరమాతని చేతివ్రేలి నుండుట కని పెట్టినను తనకష్టములకెల్ల నతఁడే మూల మన్నమాటమాత్ర మెఱుఁగదు. ఆమెకు పురుషవేషము వేసినవాఁడు తానేగనుక, మిత్రదాసుడు కళావతి నానవాలుపట్టి తనలో "ఇదిగో నాయజమానురాలి నిప్పుడు చూడఁగలిగినందుకు సంతోష మగుచున్నది. ఆమె సజీవురాలయి యున్నదిగనుక, ఇఁక నేనామెవిషయమై ప్రస్తావముచేయక యేమిజరుగునో చూచుచుండెదను" అని తలపోయుచుండెను. వంశవర్ధనుఁడు కూడ నామెను గుఱుతుపట్టి గుణవర్ధనునివంకఁజూచి మెల్లగా "ఈచిన్నవాఁడు చచ్చినవాఁడు మరల బ్రతికివచ్చినాఁడాయేమి?" అని చెవిలో గుసగుసలాడెను. గుణవర్ధనుఁ డామెవంక నిదానించిచూచి "ఈచిన్నవాసికిని మనగుహలో మృతుఁ డయినసౌజన్యనిధికిని భేదము నాకనులకేమియు గానఁబడదు." అనెను. అప్పుడుబలవర్ధనుఁడామెనుపరీక్షతో జూచి "ఆచచ్చినచిన్నవాఁడే బ్రతికినాఁడా!" అని, మఱియేమో పలుకఁబోవుచుండఁగా వంశవర్ధనుఁడు ఊరుకొమ్ము. అతఁడే యితఁడయి యున్నపక్షమున మనలను తప్పకపలుకరించియుండును"అనెను. "అతఁడుచచ్చుట మనము ప్రత్యక్షముగాఁ జూడలేదా?" అనిబలవర్ధనుఁడు మరలఁ జెప్పుచుండఁగా వంశవర్ధనుఁడు వారించి'నిమిష మోపిక పట్టుము. సర్వమును స్పష్టమగును" అనెను. విజయసారుఁడు తాను రణరంగమున రాజప్రాణమును రక్షించినవార్త వెల్లడిచేసినపక్షమున

రాజుతన్ను క్షమించునేమోయన్న భయముచేత నోరుమెదల్పక, తన మరణదండనమును రాజుముఖమునుండి వినుటకయి సంతోషపూర్వకముగా వేచియుండెను. కళావతిని తనభృత్యునిగాఁ జేసికొనియున్న దృఢసేనుఁడే మొదట మాటాడినవాఁడని వెనుకనే చెప్పియున్నాము గదా! అతఁడు ధైర్యమునం దెంతప్రసిద్ధికెక్కినవాఁడో సౌజన్యమునందుఁగూడ నంతసుప్రసిద్ధుఁడే. అతఁడప్పుడు రాజువంకఁదిరిగి "ఓమహారాజా! నీవు నీచేతజిక్కిన శత్రువులనందఱిని సంహరింతువుగాని ధనమును స్వీకరించి విడిచిపెట్టవనివినియున్నాను. నేనుశత్రుపక్షమువాఁడనగుమాళవదేశస్థుఁడను; మాళవదేశస్థులకు సహజమైయున్న ధైర్యముతోనే నేనిప్పుడు నాప్రాణములువిడనాడెదను. కాని నేనొక్కరివిషయమయి యిప్పుడునిన్ను ప్రార్థింపవలసియున్నది" అనికళావతినిముందుకు రాజనెదురకుఁద్రోచి "ఈచిన్నవాఁడు మీఘూర్జరదేశముననే పుట్టి పెరిగినవాఁడు. ఇతఁడు నాసేవకుఁడు. యజమానులవద్ద కొలువు కుదిరినసేవకులలో నిటువంటిసదయహృదయుఁడును, విధేయత గలవాఁడును, ఎల్లప్పుడు చుఱుకుగానుండువాఁడును, సత్యసంధుఁడును, ఉపచారపరుఁడును, మఱియొకఁడుండియుండఁడు. మాళవదేశస్థునియొద్ద సేవకుఁడుగా నుండుటతప్ప మీదేశమునకుఁగాని మీకుఁగాని యితఁడేయపరాధమును జేసియుండఁడు. కాఁబట్టి యితనిప్రాణసంరక్షణార్థమయి నావలన వలసినంతధనమును గొనిఁ మఱియెవ్వరిని రక్షింపకపోయినను నిరపరాధియైనయీతనిని మాత్రము రక్షింపుము" అని వేఁడుకొనెను.

అప్పుడు రాజు తనకోపమూర్తియైన కళావతియొక్క మొగము వంక తేఱిపాఱఁ జూచియు మాఱువేషముతో నున్నయామె నప్పుడానవాలు పట్టలేకపోయినను, లోపలినుండి సహజ మయినప్రేమ

యొకటి పుట్టుకొనిరాఁగా దృఢసేనునితో "ఈతనిని నే నెప్పుడో తప్పక చూచియున్నాను. ఇతని మొగమునాకు మిక్కిలి పరిచితమయి నదిగాఁ గానఁబడుచున్నది. ఎందుచేతనో చెప్పలేకపోయినను నా కీచిన్నవానిమీఁద నపరిమితదయారసము పుట్టుచున్నది" అని కళావతివంకఁ దిరిగి "ఓచిన్నవాఁడా! నీకు ప్రాణదానముచేయుచున్నాను. దీర్ఘాయుష్మంతుఁడ వయి బ్రతుకుము. నీవు నన్ను మఱియొకవరము కోరుము. యుద్ధగృహీతుఁ డయియున్నయీయుత్తమశాత్రవునిబ్రతుకు వేఁడినను తప్పక యిచ్చెదను" అని చెప్పెను. "ఈయనుగ్రహమునకు దేవరవారియెడల మిక్కిలి కృతజ్ఞుఁడనయి యున్నాను" అనికళావతి రాజున కుత్తరముచెప్పెను.

అప్పు డందఱును సౌజన్యనిధి యేమి వేఁడునోవినవలెననియత్యాతురులయి యుండిరి. దృఢసేనుఁ డామెనుజూచి "ఓసౌజన్యనిధీ! నీవు వేఁడఁబోవునదియేదో నేనెఱుఁగుదునుగాని నీవు నాప్రాణము వేఁడ నక్కఱలేదు" అనెను. "ఓదృఢసేనా! నేను నీప్రాణదానము నిప్పుడు వేఁడఁదలఁచుకోలేదు. నే నడుగఁదలఁచుకొన్నది మఱియొకకార్యమున్నది"అని కళావతి చెప్పెను. ఇట్లుచెప్పుట పయికి కృతఘ్నతగాఁ గానఁబడినందున దృఢసేనుఁ డాశ్చర్యపడుచుండెను. ఇంతలో కళావతి కుటిలాస్యునిమీఁద దృష్టిపఱపి, అతఁడు తనవ్రేలిని పెట్టుకొనియున్న యీయుంగరము తనకెట్లువచ్చినదో చెప్పినపుడని రాజునుకోరెను. రాజామె కావరము నిచ్చి, కుటిలాస్యునివంకఁ జూచి, నీవ్రేలినున్న యీరత్నఖచితమయిన యుంగరము నీకెట్లు వచ్చినదో నిజము చెప్పక పోయినయెడల పట్టుకాఱులు పట్టించి బాధించెద' మని బెదరించెను. అందుమీఁద నతఁడు తానువిజయసారునితో పందెమువేసినవిధమును, తరువాత తాను మోసముచేసి యాతని నమ్మించిన క్రమమును,

ఈవఱకుఁ జెప్పినట్లుగా మొదటినుండి కడవఱకును పూసగ్రుచ్చినట్లు చెప్పి, తన దుష్టత్వమునంతను ఒప్పుకొనెను. అప్పుడు తనభార్య నిర్దోషురాలని వినుటవలన విజయసారునికిఁ గలిగిన మోదఖేదముల పరిమాణ మింతంత యని చెప్ప సాధ్యము కాదు. విజయసారుఁడు వెంటనే ముందుకువచ్చి విశారముగానఱచుచు, క్రూరుఁడయికళావతిని జంపుమని తాను మిత్రదాసున కిచ్చినయాజ్ఞను రాజుముందర నొప్పుకొని 'ఓకళావతీ! నాప్రియురాలా! నాప్రాణేశ్వరీ! నాభాగ్య దేవతా!' అని యేడ్వమొదలుపెట్టెను. తనప్రియభర్త తననిమిత్తమయి యిట్లువిలపించు చుండఁగా చూచిసహింపలేక, కళావతిపురుష వేషమును దీసివేసి నిజరూపమును గనఁబఱిచెను. దయావిహీనుఁడయి తాను ద్రోహము తలఁచినప్రియభార్యయొక్క సందర్శనము వలన మనస్సులో నున్నవ్యధయంతయుఁ బోయి విజయసారున కపార మయినయానందము కలిగెను. పోయిన దనుకొనుచున్న తన కూఁతురు వింతగా మరల లభించి కన్నులపండువు చేయుచుండుటవలన రాజవాహనునకుఁ గలిగిన యద్భుతప్రమోదములును మేరమీఱి నవిగా నుండెను. అప్పుడు రాజు సంతోషమును పట్టఁజాలక కొమార్తెను జేరఁదీసి కౌఁగిలించుకొని, విజయసారున కభయదానముచేసి యాతని నల్లునిగా నంగీకరించెను. వంశవర్ధనుఁడుకూడ తానుచేసిన నేరము నొప్పుకొనుట కిదే మంచిసమయ మని యెంచి, ఆసంతోష సమయమునందే బలవర్ధనగుణవర్ధనులను రాజుసన్నిధినిపెట్టి, వా రాతనికొమార్తె లయిన వీరసేన విక్రమసేను లనియు, వారిని చిన్నతనమునందు తానే యపహరించి కొండగుహలోనుంచి పెంచితి ననియు సర్వమును రాజునకునివేదించెను. అట్టివంటి సంతోషసమయమునం దపరాధి నైనను దండించుట కెవ్వరికి బుద్ధిపుట్టును? తప్పిపోయినదను

కొన్నకూఁతురు మరల నేత్రోత్సవముగా కంటఁబడెను; చిన్ననాఁడే మృతులయి రనుకొన్నకొడుకులు బ్రతికివచ్చి మహాయోధులయి తన నిమిత్తము ధైర్యముతో పోరాడి తనప్రాణరక్షకు లయిరి. రాజున కింతకంటె సంతోషము మఱి యేమి కావలెను ?

అప్పుడు కళావతి తనకు యజమానుఁడుగా నుండిన మాళవ సేనానాయకుఁడైనదృఢసేనున కుపకారము చేయుట కవకాశము కలదయి యాతని ప్రాణము రక్షింపవలసిన దని తండ్రిని ప్రార్థింపఁగా, రాజాతని కభయప్రదానముచేసి కొమార్తెకోరికను చెల్లించెను. అంతట దృఢసేనుని మధ్యవర్తిత్వముచేత మాళవరాజునకును రాజవాహనునకును సంధి గలిసి, ఉభయరాజులకును యావజ్జీవమును మైత్రి సంభవించెను.

కుత్సితురా లయినమంజుభాషిణిమాత్రము తన కుతంత్రములు సాగనందునను, తన మేనల్లుఁ డయినచంద్రవర్మ యుద్ధములో చచ్చినందునను, బెంగపెట్టుకొని క్రమక్రమముగా కృశించి పరలోకగతురా లయ్యెను. తక్కినవా రందఱును పరమానందభరితు లయి చిరసౌఖ్యము ననుభవింపు చుండిరి.

స ం పూ ర్ణ ము.

---

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## స్త్రీల కుపయోగించుకథలు

యుదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రహపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతి[illegible]
7 డిటో [illegible]
8 దేహారోగ్యధర్మబో[illegible]

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హాకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్రకవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శాస్త్ర ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930

# గయ్యాళిని సాదుచేయుట



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ కీర్తిశేషులైన రావుబహద్దూరు
# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినిసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్య కావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥ భా॥
2 ,, రెం॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# గయ్యాళిని సాదుచేయుట



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు

For favour of Exhibition



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

కాపీరైటు

ఈ కథయందు వచ్చుపాత్రములు.



కాంచనవర్మ—కాంచీపురనివాసుఁ డగునొకక్షత్రియుఁడు.
రుద్రమూర్తి—కాంచనవర్మ పెద్దయల్లుఁడు; గౌరీదేవిభర్త.
దృఢసేనుఁడు—కాంచనవర్మ రెండవయల్లుఁడు; పద్మావతిభర్త.
చిత్రసేనుఁడు—దృఢసేనుని తండ్రి.
సత్యవర్ధనుఁడు—దృఢసేనుని మిత్రుఁడు.
గౌరీదేవి—కాంచనవర్మ జ్యేష్ఠపుత్రి; రుద్రమూర్తిభార్య.
పద్మావతి—కాంచనవర్మ ద్వితీయపుత్రి; దృఢసేనునిభార్య.

---

# గయ్యాళిని సాదుచేయుట



చోళమండలమునకు రాజధానియైన కాంచీనగరమునందు కాంచనవర్మ యనుపేరుగల మహాధనికుఁడయిన క్షత్రియుఁ డొకఁడు గలఁడు. అతని పెద్దకూఁతురు గౌరీదేవి; ఆమె మిక్కిలి కోపస్వభావము కలదయి తిట్టఁబోతును నయినందున కాంచీపురమునందలివా రందఱును ఆమెకు గయ్యాళిగౌరీదేవి యని పేరు పెట్టిరి. ఆమెను వివాహ మాడుటకయి రాజపుత్రు లనేకులు కాంచీపురమునకు వచ్చియు, పురజనులవలన నామెగయ్యాళితనమును విని యామెను చేపట్ట సాహసింపక తాము వచ్చినదారినే మరల తమతమపురములకుఁ బోవుచు వచ్చిరి. అందుచేత నామెను వివాహమాడు నంతటిపాత్రము గల పురుషుఁడు ప్రపంచములో దొరకునా యని యెల్ల వారును సంశయపడుచుండిరి. అయినను కాంచనవర్మమాత్రము తనపెద్దకొమార్తె పెండ్లి చేయనిదే రెండవకొమార్తె పెండ్లి చేయ నని నియమము చేసికొని, పద్మావతియొక్క గుణసంపదను విని యామెను పాణిగ్రహణము చేసికొనుటకయి యెట్టువంటి గొప్పయింటిరాచకొమాళ్ళు వచ్చినను వారి కెవ్వరికిని కూఁతు నియ్యక నిరాకరించుచుండెను. అందుచేత బంధువు లందఱును పెద్దకొమార్తెనిమిత్తమయి చిన్నకొమార్తెను చెడఁగొట్టుచున్నాఁడని యాతని నిందింప మొదలుపెట్టిరి.

ఇట్లు కొంతకాలము జరిగినపిమ్మట వివాహమునిమిత్తమయి రుద్రమూర్తి యనురాజకుమారుఁడు కాంచీపురమునకు వచ్చి, అక్కడ గౌరీదేవియొక్క గుణమహిమను పౌరులవలన పూర్ణముగా వినియు నెంతమాత్రమును వెనుకతీయక యామెసౌందర్యమును ధనమును

ఆశించి యామెను వివాహమయి శాంతాత్మురాలును పరమసాధ్వియు నయినభార్యను గా దిద్దుకొనుట కయి నిశ్చయించుకొనెను. అటువంటి యసాధ్యమయినపనిని నిర్వహింపఁ బూనుటకు సమర్థుఁడాతనితో సమానుఁడు మఱియొకఁ డుండఁడు; అతఁడు మిక్కిలి ధైర్యస్థైర్యములు గలవాఁడు; అనన్యసామాన్య మయినబుద్ధికౌశలమును వాక్చాతుర్యమును గలవాఁడు; నిజముగా మనస్సులో నణుమాత్రమును కోపము లేనప్పుడు పయికి కొండంతకోప మున్నట్లభినయించుటకును మనస్సంతయు క్రోధమయ మయి యున్నప్పుడు పయికి పరమశాంత భావమును గనఁబఱుచుటకును లోకములో నాతనిని మించినవాఁడు మఱియొకఁ డుండఁడు. అతఁడు సహజముగా తన్నుఁగూర్చి యితరు లెంద ఱేమనుకొన్నను తన కేమికష్టములువచ్చినను లక్ష్యపెట్టని స్వభావము గలవాఁడు. అతఁడు గౌరీదేవిని వివాహ మాడినతరువాత తానామెను వశపఱుచుకొని సాదుచేయుట కయి వేఱుమార్గము లే దని కనిపెట్టి యాకారవికారములచేతను చేష్టలచేతను మాటలచేతను దుర్వాసుని మించినకోపశీలునివలె నటింపసాగెను.

రుద్రమూర్తి మొట్టమొదట కాంచనవర్మ యొద్దకుపోయి తన కులగోత్రనామములు తెలుపుకొని, ఆతనితో "నీకొమార్తె యైనగౌరీదేవియొక్క శాంతస్వభావమును వినయవిధేయతలను విని యామెను వరించుతలంపుతో మధురాపురమునుండి వచ్చితి" నని చెప్పెను. కాంచనవర్మ యాతనితండ్రి నెఱిఁగినవాఁడుగాన సత్కులప్రసూతుఁడయినయుత్తమక్షత్రియుఁడు తన కల్లుఁడు గాఁగోరినందునకును తన కొమార్తెకు మంచిసంబంధము వచ్చినందునకును మిక్కిలి సంతోషించినవాఁ డయినను, ఆమెస్వభావమును తెలుపక దాఁచుట యుచితము కా దని భావించి రుద్రమూర్తివంకకుఁ దిరిగి "నాకొమార్తె

గుణములునీవు విన్న వానికంటె విరుద్ధములయిన''వని చెప్ప నారంభించెను. ఇట్లు చెప్పుచుండఁగానే లోపలినుండి సంగీతాచార్యుఁడు పరుగెత్తుకొనివచ్చి "అయ్యా! సంగీతము చెప్పునప్పుడు తోడిరాగములో స్వరము తప్పినదని చూపినతప్పిదమునకయి నీకోమార్తె వీణాదండముతో నానెత్తిమీఁద కొట్టినది'' అని మొఱపెట్టుకొనెను. ఆమాటలు విన్నమీఁదట రుద్రమూర్తిముఖమునందు మఱింతవికాసమును గనఁబఱిచి. 'ఈమాటలు విన్నతరువాత నా కామెమీఁదప్రేమ మఱింత యధిక మగుచున్నది. ఆమెశరీరములో పిడికెడంత లేనిమహాక్షాత్రము గలరాచకూఁతు రయినందునకు నా కపరిమితానందము కలుగుచున్నది. ఆమె నామనసువచ్చినజాణ' అని యామెను మెచ్చి పొగడుచు, ఆమెతో నొక్కసారి సమావేశముకలుగఁ జేయవలసిన దని యాతనిని వేఁడుకొనెను. అతఁ డందునకు సమ్మతించి, రుద్రమూర్తి యొక్క తండ్రి మృతుఁ డగుటయు తదనంతర మాతనిచరస్థిరరూపమయినసొత్తంతయు రుద్రమూర్తివశ మగుటయు నడిగి తెలిసికొని ఒకపరిచారికను పిలిచి నీ వీరాజకుమారునికి గౌరీదేవిని చూపు మని చెప్పెను. అప్పుడారుద్రమూర్తి కాంచనవర్మను జూచి, "అయ్యా! నేను నీకోమార్తెయొక్కసమ్మతిని పొంది యామెను వివాహమాడెడు పక్షమున నా కరణ మేమి యిచ్చెదవో యిప్పుడే చెప్పుము'' అని యడిగెను. నీ వాచిన్నదానిమనసు వశపఱుచుకొని యామెనువివాహమాడఁగలిగెడుపక్షమున, వివాహసమయమునం దిరువదివేలరూపాయల నిచ్చి నాయనంతరమున నాసొత్తులలో సగము వ్రాసియిచ్చెదనని కాంచనవర్మ చెప్పెను. అందున కాతఁ డొడఁబడి మామయొద్ద సెలవుపొంది పరిచారికవెంట నడుచుచు తోవపొడుగుననుతనలోతానిట్లాలోచించుకొనసాగెను. . . "ఆమెతో నే నెట్లు మాటాడుదును?

ఆమెతో సంభాషణము చేయునప్పుడు నాశాంతస్వభావమునంతను గనఁబఱిచెదను. ఆమె నన్నుదిట్ట మొదలుపెట్టినను, ఆమెవాక్యములు కోకిలస్వరమువలె మృదుమధురగంభీరములుగా నున్న వని పొగడెదను. ఆమె నావంక కన్నులెఱ్ఱచేసి చూచినను, ఆమెచూపులు దయారసమును వెదచల్లుచున్న వని శ్లాఘించెదను. ఆమెనాతో మాటాడక మౌనమును ధరించినను అట్టివంటిసరససల్లాప మెప్పుడును వినలే దని మెచ్చుకొనెదను. ఆమె నన్ను లేచిపొమ్మని చెప్పినను, తనయొద్దనే యెల్లకాలము నుండుమని చెప్పినంత కృతజ్ఞతను గనఁబఱిచెదను''

ఈప్రకారముగా నాలోచించుకొనుచుపోయి పరిచారికచూపిన గది చేరి యొకపీఠముమీఁదఁ గొంతసేపు కూరుచుండియున్నమీఁదట తండ్రి బలవంతపెట్టి ప్రార్థించి పంపఁగా గౌరీదేవి యాతనితోమాటాడుటకయి మెల్లఁగా గదిలోనికి వచ్చెను. అప్పుడాకన్యావరుల కీప్రకారముగా సంభాషణ మారంభ మయ్యెను.

రుద్ర—గౌరీ! నీకు క్షేమమా?

గౌరీ—(కోపము) నన్నందఱును గౌరీదేవియని పిలుతురు.

రుద్ర—కాదు. గౌరి యనియే పిలుతురు గయ్యాళిగౌరి యని కూడ పిలుతురు. దాని కేమిగాని నీవు సౌందర్యవతివనియు శాంతమూర్తివనియు విని నిన్నుభార్యనుగా వరింపవలె నని వచ్చినాను.

గౌరి—(కన్నులెఱ్ఱచేసి బిగ్గరగా నన్ను గయ్యాళిగౌరి యని పిలుచు చున్నారా? ఎవ్వరు పిలుచుచున్నారో వారి నిటు రమ్మను.

రుద్ర—ఓ ప్రియురాలా! నీకంఠస్వర మెంత మధురముగా నున్నది! ఓహో! నీశాంతస్వభావము నెంతని కొనియాడఁగలను! మనహాస్యవచనము లింతటితో చాలును. నిన్నిచ్చి నాకు వివాహము చేయుటకు నీతండ్రి యొప్పుకొని యరణమునకుకూడ నిర్ధారణము చేసి

నాఁడు. ఇఁక నీవంగీకరించినను లేకపోయిననుగూడ నిన్ను నేనుతప్పక వివాహ మాడెదను.

ఈమాటలు జరగుచుండఁగానే తనకొమార్తె కంఠము బిగ్గరగా వినఁబడ్డందున వారులోపల నేమికలహమాడుచున్నారో యని కాంచన వర్మ చూడవచ్చెను. అంతట రుద్రమూర్తి యాతనిని జూచి, "నీ కూఁతురు నన్నెంతో ప్రేమతో నాదరించి పయిదశమినాఁడు పెండ్లి చేసికొనుట కంగీకరించినది" అని చెప్పెను. 'ఇతనిని పెండ్లిచేసికొను టకుఁగాదు దశమినాఁ డితనిపెండ్లిచేయుట కంగీకరించితి' నని గౌరీదేవి తండ్రితో ననెను.

రుద్ర—దశమినాఁడు నన్నీమె తప్పక కరగ్రహణము చేసి చేపట్టును.

గౌరీ—కంఠగ్రహణము చేసి యురిపెట్టును.

రుద్ర—అయ్యా! మీరీచిన్నదానిమాటలుపాటిగాఁబట్టకుఁడు. మే మిద్దఱమును రహస్యములో పాణిగ్రహణమున కొప్పుకొన్నాము. పయికిమాత్రము మీయెద్ద తా నీలాగున ననుచుండెద నని యామె నాతోఁ జెప్పినది. మేము మాటాడిన యానిమిషకాలములోను నా మీఁదనీమెకుఁగుదిరిన యనురాగ మింతింత యని చెప్పశక్యముగాదు. ఓ గౌరీ! నాప్రాణేశ్వరీ! నాకొక్కముద్దిమ్ము. నేనుమధురాపురమునకుఁ బోయి నీవు కోరినయాభరణములును వస్త్రములును దీసికొని దశమి నాఁటికి వచ్చెదను—ఓమామా! వివాహసన్నాహముచేయించిబందు వులకందఱకును శుభలేఖలను బంపుము—ఓప్రియురాలా! క్రొత్తపెండ్లి కూఁతురువలెఁ గనఁబడుటకయి నాహృదయేశ్వరికిమనసువచ్చినమంచి బట్టలను నగలను దెచ్చెదను. సెలవిమ్ము పోయివచ్చెదను. దశమినాఁడే సుముహూర్తము నిశ్చయమయినది గదా?

అని యాతఁడు నడిచెను. కాంచనవర్మయు తనకొమార్తెకు వివాహ మెట్లయినఁ గావలెనని యొడఁబడి యాతనిసుముహూర్తము నకు ముందేరమ్మనిచెప్పి పంపివేసి, కొమార్తెమనసు మెత్తపడునట్లుగా నాకొత్తయల్లుని శ్లాఘింపఁజొచ్చెను. గౌరీదేవియుపయికెట్లనుచున్నను లోపలమాత్రము వరించవచ్చిన యాతనిని వివాహమాడవలె ననియే యభిలషించుచుండెను. అప్పుడే శుభలేఖ లందఱికిని బంపఁబడినవి. వివాహదినమున కొక్కరొక్కరే బంధువులందఱును రాఁదొడఁగిరి కాని పెండ్లికొమారుఁడుమాత్రమురాలేదు. పెండ్లిపను లన్నియుఁజేయఁ బడినవి; వీధికి తోరణములు కట్టఁబడినవి; పురోహితుఁడువచ్చిసిద్ధముగా నుండెను; వాద్యములు వాయించువారు సహితము వచ్చి వాకిట నిలిచియుండిరి; యెల్లవారును పెండ్లికొడుకునిమిత్త మెదురుచూచు చుండిరి. తన్ను పరిహసించుటకయి యాతఁ డిట్లు మాయచేసె నేమో యని పెండ్లికొమార్తెయు మనస్సులో వ్యథపడసాగెను. ఇట్లుండఁగా కట్టకడపట పెండ్లికుమారుఁ డక్కడకు వచ్చెను గాని యాతఁడు తెచ్చెద నన్నబట్టలనుగాని నగలనుగాని తీసికొనిరాలేదు; అతఁడు పెండ్లికొమారుని కర్హమగునట్లుగా నలంకరించుకొనినదైనను రాక మాసినపాతబట్టలతో వచ్చెను; అతఁడెక్కివచ్చిన గుఱ్ఱమును వెంట గొనివచ్చినసేవకుఁడును గూడ యజమానుని వేషమునకుఁ దగినట్టుగానే యుండిరి.

అంతట లగ్నసమయము సమీపింపఁగా మామగా రల్లుని బిలిచి క్రొత్తబట్టలు తెప్పించి కట్టుకొమ్మని చెప్పెను. ఆతఁడు పెండ్లి కొమార్తెను తనకు వివాహము చేసెదరుగాని తనబట్టలకు కాదని చెప్పుచు, ఎంతచెప్పినను వినక యాబట్టలను ధరించుట కంగీకరింపక పోయెను. ఇఁకఁ జెప్పిన కార్యము లే దనుకొని యప్పు డతనిని వివా

హావేదికవద్దకుఁ దెచ్చి పెండ్లిపీఁటమీఁదఁ గూరుచుండఁబెట్టిరి. అప్పుడు పురోహితుఁడక్షింతలపళ్లెమును చేతిలోఁ బట్టుకొని సంకల్పము చేయించుచు పెండ్లికొమారుని గోత్రనామము లడిగెను. తనదాత్రేయ గోత్ర మని యతఁ డిల్లెగిరిపోవునట్లుగా పురోహితుని మొగముమీఁద మొగము పెట్టి పెద్దకేక వేసెను. ఆధ్వని కక్కడనున్నవా రందఱును నులికి పడిరి. పురోహితుఁడును జడిసికొని చేతిలోని పళ్లెమును క్రింద వదలిపెట్టెను. అందుమీఁద నారుద్రమూర్తి పటపట పండ్లు కొఱుకుచు, నే నెంతో వేడుకపడి వివాహము చేసికొనుచుండఁగా నడుమ నమంగళముగా పళ్ళెమును క్రింద పడవేసెదవా యని వంగి క్రింద పడ్డపళ్ళెమును దీసికొనుచున్నయాపురోహితుని నెత్తిమీఁద నొక్క చఱపు చఱచెను. ఆదెబ్బతో పురోహితుఁడును పురోహితుని చేతిలోని పళ్ళెమునుగూడ మరల క్రిందఁ బడెను. ఈప్రకారముగా వివాహము పొడుగునను జరిగిన యాతనిపిచ్చికోపమును విచిత్రచేష్టలును చూడఁగా మనస్సులో గౌరీదేవియంతటిదానికి సహితము భయము పుట్టి యామెదేహము కంపమెత్తసాగెను. పెండ్లి నాలుగుదినములలోను పెండ్లికొమారుఁ డిటువంటివికారచేష్ట లెన్నెన్నో చేసెను. ఇది యంతయు గయ్యాళి యైనతనభార్యను సాదుచేసి వశపఱుచుకొనుట నిమిత్తమయి యతఁ డేర్పఱుచుకొన్నయుపాయమున కనుగుణముగా వేసిన వేషమే కాని రుద్రమూర్తియందు సహజముగా నిట్టివికారగుణము లేవియు లేవు.

వివాహ మయినమఱునాఁడే యతఁడు భార్య చేయిపట్టుకొని యిప్పుడే భార్యను తనయింటికిఁ దీసికొనిపోయెద నని ప్రయాణము చేసెను. అప్పుడు మామగారు చేసినప్రార్థనలుగాని భార్య యన్న కోపవాక్యములుగాని దృఢనిశ్చయుఁ డయి యున్నయాతనియొద్ద

నేమియు పనిచేయలేకపోయెను. ఆతఁ డెందఱెన్నివిధముల నయమున
భయమునఁ జెప్పినను వినక తనపట్టును వదలక, వివాహముకాఁగానే
భార్య తనసొత్తయినందున తనసొత్తును తనమనసువచ్చినట్లు చేసి
కొనెద నని, చేయి పట్టుకొని గౌరీదేవిని బలవంతముగా వీధిలోని
కీడ్చుకొనిపోయెను. అట్టిమూర్ఖునితో తగవులాడి వారింపఁబూనుట
వలనఁ బ్రయోజనము లేదనుకొని తా మాజోలికి పోక యెల్లవారును
మాటాడక చూచుచు నూరకుండిరి. ఇట్లామెను వీధిలోనికిఁ గొని
పోయి యామెనిమిత్తమయి బుద్ధిపూర్వకముగా నేర్చి తెచ్చినబక్క
గుఱ్ఱముమీఁద నామె నెక్కించి, తానును తనసేవకుఁడును వేఱువేఱు
గుఱ్ఱములమీఁద నెక్కి నడిపించుచు నడువలేక భార్యయెక్కిన గుఱ్ఱము
నిలువఁబడినప్పుడెల్లను దానిమీఁద తీవ్రకోపమును జూపి యింటికిఁ
బోయినతరువాత దానిమాంసమును గోసి కాకులకును గ్రద్దలకును
నెగరవేసెద నని కేకలువేయుచు, ప్రపంచములోని కోపులలోనెల్లను
పరమకోపి యని యామెకుఁ దోఁచునట్లుగా నతఁడు ప్రవర్తింప
సాగెను. కడపట నెంతోకష్టముమీఁద వారిల్లు చేరిరి. త్రోవపొడుగు
నను గుఱ్ఱము మీఁదను సేవకునిమీఁద నతఁడు వేయుచువచ్చిన
కేకలు తప్ప నామెకు మఱియేమియు వినఁబడలేదు. అతఁడు మంచి
మాటలు చెప్పుచు లోపలి కామెను గొనిపోయెను గాని యతఁ
డారాత్రి యామెకు విశ్రాంతిగాని భోజనముగాని దొరకునట్లు చేయ
దలఁచుకోలేదు. అందుచే భోజనసమయ మయినప్పుడు బోనకత్తె
వంటచేసి తెచ్చి పదార్థములను కంచములో వడ్డించఁగానే యతఁడు
భార్యయం దతిదయగలవానివలె నటించుచు దగ్గఱకు పోయి యన్న
మును కూరలును ముట్టిచూచి, అంత సుకుమారముగా పెరిగిన
యీకోమలి యిటువంటి పనికిమాలినయన్నమును కూరలు నెట్లు

తినఁగలుగు నని వంటచేసెడువారిమీఁద కోపపడుచు, ఆ యన్నమును కూరలును నట్టింట వెదఁజల్లి వాని నెత్తిపాలు వేయవలసినదని పరిచారి కల కాజ్ఞాపించెను. వా రాప్రకారముగాఁ జేసిరి. తిన్నఁగా పక్వము కానిపదార్థము లామె తినుట కిష్టములేక యామెయందుఁగల ప్రేమ చేతను దయచేతను తా నిది యంతయుఁ జేయుచున్నట్లతఁడు నటించు చుండెను. ఇట్లారాత్రి భోజనములేకయు నలసియు నామె కొంత విశ్రాంతినిగోరి పరుండ నపేక్షింపఁగా, నతఁడు పడకగది లోనికిఁ బోయి దుప్పట్లను పఱుపును తడవిచూచి పయినిజెప్పినవిధముగానే యటువంటి పుట్టుభోగికొమార్తె కిటువంటిపా న్పెట్లు పనికివచ్చునని భృత్యులమీఁద కోపపడుచు దుప్పట్లను దిండ్లను పఱుపునుదీసిగదిలో తలయొకవైపున విసరివైచెను. అందుచేత నామె పరుండుటకు మంచ మయినను లేక గోడకుఁజేరగిలఁబడి కూరుచుండియే కన్నుమోడ్వ మొదలుపెట్టెను. ఆమెకు కొంచెము కునుకువచ్చినసమయము చూచి యతఁడు క్రొత్తపెండ్లికూఁతున కటువంటిముతకపా న్పేల వేసితి రని సేవకులమీఁద నాగ్రహపడి కేకలు వేయుచు నామెకు నిద్రాభంగము కలుగఁజేయుచు వచ్చెను. ఆరాత్రియంతయునీప్రకారముగాఁగడచెను. పరిచారకులు మొదలయినవా రందఱు నావఱకే బోధింపఁబడినవా రగుటచే నతఁడుపెట్టినపాట్లెల్లను పడుచు లోఁబడి మాటాడక యూర కుండిరి.

మఱునాఁడుకూడ కూర యుడుకలే దనియు, అన్నముచిమిడిన దనియు, పులుసు కాఁగ లేదనియు, పప్పు మాడిన దనియు వంకలుపెట్టి యతఁడు వెనుకటిదినమునవలెనే పాఱవేయుచు భార్య కనుగ్రహము చూపి మంచిమాటలాడ మొదలుపెట్టెను. వేఁడుకొనుటయన్నమాట స్వప్నావస్థయందు సహిత మెఱుఁగని గర్వభూయిష్ఠురా లయిన గౌరీ

దేవియంతటిమానవంతురాలుసహింపరాని యాఁకలికి తాళలేక మలమల మాఁడుచు, భర్త యావలికిఁ బోయినప్పుడు తిన కేదియైనఁ గొంచెమాహారము రహస్యముగాఁ దెచ్చిపెట్టవలసినదని పరిచారికలను వేఁడుకొనెను. అవఱ కతనియుపదేశము తగిలినవారే యయినందున వారందఱును భయపడినట్లు నటించుచు, యజమానునకు తెలియకుండ తా మేదైనఁ బెట్టినపక్షమున తమ్మతఁడు చంపివేయు నని చెప్పి, ఏమియుఁ బెట్టక దూరముగాఁ దొలఁగిపోయిరి. అప్పు డామె యొంటిగానుండి తనలో "అయ్యో! నన్నితఁడు పస్తుపెట్టి చంపవలెననియో వివాహమాడెనుకాఁబోలును! నాతండ్రి యింటికివచ్చినబిచ్చగాండ్రు సహితము కావలసినంతయన్నము తిని పోయెడువారు. ఏవస్తువువిషయమునను పరుల నెప్పుడును వేఁడుకొని యెఱుఁగనట్టి నాయట్టిదానను తిండిలేక మాఁడిపోవుచున్నాను; నిద్రలేక తలతిరిగి చచ్చిపోవుచున్నాను; ఈతని యఱపులే నా కాహారముగా నున్నవి; కేకలు వేసికన్నులుమూయనీయకుండుటయే నాకు నిద్రగానున్నది. సేవకులు తెచ్చినయన్నమును తిన్నను, పరిచారికలు వేసినపాన్పుమీఁద పరున్నను, నే నప్పుడేచచ్చిపోదునన్నట్లు నటించుచు, నా ప్రాణములు నిలుపుటనిమిత్తమే తాను నా కీమహోపకారమును జేయుచున్నట్లభినయించుచుండుట చూడగా నాకుమరింతవిచారముకలుగుచున్నది" అని తలపోయ మొదలుపెట్టెను. ఇట్లింకను తలపోయుచుండఁగా నింతలో రుద్రమూర్తి కొంచెము చిమిడిన యన్నమును రెండుమూఁడు ఉప్పువేయనికూరలును పళ్ళెములో వేసి పట్టుకొనివచ్చి, 'ఓప్రియురాలా! నీ వెట్లున్నావు? ప్రాణాధికురాలవయిననీనిమిత్తము నేనెట్లుకష్టపడుచున్నానో చూచినావా? ఈయన్నమును కూరలును నేను స్వహస్తములతో పాకముచేసినాను. నేనుపడ్డ శ్రమకు నీవునాయెడల కృతజ్ఞురాలవయి యుండవలెను" అని మెల్లఁగా

ముందు పెట్టెను. ఆమె దానిని పుచ్చుకొని తినవలె నని యుద్దేశించి మాటాడక మెల్లఁగా ముందుకు జరుగుచుండెను. అదిచూచి యతఁడు నోటినుండి మాటరా దేమి? నీవాహారమునుగాడఁగా నీకిప్పుడన్న మక్కఱ లేన ట్లున్నది. ఇంతసేపును నీనిమిత్తమయి నేనుపడినప్రయాస మంతయు వ్యర్థమయిపోయినది" అని పలుకుచు సేవకులనుబిలిచి యాపళ్ళెమును లోపలికిఁదీసికొనిపొండని చెప్పెను. ఆమెలోపలనున్న దుస్సహమయిన క్షుద్బాధ యామెగర్వమునంతను బోఁగొట్టి యామె చేత 'నా కన్నము కావలె' ననిపించెను. కానియతఁడామాటతోఁ దృప్తి నొందక యామెను మఱింత దీనత్వముతో వేఁడుకొనునట్లు చేయ నుద్దేశించి, లోకములో నీచసేవకుఁడు కొంచె ముపచారము చేసినప్పుడుకూడ యజమానులయినను కృతజ్ఞతను జూపుదురు. ఇంతకష్టపడి పనిచేసినను భర్తనైన నే నింతమాత్రపుమాటకయినను నోచుకోక పోతిని' అని సేవకులవంకఁ జూచెను. ఆ యన్నముకూడ లేకుండ సేవకు లెక్కడ పళ్ళెమునుదీసికొనిపోదురోయని భయపడి బగబగమండు చున్న కడుపుచిచ్చునకు సహింపలేక గర్వమునంతనువిడనాడి యిష్టము లేకయే "నేను మీయెడల కావలసినంతకృతజ్ఞత కలిగియున్నాను. మీకనేక వందనములు చేసెదను. నాకాయన్నము పెట్టింపుఁడు" అనెను. అందుమీఁద నతఁడా సేవకులను పళ్లెమును తీసికొనిపోకుండ నాజ్ఞాపించి యామె భోజనముచేయుచుండఁగా 'ఓ మనోనాయికా! నీవినయవచనములకు నాకెంతో సంతోషమగుచున్నది, నీవు కడుపు నిండ భోజనము చేయుము. మనుగుడుపునిమిత్తమయి రేపు మనమిద్దఱ మును నీపుట్టినింటికిఁబోయి హాయిగా సర్వసుఖములను అనుభవింతము. ఈలోపల నీకు నేను దెచ్చి పెట్టెదనన్న బట్టలను నగలను తెప్పించియిచ్చె దను' అనితనమాటలయందామెకు నమ్మకముపుట్టుటకై మంచిపట్టుగుడ్డను

తెప్పించి కుట్టుపనివానినిబిలిపించి అవికలు కట్టితెమ్మనియామె యెదుటనే గుడ్డ వానిచేతి కిచ్చెను. వాఁడు కొంతసేపటికొక అవికను కుట్టి తీసికొని వచ్చెను. అది చేతఁబుచ్చుకొని వానిమీఁద కోపపడి కేకలు వేయుచు "ఇది పల్లెలయం దుండుమోటుస్త్రీలకు తగియున్నదిగాని నాభార్యవంటి నాగరికము గలవారికి తగినదిగా నుండలేదు. ఇది నీ మొగమును వేసి కొట్టుకొమ్ము" అని యారవికను వానిమీఁద విసరివైచెను. ఆరవిక మిక్కిలి యందముగా నున్నందున దాని నేలాగుననైన ధరింపవలె నన్నయాశతో నామె "పట్టణమునందలి మంచి స్త్రీలందఱును తా మిటువంటిరవికలనే తొడుగుకొందురు. నా కీరవిక కావలెను" అని యడిగెను. "అట్లయినపక్షమున వారివలెనే నీవును మంచిదాన వగుము. మంచివారు తొడుగుకొనెడునట్టి యారవికను నీకిప్పుడు తప్పక యిప్పించెదను" అని యతఁడు ప్రత్యుత్తరము చెప్పెను. ఈప్రసంగ మారంభ మగునప్పటికి తిన్నయన్నము దేహమునఁబట్టి కొంతబలము కలిగినందున, ఆమెకుఁ గలధైర్యమును గర్వమును మరల పురికొనఁగా నామె యతనివంకఁ జూచి "మీరు నన్నట్లనెద రేమి? నాకు తోఁచినయుత్తరమును నేను చెప్పవచ్చు ననుకొనెదను. నామనస్సులో నున్నదేమో చెప్పెదను. నేను శిశువును గాను, మీకంటె గొప్పవారిముందఱకూడ నాకుఁ దోఁచిన దేమో నిర్భయముగా చెప్పెడిదానను. వారు నాకడ్డమురాక నన్ను చెప్పనిచ్చెడువారు. మీకు నామాటలు వినుట కిష్టము లేక పోయినయెడల మీ చెవులు మూసికొనుఁడు" అని యధికప్రసంగము చేయుట కారంభించెను. రుద్రమూర్తియటువంటికోపపుమాటలు వినుటకిష్టములేనివాఁడయి, ఆమెతో వాదులాడుటకన్న నెటువంటిసంభాషణచేసియామెను వంచవలెనో చక్కఁగా కనిపెట్టినవాఁడు గనుక "నీవు చెప్పినది

సత్యము. ఆరవిక వట్టిపనికిమాలినది. అది నీ కక్కఱలేదు. నీవది యక్కఱలేదన్నందుననే నాకెంతో సంతోష మగుచున్నది.'' అనెను. ''మీకు సంతోషమయినను కాకపోయినను సరే. నాకారవికమాత్రము కావలెను. నాకిదితప్ప మఱియొకటి యక్కఱలేదు'' అని యామె చెప్పెను. అతఁ డామెమాటలను గ్రహింపనట్లు నటించుచు ''నీకు పట్టుచీర కావలె ననుచున్నావా? నీకదియుఁ గొనిపెట్టెదను.'' అని చెప్పుచుండఁగా నింతలో వర్తకుఁడు వెనుక నియమించినప్రకారముగా నొకమంచిపట్టుచీరను దెచ్చి చేతి కిచ్చెను. అతఁ డాపట్టుచీరను చేతఁ బట్టుకొని చూచి, నిజముగా నతఁ డప్పుడు భార్యకు పట్టుచీరనుగాని పట్టురవికనుగాని కొని యియ్యఁ దలచుకొనందున దానియందు దోషారోపణములు చేయుచు, అంచు వెడల్పుగా నున్నదనియు, ఎట్టి రం గందముగా నుండలే దనియు, వెడల్పు తక్కువనియు, పొడ వెక్కువనియు, కేకలువేసి యంతవంటిపాడుచీర తెచ్చినందున కయి యావర్తకునిమీఁద కోపపడి నిజముగా రుద్రమూర్తి యయి బట్ట నలిపి వానిమీఁద పాఱవేసి వానిని కొట్టఁబోయెను. ''దేశమునం దిప్పుడు గొప్పయింటిస్త్రీ లందఱు నిటువంటిచీరలనే ధరించుకొను చున్నారు'' అని పలుకుచు బట్టనెత్తుకొని వర్తకుఁడువీధిలోనికి పాఱి పోయెను. అతఁ డాకుఱ్ఱపడవవానితోను వర్తకునితోను తానావలనే మాటాడి వారి కియ్యవలసినసొమ్మునావలనే యిచ్చివేసినందున నతఁ డెంత కోపపడినను వారిలో నెవ్వరును మాఱుమాట పలుకక పరమ విధేయతను గనఁబఱుచుచు నావలికిఁబోయిరి. ఈవల కెప్పుడును తా నంతకంటె మంచిచీరనుజూచి యుండలే దని గౌరీదేవి యాచీరను మెచ్చుకొనెను. అతఁ డప్పటికంతేచాలుననుకొని వారి నావలికి తఱిమి వేసినతరువాత కోపము చల్లార్చుకొని భార్యవంకఁదిరిగి ''ఓ ప్రాణేశ్వరీ!

మన మిప్పుడు కట్టుకొన్న యీసామాన్యమయిన బట్టలతోనే నీ పుట్టి నింటికిఁ బోదము రమ్ము" అని గుఱ్ఱములను సిద్ధముచేసి తెచ్చుటకు నియమించి "యిప్పుడే సూర్యోదయమయినందున భోజనసమయము నకే మనము మీతండ్రిగారియింటికి పోదము" అని చెప్పెను. నిజ ముగా నది ప్రాతఃకాలము కాదు; అప్పటికిమిట్టమధ్యాహ్నమయినది. ఆతనియాకారవికారములకును చేష్టలకును నిజముగాభయపడినదయి స్వభావగర్వమును విడిచి వినయముతో 'ఓప్రాణనాథా! ఇప్పుడు మధ్యాహ్నము రెండుజాము లయినది. మన మక్కడకువెళ్ళునప్పటికి రాత్రి నిద్రవేళ యగును" అని మెల్లఁగా సాహసముచేసి చెప్పెను. కాని యతఁడామెను పుట్టినింటికి దీసికొనిపోవులోపల నామెను పూర్ణ ముగా లోఁబఱుచుకొని తాను జెప్పినదానినెల్ల నామెయెదురుచెప్పక యొప్పుకొనుచుండునట్లు చేయవలెనని యుద్దేశించుకొని యుండెను. కాఁబట్టి యతఁడు తాను సూర్యునికిఁగూడ ప్రభువయి యాతనిని తన యిచ్చవచ్చినట్లు నడపఁగలిగినట్లుగా "నేను బయలుదేఱునప్పుడే వేళ కావలెనన్న నావేళయే యగును. నే నేమి చెప్పినను నీవు నామాట కెదురుచెప్పుచున్నావు. ఈదినమున నిన్ను నేనుపుట్టినింటికిఁ దీసికొని పోను. నేనుదీసికొనిపోవునప్పుడు నేనేకాలమని చెప్పెదనో యాకాలమే కావలెను" అని యప్పటికి ప్రయాణము నిలిపివేసెను. ఆమఱునాఁడు గౌరీదేవి యాతఁడు నేర్పమొదలుపెట్టిన విధేయతను నేర్చుకోవలసిన దయ్యెను. ఆమెతనవెనుకటి గర్వమునంతనువిడిచిపెట్టియెదురుచెప్పుట యన్నమాట మఱచిపోవువఱకును తా నామెను పుట్టినింటికిఁ దీసికొని పోనని యాతఁడు శపథముపట్టి కూర్చుండెను. అందుచేత నామెయతఁ డన్నదాని నెల్లనౌనని యొప్పుకొన నారంభించినందున మఱునాఁ డతఁడు ప్రయాణము చేసికొంతదూరము ప్రయాణముసాగినతరువాత

తీక్ష్ణముగా ప్రకాశించుచున్న సూర్యుని జూపి "ఈమిట్టమధ్యాహ్న వేళను చంద్రుఁ డెంతచక్కఁగా వెలుఁగుచున్నాఁడో చూచితివా?" అని భార్య నడిగెను. ఆవెలిఁగెడిది సూర్యబింబముకాని చంద్రబింబము కా దని యామె ప్రత్యుత్తరము చెప్పెను. అందుమీఁద నతఁడు కోప పడి "నీవుపుట్టినింటికివెళ్ళులోపల నే నది చంద్రబింబమన్నను నక్షత్ర మన్నను నే నన్నప్రకార మయి తీఱవలెను. నీవికను నామాటకెదు రాడుచున్నావుగాన నిన్ను నేను నీపుట్టినింటికిఁ దీసికొనిపోను" అని చెప్పి గుఱ్ఱమును వెనుకకు మరలింపఁబోయెను. గౌరీదేవి వెనుకటివలె గయ్యాళిగాదిగాక సాధ్వియైనందున భర్తవంకఁ జూచుచు 'ఓ ప్రాణ వల్లభా! మన మిప్పటికి చాలదూరము వచ్చితిమిగాన గుఱ్ఱమునువెనుక త్రిప్పక ముందుకె నడిపింపుఁడు. అది సూర్యబింబమో చంద్రబింబమో నక్షత్రమో మీ రేదిచెప్పిన నదే కానిండు. మీరు దానినిప్పు డాముదపుదీపమని చెప్పినను నే నౌనని యొప్పుకొనెదను" అని దీనత్వముతోఁ జెప్పెను. అతఁ డామె వాక్యముల సత్యమునుపరీక్షింపఁదలఁచి 'అది చంద్రబింబము' అని మరల చెప్పెను. "అది నిస్సందేహముగా చంద్రబింబమే" అని గౌరీదేవియుఁ బలికెను. "నీ వబద్ధ మాడుచున్నావు. ఆవెలిఁగెడిది ప్రకాశమానమైన సూర్యబింబము" అని యతఁడు తన మాటను మార్చెను. "అట్లయిన పక్షమున నదితప్పక సూర్యబింబమే. మీ రది సూర్యబింబము కాదని చెప్పెడు పక్షమున సూర్యబింబము కాదు. మీరు దాని నేమనిపిలుతురో నాపాలిటికది యాపేరుకలదే యగును. ఇఁకముందెప్పుడును మీగౌరీదేవి కేదియు మీకు తోఁచిన దానికంటె వేఱువిధముగా తోఁచదు" అని యామె బదులుచెప్పెను. ఆపయి నతఁడు కొంతదూరము ప్రయాణము సాగనిచ్చి యామెయొక్క విధేయత స్థిరముగా నుండునో లేదో మఱియొకసారి పరీక్షించిచూడఁ

దలఁచి, ఆదారిని బోవుచున్న యొకవృద్ధుని జూచి కన్యయైనట్టుగా "ఓసుందరీ! నీ వెందుఁ బోవుచున్నావు?" అని పలికి భార్యవంకఁ దిరిగి "నాప్రాణేశ్వరీ! సౌందర్యరాశియైన యిటువంటి యువతిని నీ వెప్పుడయినఁ జూచియున్నావా? ఆమెముఖము చంద్రబింబమువలెనున్నది. ఆమె చెక్కులద్దములను మించియున్నవి. ఆమె కన్నులు కెందామర రేకులను తిరస్కరించు చున్నవి. అటువంటి లావణ్యవతి యైన యామెవద్దకుఁబోయి కుశలప్రశ్నమడిగి యామెనొక్కసారియాదరించి రమ్ము" అని చెప్పెను. తనగర్వమంతయుఁ బోఁగొట్టుకొని పరమవిధేయురాలయి యున్న యామె భర్త యాజ్ఞాపించిన ట్లామునలివానియొద్దకుఁ బోయి "ఓ చెల్లెలా! ఓసౌభాగ్యవతీ! నీకు క్షేమమా? నీ వెక్కడకుఁ బోవుచున్నావు? నీగృహ మెక్కడ నీయంతటి సౌందర్యవతిని గన్నతల్లిదండ్రులభాగ్యమే భాగ్యము"అని యావృద్ధుని నాదరించెను. అంతట రుద్రమూర్తి మరల భార్యవంకఁ జూచి "ఓ ప్రియురాలా! నీకు మతిపోయినదా యేమి? ఇతఁడు పురుషుఁడుకాని నీ వనుకొనునట్లు స్త్రీ కాదు. ముసలితనముచేత నీతని చర్మమెల్ల ఎండిపోయినవి; ముఖము ముడుతలు పడినది. నీవు కని పెట్టలేదా?" అని పలికెను. అందుమీఁద నామె వెంటనే తెలివి తెచ్చుకొన్న ట్లభినయించుచు నావృద్ధునిజూచి "అయ్యా! నన్నుక్షమింపుము. ఈయెండలో నడుచుటచేత నాకన్నులు మిఱుమిట్లుగొని నా కేవియు తిన్నఁగా కానరాకున్నవి. కన్నులు పచ్చపడి సర్వమును పచ్చఁగానే కానవచ్చుచున్నది. ఓ వృద్ధుఁడా! నీవు పూజార్హుఁడవుగాఁ గానఁబడు చున్నావు. నేను పొందినయీభ్రమకు నన్ను మన్నింపుము" అని వేఁడుకొనెను. "అయ్యా! ఈచిన్నది యెఱుఁగక చేసినయీతప్పిదము మన్నింపుము. నీవు మంచివాఁడవుగాఁ గానఁబడు చున్నావు. నీ

వెక్కడకుఁ బోవుచున్నావో మాయం దనుగ్రహించి చెప్పెదవా? మేము పోయెడియూరికే నీవును బోవుచున్నపక్షమున, మాకు మంచి సహవాసము దొరకినందుకు పరమానందభరితుల మగుచున్నాము'' అనిరుద్రమూర్తి యావృద్ధుని సంతోషపెట్టెను. ఆవృద్ధుడు 'అయ్యా! వింతయైన మీయిరువురవర్తనమును నాకద్భుతమును సంతోషమును గలిగించు చున్నది. నాపేరు చిత్రసేనుఁడు కాంచీనగరమం దున్ననా కుమారుని జూచుటకయి నే నక్కడకుఁ బోవుచున్నాను''అని చెప్పెను. ఆపేరు వినఁగానే యతఁ డావృద్ధుఁడు తనముఖదలిని వివాహము చేసికొనఁ బోవుచున్నదృఢసేనునితండ్రి యగుట యెఱిఁగి "అయ్యా! నీకొమారుఁడు కాంచనవర్మయొక్క ద్వితీయపుత్రిక యైనపద్మావతిని పెండ్లియాడఁ బోవుచున్నాఁడు కాఁడా'' యని యడిగి తెలిసికొని తన బంధుత్వమునుకూడఁ దెలిపికొని యటువంటిభాగ్యవంతునితో సంబంధము చేయఁబోవుచున్నందున నాతని నభినందిచెను. అటుతరువాత వారందఱును గలిసి సుఖముగా ప్రయాణముచేసి యుక్తసమయములో కాంచనవర్మ గృహమునకుఁబోయి చేరిరి. ఆవల నేర్పఱుచుకొన్న ప్రకారముగా విదియనాఁడు ముహూర్తనిశ్చయము చేయఁబడినందున ఆదినమున పద్మావతిని దృఢసేనున కిచ్చి వివాహము చేసిరి. ఆదినము ననే యాసుముహూర్తమునందే కాంచనవర్మ తనబంధువుల చిన్న దాని నొకదానిని సత్యవర్ధనుఁ డనువాని కిప్పించి యావివాహమును తనకొమార్తె వివాహముతోఁగూడ జరపించెను. ఆవివాహములనిమిత్తము బంధువర్గమంతయు వచ్చియుండెను. ఇట్లందఱును జేరి కూరుచుండి యుండఁగా పద్మావతిభర్తయైనదృఢసేనుఁడును రెండవపెండ్లికొమారుఁ డయినసత్యవర్ధనుఁడును రుద్రమూర్తినిజూచి యాతనికి గయ్యాళిభార్య దొరకినదనియుఁ దమకు చెప్పినట్లు వినెడుమంచి

భార్యలు [illegible]యు [illegible] గారిని పరిహసింప మొదలుపెట్టిరి. ఆమాటల కసేయను సహింపక క్రొత్తగా వివాహమయినయాముగ్గురు వధువులలోను తనభార్యయే మిక్కిలివిధేయతకలదని వారితోవాదింప దొడఁగెను. ఆవాదమును విని కాంచనవర్మసహితము మూరకుండలేక తన పెద్దయల్లుని జూచి యీయున్నముగ్గురిలోను నీభార్యయేగదాగయ్యాళి యని చెప్పెను. అందుమీఁద నరేంద్రుఁడు గంభీరస్వరముతో మామగారిని క్రొత్తపెండ్లికొడుకులనుబిలిచి, అందఱిభార్యలలోను నిశ్చయముగాతన భార్యయే మిక్కిలియడఁకువయును సద్వర్తనమును గలదనియు, ఆమె యోగ్యత తక్కినవారికంటె తనకే దృఢముగా తెలియు ననియు, భర్త యాజ్ఞ యైనదని నూతనబంధువుల నందఱిని పిలువనంపిన పక్షమున నెవ్వ రెక్కువవిధేయరెను గనఁబఱచి ముందుగావత్తురో వారినడతను బట్టి వారిసుగుణసంపద తెలియవచ్చుననియు, ఈపని కిష్టమయిన యెడల తాను పందెము వేయుటకుసిద్ధముగా నున్నాఁడననియు, దృఢ ముగాఁ జెప్పెను. తక్కినయిద్దఱును తలతిక్కదయిన గౌరీదేవికంటెఁ తమభార్యలే యెక్కువ విధేయతగలవారని దృఢముగా నమ్మియుండిరి గాన వారు వెంటనే పందెమున కొప్పుకొని, గెలిచినవారి కోడినవారు నూఱేసిరూపాయ లిచ్చుట కొడంబడిరి. అప్పుడు రుద్రమూర్తి వారిని జూచి మీభార్యలు మీరుచెప్పినట్లు విందురో వినరో యన్నసంశ యముచేత తక్కువపందెము వేసితిరి కాని నేను నాభార్యయందున్న నమ్మకముచేత నూఱురెట్లధికధనము పందెము వేయుటకయినను సిద్ధముగా నున్నానని వారిని మఱింతపురికొల్పెను. అందుపయిన వారు రోషమెక్కినవారయి తాము విజయము పొందకపోయినయెడల చెఱి వేయేసి రూపాయలు నిచ్చెద మని పందెపుసొమ్మును హెచ్చించిరి. పందెము నిశ్చయమయినతరువాత వారిలోముందుగా దృఢసేనుఁడు

పరిచారిక నొకదానిని పిలిచి నీభర్త సెలవయినదని పద్మావతిని పిలుచు కొనిరమ్మని పంపెను. కొంతసేపటి కాపరిచారిక మరలవచ్చి 'అయ్యా! మీభార్య లోపల పనిగానున్నందున తా నిప్పుడువచ్చుటకు వీలులేదని చెప్పుమన్నది'' అనిచెప్పెను. అది చూచి రుద్రమూర్తి "దృఢసేనా! నీభార్యయొక్క విధేయత తేటపడినదా? లోపల పనిగా నున్న దఁట! వచ్చుటకు వీలులేదఁట! ఇదేకదా నీభార్యయొద్దనుండి వచ్చినప్రత్యుత్తరము!'' అని తోడియల్లుని కేరడములాడ మొదలు పెట్టెను. ఆమాటల కుడికి దృఢసేనుఁడు "అన్నా! తొందరపడఁబోకు. నీభార్య యింతకంటెనవమానకరమయిన యుత్తరమును బంపకపోయినయెడల నీవప్పుడు సంతోషింపుము'' అని యూరకుండెను. అప్పుడు సత్యవర్ధనుఁ డాపరిచారికనుజూచి నీవీసారినాభార్యవద్దకుపోయి యెంతపనియున్నను విడిచి నీభర్తనిన్నొక్కసారి వచ్చి పొమ్మనుచున్నాఁడని వేఁడుమని పంపెను. ఆమాటవినిరుద్రమూర్తి "ఓసత్యవర్ధనా! నీభార్యనుభర్తవద్దకు తోడితెచ్చుటకయి వేఁడుకోవలెనుగా! అట్లయిన నీదిదొడ్డభార్యయే'' అని యాతనినికూడ నెగతాళి చేసెను. ఆపరిహాసమునకు రోషించి సత్యవర్ధనుఁడు "బావా! నీవంతువచ్చినదాఁక నిమిష మోపిక పట్టుము. నీభార్య ప్రార్థింపకుండ నీవద్దకు వచ్చినప్పుడు చూతములే'' అనిపరిహాసముగా పలికెను. ఈమాటలనుచుండఁగానే లోపలికిఁబోయినపరిచారిక క్రొత్త పెండ్లికూఁతును దీసికొనిరాకయే తా నొంటిగావచ్చుచుండుట కంటఁబడఁగానే సత్యవర్ధనుని మొగము వెలవెలపోవ నారంభించెను. అంతట పరిచారిక ప్రవేశించి "అయ్యా! మీ భార్య లోపలనేదో వేడుకలోనున్నది. అందుచేతఁ దానువచ్చుట కవకాశములేక మిమ్మే వచ్చి మాటాడిపొమ్మన్నది'' అని చెప్పెను. ఆమాటలు పరిచారిక ముగింపఁగానే రుద్రమూర్తి పకపకనవ్వి 'నీభార్య నిన్నే రమ్మని

యాజ్ఞాపించినదిగా! సరిసరి! ఇది యంతకంటెను మేలుగా నున్నది. మీభార్యలు విధేయతయం దొకరిని మించినవా రొకరయినారు" అని తల యూఁచసాగెను. కొంతసేపటికి కాయుదే)కము తగ్గినతరు వాత రుద)మూర్తి పరిచారికను పిలిచి 'నీవునాభార్యయొద్దకుఁబోయి నీభర్తగారు నిన్నిక్కడకు రమ్మని యాజ్ఞాపించినారు.'' అనిచెప్పుమని పంపెను. అప్పు డక్కడ నున్నవారందఱును గౌరీదేవి నిశ్చయముగా రాదని యొండొరులతోఁ ననుకొనుచుండఁగానే యందఱును విస్మయ పడునట్లుగా కాంచనవర్మ అదిగో నాపెద్దకొమార్తె వచ్చుచున్నది.'' యని యత్యాశ్చర్యముతోఁ కేక వేసెను. ఇంతలో గౌరీదేవి పరిచారిక వెంటవచ్చి భర్తయెదుట నిలిచి "ప్రాణేశ్వరా! నన్ను పిలిపించిన పని యేమి?'' అని వినయముతో నడిగెను. "నీ చెల్లెలునుసత్యవర్ధ నునిభార్యయు నేమి చేయుచున్నారు.'' అని రుద)మూర్తియడి గెను. "నడవలోఁ గూరుచుండి వినోదముగా కథలు చెప్పుకొను చున్నారు.'' అని గౌరీదేవి యుత్తరము చెప్పెను. నీవు పోయి వా రిద్దఱిని గూడఁ దీసికొనిరమ్ము'' అని యతఁడు మరలఁ జెప్పెను. ఆమె మాఱుమా టాడక వారిని దెచ్చుటకయి వెంటనే కదలి పోయెను. అప్పుడు "ప్రపంచములో నే దయిన నద్భుత మున్న యెడల నిది మహాద్భుతముగా నున్నది'' అని దృఢసేనుఁ డనెను. నాకు నిది మహాద్భుతముగానే తోఁచుచున్నది. ఈవైప రీత్యమువలన నేమి పుట్టునో నాకు తెలియకున్నది'' అని సత్యవర్ధనుఁ డనెను. 'మఱేమియుపుట్టదు. దంపతులకు సుఖమును సంతోషమును పుట్టును' అని రుద్రమూర్తి మాఱుపలికెను. ఇదంతయు నాశ్చర్యపడి చూచుచున్న కాంచనవర్మ సంతోషమును పట్టఁజాలక పెద్దయల్లుని కౌఁగిలించుకొని "పుత్రకా ! దీర్ఘాయుష్మంతుఁడవయి మందువుగాక!

నీవు పందెమును గెలిచితివి. ఆమె మఱియొక కోమూర్తి యనుకొని యరణమ్ముగా నీకు నేను మఱి పదివేలరూపాయల నిచ్చెదను. నిజముగా నిది గుణములచేత క్రొత్తకోమూర్తిగా నే మాఱినది.'' అని సంతోషముతోఁ బలికెను. అతఁడు మామగారినిజూచి 'నీకోమూర్తిక్రొత్తగా నేర్చుకొన్న యోగ్యతను విధేయతను మీయెద్దఁ జూపించి ధనరూపమయినదిగాక యంతకంటెమే లయినపందెమును గెలిచెదను.'' అని పలికి, గౌరీదేవి తక్కిన యిద్దఱువధువులతోను వచ్చుచుండుట దూరమునుండి కనిపెట్టి వారిభర్తలవంకఁ దిరిగి ''సోదరులారా! నాభార్య మీభార్యల నెల్లు తీసికొని వచ్చుచున్నదో చూచినారా? వారు భర్తలమాటలయందు లేనిగౌరవమును తమయక్కగారి ప్రియవచనములయందుఁ గనఁబఱిచిరి'' అనెను. అంతలో వారందఱును సమీపమునకు వచ్చిరి. అప్పుడు రుద్రమూర్తి తనభార్యను జూచి ''ఓప్రాణేశ్వరీ! నీ కొప్పులోని యాపూలదండ సంసారికస్త్రీలకు తగినదిగానుండ లేదు. దానిని తీసి యావల పాఱవేయుము'' అని యాజ్ఞాపించెను. ఆతనినోటినుండి యామాట రాఁగానే సంశయింపక యర్థనిమిషమయిన నాలస్యముచేయక యామె పువ్వులదండను దీసి భర్తనియమించినట్లు పాఱవేసెను. అదిచూచి పద్మావతి భర్తవంకఁ దిరిగి ''ఇది యేమి తెలివితక్కువ. ఆలోచనలేక భర్తయిచ్చినపిచ్చియాజ్ఞల నెల్ల చెల్లించుచున్నది'' అనెను. ఆమాటలు విని యొుడలుమండ దృఢసేనుఁడు భార్యవైపునకుఁ దిరిగి ఇట్టి తెలివితక్కువ నీకుఁగూడ కుదరవలె నని నేను గోరెదను. భర్తమాటను మన్నింపని నీ తెలివియెక్కువయే యీ మధ్యాహ్నము నాకు వేయిరూపాయలనష్టము దెచ్చిపెట్టినది'' అని విచారముతో మొగము వంచుకొని యూరకుండెను. అప్పుడు రుద్రమూర్తి భార్యను బిలిచి ''ఈవధువులుకూడ సిగ్గుపడి తలవంచుకొను

నట్లుగా నీవు నేర్చుకొన్నవిధేయతను నీ విప్పుడు వీరి కుపదేశింపుము' అని యుత్తరవు చేసెను. అందుపయి నామె మృదుమధురస్వరముతో భార్యలు భర్తయెడఁ జూపవలసినవిధేయతను గూర్చియు పతివ్రతా ధర్మములను గూర్చియు కర్ణోత్సవముగా నుపన్యసించెను. అవఱకు కాంచీనగరములో గౌరీదేవి గయ్యాళియని యెంత పేరుపడినదో యంతకంటె శతగుణము లధికముగా నాటనుండియామెపాతివ్రత్యము నందును కళ్యాణగుణములయందును ప్రసిద్ధికెక్కెను. కళ్యాణగౌరీదేవి యనుసార్థకనామముతో వ్యవహరింపఁబడుచుండెను.

సంపూర్ణము.

---

భాస్కర ప్రెస్, రాజమహేంద్రవరము—1950.



# చిత్రకేతుచరిత్రము

ఇది,

షేక్స్పియరుయొక్క "కింగులియర్"

అను నాటకకథ ననుసరించి

చెన్నపురి ప్రసిడెన్సికాలేజిలో రిటైర్డు

తెనుఁగుపండితుఁడగు

కందుకూరి వీరేశలింగముచేత

వ్రాయఁబడినది.

ఐదవకూర్పు 500.

రాజమహేంద్రవరము

మోడరన్ ప్రెస్ నందు

ముద్రింపఁబడినది.

1949

దీని వెల రు. ౦—౧—౬ లు.

## ఈకథలోవచ్చు పాత్రములు.

చిత్రకేతుఁడు—కురుదేశపురాజు.

శ్రుతకీర్తి—చిత్రకేతుని మొదటియల్లుఁడు.

వీరవర్మ—చిత్రకేతుని రెండవయల్లుఁడు.

గుణరత్నాకరుఁడు—చిత్రకేతుని మూఁడవయల్లుఁడు.

విత్తకాముఁడు—లక్ష్మణపుర సంస్థాన ప్రభువు.

చిత్రాంగి—చిత్రకేతుని పెద్దకొమార్తె; శ్రుతకీర్తి భార్య.

మధువాణి—చిత్రకేతుని రెండవకొమార్తె; వీరవర్మ భార్య.

కళావతి—చిత్రకేతుని మూఁడవకొమార్తె; గుణరత్నాకరుని భార్య.

సుమంత్రుఁడు—చిత్రకేతుని మంత్రి; ఇతఁడు విశ్వాసియను మాఱు పేరుతో రాజునకు సేవకుఁడుగా నుండెను.

మతిమంతుఁడు—చిత్రకేతుని యాస్థానమునందలి పరిహాసకుఁడు.

సుందరాంగుఁడు—అన్నకు ద్రోహముచేసిన మగధరాజు.

సత్యవిక్రముఁడు—మగధరాజు; సుందరాంగుని యన్న.

వీరుగాక భటులు, సేవకులు, మొదలయినవారనేకులు వత్తురు.

# చిత్రకేతు చరిత్రము

పూర్వకాలమునందు చిత్రకేతుఁ డనురాజు కురుదేశమును పాలించుచుండెను. అతనికి శ్రుతకీర్తియను రాజపుత్రునిభార్యయగు చిత్రాంగియు, వీరవర్మయను రాజపుత్రుని భార్యయగు మధువాణియు కన్యయైన కళావతియు, అనిముగ్గురు కొమార్తెలు గలరు. కన్యయైన యాముద్దులకూఁతును వివాహమాడవలెనన్న తలంపుతో కోసలదేశమునకు రాజయినగుణరత్నాకరుఁడును లక్ష్మణపురసంస్థానమునకు ప్రభువయిన విత్తకాముఁడను సామంతరాజును వచ్చి చిత్రకేతుని రాజధానియందప్పుడు వేచియుండిరి.

అఱువదిసంవత్సరములు దాఁటి వార్ధకమువలనను రాజ్యభార నిర్వహణక్లేశమువలనను కృశుఁడయియున్న యావృద్ధరాజు రాజ్యభారమును శక్తిసంపన్నులయి యల్పవయస్కులయి యున్నవారిమీఁద పెట్టి తానిఁక పారమార్థికచింతతో తత్త్వవిచారమునుచేయుచు కాలముఁగడుపుట యుచితమనితలఁచి, తనముగ్గురుకొమార్తెలను దగ్గఱకు పిలిచి వారికి తనమీఁద నెంతప్రేమ యున్నదో వారినోళ్ళనుండియే తెలిసికొని వారివారికిఁగల ప్రేమకు తగినట్లుగా రాజ్యమును వారికి పంచి యియ్యవలెనను నుద్దేశముతో, తనమీఁద నెవరెవరికెంతెంత ప్రేమ యున్నదో చెప్పుఁడని యడిగెను.

వారిలో పెద్దకూఁతు రయిన చిత్రాంగి తనకు తండ్రిగారిమీఁద గలప్రేమను మాటలతో చెప్పుటకు శక్యము కాదనియు, తనదేహము కంటెను ప్రాణముకంటెను ప్రాణాధికములయిన సమస్తపదార్థముల కంటెనుతండ్రియే యధికుఁ డనియు, తీయనిమాటలను కావలసినన్ని

పలికెను. మనసులో నిజమయిన ప్రేమ లేనప్పుడు పరులను నమ్మించి మోసపుచ్చుటకయి యిటువంటి యిచ్చకముల నెన్నిటినైన పలుకుట సులభమే కదా? తండ్రి కొమార్తెనోటినుండివచ్చిన యీ తేనెమాటలకు పొంగి, అవియన్నియు తనమీఁదియవ్యాజప్రేమచేత హృదయ పూర్వక మయిన వాక్యములే యనుకొని, పితృవాత్సల్యముతో తన రాజ్యములో మూఁడవభాగ మామె కిచ్చెను.

తరువాత రెండవకొమార్తెను పిలిచి నీవేమిచెప్పెద వనియడుగఁగా, ఆమెయు తన యప్పగారివంటిస్వభావము కలదియే గనుక, స్తోత్రపాఠములయం దప్పగారి కెంతమాత్రమును తీసిపోక తనకున్న ప్రేమను తెలుపుటకయి యప్పగారు చెప్పినమాట లణుమాత్రమును చాల వనియు, తండ్రిగారియెడలఁగల ప్రేమవలనఁ దనకుఁగలిగెడుసంతోషముతోఁబోల్చి చూడఁగా ప్రపంచమునందలి సమస్తసంతోషములును దానిలోషోడశాంశమునైనను బోల వనియు, చెప్పెను. చిత్రకేతుఁడు తనకటువంటి ప్రేమాధికురాండ్రయిన కొమార్తెలను గన్నభాగ్యము లభించినందునకు పరమానందభరితుఁడయి తనపెద్దకొమార్తె కిచ్చిన దానితో సమానముగా తనరాజ్యములో మూఁడవవంతు రెండవ కొమార్తె కిచ్చెను.

అటుతరువాత తా నెప్పుడును తనపాలిటి భాగ్యదేవతనుగా భావించుకొనుచున్న ముద్దులకూఁతును జూచి, ఆమెకూడ తనయప్పల వలెనే తేనెలొలుకుమృదుమధురవచనములతో చెవులకు విందుచేయు ననియు, తాను కూఁతులందఱిలో కళావతినే మిక్కిలి గారాబముతో చూచుచు ప్రాణాధికురాలినిగా భావించి యుండుటచేత నామె తనయక్కలకంటె ప్రేమ నధికముగా కనఁబఱుచు ననియు, తలఁచుకొని నీవేమిచెప్పెద వని మూఁడవపుత్రిక నడిగెను. కాని కళావతి తనయప్పలస్వభావ మెఱిఁగినది గనుక వారు నోట పలికినది హృదయ

ములో లేనిదనియు తమతండ్రి రాజ్యము నపహరించి తాము నుభర్త లును యావజ్జీవమును హాయిగా రాజ్యసుఖ మనుభవింపవలె నన్న దురుద్దేశముతోనే వారామాయమాట లన్నియు పలికి రనియు, తెలిసి కొన్న దయి తానట్టి నీచములయినస్తుతిపాఠములు చేయుట కిష్టము లేనిదయి, తండ్రియందు కొమార్తెల కెంతప్రేమ యుండవలెనో యంత ప్రేమయే తనకు తండ్రియం దున్నది గాని యంతకంటె హెచ్చుకాని తక్కువకాని లేదని యుత్తరము చెప్పెను.

తనప్రియపుత్రిక తనదృష్టికి కృతఘ్నురాలై యీ ప్రకారముగా పలికినందులకు మనస్సులో విస్మయపడి, రాజామెనుజూచి నీవు తిన్నగా నాలోచించుకొని మరల పలుకవలసిన దనియు, లేనియెడల నీభాగ్య మునకు భంగము కలుగు ననియు, చెప్పెను. అందుమీఁద కళావతి తండ్రినిజూచి "మీరు నాకు జనకులు; నన్ను పెంచి పెద్ద దానిని జేసి విద్యాబుద్ధులుచెప్పించి యెంతో ప్రేమతో చూచుచున్నారు; ఈవిష యమున మీకు నేనెంతో కృతజ్ఞురాలయినయియుండి మీయెడలభయ భక్తులు గలిగి, మీయాజ్ఞ యెన్నఁడును మీఱక, మిమ్మెప్పుడును ప్రేమించుచు గౌరవించుచు, అర్హమయిన విధమున నడుచుకొను చున్నాను. అయినను నేను నాయక్కలనలె నంత పెద్దమాటలుచెప్పి మిమ్ముతప్ప ప్రపంచములో మఱిదేనిని ప్రేమింప నని చెప్పఁజాలను. వారికి తమతండ్రియందుతప్ప మఱి దేనిమీఁదను ప్రేమయే లేకపోయిన పక్షమున, తాము భర్తల నేల చేసికోవలెను? నే నెప్పుడయిన వివాహము చేసికొనుట తటస్థించినయెడల, నన్ను పాణిగ్రహణము చేసి కొన్నప్రాణనాథునియెడలకూడ నాప్రేమలోసగము వినియోగపఱిచి యాయన కుపచారము చేయుచు కష్టసుఖముల కగుచుందునుగాని, నాయప్పలు చెప్పినట్టు తండ్రి నొక్కనినే ప్రేమించి నేను భర్తను విడిచి పెట్టఁజాలను" అనిచెప్పెను.

తనతోడఁబుట్టినపడుచులు నోటితో చెప్పినంతప్రేమ నిజముగానే కళావతిమనస్సులో నున్నను, ఆమె మఱియొక్కప్పుడయిన పక్షమున తండ్రి మనస్సున కసూయ తోఁచకుండ ఘృతికాస్నేహముతో మనస్సులో నున్నది స్పష్టముగానే చెప్పివేసి యుండునుగాని, తన యప్పలు మనస్సులోలేని కల్లప్రేమను కనఁబఱిచి ముఖస్తుతులుచేసి యటువంటిలాభమును పొందినతరువాత కళావతి వారివలెఁ జేయుటకు తనకు మనసు కొలుపక మనస్సులో ప్రేమించి పైకి చెప్పకొనకుండు టయే సర్వోత్తమ మని తలంచుకొనెను. ఈకార్యమువలన స్వప్రయో జనము నిమిత్తమయి తండ్రిని ప్రేమించినదని యితరులు సందేహపడుట కవకాశము కలుగకపోవుటయేకాక, ఆమెకు తండ్రియెడ నత్యంతప్రేమ కలిగియున్నను ధనమునిమిత్తముకాదని తేటపడెను; ఆమె చెప్పినమాట లప్పలుచెప్పినంత గొప్పగా లేకపోయినను చెప్పినదంతయు హృద యములోనుండి వచ్చినదియు సత్యమును నైయుండెను.

ఈప్రకారముగా మనస్సులోనున్నది స్పష్టముగా చెప్పివేయుట చేత రాజున కది గర్వముగా తోఁచి, సహజముగానే కోపస్వభావుఁడును తొందరపడువాఁడు నయినయాతని కిప్పుడు వార్ధకముకూడ తోడుపడి నందున మర్యాగ్రహావేశముచేత వివేకముచెడి ముఖస్తుతికిని సత్యము నకును, హృదయములోనుండి వచ్చినమాటలకును నాలుకచివరనుండి వచ్చినమాటలకును, భేదముకనిపెట్టలేక, వేగిరపాటుతో తనకడపటి కూఁతునకియ్యఁదలఁచుకొన్న తన రాజ్యములోని మూడవభాగమును కళావతికియ్యక తక్కిన యిద్దఱుకొమార్తెలకును దానిని సమానముగా పంచియిచ్చివేసెను. అప్పుడారాజు తనయల్లుర నిద్దఱను రప్పించి, మంత్రులు సభాసదులు మొదలయినవారియెదుట రాజ్యమును వారిద్దఱి పరముచేసి వారికి సర్వాధికారములు నిచ్చివేసి, తాను రాజునన్న పేరు మాత్రముంచుకొనెను. ఈప్రకారముగా రాజ్యభారమంతయు వారి

మీఁదమోపి, తనయొద్దనూఱుగురు వీరభటులుమాత్రము సేవకులుగా నుండునట్లును వారిజీతములువంతువరుసను మాసమున కొక్కొక్క కూఁతురిచ్చునట్లును నియమము చేసెను.

కొంచెమయినను వివేకములేక క్రోధమే ప్రధానము చేసికొని యీవిధముగా వేగిరపాటుతో రాజ్యమును పంచియిచ్చుటవలన సభాసదులకందఱకును విస్మయమును వ్యసనమునుకలిగెను. కాని యాతని సభాస్తారులలో నొక్కఁడయినయొక్కసుమంత్రునకుతప్ప మఱి యెవ్వరికిని ఆతఁడుచేసినకార్యము మంచిదికాదని చెప్పు నంతటిసాహసమును ధైర్యమును లేకపోయెను; సుమంత్రుఁడు ధైర్యముచేసి కళావతిపక్షమున నేమో చెప్పఁబోఁగా, దురాగ్రస్తుఁడయియున్నరా జాతనిని వారించి,యీమెపక్షమున మఱియొకమాట చెప్పినపక్షమున తల తీయించెద ననియాజ్ఞ చేసెను; అయినను సుమంత్రుఁ డంతమాత్రము చేత భయపడి యూరకున్నవాఁడు కాఁడు. అతఁడు రాజునెడలసదాప్రభుభక్తి కలవాఁడయి, ఆతని దేవునివలె గౌరవించుచు, తండ్రినివలెప్రేమించుచు యజమానునివలె సేవించుచుండెను; అతఁడు తన ప్రాణమును రాజుయొక్క శత్రువులనిమిత్తమయి పూటపెట్టుచు వచ్చెనేకాని యొకప్పుడును స్వామిరక్షణార్థమయి ప్రాణములను త్యజించుటకు వెనుకతీసిన వాఁడు కాఁడు. ఇప్పుడు రాజు తానే తనకు శత్రు వయినందున సుమంత్రుఁ డీశత్రువునెదిరించుటకును భయపడక రాజుయొక్కక్షేమము నిమిత్తమయి ధైర్యముతో చెప్పవలసినది చెప్పెను. రాజిదివఱకు సమస్తవిషయములయందును తన యాలోచనప్రకారమే నడుచుచున్నందున, ఈవిషయమునందు సహితము కర్తవ్యము తనదృష్టితో చూచి తనయాలోచనను విని ప్రవర్తింపు మని యతఁడు రాజును మిక్కిలి వేడుకొనెను. అంతేకాక వచ్చిన కోపమును మరలించుకొని మరల శాంత హృదయముతో నాలోచింపవలసిన దనియు, చిన్న కొమార్తె కందఱి

కంటెను తక్కువప్రేమ యున్నదని యూహించుట క్రమముకాదనియు, తక్కినకొమార్తెలు పలికినదంతయు యథార్థమని విశ్వసించుట సరికాదనియు, అతఁడుబోధించెను. ముఖస్తుతులచేత యుక్తాయుక్త వివేకము చెడియున్నప్పుడు, సమబుద్ధికలవాఁడు నిజమును స్పష్టముగా మొగము ముందు చెప్పవలసినదేకదా? ఇదివఱకే రాజుసేవనిమిత్తమయి ప్రాణము లర్పించియున్నవానికి రాజుబెదరింపు లిప్పు డేమిపని చేయఁగలవు? బెదరించునంతమాత్రముచేత జడిసి, యతఁడు తనకు ధర్మమని తోఁచిన దానిని నిశ్శంకముగా నుపదేశింప వెనుకతీయలేదు.

సుమంత్రుఁడు నిర్భయముగా పలికినమాటలవలన రాజునకు మఱింతకోపమధికమయి, ప్రాణోపద్రవ కరమయినరోగమును ప్రేమించి వైద్యుని జంపఁదలఁచకొన్న దేహము తెలియనిరోగివలెనే రాజును, తనకు హితోపదేశము చేయవచ్చినసుమంత్రుని దేశమునుండి వెడల నడఁచుట కుత్తరువుచేసి, దేశమువిడుచుటకై దుదినములు మాత్రము గడువిచ్చి, ఆఱవదినమున తనదేశములో కనఁబడినపక్షమున తత్క్షణమే శిరశ్ఛేదము చేయించెద నని యాజ్ఞచేసెను. దేశాంతరము పోవుటకన్న నిటువంటి విమర్శలేనిరాజును కొలిచియుండుటయే తనకుద్వీపాంతర వాసశిక్షగా నుండునని చెప్పి, చక్కగా విమర్శించి న్యాయముగా పలికినకళావతిని రక్షింపవలయునని దేవతలను ప్రార్థించి, తక్కినవారు చెప్పినమాటలు కార్యములవలన కనఁబడవలయునని కోరుచు, అతఁడు కొలువువిడిచి పోయెను.

అప్పుడు కోసలదేశాధీశ్వరుఁడును, విత్తకాముఁడును, కళావతి తనతండ్రియాగ్రహమునకు పాత్రురా లయినదనియు, అందుచేత నామె సౌందర్యముతప్ప మఱియేసొత్తును వెంట రాదనియు, తెలిసికొని వారిలో విత్తకాముఁడు తనకాసంబంధ మక్కఱలేదని వెడలిపోయెను. గుణరత్నాకరుఁ డాచిన్నది చేసినదోషముయొక్కస్వభావమును తెలిసికొని,

తండ్రియొక్క యనుగ్రహము చెడఁగొట్టుకొని రాజ్యలాభమునుపోఁగొట్టు కొన్నందునకు కారణము తనయప్పలవలె ముఖస్తుతి చేయలేకపోవుటయే కదా యని యెంచి, రాజ్యలాభముకంటెను, ధనముకంటెను, తన కామెసుగుణసంపదయే గొప్పయాభరణమని చెప్పి తాను కళావతిని పాణిగ్రహము చేసికొని, మామవద్దను వదినెలవద్దను సెలవు పుచ్చు కొని, 'నీవు కోసలదేశమునకు రాణివై నీయప్పలకంటెను మంచిదేశ మును పాలింపవచ్చు' నని భార్యతో చెప్పి, ఆమెను వెంటబెట్టుకొని మహావైభవముతో స్వదేశమునకు ప్రయాణమాయెను.

అప్పుడు కళావతి కనుల నీరుకాఱఁ దనయప్పలవద్ద సెలవు పుచ్చుకొని తండ్రిని మిక్కిలియాదరముతో చూచుచు పలికినమాటలను చెల్లింపవలయును జుండీ! యని వారిని వేఁడుకొనెను. అందుమీఁద వారామెను కోపదృష్టితో చూచి నీవు మాకు ధర్మోపదేశము చేయ వలసినపని లేదనియు, నీవు భాగ్యదేవతవు లభించితివి గనుక నీభర్తను నీవు తిన్నగా నాదరించుచుండినం జాలుననియు, పరిహాసము చేసిరి. అప్పలయొక్క దుస్స్వభావమును విచారించి, తండ్రి యింతకంటె మంచి వారిచేతులలో నున్నపక్షమున నెంతో యనుకూలముగా నుండునుగదా యని చింతించుచు, దుర్భరహృదయముతో వారిని విడిచిపోయెను.

కళావతి దేశమువిడిచి భర్తవెంట బయలుదేఱి పోఁగానే, ఆదుష్టురాండ్రు తమకుటిలస్వభావములను కనఁబఱుప నారంభించిరి. మొదటిమాసమయినను పూర్తిగా గడవకమునుపే మొదట చేసికొన్న నియమప్రకారముగా పెద్దకూఁతురయిన చిత్రాంగియింటనున్న యా వృద్ధరాజు చెప్పుటకును చేయుటకును గల తారతమ్యమును తెలిసికొన నారంభించెను. తనతండ్రివలన పొందవలసినదంతయు పొంది యా దుర్మార్గురాలు, తానింకను రాజునని సంతోషించుటకయి వృద్ధజనకుఁ డుంచుకొన్న యల్పములయిన రాజచిహ్నములను జూచి యోర్వలేక

యసూయ కనఁబడుచుసాగెను; రాజును రాజువద్దనున్న నూఱుగురువీర భటులను చూచినప్పు డెల్లను చిత్రాంగికి కన్నుమంటగా నుండుచు వచ్చెను. అప్పటినుండియు తండ్రిపొడ కనఁబడినప్పుడెల్లను మొగమింత చేసికొని చిరచిరలాడుచువచ్చెను; ఆవృద్ధుఁడామెతో మాటాడఁదలఁచు కొన్నప్పు డెల్లను రోగమని బొంకియో మఱియేదో మాయవేషము వేసియో తప్పించుకొనుచుండెను. ఇందువలన వృద్ధుఁడయిన యతఁడు తనకు వ్యర్థమయిన భారముగా నున్నాఁడనియు, ఆతనియొద్దనున్న వీర భటులను పోషించుట వృథావ్యయమనియు, ఆమె తలఁచియుండుట స్పష్టమేకదా? నానాఁటి కామెకు తండ్రియెడఁగల యాదరమును గౌరవ మును తగ్గిపోవుటయేకాక, ఆమె ప్రవర్తనమునుబట్టి యామె పరిచార కులు సహితము రాజునెడలననాదరణమును చూపుచు, ఆతని యాజ్ఞలను చేయకయు చెప్పినమాట వినఁబడనట్టు నటించియు చులకచేయ నారంభించిరి. ఇట్లుచేయుటకయి చిత్రాంగి తనసేనకులను రహస్యముగా ప్రోత్సాహపఱిచినదనియు కొందఱు చెప్పుదురు. తనకొమార్తెయొక్క ప్రవర్తనమునందీదృశాత్యాసము రాజు కనిపెట్టకపోలేదు గాని సాధారణ ముగా జనులు స్వయంకృతాపరాధమువలనఁ గలిగిన యనర్థములను బయలుపుచ్చుట కిష్టములేనివారుగా నుందురుగనుక రాజు తనమనస్సెవరి తోను జెప్పక తానాలాఘవమును సహింపఁగలిగినంతకాలము సహించి యుండెను.

సదాదరణమువలన దుష్టులహృదయములయందు నిజమయిన భక్తివిశ్వాసాదు లెట్లుకలుగవో, అట్లే సాధుల హృదయములయం దనాదరణచేత ప్రేమయు విశ్వాసమును తగ్గిపోవు. ఈసత్యము సుమంత్రుని చరిత్రమువలన దుస్పష్టమగుచున్నది. అతఁడు రాజుచేత దేశమునుండి వెడలఁగొట్టఁబడినవాఁడయినను, కురుదేశమునందు మరల

కనఁబడినపక్షమున ప్రాణము పోఁగొట్టుకోవలసినవాఁ డయినను, తన ప్రభువయినచిత్రకేతున కేవిధముగానయిన తోడుపడఁ గలుగుటకు కించిదవకాశమయిన నున్నంతవఱకును దేశమును విడువకుండుటకు నిశ్చయించుకొని యేయుపాయమునకయిన నొప్పుకొని యుండెను. ఆహా! స్వామిభక్తి యెటువంటి కష్టములకయినను సహించును గదా! ఈసుమంత్రుఁడు తన గొప్పతనమును వైభవమును దాఁచి, యొక బీద సేవకునివలె మాఱువేషము వేసికొని విశ్వాసియను పేరుతో రాజువద్ద కొలువుకుదుగుటకయి వచ్చెను. ఆబీదవేషములో రాజాతని నానవాలు పట్టలేక, తన కత్యంతాప్తుఁడును ప్రియమంత్రియు నయిన సుమంత్రుఁ డని లేశమాత్రమును సందేహింపక, ఆతనికిఁగల ఋజువర్తనమునకును నిష్కాపట్యమునకును సంతోషించి యాతనిని తన భృత్యునిగా స్వీకరించెను. ముఖస్తుతులవలన మోసపోయి ప్రియవాక్యములన్న కంటకించుచున్న యాతని చెవుల కీక్రొత్త సేవకుని ముగమోటములేని ఖండితవచనము లమృతప్రాయములుగా నుండెను. ఈవిశ్వాసికి తన ప్రభుభక్తిని నమ్మకమును కనఁబఱచుటకు శీఘ్రముగానే యవకాశము దొరకెను. చిత్రాంగియింట వెచ్చములు తీసికొనివచ్చు నుద్యోగస్థుఁ డొకనాఁడు తన యజమానురాలి బోధచేత రాజువిషయమున మిక్కిలి యగౌరవముతో నడుచుకొని కోపదృష్టితోఁ జూచి కొన్ని తేలికమాటలాడఁగా, అతఁడుచూచి సహింపలేక వానిని తన్ని భూమిమీఁద పడఁగొట్టి బుద్ధివచ్చునట్లు చేసెను. అందుచేత రాజు కాతనియం దంతకంత కధికానురాగము కలుగసాగెను.

రాజునెడల విశ్వాసము విడువకున్నవాఁ డొక్కసుమంత్రుఁడే కాఁడు. చిత్రకేతుని యాస్థానమునందు పరిహాసకుఁడుగానున్న మతిమంతుఁ డనువాఁడుకూడ రాజును విడువక సేవచేయుచు యథాశక్తిని తోడుపడుచు, రాజు వ్యసనముగానున్నప్పు డెల్లను హాస్యవచనములను

చెప్పి నవ్వించి యుత్సాహము పుట్టించుచు, కొలుచుచుండెను. అతఁ డప్పుడప్పుడు భావిచింతలేక రాజ్యమును కూఁతుల కిచ్చివేసిన యవివేక మునుగూర్చి రాజును మొగము ముందఱనే పరిహాసము చేయుచు, చిత్రాంగియెదుటకూడ నామెకు తాఁకునట్లుగా నెగతాళి చేయుచు, వినోదకరమయినకథలు చెప్పుచు, కోయిలగుడ్లను పిల్లలుచేసి పెంచి పెద్దవయినతరువాత వానిచేత తన్నులుతిన్న కాకిబ్రతుకు సంభవించిన దని రాజునాక్షేపించుచు, సింహము ముసలిదయినందున కుక్కలు మీఁదికెక్కి స్వారిచేయ సంభవించినదని కూఁతుల నెత్తిపొడుచుచు, పరిహాసకుఁడు గనుక స్వేచ్ఛగా విహరించుచుండెను.

మతిమాలిన యీరాజున కయోగ్యురాలయిన కొమార్తెవలనఁ గలిగిన మనస్తాపము, గౌరవము నానాటికి తగ్గుచు వచ్చినందువలనను అనాదరము కలిగినందువలనను మాత్రమే కలిగినదికాదు. ఒకనాఁడు చిత్రాంగి తండ్రితో ప్రత్యక్షముగనే యామూఁడుగురు వీరభటులను విడిచిపెట్టకపోయినయెడల తన నగరునం దాఁత దుండుటయే పొసఁగ దనియు అంతమంది సేవకుల నుంచుకొనుట వృధావ్యయమునకు కారణమగుటయేకాక నిరుపయోగముకూడ నగుయు, వారుండుట రాజ మందిరమునందు తిని త్రాగి యల్లరిచేయుటకు హేతువగుననియు వారి నందఱిని పనినుండి తొలఁగించి తనయీడుకు తగినట్టుగా ముసలివాం డ్రను కొందఱిని సేవకులనుగా నుంచుకొన్న చాలు ననియు, స్పష్ట ముగా చెప్పివేసెను. రాజునకు మొట్టమొదట తాను కన్నకూఁతురే యింతక్రూరముగా చెప్పునని నమ్మకము తోఁచక తనకన్నులయం దును చెవులయందునే విశ్వాసము లేకపోయెను. తనయొద్దనుండి సింహాసనముపొందిన యీమెయే కృతజ్ఞతలేక తనయొద్దనున్న యల్ప సంఖ్యాకులయిన భటులపోషణము భారముగానెంచుననియు, తన పెద్ద తనమునకు తగినగౌరవము నిలుపుట కసూయపడుననియు, అతని

హృదయమునకు విశ్వాసముకలుగలేదు. కాని యామెతనపట్టును విడువక మరలమరల తనమూర్ఖవాక్యములనే పలుమాఱు పలికి నిర్బంధించుచు వచ్చుటవలన, అతఁడత్యాగ్రహవ్యగ్రుఁడయి దేహము తెలియక నోరికి వచ్చినట్లెల్లను కోమార్తెను తిట్టి మోసకత్తెయనియు కల్లలకు పుట్టిని ల్లనియు నామెను బహువిధముల దూషించెను. ఆమెకల్లలకు జన్మ స్థాన మగుటయు వంచకురా లగుటయు సత్యమే. రాజునొద్దనున్న నూఱుగురు సుభటులును యుక్తప్రవర్తనముగలవారును, పెద్దమను ష్యులును, ప్రభుభక్తి గలవారును, సేవానిపుణులును గాని వారియం దొక్కరును తిని, త్రాగి, యెల్లరిచేయువారులేరు. కోమార్తెయొక్క చెడుసడతవలన పుట్టినయాగ్రహమునురాజు వారించుకోలేక, తననూఱు గురు వీరభటులతోను తాను రెండవ కోమార్తెయింటికి పోవనిశ్చయిం చుకొని, తత్క్షణమే తేరికి గుఱ్ఱములనుకట్టనియమించి, నోరి కసితీఱ కోమార్తెను కృతఘ్నురాలనియు, రాతిగుండె రాకాసి యనియు, ఘాతుకమృగ మనియు దూషించి, ఆమె కెప్పుడును సంతానము కలుగ కుండునుగాక యనియు, ఒకవేళ కలిగినయెడల తనకుఁగలిగినపాట్లే బిడ్డలవలన నామెకును కలుగునుగాక యనియు, కృతజ్ఞతలేనిబిడ్డ విష సర్పమునకన్న క్రూరమయినదని యనుభవ మగుఁగాక యనియు, కర్ణ కఠోరముగా శపించెను. ఈసంగతి విని చిత్రాంగిభర్తయైనశ్రుతకీర్తి వచ్చి తనకీసంగతి యేమియు తెలియ దనియు, తన్నుమన్నించియిందు నిలువవలయు ననియు ప్రార్థించెను గాని రాజాతనిమాటలనువినక గుఱ్ఱ ములుకట్టించి యప్పుడె తన నూఱుగురభటులతోను ద్వితీయపుత్రిక యైన మధువాణియింటికి బయలుదేఱెను. ఇప్పుడు జరిగినదానిని బట్టి చూడఁగా కళావతిచేసినది యేమితప్పిత మని రాజప్పుడు తలఁచుకొని దుఃఖపడెను.

మధువాణియు పెనిమిటియు మహావైభవముతో రాజ్యభోగము ననుభవించుచుండిరి. తానును తనభటులును వెళ్ళినప్పు డెదురుగా వచ్చి యర్హగౌరవముతో తీసికొనిపోవుట కవకాశము కలుగుటకయి జాబులువ్రాసియిచ్చి రాజు ముందుగా విశ్వాసిని మధువాణి యూరికిఁ బంపెను. చిత్రాంగి తానుకూడ ప్రయాణమయి ముందుగా జాబువ్రాసి మనుష్యులకుబంపి, తండ్రియొక్క చిరాకును మతిమాలిన తనమును నిందించుచు, అంతమంది సేవకులతో వచ్చుట కంగీకరింపవలదని చెల్లెలికి తెలియఁజేసెను. ఈలేఖ తెచ్చినవాఁడును విశ్వాసి వచ్చినప్పుడే రాఁదటస్థించినందున వారిద్దఱును నొకచోటఁగలిసికొనిరి. ఆకమ్మను తెచ్చినవాఁడు తనపూర్వశత్రువయిన వెచ్చములు తెచ్చెడి యుద్యోగస్థుఁడే యయినందున విశ్వాసి కోపముపట్టలేక వానిని దూషించి, పోట్లాటకు రమ్మని పిలిచి యాతఁడు రానందున మర్యాదలు తెచ్చి మనస్తాపము పెంచవచ్చినయీదుష్టాత్ముని పట్టుకొని దిట్టముగా కొట్టెను. ఈసంగతి మధువాణికిని భర్తకును తెలిసి, అతఁడు రాజువద్దనుండి వచ్చిన దూతయనియు అందుచేత గౌరవార్హుఁ డనియు విచారింపక వారావిశ్వాసిని బొండలో వేయించిరి. కాఁబట్టి రాజు కోటలో ప్రవేశింపఁగానే మొట్టమొదట తెలిసినసంగతి విశ్వాసపాత్రుఁ డయిన తన ప్రియభృత్యుఁ డవమానకరమయినదురవస్థలో నుండుట.

ఆతఁ డెదురుచూచుచున్న యాగమనోత్సవమునకు మొట్టమొదట నే యిదియొక యశుభసూచక మయ్యెను; కాని తరువాత జరిగినది యింతకంటెను విరుద్ధముగాఁ గనఁబడెను. రాజు తనయల్లుఁడును కూఁతురు నేమయినారని విచారింపఁగా వారు రాత్రియంతయు నిద్రలేక బడలియున్నారనియు, ఇప్పుడు వారిని చూచుటకు సమయము కాదనియు పరిచారకులు చెప్పిరి. అందుమీఁద రాజు మిక్కిలి కోపపడి వారిని తక్షణముతనవద్దకు తీసికొనిరావలసినదని కేకలు వేయఁగా

వారు తనకథను చెప్పి తండ్రిమీఁద చెల్లెలిమనస్సు విరసము చేయుటకయి వచ్చినచిత్రాంగితోఁ గూడ రాజును తోడుకొని పోవుటకయి యెదురుగా వచ్చిరి. చిత్రాంగి మొగము చూడఁగానే రాజుమనస్సు నిప్పులే కయే దహించుకొనిపోవ మొదలుపెట్టెను, పెద్దకొమార్తె ముఖావలోకనమాత్రమున నే కష్టములంటగానున్న రాజున కప్పుడు మధువాణి యప్పగారి నాదరముతో చెట్టఁబట్టుకొనివచ్చుట చూడఁగా కన్నులకు మఱింత వేధ కలిగి, 'నా మొగముచూచుటకు నీ కింకను సిగ్గు కలుగ లేదా?' యని చిత్రాంగితోనవెను. అప్పుడుమధువాణి తండ్రినిజూచి, చిత్రాంగితోఁగూడ మరలనింటికి పోయి యిప్పుడున్న సేవకులలోసగము మందిని తగ్గించి నెమ్మదిగా నుండవలసిన దనియు, తనమాటవిని యప్పగారి క్షమను వేడుకొని పెద్దతనమగుటచేత మతిచెడియుండును. గనుక చిన్నలయి మతిమంతు లయియున్న వారియాలోచన విని వారు చెప్పిన ప్రకారముగా బుద్ధి కలిగి నడుచుకోవలసిన దనియు, హితబోధ చేసెను. అతఁడుతనకొమార్తె కాళ్ళమీఁదఁబడి యన్నవస్త్రముల కొఱకు వేడుకొనుట మానవంతున కెంతసిగ్గుపాటుగానుండునో తెలిపి, తన నూఱుగురుభటులతోను ఇక్కడనే యుండునుగాని మరలచిత్రాంగి యింటికి పోయి స్వభావవిరుద్ధమయినయటువంటి నైచ్యమున కెన్నఁడును లోఁబడి యుండనని తనమనోనిశ్చయమును చెప్పెను. అంతేకాక యాతఁడు 'నాయర్ధరాజ్యమును పుచ్చుకొన్నమాట నీవు మఱచి యుండ' వనియు; 'నీచూపు చిత్రాంగిదృష్టివలె క్రూరముగా నుండక శాంతముగాను కరుణార్ద్రముగాను కనఁడుచున్న' దనియు, అందుచేత నిక్కడనేయుండెదననియు చెప్పి, భృత్యవర్గములో నర్ధభాగమును విడిచి చిత్రాంగియింటికి మరలపోవుటకంటె కోసలదేశమునకుపోయి యరణములేకుండ తనచిన్నకొమార్తెనువివాహముచేసికొన్న చిన్నయల్లుని జీవ

నార్థముగా మానాశన మేర్పఱుపుమని వేఁడుకొనుటమైననుమ హా_త్తమ ముగా తోఁచుచున్నదనియు, చెప్పెను.

కాని యతఁడు తన్ను చిత్రాంగికంటె మధువాణి యధికాదరణ చేయునని తలఁచుకొనుటలో మాత్రము మిక్కిలి పొరపడినాఁడు. ఈమె పితృద్రోహమునం దప్పగారిని మించ ప్రయత్నించుచున్నదేమో యను నట్లుగా, తన యభిప్రాయమునం దేఁబదిభటులయినను అత్యధికమే యనియు, సేవ కిరువదియైదుగురే చాలుదురనియు, చెప్పెను. అప్పుడు రాజించుమించుగా మనసు విఱిగినవాఁడయి చిత్రాంగివంకతిరిగి యేఁబది మంది యిరువదియైదుగురుకంటె ద్విగుణముగుటనుబట్టి నీప్రేమ నీచెల్లెలి ప్రేమకంటె ద్విగుణముగా నుండునుగాన నేను నీవెంటనే వచ్చెద నని పలికెను. 'నీకుపచారము చేయుటకయి నాసేవకులుండఁగా ఇరువది యైదుగురుగాని పదుగురుగాని తుదకయిదుగురు గాని ప్రత్యేకముగా నేలకావలెను?' అని చిత్రాంగి యప్పుడు మాఱుపలికెను. ఈ యిద్దఱు దుష్టపుత్రికలునుతమకంతటిమహోపకారము చేసినతండ్రివిషయమున క్రూరత్వముచే నొకరినొకరు మించవలెనని పంతముపట్టినట్టుగా, తాను పూర్వము గొప్పదేశమును పరిపాలించినకిరీటాధిపతి యని సూచించుట కయి యుంచుకొన్న యాయత్యల్పపరివారమును, రాజచిహ్నములును కూడ వలదని యొకరితరువాత నొకరు క్రమముగా నిరాకరించిరి. ఆయనసుఖమున కావీరభటు లావశ్యకముకాదుకాని, రాజయినవాఁ డొక్కసారిగా బిచ్చగాఁడగుటయు, లక్షలకొలఁదిజనులపయినధికారము చెల్లింప నలవాటుపడినవాఁడు పిలిచిన నోయను నొక్క సేవకుని నైన లేకయుండుటయు, ఎంతకష్టముగానుండును! అట్టిసేవకులు లేకపోవుట యందలి ఖేదముకంటెను తనకుముద్దుకూఁతులే యామాటలు చెప్పుట వలనఁ గలిగినఖేదము దుర్వారమయి యదృష్టహీనుఁడయిన యారాజు మనసున నాటుకొని శూలమువలె వేధింపఁసాగెను. ఈప్రకారముగా

నిర్దయీవలనను అనాదరమును అగౌరవమును కలుగఁగా ముందు విచారింపక రాజ్యమును తెలివితక్కువచేత నిచ్చివేసినందులకు పశ్చాత్తప్తుఁడయి యేమిచేయుటకును తోఁచక మతిపోయి కొమార్తెలమీఁద పగసాధించి లోకమునందలి దుష్టురాండ్ర కందఱికిని బుద్ధివచ్చునట్లు చేసెదనని యతఁడప్పుడు శపథములు పలుకసాగెను.

ఈప్రకారముగా నావృద్ధరాజు తనశక్తిలోలేని ప్రయోజనము మాలినబెదరింపులను బెదరింపుచుండఁగా నింతలో రాత్రియయి యురుములతోను మెఱుములతోను గొప్పగాలివాన పట్టి కుంభవృష్టిగా వర్షము కురియనారంభించెను. ఆతని కొమార్తెలింకను సేవకులను తీసివేయవలసినదన్న తమపట్టును విడువనందున, కృతఘ్నురాండ్రయిన కూఁతులతోకూడి వారియింటనుండుటకన్న నటువంటి గాలివానలో నిల్లువిడిచి లేచిపోవుటయే యుచితమని చెప్పి యతఁడు గుఱ్ఱములను కట్టించెను. కొమార్తెలును వారువారు బుద్ధిపూర్వకముగా తెచ్చిపెట్టికొన్న దోషఫలమనుభవించినంగాని బుద్ధిరాదనిచెప్పి వారింపక యూరకుండిరి.

అప్పు డోరుగాలి యపరిమితముగా వీచుచుండెను. వర్షము నంతకంతకు హెచ్చుకాసాగెను. అటువంటి ఘోరమయిన గాలివానలో నతఁడు క్రౌర్యమునందు తనకొమార్తెలతో సాటిరాఁజాలని యాజలవాయుభూతములతో పోరాడుచు బయలుదేఱెను. అతఁడు కొన్నికోసులు నడుచువఱకును నొక్కపాదయయినను కంటికగపడలేదు. అంధకారబంధురమయిన రాత్రియం దతఁడొంటిగా గాలిదెబ్బకును వానదెబ్బకును లక్ష్యముచేయక బట్టబయలున సంచరించుచు, కృతజ్ఞతలేని మనుష్యజాతిపురుగుయొక్క యానవాలు భూమిమీఁద లేకుండునట్లుగా భూమిని సముద్రములో ముంచివేయవలసిన దనియు లేనియెడల సముద్రమును తెచ్చి భూమిని జలమయముగా చేయవలసినదనియు గాలి

దేవుని బ్రార్థింప మొదలుపెట్టెను. ఈగాలివానలో సహితము పరిహాసకుఁడయిన మతిమంతుఁ డొక్కఁడుమాత్రము రాజు వెంబడినుండి, చమత్కారవాక్యము లాడి రాజునకు దుఃఖశాంతి చేయుటకయి ప్రయత్నించుచుండెను.

మహారాజుగానుండిన యాతఁడీప్రకారముగా దిక్కులేక తిరుగుచుండఁగా రాజు తానెవరో తెలిసికోలేకపోయినను విశ్వాసిగా మాఱియున్న పరమవిశ్వాసిమైన యాసుమంత్రుఁడు రాజునుచేరి, "అయ్యో! చీఁకటిలో నీక్కిట్లు తిరుగవలసినగతి పట్టెనదా? రాత్రులయందు తిరుగవలవాటుపడి చీకటిని ప్రేమించువారు సహితమిటువంటి రాత్రి నెప్పుడునుగోరరు. భయంకరమయిన యీగాలివాన మృగములను సహితము మఱుఁగున దూరి దాఁగునట్లుచేసినది. అటువంటిస్థితిలో మనుష్యుఁడిటువంటి కష్టములకు సహింపఁగలుగునా ?" అనిచెప్పెను. చిత్రకేతుఁడాతనిని దూషించి 'ఓయి వెఱ్ఱివాఁడా! గొప్పకష్టములు మనస్సును బాధించుచున్నప్పు డీయల్పకష్టములు దానికి తోఁచునా? మనస్సు నెమ్మదిగానున్నప్పుడుగదా దేహసౌఖ్యములనుగుఱించి యాలోచించుట కవకాశముకలుగును. మనస్సులోనే గాలివానపట్టియున్నప్పుడాయొక్కబాధమాత్రమే కాక యీపయిగాలివానలన్నియు నింద్రియగోచరములగునా ?' యని పలికి, అటుతరువాత కూఁతులకృతఘ్నతను గుఱించి మాటాడి, "నోటికన్నము నందిచ్చినపాపమునకయి చేతిని తెగఁగొట్టుకవలసినదే; నేను కొమార్తెలకన్నముపెట్టి పోషించినందునకయి నాకీదుర్దశ పట్టవలసినదే" అని తన్ను తాను నిందించుకొనెను.

అప్పుడు విశ్వాసి బట్టబయలున గాలిలో తిరుగవలదని బహువిధములఁ బ్రార్థించి, చిట్టచివర కాసమీపముననున్న యొక చిన్నసత్రములోనికి వచ్చునట్లు రాజు నొడఁబఱిచెను. మతిమంతుఁడు ముందుగా సత్రములో బ్రవేశించి చూచి లోపల దయ్యమున్నదని యీవలికి

పరుగెత్తుకొనివచ్చెను. తరువాత వారందఱును లోపలికిపోయి పరీక్షించి చూడఁగా, ఆదయ్యామొక బిచ్చగాఁడయ్యెను. వాఁడర్ధరాత్రమున గాలివానలో తన తల దాఁచుకొనుటకయి యాసత్రములో దూరెను. ఇటువంటి బండవాండ్రు రోగమునుగాని పిచ్చితనముగాని నటించుచు, మేకులతోను ముండ్లతోను గీఱుకొని దేహము రక్తమువచ్చునట్లు చేయుచు మూఢులయినజనులను భయపెట్టియు బతిమాలియు శపించియు బలవంతముగా బిచ్చములుగొనుచు, ఇల్లువాఁకిలిలేక దేశమంతటను తిరుగుచుందురు. కప్పుకొనుటకు మంచిబట్టయయినను లేక గాలిలో వడవడవడఁకుచున్న యాభిక్షుకునిదుస్థితిని జూచి రాజు వాఁడును తనకున్న సొత్తంతయు కొమార్తెలపాలుచేసి జోగియయి యిటువంటి దురవస్థను తెచ్చిపెట్టుకొని యున్నవాఁడే యని తలఁచెను. కృతఘ్నురాండ్రయిన కొమార్తెలు కలిగియుండినంగాని మఱియొక విధముగా మనుష్యునకిటువంటి కష్టదశ యెన్నఁడును సంప్రాప్తము కానేరదని రాజప్పుడభిప్రాయపడియుండెను.

ఇటువంటి వెఱ్ఱిమాటలనేకములు రాజు పలుకుచుండుటచూచి, పుత్రికలయనాదరమువలన నాతనికి మతిభ్రమణము కలిగినదనియు స్థిరచిత్తుఁడయి యుండలేదనియు తెలిసికొని, ప్రభుభక్తికలిగి తనయందు విశేషగౌరవముగల కొందఱు కాపులసాహాయ్యముచేత రాజును కోసలదేశపుసరిహద్దునున్న రామపురమునకుఁజేర్చి తగినవారి నుపచారమునకు నియమించి రాజు సురక్షితుఁడుగానున్న తరువాత సుమంత్రుఁడు తాను బయలుదేఱి యీసంగతిని కళావతికి తెలుపుటకయి యయోధ్యానగరమునకు పోయెను. అతఁడక్కడకుపోయి వృద్ధరాజునకు సంభవించిన దుర్దశను మనసు కరఁగునట్లు విన్నపముచేయఁగా, కళావతి మిక్కిలి దుఃఖించి భర్తను వేఁడుకొని తాను సేనలతోపోయి యప్పలను వారిభర్తలను జయించి తండ్రికి మరల సింహాసనము నిప్పించి

వచ్చునట్లు సమ్మతిపఱిచి, కురుదేశమును జయించుటకు చాలినంత చతురంగబలముతో సుమంత్రునివెంట దండయాత్ర వెడలి యుక్త కాలములో రామపురమువచ్చి చేరెను. ఈలోపల రాజుతనసంరక్షణార్థ మయి సుమంత్రుఁ డప్పగించిపోయిన కావలివారి నేలాగుననో తప్పించుకొనిపోయి, వెఱ్ఱిపాటలు పాడుచు, అడవిపువ్వులతో కిరీటము చేసికొని శిరస్సున ధరించి రాజునని చెప్పుకొనుచు, నరిపొలములలో తిరుగుచుండఁగాఁ జూచి కళావతియొక్క సైనికు లాతని తమ రాణిశి బిరమునకు తీసికొనివచ్చి సమర్పించిరి. కళావతి తండ్రిని దర్శింపవలెనని యెంతయుభిలాష కలదయినను, అప్పుడు చూచుట శుభదాయకము కాదనియు నిద్రపోయి లేచి మందులబలముచేత కొంత మనస్స్థైర్యము పొందినతరువాత చూచుట యుచితమనియు వైద్యులు చెప్పుటచేత తండ్రినొకగదిలో పరుండఁబెట్టించి వైద్యులచేత తగిన చికిత్సలుచేయించుచు, తండ్రినిమరల స్వస్థచిత్తునిగాఁ జేసినపక్షమున వారికి తనశరీర మునందున్న యాభరణముల నన్నిఁటి నిచ్చెద నని వాగ్దానము చేసెను. ఈప్రకారముగా కొంతసే పుపచారములు చేసినతరువాత రాజు కొంతవ ఱకు కొమార్తెను చూడఁదగిన యవస్థకు వచ్చెను.

తండ్రిబిడ్డల సమావేశసమయమున జరిగిన సంభాషణము విన్న వారిహృదయములు నీరుగా కరుగకమానవు. అతనికితనప్రియపుత్రికను కన్నులు చల్లగా మరల చూడఁగలిగినందుకు సంతోషమును, చిన్న తప్పిదమునిమిత్తమయి ముందు వెనుకలు విచారింపక నిష్కారణముగా తానన్యాయముచేసి వెడలనడఁచినకూఁతురే కష్టకాలమున నక్కఱకు వచ్చి పుత్రికాస్నేహమును కనబఱచుచున్నందుకు లజ్జయు, హృదయ ములో పెరిగొనఁజొచ్చెను. ఈలజ్జా ప్రమోదము లిదివఱకున్న చిత్త చాంచల్యమునకు తోడుపడి కొంతసే పాతఁడు తా నప్పు డెక్కడ నున్నాఁడో, తన్నంతప్రేమతో కౌఁగిలించికొని యాదరించుచున్న వా

రెవ్వరో తెలిసికోలేని యవస్థలో నుండెను. అప్పు డతఁడు చెంత నున్నవారిని జూచి తా నామెను కళావతినిగా భ్రమించుచున్నందుకు నవ్వవలదనిచెప్పి, అమ్మా! నేనుచేసిన యపరాధమును క్షమింపు మని కొమార్తెపాదములమీఁద పడఁబోయెను. ఇంతసేపును మోకారించుకొని కూరుచుండి యుపచారములు చేయుచు తండ్రి యాశీర్వాదమునకయి నిరీక్షించియున్న కళావతి యప్పుడు తండ్రిని పట్టుకొని లేవనెత్తి, ఆశీర్వాదమున కర్హురాలయిన తనకాళ్ళమీఁద పడఁబోవుట పెద్దవారి కుచితము కాదనియు, తానుప్రేమాస్పదురాలయిన కళావతియు ప్రియపుత్రికయు నగుటచేత మ్రొక్కుట తనకు ధర్మమనియు బహువిధములఁ జెప్పి తండ్రిని శాంతిపఱుపఁజూచెను. అంతేకాక తన్ను కఱువవచ్చిన శత్రువులకుక్కనైనను లోపలఁ జొచ్చినయెడల వెడలఁగొట్ట మనసుకొలుపరానియటువంటికంటికి రాత్రియందు వృద్ధుఁడయిన కన్నతండ్రిని దయమాలి యిలువెడలఁగొట్టినందునకయి తనయప్పలు సిగ్గుపడవలసియుండు ననియు, అటువంటికఠినురాండ్ర గర్వసంహారము చేసి పితృఋణమును బాపుకొనుటకయి సేనలతో కోసలదేశమునుండి వచ్చితిననియు, ఆమెతండ్రితో విన్నవించెను. అందుమీఁద నతఁడు తానువృద్ధుఁడును మతిపోయినవాఁడు నగుటవలన ఏమిచేయునదియు నెఱుఁగక చేసినయుపకారమును మఱచిపోయి క్షమింపవలయుననియు నీవునన్ను ద్వేషించినను ద్వేషించుటకు తగినహేతువున్నదికాని నీయప్పలకేదియు లేదనియు, చెప్పి దీనత్వముతో వేఁడుకొనెను. కళావతి తనయప్పలకు ద్వేషహేతు వెట్టులేదో యట్లే తనకును లేదనియు, తండ్రిని ప్రేమించుట పుత్రికాధర్మ మనియు, చెప్పి సర్వవిధములనాతనిని శాంతాత్ముని జేయుచుండెను.

ఇక్కడ నీవిధముగా మంచిమాటలచేతను, ఔషధసేవచేతను పథ్యపానములచేతను, ఇతరోపచారములచేతను కూఁతురుతండ్రికి సుఖా

భివృద్ధి చేయుచుండఁగాఁ అక్కడ కృతఘ్నతకు జన్మస్థానములయిన యప్పల స్థితిగతులను కొంతవిచారింతము. కన్నతండ్రియెడలనే ద్రోహముతలఁచినవారు చేసికొన్న భర్తలయెడలమాత్రము ద్రోహము తలఁపరనియెట్లు తలఁపవచ్చును? వారు పతిశుశ్రూషించు పతివ్రతాధర్మమును మఱచిపోయి కొంతకాలములోనే భర్తలయందలియనురాగమును విడిచినవారయి తమపాపిష్ట హృదయముల నన్యులమీఁద వ్యాపింపఁజేసిరి. దైవికముగా నక్కచెల్లెండ్ర యిద్దఱి హృదయములును యౌవనగర్వముచేతను సౌందర్యగర్వముచేతను కన్నుగానక తనయన్నయైనసత్యవిక్రముని మోసముచేసి రాజ్యము నాక్రమించుకొనియున్న మగధరాజయిన యొక్కసుందరాంగునియందే తగిలియుండెను. ఆకాలమునందు మధువాణియొక్క భర్త వీరవర్మ యాకస్మికముగా మరణము నొందినందున, ఆమె తనయప్పగారియింటికి పోయియుండెను. ఇద్దఱిమనస్సులు నొక్కరిమీఁదనే తగిలియుండుటనుబట్టి యసూయచేత చిత్రాంగి చెల్లెలికి రహస్యముగా నన్నములో విషముపెట్టింపఁగా మధువాణి మృతినొందెను ఈసంగతి యేలాగుననో బయలఁబడఁగా భర్తయైన శ్రుతకీర్తి యామెను చెఱసాలయందుఁ బెట్టించి, సుందరాంగునితోనామెకుఁగలిగిన చెడుసంబంధము తెలియరాఁగా భార్యను శిరశ్ఛేదము చేయించెను.

పాపాత్మురాండ్రయిన యాయిద్దరకును తగినట్టుగా దుర్మరణము సంభవించెనని యెల్లవారును సంతోషించుచుండఁగా నింతలోనే వారొకపాపపుమాటకూడ విని ఖేదపడవలసినవారయిరి. ఈలోకములో మంచితనమే యెల్లప్పుడును విజయము నొందదు. కొన్నిసమయములయందు త్తములును కష్టములను పొందుచుందురు. కళావతి సేనలతో వచ్చినసన్నసంగతి చారులవలనఁ దెలియఁగానే చిత్రాంగియు మధువాణియుసుందరాంగుని సేనాసమేతముగా చెల్లెలిమీఁదికిఁ బంపిరి. అప్పుడుభయసైన్యములకును ఘోరయుద్ధము జరుగఁగా కళావతి యబలయు

య్యును మహాపౌరుషము కనఁబఱిచి శత్రువులు వెఱఁగుపడునట్లు పోరి పితృకార్యార్థము ప్రాణముల నిచ్చి శత్రువులు సహితము వేయినోళ్ళ శ్లాఘింపఁ దుదకు వీరస్వర్గమును పొందవలసినదాయెను. ఆహా! ఎంతపు ణ్యాంగనకిట్టియకాలమరణము సంప్రాప్తమయినది! జగత్తులో దేవుని చర్య లద్భుతములుగదా! కొమార్తెమరణవార్త విన్నతరువాత ముసలి రాజును చిరకాలము జీవింపలేదు. అతనిమరణమునకు ముందు సుమం త్రుఁడు వచ్చి తనపేరు చెప్పి తానే విశ్వాసియనుపేర నింతకాల మాత నిని కొలిచియుండుట మొదలయిన సంగతులను జెప్పి యూరార్పఁ జూచెను గాని యామాటలవలన నేమియుఁ గార్యములేక యతఁడు కళావతిని తలఁచుకొని విలపించుచు ప్రాణములు విడిచెను. అటుతరు వాత ప్రభుభక్తియుక్తుఁడయినసుమంత్రుఁడును దీర్ఘవిచారముచేత తన స్వామిలోకమునే పొందెను.

అంతట సుందరాంగునియొక్క దౌర్జన్యమంతయు ప్రజలకు తెలిసి వారు తిరుగఁబడి చెఱలోనున్న సత్యవిక్రముని విడిపించి సాయము చేయఁగా వారిసాహాయ్యముచేత నతఁడు దండెత్తివచ్చి యుద్ధము చేసి సుందరాంగుని సంహరించెను. మామగారి విషయమయికాని కళావతి విషయమయికాని జరిగిన దౌర్జన్యములో నెంతమాత్రమునుచేరి యుండ నట్టియు; వారియవస్థను విని మిక్కిలి పరితపించినట్టియు శ్రుతకీర్తి కురు దేశమునకు రాజయి పాలనము చేయసాగెను.

సంపూర్ణము.

---

# దానకేసరివిలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ త్రి శే ష శై వ రా వు బ హ ద్దూ రు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

### ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 [illegible] నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

### వ చ న ప్ర బం ధ ము లు

### ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్

# దాసకేసరివిలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు

For favour of Exhibition

For Hithakarani Samaj.

Hon. Secretary



ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

1950

## ఈ కథయందు వచ్చుపాత్రములు

దానకేసరి—హస్తినాపురమునం దున్న యొకక్షత్రియప్రభువు.

సింహకేతుఁడు—దానకేసరివలన నుపకారముపొందినమిత్రుఁడు.

మిత్రప్రియుఁడు—దానకేసరికి ప్రియమిత్త్రుఁడు.

మతిమంతుఁడు—దానకేసరికి మఱియొకమిత్త్రుఁడు.

ధనపతి—దానకేసరి కింకొకమిత్త్రుఁడు.

హితకాముఁడు—దానకేసరికి హితసేవకుఁడు.

విక్రమసింహుఁడు—ఒకసేనాధిపతి.

# దానకేసరివిలాసము

హస్తినాపురమునందు దానకేసరియను మహాధనికుండైన రాజపుత్రుఁ డొకఁ డుండెను. తండ్రిమరణానంతరము గణనాతీత మయిన ధనమంతయు నాతనిచేతిలోఁ బడినందున, కీర్తికాముఁడయి నడివయస్సులో నున్నయాతనికి దానపరుఁడు కావలె నన్నబుద్ధి పుట్టెను. అపరిమిత మయినయాతనిధన మెంతదానము చేసినను తఱుగవలసినది కాదుగాని, అతఁడు సాధ్యమయినంతశీఘ్రముగా సమస్తమయినవారికిని నానావిధముల వ్యయపెట్ట నారంభించెను. ఆతని త్యాగశీలత వలన లాభము పొందినవా రొక్క బీదలుమాత్రమే కారు; ధనవంతులు సహిత మాతనికి భృత్యు లయి వెనువెంటఁ దిరుగుచు బహువిధముల నాతనిసంపద ననుభవించిరి. ఆతనియింట బీదలకు సంతర్పణములును భాగ్యవంతులకు విందులును ప్రతిదినమును జరుగుచునే యుండును. దివారాత్రములయం దెప్పు డేవేళకు వచ్చినను, అభ్యాగతులకుఁగాని యతిథులకుఁగాని యాతనిగృహమునం దన్నమున కేవిధమయిన యాటంకము లేదు. నిరుపమానమయిన యాతనియౌదార్యమువలనను ధనాతిశయమువలనను ముఖస్తుతి వ్రతపరాయణు లయిన యాచకశిఖామణులు మొదలుకొని మహాగంభీరు లయిన ప్రభురత్నములవఱకును గలపట్టణములోనివా రందఱు నాతనికి వశ్యులయి ప్రేమానుబంధమును గనఁబఱుచుచు, అనుసరించి, తిరుగుచుందురు. ప్రాపంచిక సుఖముల నన్నిటిని విడిచిపెట్టి ధనాశ లేక విరాగు లయినట్టు సంచరించెడు సన్న్యాసులుసహిత మనాహూతులయివచ్చి యాతనియింట యథేచ్ఛముగా పిండివంటలతోడ భిక్ష లారగించి పోవుచుందురు.

ఏకవీశ్వరుఁడయినను తనగ్రంథము లోకములో వ్యాపనము చెందవలెనని కోరికగలవాఁ డయినపక్షమున, అతఁడు దాని నాదాన కేసరి కంకితము చేసి యాతనివలన బహుధనవస్తువాహనములను పొందుటయేకాక యందువలన ఆపుస్తకమును సర్వజనాదరణపాత్ర మునుగాఁ జేసికొనుచుండును. ఏచిత్రకారుఁ డయిన తాను వ్రాసిన పట మమ్ముడు పోనిపక్షమున, వాఁడు దానిని దాన కేసరియొద్దకుఁ దెచ్చి పటముయొక్క యోగ్యతనుగ్రహించి యాదరింపఁగలిగినసరసు లు లోకములో మఱియొకరు లేరనికొంచెము స్తుతించినచో నిస్సందేహ ముగా దాని కెంతవెలయైననువచ్చును. ఏవర్తకుఁడయినను సామాన్య సంసారులు కొనలేనివస్త్రాభరణములుగాని వింతవస్తువులుగాని తన వద్దకు వచ్చినప్పుడు వాఁడు వానిని తిన్నగా దాన కేసరిసన్నిధికిఁ గొని వచ్చి యటువంటియపరూప మయినయమూల్యవస్తువును ముందుగా నతనికిఁ జూపక యితరులకు విక్రయింపలేనివానివలె నటించి యావస్తు వాతని కంటఁగట్టి యభీష్టలాభమును పొందుచుండును. ఇట్టివస్తువుల వలన ప్రయోజన మేమియు లేకపోయినను, తెచ్చినదానినెల్ల కొను చుండుటచేత నుపయుక్తములుకాని యిట్టివస్తువులతో గృహమంతయు మాత్రము నిండి కాలుపెట్టుట కెడము లేకుండెను. ఈప్రకారముగా ఇబ్బంది కలుగఁజేయుచుండిన విట్టియచేతనవస్తువులుమాత్రమే కావు. దర్శనార్థము నిత్యమును విజయముచేసెడుచేతను లయినసోమరిప్రభువు లును, నిరక్షరకుక్షు లయిన మహాకవీశ్వరులును, చిత్రవిద్యాకుశలులు గాని యపూర్వచిత్రకాదులును, పనిపాటులు లేనియిటువంటి పలు తెగల యితరమహానుభావులును, ముఖస్తుతులయందుఁ దమకుఁగల నిరుపమాన పాండిత్యమును గనఁబఱుచుచు, స్తోత్రపాఠములతో నాతనిని స్వర్గలోకమున కెక్కించుచు, అమ్మెడువస్తువులలో సారము

లేనందున తమమాటలనే యెక్కువవెలకు విక్రయించుచు బెల్లము నీఁగలు ముసరినట్లు ముసరి యాతని బాధించు చుందురు. వీరిలో స్వేచ్ఛగా తమపూర్వు లార్జించినధనమును దుర్వినియోగము చేసి యప్పులపాలై చేసినయప్పులు తీర్చ లేకపోవుటచేత ఋణప్రదాతలచే చెఱసాలయందు పెట్టింపఁబడి దానకేసరిచే విడిపింపఁబడిన గొప్ప యింటిబిడ్డలును పలువు రున్నారు. అందుచేత వా రాతనియందు బద్ధానురాగము గలవా రయి యాతని నెప్పుడును విడువక సదా యనుసరించి తిరుగుచు, ధనసంపదయం దాతనితో సమానులుకాలేక పోయినను, అతివ్యయమునందుమాత్రము సమాను లగుచు, కష్టపడి సంపాదించినది గాక తేరగా వచ్చినదగుటచేత మిత్రునిధనమును స్వేచ్ఛగా వెచ్చపెట్టుచుందురు. ఈప్రకారముగాతమయాదాయమున కంటె నెక్కువగా వ్యయముచేయుమిత్రులలో నొక్కఁ డయినసింహా కేతుఁడు ఋణములపా లయినందున, మొన్న నీనడుమనే యాతని ఋణవిముక్తుని జేయుట కయి దానకేసరి వేయిరూపాయల నప్పుల వారి కిచ్చెను.

ఇటువంటి మిత్రకోటిలో మఱియొక తెగవారుకూడఁ గలరు. వారు తమయొద్ద నున్నయొకకుక్కమీఁదఁగాని గుఱ్ఱముమీఁదఁగాని మఱియొకవస్తువుమీఁదఁగాని దానకేసరికి మనసుతగిలినట్టు కనఁబడఁ గానే యావస్తువుయొక్క యోగ్యతను సహస్రగుణములవర్ణించితత్క్షణ మాతఁడు మక్కువపడినవస్తువు నాతనికి కానుకగా పంపి తా మతని గొప్పతనమునకు తగినట్టుగా నంతకంటె మంచివస్తువును పంపలేక పోయినందున కయి తమకుఁ గలవ్యసనమును తెలుపుచు, కాలక్రమమున తా మాతనికిచ్చినవస్తువువెలకంటె నూఱురెట్లుధనమాతనివలన లాగుచుందురు. ఇటువంటివారు తాము గౌరవముగలవా రయినట్లును

తా మిచ్చినవస్తువులకు వెలవుచ్చుకోనివా రయినట్టును పయికినటించుచున్నను, లోపల ధనాశ గలవా రయి తా మొకచిన్నవస్తువు నాతని కిచ్చి యాతనివలన నమూల్యరత్నాభరణాదులను బహుమానము పొందుచుందురు. ఈవిధముగా నీనడుమనే మిత్రప్రియుఁ డనునతఁడు కామధేనుసంతతి యని పొగడుచు నాతని కొకకపిలగోవును బంపెను; మఱియొకమిత్రుఁ డయిన మతిమంతుఁ డనునాతఁడు సింహముల నయినను వేఁటాడు నని పొగడుచు రెండుజాగిలపుపిల్లలను బంపెను; నిష్కపటస్వభావుఁ డయినదానకేసరి వారిదుస్స్వభావము గనిపెట్టలేక వారు తనకు నిజమయినమిత్రులనియు తనమీఁది నిర్వ్యాజప్రేమచేత తన కాజంతువులను బంపి రనియు విశ్వసించి వారుచేసిన బహుమానముల నంగీకరించి, ఏదోమిషమీఁద వారి కొకనాఁడు విందుచేసి వారిలో నొకనికి మంచివజ్రపుటుంగరమును మఱియొకని కాణిముత్యాలహారమును బహుమతులుచేసెను.

ఈమిత్రోత్తము లాయనవలన ధనాకర్షణమునకయి యనేక మార్గములు కనిపెట్టి యున్నారు. అందుఁ గొందఱు ముందుగాఁ దా మేమియుఁ బంపకయే తాముకన్నువేసిన వస్తువును సంపాదించుటకయి సమయము వేచి యది మంచివస్తు వనియు, దానిని గలవాఁడు ధన్యాత్ముఁ డనియు పొగడుచు, తన కావస్తువు కావలె నని ప్రత్యక్షముగాఁ జెప్పక తమ కావస్తువునందు మక్కువయున్నట్లు దానకేసరి గ్రహించునట్లుమాత్రము చేయుచుందురు. వారాయ లెఱుఁగనియా దానకేసరి వారి యభిప్రాయమును గనిపెట్టి కావలసినయెడల వా రావస్తువును దీసికోవచ్చు నని చెప్పఁగా, తమకు దానిమీఁద నభిలాషము లేనట్టు నటించుచు తాము దానిని నిరాకరించినపక్షమున నాతని మనస్సు చిన్నపోవునేమోయని యాతనిమీఁదియనుగ్రహము

చేతనే తా మది నిర్బంధముమీఁద నంగీకరించి తాము కన్ను వేసిన వస్తువునుకడ తేర్చుచుందురు. ఇట్టివంటి మిత్రశిఖామణులవలన దానకేసరికి లభించెడుప్రతిఫల మంతయు వ్యయప్రయాసములేని స్తోత్రపాఠములేకాని యంతకంటె మఱి యేదియు లేదు.

ఈప్రకారముగా దానకేసరి సొమ్మంతయు ముఖస్తుతిపరాయణులవిషయమున మాత్రమే వినియోగపడుచుండలేదు. అతఁడు శ్లాఘనీయములై నయుత్తమకార్యముల ననేకములను జేసియున్నాఁడు. అతఁడు యోగ్యులయినవారి వివాహకార్యములకును; అన్నసత్రములకును, విద్యాశాలలకును, కూడ విశేషధనమును వినియోగించెను. కాని యాతనివ్యయములో విశేషభాగము ముఖస్తోత్రములుచేయు వంచకులకును, కృత్రిమమిత్రులకును దుర్వినియోగమేయగుచుండెను. వారు వంచకు లనిమాత్ర మాతనికి తెలియదు. వారెప్పుడును అనుసరించి వెంటతిరుగుచుండుటచేత తనమీఁద వారికి నిజమయిన యనురాగమే కలదనియు వారు సదా స్తుతులు చేయుచుండుటచేత తన నడత మంచివారికి ప్రశంసనీయముగా నున్నందుననే వారు శ్లాఘించుచున్నారనియు, నమ్ముచు వచ్చెను. ఈస్తోత్రపాఠకులును మిత్రవేషధారులును చుట్టును జేరి ప్రతిదినమును సహపంక్తిని విందు లారగించుచు శ్లాఘించుచుండఁగా జూచుచున్న సంతోషములో నతఁడు నిజ మయినమిత్రులకును ముఖస్తుతిపరాయణులకును గలవ్యత్యాసమును గనిపెట్టలేకపోయెను. అంతేకాక యింతమంది మనసుకలిసిన సఖులు సౌభ్రాత్రముతో తన్నెప్పుడును విడువక యనుసరించుచు తనసుఖదుఃఖములకు పాలివారయి తన్ను ధన్యుని జేయుచుండఁగా కన్నులపండువుగాఁ జూచుచుండెడిభాగ్యమునకంటె లోకములో

మఱియేది కావలె నని భావించుకొని యతఁడు మనసులోపరమానంద భరితుఁ డగుచుండెను.

ధనలక్ష్మి తనయింట కాపురమున్న ట్లుండుటచేత నతఁడీ ప్రకారముగా దానధర్మములు చేయుచుముందుసంగతి యెంతమాత్ర మును విచారింపక తనధనము తఱుఁగక యెంతకాలముండునో యన్న యాలోచనయైనను లేక నిత్యమును విందులకొఱకును సంతర్పణముల కొఱకును దానములకొఱకును బహుమానములకొఱకును మితము తప్పి వ్యయము చేయుచు రాఁగా అక్షయములు కానందున క్రమక్ర మముగా పర్వతోపమానములైన యాతని ధనరాసులు సహితము క్షీణించి సన్నగిల్లసాగెను. ఈసమయములో నాతని క్షేమమునుగోరి నిజమయినస్థితిని దెలిపి యాతని కన్నుదెఱపి, అతివ్యయమునుండి మరలింపఁ గలవా రెవ్వరును గానఁబడలేదు. అతని నంధునిగానే యుంచి యాతనిదానములవలననే తాము బాగుపడ నపేక్షించెడు స్వప్రయోజనపరు లయినస్తుతిపాఠకులు మొదలైనవారు తమలాభ మునకు భంగము కలుగునట్లుగా నాతని కెప్పుడును హితము చెప్పరు. అయినను హితకాముఁడనెడు విశ్వాసియైనయొకభృత్యుఁడుమాత్రము సాహసముచేసి యాతని ప్రస్తుతస్థితిని దెలిపి వ్యయము తగ్గింపవలసిన దని బహువిధములఁ బ్రార్థించిచెప్పి తనయజమానుని దుర్వ్యయముల నుండి మరలింపఁ జూచెనుగాని, దానకేసరి తనసేవకుని హితబోధ యందు లక్ష్యముంచక యాతని మాటలను పెడచెవులఁ బెట్టెను. తుదకు హితకాముఁ డొంటిగానున్నప్పు డొకనాఁడు తనయజమానుని చెంతఁ జేరి యొక్కసారి యావ్యయములగూర్చినలెక్కల నైనను చూచుకోవలసిన దని బతిమాలి చెప్పెను. ఆహితోపదేశ మాతని చెవులకు రుచింపనందున నేను దెప్పు డయిన లెక్కలు చూచెద నని

యిప్పటి కేదో చెప్పి యాప్రసంగమును చాలించెనే కాని యతఁడు నిజస్థితి విచారించుట కెంతమాత్రమును ప్రయత్నించినవాఁడు కాఁడు. ధనికుఁడు తాను నిర్ధనుఁ డగుచున్నా నని తెలిసికొనఁ గోరకుండుట లోకస్వభావ మయియే యున్నది. అట్టివాఁడు నిజముగా తాను ధనహీనుఁ డగువఱకును పరులు చెప్పెడు మాటలను నమ్మఁడు. స్వామిహితార్థియైన యాహితకాముఁడు తనప్రభువు చెడిపోవుచున్నాఁ డన్న దుఃఖము మనస్సును బాధింపఁగా సహింపలేక, లోపల విందులును, సంగీతములును మహావైభవముతో జరుగుచున్నప్పుడు తానొక్క-డును దూరముగా నొక్కరహస్యస్థలమునకుఁబోయి తనయజమానుని వెట్టియీవిని దలఁచుకొని కొంతసేపు దుఃఖించి వచ్చుచుండును. ధనమువలనను వెట్టిదానములవలనను వచ్చెడి మిన్నుముట్టుచున్న యీముఖస్తుతు లన్నియు ధన ముడిగి దానములు కట్టుపడఁగానే యడుగంటి మూలపడు ననియు, ఇప్పుడీఁగలవలె ముసరుచున్న యా స్తోత్రపాఠకు లందఱును గాలి యెదురు తిరుగఁగానే నానాముఖముల చెదరిపోదు రనియు, అప్పుడు విందులతోఁ గూడిననిత్యోత్సవము లన్నియు నిత్యోపవాసములుగా మాఱవలసి వచ్చు ననియు, పరిపరి విధముల చింతించి హితకాముఁడు తనయజమానునినిమిత్తము కన్నుల నీరు పెట్టుకొనుచుండును.

ఇట్లుండఁగా నత్యల్పకాలములోనే దానకేసరికి హితకాముని మాటలను వినవలసినయవస్థయు సంభవించినది. ఇంట నున్నదొక్క-మంతయు కడతేఱినది; భూములమీఁద ముందు వచ్చెడుపంటలలో తీర్చుకొనెడిపద్ధతిని కాపులవద్ద పుచ్చుకొన్న సొమ్మును వ్యయపడి పోయినది; అఱవు తెప్పించిన వస్తువులకయి యంగళ్ళవాండ్ర కియ్య వలసిన ధనము తనకున్న చరస్థిరరూప మయిన సొత్తును మించిపోయి

నదు. ఇంట నున్న వెండిబంగారపువస్తువులును విక్రయించినవి పోఁగా మిగిలినవి. తాకట్టు పడినవి అట్టిస్థితిలో దానకేసరి హితకామునిఁ బిలిచి కొన్ని మాన్యములు విక్రయించి ధనము తేవలసినదని చెప్పగా అతఁ డీవఱకుచేసిన ఋణములమొత్తమే మాన్యముల నన్నిటిని విక్రయించివేసినను తీఱదని చెప్పినప్పుడు దానకేసరి యత్యాశ్చర్యపడి మనకు నూఱుపుట్ల పంటభూమియు లెక్కలేని తోఁటలును ఉన్నవి కావా యని పలికెను. "ప్రపంచమంతయు నున్నను, దానికి సహితము పరిమితియున్నది కాని లేకపోలేదు. వెనుకముందులు చూడక దానము చేయ మొదలుపెట్టినపక్షమున కొంతకాలములో ప్రపంచమంతయు తఱిగిపోవును. అట్టిస్థితిలో మీరుచేసెడు వ్యయములకు మీభూము లేమిలెక్క?" అని యతఁడు సమాధానము చెప్పెను.

అప్పుడును దానకేసరి విచారపడక తాను ధనమును దానధర్మములకొఱకును మిత్రసంతోషముకొఱకును వినియోగించితిని గాని తుచ్ఛములయిన యింద్రియసుఖములకొఱకును దుర్మార్గపుకార్యములకొఱకును పాడుచేయలేదుగదా యని మనస్సులో నొకవిధమైన తృప్తిని గలుగఁజేసికొని ధైర్య మవలంబించి యుండెను అయినను హితకాముఁడుమాత్రము తనయజమానుని స్థితిని దలంచుకొని దుఃఖింపసాగెను. అది చూచి దానకేసరి తన కంతమంది మిత్రులుండఁగా విచారింపవలసినపని లేదనియు, తనవలన నుపకారమును పొందిన గణనాతీత మయిన మిత్రసంఘము తనస్థితిని తెలుపుటయే తడవుగా తనకు వలసిన సహాయ్యమును బంపి తనగౌరవమును కాపాడుటకు సిద్ధముగా నుందురనియు, చెప్పి యాతని నోదార్చెను. ఇట్లు పయికిఁ జెప్పుటమాత్రమే కాక దానకేసరి మనస్సులోఁకూడఁ గలిగి యున్న కాలములో తనవలన లాభమును పొందినవా రందఱును

తప్పక తన కాపత్సమయములో నక్కఱకు వత్తురని దృఢముగా నమ్మినవాఁడయి వెనుకటికాలములో తనవలన విశేషలాభమును పొందినమిత్రప్రియుఁడు, మతిమంతుఁడు, ధనపతి మొదలయినవారి యొద్దకును, కొంచెముకాలముక్రిందటనే యాతని యప్పు లన్నియుతీర్చి యాతనిని చెఱసాలనుండి తప్పించినసింహకేతునకును, వర్తమానములు పంపెను. తక్కినవారివలెనే యిప్పుడు సింహకేతుఁడును తన పినతండ్రి మృతుఁడు కాఁగా నాతనిసొత్తంతయు తన్ను చేరినందున మహాధనికుఁడయి యుండెను. అందుచేత దానకేసరి యిప్పు డాతనిని తాను వెనుక ఋణవిముక్తునిగాఁ జేయుటకై యిచ్చినవేయిరూపాయలను మరల నిచ్చివేయుమని యడుగఁబంపి, తక్కినవారినితనకు చెఱిరెండేసివందలరూపాయలును బదు లడిగెను. అతఁ డిప్పు డడిగినది రెండేసివందలరూపాయలఋణమే యయినను వా రొక్కొక్క రీతనివలన దానికి పదిరెట్లుధనము ననుభవించి యున్నారు.

దానకేసరి పంపినమనుష్యుఁడు మొట్టమొదట మతిమంతుని యింటికి వెళ్ళెను. అతఁ డావఱకు దానకేసరి యింటనున్న యొక విచిత్రమయిన వెండిపళ్ళెముమీఁద కన్ను వేసి తుదకు దానియందు తనకు మక్కువ గలదనికూడ తెలిపియున్నందున, అది యెప్పుడువచ్చి తనయిల్లుచేరునాయన్నచింతతో నిద్రలోసహితము దానినే పలవరింపుచుండెను. ఇట్లుండఁగా దానకేసరి పంపినమనుష్యుఁ డక్కడకు పోయినందున వెండిపళ్లెము వానిచేతికిచ్చి పంపెనేమోయని యులికిపడిలేచి వచ్చియేమిసమాచారమనియడిగెను. వాఁడుతనయజమానునియొక్క స్థితినిజెప్పి కొంతసొమ్ము బదు లడిగితెచ్చుటకయి యాతఁడు పంపఁగా వచ్చితి నని చెప్పఁగానే యతనికి ముఖమునందు మునుపున్నకళపోయి వెలవెలపోయి యుత్సాహము తగ్గినవాఁడయి యాప్రకారముగానీతి

బోధకారంభించెను—"నీయజమానుఁడును చేయుచుండినయతివ్యయమునుబట్టి యతఁడు చెడిపోవునని నేను చిరకాలముక్రిందటనే కనిపెట్టి, ఈసంగతి యాతనితో చెప్పవలె నని యుద్దేశించుకొని భోజనమున కనెడిమిషమీఁద తఱుచుగా నే నాతనియింటికి వెళ్ళుచుండెడివాఁడను. అయినను నీ విఁకముం దీయమితవ్యయమును గట్టిపెట్టి పొదుపుగా వాడుకోకపోయినపక్షమున శీఘ్రకాలములోనే చెడిపోదువని చెప్పుటకు చూచినప్పుడెల్లను మాట నానాలుకచివరకు వచ్చుచుండెడిది కాని యామాటవల్ల నాతనిమనసు చిన్నపోవునేమోయని తలఁచి యాతనియందు నా కున్నగౌరవమునుబట్టి మరల మరలించుకొనుచుండెడివాఁడను. అంతేకాక నేను వృథాగా మాటచెలుపుకొనుటయేకానీ నాహితోపదేశము నతఁడు చెవినిబెట్టఁ డని కూడ తోఁచి నేను విరక్తి చేసికొని యూరకుండెడివాఁడను."—ఈమాటలలో మతిమంతుఁడు తఱుచుగా విందు లారగించుటకు విజయంచేయుచు వచ్చినమాట సత్యమే కానిదానకేసరికిహితోపదేశముచేయనుద్యుక్తుఁడనయి వెళ్ళితి నన్నమాటమాత్రముసత్యముకాదు. అతనికిహితోపదేశమును జేయుటకుమాఱుగా నితఁడును, ఈతనివంటిమహానుభావులు మఱికొందఱును సదా యాతనిని ముఖస్తుతులు చేయుచు, ఆతనియౌదార్యమును శ్లాఘించుచు, అతివ్యయము చేయుటకై యాతనిని మఱింత ప్రోత్సాహపఱుచుచుండెడివారు, మిత్రునిక్షేమమునం దింతయాసక్తిగల యీమహాపురుషుఁ డిప్పు డీవచ్చిన మనుష్యునిచేతిలో రెండురూపాయలుపెట్టి మతిమంతుఁ డింటలేఁ డని చెప్పవలసిన దని చెప్పి వానిని బంపివేసెను.

ఈప్రకారముగా నే మిత్రప్రియునియొద్దకు వెళ్ళినమనుష్యుఁడును తనయజమానునివద్దకు వట్టిచేతులతో నేవచ్చెను. దానకేసరిచేసిన

విందులతోనే పెరిఁగి యాతఁడు చేసినబహుమానములతోనే మహా ధనికుఁడై నయామిత్రిప్రియుఁడు దానకేసరికి బదులుకావలసి వచ్చిన దన్నమాట మొట్టమొదట నమ్మలేదుగాని, ఆతనిస్థితి చెడిపోయిన మాట వచ్చినసేవకుఁడు నమ్మకము పుట్టునట్లు చెప్పినమీఁదట తన కెంతోవ్యసనము కలిగినట్లు నటించి యిట్టికష్టసమయములో తనప్రాణ మిత్రునకు సహాయపడలేని దురవస్థ తనకు సంభవించిన దని చెప్పి నొచ్చుకొనసాగెను. "ఓయీ! దానకేసరికిని నాకును దేహములే వేఱు కాని ప్రాణ మొక్కటియే సుమా! నాసుఖము నయినమానుకొని నాప్రాణమిత్రుఁ డయినదానకేసరియొక్క సుఖమునిమిత్త మయి నేను నాసర్వస్వమ్మును వినియోగింపవలసినవాఁడను. అయినను నా కటువంటిమిత్రోత్తమునికి సహాయము చేయలేక కృతఘ్నుఁడను కావలసినదుర్దశ యిప్పుడు పట్టినందుకు నాకెంతో దుఃఖ మగుచున్నది. ఒకభూమిని కొనుటకయి మొన్నటిదినముననే నేను నావద్ద నున్నసొమ్మంతయుఁ బంపివేయుటయే కాక కొంతఋణముకూడ చేయవలసి వచ్చినది. అయ్యో! మిత్రకార్యము నింతమాత్రము చేయలేకపోవు చున్నానుగదా యని నామనస్సులో నాకేలజ్జపుట్టి జీవచ్ఛవము నయి యున్నాను. ధన మున్నపక్షమున కష్టసమయములో ప్రాణాధికుఁ డయినమిత్రోత్తమునకు సాహాయ్యము చేయఁగలుగుటకంటె సంతోషకర మయినకార్యము నాకు మఱియొకటి లేదు" అని క్రియలేనిపాడి మాట లనేకములు చెప్పి యతఁడు తాను నిజముగా వ్యసనపడుచున్న వానివలె నటింపసాగెను. అతఁడు క్రొత్తగా భూములు కొన్నందున కెంతమాత్రమును సందేహము లేదుగాని తనయొద్దఁ బ్రస్తుతము సొమ్ములే దన్నమాటమాత్ర మబద్ధము.

ఇటువంటివంచకుల నెవ్వరైన మిత్రులని చెప్పఁగలరా? ముఖస్తుతులుచేయువారందఱును సామాన్యముగానిట్టివారుగానేయుందురు. దానకేసరి మిత్రప్రియునియందు పుత్రప్రేమ కలిగియుండెడివాఁడనియు, మిత్రప్రియుని ఋణముల నన్నిటిని తీర్చె ననియు, మేడకట్టుకొనుటకు సహాయము చేసెననియు, ఇంచుమించుగా ప్రతిదినమును వస్త్రభూషణాదిరూపమున నేదో బహుమానము చేయుచుండెననియు ఎల్లవారును నెఱుఁగుదురు. ఇటువంటి మహోపకారములను పొందిన పరమనీచుఁడయిన మిత్రప్రియుఁడు కృతఘ్నుఁ డయి తా నాతనివలన నీవఱకు నూఱురెట్లధికధనమును పొందినవాఁ డయ్యును తా నిప్పుడు శక్తుఁడయి యుండియు తనయుపకర్తకు కష్టకాలమందు ముష్టిరూపాయ లిన్నూఱు బదులీయ లేకపోయెను. దానకేసరి మనుష్యులను పంపిన ధనపతి మొదలయిన తక్కినవారందఱునుగూడ సామ్మియ్యక తప్పించుకొనుట కయి యేవో యిటువంటి ప్రత్యుత్తరములనే పంపిరి. దానకేసరియొక్క యౌదార్యమువలన కారాగృహమునుండి విముక్తుఁడయి యిప్పుడుమహా ధనికుఁ డయి యున్నసింహకేతుఁడు సహితము తన కతఁడు ధర్మార్థముగా నిచ్చిన రెండువేలరూపాయలను బదులుగా నిచ్చుట కయిన మనసురాక నిరాకరించెను.

ధనికుఁడుగా నున్నప్పు డాతనియింటిచుట్టును తిరుగుచుండెడి పెద్ద లందఱును బీదతనమురాగానే యిప్పుడు సాధ్యమయినంతవఱకాతనియింటిసమీపమునకుఁ బోవుటకే మానుకొన మొదలుపెట్టిరి. మహాదాత యనియు వితరణశాలి యనియు దయార్ద్రహృదయుఁడనియు పరోపకార శీలుఁ డనియు నాకాశ మంటునట్లుగా నిన్నటివఱకును దానకేసరిని స్తుతిచేయుచు వచ్చినపుణ్యపురుషులే యిప్పుడు సిగ్గుపడక నిన్నస్తుతిచేసిననోటితోనే నేఁడు దుర్వ్యయపరాయణుఁ

డనియు బుద్ధిహీనుఁ డనియు దూరాలోచన లేనివాఁ డనియు బహు విధముల నిందింపసాగిరి. ఆతనియం దొక్క లోపము మాత్రము నిజముగానే యున్నది. ఇట్టివంటివారిని తనమిత్రత్వమునకును దాతృత్వమునకును పాత్రభూతులనుగాఁ జేసికొనుటయే గొప్పబుద్ధి హీనత. ఇంతవఱకును నిరతాన్నప్రదానములతో నిండియుండిన దానకేసరిగృహ మిప్పుడు వేళకు వచ్చినయొక్క పరదేశికి పిలిచిపట్టె డన్నము పెట్టుటకు నోచుకొననిదయ్యెను. ఇప్పు డాగృహము మును పటివలె విందు లారగించెడివారితోను స్తోత్రపాఠములు చేయువారి తోను నిండియుండక మాఋణములు తీర్చవలయు ననియు మావడ్డి యియ్యవలయు ననియు కేకలువేసెడికఠినహృదయు లయినయప్పుల వారితోను వెచ్చము లిచ్చినవారితోను సందడిగా నుండెను. అందు చేత నాతని యిల్లిప్పుడు సుఖదాయకముగా నుండక యాతనిపాలిటి కొకగొప్ప చెఱసాలవలె నుండెను. ఒకఁడు వచ్చి తన యేఁబదిరూపా యలను ఇచ్చినదాఁక కదల నని చెప్పెను; ఇంకొకడువచ్చి తననూఱు రూపాయలును చేతిలో పడువఱకును అభోజనము కూరుచుండెద నని గుమ్మమున కడ్డముగా ప్రాణాచారము పడును; మఱియొకఁడు వచ్చి నాయినూ్నఱురూపాయలను ఇచ్చి మఱికదలు మని మెడలో చెయి వేసి నిలువఁ బెట్టును.

ఈప్రకారముగా నున్నస్థితిలో దానకేసరి మఱియొక్క గొప్ప విందు తలపెట్టి ఊర నున్న పెద్దమనుష్యుల కందఱికిని తనయింటభోజ నముచేసి త న్నాదరించి పోవలసిన దని యాహ్వానపత్రికలను బంపెను. అదిచూచి యెల్లవారును వింతపడి మరల నాతని కేదో రావలసినధనము వచ్చిన దని భావించి యుండిరి. ఆవిందునకు హాస్తి నాపురమునందుఁ గలప్రముఖు లందఱును విజయంచేసిరి. ఆవచ్చిన

వారిలో సింహకేతుఁడు మిత్రప్రియుఁడు, మతిమంతుఁడు, ధనపతి మొదలయినవా రందఱును నుండిరి. వారందఱును దానకేసరియొక్క బీదతనము నిజమయినది కాదనియు నెవ్వరెవ్వరికి తనమీఁద నెంతెంత ప్రేమ యున్నదో కష్టసమయమునం దెవ్వరెవ్వరే యేవిధముల సాహాయ్యము చేయుదురో పరీక్షించుటకయి యాతఁడీవేషము వేసె ననియు భావించుకొని, తాము మొట్టమొదటనే యీసంగతిని దెలిసికొని కావలసినంత ధనము నిచ్చెద మని బయలుదేఱలేకపోతిమి కదా యని విచారపడసాగిరి. అయినను వారీవఱకెండిపోయినదను కొన్నయూట యెండిపోకప్రవహించుచు మరలఁ దమ కుపయోగపడు చున్నందునకయి మనస్సులో సంతోషసంతోషపడిరి. కాఁబట్టి వారొక్కరొక్కరే దానకేసరియొద్దకు వెళ్ళి తమదురదృష్టవశముచేత నాతఁడడుగబంపినప్పుడే తమయొద్ద సొమ్ములేకపోయినందునకును, అటువంటి ప్రాణమిత్రుని యభీష్టమును చెల్లింపలేక పోయినందునకును చింతాక్రాంతు లయియున్నవారివలెను సిగ్గుపడుచున్నవారివలెను నటించుచు క్షమార్పణముచేయ మొదలుపెట్టిరి. అప్పుడు దానకేసరి తా నావఱకే యావిషయమును మఱచిపోతి ననియు, అటువంటి యల్పాంశములను మరల తలపెట్టవల దనియు, చెప్పి వారిని సమాధానపఱిచెను. ముఖస్తుతులును. నక్కవినైచ్యములును చేసెడియీ ప్రభువు లందఱును మిత్రవంచకు లయి దారిద్ర్యదశలోసమయమున కొక్కరును అక్కఱకు రాకపోయినను భాగ్యదశలో భోజనమునకు మాత్రము తప్పక విజయంచేసిరి. ఇటువంటివారు బెల్లమున్నంతవఱకును ముసరుకొని యది కాఁగానే లేచిపోయెడి యీఁగలవంటివారే కాని యీమనుష్యకీటకము లంతకంటె నధికులు గారు. ఒకమూల సంగీతములు జరగుచుండఁగా ప్రభువు లందఱును విస్తళ్ళముందు

కూరుచుండి లోపల నేదో యెత్తుగానుండి పయినిమటియొక విస్తరి బోర్లించియుండుట చూచి విస్తరిలో నేవో యపూర్వపదార్థములు వడ్డింపఁబడి యున్న వని తలఁచి యింతమంది కిప్పు డట్టివిందుచేయుట కయి దవ్య మెక్కడనుండి వచ్చెనా యని కొందఱును, తమ్ము పరాభవ పఱుచుటకయి యితఁ డేమయిన పన్నుగడ పన్నియుం డునాయని కొందఱును, సావకాశముగా బహువిధముల నాలోచించు కొనుచుండిరి. అంతట దానకేసరి చేసినయేర్పాటుప్రకారముగా సేవకులు ముందుగా వేఁడినీళ్ళు దొన్నెలలోఁ బోసి దెచ్చి ప్రతిభోజన పాత్రముముందును బెట్టిరి. చేయవలసినయేర్పాటు లన్నియు ముగిసినతరువాత భోజనముల కారంభింపవచ్చు నని పరిచారకులు వచ్చి చెప్పిరి. అప్పుడు విస్తళ్ళముందు కూరుచున్న పెద్దలు వింత లయినయపూర్వభక్ష్యములను వేగముగా చవిచూడవలె న నెడి యభిలాషతో పైవిస్తరి తీయఁగానే, వారి కందఱికిని దానకేసరిచేసిన క్రొత్తయేర్పాటు చక్కఁగా బోధపడెను. ఆభోజనపాత్రములలో పూర్వానుభవమునుబట్టి వా రెదురుచూచుచున్న భక్ష్యములేవియు లేక దానకేసరియొక్క బీదతనమునకును విందులకు విజయుంచేసిన వారి యోగ్యతకును తగినట్టుగా నొక్కొక్కవిస్తరిలో నొక్కక్క వట్టిగడ్డియుండ కానఁబడెను. వారదిచూచి యేమియు తోఁచక యాశ్చర్యపడుచుండఁగా దానకేసరి "ఓపశువులారా! మీరు గడ్డి తినవలసినవారే తినుండి" అని కేకలు వేయుచు, పరిచారికలందిచ్చు చెంబులతో వారిమొగములమీఁద వేడనేళ్ళు చల్ల నారంభించెను. ఈయపూర్వమయినయాదరణకు వా రత్యద్భుతపడి విస్తళ్ళముందు చెంబులు విడిచియు పైబట్టలు పాఱవైచియు నానాముఖముల తొం దరపడి పరుగులెత్తుట కారంభింపఁగా, దానకేసరి వారివెంటఁ బడి

"ఓసిగ్గుమాలినపశువులారా! ఓభోజనమిత్రులారా! ఓగోముఖ వ్యాఘ్రములారా! ఓకప్పవెలుఁగుపాములారా! ఓముఖస్తోత్ర విద్వాంసులారా!" అని నానావిధము లయినవారివారి యర్థనామములతోఁ బిలుచుచు తఱుమఁజొచ్చెను. అప్పు డాప్రభువు లందఱును వీథిలోఁ బడి మానములు దక్కించుకొని పరుగెత్తుచు, ఆపిచ్చిప్రభువు వచ్చి తమ్మెక్కడ కలిసికొనునో యని వెనుక తిరిగిచూడక తిన్నగా తమయిండ్లలో దూఱి లోపలతలుపులు వేసికొని, నాఁటిగండము గడచి తప్పించుకొని ప్రాణములతో నీవలఁ బడఁగలిగినందులకు సంతోషభరితు లయిరి.

దానకేసరి హస్తినాపురమువారికిఁ జేసినవిందులలో నెల్లనిదియే కడపటిది. ఈవిందుతోనే యతఁడు హస్తినాపురజనులవద్ద కడసారి సెలవు గైకొనెను. అపురూప మయినయీవిందు ముగిసినతరువాత గొప్పభూకంపము వచ్చి పట్టణ మంతయు భూమిలో మునిఁగిపోవలయు ననియు, మారి మొదలయినమహావ్యాధులు వచ్చి పురజను లందఱు నొక్కపెట్టున చావవలయు ననియు, పురజనులను శపించుచు దేవతలను బ్రార్థించుచు మిట్టమధ్యాహ్నసమయమునం దతఁ డొంటిగా పట్టణమునువిడిచి యరణ్యమునకు లేచిపోయెను. ఆపురజనులయొక్క కృతఘ్నతవలన దానకేసరి కయొక్క హస్తినాపురనివాసులమీఁదమాత్రమే కాక మానవకోటిమీఁద నెల్లను ద్వేషముగలిగినవాఁ డయి విశ్వాసఘాతుకు లయినమనుష్యమృగములలో గలిసి యుండుటకంటె వారికంటెఁ గొంతదయాదాక్షిణ్యములు గలిగిన యడవిమృగములలోనుండుట యుత్తమ మని భావించుకొనెను. అతఁ డరణ్యము చేరినతరువాత మానవకోటియందాతనికిఁ గలిగినపరిపూర్ణ ద్వేషమునుబట్టి మానవకోటి ధరించుచిహ్నములు ధరించుటకూడ

తన కవమానకర మని భావించుకొని వస్త్రవిసర్జనముసహితము చేసి దిగంబరుఁ డయి, అడవులలోనిదుంపలను ఫలములను తిని యేళ్ళలోని నీళ్ళు త్రాగి దేహధారణము చేయుచు, రాత్రులుగుహలలోశయనించుచు, మనుష్యముఖము కనఁబడినప్పుడెల్లను పెద్దపులిని జూచినప్పటి కంటె నెక్కువగా భయపడి పాఱిపోయి దూరముగా తొలఁగుచు, ఒక్కమనుష్యకోటితప్ప మఱియేజంతు వయినను తుదకు ఘాతుకమృగము లయినను సహవాసయోగ్యములే యని తలఁచి యతఁడు వన్యమృగములతోఁ గలిసి స్వేచ్ఛావిహారము చేయుచు, కాలము గడపుచుండెను.

అయ్యో ! పాపము! ఎంతశీఘ్రముగా దానకేసరి కెట్టివంటి యవస్థనుండి యెట్టువంటి యవస్థ పట్టినదో! అట్టువంటి యమూల్యము లయినదివ్యవస్త్రములను ధరించినవాఁ డిప్పుడు దిగంబరుఁ డయ్యెను. నిత్యమును స్తోత్రపాఠములు వినెడిచెవులకిప్పుడు సింహవ్యాఘ్రాదుల భయంకరధ్వనులు వినుచుండవలసిన గతిపట్టెను. సదా నూఱుల కొలఁది పరిచారకులతో చుట్టఁబడియుండెడువాని కిప్పుడు వన్యమృగములమధ్య నుండవలసివచ్చెను. అయినను పూర్వమువలె నాతనికి ధనాశగల యిచ్చకాలమారులకొలువు లేక యిప్పు డీశ్వరుఁడులోకోపకారముగా ననుగ్రహించిననోరులేనిపరిచారకులసేవ లభించెను.— చముఱక్కఱలేకయే యిప్పుడాతనికి పెట్టనిదీపములయిసూర్యచంద్రులు వెలుతురునిచ్చుచున్నారు. పీవనలక్కఱలేకయేవాయుదేవుఁడుచల్లగాలి విసరి శ్రమ మడఁచుచున్నాఁడు; విలువగలపాత్రము లక్కఱలేకయే నదులు నిర్మల మైనమధురోదకము నిచ్చుచున్నవి; ప్రతిఫల మపేక్షింపకయే వృక్షములు స్వాదుఫలములను కానుకపట్టుచున్నవి. ఆహా !

ఇప్పుడు విన మనసయినను హృదయపూర్వకములుగానినీచములయిన స్తుతిపాఠము లెక్కడను వినఁబడవుగదా!

ఇట్టిస్థితిలో నొకనాఁడు దానకేసరి యాహారమునిమిత్త మొక చెట్టుమొదల దుంపలు త్రివ్వుకొనుచుండఁగా ధననిక్షేపము కానఁబడెను. సువర్ణపూర్ణ మయినయాగొప్పకలశమును పూర్వ మెవ్వఁడో లుబ్ధుఁడు చోరులో రాజులో యపహరింతురన్నభయముచేత కావలసినప్పుడు కొనిపోవ నుద్దేశించి యక్కడ పాతిపెట్టి, తాను మరలవచ్చి పుచ్చుకొనులోపల నెవ్వరికిని జెప్పక మృతినొంది యుండును. అందుచేత నాధనరాశి యెవ్వరికిని మేలునుగాని హానిని జేయక యిప్పుడు దానకేసరి కాకస్మికముగా నేత్రగోచర మగువఱకును భూగర్భములో దాఁగి యడఁగి యుండెను. దానకేసరి మునుపటి మనస్సుతోనే యుండి యున్న పక్షమున, ఆధనము మరలముఖస్తుతిపరాయణులను కృత్రిమమిత్రులను కావలసి నందఱిని సంపాదించుటకు చాలియున్నదిగాని యిప్పు డాతనికి ప్రపంచముమీఁద రోఁతపుట్టి ధనమన్న కాలకూటవిషమువలె నుండెను. మనుష్యులలో జరగుచుండెడు దొంగతనములకును, అన్యాయములకును, లంచములకును, దౌర్జన్యములకును, హత్యలకును, అసత్యములకును, సమస్తపాపములకును ధనమే మూల మని యెంచి యతఁడు దానిని మరల భూమిలో పాతిపెట్టఁ దలఁచుకొనెను గాని యింతలోనాదారి నొకసేనాసమూహము పోవుచున్నందునను వారిని చూడఁగానే వ్యర్థముగాపూడియున్నయీధనముతో కృతఘ్నులను పాపులను పరవంచకులను నాశనము చేసి లోకములో పుణ్యము వెలయింపవచ్చు నన్నబుద్ధి పుట్టినందునను వారిని తనయొద్దకు పిలిచి వారు దుర్మార్గులను శిక్షించుటకయి యుపయోగించెడుపక్షమున ధనమును వారి కియ్యవలెనని యుద్దేశించి "ఓశూరులారా! మీరెక్కడకు

పోవుచున్నారు?'' అని యడిగెను. ఆ సైనికులు తమ ప్రభు వయిన విక్రమసింహుఁడు మహాశూరుఁ డయితనప్రాణముల కాశపడక యనేక పర్యాయములు శత్రువులతో ఘోరయుద్ధము చేసి హస్తినాపురమును కాపాడి పురజనులకు మహోపకారము చేసినను వారావగింజంతయైన నుపకారచింత లేక కృతఘ్నులయి యావిక్రమసింహుని నిష్కారణ ముగా సేనాధిపత్యమునుండి తొలఁగించి యవమానింపవలయు నని ప్రయత్నించినందున నతఁడు తమ్ము తోఁ చేసికొని హస్తినాపురము నాక్రమించుకొనుటకయి దండెత్తిపోవుచుండఁగా తా మాతనివెంటఁ బోవుచున్నా మని చెప్పిరి. వారిపని యాతనికిహృద్యముగా నున్నందున దానకేసరి యప్పుడే యాసేనాధిపతిని తనయొద్దకు రప్పించి, తనకు దొరకినధనమంతయు నాతని కిచ్చి "ఈధనముతో నీవు నీసైనికుల కాహారపదార్థములు తక్కువపడకుండ నిచ్చుచు, ఎంతకాలమయినను యుద్ధముచేసి హస్తినాపురమును నేలమట్టముచేసి యాబాలవృద్ధముగా నందలివారి నందఱిని జంపి భూభారమునుతగ్గింపుము. కృతఘ్నులయిన పాపాత్ము లుండుట భూమికి భారముగాన నీవాదుష్టులయెడ లేశమయి నను దయచూపవలదు. నా కిదే మహోపకారము'' అని ప్రార్థించి పంపివేసెను. ఎంతమంచివారికిని కృతఘ్నులయెడల నిట్టి ద్వేషమే పుట్టునుగదా!

అతఁ డీప్రకారముగా మృగమధ్యమున మనుష్యరూపమున నున్న వింతమృగమువలె కాలము గడపుచుండఁగా, ఒకనాఁ డొక మనుష్యుఁ డాకస్మికముగా వచ్చి యాతఁడు వసించియున్నగుహావాకిట నిలువఁబడెను. వానిని జూచి మనుష్యసంచారములేని యీగుహాముఖ మున కొక్కమనుష్యుఁ డొంటిగా నేలవచ్చెనాయని దానకేసరి యద్భుతపడసాగెను. అట్లొంటిగా మహారణ్యమునఁ బడివచ్చి గుహాముందు

నిలిచినవాఁడు హితకాముఁడు. నిర్మలహృదయుఁడయిన యతఁడు తన యజమానునియందు నిజమయినప్రేమయును విశ్వాసమును గలవాఁడగు నాతనికి సంభవించినదుర్దశకు చింతిల్లుచు తనచేతనైన సాహాయ్యమును జేయవలె నన్నయుద్దేశముతో నాతనిని వెదకుకొనుచు తుదకక్కడఁ గనుఁగొనెను. పూర్వమటువంటి యింద్రవైభవమనుభవించిన దానకేసరి యోగివలెనయి దేహమున బట్టయయిననులేక తల్లిగర్భమునుండి వచ్చినప్పటివలె దిగంబరుఁడయి మృగసముదాయములో తిరుగుచుండఁగానే హితకాముఁ డప్పుడు నిశ్చేష్టితుఁడై నోటమాటరాక కన్నులనీరు కాలువలుగట్ట చిత్రపుప్రతిమవలె నిలువఁబడెను. అట్లు కొంతసేపుండి తుదకు ధైర్యము తెచ్చుకొని దానకేసరి కాళ్ళమీఁదపడి కన్నులనీరుకార గద్గదస్వరముతో నతఁడు తాను యజమానునితోఁగూడ నరణ్యమునందే నివసించుచు పరిచర్య చేయ వచ్చితిననియు తనసేవ నంగీకరింపవలయుననియు బహువిధముల దీనముగా ప్రార్థించియడిగెను. కాని మనుష్యకోటియం దాతనికిఁ గలిగియున్న యాయపారద్వేషములో దానకేసరి కాతని నానవాలుపట్టుటయే దుర్ఘటమయ్యెను. ఆనవాలు పట్టినతరువాతకూడ దానకేసరి మనుష్యులలో కృతజ్ఞతగలవాఁ డుండునన్ననమ్మకము లేకపోవుటచేత మనుష్యదేహమును ధరించిన తప్పిదమునుబట్టి హితకాముని మాటలను నమ్మక యాతఁడును వంచకుఁడేయని తన్నే మోసము చేయుటకే వచ్చెననియు నాతనిది దొంగయేమపనియు భావించెను. కాని హితకాముఁడు తన ప్రవర్తనవలనను మాటలవలనను తుదకెంతో కష్టముమీఁద తాను తనయజమానునిమీఁదఁగల యవ్యాజమైన ప్రేమచేతనే యక్కడకు వచ్చినట్టు నమ్మకము గలిగింపఁగా దానకేసరి యప్పుడు చేసినమేలు మఱవనివాఁడు ప్రపంచములోనొక్క

మనుష్యుఁ డున్నాఁడని యొప్పుకొనెను. అయినను మనుష్యసామాన్యముమీఁద నెల్లను గలిగిన ద్వేషమునుబట్టి యతఁడు మనుష్యుఁ డయిన హితకాముని మొగము చూచుటకును మాటలువినుటకును కూడియుండుటకును సమాధానపడనందున, తుద కాహితకాముఁడు మహాదుఃఖముతో తనయజమానుని విడిచిపోవలసినవాఁ డయ్యెను.

హితకాముఁడు వెడలిపోయిన తరువాత దానకేసరిదర్శనార్థమై యాతనికంటె గొప్పవారైన ప్రముఖు లనేకులు కలిసి వచ్చిరి. ఈలోపల విక్రమసింహుఁడు తనసేనలతో వెళ్లి సైన్యమును కోట చుట్టునుబెట్టి హస్తినాపురమును ముట్టడించి, కొన్నిదినములలోపల పట్టణమునంతను మంటిలో కలుపునట్లు కానఁబడెను. అందుచేత పట్టణములోనివా రందఱును భయపడి విక్రమసింహునితో సమానముగా యుద్ధముచేసి గెలువఁగొనఁజాలిన ధైర్యసాహసములు గల రణశూరుఁడు బహుయుద్ధములయం దాఱితేఱిన దానకేసరితప్ప మఱియొకఁడు లేకపోవుట విచారించి, ఆతనియెడల తాము చూపిన కృతఘ్నతకై పశ్చాత్తాపపడి పురజనులు దానకేసరిని ప్రార్థించి తెచ్చుటకొఱకు తమలోనిముఖ్యుల నాతనికడకుఁ బంపిరి. కష్టసమయమునం దాతనికి సహాయము చూపలేని పెద్దమనుష్యులిప్పుడు తమకష్టసమయమునం దాతనిపాలికి పోయి, తాము బుద్ధిలోపముచేతఁ జేసిన యపరాధములను క్షమించి పురరక్షణభారమును వహించి యీ యాపత్సమయమునందు తమ్ముద్ధరింపవలసిన దని బహువిధములఁ వేఁడుకొనిరి. అతఁడు వారిప్రార్థనము నంగీకరింపనందున వా రాతనిపాదములమీఁద బడియు, కన్నుల నీరు పెట్టుకొని బతిమాలుకొనియు, తాము వెనుకచేసిన యపచారమునకు ప్రాయశ్చిత్తముగా తమసంపదలను గౌరవాధికారములను ధనప్రాణ

ములను సమస్తమును సమర్పించెద మని వేడుకొనియు, పురసంరక్షణార్థ మాతని నేలాగుననైన మరల హస్తినాపురమునకుఁ గొనిపోవ బ్రయత్నించిరికాని వారియత్నము లేవిధముచేతను సఫలము లయినవి కావు. దానకర్ణుఁ డయి పట్టణమునం దున్నప్పటివలె దానకేసరి యొక్క హృదయ మిప్పుడు మృదువయి దయార్ద్రమై కరఁగఁ దగినదిగా నుండక యాతఁడు వసించియున్న పర్వతమువలెనే కఠినమయి దయాశూన్యమయి యుండెను. అతఁ డిప్పుడు విక్రమసింహుఁడు నిర్దయత్వమును వహించి పురజనులనందఱిని సంహరించినను నిర్వికారముగా నుండెడుస్థితిలో నున్నవాఁడు విక్రమసింహుని సైనికులు హస్తినాపురమునంతను దహించి పాడుచేసినను దానకేసరి కిప్పుడు పరమసంతోషముగా నుండునే కాని యణుమాత్రమును సంతాపము కలుగదు. అట్టిస్థితిలో వారిమొఱ్ఱ లిప్పుడు చెవిటివానిముందఱి శంఖధ్వనులు గాక యెట్లు ప్రయోజనకారు లగును?

వా రప్పటికిని లేచిపోవక దానకేసరి రానిపక్షమున తామక్కడనే ప్రాణములు విడిచెద మని కాళ్ళమీఁదపడి లేవనందున వారినితప్పించుకొనుటకయి యతఁడు వారికి రెండుపాయములు చెప్పి పంపివేసెను. అందొకటి హస్తినాపురవాసు లందఱును జేరి దానకేసరిచేసిన విక్రమసింహునిదాసులమని చెప్పుకొనుచు విక్రమసింహుని పాలికిపోయి గడ్డికఱచి యాతనిశరణుచొచ్చి పురపరిపాలనమునాతనికి సమర్పించి యాతనినే తమప్రభువునుగా నమ్మి సేవించి బ్రదుకుట. రెండవది యాపురజను లీవఱకు పలువురయెడలనుజూపిన కృతఘ్నతా పాపపరిహారార్థముగా సంసారములనువిడిచి యాయరణ్యాశ్రమమును ప్రవేశించి యీశ్వరధ్యానము చేసికొనుచు నక్కడనే నిలిచి మరల సంతానరూపమున పాపులసంఖ్య వృద్ధిచేయక నశించి సుగతి పడ

యుట. ఈ రెండాలోచనలును వారిమనస్సులకు రుచింపనందున, అతఁడు స్వపురరక్షణార్థము వచ్చుదారి గానక నిరాశు లయివారు తమవచ్చిన దారినే మరల స్వపురమును బ్రవేశించిరి.

అటుతరువాత దానకేసరి మరల నెప్పుడును మనుష్యునికంటఁ బడలేదు. హితకాముఁ డనేకపర్యాయములు తనయజమానుని వెదకు కొనుచు నతఁడు వసియించి యుండినయరణ్యమును పర్వతమునుతిరిగి చూచెనుగాని యాతనిరూపముమాత్ర మెక్కడను కానరాలేదు. అతఁ డుండెడుగుహలోమాత్ర మొకమానిపలకమీఁద "దానకేసరిబ్రతికి యుండి కృతఘ్నస్వభావు లయినమనుష్యులను ద్వేషించి యున్నాఁడు. ఇప్పుడు వచ్చుచున్న కృతఘ్నులునుపరవంచకులునయినమనుష్యు లంద ఱును మహాప్రళయము వచ్చి యొక్కసారిగా నశింతురుగాక యని కోరుచున్నాఁడు" అని వ్రాయఁబడియుండెను. మనుష్యులకృతఘ్నత వలన మతిపోయినయాదానకేసరి బలవన్మరణమునే పొందెనో స్వచ్ఛందమరణమునే పొందెనో యెవ్వరికిని దెలిసినది కాదు. ఎట్లయి నను తనవలన నుపకారము పొందినమనుష్యకోటి చూపినకృతఘ్నత చేత మనస్సు వికల మయినందున తీఱనిచింతచేత మృతి నొందె నను టకు సందేహము లేదు. ఆపలకను జూచినవా రందఱును మహో దారపురుషుఁ డయి దానకేసరి యనుసార్థకనామమును వహించిన యాపుణ్యపురుషుఁడు మనుష్యులదుర్మార్గమువలన నడవులపా లయి యేకాకిగా దిక్కుమాలి మృతినొందినందునకై దుఃఖించుచు వచ్చిరి.

స ం పూ ర్ణ ము.

## స్త్రీల కుపయోగించుకథలు

### అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

### ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞీ చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

### ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

### ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవ చరిత్రము

## సాహిత్య గ్రంథములు

### తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక–విగ్రహము
5 నీతిచంద్రిక–సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

### పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

### పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

కాన్పు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# వైదర్భీ విలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ త్రిశేషు శైవరాజ బహద్దూరు
కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మహిషాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచన ప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా।
2 ,, రెం॥భా।
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జార్జిగిల్బర్ట్
10 నీతిదీపిక

# వైదర్భీ విలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు

From Bureau of
Exhibition
For Hitakarini Samaj.

Hony Secretary



ప్రకాశకులు:

హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము

**1950**

కాపీరైటు

# ఇందువచ్చు పాత్రములు.

---

ధర్మపాలుఁడు—విదర్భ దేశపురాజు; మనోహారిణితండ్రి.
దుర్జయుఁడు—ధర్మపాలుని తమ్ముఁడు; మిత్రరంజనితండ్రి.
మాధవసేనుఁడు—విజయపురపురాజు; మిత్రరంజనిభర్త.
విజయసేనుఁడు—మాధవసేనునితమ్ముఁడు; మనోహారిణిభర్త.
గోపాలదాసు—విజయసేనుని భృత్యుఁడు.
భద్రుఁడు—మనోహారిణికి గోపికావేషముతోనున్నప్పటిపేరు.
పార్వతి—మిత్రరంజనికి గోపికావేషముతోనున్నప్పటిపేరు.
మనోహారిణి—ధర్మపాలుని కూఁతురు· విజయసేనునిభార్య.
మిత్రరంజని—దుర్జయునికూఁతురు; మాధవసేనునిభార్య.

---

# వైదర్భీ విలాసము



పూర్వకాలమునందు ధర్మపాలుఁ డనురాజు విదర్భ దేశమును పాలించుచుండెను. అతఁడు మిక్కిలి సాధువయి, రాజ్యభారమునంతను తనతమ్ముఁడయిన దుర్జయునిమీఁద పెట్టినందున, అతఁడు రాజ్యకాంక్ష గలవాఁడై భ్రాతృద్రోహముచేసి రాజ్యమునంతనుతానే యాక్రమించుకొని యన్నగారిని పురమువెడల నడఁచెను. సింహాసనవిహీనుఁడయిన యారాజు పరిమితపరివారముతో రాజధాని వెడలి, పరమవిశ్వాసులయిన కొందఱుమిత్రులు వెంటరాఁగా దండకారణ్యమునకుఁ బోయి, అక్కడ వానప్రస్థునివలె కాలముగడపుచుండెను. మిత్రానురాగముచేత గృహములను కుటుంబములను విడిచి రాజువెంట నడవులకు వచ్చిన యాయుత్తమపురుషులయొక్క భూములను ధనమునుకూడ కొల్లగొని ద్రోహియయిన దుర్జయుఁడు మఱింతధనవంతుఁడయ్యెను. అడవులలో నుండుట యలవాటుపడినకొలఁదిని దంభముతోను వంచనముతోను నిండి విశ్రాంతిలేని పురనివాసమునకంటె నిర్వ్యాపారమయిన వనవాసజీవనమే సుఖతరమయినదిగా వారికిగనఁబడఁజొచ్చెను. అంతేకాక యప్పుడప్పుడు బంధుమిత్రాదులుకూడవచ్చి వారినిచూచిపోవుచుండుటచేతను, అక్కడ మనస్సంతుష్టికి భంగము గలిగించెడు తొందరపాటులేవియు లేకుండుట చేతను, వారుపట్టణమును విడిచితిమన్న విచారమించుకయు లేనివారయి పూర్వకాలమునందలి ఋషులవలె నెమ్మదితో కాలక్షేపముచేయుచుం

డిరి. వేసవికాలమునందు హారువనవృక్షములయొక్క చల్లనినీడలయందు విశ్రమించి, లేళ్ళయొక్క యాటలను స్వేచ్ఛావిహారమునుజూచి వినోదించుచుందురు. అందుచేత వన్యములయిన యామృగములమీఁదసహితము వారత్యంతవాత్సల్యము కలవారయి ఆహారమునిమిత్తము వానిననివార్యముగా వేఁటాడవలసివచ్చెనుగదాయనిమనస్సులో ఖేదపడుచుందురు. అంతట మనోహరమైన వసంతకాలముపోయి వానలునుచలియు వచ్చి తన్ను బాధించుచున్నప్పుడు సహితము రాజు తనయప్పటిదురవస్థను గుర్తెఱిఁగిన వాఁడయ్యును విచారమునకు మనస్సులోఁచోటియ్యక కష్టములనన్నిటిని ధైర్యముతో సహించుచు, ఈశీతవాతములు రాజస్థానములయందుండు కొలువుడు కాండ్రవలె ముఖస్తుతులు చేసి లేనిపోనిభ్రమలు కలిగింపక నానిజమయిన స్థితిని తెలుపుచున్నవి;వీనివలని బాధయధికముగా నేయున్నను దయావిహీనులునుకృతఘ్నులునునయినవారివలనఁ గలుగుచుండెడుబాధలో నిది సహస్రాంశమయినను లేదు; కష్టకాలమునుగూర్చి మనుష్యులెంతభయపెట్టుచున్నను, విపత్తులవలన సహితమునేర్చుకోవలసినప్రయోజనములు నాకనేకములుకానఁబడుచున్నవి; విషసర్పముయొక్కశిరస్సునందున్నమణి విషనివారణముచేసిసుఖమునుకలిగించునట్లేయీకష్టములును జ్ఞానోపదేశముచేసి మనోవ్యాకులతనుతొలఁగించిసుఖదాయకములగుచున్నవి. అనియీవిధమయినతలంపులతో చిత్తశాంతిచేసికొనుచు సంతుష్టుఁడయియుండెను.అందుచేతనా తని మనస్సునకు రాజ్యమునుబాసినదుఃఖముతోఁచక, వృక్షపత్రములే పుస్తకములుగాను, సెలయేళ్ళమ్రోతలేయుపన్యాసములుగాను, వాయుశబ్దములేప్రసంగములుగాను, అయి యరణ్యములోనిప్రతివస్తువునుహితబోధచేయుచున్నట్లే కనఁబడుచుండెను,

రాజ్యపదభ్రష్టుఁడయినయీరాజునకుమనోహారిణియనుపేరుగల
యొక్కకొమార్తెయుండెను. దురాశాపాశబద్ధుఁడయినదుర్జయుఁ డన్న
గారినిల్లువెడలనడఁచినను, తనకూఁతురయినమిత్రరంజని కీడుజోడుగా
నుండి సహాయురాలుగానుండుటకయి మనోహారిణిని రాజాంతఃపురము
నందే యుంచుకొనెను. తండ్రుల వైరమునుబట్టి యణుమాత్రమును
వేఱుపాటుకలుగక యీరాజపుత్రికల కిరువురకునుపరస్పరానురాగము
ప్రబలి ప్రాణస్నేహముకలిగెను. తండ్రివిషయమున జరిగినయన్యాయ
మునుబట్టి పుట్టినమనోవ్యథయంతయు పోవునట్లుగా మనోహారిణిమీఁద
నత్యంత ప్రేమను గనఁబఱుచుచుతనచేతనైనసమస్తసాహాయ్యములను
జేయుచుమిత్రరంజనియాచిన్నదానినిఏకగర్భమునఁబుట్టినయప్పగారికం
టెను నధికాదరముతోఁ జూచుచునుపచరించుచుండెను. మనోహారిణి
కెప్పుడయినను తండ్రిమీఁద తలఁపుపాటి తనయసహాయతకై దుఃఖము
కలిగినప్పుడు, మిత్రరంజనిసమస్తవిధములనుదుఃఖశాంతిచేసియామెనో
దార్చుచుండును. ఈవిధముగా నొకనాఁడు మిత్రరంజని దుఃఖోపశమ
నముచేసి యప్పగారి కుత్సాహముపుట్టించుచున్నసమయములోరాజసే
వకుఁడొకఁడువచ్చి రాజుగారివేడుకకొఱకు మల్లవినోదము జరగఁబోవు
చున్నదనియు అట్టిపోరును జూచుటకయి రాజుగారు వారిని సభకుఁదీసి
కొనిరమ్మనిసెలవిచ్చినారనియుఁజెప్పెను. ఆవేడుకవలనమనోహారిణిమన
స్సునకుల్లాసము కలుగవచ్చునని యెంచి మిత్రరంజని యామెతోకొలువు
కూటమునకుఁ బోవ ననుమతించెను.

ఆకాలమునందు రాజసభలలో జెట్టిపోరుసాధారణముగాజరగు
చుండును. బహుసంస్థానములయందు బాహుబలమున ప్రసిద్ధికెక్కిబిరు

దులను పొందినజెట్లు జీతముల కుందుచువచ్చిరి. ఇతరదేశములనుండి ప్రఖ్యాతికెక్కిన మల్లులెవ్వరైన వచ్చినప్పుడు జరగెడుపోరును జూచి యానందించుటకయి రాణివాసపుస్త్రీలుకూడవచ్చుచుందురు. అయా చారమును బట్టియేయిప్పుడుమనోహారిణియు మిత్రరంజనియు వేడుకచూచుటకయి వెళ్ళిరి. వారక్కడకు వెళ్ళునప్పటికిఅవలఁ కనేకయుద్ధములయందు జయమునొందిగడిదేరియనేకమల్లులను చంపిబిరుదులుపొందియున్న బలిష్ఠుఁడైన యొకజెట్టికిని విశేషానుభవము లేకసుకుమారముగానున్న యొక పిన్నవయస్సువానికిని యుద్ధముసిద్ధమయి యుండెను.అప్పుడక్కడ నున్న వారందఱును జెట్టిపట్లలోపిన్నవయసువాఁడుపరాజయమునొందితప్పక చంపఁబడునని నమ్మియుండిరి. అంతట రాజుతనయన్నకొమార్తెను కొమార్తెనుజూచి "ఓకన్యలారా! ఇప్పుడొక్కబలవంతునకును బలహీనునకునుపోరాటము జరగఁబోవుచున్నది. ఈయసమానమయినపోరాటమువలదని నేనెంతచెప్పినను, ఈబాలుఁడు వినకున్నాఁడు. ఈబాలుని చూచిన నాకుజాలివేయుచున్నది. స్త్రీస్వాభావికములైనమృదుమధుర వాక్యములతో మనసుకరఁగునట్లుగా బోధించినచో మీమాటవిని యితఁడు తనపూనికనువిడిచిమరలునేమోప్రయత్నముచేసిచూడుఁడు" అని చెప్పెను.

ఆమాటలకు వారుసంతోషించి రాజుచెప్పినట్లుచేయుటకుపూనుకొనిరి. వారిలో మొట్టమొదట మిత్రరంజనియీాడుజోడు కానివానితో పోరాటముతగదు మానుమని యాపిన్నవానికి బోధించిచెప్పెను; అటు తరువాత మనోహారిణియందుకొని తననేర్పంతయు నుపయోగించి రాతిగుండెనయినను కరఁగింపఁగల మృదువచనములతోదయారసముట్టిపడ

ప్రాణాపాయకరమైన యిటువంటిపోరాటమును మానవలసినదని బహు విధములఁ జెప్పెనుగాని, ఆమాటలవలననాతనిపూనికి చెడుటకుమాఱుగా మఱింతప్రోత్సాహము కలిగి యాతని మనస్సులో శౌర్యమును బాహు వీర్యమును కనఁబఱిచి తానేలాగునయినను విజయమునొంది యామెను మెప్పింపవలయునన్నబుద్ధి పుట్టెను. అందుచేత నాతఁడు వారిప్రార్థన నంగీకరింపక మహావినయముతో "ఈదయనేమీరెప్పుడును నాయెడల కలిగియుండవలెనని మిమ్ము మిక్కిలివినయముతో ప్రార్థించుచున్నాను. ఈవిషయములో మీకోరికను చెల్లింపకపోయినందుకు నాలోనేనేలజ్జ పడుచున్నాను. నన్ను మన్నింపుఁడు. ఈయుద్ధములో నేను చంపఁబడెడు పక్షమున, చావుకావలెనని కోరుకొనువాఁడేచచ్చెననుకొనుఁడు; ఈప్రపంచసుఖములయందు నాకేమియు నపేక్షలేదు. నేననుభవించిన కష్టములచేత నేనిప్పుడువిరక్తుఁడనయియున్నాఁడను. నాప్రార్థననంగీకరించి యీపోరాటమునకునాకనుజ్ఞయిచ్చిమనఃపూర్తిగానన్నాశీర్వదింపుఁడు" అని వేఁడుకొనెను.

అంతట జెట్టిపట్లారంభమయినవి మిత్రరంజనియాతనికపాయము కలుఁగకుండునుగాకయనికోరుచుండెనుమనోహారిణియామెకంటె నెక్కువ పరితాపము కలదై యాతని యాపద తనదిగా భావించుకొనుచుండెను. అతఁడు తనకీప్రపంచముమీఁద రోఁతపుట్టినదనియుచావుపరమసమ్మతమే యనియు చెప్పుటచేత మనోహారిణి తనవలెనే యతఁడును నదృష్టహీనుఁడని తలపోసి జాలిపుట్టి యాతనిమీఁద నింతంతనరానిప్రేమగలదాయెను. ఈవిధముగానుత్తమకులీనురాండ్రయిన యాయువతులుచూపిన దయచేత నాపిన్నవానికి క్రొత్తబలమును క్రొత్తధైర్యమును గలిగి

యతఁడు మల్లయుద్ధములో చూచువారికెల్ల నాశ్చర్యమును కలిగింపఁ జొచ్చెను; ఇట్లాయిరువురును కొంతసేపు పెనఁగులాడినతరువాత క్రమ క్రమముగా మించి యాచిన్నవాఁ డాజెట్టిని క్రిందపడఁద్రోసి పరా జయము నొందించెను. అప్పుడు తగిలిన దెబ్బచేత మల్లుఁడు కొంతసేపు మాటాడుటకును కదలుటకును శక్తుఁడుగాక మూర్ఛ పోయినట్లుండి యెంతోసేపటికి తెప్పిరిలెను.

రాజాచిన్నవానిబలపరాక్రమములకును కౌశలమునకును సంతో షించి, ఆతని, దనయాస్థానమునం దుంచుకొనఁదలఁచి యాతనిపేరును జననీజనకుల నామధేయములను అడిగెను. అతఁడు తనపేరువిజయసేనుఁ డనియు దానుదృఢసేనునినాలవకుమారుఁడననియు చెప్పెను. విజయసే నునితండ్రియైన దృఢసేనుఁడు కొన్నిసంవత్సరములక్రిందటనే మృతుఁ డయినను, అతఁడు బ్రతికియున్నకాలములో ధర్మపాలుని ప్రాణమిత్రుఁ డునుప్రభుభక్తియుక్తుఁడునుఅయిన సామంతరాజుగానుండెను. అందు చేత రాజాచిన్నవాఁడుతనయన్నగారి మిత్రునిపుత్రుఁడన్నమాట చెవిని బడఁగానే మొగముచిట్లించుకొని, అతనియందావఱకుగలిగినయాదరము నంతను విడనాడి అన్నగారి యెడలను తన్మిత్రులయెడలనుగలద్వేషము చేత నాతని మొగమువంకనైనను తిన్నగాచూడనొల్లక పెడమొగము పెట్టుకొని, ఆతని యసమానపరాక్రమసందర్శనమువలనఁగలిగినయను రాగబంధమును మొదలంట కోసివేయఁజాలక "నీవు మఱియెవ్వరి పుత్రుఁడవైన నైనపక్షమున బాగుండును." అనుచు వెడలిపోయెను.

అతఁడు తనతండ్రియొక్క ప్రియసఖునిపుత్రుఁ డయినట్లు వినఁ గానే మనోహారిణి యపరిమితానందమునుబొంది మిత్రరంజనిని జూచి "చెలియా! విజయపురరాజయిన దృఢసేనుని మాతండ్రిగారు తమ

బహిఃప్రాణమువలెఁ జూచుకొనుచుండెడివారు; ఈతఁ డాతనిపుత్త్రుఁ డన్నసంగతి నాకు మొట్టమొదటనే తెలిసియుండినపక్షమున, అటు వంటిసాహసకార్యమునకు తెగింపవలదని నావాగ్ధారలతోఁగూడ నీతని పాదములమీఁద నాకన్నీటిధారలనుకూడ కురిపించియుందును.'' అని చెప్పెను. అంతట నాయువతు లిరువురును విజయసేనునియొద్దకు పోయి రాజుగారి యనాదరమువలన నతఁడు చిన్నపోయియుండుట కనిపెట్టి, కొన్నిప్రియవచనములాడి యతని కుత్సాహము పుట్టించిరి. తరువాత వారిరువురును మరలునప్పుడు మనోహారిణి యాతనిని సమీపించి తనమెడలో నున్నహారమును దీసి యాతని కంఠమునవైచి "మిత్త్రుఁడా! నే నిప్పుడు మందభాగ్యురాలనయి దీనదశయం దున్న దానను; నేనే మంచిస్థితియం దుండినపక్షమున నీ కింతకంటె మంచి బహుమానమును జేసియుందును. ఇప్పుడు దీని నంగీకరింపుము'' అని వెడలిపోయెను.

ఆకన్య లిద్దరును రహస్యముగా మాటాడుకొనునప్పుడును మనోహారిణి విజయసేనునిగూర్చియే సంభాషింప నారంభించినందున, ఆమెమనస్సు రూపయౌవనవంతుఁ డయిన యాతనిమీఁద తగిలి యున్నట్లుగ్రహించి, మిత్త్రింజని "అప్పా! ఆకస్మికముగా చూచినాడఁ గానే పరునిమీఁద నింతప్రేమపుట్టుట సాధ్యమగునా?'' అనియడిగెను. "అమ్మాయీ! మాతండ్రిగా రీతనితండ్రియం దెంతో ప్రేమగలిగి యుండెడివారు. అందుచేత నే నీతనిపయి నెట్లు ప్రేమచూపకుండఁ గలుగుదును?'' అని మనోహారిణి యుత్తరము చెప్పెను. "ఒకరితండ్రి మఱియొకరిని ప్రేమించినంతమాత్రముచేత నాతని కూఁతురుకూడ నాతనిపుత్త్రుని ప్రేమించుట సహజ మగునా? అట్లయిన పక్షమున మాతండ్రిగా రీతనితండ్రిని ద్వేషించిరి గనుక నేనుకూడ ఈతనిని

ద్వేషింపవలయును. అయినను నా కీవిజయసేనునియం దట్టిద్వేష మేమియుఁ గలుగలేదే?'' అని మిత్రరంజని మరల నడిగెను.అక్కయు చెల్లెలును తమలో తా మీప్రకారముగా సంభాషించుకొనుచున్న సమయములో దుర్జయుఁ డక్కడకు వచ్చెను. విజయసేనునిఁజూచి యాతనితండ్రిపేరు విన్నంతమాత్రముచేత తన సామంతరాజులలో ననేకులు తనయన్నగారికి మిత్రులుగా నున్నారన్నమాట స్మరణకు వచ్చి పట్టరానికోపముగలవాఁడయి, అంతేకాక ప్రజ లందఱును కొంతకాలమునుండి మనోహారిణియొక్క గుణసంపదకు సంతోషించి యామె తండ్రికిఁ గలిగినదురవస్థకు చింతిల్లి యాచిన్నదాని విషయమయి జాలిపడుచుండుటచేత లోలోపలనే రవులుచున్న కోపాగ్ని యిప్పు డాకస్మికముగా ప్రజ్వరిల్లిన వాఁడయి, దుర్జయుఁడు మనోహారిణిని కన్నులనిప్పులొలుక నెట్టుపాటి చూచుచు, ఈర్ష్యాగ్రహగ్రస్తుఁడయి''మనోహారిణీ!నీవు తత్క్షణమే మారాచనగరు విడిచి నీతండ్రి యున్నచోటికి పొమ్ము'' అని యుత్తరువుచేసి, మిత్రరంజనివంక తిరిగి ''అమ్మాయీ! ఈమె నింతకాలము నీనిమిత్తమయి యిక్కడ నుంచవలసినవాఁడ నయితిని'' అని చెప్పెను. అప్పుడు మిత్రరంజని తండ్రితో ''నాన్నగారూ! నే నప్పు డీమెను నాయొద్దనుంచుఁడని మిమ్ము ప్రార్థించి యుండలేదు. నే నాకాలమునందు మిక్కిలి పసిదాననగుటచేత నాకప్పు డీమెయోగ్యత తెలియదు. ఈమె యోగ్యత నా కిప్పుడు పూర్ణముగా తెలిసినది కాఁబట్టి యీమె నిక్కడనుండి పంపివేయవలదని మి మ్మిప్పుడు వినయ పూర్వకముగా ప్రార్థించుచున్నాను. ఈమెయు నేనును చిన్నప్పటినుండియు కలిసి భోజనము చేయుచు, శయనించుచు, ఆడుకొనుచు, చదువుకొనుచు, ఒక్కచోట పెరిఁగినాము. ఈమె నెడఁబాసి నే నొక్కనిమిషమయినను వేఱుగా

నుండలేను,'' అని బహువిధముల మనోహారిణివిషయమయి మాటాడఁ జొచ్చెను. కూఁతు రెంతచెప్పినను దుర్జయుఁ డామెమాట వినక "యుక్తాయుక్తము లెఱుఁగని బుద్ధిహీనురాలవు గనుక నీవీమెను పంపి వేయవలదని నన్ను వేఁడుచున్నావు. ఈమె తేనెమాటలుచూచి నీవు మోసపోవుచున్నావు గాని నిజ మెఱుఁగఁజాలకున్నావు. ఈమె వినయమును, శాంతస్వభావమును, మంచిమాటలునుజూచి భ్రమించి ప్రజలీమెవిషయమయి జాలిపడుచున్నారు. ఈమె యిక్కడనుండి వెడలినఁ గాని నీగుణసంపద బయలఁపడదు. ఈమె నిక్కడనుండి పంపివేయుటకయి నేను నిశ్చయించుకొన్నాఁడను గనుక నాతో నీ వీమెవిషయమయి యేమిచెప్పినను విన(గలవాఁడనుగాను. నీవిఁక మాటాడకుము'' అని చెప్పి లోపలికిఁబోయెను.

తా నెంతచెప్పినను తండ్రి తనమాటలు వినక పెడచెవిని బెట్టినందున, ఇఁక నాతనితో మాటాడినకార్యములేదని తెలిసికొని మిత్రరంజని యప్పగారితో తానుకూడపోవుటకు నిశ్చయము చేసికొనెను. అందుచేత చెలికత్తె లిద్దఱును ఆలోచించుకొని యారాత్రియే బయలుదేఱి ధర్మపాలుఁ డున్నదండకారణ్యమార్గమునఁ బోయిరి. వారు బయలుదేఱకముందు తా మట్టి రత్నాభరణములతోను విలువ వస్త్రములతోను వెళ్ళుట యపాయకర మని తెలిసికొని సామాన్య వేషములతోఁ బోవ నిశ్చయించుకొనిరి. వారిలో మిత్రరంజని తా మిద్దఱమును కాపు కన్నెలవలె వేషమువేసికొన్న యెడల యుక్తముగా నుండు నని చెప్పెను గాని మనోహారిణి యిద్దఱును స్త్రీవేషములతో వెళ్ళుటకంటె నొక్కరు పురుషవేషమును ధరించుట యుక్తముగా నుండుననియు తాను మగవేషము వేసికొని యన్నగారివలె నుండెదననియుఁజెప్పి యామె నొడఁబఱిచెను. అప్పుడు వా రాప్రకారముగా

బీదవేషములు వేసికొని పేరుకూడ మార్చుకొని కొంతసొమ్మును నగలును పట్టుకొని మనోహారిణి భద్రుఁడనునామముతో నన్నగారివలెను, మిత్రరంజని పార్వతి యనునామముతో చెల్లెలివలెను బయలుదేఱిరి.

అప్పుడు మనోహారిణికి పురుషవేషముతో పురుషధైర్యము కూడ వచ్చినట్టు కానఁబడెను. ఈమాఱువేషముతో వా రిరువురును సత్రములలో భోజనములుచేసి పల్లెలదారిని ప్రయాణములుచేయుచు కొన్నిదినములలో దండకారణ్యము ప్రవేశించిరి. అరణ్యములో ప్రవేశించినతరువాత వారికి మునుపటివలె భోజనములు చేయుటకు సత్రములుగాని పరుండుటకు చావళ్ళుగాని కనఁబడలేదు. నడుచుటకు మంచిమార్గము లయినను లేక యడవిలోఁ గలయిఱుకుదారు లెల్లను కఱకురాళ్ళతోను ముండ్లతోను నిండియుండెను. అటువంటి దుర్గమారణ్యములో కొంతసేపు నడిచినతరువాత వా రాఁకలిగొన్నవారయి మార్గాయాసముచేత మిక్కిలి బడలిరి; ఇంతవఱకును కథలును నవ్వుమాటలును చెప్పి చెల్లెలి కుత్సాహము కలిగించుచున్న భద్రుఁడు సహితము క్షుత్పీడచేతను మార్గశ్రమముచేతను ధైర్యము చెడ్డవాఁడయిన యాఁడుదానివలె నేడ్చుచు తా నప్పుడు ధరించియున్న పురుషవేషమున కవమానము తెచ్చితినని యొప్పుకోవలసినవాఁ డయ్యెను. ఇఁక పార్వతియవస్థ చెప్పవలసిన పనియే లేదు. ఆమె యిఁక తానడుగెడు దూరమయినను నడవలేనని చెప్పి యొకరాతిబండమీఁద కూలఁబడెను. అప్పుడు స్త్రీలకు కష్టసమయములయందు ధైర్యముచెప్పి యుత్సాహముపుట్టించుట పురుషధర్మమని స్మరణకుఁదెచ్చుకొని పయికి మనస్సులో లేనిధైర్యము నవలంబించి చెల్లెలినిజూచి "చెల్లాయీ! అధైర్యపడఁబోకు, లేచి మెల్లగా ముందుకు రెండడుగులు వేయుము.

మనము శీఘ్రముగానే గమ్యస్థానమును చేరుదుము" అని భద్రుఁడుత్సాహవాక్యములు పలుకజొచ్చెను. కాని కృత్రిమపౌరుషమును తెచ్చిపెట్టుకొన్న ధైర్యమును వారిమనస్సుల కుల్లాసమును కలిగింపఁ గలిగినవి కావు. వా రిప్పుడు దండకారణ్యములోనే యున్నను రా జెక్కడ నున్నాఁడో వారికి తెలియదు; అడవిమృగములచేతఁగాని క్షుత్పిపాసలచేతగాని యడవిలోఁబడి దారిగానక చావవలసివచ్చునేమో యని వారిమనస్సులలో భీతిపుట్ట నారంభించెను. ఈసంగతులనే యాలోచించుకొనుచు వా రొకచెట్టునీడను కూరుచుండి యుండఁగా, ఆదారి నొకగొల్లపిల్లవాఁడు పోవుచుండుట తటస్థించెను. వానినిజూచి భద్రుఁడు "ఓగోపకా! నాచెల్లె లయిన యీచిన్నది దారినడచుటచేత బడలిన దయి తిండిలేక సొమ్మసిల్లుచున్నది. ఈయరణ్యమునందు భూతదయచేతఁగాని ధనాశచేతఁగాని మా కన్నపానము లిచ్చి విశ్రాంతి కలుగఁజేయఁగల తా వున్నయెడల మమ్మక్కడ జేర్చి మాప్రాణసంరక్షణము చేయుము" అని యడిగెను.

ఆగొల్లపిల్లవాఁడు తా నొకగొల్లవానిసేవకుఁడ ననియు, తన యజమానుఁడు తనయింటిని పశువులను అమ్ముకొని మఱియొకచోటికి లేచిపోఁబోవుచున్నాఁ డనియు, అక్కడకు సమీపములోనున్న యాతనియింటికి తనతోఁగూడ వచ్చెదుపక్షమున కలకొలఁదని భోజనము లభించుననియు చెప్పెను. ఇల్లు సమీపములో నున్నదని వినుటచేత క్రొత్తబలమువచ్చినవారయి వానివెంట వారిద్దఱును నడిచిపోయి గొల్లవాని యిల్లుచేరి వానియింట భోజనముచేసి, వానియింటిని పశువులను కొని తమ్మచ్చటకు తీసికొనివచ్చిన యాపిన్నవానిని తమకు సేవకునిగా నేర్పఱుచుకొని, వా రక్కడ నివాసముచేసిరి. ఇట్లు చేయుటవలన వారికి తలదాఁచుకొనుట కొకయిల్లును భోజనపదార్థ

ములునుకూడ లభించినందున, ధర్మపాలుఁ డాయరణ్యములో నెక్కడ నున్నాఁడో తెలుసుకొనువఱకును తా మక్కడనుండుటకు వారు నిశ్చయించుకొనిరి. వా రక్కడ మార్గాయాసమును తీర్చుకొని విశ్రాంతిని పొంది దినదినక్రమమున వా రాస్థలమున కలవాటు పడినకొలఁదిని వా రప్పుడు ధరించుకొనియున్న కాపువేషముల కనుకూలముగా వారి కాయడవి యింట నున్నట్టే సుఖదాయకము కానారంభించెను. అయినను భద్రుఁడు తా నొకప్పుడు మనోహారిణి యయియుండి విజయసేనుని కామించుట మొదలయిన సంగతులను తలపోయుచు, తనప్రియుఁ డయినవిజయసేనుఁ డెంతోదూరములో నున్నాఁ డని భావించుకొనుచుండును. కాని యతఁ డిప్పు డాయరణ్యములోనే యున్నందున కొన్నిదినములలోనే యొకవింత తటస్థ మయ్యెను.

విజయపురసామంతరా జయినదృఢసేనుఁడు తనమరణకాలమునందు పెద్దకుమారుఁ డయినమాధవసేనుని తనయొద్దకు బిలిచి, మిక్కిలి పసివాఁడయి కడగొట్టుకొడు కయినవిజయసేను నాతని కొప్పగించి, తమవంశమునకును స్థితికిని తగినట్లుగా నాబాలునకు విద్యాబుద్ధులు చెప్పించి బాగుచేయవలసినదని చెప్పెను. కాని పితృభక్తియు భాతృవాత్సల్యమును లేనియామాధవసేనుఁడు తనతండ్రి యాజ్ఞయందు గౌరవ ముంచి తమ్ముని విద్యావిషయమయి శ్రద్ధవహింపక, విజయసేనునియం దనాదరముచూపి యాతనియన్నపానాదుల విషయమునసైనను తిన్నగా విచారింపకుండెను. ఇట్లున్నను విజయసేనుఁడు స్వభావముచేతనే తండ్రియొక్క సుగుణసంపదను పొందినవాఁడయి విద్యాలాభము లేనివాఁ డయినను బుద్ధిమంతుఁ డయి విశేషవిద్యావంతునివలె వినయవిధేయత్వాది సమస్తసద్గుణములను గలిగి ప్రవర్తించుచుండెను. తమ్మునియొక్క యుత్తమగుణములను జూచి మన

స్సులో నసూయగలవాఁడయి మాధవసేనుఁ డాతనిచావు వేఁడి, తన కోరిక సిద్ధించునిమిత్తమే వెనుక జెట్టితోడి పోరాటమునకు తనతమ్ముని బంపెను. అంతేకాక మాధవసేనుఁ డాతని కనేకవిధములయిన బాధలు కలిగించినందున విజయసేనుఁడు బ్రతుకుటకంటె మరణము నొందుటయే యుత్తమ మని యెంచుకొనియుండెను.

తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. జెట్టితో పోరాడి చచ్చునన్నయుద్దేశముతో విజయసేనుని అన్నగారు మల్లయుద్ధమునకుఁ బంచినను, అతఁ డట్లు చావక విజయము నొందెను. అందుచేతవిఫల మనోరథుఁ డయినమాధవసేనునికి తమ్మునియెడల మఱింతయీర్ష్యయు ద్వేషమును ప్రబలి యేరాత్రియైనను విజయసేనుఁడు నిద్రించెడి యింటికి నిప్పుపెట్టించవలె నని యతఁ డొకయాప్తునితో నాలోచించెను. ఈసంగతి యేలాగుననో విజయసేనుని తండ్రినాటినుండియు విశ్వాస ముతో సేవించుచున్న యొకముసలిసేవకునికి తెలిసినందున, అతఁడు దృఢసేనునియం దుండిన విశ్వాసముచేతను తండ్రియొక్క సుగుణముల నన్నిటిని వహించుటనుబట్టి విజయసేనునియందుఁ గలిగినప్రేమచేతను విజయసేనుఁడు విదర్భనుండి రాఁగానే యూరిబయలి కెదురుగావెళ్ళి కన్నీరునించుచు "ఓవిజయసేనా ! నీవెందు కింతమంచివాఁడ వయి నావు? నీ కింత బలధైర్యసాహసము లేలకలుగవలెను? నీవా జెట్టి నేల జయింపవలెను? ఇతరుల తేజోబలాదులనుజూచి లోకము సహింపదు గదా? నీకీర్తి నీకంటె ముందుగానే యీపట్టణమునకు వచ్చినది" అని ప్రలాపింప మొదలుపెట్టెను. వృద్ధసేవకుఁ డైనయీగోపాల దాసునిమాటలయర్థము తెలిసికొలేక విజయసేనుఁ డేమివిశేషము లని యడిగెను. దుష్టుఁ డయినదుర్జయుఁడు తమ్ముఁడు ప్రజానురాగము కలవాఁ డగుట కోర్వ లేనివాఁడయి యిప్పుడు మల్లయుద్ధము

నందలి విజయమువలనఁ గలిగిన నీకీర్తి కసూయపొంది యీరాత్రినీ శయనగృహమునకు నిప్పు ముట్టించి నిన్ను చంపింప నుద్దేశించుకొన్నాఁ డనియు, ఇప్పుడు పట్టణములోనికిఁబోవక తప్పించుకొని పాఱిపోవుట శ్రేయస్కర మనియు, చెప్పి యావృద్ధుఁడు తనకొంగుననున్న రూపాయలమూటవిప్పి ముందు పెట్టి "ఓవిజయసేనా! నీయొద్ద ధనము లేదని యెఱిఁగి నీనిమిత్తమే యీనాలుగువందలరూపాయలును తెచ్చినాఁడను. ఇవి నేను నీతండ్రియొద్ద కొలువున్న కాలములో సంపాదించిన యార్జనలోనుండి మిగుల్చుకొని ముసలితనములో శక్తియుడిగిపని చేయలేనికాలమున కక్కఱకువచ్చునని దాఁచుకొన్నాఁడను. ఈసొమ్ము నీ వంగీకరింపుము. అడవిలోని పక్షుల కాహారము కల్పించినదయామయుఁ డయినయీశ్వరుఁడు నా కాహారము లేకుండఁ జేయఁడు. వృద్ధుఁడ నని సంశయింపక నన్నుకూడ నీ సేవ కంగీకరింపుము. నేను ముసలివాఁడ నయినను పడుచువానివలెపనిచేసి సమస్తవిధములచేతను నీకు సహాయుఁడ నయ్యెదను." అని సొమ్ము చేతి కిచ్చెను. అప్పుడు విజయసేనుఁడు సంతోషమును పట్టఁజాలక యద్భుతపడి కొంతతడవు నోటమాటరాక యూరకుండి తరువాత మెల్లఁగా "ఓగోపాలదాసా! నీ వెంతమఁచివాఁడవు! నీ వీకాలమునకు తగినవాఁడవుకావు. ఈకాలమునం దెక్కడఁజూచినను స్వప్రయోజనపరత్వముతప్ప మఱియొకటి కానఁబడదు. ఇఁకముం దెల్లకాలమును మన మిద్దఱమును గలిసి యుందము. నీవు వయస్కాలములో కష్టపడి సంపాదించుకొన్న యీధనము వ్యయపడకుండ మనజీవనము నిమిత్తమయి నేనేదో మార్గము నాలోచించెదను. పోదమురము." అని చెప్పెను.

ఇట్లు విశ్వాసి యయినసేవకుఁడును ప్రేమాస్పదుఁ డయిన చిన్నయజమానుఁడును బయలుదేఱి యెక్కడకుపోవలెనో తెలియక

నడిచినడిచి దండకారణ్యము ప్రవేశించి, అక్కడ భోజనము దొరకక భద్రుడును పార్వతియును చిక్కులు పడ్డట్లే చిక్కులు పడుచుండిరి. వారక్కడ నెక్కడనైన మనుష్యసంచారముగల ప్రదేశము దొరుకు నేమోయని యందందు తిరుగుచు నెక్కడను నరునిపొడగానక యాకలిచేత మిక్కిలి యలసిపోయిరి. అప్పుడు గోపాలదాసుడు తన యజమానునిజూచి "ఓతండ్రీ నేనిప్పుడాకలిచేత చచ్చిపోవుచున్నాను. ఇక నే నడుగుతీసి యడుగు పెట్టలేను. నామీద దయయుంచుము. నే నీయడవిలో ప్రాణములు విడిచెదను" అని యొకచోట చతికిలం బడెను. అతడు బలహీనుడుగా నుండుట తెలిసికొని విజయసేనుం డాతనికి ధైర్యము చెప్పి, ఆముసలిసేవకునిని తనమూపులమీద నెక్కించుకొని కొంతదూరము నడిచి యాతనిని సురక్షితమయిన యొక చెట్టునీడను దింపి, "ఓయీ! నీవధైర్యపడంబోకు, కొంతసేపు నీ వీచెట్టునీడను విశ్రాంతిపొందుచుండుము. నే నింతలో నెక్కడికైనను వెళ్ళి నీ కాహారము సంపాదించుకొని వచ్చెదను" అని చెప్పి తా నొక్కడును బయలుదేఱెను. అతం డాప్రకారముగా కొంతదూరము నడచునప్పటికి కడవిలో ధర్మపాలుం డున్నచోటికివచ్చుట తటస్థించెను. ఆసమయమందు రాజును మిత్రులునుగలిసి భోజనమునకుం గూరు చుండిరి. వారిలో రాజు ముందునైపున మనోహరమయిన యొక చెట్టునీడను గడ్డిమీఁద కూర్చుండి యుండెను.

అప్పుడాకలిబాధచేత నన్నిటికిని తెగించినవాఁడయి యాతని యన్నమును బలాత్కారముగానైన తీసికొన నిశ్చయించుకొనివిజయ సేనుఁడు కత్తినిదూసికొని రాజును సమీపించి "ఆగు నామాటవిని యింకతినుట మానివేయుము. నాకు నీయన్నము కావలెను" అని గంభీరగంభీరస్వరముతో కేకవేసెను. రా జాతనివంకఁజూచి "ఓయీ! నీ

వేయాపదమూలమునకైన నిట్లుచేయుటకు సాహసించినావా? లేక నీ వితరులగౌరవ మెఱుఁగని మోటుతనమువలన నిట్లు తెగించినావా?" అని యడిగెను. అందుమీఁద విజయసేనుఁడు "అయ్యా! నే నాఁకలి చేత చచ్చిపోవుచున్నాను" అని బదులుచెప్పెను. అంతయాఁకలి బాధించుచున్నపక్షమున తమతోఁ గలిసి యథేచ్ఛముగా సుఖభోజనము చేయవచ్చునని రాజు చెప్పెను. అప్పుడు రాజుయొక్క శాంత వచనములచేత చేతనున్నకత్తిని క్రిందపడవైచి, తా నంతమోటుతనముగా అన్న మడిగినందునకు సిగ్గుపడినవాఁ డయి "అయ్యా! మిమ్ము వేఁడుకొనుచున్నాను. నాయపరాధము క్షమింపుఁడు. ఈయడవిలోఁ గానఁబడుటచేత మీరును దయాశూన్యులైన యడవి మనుష్యులుగానే యుందు రని భావించి ముఖమున లేనికాఠిన్యమును తెచ్చుకొని యాజ్ఞాపించినట్లు పలికినాను. మీ రెవ్వ రయినను నాయిప్పటిమాటలను పాటిగాఁ బట్టఁబోకుఁడు. మీ రెన్నఁడయిన మంచిదశయం దున్నవారై యుండి, పాత్రదానము చేయుట కెఱిఁగిన వారయి, ఇతరులకష్టములనుతొలఁగింపనేర్చినవారయి, కరుణయెట్టిదో యెఱిఁగినవా రయి యుండినపక్షమున, నామాట లిప్పుడు మీమనస్సులో నామీఁద జాలిపుట్టింపవచ్చును" అని వినయపూర్వకముగా పలికెను. రా జామాటలు విని "ఓయీ! నీ వన్నట్టు మే మొకప్పుడు మంచిదశయం దుండినవారమే మే మనేకపాత్రదానములు చేసిన వారమును, పరులకష్టములను తొలఁగింపనేర్చినవారమును, అగుదుము: మే మిప్పుడు వనవాసముచేయుచున్నను కొంతకాలము పురములలోనుండి కరుణామహిమను తెలిసికొన్నవారమే. కాఁబట్టి యిప్పుడు నీవు మావలన నతిథిసత్కారమునుపొంది తృప్తిగా నిష్ట భోజనము చేయుము" అనిచెప్పెను. ఆమాటలకు సంతోషించివిజయ

సేనుఁడు "అయ్యో! ఆఁకలిచేతను ముసలితనముచేతను బాధపడుచు నామీఁదఁ గలయవ్యాజప్రేమచేతనే కాళ్ళీడ్చుకొనుచు నావెంట నడిచివచ్చిన వృద్ధుఁ డొకఁడు వెనుక నిలిచియున్నాఁడు. అతనినితృప్తి పఱుచువఱకును నానోటికి కొక్కమెతుకయినను పోదు." అని మరల చెప్పెను. అల్లయినపక్షమున నీవు వెంటనేపోయి యాతని నిక్కడకుఁ దీసికొనిరమ్ము. మీరువచ్చువఱకును మేము భోజనములుమాని వేచి యుండెదము. పొమ్ము" అని రాజు వేగిరించెను. అప్పుడు విజయ సేనుఁడు మేఁతనిమిత్తము తనపిల్లను గొనివచ్చుటకై పరుగెత్తులేడివలె పరుగెత్తి, గోపాలదాసుని తనవీపుమీఁద నెక్కించుకొని క్షణకాల ములో మరలవచ్చెను. అంతట రాజు వారివంకఁజూచి "ఓయీ! నీ వీవృద్ధుని క్రిందదింపి మీ రిద్దఱును యథేష్టముగా భోజనములు చేయుఁడు" అని చెప్పి వారిద్దఱికిని కడుపునిండ భోజనము పెట్టించెను. ఆముసలివాఁ డన్నము తిని తేరుకొని మరల నెప్పటియుత్సాహమును బలమునుగలవాఁ డయ్యెను. భోజనము లయినతరువాత రాజువిజయ సేనుఁ డెవ్వఁడో యడిగి తెలిసికొని, అతఁడు తనబాల్యమిత్రుఁ డయిన దృఢసేనుని పుత్రుఁ డగుటకు సంతోషించి, బహువిధముల నాదరించి యప్పటినుండియు వృద్ధసేవకునితోఁగూడ విజయసేనుని తనయొద్దనే యుంచుకొనెను. భద్రుఁడును పార్వతియు దండకారణ్యమునకు వచ్చి గొల్లవాని యిల్లుకొని వాసము చేయనారంభించిన కాలములోనే విజయసేనుఁడు వచ్చి యిక్కడ ప్రవేశించెను.

అటుతరువాత భద్రుఁడును పార్వతియు వనములో సంచరిం చుచు నొకనాఁడు చెట్లయాకులమీఁదను లేతబెరళ్ళమీదను మనో హారిణి పేరును మనోహారిణిమీఁది పద్యములును వ్రాసియుండుట

చూచి మిక్కిలి యద్భుతపడిరి. ఇట్లెవ్వరు వ్రాసియుందురా యని యాశ్చర్యపడుచుండఁగా మనోహారిణి యిచ్చినహారము కంఠమున వేసికొని విజయసేనుఁడాదారిని బోవుచు వారికంటఁబడెను. వా రాతనిని జూచి సమీపమునకువెళ్ళి పలుకరించిరి. కాని యతఁ డాభద్రుఁడే ప్రేమాస్పదము లగుమృదుమధుర వచనములచేతను నిరుపమానౌదార్యముచేతను తనహృదయము నాకర్షించి తన్నివృక్ష ములమీఁదనెల్ల ప్రేమనుదెలుపు గీతములను పద్యములను వ్రాయు నట్లు చేసినమనోహారిణి యని తెలిసికోలేకపోయెను. అయినను భద్రుని యొక్క సౌజన్యమునకును వాక్కౌశలమునకును సంతోషించి విజయ సేనుఁడాగొల్లపిల్లవానితో సంభాషణ కారంభించెను. ఇట్లు సంభా షించుచున్నసమయములో భద్రునియందు తనహృదయేశ్వరి యైన మనోహారిణిపోలిక కొంతయున్నట్లును ఆమెకుఁగల స్వాభావికలజ్జా సౌకుమార్యాదులుమాత్రము లేకున్నట్లును, అతని మనస్సునకుఁ దోచెను. అప్పుడు భద్రుఁడు పురుషధర్మము లయిన ధైర్యవాచాల త్వాదులను నటించుచు విజయసేనునితో ప్రసంగధోరణిని చమత్కా రముగా కాముకజనప్రశంసను దెచ్చి, "ఎవ్వఁడో కానియొక కాముకుఁడు కొన్నిదినములనుండి మావనమునందు తిరుగుచు, చూచినచెట్లమీఁద నెల్లను మనోహారిణియని గోళ్ళతో చిత్రించుచు, లేఁతమొక్కల చక్కనియాకులమీఁద తనవలపు తేటపడున ట్లాసుందరిసౌందర్య మునే వర్ణించి పద్యములను వ్రాయుచు, మనోహరము లయిన యీవనవృక్షముల స్వాభావికసౌందర్యమును చెడఁగొట్టుచున్నాఁడు. అతఁ డెవ్వఁడై యుండును ? అతఁడు నాకు కనఁబడినపక్షమున, తగినహితమును జెప్పి కొంచెముకాలములోనే నే నాతనిని పట్టుకొన్న వలపుపిచ్చిని వదలఁగొట్టి వేయుదును" అని పలికెను.

అప్పుడు విజయసేనుఁ డాకాముకుఁడు తానే యనియు, చెప్పఁ దలఁచుకొన్న హితమేదో చెప్పి వలపు వెఱ్ఱినికుదుర్చవలసిన దనియు భద్రుని నడిగెను. అందుమీఁద భద్రుఁడు ప్రతిదినమును నీ వొక్క సారి మాయింటికి వచ్చి చూచిపోవుచుండవలసిన దనియు, అప్పుడు తాను మనోహారిణివలె నటించెద ననియు, నేను నిజమయిన మనోహారిణినే యనుకొని యామె ననుసరించినట్లే నీవు నన్ననుసరించు చుండవలసిన దనియు, నే నప్పుడు స్త్రీలు కాముకులయెడ నటించు నటనలన్నియు నీయెడల నటించి నీయంతట నీవు సిగ్గుపడి నీవలపు పిచ్చిని వదల్చుకొనునట్లు చేసెద ననియు, ఈకామోన్మాదమడఁగుట కింతకంటె మంచిమందు లేదనియు, చెప్పెను. విజయసేనున కీమందు నందు విశ్వాసము లేకపోయినను, అతఁడు ప్రతిదినమును భద్రుఁ డున్నయింటికి వచ్చి వినోదార్థముగా వలపునటించి యనుసరణము చేయుచుండెద నని యొప్పుకొనెను. అతఁ డాప్రకారముగా నిత్యమును భద్రుఁ డున్నయింటికి వచ్చి యాతనిని చెల్లెలిని చూచుచు భద్రుని మనోహారిణీ యని పిలుచుచు, తమప్రియురాండ్ర యనుగ్రహ సంపాదనమునకయి లేఁతవయస్సులో నున్నకాముకులు వారి యెడల చేయు ముఖస్తుతులు ప్రియవచనములు మొదలయినసమస్త నటనలను భద్రునియెడలఁ బ్రయోగించుచుండెను. కాని యిందు వలన విజయసేనునికి మనోహారిణిపయిని గలిగియున్న కామోన్మాద మువూత్ర మణుమాత్రమును తగ్గలేదు. భద్రుఁడే నిజమయినమనోహారిణి యన్నమాట తెలియనందున విజయసేనుఁ డిదియంతయు వేడుకకొఱకు జరపుచున్న యాటగానే భావించుకొనుచున్నను, ఇందుమూలమున నతఁడు తనమనస్సులో నున్నదంతయుఁ జెప్పివేసి తృప్తిపొందఁగలుగుట కవకాశము కలిగెను. అయినను భద్రునికి

మాత్రము వలపు తేటపఱిచెడి స్త్రీయామాట లన్నియు నిజముగా తన్నుద్దేశించియే పలుకఁబడినట్లు తోఁచి యావినోదమువలన నిజ మయిన యానందమే కలుగ సాగెను.

ఆబాలకాము లిద్దఱును కొన్నిదినము లీప్రకారముగా సంతోషముతోఁ గడపిరి. ఈవినోదమువలన భద్రునికి సంతోషము కలుగుచున్న దని తెలిసికొని మంచిస్వభావముగల యాపార్వతి యతని యానందమున కెంతమాత్రమును భంగము కలిగింపక యతనిని మనసువచ్చినట్లు వినోదింపనిచ్చుచు, తానుగూడ వారి కపటనాటకమువలన వినోదించుచు, రాజువసించెడుస్థలమును తా మావఱకే విజయసేనునివలన నెఱిఁగినవారయినను మనోహారిణి యింకను తన తండ్రి యయినరాజుగారిని సందర్శించి యతనికిఁ దన్ను తెలుపుకోలే దన్న సంగతినిగూడ భద్రునికి స్మరణకు లేకుండెను. కాని భద్రుఁ డొకనాఁ డాయరణ్యములో రాజును కలిసికొని సంభాషించుట తటస్థించెను. అప్పుడు రాజాతనిని నీతల్లిదండ్రు లెవ్వరని యడిగెను. భద్రుఁడు తాను గొప్పవంశమునందు పుట్టినాఁడ నని మాత్రము చెప్పి యూరకుండెను. చక్కనివారిలో నెల్ల మిక్కిలి చక్కనివాఁ డయిన యాగొల్లపిల్లవాఁడు రాజవంశపువాఁడని రాజున కప్పు డెంతమాత్రమును సందేహము కలుగనందున, రాజాతని మాటలకు నవ్వి మఱి యేమియు ప్రశ్నలు వేయకుండెను. రా జారోగ్యదశలోను సుఖస్థితిలోను ఉండుటకు సంతోషించి భద్రుఁడు తా నప్పుడు మఱే మియు ప్రసంగింపక యావత్సంగతులును కొన్నిదినములలోనే రాజునకు విన్నవింపఁ దలఁచుకొని యప్పటికి సెలవు గైకొని వెడలి పోయెను.

ఒకనాఁటిప్రాతఃకాలమున విజయసేనుఁడు భద్రునిఁ జూచుటకయి బయలుదేఱి వెళ్ళుచుండఁగా త్రోవలో నొక మనుష్యుఁడు పరుండి నిద్రపోవుచుండఁగా త్రాఁచుపా మొకటి వానిమెడకు చుట్టుకొని యుండెను. విజయసేనుఁడు సమీపింపఁగానే యాతనియడుగులచప్పుడు విని పాము పట్టు విడిచి మెల్లఁగా చేరువపొదలోనికి ప్రాఁకి పోయెను. అతఁడు మఱింత దగ్గఱగా పోయి పొదవంకచూచునప్పటికి వ్యాఘ్రమొకటి కాళ్ళు చాచుకొని పిల్లివలె పొంచుండి యాపడుకొనియున్న మనుష్యునిమీఁదికి దుముకుటకు సిద్ధముగా నుండెను. అప్పు డామనుష్యుని పులివాతఁ బడకుండ రక్షించుటకయి భగవంతుఁ డప్పటికి విజయసేనుని బంపినా డేమోయనినట్లు కానఁబడెను. అప్పు డొడ లెఱుఁగక నిద్రించుచున్న యామనుష్యుని మొగమువంకఁ దేఱిపాఱ చూచునప్పటి కతఁడు క్రూరుఁ డయి యింటికి నిప్పు పెట్టించి తన్ను చంపింపఁ దలఁచుకొన్న తనయన్నయైన మాధవసేనుఁ డయినట్లు తెలియవచ్చెను. అప్పు డతని మనస్సులో మొట్టమొదట కోపమువచ్చి మాధవసేనుని పులినోటఁ బడుటకయి విడిచిపెట్టవలెనన్న బుద్ధిపుట్టెనుగాని యింతలో నతఁడు తన సత్స్వభావముచేతను భ్రాతృవాత్సల్యముచేతను కోపమును మరల్చుకొని వెంటనే కత్తిదూసికొని పులిమీఁది కుఱికి దానిని నఱికి యన్నగారిప్రాణములు కాపాడెను. కాని యావ్యాఘ్రము తన ప్రాణములు పోవులోపల విజయసేనునిమీఁద పడి యతనిని గాయపఱిచి మఱిచచ్చెను. ఈప్రకారముగా విజయసేనుఁడు పులితో పోరాడుచున్న సమయములో మాధవసేనుఁడు మేలుకొని, తాను నిర్దయుఁడయి యనేకవిధముల హింసపెట్టినసహోదరుఁడే తనప్రాణసంరక్షణార్థమయి ప్రాణముల కాశపడక క్రూరమయిన యాఘాతుక

మృగముతో పోరాడుచుండుట చూచి సిగ్గుపడి, తానాతనియెడల చేసిన క్రూరకృత్యము లప్పుడు తలఁపునకు వచ్చి మనస్సునకు బాధింపఁగా పశ్చాత్తప్తుఁడయి, కన్నులనీరు కాలువలుగట్ట నేడ్చుచు తమ్ముని పాదములమీఁద పడి తన వెనుకటి యయోగ్యతను మఱచి పోయి తన్ను క్షమింపుమని బహువిధముల దీనత్వముతో వేఁడుకొన మొదలుపెట్టెను. అన్నగారి కనుతాపము కలిగినందుకు సంతోషించి విజయసేనుఁ డాతని నప్పుడే క్షమించెను. అప్పుడు సోదరు లిద్దఱును అన్యోన్య ప్రేమతో గాఢాలింగము చేసికొనిరి. మాధవసేనుఁడు తన తమ్మునిప్రాణములు గొనవలెనన్న యుద్దేశముతోనే యీయడవికి వచ్చినను, అతఁ డాక్షణమునుండియు నిజమైన భ్రాతృస్నేహము గలవాఁ డయి తన తమ్ముని తన ప్రాణతుల్యునిగాఁజూచుకొన మొదలు పెట్టెను.

విజయసేనుని చేతికి పులివలన తగిలిన గాయమునుండి రక్తము విస్తారముగా ప్రవహించినందున, బలహీనతచేత భద్రునియొద్దకు తాను స్వయముగా వెళ్ళుటకు శక్తిలేనివాఁ డయి, అన్నగారితో తాను నవ్వులాటలకయి మనోహారిణి యని భద్రుని పిలుచుచుండుట మొదలుగాఁగల వినోదకథనంతను జెప్పి యచ్చటికిఁబోయి యాతనితో తనకిప్పుడు సంభవించిన యవస్థను తెలిపిరమ్మని మాధవసేనుని ప్రార్థించెను. మాధవసేనుఁ డక్కడనుండి తిన్నగా భద్రునియింటికి నడిచి విజయసేనుఁడు తనప్రాణరక్షణము చేసినవిధము నంతను భద్రునితోను పార్వతితోను జెప్పి, ఆతని ధైర్యశౌర్యములను కొంతసేపు పొగడిన తరువాత తానాతని యన్నగా రయినమాధవసేనుఁ డగుటయు చిన్నప్పటినుండియు తానాతని ననేకవిధముల కష్టపెట్టుటయు

తా నిప్పుడు పశ్చాత్తాపము కలవాఁడై తమ్ముని తనబహిఃప్రాణము నుగాఁ జూచుకొనుచుండుటయుకూడ జాలిపుట్టునట్లుగాఁ జెప్పెను.

తాను జేసినయపరాధములనిమిత్తమయి మాధవసేనుఁడు నిజమయినపరితాపమునుపొంది తమ్మునియెడల తన కిప్పుడు గలిగిన ప్రేమను తెలుపునప్పు డాతనిముఖమునందును మాటలయందును గనఁబడిన దైన్యమును సౌజన్యమును జూచి పార్వతి మనసు కరఁగిన దయి యాతనియెడల మోహావేశము కల దాయెను. భ్రాతృవిషయమున తాను చేసిననేరమును గూర్చి తనకుఁ గలిగినసంతాపమును దెలుపునప్పుడు పార్వతి జాలిపడుచుండుట చూచి యామెమీఁద మాధవసేనునకును ప్రేమ కలిగెను. కాముఁ డిపప్రకారముగా మాధవసేనునియొక్కయు పార్వతియొక్కయు మనస్సుల నుయ్యాలలూఁచుచుండఁగా, విజయసేనుఁడు పులిచేత గాయపడి కష్టదశయం దుండుట తలఁచుకొని ప్రేమాతిశయముచేత మనస్సుతల్లడిల్ల భద్రుఁడు మూర్ఛపోయెను. కొంతసేపటికి మూర్ఛ తెలిసినతరువాత భద్రుఁడు మాధవసేనుని జూచి తాను మనోహారిణి ననుకొను చుండుటచేత ప్రియుల కాపత్తు వచ్చినప్పుడు ప్రియురాం డ్రెట్లుమూర్ఛిల్లుదురో చూపుటకయి యిట్లు మూర్ఛ నటించితి ననియు, తా నెంతసరిగా మూర్ఛ నటించెనో యావివరమును విజయసేనునితోఁ జెప్పవలయు ననియు, చెప్పెను. వెలవెలపాఱుట మొదలయినముఖలక్షణములనుబట్టి యది నిజమయినమూర్ఛయేకాని నటించుట కాదని తెలిసికొని, ఆచిన్నవాఁడు స్త్రీవలె నంత పిఱికివాఁ డగుట కాశ్చర్యపడుచు, మాధవసేనుఁడు భద్రుని జూచి "నీవిప్పుడు మూర్ఛపోవుటను నటించినపక్షమున నీవు ధైర్యము నవలంబించి మగవానివలె నుండుటకూడ చక్కఁగా నటింపుము" అని పలికెను. "నేనిప్పు డాలాగుననే నటించు

చున్నాను కాని నేను స్వభావముచేత స్త్రీనిగానే యుండఁదగి యున్నాను.'' అని భద్రుఁడు నిజ మయినయుత్తరమునే చెప్పెను.

అక్కడ చాలసేపు సంభాషించినతరువాత మాధవసేనుఁడు తనతమ్ముఁ డయినవిజయసేనుఁడున్నచోటికి పోయి, అతనితో భద్రుని యింటివద్ద జరిగినదంతయుఁ జెప్పెను. విజయసేనునికి గాయముతగిలినదన్నమాట విన్నతోడనే భద్రుఁడు మూర్ఛపోవుటయు,అటుతరువాత తనమనస్సు మహాసౌందర్యవతి యైనపార్వతి యనుగోపయువతి మీఁద తగులుటయు, తనయభిప్రాయమును తాను తెలిపినతోడనే మాఱుమాటాడక యాగొల్లపడుచు తనప్రార్థన నంగీకరించుటయు తెలిపి తనశరీరము వేఱుచోట నున్నను ప్రాణము లన్నియు పార్వతి మీఁదనే యున్నవనియు తా నాచిన్నదానిని వివాహము చేసికొని యామెతో నీయరణ్యములోనే గొల్లవానివలె నుండుటకును విజయపురరాజ్యమును సర్వసంపదలును తమ్ముఁడైనయతనికే విడచిపెట్టుటకును నిశ్చయించుకొన్నాఁడ ననియు కూడఁ జెప్పెను. అందుమీఁద విజయసేనుఁడు ''నీ వాచిన్నదానిని వివాహమాడుటకు నేనంగీకరించినాను. వివాహమహోత్సవము రేపే జరగవచ్చును. మిత్రబృందముతోఁగూడ రాజును నీవివాహమునకు విందుకు పిలిచెదను. ఈకార్యము నంగీకరింపవలసినదని నీ విప్పుడే పోయి యాగొల్లచిన్నదానిని వేఁడుకొని యొప్పింపుము. ఇప్పు డాచిన్నది యొంటిగా నుండును. అదిగోఁనూడు ఆచిన్నదానియన్న యిక్కడకే వచ్చుచున్నాఁడు'' అనిచెప్పెను. ఆప్రకారముగా మాధవసేనుఁడు పార్వతియొద్దకు వెళ్ళెను. అంతట భద్రుఁడు పులిచేత గాయముతిన్నతనమిత్రుని యొక్క క్షేమమును విచారించుటకయి యక్కడకు వచ్చెను.

అప్పుడాకస్మికముగా మాధవసేనునికిని పార్వతికిని గలిగినపరస్పరమోహాతిశయమునుగూర్చి వారు కొంతసేపు సంభాషించినతరువాత విజయసేనుఁడు తా నన్నగారిని వెంటనే పార్వతియొద్దకి పోయి రేపటిదినముననే వివాహమునకు సమ్మతించుట కామెను సమాధానపఱచిరావలసిన దని పంపితి నని చెప్పి, ఈసంతోషసమయముననే తానుగూడ తనసమ్మోహనదేవతయయిన మనోహారిణిని వివాహము చేసికొన్నచో నెంతోధన్యుఁడనయ్యెదనని చెప్పెను. భద్రుఁడాయేర్పాటున కంగీకరించి పయికి నటించుచున్నంత ప్రేమయే విజయసేనునికి నిజముగా మనోహారిణిమీఁద నున్నపక్షమున నాతనికోరికయు ఫలించు ననియు, రేపటిదినమున మనోహారిణిని నిజస్వరూపముతో వచ్చునట్లుచేసి యామెను విజయసేనుని పెండ్లియాడుట కొప్పించెద ననియు, చెప్పెను. పయి కద్భుతకార్యమువలె కనఁబడుచున్న యీ పనిని నిర్వహించుట తానే మనోహారిణి యగుటచేత నాతనిచేతిలోనే యున్నను, భద్రుఁ డప్పుడు మహామాంత్రికుఁ డయినతనపినతండ్రివలన నేర్చుకొన్నమంత్రశక్తిచేత సాధించెద నని నటింపనారంభించెను. ఆమాటలకు సగము నమ్మకమును సగము సందేహమును మనస్సును బాధింపఁగా విజయసేనుఁడు భద్రునిజూచి "నీవు నిజముగానే యీపని నిర్వహింపఁగలవా? న న్నూరక పరిహాసము చేయుచున్నావా?" అనియడిగెను. "ఈశ్వరసాక్షికముగా చెప్పుచున్నాను నేనాపనిని నిశ్చయముగా నిర్వహింపఁగలను. కాఁబట్టి నీవు రేపు వస్త్రాలంకారభూషితుఁడవయి రాజును మిత్రులనునీపెండ్లికి పిలువుము. నీవు మనోహారిణిని రేపు వివాహమాడఁదలఁచుకొన్నయెడల, ఆమె సమయమున కక్కడప్రత్యక్షమగును" అని దృఢముగా భద్రుఁడు చెప్పెను.

మఱునటిదినము ప్రాతఃకాలమున మాధవసేనుఁడు పార్వతి యొక్క సమ్మతి పడసినందున వారుభయులును రాజుసన్నిధికివచ్చిరి; అప్పుడు వారితోఁగూడ విజయసేనుఁడును వచ్చెను. ఏకముహూర్తము నందే రెండువివాహములను జరిగించుటకు వారందఱును సమావేశ మయినందునను, పెండ్లికూఁతురొక్కతె మాత్రమే యక్కడకువచ్చి నందునను, సభవారొండొరులమొగములు చూచుకొని తమలో తాము తలపోఁతకు మొదలు పెట్టిరి. వారిలో ననేకులు భద్రుఁడు విజయసేనుని పరిహసించుటకయి యీవేషము వేసె నని తలఁచి యుండిరి.

ఈవింతమార్గమున తనకూఁతురే యచ్చటికి రప్పింపఁ బడునని విన్నమీఁదట రాజు విజయసేనునిజూచి, ఆగొల్లపిల్లవాఁడు తానుజెప్పినట్లు చేయఁగలఁ డని నీకునమ్మకమున్నదా?" అనియడిగెను. తనకేమి చెప్పుటకును తోఁచకున్నదని విజయసేనుఁడు చెప్పుచుండఁగా, భద్రుఁ డాస్థలమునకువచ్చి రాజునుజూచి "మీకొమార్తెను నేనిక్కడకు రప్పించెదుపక్షమున విజయసేనుని కామెనిచ్చి వివాహము చేయుటకు మీరంగీకరించెదరా?" అని యడిగెను. "ఆమె కరణముగా నిచ్చుటకు నాకు రాజ్యము లున్నను నే నంగీకరించెదను" అని రాజు ప్రత్యుత్తరము చెప్పెను. అటుతరువాత భద్రుఁడు విజయునివంక తిరిగి 'ఇక్కడకు రప్పించినపక్షమున నీ వామెను వివాహమాడెదవా?" అని ప్రశ్న వేసెను. "అనేకరాజ్యములకు నేను రాజు నయినను తప్పక వివాహమాడెదను." అని యతఁడు చెప్పెను. అంతట భద్రుఁడును పార్వతియుఁ గలిసి దూరముగా చెట్లమఱుఁగునకు వెళ్ళిరి. అక్కడ భద్రుఁడు తాను కట్టుకొన్నబట్టలను తీసివేసి, తాము వచ్చునప్పుడు తెచ్చుకొన్నవస్త్రాభరణములను ధరించుకొని, మంత్రిబల

మక్కఱలేకయే క్షణకాలములో మనోహారిణిగా మాఱెను. పార్వతియు గొల్లవేషమును తీసివేసి తనయమూల్యాలంకారములను వస్త్రములను ధరించుకొని విశేషాయాస మక్కఱలేకయే మిత్రరంజనిగా మాఱెను.

వారు చాటునకు వెళ్ళియున్నకాలములో రాజు విజయసేనుని జూచి యాగొల్లవానియందు తనకూఁతు రయినమనోహారిణిపోలిక చాలవఱ కున్నదని చెప్పెను. ఆపోలికను తానును కనిపెట్టితి నని విజయసేనుఁడు చెప్పెను. ఇదయంతయు నెట్లు ముగియునో యని వా రనుకొను చుండఁగా, ఎల్లవారును నద్భుతపడునట్లుగా మనోహారిణియు మిత్రరంజనియు స్వాభావికవేషములతో నక్కడకు వచ్చిరి. మంత్ర ప్రభావమువలన తా నచ్చటికి వచ్చితి నని నటింపక మనోహారిణితండ్రి పాదములమీఁద పడి మ్రొక్కి తన్నాశీర్వదింపవలసిన దని ప్రార్థించెను. వా రట్లాకస్మికముగా వచ్చుట యచ్చట నున్నవారి కందఱికిని నిజ మయినయింద్రజాలమువలెనే కానఁబడెను. అప్పుడు మనోహారిణి తండ్రిసమక్షమున వ్యర్థాలాపములు పలుకక, పినతండ్రి పురము వెడలి పోవ తన కుత్తరువిచ్చుటయు, తనపినతండ్రికూమార్తె యయినమిత్ర రంజని మిత్రవాత్సల్యముచేత తనవెంట ప్రయాణమయి వచ్చుటయు, తా మీయరణ్యములో గొల్లవేషము వేసికొని యన్నయు చెల్లెలును వలె విహరించుటయు, లోనుగాఁగలకథ యంతయు నేకరువు పెట్టెను.

వారల వివాహమునకు రాజు వరల సమ్మతిని తెలుపఁగా, మనోహారిణి విజయసేనునికిని, మిత్రరంజని మాధవసేనునికిని, ఏక ముహూర్తమునం దేవివాహము చేయఁబడిరి. ఈయరణ్యములో సాధారణముగా వివాహాదినములయందు పట్టణములలో చేయఁబడెడి యుత్సవములును వేడుకలును లేకపోయినను, ఇంతకంటె సంతోషకరము

లయిన వివాహము లెక్కడను జరిగియుండవు. అక్కడివా రందఱును శ్రాంతులుతీరి చల్లనినీడలు గలచెట్లక్రిందఁ గూరుచుండి పెండ్లిభోజనములు చేయుచుండఁగా రాజుయొక్కయు మిత్రులయొక్కయుపరిజనముయొక్కయు సంతోషమును పరిపూర్తిచేయుటకో యన్నట్లుగా నొక దూత యాకస్మికముగా పరుగెత్తుకొనివచ్చి రాజునకు పూర్వరాజ్యము మరలవచ్చిన దన్నశుభవార్తను జెప్పెను.

దుర్జయుఁడు తనకూఁతు రయినమిత్రరంజని పాఱిపోవుటవలన పట్టరానియాగ్రహము కలవాఁ డయి, తా నన్నకొమార్తెను వెడలఁ గొట్టుటవలన తనరాష్ట్రములోనియోగ్యు లనేకులు తనయందలి యసూయచేత రాజ్యమును విడిచి తనయన్నగారివద్దకు దండకారణ్యమునకుఁ బోవుచున్నారని విని కష్టదశలో నున్నరాజున కంతప్రజానురాగము కలుగుట సహింపలేక, ఆతని నేలాగున నయిన సంహరింపవలెనని గొప్పసైన్యముతో దండకాటవికి వచ్చెను. అరణ్యమునందుఁ బ్రవేశింపఁగానే యతని కక్కడ నొకయోగి కనఁబడెను. ఆయోగితో కొంచెముసేపుదైవికముగాభగవద్విషయమునుగూర్చి సంభాషింపఁగా నాతనికి బ్రాపంచిక విషయములయందు విరక్తియు, తాను జేసిన దుష్కృత్యములవిషయమయి యనుతాపమును, గలిగి మంత్రించినట్లుగా నిమిషకాలములో నతనిపూర్వహృదయము మాఱి క్రొత్త దయ్యెను. అప్పటినుండియు నతఁడు పశ్చాత్తప్తుఁడయి వైరాగ్యమును పొంది, తానక్రమముగా నన్నగారివలన పొందినరాజ్యమును మరల నతనికి సమర్పించి, తాను సాధువయి యరణ్యములోని మఠములో నీశ్వరధ్యానము చేయుచు కాలము గడపవలెనని నిశ్చయించుకొనెను. అందుచేత నతఁడు తనపరిజనులలో నొక్కనిఁ బిలిచి వెంటనేతనమనో నిశ్చయమును రాజున కెఱిఁగించిర మ్మని చెప్పెను. రాజుతో పోయిన

రాజ్యమును సంపదలును మరల వచ్చిన వని యిప్పుడు వచ్చి చెప్పిన దూత యితఁడే.

ఎవ్వరును ఎదురుచూడనియీసంతోషవార్త యుక్తసమయములో వచ్చినందున, ఆరాచకొమార్తెలయొక్కయు రాచకొమాళ్ళయొక్కయు వివాహమహోత్సవము మఱింత సంతోషదాయకమాయెను. అప్పుడు మిత్రిరంజని యీయేర్పాటువలన రాజ్యమునకు ఉత్తరాధికారిణి యగుట తప్పిపోయినను మనస్సులో నావగింజంతయు వ్యసనపడక మనోహారిణితండ్రికి రాజ్యమువచ్చినందునకయి యామెను హృదయపూర్వకముగా నభినందించెను. ఇఁకముందు మిత్రరంజనికి మాఱుగా రాజుయొక్కయనంతరమునందు రాజ్యము మనోహారిణికి వచ్చును. ఒక్కకడుపునఁబుట్టినయక్కచెల్లెండ్రకంటెనుసహస్రగుణము లధికానురాగముగలయారాజపుత్రికల కిరువురకును దానివలన వైషమ్యముగాని యసూయగాని యణుమాత్రమును గలుగలేదు. అంతే కాక వారిమైత్రియు పరస్పరప్రేమయు వయస్సుతోకూడ దినదినాభివృద్ధి పొందుచు వచ్చెను.

అప్పుడు రాజు సమస్తపరివారముతోను మిత్రివారముతోను రాజధానికిఁబోయి మరల రాజ్యభారమును వహించి, ప్రభుభక్తిగలవారయి కష్టములఁకోర్చి తనవెంట వనమునకు వచ్చినయుత్తమపురుషులకు రాష్ట్రములో తగినయధికారములిచ్చి, చిరకాలము జనరంజకముగా రాజ్యపాలనము చేసెను. నూతనవధూవరులును పుత్రపౌత్రాభివృద్ధి కలవారయి సంపదలతో తులఁదూఁగుచు చిరకాలము సుఖ మనుభవించిరి.

---

బాన్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

సాహిత్యగ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్రకవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శారదా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# భానుమతీ కల్యాణము




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు





ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ రావుబహద్దూరు

కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥ భా॥
16 ,, రెం॥ భా॥
17 ,, మూ॥ భా॥

## నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధి పత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వచనప్రబంధములు

## పద్యకావ్యములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥ భా॥
2 ,, రెం॥ భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# భానుమతీ కల్యాణము




గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు





ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

**1950**



కాపీరైటు

# ఈ కథలో వచ్చు పాత్రములు

## పురుషులు.

వజ్రసేనుఁడు—కళ్యాణపురపరిపాలకుఁడు.

విజయవర్మ—చోళమండల రాజు; వజ్రసేనుని చుట్టము.

విక్రమబాహుఁడు—ఉదయగిరిదుర్గాధీశుఁడు; విజయవర్మమిత్రుఁడు.

ప్రతాపరుద్రుఁడు—చంద్రగిరిదుర్గాధీశుఁడు; విక్రమబాహుని చెలికాఁడు.

అరిష్టవర్మ—విజయవర్మసవతితమ్ముఁడు.

వక్రబుద్ధి—నిపుణికకు ప్రియుఁడు.

## స్త్రీలు.

ఇందుమతి—వజ్రసేనునికూఁతురు; విక్రమబాహుని ప్రియురాలు.

భానుమతి—వజ్రసేనుని మేనకోడలు; ప్రతాపరుద్రుని ప్రియురాలు.

చతురిక—ఇందుమతియొక్క చేటిక.

నిపుణిక—ఇందుమతియొక్క చేటిక.

# భానుమతీకల్యాణము



కళ్యాణపురరాజ్యాంతఃపురములో ఇందుమతి యనియు, భానుమతియనియు, ఇద్దఱు చక్కని రాచకన్నియలు గలరు. వారిలో నిందుమతి కళ్యాణపురాధీశ్వరుఁ డయిన వజ్రసేనునికూఁతురు; భానుమతి యాతని మేనకోడలు. ఆయిరువురిలో భానుమతి యానందశీలురాలు; ఇందుమతి గంభీరస్వభావము గలది. భానుమతి నవ్వుకథలు చెప్పి తనమఱఁదలికి సదా వినోదము కలిగించు చుండును. చుట్టుపట్ల నేది జరగుచున్నను మహోల్లాసశీలురా లయినభానుమతి మనస్సున కదియెల్లను వినోదకరముగా నుండి నవ్వులాట కాస్పదమగుచుండును.

ఆకాలమునందు పాండ్యమండలము వారితో జరిగిన మహాయుద్ధమునందు తనశౌర్యమును బాహువీర్యమును గనఁబఱిచి విజయము నొంది ప్రసిద్ధికెక్కినవిజయవర్మ తనకు సహాయు లైనయిద్దఱు రాజపుత్రులతో మరల స్వదేశమునకుఁ బోవుచుఁ దన యాప్తబంధుఁ డయినవజ్రసేనుని జూచిపోవుట కయివచ్చి కళ్యాణపురములోఁ గొంత కాలముండుట తటస్థించెను. అట్లువచ్చినయతిథులలో చోళమండలరాజయిన విజయవర్మ గాక యాతనిమిత్రుఁడయిన యుదయగిరి దుర్గాధీశుఁ డయిన విక్రమబాహువును, వారివెంట వచ్చినచంద్రగిరిదుర్గాధీశుఁ డయినవాక్చాతుర్యమును తీవ్రస్వభావమును గలప్రతాపరుద్రుఁడును ముఖ్యులు. తనయింటికి విందు కయి వచ్చినయారాజపుత్రులను దనపుత్రికకును మేనకోడలికిని జూపి, అతిథిసత్కారము చూపి వారి నాదరించుటకయి వజ్రసేనుఁ డాకన్యలను నియమించెను.

వా రందఱు నొక్కచోటఁ జేరఁగానే ప్రతాపరుద్రుఁడు తన మిత్రులతోడ వినోదకరము లయిన సరససల్లాపముల కారంభించెను. తనవాక్చమత్కారము నితరులకు తెలుపక యడఁగియుండుట కిష్టము లేని దయి భానుమతి మధ్యను తానందుకొని యాతనిమాటల కడ్డము వచ్చి "అయ్యా! మీ రెంతో శ్రమపడి ప్రసంగము చేయు చున్నారుకాని యిచ్చట మీమాట లెవ్వరును వినుచుండలేదు" అని యాతని మాటలలోఁ దనమాట నొకటి కలిపెను. భానుమతి యెంత వదరుఁబోతో ప్రతాపరుద్రుఁడు తా నంతవదరుబోతే యయినను తనయెడల నామె చూపినయీయతిశీఘ్రసత్కారము రుచియింపనివాఁ డయి గొప్పవంశమునందుఁ బుట్టి మర్యాదతోఁ బెరిఁగినకన్య కిట్టి యధికప్రసంగము యుక్తము కాదని యతఁడు తలచెను. అంతేకాక వెనుకటిసారి తా నిచ్చటకు వచ్చినప్పుడుకూడ భానుమతి చతురవచన ములతో తన్నే యెగతాళి చేయుచువచ్చుట యాతని కప్పుడు స్మర ణకు వచ్చెను. ఇతరులు తమ్ముఁ బరిహాసించినప్పుడు తామితరులను బరిహాసము చేయుస్వభావము గలవారి కుండునంతకోపము మఱి యొకరి కుండదు. అలాగుననే యీభానుమతికిని ప్రతాపరుద్రునికిని కోప మెప్పుడును ముక్కుననే యుండును. కాఁబట్టి వాఙ్నిపుణు లయిన యీయిద్దఱు నొక్కచోటఁ గూడినప్పు డెప్పుడును సరసత్వ మంతకంతకు ముదిరి వాక్కలహముగాఁ బరిణమించి నవ్వులు పువ్వు లయి యొండొరులను దూషించుకొనుచు కోపముతో లేచిపోవుం డుట తటస్థింపలేదు. అందుచేతఁ దనమాట లెవ్వరును వినుచుండ లేదని పలికి తనసంభాషణము సాగనీయక యామె నడుమ నడ్డము వచ్చినప్పుడు ప్రతాపరుద్రుఁ డామె యక్కడ నుండుటయే యెఱుఁగ నట్లు నటించుచు "నాపాలిటి తిరస్కార దేవతా! నీ కింకను

బ్రతికియున్నావా!' అని కుశలప్రశ్నము చేసెను. ఆమాటతో నప్పుడు వారిద్దఱికిని శ్రోత్రవాగ్యుద్ధ మారంభ మయినది. ఆపోరాటములో వాగ్రణశూరు లయినయాయిరువురును వక్రోక్తిబాణముల నొండొరులమీఁదఁ బ్రయోగించుకొను చున్నప్పుడు భానుమతి యతఁడు మహాపరాక్రమశాలి యని యెఱిఁగినదయ్యును సంగ్రామభీరుఁ డని సూచించుచు నాతనిపిక్కబలమును శ్లాఘించి మనస్సు నొప్పించుటకుఁ బ్రయత్నించుచుండెను. విజయవర్మ యాతనియుక్తినైపుణి కానందించు చుండుట కనిపెట్టి యతఁడు విజయవర్మయొక్క యాస్థాన పరిహాసకుఁ డని బ్రహ్మాస్త్రమువలె మధ్య నొకవాక్యప్రయోగముచేసి యాతని నత్తిపోశిచెను. ఈవఱకు భానుమతి యాడినమాట లన్నిటికంటెను కడపటఁ బ్రయోగించినయీపరిహాసోక్తియొక్కటియే ప్రతాపరుద్రునిహృదయమధ్యమునం దమోఘబాణమయి నాటుకొని యెక్కువనొప్పి కలిగించెను. ఆమె తనపిక్కబలమును మెచ్చిరణభీరుఁ డని సూచనచేసినను దాను రణశూరుఁడ నని యెఱిఁగినవాఁ డగుట చేత నామాట నాతఁ డెంతమాత్రమును లక్ష్యము చేయలేదు. కాని 'విజయవర్మయొక్కయాస్థానపరిహాసకుఁడు' అన్నయెత్తిపొడుపుమాట మాత్రము సత్యమునకు మిక్కిలిచేరువయిన దగుటచేత వజ్రసదృశమయినయాతనిహృదయమున నాటుకొని మర్మచ్ఛేదము చేసి, ఉన్నమాట యన్న నులుకువచ్చు నన్నసామెతను సత్యము చేసెను. తామే మాటనేర్పరుల మని యితరుల నెగతాళి చేయుచుండువారికి లోకులు తమ్ము పరిహాసకు లని పిలిచినప్పుడు వచ్చునంతరోషము మఱి యెప్పుడును రాదుగదా!

అప్పుడు వినయవతి యైనయిందుమతి యారాజనందనుల ముందుఁ దా నేమియు మాటాడక యూరక కూరుచుండెను; విక్రమ

బాహువు కాలమహిమచేత నాసుందరియొక్క సౌందర్యమునందుఁ గలిగినయాధిక్యమును సావధానముగాఁ బరీక్షించుచు ఆమెసుందర విగ్రహముయొక్కయద్భుతశృంగారమునుగూర్చి తలపోయుచుండెను. ప్రతాపరుద్రునికిని భానుమతికిని జరగుచున్నవినోదకర మయిన సరస సల్లాపమును విని వేడుక చూచుచు, విజయవర్మ వజ్రసేనునివంకఁదిరిగి చెవిలో మెల్లగా 'ఈచిన్నది మంచిపౌరుషము గలయువతి. ఈమె ప్రతాపరుద్రునికి తగినభార్య యగును.' అనిపలికెను. 'ఓ మహారాజా! ఒక్కవారముదినములు వీరిద్దఱును దంపతు లయినపక్షమున, కేకలతో పిచ్చివాండ్రయిపోవుదురు.' అని వజ్రసేను డాతనిమాటకు ప్రత్యుత్తర మిచ్చెను. వజ్రసేనుఁడు వారి దనుకూలదాంపత్యము కాఁజాల దని తలఁచినను, విజయవర్మమాత్ర మీవాచానిపుణులనిద్దఱిని దంపతు లనుగాఁ గూర్చవలె నన్నతలఁపును విడిచిపెట్టలేదు.

అటుతరువాత నొకనాఁడు విజయవర్మ విక్రమబాహునితో మాటాడునప్పు డొక్కభానుమతీప్రతాపరుద్రులవివాహముమాత్రమే కాక మఱియొకవివాహముకూడ నుద్దేశింపఁబడినట్లు స్పష్టపడినది. మాటలసందర్భములో విక్రమబాహుఁ డిందుమతియొక్క గుణాతిశయ మును శ్లాఘించుటనుబట్టి యాతనిమనస్సామెమీఁదఁదగిలినట్లు విజయ వర్మ కనిపెట్టి, "మిత్రుఁడ! ఇందుమతిమీఁద నీకనురాగముగలదా?" అని యడిగెను. "క్రిందటిసారి యీకళ్యాణపురమునకు వచ్చినప్పుడు నే నామెను వీరదృష్టితోఁ జూచితిని. అప్పుడుసహితము నాకన్నామెను తగిలెనుగాని ప్రేమ నిలుపుట కప్పుడు నామనస్సులో నవకాశము లేక పోయినది. యుద్ధ మంతమునొంది సంధి జరగిన యీకాలమునందు యుద్ధచింత లన్నియు నామనస్సును విడిచిపెట్టఁగా వానిస్థానమున నిప్పుడు హృద్యము లైనమృదుచింతలు గుంపులుగుంపులుగా ప్రవే

శించి యిందుమతి యెంతసౌందర్యవతియో చూపి యుద్ధమునకుఁ బోకపూర్వమునందుఁగూడ నే నామెను కామించినట్టు స్మరణకుఁదెచ్చి నామనస్సు నాయువతీమణిమీఁదికిఁ బురికొల్పుచున్నవి'' అని విక్రమబాహుఁ డుత్తర మిచ్చెను. విక్రమబాహుఁ డిందుమతిమీఁదఁ దనకు గలవలపు దాచక యిటుగఁగానే బయలుపఱుచుటచేత విజయవర్మ మనస్సు కరఁగినవాఁ డయి యాక్షణముననే తనచుట్టమును మిత్రుఁడు నయినవజ్రసేనునియొద్దకుఁ బోయి విక్రమసేను నల్లునిగాఁ జేకొనుట కంగీకరింపవలసిన దని ప్రార్థించెను. వజ్రసేనుఁ డాసంబంధమును సమ్మతించెను. విక్రమబాహుఁడు విద్యావయోరూప గుణసంపత్తి గలవాఁ డగుటచేత నాతనిని భర్తనుగా గ్రహించుట కిందుమతిని ఒప్పించుట విజయవర్మ కంతకష్టము లేకపోయెను. విజయవర్మయొక్క ప్రోత్సాహమువలన నిందుమతీవిక్రమబాహుల వివాహమహోత్సవమునకు శుభముహూర్తమును వెంటనే నిశ్చయింపఁబడెను.

వివాహదినమప్పటికిఁగొన్ని దినములేయుండినను విక్రమబాహునకు దినమొకయేడుగాఁ గానఁబడి కాలముగడపుట దుర్భరమయ్యెను. తమకిష్టమయినకార్యముమీఁద దేనిమీఁదనైనను మనస్సు నిలిపినప్పుడు పడుచువాండ్రు సామాన్యముగా నత్యాతురులయి యుందురు గాన, నిర్వ్యాపారముగా నున్నప్పుడు వారి కన్యచింత మనస్సులోఁ జొరక కాలవిలంబ మెంతయల్పమయినను దుస్సహమగును. కాఁబట్టి యీకాలములో శీఘ్రముగా నుబుసుపోవునిమిత్త మొకవిధమైనవేడుకగా ప్రతాపరుద్రుఁడును భానుమతియును నొండొరులను వలచునట్లు చేయుటకయి యేదోవింత యైనయుపాయ మొకటి యాలోచింపవలయునని విజయవర్మ విక్రమబాహునితోఁ బ్రస్తావించెను. అప్పుడు వారిలోవా రదిబాగున్నదని సంతోషించి, వెంటనేపోయి తమయోచ

నను వజ్రసేనునితోఁ జెప్పఁగా నతఁడు నామోదించి తానుగూడఁ దన చేతనైనసాహాయ్యమును చేసెద నని వాగ్దానముచేసెను. ఇందుమతి సహితము తనవదినగారికి మంచిభర్తను లభింపజేయుటకయి పన్నెడి యుపాయములలో నేదైనఁ జిన్నపని తనమీఁద బెట్టినయెడల, తానును తోడుపడెదనని తనయభిమతమును దెలిపెను. పురుషులందఱును జేరి భానుమతి ప్రతాపరుద్రునివలచి కామించుచున్నదని యతనితోఁ జెప్పి నమ్మించునట్లును, ఇందుమతి ప్రతాపరుద్రుఁడు భానుమతిని వలచి కామించుచున్నాఁడని యామెతోఁ జెప్పి నమ్మించునట్లును జేయవలె నని విజయవర్మ యప్పుడొకయుపాయ మాలోచించెను.

విజయవర్మయు, వజ్రసేనుఁడును, విక్రమబాహుఁడును మొట్ట మొదట పని కుపక్రమించిరి. ఒకనాఁటిమధ్యాహ్నమునఁ బ్రతాప రుద్రుఁడొంటిగాఁబోయి తోఁటలోనియొకపొదరింటఁ గూరుచుండి చదువుకొనుచుండఁగా సమయము కనిపెట్టి, విజయవర్మయు సహాయులును దోఁటలోనికిఁబోయి యాపొదరింటికిఁ జేరువ నున్నయొకచెట్టు నీడను గూరుచుండి ప్రతాపరుద్రునికి వినఁబడునట్లుగా మొట్టమొదటఁ గొంతసేపు తమలోఁ దామేదో మతియొకసంగతి ముచ్చటించి, తరువాతఁ గార్యాంశమునకు దిగి వారిలో విజయవర్మ వజ్రసేనునిఁజూచి "ఓయీ! సఖుఁడా! చేరువకు రమ్ము. మొన్ననాఁడు నీవేదో చెప్పవచ్చి సగము చెప్పి మానితివే. అదియేమి? నీమేనకోడలు భానుమతికి ప్రతాపరుద్రునిమీఁద మనసు తగిలినదా? ఆచిన్నదాని కేపురుషునిమీఁదను మనసు తగులునని యెన్నఁడును నే ననుకోలేను." అని మెల్లగాఁ బ్రసంగము నారంభించెను. "నే నంతకుమునుపే యనుకోలేను. అందుకోను పయికెప్పుడును తాను ద్వేషించుచున్నట్లు తోఁపఁజేసెను ప్రతాపరుద్రునినే యది కామించి ప్రేమించుట మహాద్భుతముగా

నున్నది.'' అని వజ్రసేనుఁడు పలికెను. అప్పుడు విక్రమబాహు డందుకొని భానుమతి ప్రతాపరుద్రునిపై వలవు నిలుపుట సత్యమే యనియు, భానుమతిని వరించుట కాతనిని చేయలేకపోయినపక్షమున భానుమతి తప్పక మన్మథతాపముచేత ప్రాణములువిడుచునని యిందుమతియే తనతోఁజెప్పిన దనియు, వారిసంశయనివారణము చేసెను. ప్రతాపరుద్రుఁడెప్పుడును సాధారణముగా సుందరులందఱిని వారిలోను ముఖ్యముగా భానుమతిని దూషించుచుండువాఁ డగుటచేత వీరిదాంపత్యము పొసఁగుట యసాధ్యమని వజ్రసేనుఁడును విక్రమబాహువును దమయభిప్రాయములను గనఁబఱిచిరి.

ఈప్రసంగము విన్నంతసేపును విజయవర్మ తాను భానుమతి విషయమయి జాలిపడుచున్న వానివలె నటించి, ''ఈసంగతియెవ్వరైనఁ బ్రతాపరుద్రునితోఁ జెప్పిన బాగుండును.'' అని హెచ్చరించెను. ''చెప్పుటవలన నేమిప్రయోజనము? ఇది సందుచేసికొని పరిహాసమున కారంభించి యతఁడాచిన్నదానిని మఱింత బాధపెట్టును.'' అని విక్రమబాహుఁడు పలికెను. ''అట్లు బాధించెడుపక్షమున మనము ప్రతాపరుద్రుని నుడికించి చంపవలెను. నిజముగా భానుమతి బహు యోగ్యురాలు. ఒక్క యీప్రతాపరుద్రుని మోహించుటలోనే కొంచెము తెలివితక్కువ కనఁబఱిచినదికాని యామె తక్కిన సమస్త విషయములలోను మిక్కిలి తెలివి కలదిగాఁ బ్రవర్తించుచుండును.'' అని పలుకుచు విజయవర్మ లేచిపోదము రండని మిత్రులను బిలిచి, పొదలోనుండి వినుచున్నయాసంభాషణమును నూర్చి తనలోఁదానాలోచించుకొనుచుకయి ప్రతాపరుద్రుని తొందరగా విడిచిపెట్టి మిత్రబృందముతో నచ్చటినుండి వెడలిపోయెను.

ఈప్రసంగము జరుగుచున్నంతసేపును ప్రతాపరుద్రుఁడు లతాగృహములోనుండి యత్యాతురతతో చెవులొగ్గి వినుచు, భానుమతి తన్నుఁగామించినదన్నమాట చెవినిబడ్డప్పుడు "ఇంతటివింత పుట్టునా, ఈవైపరీత్యము సాధ్యమగునా?" అని తనలోఁ దలపోయుచుండెను. వారాస్థలము విడిచిపోయినతరువాత నతఁడు సావకాశముగాఁ గూరుచుండి తనకుఁదానే యాక్షేపసమాధానములుచెప్పుకొనుచులోలోపల నిట్లాలోచించుకొన మొదలుపెట్టెను. "ఇది వారు నన్నువంచించుటకయి పన్నినమాయవేష మయి యుండదుగదా! ఉండదు. నవ్వులాటమాటలుగాక వా రీవిషయమయి మిక్కిలి గంభీరముగా మాటలాడి ఇందుమతివలన సత్యము నంతను దెలిసికొని యాయువతినిగూర్చి పరితాపపడినట్టు కనఁబడినారు. నన్ను మోహించినదా! నే నామెను బదులు మోహింపవలెనా! నేనీవఱకెన్నఁడును వివాహమాడఁదలఁచుకోలేదు. వెనుక నేనొకసారి యావజ్జీవమును బ్రహ్మచారినిగానుండి చావవలెనని చెప్పినప్పుడు, వివాహమగునంతవఱకును బ్రతుకుదునని నేననుకోలేదు. వా రాయువతి గుణవతియనియు రూపవతి యనియుఁ జెప్పుచున్నారు. ఆమె యట్టిదే యగును. ఒక్కనన్ను మోహించిన విషయములోఁదక్క మిగిలినసమస్తవిషయములలోను ఆమె యెంతో బుద్ధిమంతురాలఁట! ఆమెబుద్ధిహీనతను స్థాపించుట కిది యొకగొప్ప హేతువుకాఁజాలదు. అదిగో భానుమతియే యిక్కడకువచ్చుచున్నది. నేఁడామె నాకంటి కత్యంతసౌందర్యవంతురాలుగాఁ గనుపట్టుచున్నది. ఆమెముఖమునం దిప్పుడు కొన్ని మోహచిహ్నములు నాదృష్టికి పొడకట్టుచున్నవి." అనునంతలో భానుమతి యతనిని సమీపించిస్వభావకటుమార్గమున "మనస్సులో నా కిష్టము లేకపోయినను వారు నిన్ను భోజనమునకు తోడుకొనిరమ్మని పంపఁగా వచ్చినాను" అని పిలిచెను.

అవల కెన్నఁడును ప్రతాపరుద్రుఁ డిటువంటి మృదువచనము లామెవిషయమయి తననోట రానిచ్చిన పాపమునఁ బోనివాఁ డయినను ఇప్పుడు మాత్రము "ఓసుందరీ! నావిషయమై నీవింతశ్రమపడినందుకు మిక్కిలి కృతజ్ఞుఁడ నయి యున్నాను" అని యామెమాటలకుఁ బ్రత్యుత్తరమిచ్చెను. భానుమతి మఱిరెండుమూడు మోటుమాటలని వెడలిపోయి తరువాత నప్పు డాడిన యామృదుత్వము తప్పినమాటలలో వలపును దెలిపెడు గూఢార్థ మేదో లోపల దాఁగియున్నట్టు తాము గ్రహించితినని భావించుకొని "ఈ చిన్నదానియెడల నే నిప్పుడు దయ చూపకపోయినయెడల నేను మహాక్రూరుఁడ నగుదును. ఈమెయెడల నేను ప్రేమవహింపనిపక్షమున నేను రాక్షసుఁడను. ఇప్పుడు పోయి నే నీమెసందర్శనము చేసికొనెదను." అని యతఁడు మనసులోని యుద్రేక మాపుకోలేక బిగ్గరగా ననెను.

ఈప్రకారముగాఁ బ్రతాపరుద్రునినిమిత్తమై వారు పన్నిన వలలో నతఁడు పడినందునఁ ఇఁక భానుమతివిషయమయి నిర్వహింపవలసిన యిందుమతివంతే మాత్రము మిగిలి యుండెను. అందుచేత నిందుమతి యీకపటనాటకప్రయోగమునకయి తనచేటికలయినచతురికానిపుణికలను పిలిపించి వారిలో నిపుణికనుజూచి "ఓచెలీ! నీవిప్పుడే పరుగెత్తుకొనిపోయి సల్లాపమందిరములో విజయవర్మతోను విక్రమబాహునితోను సంభాషించుచున్న నావదినె భానుమతిని జేరి చెవిలో నేకాంతము నేనును చతురికయు తనవిషయమై యేదో చెప్పుకొనుచు శృంగారవనములో విహరించుచున్నామనియు, నీవిప్పుడు రహస్యముగాఁ బోయి సూర్యకిరణములతోడ్పాటుచేతనే పరిపక్వఫలములను బొంది కృతఘ్నులవలె సూర్యకిరణములనే లోపలఁ జొరనీక వారించుచున్నద్రాక్షతీఁగ లల్లిబిల్లిగానల్లుకొన్న లతాగృహమునందుఁ బ్రవేశించి

మామాటలు వినవలసినదనియు, చెప్పుము" అని యుపదేశించెను. ఇప్పు డామె భానుమతినాకర్షింప నుద్దేశించినతీఁగలయిల్లింతకుమునుపు ప్రతాపరుద్రుఁడు సావధానముగాఁ దనమిత్రుల సంభాషణ మాలకించుచుఁ గూరుచుండిన పొదరిల్లే. "ఇదెంతపని? ఇప్పుడొక్కనిమిషములోనే నామె నిక్కడకు వచ్చునట్లు చేసెదను" అనిచెప్పి నిపుణిక యప్పుడే వెడలిపోయెను.

తత్క్షణమే యిందుమతి చతురికను దనవెంట నుద్యానవనమునకుఁ గొనిపోయి, "ఓచతురికా! భానుమతి యిక్కడకు వచ్చినప్పుడు మనమీపొదరింటిదగ్గఱనుండి ముందుకును వెనుకకును నడచుచు, ప్రతాపరుద్రునిగుఱించిమాత్రమే మాటాడవలెను. నే నాతని పేరెత్తినప్పుడెల్లను నీ వాతనిని బట్టు పొగడినట్టు పొగడుచుండవలెను. నేను నీతోఁ బ్రతాపరుద్రుఁడు భానుమతిని వలచి యెట్లు కామపీడపాలగుచున్నాఁడో యావిషయమునుగూర్చి ముచ్చటించెదను. మనముశీఘ్రముగా పనికారంభించవలెను. అదిగో భానుమతి మనమాటలు వినవలెనని గబ్బిలమువలె చెట్లనంటిపట్టుకొని పొదలచాటుననుండి యెట్లు ప్రాఁకుచువచ్చుచున్నదోచూడు" అని చెప్పిచూపెను. వారు తోడనే తమకథ వినిపించుటకారంభించి ఇందుమతి తన్నేమో చతురికయడుగఁగా నుత్తరముచెప్పుచున్న దానివలె "కాదు నిశ్చయముగాకాదు. ఓచతురికా! ఆబిడ యితరులయెడ మిక్కిలి తిరస్కారభావముకలది. ఆబిడ యెదుటివారిని మాటలచేత గడ్డిపఱకగా తీసివేసినను, ఆబిడ మనసుమాత్ర మడవిమృగమువలె బెదరుస్వభావము కలదేసుమా" అనిపలికెను. "ఓయిందుమతీ! ప్రతాపరుద్రునికి భానుమతిమీఁద నంత యధికప్రేమ యుండుటనిశ్చయమేకదా! అని చతురిక మరల నడిగెను. "నిశ్చయమని విజయవర్మయు నాప్రాణనాయకుఁడయిన విక్రమ

బాహుని నాతోఁజెప్పి యేలాగునైన భానుమతి కీసంగతి తెలుపు మని నన్నుబతిమాలుకొన్నారు; మీకుఁ బ్రతాపరుద్రునిపయి నిజమైన ప్రేమ యున్నపక్షమున మీరీసంగతి నెప్పుడును భానుమతికిఁ దెలియ నీయవలదని నేనువారికిహితబోధచేసినాను'' అనియిందుమతి చెప్పెను. ''అవును. ఆతనివల నామెకు తెలియనిచ్చుట యెంతమాత్రమును మంచిదికాదు. ఈవార్త కొంచెము మామెచెవిని బడినపక్షమున, ఆతని నెగతాళిచేసి బ్రతుకనియ్యదు'' అనిచతురిక మరలఁ బలికెను. ''ఓచెలీ! నిజమునకు ప్రతాపరుద్రుని మించినబుద్ధిమంతుఁడును గుణవంతుఁడును రూపవంతుఁడును పడుచువాండ్రలో నేనెఱిఁగినంతవఱకు నాదృష్టికి మఱియెవ్వరును గానరారు. అయినను భానుమతిమాత్ర మతనిని దూషించును'' అని యిందుమతి ప్రత్యుత్తరమిచ్చెను. ''అట్లు నిష్కారణముగా దూషించుట యామెకు నిశ్చయముగా యోగ్యమయినపని కాదు.'' అని చతురిక పలికెను. ''కాదు అయినను సాహసముచేసి యీమాట యాబిడతో నెవ్వరుచెప్పఁగలరు? నేను చెప్పినపక్షమున నన్ను పరిహాసముచేసి నిలువనియ్యదు'' అని యిందుమతి మాఱుపలికెను. ''ఓసఖీ! నీవు నీవదినెగారి స్వభావమును తిన్నగాఁ గనిపెట్ట లేదు. ప్రతాపరుద్రునివంటిధీమంతుని నిరాకరించుట కామె యంత బుద్ధిలేనిదనుకొన్నావా? కాదు'' అని చతురిక యనెను. ''ప్రతాపరుద్రుఁడు మంచిఖ్యాతి సంపాదించినాఁడు. ఒక్కనాప్రియభర్తను విక్రమబాహుని విడిచిపెట్టినపక్షమున కర్ణాటకదేశములో నితఁడే యగ్రగణ్యుఁడు అని యిందుమతి యాతనిని మెచ్చుకొనెను. అంత టితో నాప్రసంగమును మార్పవలెనని యిందుమతి సూచనచేయఁగాఁ జతురిక ''అమ్మా! నీవివాహమెన్నిదినములున్నది?'' అని యడిగెను. రేపటిదినమే వివాహమని చెప్పి, ''నేనుపెండ్లికిమంచి చీరయురవికయుఁ

దెప్పించుకొన్నాను. అవి నీవుచూచి యేలాగుననున్నవో చెప్పుదువు గాని నాతో రా'' అనియిందుమతి చతురికను దనవెంటఁ దీసికొని యింటికిఁబోయెను. భానుమతి వారిసంభాషణ మంతయు నత్యాదర ముతో వినుచుండి వారుదూరముగాఁ బోయినతరువాత తనలోదాను వారు నాచెవులలో నిప్పులుపోసి వెళ్ళినారు. ఇదియంతయు సత్యమే యగునా? ఓతిరస్కార భావమా! ఓగర్వమా! మిమ్ము నేటితో విడిచిపెట్టు చున్నాను. నాకు సెలవిండు. ఓప్రతాపరుద్రా! నన్ను కామించు చున్నావా! ప్రేమాస్పద మయిననీపాణిగ్రహణమునకయి నాదుష్ట హృదయమును సాదుచేసి నీవిషయమున నేఁజేసినయపరాధమునకిఁకఁ బ్రతిక్రియ చేసెదను'' అని తలపోయుచు మనస్సమాధానము చేసి కొనుచుండెను.

ప్రాఁతశత్రువు లిట్లాకస్మికముగా క్రొత్తమిత్రులయి యొం డొరులను వలచుటయు, సత్స్వభావము గలవిజయవర్మయొక్క వినోద కర మైనమాయోపాయమువలన పరస్పర మిత్రులుగావంచింపఁబడిన కాముకీకాముకులు ప్రథమసమావేశము పొంది సల్లాపసౌఖ్య మనుభ వించుటయు, చూచువారిహృదయముల కెంతో వేడుకగా నుండక పోదు. కాని యీలోపల నిందుమతికి సంభవించిన శోచనీయమయిన మరదృష్టకథనుగూర్చి మన మిప్పుడు చింతిల్లవలసి యున్నది. వివాహ మహోత్సవము నడచి సంతోషకరము కావలసిన యామఋచటిదిన మిందుమతికిని సౌజన్యనిధి యైనతజ్జనకునికిని తీఱనిమనోవ్యధను తెచ్చి పెట్టినది.

విజయవర్మ కరిష్టవర్మ యనుసవతితమ్ముఁ డొకఁడు కలఁడు. అతఁ డన్నతోఁగూడ యుద్ధభూమినుండి యిప్పుడుకళ్యాణనగరమునకు వచ్చి యుండెను. ఇతఁ డసంతుష్టుఁడును దుస్స్వభావము గలవాఁడు

నయి సదా పాపకార్యములు చేయుటకై యుపాయము లాలోచించు చుండును. ఈఖలుఁ డన్నగారిని అన్నగారిమిత్రుఁ డయినందున విక్రమబాహునిని, మనస్సులో ద్వేషించు చుండును. కాఁబట్టి యీ దుష్టుఁ డిప్పు డన్నగారికిని విక్రమబాహునకును మనోవ్యాకులత కలుగఁజేసి యందువలన తాను హీనమైనయానందమును పొందుట కయి యిందుమతియొక్క యీవివాహము నెట్లయిన చెడఁగొట్టవలెనని నిశ్చయించుకొనియుండెను. ఈవివాహకార్యమునందు విక్రమబాహున కెంత యుత్సాహము గలదో యంతయుత్సాహము విజయవర్మకును గలదని యరిష్టవర్మ దృఢముగా నెఱుఁగును. ఈదుష్టకార్యమును సాధించునిమిత్తము గొప్పబహుమాన మిచ్చెదనని యాశబెట్టి ప్రోత్సాహపఱిచి తనవలెనే దుర్మార్గవర్తనుఁ డయినవక్రబుద్ధియను వాని నొకనిని నియమించెను. ఈవక్రబుద్ధి యిందుమతి సేవకురా లయిననిపుణికను వివాహమాడవలె నన్నతలంపుతో దాని ననుస రించుచుండెను. ఈసంగతి కనిపెట్టి యరిష్టవర్మ వక్రబుద్ధిని రహస్య ముగా రప్పించి, ఇందుమతి నిద్రపోయినతరువాత నిపుణిక నేఁటిరాత్రి యిందుమతియొక్కబట్టలను ధరించుకొని విక్రమబాహుఁ డిందు మతియే యని నమ్మి మోసపోవునట్లుగాఁ దనయజమానురాలు శయ నించు మేడగదిలోనిగవాక్షములోనుండి నీతో మాటాడునట్లు చేయ వలె నని చెప్పి వాని నొప్పించెను. ఆదుష్టుఁడు కార్యవిఘాతముచేయ నుద్యోగించినది యీకుత్సితోపాయముచేతనే. ఈయేర్పాటు చేసి యరిష్టవర్మ శీఘ్రముగా విజయవర్మయొద్దకును విక్రమబాహునియొద్ద కును బోయి యిందుమతి యవివేకురా లనియు, నిశీథవేళయందు తన గదికిటికీలోనుండి పరపురుషులతో మాటాడుచుండు ననియు, వారితో జెప్పెను. ఇదియంతయు నిఁక రేపు పెండ్లి యనఁగా జరిగినది. అతఁ

డారాత్రియే వారినిద్దఱిని దీసికొనిపోయి చూపెద ననియు, గవాక్ష ములోనుండి యిందుమతి యన్యపురుషునితో సంభాషించు చుండఁగా వారే చెవులార వినవచ్చు ననియు చెప్పెను. అప్పు డరిష్టవర్మ వెంట వారిద్దఱును వచ్చుటకు సమ్మతించిరి. అంతట విక్రమబాహుఁడు విజయవర్మను జూచి, 'ఇందుమతిని వివాహ మాడకుండుటకుఁ దగి నంతదోష మేదియైన నేఁటిరాత్రి నా కిందుమతివద్ద కనఁబడినపక్షమున వివాహముహూర్తసమయమున బంధువు లందఱును జేరియున్నప్పుడు నేనామె నవమానపఱిచెదను' అని తనయుద్దేశము చెప్పెను. 'ఆమెను పెండ్లికూఁతునుగా కుదుర్చుటలో నీకు నేను సహాయుఁడ నయినందున ఆమె నవమానపఱిచి చిన్నపుచ్చుటలోఁగూడ నీకు నేను తోడు పడెదను.' అని విజయవర్మయుఁ జెప్పెను.

అరిష్టవర్మ నాఁటిరాత్రి యిందుమతియొక్క పడకగదిచెంతకు వారిని గొనిపోయినప్పుడు వక్రబుద్ధి వీధిలో మేడక్రిందగవాక్షమున కెదురుగా నిలుచుండి యుండుటయు నిపుణిక గవాక్షములోతలఁబెట్టి క్రిందనున్నవక్రబుద్ధితో మాటాడు చుండుటయు వారికంటఁ బడినవి. తా మావఱ కిందుమతి కట్టుకొని యుండఁగాఁ జూచినబట్టలనే యప్పుడు నిపుణిక ధరించుకొని యున్నందున, ఆమాటాడునది యిందు మతియే యని విజయవర్మయు విక్రమబాహుఁడును నమ్మిరి.

నేరమును తాను ప్రత్యక్షముగాఁ గనిపెట్టినా ననుకొన్నప్పుడు విక్రమబాహునికి వచ్చినకోపమునకు పరిమితి లేదు. నిర్దోషురా లయిన యిందుమతిమీఁద నాతనికిఁ గలప్రేమ యంతయు క్షణకాల ములో ద్వేషముగా మాఱిపోయినది. అతఁ డీవఱ కనుకొన్నప్రకా రముగా బంధువు లందఱిముందును దేవాలయములో నాయబల యపరాధము బయలఁబెట్టవలె నని నిశ్చయించుకొనెను; ఉత్తముఁ

డయిన విక్రమబాహుని వివాహ మాడఁబోవుచున్న దినమునకు ముందటిరాత్రియే మఱియొకపురుషునితో తనగదికిటికీలోనుండి సంభాషణ చేసినదుర్మార్గురాలి కెంతశిక్ష చేసినను అధికము కా దని యెంచుకొని విజయవర్మయు నాతనినిశ్చయము నామోదించెను.

మఱునాఁడు లగ్నసమయమునందు వివాహవేదికకు సమీపమున నందఱును జేరి కూరుచుండఁగా, పెండ్లికొడుకును పెండ్లికూఁతురును వచ్చి పురోహితునియెదుట నిలువఁబడిరి. అప్పుడు పురోహితుఁడు వివాహమంత్రముల నుపక్రమింపఁ బోవుచుండఁగా, విక్రమబాహువు మహారోషముతో దూషణభాషణము లాడుచు నందఱిముందఱను నిరపరాధిని యైనయిందుమతియొక్క దోషమును ఘోషించెను. అతఁ డప్పు డాడినవింతమాటల కద్భుతపడి నిశ్చేష్టురాలయి యిందుమతి నమ్రతతో 'ఇటువంటిమాట లనుట కిప్పుడు నాప్రాణనాయకుఁడు మతిస్థిమితము కలిగియే యున్నాఁడా?' అని మెల్లగా ననెను.

అప్పుడు వజ్రసేనుఁ డతిభయోద్రేకముచేత వడఁకుచు విజయవర్మవంకఁ జూచి 'ఓ మిత్రుఁడా! నీవు మాటాడవేమి?' అనెను. 'నే నే మని మాటాడను? నాప్రాణమిత్రుని నొకయయోగ్యురా లయిన కాంతతోఁ గూర్చుటకుఁ బ్రయత్నించుటచేత నేనుసహితము నవమానము పాలయినాను. ఓ వజ్రసేనా! ఈశ్వరసాక్షిగా చెప్పుచున్నాను. నేనును, నాతమ్ముఁడును, నొప్పినొందిన యీవిక్రమబాహుఁడును గతరాత్రి సట్టనడిరేయి యీమె తనగదికిటికీలోనుండి పరపురుషునితో మాటాడుచుండఁగాఁ గన్నులార చూచి చెవులార విన్నాము' అని విజయవర్మ పలికెను. ప్రతాపరుద్రుఁడు 'ఇది యంతయు చూడఁగా నాకిది పెండ్లికథలాగున నే కనఁబడు చుండలేదు' అని యద్భుతపడఁ జొచ్చెను.

'ఓ యీశ్వరుఁడా! సత్యము నీ వెఱుఁగుదువు' అని నోట మాట రాక మందభాగ్యురా లయినయిందుమతి గుండెలు పగిలి మూర్ఛిల్లి శవమువలె నేలఁ బడిపోయెను. ఇందుమతి మూర్ఛ తేఱునో లేదో చూచినదాఁక నిలువక వజ్రసేనునకుఁ దాము తెచ్చిపెట్టిన యాపదనైన లేశమును గణింపక విజయవర్మయు విక్రమబాహుఁడును దామచ్చటినుండి చివాలున లేచిపోయిరి. అప్పుడు వచ్చినకోపా వేశము వారి సంతతిని కఠినహృదయులను గాఁ జేసినది. ప్రతాప రుద్రుఁడుమాత్ర మక్కడ నట్టె యుండి యిందుమతిని మూర్ఛ తేర్చు టలో భానుమతికి సాయము చేయుచు 'ఆమె కెట్లున్నది' అని యడి గెను. "ప్రాణము పోయినట్లున్నది" అని చెప్పి, భానుమతి తనకు మఱదలియందుఁ గలప్రేమాతిశయమునుబట్టి యెంతో ఖేదపడెను. ఆచిన్నదానియొక్క సౌశీల్య నీతివర్తనములను చక్కగా నెఱిగినదగుట చేత భానుమతి తానప్పు డామెవిషయమైనమాటల నెంతమాత్రమును నమ్మలేదు. అదృష్టహీనుఁ డైనతండ్రిచర్య వేఱువిధముగా నుండెను. అతఁడు తనకోమార్తెయొక్క యపకీర్తికథను నమ్మినవాఁడయి, తన ముం దాచిన్నది మృతినొందినట్లు పడియుండఁగాఁ జూచి తెచ్చుకొన్న తలవంపు తొలఁగునట్లు మోడ్చినకన్నులు విప్పక యింతటితో మృతి నొందిన మేలుగా నుండునని కోరుచు నామెపయిని బడి విలపించు చుండుట యెంతయుఁ బరితాపకరముగా నుండెను.

వృద్ధుఁ డయినయాపురోహితుఁడు బుద్ధిశాలియు మానుష స్వభావమును చక్కగా గుర్తెఱిఁగినవాఁడు నయి యుండెను. తన మీఁద నితరులు దోషారోపణము చేయఁగా విన్నప్పుడు గలిగిన యిందుమతి ముఖలక్షణములను, అపరిమితలజ్జాభయము లామె మోమునఁ దోఁచుటయు, అంతలో వెలవెలపా టడరి యాచిహ్నము

లను కప్పివేయుటయు, తనకన్యాత్వదూషణమునుగూర్చి విజయవర్మ పలికినపలుకు లబద్ధము లని తెలుపుచుఁ గన్నులనుండి క్రోధాగ్ని బయలువెడలుటయు, అన్నియు నతఁడు జాగ్రత్తతోఁ గనిపెట్టి యిందుమతి యనపరాధిని యని నిశ్చయించి, చింతాక్రాంతుఁ డయి యున్న తండ్రినిఁ జూచి 'అయ్యా! ఈమె తప్పక నిర్దోషురాలు. తనపై మిథ్యాదోష మారోపించుటచేతనే యీమె యిట్లు మూర్ఛిల్లినది. నామాట సత్యము కానియెడల నీవు నన్నిఁక బుద్ధిహీనుఁడని పిలువ వచ్చును. ఇంతమాత్రము నే నీసుందరియొక్క నిష్కళంకతయే కని పెట్టలేకపోతినేని, నేను చదివినచదువును, నాలోకానుభవమును, నా వయస్సును, నాగౌరవమును, అన్నియు వ్యర్థములు కావలెను' అని దృఢముగాఁ జెప్పెను.

ఇంతలో నిందుమతి మూర్ఛ తెలియఁగాఁ బురోహితుఁడామెను జూచి 'అమ్మాయీ! వారు నీమీఁద నిందమోపినది నీ వేపురుషు నితో మాటాడు చుండఁగాఁ జూచితిమని?' అని యడిగెను. "నే నేపురుషుని నెఱుఁగను. ఆపురుషుఁ డెవఁడో నాకు నిందకట్టినవారికే తెలియవలెను' అని యుత్తరముచెప్పి తరువాతఁ దండ్రివంకఁ దిరిగి యిందుమతి 'ఓ తండ్రీ! అనర్థమైనవేళయందు నాతో నేపురుషుఁ డైన నెన్నఁడైన మాటాడినట్టుకాని నిన్నటిరాత్రి నే నెవ్వరితో నైన సంభాషించినట్టుగాని నీ కణుమాత్ర మైనదర్శనము కనఁబడినపక్షు మున నన్ను నీవిఁక నింటికి రానియ్యక ద్వేషించి చంపివేయుము' అని పలికెను.

"ఇంతలో విజయవర్మయు విక్రమబాహుఁడును తప్పక యేదో భ్రమపడినారు" అని పలికి పురోహితుఁడు వజ్రసేనునితో నీవీచిన్నది మృతినొందిన దని ప్రవాదము వేయవలసినదనియు, వారు వెడలి

పోయినప్పు డీమె మరణసదృశ మైనమూర్ఛలో నుండినందున సులభ ముగా నమ్ముదురనియు, అతఁడు మయిలపట్టి యథావిధిగా నపర క్రియలు జరపి స్మారకార్థ మయినట్లుగా సమాధిపయి నొకవేదిక నిర్మింపవలయుననియు, ఆలోచన చెప్పెను, "అట్లు చేయుటవలనఁ బ్రయోజనమేమి? ఎవరి కేమిలాభము కలుగును?" అని వజ్రసేనుఁ డడిగెను. "ఈమరణవార్తలవలన నెల్లవారిహృదయములలోనునిందా స్మృతి పోయి యీమెవిషయమయి జాలిపుట్టును. కలుగవలసిన ప్రయోజన మంతయు నింతేకాదు. తానాడినమాటలనుబట్టి యీమె మృతినొందినదని విక్రమబాహుఁడు విన్నప్పుడు ఆతనిధ్యానమంతయు నీమెమరణముమీఁదికిఁ బోవును. అప్పు డాతనిమనస్సులో నిజ మయినయనురాగలేశ మేమూలనయిననుండి యుండినపక్షమున, ఈమె యెడలఁ దాను జేసినదోషారోపణ మసత్యము కాదనియే యతఁడు భావించినను మనోవ్యాకులత నొంది యీమాట లేల-యనిపోతినా యని పశ్చాత్తాపపడకమానఁడు" అని పురోహితుఁడు చెప్పెను. "ఓ వజ్రసేనా! నీవు పురోహితుఁడు చేసినహితబోధ ననుసరింపుము. విజయవర్మమీఁదను విక్రమబాహునిమీఁదను నాకెంతప్రేమ యున్న దో నీకే తెలిసినను నే నీరహస్యమును వారికి వెల్లడిచేయ నని యిదిగో ప్రమాణపూర్వకముగాఁ జెప్పుచున్నాను." అని ప్రతాప రుద్రుఁడు చెప్పెను.

వజ్రసేనుఁ డప్పుడు వారు చేసినహితబోధ కొప్పుకొని, "నే నిప్పుడు దుఃఖసముద్రములో మునిఁగి యున్నందున గడ్డిపఱక చేతికి దొరకినను పట్టుకొనుచున్నాను." అని విచారగ్రస్తుఁ డయి పలికెను. దయార్ద్రహృదయుఁ డయిన యాపురోహితుఁ డప్పుడు వారి నోదార్చి ధైర్యము చెప్పుటకయి లోపలికిఁ దీసికొనిపోయెను. అప్పుడు ప్రతాప

రుద్రుడును భానుమతియు నొంటిగా నుండిరి; వారిమిత్రు లటువంటి వినోదకరతంత్రమును పన్ని తాము వేడుక ననుభవించ దలచు కొన్నది యీసమావేశసమయమునందే. ఆమిత్రు లిప్పుడు చింతా క్రాంతు లయి యున్నందున వేడుక యన్నతలంపే మరల నెప్పటికిని రాకుండ వారిహృదయములను పూర్ణముగా విడిచిపెట్టి పోయిన ట్లున్నది.

వారిలో ప్రతాపరుద్రుడు ముందుగా మౌనముద్రను విడిచి పలుకరించి, "ఓభానుమతీ ! నీ వింతతడవును దుఃఖపడుచునే యున్నావా?" అని యడిగెను. "ఇంతటితో తీఱలేదు. నే నింకను మఱికొంతసేపు దుఃఖపడియెదను" అని భానుమతి యుత్తర మిచ్చెను. "పాపము! నీమఱదలియెడ వారపరాధము చేసినారని నేను నిశ్చ యముగా నమ్ముచున్నాను" అని ప్రతాపరుద్రుడు పలికెను. "నా మఱదలి విషయ మయి యిటువంటిన్యాయవచనము పలికినపురుషుం డెంతయయిన నాగౌరవమున కర్హుడు" అని భానుమతి మెచ్చెను. "అటువంటిగౌరవమును జూపుట కేదైనమార్గ మున్నదా? ఈప్రపంచ ములోని దేనిమీదను నాకు నీమీద నున్నదానికంటె నెక్కువ ప్రేమ లేదుసుమా. ఇది నీకు వింతగా తోచవచ్చును" అని ప్రతాప రుద్రుడనెను. "నీవునామాట నమ్ముదువో లేదో కాని యీప్రపంచ ములోని దేనిమీదను నాకు నీమీద నున్నదానికంటె నెక్కువ ప్రేమలేదని నేనునుజెప్పగలను. నేనుజెప్పినది యసత్యముకాదు. నేనులేనిదియొప్పుకొనను; ఉన్నదిలేదనను. నామఱదలినిగూర్చి నాకు విచారముగానున్నది" అని భానుమతి బదులుచెప్పెను. "నేనుధరిం చిన యీఖడ్గముతోడు! నామీద నీకనురాగముకలిగినట్లే నాకును నీమీద గాఢానురాగము కలిగియున్నది. ఇంక నీసేవకుని కేమిపని

నియమించెదవో నియమింపుము.” అనిప్రతాపరుద్రుఁడు వచించెను. “విక్రమబాహుని వధింపుము” అని భానుమతి విధించెను. ప్రతాప రుద్రుఁడు విక్రమ బాహునియెడల మిక్కిలి స్నేహము గలవాఁ డగుటచేతను, అతఁడేదో భ్రాంతిచేత నట్లుచేసియుండునని నమ్మినవాఁ డగుటచేతను, “ఈప్రపంచమంతయు నాకు లభించినను నేనాపని చేయను” అని చెప్పెను. “నామఱఁదలి కట్లుపాపముకట్టితిరస్కారము జూపి ద్రోహముచేసిన యీవిక్రమబాహుఁడు వధ్యుఁడు కాఁడా? ఓహో! నేనేపురుషుఁడనైతినా?” అని యూరకుండెను. “ఓభాను మతీ! నామాట విను” అని యతఁడేమో చెప్పవచ్చెను. భానుమతి యతనిమాట కడ్డమువచ్చి “విక్రమబాహునిపక్షమునఁ జెప్పెడుమాట యేదియు నేను వినను. నామఱఁదలు కిటికీలోనుండి పరపురుషునితో మాటాడిన దఁట! ఇది యెంతమాట! ఆ ఖలునిమూలమున నిష్కార ణముగా నిరపరాధిని యైనసుశీల దుర్భాషలకు లోనయినది · అప ఖ్యాతిపాలైనది ; చెడిపోయినది. విక్రమబాహుని నిమిత్తమయినను నే నిప్పుడు పురుషుఁడనైతినా? లేదా నానిమిత్తమయి పౌరుషము చూపఁగలమగవాఁడు నాకిచ్చట మిత్రుఁడయ్యెనా ? కాఁడు. మగతన మంతయు వట్టితేనెమాటలలోను స్తుతిపాఠములలోను కరఁగిపోవు చున్నది. కోరికలవలన నే నిప్పుడు పురుషుఁడను కాఁజాలను. కాఁబట్టి నే నిఁక నాఁడుదాననై యుండి శోకములో మునిఁగి చావవలసినదే” అని భానుమతి తనమఱఁదలిపగ తీర్చుకొనుటకయి పౌరుషమెక్కిం చెడు మాటలతో నాతనిని పురికొల్పసాగెను. “ఓభానుమతీ! నీవు దొడ్డదానవు. కొంచెము శాంతి పొందుము. ఇదిగో నీమీఁద నాకు ప్రేమగలదని నీచేతిలోచేయి వేసెదను.” అని ప్రతాపరుద్రుఁడనెను. నిజముగా నే నీకు నామీఁద ప్రేమయున్నపక్షమున ప్రమాణముచేయు

టకుఁగాక నీచేతిని వేఱుపనికుపయోగింపుము'' అని యామె మాఱు పలికెను. 'నీమనఃపూర్తిగా నీవు విక్రమబాహుఁడిందుమతికపకారము చేసినాఁడనియే తలఁచుచున్నావా?' అని ప్రతాపరుద్రుఁడడిగెను. 'నామనఃపూర్తిగా ముమ్మాటికిని నేనాలాగుననే తలఁచుచున్నాను' అని భానుమతి యుత్తరమిచ్చెను. 'ఇఁకచాలును ఇదిగో నేను కృతప్రతిజ్ఞుఁడ నయినాను. ఇప్పుడే పోయి నేను విక్రమబాహుని పోరాటమునకుఁ బిలుచుచున్నాను. నీచేయి యొక్కసారి ముద్దుపెట్టుకొని వెడలిపోయి, కృపాణధారణప్రశస్త మయినయీహస్తముతో నాతనికి బుద్ధి కఱపెదను. నేను చెప్పినదందయుఁ జేసితీరెడువాఁడ నని భావింపుము. నీవిఁక హాయిగాఁబోయి నీమఱఁదలి నోదార్చుము' అని ప్రతాపరుద్రుఁడు పీరాలాపములు పలికెను.

ఈప్రకారముగా నిచ్చట భానుమతి ప్రతాపరుద్రునితో బలముగా వాదించి తన రోషభాషణములతో నాతనికి శౌర్యావేశము పుట్టించి యిందుమతిపక్షమునఁ బోయి ప్రియమిత్రుఁడయిన విక్రమబాహునితోఁ బోరాడుట కాతనిని డీకొల్పుచుండఁగా, అచ్చట వజ్రసేనుఁడు విజయవర్మవిక్రమబాహులయొద్దకుఁ బోయి పరాభవదుఃఖము చేత దనకూఁతురు ప్రాణములువిడిచినదని చెప్పి తనబిడ్డయెడలఁ జేసినఁ యపచారమునకుఁగాఁ దనఖడ్గమున కుత్తరము చెప్పవలసినదని వారిని యుద్ధమునకుఁ బిలుచుచుండెను. కాని, వా రాతనిముసలితనమునుశోకమును విచారించి యాతనియందుగౌరవముచూపి 'అయ్యా! ఈవార్ధకదశలో మీరు మాతో కయ్యము పెట్టుకొనకుఁడు' అని వారించుచుండిరి. ఈసమయమునందే ప్రతాపరుద్రుఁడుకూడ నక్కడకుఁబోయి ఖడ్గముదూసికొని నీ విందుమతికిఁ జేసినమహాపరాధమునకై యీఖడ్గమునకుత్తరవాదము చెల్లింపవలసియున్నదని విక్రమబాహుని తనతో

ద్వంద్వయుద్ధమునకుఁ బిలిచెను. "భానుమతి వీరావేశము తన కెక్కించి యాతని నీపనికిఁ బంపినది" అని విక్రమబాహుఁడును విజయవర్మయు దమలోఁ దా మనుకొనిరి. ద్వంద్వయుద్ధమునఁ గలిగెడియసందిగ్ధమైన పరీక్షకంటె నామెనిర్దోషత్వమును స్థాపింపఁగల ప్రబలతరమైన నిదర్శనము నాక్షణమం దీశ్వరుఁ డనుగ్రహింపక యుండినయెడల, ప్రతాపరుద్రునియొక్క యుద్ధాహ్వానము నంగీకరించిన విక్రమబాహున కాతనితోఁ ఘోరయుద్ధము జరిగియుండును.

విజయవర్మయు విక్రమబాహుఁడును ప్రతాపరుద్రునియొక్క యుద్ధాహ్వానమును గూర్చి చెప్పుకొనుట ముగింపకమునుపే దండవిధాయకుఁ డొకఁడు వక్రబుద్ధిని బంధించి తెచ్చి యపరాధినిగా రాజయిన విజయవర్మముందుఁ బెట్టెను. అరిష్టవర్మచేతఁ దా నాచారుణకర్మము నందునియోగింపఁబడినవార్తను వక్రబుద్ధి తనమిత్రులతోఁ జెప్పుచుండఁగా దైవికముగా నొకరిచెవిని బడినందున నేరము బయలఁ బడెను. విక్రమబాహుఁడు వినుచుండఁగా విజయవర్మయొక్కసన్నిధి యందు వక్రబుద్ధి తనలో నారాత్రికిటికిలోనుండి మాటాడినది యిందుమతీవేషమును ధరించి వారి కిందుమతి యను భ్రమపుట్టించిననిపుణిక కాని యిందుమతి కాదని చెప్పి తన నేర మొప్పుకొని, ఉన్న సత్యమంతయుఁ జెప్పివేసెను. ఆమాటలతోనే వారికిందుమతియొక్కనిరపరాధత తేటపడి యావఱకువారిమనసులోనున్న యనుమానమంతయు నివారణమయ్యెను. ఇంకనుసంశయలేశ మేమూలనైనను వారిహృదయములలో నించుక దాఁగియున్నయెడల, అదియును తనగాష్ట్యము వెల్లడియగుటచే నన్నగారికోపమునకు వెఱచి యాకస్మికముగా కళ్యాణనగరమును విడిచిపోయిన యరిష్టవర్మయొక్కపలాయనవార్త వలన నిర్మూల మయ్యెను.

ఇందుమతిమీఁద తాను నిర్హేతుకముగా నిందమోపితినని తెలిసి కొన్నప్పుడు విక్రమబాహుఁడు తన క్రూరవాక్యములవలననే యామె మృతినొందినదని యెంచుకొని మనస్సులో నింతంతనరాని పరితాపము నొందెను. అప్పుడామెగుణవిశేషము లన్నియు తలఁపునకు వచ్చి మొట్టమొదట నాతఁడు మోహించినట్టిరూపముతో నాయబలయొక్క సుందరవిగ్రహ మాతనికన్నులకుఁ గట్టినట్లగపడెను. 'నీవిప్పుడు విన్న మాటలు నీమనస్సునకు శూలములవలె నాటుకొనలేదా?'' అని విజయవర్మ యడుగఁగా, 'వక్రబుద్ధి నిజకథ చెప్పుచున్నప్పుడాతనిమాటలొక్కొక్కటియే విషశరప్రయోగమువలె నాహృదయమునఁ బ్రవేశించి ప్రత్యవయవమును నొప్పించి యంతకంతకు మర్మచ్ఛేదము చేయుచున్నవి' అని యాతఁ డుత్తరము చెప్పెను. పశ్చాత్తప్తుఁడయి వేఁగుచున్న విక్రమబాహుఁ డప్పుడు వజ్రసేనునిపాదముల మీఁదబడి 'నిర్దోషురాలయిన నీకొమార్తెమీఁద నిష్కారణముగా దోషారోపణముచేసిన తప్పుమన్నింపు' మని వేఁడుకొని, తననూతనవధువుపై లేనిదోషమును నమ్మిన పాపమునకు శిక్షగాఁ దనకిప్పుడేమిప్రాయశ్చిత్తము విధించినను దనప్రియురాలినిమిత్తమె సహించి దానికిలోఁబడెదనని చెప్పెను. రూపమునం దిందుమతిని బోలినట్టియు నిప్పుడు తనకుత్తరాధికారిణిగా నేర్పడినట్టియుఁ దనస్వీకృతపుత్రిక నొకదానిని మఱునాఁటియుదయముననే పెండ్లియాడ వలయునని వజ్రసేనుఁడతనికిఁ బాపపరిహారార్థముగాఁ బ్రాయశ్చిత్తమును విధించెను. తన్ను వివాహమాడుమన్న కన్యయెట్టిదో యెఱుఁగనివాఁ డయినను విక్రమబాహుఁడాడినమాట తప్పనివాఁడయినందునఁ దానాకన్య కుబ్జయైనను దప్పక పాణిగ్రహణము చేసికొనెదనని వాగ్దానముచేసెను. ఆతనిస్వాంతమంతయు దురంతచింతాక్రాంతమయి వేఁగుచున్నందున నిప్పులలోఁ

కరలించినట్లు బాధపడుచు నిద్రపట్టక లేచిపోయి యాతఁడారాత్రి యంతయుఁ దనప్రియురాలికయి వజ్రసేనుఁడు కట్టించినసమాధియొద్దకు పోయి కన్నీటితో దానినభిషేకించుచు విలపించుచు నిమిష మొక్కొక యుగమువలె నక్కడఁ గడపెను.

మఱునాఁటి ప్రాతఃకాలమున నతఁడు తనమిత్రుఁడైన విజయవర్మతోఁగూడ దేవాలయమునకుఁ బోవునప్పటికే పురోహితుఁడును వజ్రసేనుఁడును మేనకోడలును రెండవవివాహమును నడుపుటకై యచ్చటఁ గూడియుండిరి. అప్పుడు వజ్రసేనుఁడు వాగ్దత్తయైన క్రొత్త పెండ్లికూఁతును దెచ్చి విక్రమబాహునియెదుట నిలిపెను. విక్రమబాహునకు మొగము కనఁబడకుండునట్లుగా నావధు వప్పుడు మేలిముసుఁగు వేసికొనియుండెను. "ఓసుందరీ! పుణ్యాత్ముఁడైనయీపురోహితునిసమ్ముఖమందు నీహస్తము నాచేతికిమ్ము; నీకు నన్నువరింప నిష్టమున్నచో నీపాణిగ్రహణముచేసి యిదిగో నీభర్తనగుచున్నాను" అని తెరలోనున్నయువతినిగూర్చి విక్రమబాహుఁడుపలికెను. "వెనుక నేను బ్రతికియున్నప్పుడే నేను నీప్రథమభార్యను" అని ప్రచ్ఛన్నురాలైన యాయువతి పలికి, మొగమునుండి మేలిముసుఁగు తీసివేసి యావలకు భ్రమగొల్పినరీతిగా వజ్రసేనుని పెంపుడుకూఁతురుగాక కన్నకూఁతురైన వెనుకటియిందుమతియే మరలనయ్యెను. ఇందుమతి మృతినొందిన దనుకొనుచుండిన విక్రమబాహున కీయింద్రజాలమద్భుత ప్రమోదజనక మయినందునఁ గొంతసేపతఁడుసంతోషపరవశత్వములో తనకన్నులనేతాను నమ్మలేకపోయెను. విక్రమబాహునివలెనే యద్భుత రసాక్రాంతుఁడయియున్న విజయవర్మ సంతోషమునుపట్టఁజాలక "ఇది మృతినొందిన యిందుమతిరూపము కాదా?' అని యాశ్చర్యపడ సాగెను. అప్పుడు వజ్రసేనుఁ డాతనినిజూచి 'ఓరాజా! తనమీఁదియుప

వాడము జీవించి యున్నంతవఱకును మృతులా లయియుండి, ఆయప వాడము చావఁగానే యిందుమతి పునర్జీవితులా లైనది' అనెను. ఈయద్భుతకథ యంతయు వివాహ మయినతరువాత సావకాశ ముగా వారికి విప్పిచెప్పెద నని వాగ్దానముచేసి పురోహితుఁడువివాహ తంత్రమును నడపుచుండఁగా, ప్రతాపరుద్రుఁడువచ్చి యీసమయము నందే తనకును భానుమతికిని గూడ వివాహము చేయవలసిన దని కోరెను. దాంపత్యమునకు భానుమతి కొంచెము సందేహించు చున్నట్లు కనఁబడఁగాఁ బ్రతాపరుద్రుఁడు నీగుట్టంతయు నిందుమతి వలన నెఱిఁగినాఁడనని యామెకుఁ దనమీఁదఁ గలమోహాతిశయ మునుగూర్చి చెప్ప మొదలుపెట్టినపుడు వా రావిచిత్రనాటకప్రయో గము నంతను బయటఁబెట్టిరి. ఒండొరులమీఁద నెన్నఁడును లేనిప్రేమ మున్నట్టు చెప్పఁగా నమ్మి యిద్దఱును మోసపోవుటయు, అసత్య మయినవినోదక్రీడయొక్క ప్రభావమువలననే తా మిరువురును సత్య మయినయన్యోన్యానురాగము పొందినవా రగుటయు, వా రప్పుడు కనిపెట్టిరి. మోసపుతంత్రముచేతఁ గూర్పఁబడిన వారిపరస్పరప్రణయ పాశము వారిహృదయముల నినుపగొలుసువలె దృఢముగా బంధించి యిప్పు డీస్పష్టీకరణశాతహేతికిని దుశ్ఛేద్య మయ్యెను. ప్రతాప రుద్రుఁడు తా నామెను పరిణయ మయ్యెదనని చెప్పినందునఁ దన్ను గూర్చి లోక మేమనుకొనునో యనుచింత యావంతయుఁ బొందక యితరులపరిహాసమును లెక్కగొనకుండుటకు నిశ్చయించుకొనెను. అందుచేత నతఁడు ముందు తమ్మితరులు చేయఁబోయెడుపరిహాసము నకుఁ దానే యిప్పు డుపక్రమించి నవ్వుచు "ఓ ప్రాణేశ్వరీ! నీవు నామీఁదవలపుచేతఁ బ్రాణములు విడుచుచున్నా వని విని నీమీఁది జాలిచేతనే నిశ్చయముగా నిన్నిప్పుడు వరించు చున్నాను సుమా!"

అని నవ్వెను. "ఓ ప్రాణేశ్వరా! నామీఁదిప్రేమచేత నీవు కృశించి ప్రాణత్యాగము చేసికొనఁబోవుచున్నా వన్నవార్త విని నీప్రాణము లను కాపాడుటకొరకే నేనును లోఁబడినాను సుమా!" అని భానుమతి ప్రత్యుత్తరమిచ్చెను. ఈ ప్రకారముగా మనస్సమాధానముచేసి కొని యీపిచ్చిదంపతు లితరేతరప్రియు లయినందున నిందుమతీ విక్రమబాహులవివాహానంతరమున వారివివాహముకూడ యథా విధిగా జరపఁబడెను. ఈసంక్షోభమున కంతకును కారకుఁ డయిన యరిష్టవర్మ కల్యాణపురమును విడిచి పాఱిపోవుచుండఁగాఁ ద్రోవలో బట్టుకోఁబడి యీసమయమునందే యిక్కడకుఁ దీసికొని రాఁబడెను. కుతంత్రమువలన తాను భంగము చేయఁదలఁచుకొన్న యీవివాహ మహోత్సవము కన్నులలో నిసుక పోసినట్లుగాఁ దనకన్నులయెదుటనే మహావైభవముతో జరగినందున, అసూయాపరుఁడయి యాశా భంగముఁ నొంది సగము చచ్చియున్నయరిష్టవర్మ కాపెండ్లివేడుకలును విందులును సంతోషమునుజూచి పరితపించుటకంటె నెక్కువశిక్ష వేఱొకట్టి యప్పుడక్కఱలేకపోయెను.

సంపూర్ణము.

---

బాలసాహిత్య ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## స్త్రీల కుపయోగించుకథలు

**అయిదవ సంపుటము**

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

**ఆఱవ సంపుటము**

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

## ఉపన్యాసములు

**ఏడవ సంపుటము**

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హాకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సకాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక [illegible]

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్ర కవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శాస్త్రి ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# సరసజన మనోభిరామము



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
1950

[వెల రు. 0-4-0

శ్రీ త్రి శే షు లై న రా వు బ హ ద్దూ రు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధి పత్యము
5 ప్రహ్లాద నాటకము
6 [illegible]
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బ ం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ
యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన
నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 [illegible]

# సరసజనమనోభిరామము.



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

**1950**

కాపీరైటు

# ఈ కథ యందు వచ్చు పాత్రములు



## పురుషులు

విక్రమసింహుఁడు—కళింగపట్టణనివాసుఁడైనయొక రాజపుత్రుఁడు; మోహినిభర్త.

వీరసేనుఁడు—ఉత్కలదేశపురాజు ; చాతుర్యవతిభర్త.

జలధీశుఁడు—విక్రమసింహునిప్రాణము కాపాడిన యోడనాయకుఁడు

శూరవర్మ—చాతుర్యవతి పురుషవేషము వేసికొనియున్నప్పుడు పెట్టుకొన్న పేరు.

## స్త్రీలు

చాతుర్యవతి—కళింగదేశపురాచకూఁతురు; విక్రమసింహుని చెల్లెలు, వీరసేనుని రాణి.

మోహిని—ఉత్కలదేశపురాజపుత్రి ; వీరసేనుని నిరాకరించి విక్రమసింహుని వివాహము చేసికొన్నయువతి.



శ్రీ

# సరసజనమనోభిరామము



కళింగదేశమునకు రాజధానియైనకళింగపట్టణమునందు విక్రమసింహుఁ డనుయౌవనపురుషుఁ డొకఁడును చాతుర్యవతియనుయౌవనస్త్రీయొకతెయును తోఁబుట్టువులుగలరు. క్షత్రియవంశమున కలంకారముగా జన్మించిన యాయిద్దఱును కవలవా రగుటచేత రూపమునందుమాత్రమును భేదములేనివారయి యెఱిఁగినవారుసహిత మొకరిని జూచి యొకరని భ్రమపడునంత యాకారసామ్యము గలవారయి స్త్రీపురుషులగుటచేత వస్త్రధారణమునందుఁ గలిగినభేదమే లేకపోయినయెడల గృహమునఁ గలవారుసహితము వారిని వేఱువేఱు నానవాలుపట్టుట దుస్సాధ్యముగా నుండెను. వారిరువురును నిరుపమానసౌందర్యము గలవారయి చూచువారికన్నుల కుత్సవము చేయుచుండిరి. వారు గంగాయాత్ర చేయవలెనని యొకయోడమీఁద వంగదేశమునకు సముద్రయానముచేయుచుండఁగా వారెక్కినయోడ పగిలిపోయి యేకకాలమునందు జననమొందినయాయిరువురు మరల నేకకాలమునందే మరణమునొందవలసినగతిపట్టినట్టు కనఁబడెను. వారెక్కినయోడ గాలివానచేత నొకపర్వతమునకుఁ దగిలి పగిలిపోఁగానందున్నవారిలోఁ గొందఱుమాత్రమే ప్రాణములు దక్కించుకోఁగలిగిరి. ఆసమయమునం దానౌకాధికారి చావఁగా మిగిలినతనపడవవాండ్ర నొక్కచిన్నపడవలో నెక్కించుకొని వారితో చాతుర్యవతిని గూడఁ దీసికొనిపోయి యుత్కలదేశమున కప్పుడు రాజధానిగా నున్న పురుషోత్తమపురమునందు వారి నందఱిని సురక్షితముగ దించెను.

అప్పుడు చాతుర్యవతి తానుబ్రతికినందుకు సంతోషపడుటకుమారుగాఁ దనసహోదరునికి సంభవించినవిపత్తును దలఁచుకొని దుఃఖపడసాగెను. ఆమెదుఃఖమును జూచి జాలిపడి యానౌకాధిపతి యోడ పగిలినప్పు డామెసోదరుఁ డొకతెరచాపకొయ్యను పట్టుకొని యీఁదుచు నీటి పయిని తేలి యొడ్డువంకకుఁ బోవుచుండఁగాఁ దాను జూచితి ననియు నాతనికిఁ బ్రాణభయము లేదనియుఁ జెప్పి ధైర్యము చెప్పి యామె నోదార్చెను. ఆతఁడు చెప్పినధైర్యపుమాటలవలన, జాతుర్యవతి కొంత యూఱట పొంది, ఈక్రొత్తదేశములో నాకస్మికముగా నేకాకిని యయిపోయిన తనగతి యిఁకముం దేమి కావలయునా యని యాలోచించుచు, ఆనౌకాధికారిని జూచి "అన్నా! ఈదేశమును గుఱించి నీ కేమైనఁ దెలియునా?" అని యడిగెను. 'ఈరాజధానికిఁ గొన్నిదినముల ప్రయాణములోనే నేను పుట్టిపెరిఁగినవాఁడ నగుటచేత నాకీ దేశమునుగతి చక్కఁగాఁ దెలియును' అని యతఁ డుత్తరము చెప్పెను. 'ఈదేశము పాలించుప్రభు వెవ్వరు?' అని యామె మరల నడిగెను. ఉత్కలదేశమును వీరసేనుఁ డనురాజు పాలించు ననియు, అతఁడు మహాగుణపరాక్రమసంపన్నుఁ డనియు, ఆనౌకాధిపతి చెప్పెను. 'అవును, వీరసేనుని పేరు నే నీవఱకే వింటిని. అతఁడవివాహితుఁడనియు నసమానరూపగుణసంపన్నుఁ డనియు మాతండ్రిగారు చెప్పుచుండెడి వారు' అని చాతుర్యవతి పలికెను. "ఆతని కిప్పటికిని వివాహము కానే లేదు. నెలదినములక్రిందట నేనీపట్టణమునకు వచ్చినప్పు డతఁ డొక సామంతప్రభువుకూఁతు రయిన మోహిని యనుయువతీరత్నమును గామించియున్నాఁడనియు, సంవత్సరముక్రిందట నామెతండ్రియు దద నంతర మల్పకాలములోనే యామెప్రియసోదరుఁడును లోకాంతరగతు లయినందున నాసుందరి చింతాక్రాంత యయి పరులమొగము చూడక

పురుషులతో సంభాషింపకున్నదనియు, జనులప్పుడు చెప్పుకొనుచుండిరి' అని యతఁడు తానెఱిఁగినది చెప్పెను. తనవలెనే భ్రాతలనుపోఁగొట్టుకొని ప్రేమాతిశయముచేత నాతనినిమిత్తము శోకించుచున్న యాయుత్తము రాలినిజూచి సేవింపవలె నన్నయభిలాష తనకుఁ గలిగినదని చెప్పి, తిన్నామెయొద్దకుఁ గొనిపోయి యొప్పగింత పెట్టఁగలవాయని యాతని నడిగెను. సహోదరమరణదినము మొదలుకొని మోహిని యితరుల నెవ్వరిని జూచి మాటాడకుండుటచేతను, అప్పటినుండియు నామె రాజునకు సహితము దర్శన మీయకుండుట చేతను, అపని యసాధ్య మని యతఁడుచెప్పెను. అంతట చాతుర్యవతి యాప్రయత్నమునుమాని వేసి పురుషవేషము వేసికొని రాజునద్దనే యొకసేవకుఁడుగా కొలువుకుదర వలె నని మనస్సులో నొకయాలోచన చేసెను. యౌవనవతియైన యొకచిన్నదానికి పురుషవేషమును ధరించి పురుషునివలె నటింపవలె నన్నబుద్ధి పుట్టుట వింతయే యయినను, వింతదేశములో నేకాకినియు రూపవతియు యౌవనవతియునయియున్న తనయసహాయత్వమునుదలచు కొని చాతుర్యవతి యాపనికినిశ్చయించుకొనెను. ఈయాలోచనను దన పరిణదాతయైననౌకాధికారితోఁ జెప్పుటకు మొట్టమొదట కొంచెము సంకోచపడినను, ఆతని సత్స్వభావమును తనయెడలఁగలవాత్సల్యమును విచారించి తనయభిమతము నాతనికిఁ దెలుపఁగా నతఁడామెకు సాయము చేయుటకుఁ బూనుకొనెను. అప్పుడామె యాతనిచేతికిఁ గొంతసొమ్మిచ్చి పరిమాణమునందును వర్ణమునందును సరిగాఁ దనసోదరుఁడు ధరించుకొనురీతిబట్టలను తెచ్చిపెట్టుమని వేఁడుకొనెను. ఆమె నియమించినరీతిగా నతఁడు వస్త్రములనుసిద్ధముచేయించి తీసికొని రాఁగా, ఆయాతనవస్త్రములను ధరించి యచ్చునఁబోడిచిన ట్లామె తనసోదరుని వలె నయ్యెను. దైవికముగా నామెసోదరుఁడయినవిక్రమసింహుఁడు

కూడ జలగండమును తప్పించుకొని బ్రతికి యీపట్టణమున కొకసారి వచ్చుట తటస్థించినందున, ఈనూతనవస్త్రధారణమునుబట్టి యప్పుడు కలిగినభ్రమలనుగూర్చి ముందు యుక్తసమయమున ముచ్చటింపఁబడును.

చాతుర్యవతికి హితకాముఁడయినయానౌకాధికారి రాజాస్థానమునందుఁ గొందఱాప్తులను గలవాఁడగుటచేత స్త్రీని పురుషునిగా మార్చివేసినతరువాత శూరవర్మ యని నూతననామకరణము చేసి యామెనుగొనిపోయి రాజసందర్శనము చేయించెను. ఆ యపూర్వసుందరపురుషునియొక్క వాక్యనైపుణికిని వినయ వర్తనమునకును సంతోషించి రా జాతని తనయంతరంగభృత్యునిగాఁ జేకొనుట కంగీకరించెను. చాతుర్యవతియొక్క మనోరథ మంతయు నిం తేయయినందున నామె కృతార్థురాలయి నాఁటు మొదలుకొని వినయభక్తులతో స్వకృత్యములను రాజుమనస్సున కెక్కునట్లుగా నిర్వహించుచు శీఘ్రకాలములోనే సమస్తభృత్యవర్గములోను దానొక్కతయే రాజునకు నమ్మినబంటయ్యెను. అందుచేత రాజు మనసు గలిసినపరిజనునియొద్దఁ దన రహస్యము నేమియు దాపురముచేయక తాను మోహినిని మోహించుటను గూర్చినచరిత్రమునంతను శూరవర్మతోఁ జెప్పెను. చిరకాలము నుండి తాను మోహినిని కామించి యామె యనుగ్రహసంపాదనమునకయి ప్రయత్నముచేయుచుండుటయు, సౌందర్య గర్వముకలదయి యామె తనప్రార్థనలను పెడచెవులనుబెట్టి తనకు దర్శనసుఖమయినను నియ్యకొల్లక నిరాకరించుచుండుటయు, ఏకాంతమునఁ దొకనాఁడు తనవలపుకథ యాద్యంతమును వీరసేనుఁడు శూరవర్మతో నేకరువు పెట్టెను. అవ్యాజానురాగము గలతనప్రార్థనలయం దనాదరముచూపి పసన్నురాలు కాకున్న యాసుందరిమీఁదివలపు మరలించుకోలేక

యతఁడు కామావేశవివశుఁడయి ప్రపంచమంతయు మఱచి, తన కావలకుఁ బ్రాణతుల్యము లయి యుండినమృగయావినోదము మొదలయినవ్యాయామములనెల్లవిడిచి యాఁడుదానివలె నింటఁగూరుచుండి శృంగారగీతములను వినుచు బ్రొద్దులుపుచ్చుచుండెను. అంతేకాక యతఁడు కొలువుచేయుటసహితము చాలించి, బుద్ధిమదగ్రగణ్యులును విద్వద్వరేణ్యులు నయినతనమంత్రులతో రాజకార్యతంత్రములను గూర్చియైన మాటాడనొల్లక యిష్టకథాగోష్ఠిని సర్వదాశూరవర్మతో నుబుసుపుచ్చుచుండెను. లోకోత్తరుఁడయి యుండిన తమప్రభురత్నమున కిప్పుడు శూరవర్మ యనునాగనిమిత్తుఁడొకఁడు దొరకెనని సభాసదులు విచారించుచుండిరి.

వయస్సులో నున్నకన్యలకు వయోరూపసంపన్ను లయినప్రభువులవద్ద చనవరులుగానుండుట క్షేమకర మయినపని కాదు. ఈసంగతి కిప్పుడు చాతుర్యవతియే నిదర్శనభూతిమైనది. ఇంతకుమును పాతఁడు మోహినిమీఁదివలపుచేతఁ దా నెట్టియవస్థపాలైతి నని చెప్పెనో యాయవస్థయే యిప్పుడు వీరసేనునిమీఁదివలపుచేత చాతుర్యవతికి సంప్రాప్త మయ్యెను. అసమానసౌందర్యనిధి యైనయాతనిరూపము నొక్కసారి కన్నులఁ గాంచనోచినయే సుందరియు కామబాణముల పాలు కాకుండ సంభవింపనేరదని భావించుకొని యింతటిరూపవంతుఁడైన భూకాంతుని మోహిని యేలనిరాకరించెనాయనియద్భుతపడుచు, సౌందర్యగర్వముచేతఁ గన్నుగానక యటువంటి యోగ్యగుణములను గనిపెట్టఁజాలని చెలువపై వలపునిలుపుట శోచనీయమనిసూచించుచు 'ఓమహాప్రభూ! దేవరవా రిప్పుడు మోహినిని కామించినట్లే దేవరవారిని వేఱొకసుందరి కామించినదనుకొందము. దేవరయామెను బదులు కామింపఁజాలరేని, దేవర తా మామెను గామింపఁజాలమని సెలవిచ్చి

నప్పుడామెయాప్రత్యుత్తరముతో సంతుష్టిపొంది యూరకుండవలసినది కాదా?' అని యామె వినయముతో వీరసేనునిజూచి పలికెను. తా నిప్పుడు మోహినిని కామించినంతగాఢానురాగముతో లోకములోని జవ్వనియెవ్వతెయు నేపురుషునిని గామించుట యసాధ్యమగుటచేత నిప్పుడు చెప్పినయుక్తి సహేతుకముగా నుండలే దనియు, ఇటువంటి యపారప్రేమ పట్టఁగలిగినంతగొప్పమనస్సు భూలోకములో నేకాంతకు నుండఁజాలదుగాన మోహినిమీఁదఁ దనకుఁగలవలపును దనమీఁద నొకకాంతకుఁ గలుగఁగలవలపుతో నుపమించుట తగవుకా దనియు, రా జుత్తరమిచ్చెను. అతని మాటలయందుఁ జాతుర్యవతి కెంతగౌరవ మున్నను, రాజు మనస్సులో నున్నదానికంటె నెక్కువయనురాగరసముతో తనమనస్సు నిండియున్నదని నమ్మియున్నందున రా జప్పుడు పలికినపలుకులు సత్యములని యామె విశ్వసింపలేక, "ఓమహారాజా! నేను నిశ్చయముగా నెఱుఁగుదును—" అని సగముచెప్పి చాతుర్యవతి యూరకుండెను. 'ఓశూరవర్మా! నీవేమెఱుఁగుదువు?' అని రాజడిగెను. 'పురుషులయెడ స్త్రీల కెంతప్రేమ యుండవచ్చునో నేనెఱుఁగుదును. అనురాగవిషయమున మనమనస్సు లెంతయుదారములో స్త్రీల మనస్సులునంతయుదారములయినవే. నాతండ్రికొక్కకూఁతురుగలదు. నేనే స్త్రీ నయినపక్షమున దేవరవారియందు నా కెంతప్రేమ యుండవలెనో యామె కొకపురుషునిమీఁద నంతప్రేమగలదు.' అనిచాతుర్యవతి యుత్తరము చెప్పెను. 'ఆమెవలపుకథ యేమి?' అనివీరసేనుఁడు మరల నడిగెను. "ఏమియు లేదు. ఆమెవలపంతయు నడవినిగాచిన వెన్నెలవలె నున్నది. ఆమె తనవలపును బరులతోఁ జెప్పక లోపలనే దిగమ్రింగుటచేత, తామరమొగ్గలోఁ జేరిన చీడపురుగువలె హృదయాంతరాళమునందే యుండి బాధించుచునామెవలపు లవలీదళముల

వంటిలేఁజెక్కులను వాఁడబాఱునట్లు చేయుచున్నది. ఆమె మనస్తాప మును బొందుచుండియు లోపలిశోకమును వెలిఁబాఱకనీయకలోని వ్యధను ముఖమునందలిమందహాసముచే నడఁచుచుఁ బయికిఁ దాలిమి యంతయుఁ జేరి మూర్తీభవించినట్లు కనఁబడుచున్నది” అనిచాతుర్య వతి పలికెను. ఆసుందరి మేరమీఱినవలపుచేతఁ బ్రాణములు విడువక నిలుపుకోఁగలిగినదా యని రాజడుగఁగా, ఆప్రశ్నకుసదుత్తరమియ్యక మనసులో రాజుపయిని దనకుఁ గలవలపును కామాగ్నిచేతఁ దాను బొందుచున్నదురంతతాపమును దెలుపుటకొఱకే యీకథనుగల్పించిన దగుటచేత నీళ్ళునమలుచు నేవేవో దూరసంబంధము గలకథలు చెప్పసాగెను.

ఈసంభాషణము జరగుచుండఁగా రాజు మోహినికడకుఁ బంపినదూత యొకఁడు వచ్చి, “ఓమహారాజా! ఆమె నాకు దర్శనమే యనుగ్రహించినదికాదు. అయినను ‘ఏడుసంవత్సరములవఱకును నేను బయలికి వచ్చి యెండమొగమయినను జూడఁగలదానను గాను. అకాలమరణము నొందినప్రాణాధికుఁ డయిననాయన్న గారినిమిత్త మయి నిరంతధారఁగాఁ గాఱుచున్నకన్నీటివెల్లువతో నట్టిల్లుతడుపుచు మూల ముసుఁగువేసికొనియీగదిలోనే కూరుచుండెదను.’ అని యామె దేవరవారితో మనవిచేయవలసిన దని తనచెలికత్తెచేత సందేశము పంపినది” అని విన్నపము చేసెను. ఆమాటలు విని రాజు ‘ఉహో! తనసోదరు నీలోకమునుండి యీడ్చుకొనిపోయిన కాలపాశముచేతనే యింతగా నాకర్షింపఁబడి వగలపా లగుచున్నయీ మెమ్మృదుహృద యము కామునిబాణములే నాటుకొన్నపక్షమున పీడనికూరిమిచే నిఁక నెంతటి సంతాపముపాలు కాఁగలుగునో!’ అని యాశ్చర్యపడుచు జాతుర్యవతిని జూచి ‘ఓశూరవర్మా! నామనస్సులోని గుట్టంతయు

నీకుఁ జెప్పి యున్నానుగదా! నీ వొక్కసారి యిప్పుడు నాపాలిటి మోహినీదేవత యైనయామోహినియాలయమునకుఁ బోయి, ఆమె సుందరవిగ్రహమును దర్శించువఱకును గృహమున నాటిన స్తంభము వలె ముంగిట పాతికొని యుండి, దర్శనము ప్రసాదించినదాఁక నీ కా లక్కడనుండి కదల దని నీమనోనిశ్చయము నామెకుఁ దెలుపుము'అని వేఁడుకొనెను. 'ఆమె దర్శనమిచ్చి మాటాడ ననుగ్రహించినపక్షమున నే నప్పుడు చేయవలసినపని యేమి?' అని చాతుర్యవతి యడిగెను. 'ఓ మిత్రుఁడా! తత్క్షణమే నాకామోద్రేకకథ యంతయు విప్పి చెప్పుము. నాకామెయెడఁ గలయనురాగాతిశయమునుగూర్చి సావకాశముగా దీర్ఘసంభాషణముచేసి సర్వము సవిస్తరముగా విన్నవింపుము. గంభీరస్వభావము గలమఱియొకదూత చేసెడుబోధకంటె నితరులదుఃఖకథను బ్రత్యక్షముగా ననుభవించు చున్నట్లు నటించుచు వినిపింపఁగల నీదయనీయవాక్యము లామెచెవుల కధికరుచికరములయి నీయందత్యాదరమును బుట్టించు ననుటకు సందేహ ముండదు'అని యతఁడు మాఱుపలికెను.

తాను భర్తనుగా వరింపఁ దలఁచుకొన్నపురుషునికే భార్యవు కమ్మని మఱియొకకాంతను వేఁడఁబోవుట కయినందునలోపలనీసందేశము చాతుర్యవతి కెంత రుచింపనిదయినను, మాఱుమాటాడక యామె యప్పుడే వెడలిపోయెను. ఉదాత్తము మనస్సున కింపయిన దయినను కాకపోయినను ప్రభునియోగమును శిరసావహించి బయలు దేఱినందునఁ దాను బూనినకార్యమును జాతుర్యవతి శక్తివంచనలేక మహాచాతుర్యముతో నిర్వహించెను. అప్పుడు మోహినిచెలికత్తె యొకతె లోపలికిఁబోయి తనయేలికసానితో "అమ్మా! ఎవ్వఁడో చక్కనిపడుచుచిన్నవాఁ డొక్కఁడు నీదర్శనమునిమిత్తమయి వచ్చి

యిప్పుడు సమయము కాదని మేమెన్ని చెప్పినను మామాటలకన్నిటికి నన్నిసమాధానములు చెప్పి నీముఖదర్శనము చేయువఱకును గదలి పోనన్ని పట్టుపట్టి వాకిటఁ గూరుచుండి యున్నాఁడు. నేను నీదేహ మస్వస్థముగా నున్నదని చెప్పఁగాఁ దానాసంగతి యెఱిఁగియే నీతోడ మాటాడ వచ్చితినని చెప్పినాఁడు. నేను నీవు నిద్రపోవుచున్నా వని చెప్పఁగాఁ దానాసంగతి సహితి మెఱిఁగిన ట్లభినయించి యందు చేతనే తాను మాటాడవలసి యున్నదని చెప్పినాఁడు. ఆతని వదలించుకొనుమార్గము నాబుద్ధికి తోఁచలేదు. నీ వాతనితో మాటాడిఁ దలఁచుకొన్నను దలఁచుకోక పోయినను నీతోడ మాటాడి మఱిపోవుటకుఁ గంకణము కట్టుకొని వచ్చినవానివలెఁ గనుపట్టు చున్నాఁడు. అమ్మా! అట్టివానితో నేనేమని చెప్పను?'' అని యడి గెను. అయినంటిదిట్టు యెవ్వఁడో చూడవలె నన్నబుద్ధి పుట్టఁగా మోహిని యాతనిని లోపలికిఁ దీసికొనిరమ్మని చెలికత్తెను బంపి, అతఁడు వీరసేనునిచేఁ బంపఁబడినదూతయో యయి యుండు నని యూహించియు మేలిముసుఁగు తీసివేసి యాతనితో ముచ్చటించుటకు నిశ్చయించుకొని యుండెను. అంతటఁ జాతుర్యవతి యామెసన్నిధికి వచ్చి సాధ్యమయినంతవఱకు పురుషవర్తన మభినయించుచు, మేలి ముసుఁగు వేసికొని యున్నయామెవంకకుఁ జూచి రాజసన్నిధానవర్తులు పలుక నలవాటుపడిన స్తుతివచనములతో "ఓ త్రిలోక సుందరీ! నీసౌందర్యము నిరుపమానమైనది. నీలావణ్యమశ్రుతదృష్టపూర్వము. గృహయజమానురాలవు నీవవుదువో కావో యానతిమ్ము. నామధుర ప్రసంగమును మఱియొకరివిషయమున నుపయోగించి వ్యర్థపుచ్చుటకు నామన సొప్పదు. అంతేకాక నేనీప్రసంగము నెంతో శ్రమచేసిచక్కఁగా వ్రాసికష్టపడి వల్లించుకొన్నాను'' అనిపలికెను. "స్త్రీ..............చ్ఛ

నావు" అని మోహిని యడిగెను. "నేనువల్లించుకొని వచ్చినదాని కంటె నధికముగాఁ జెప్పలేను. ఈప్రశ్నకుత్తరము నేను పఠించినభాగములో లేదు." అని చాతుర్యవతి యుత్తరముచెప్పెను. "నీవు పరిహాసకుఁడవా?" అని మోహిని యడిగెను. "నేను పరిహాసకుఁడనుగాను గాని నేనిప్పుడుధరించినవేషముమాత్రము నాస్వాభావికవేషముకాదు" అని చాతుర్యవతి తాను స్త్రీయయ్యును పురుషునివలె నటించుచున్నా నన్నభావమును మనస్సులో నుంచుకొని చమత్కారముగాఁ బలికి "గృహయజమానురాలవు నీవేకదా?" అనిమరల మోహినినడిగెను. తానే గృహపత్నినని యామెయుత్తరమిచ్చెను. అప్పుడు చాతుర్యవతి తనప్రభువుయొక్క సందేశమును జెప్పుటకంటె ముందుగాఁ దనకు సపత్నిగా నుద్దేశింపఁబడినయువతియొక్క ముఖలక్షణములను జూడ వేడుకగలదయి అమ్మా! దయచేసి నీముఖ మొక్కసారి నన్నుఁజూడ నిమ్ము" అని వేఁడెను. ఆవింతపురుషునిముఖము చూడవలెనన్న కౌతూహలము లోపల మోహినికిని గలిగినందున, ఆమె తన మేలి ముసుఁగు తొలఁగించి మొగమును జూపుటకు సంశయింపలేదు. అ ట్లాయిరువురు నొండొరులముఖావలోకనము చేయఁదలఁచింప గానే యావఱ కెంతకాలమునుండియో వీరసేనుఁడు కామించి వేఁడుచున్నను మెత్తపడని యాసౌందర్యగర్వితురాలిమనస్సు క్షణకాలములోఁగామాగ్నిచేత వెన్నవలెఁ గరఁగి రాజదూతయైనశూరవర్మమీఁదతగిలెను.

చాతుర్యవతి మొట్టమొదట మొగముచూపుమని యడిగి నప్పుడు మోహిని "నీయజమానుఁడేదైన సందేశమును నామొగ ముతోనే నడుపుమని పంపెనా!" అని యడిగి, రెండుసంవత్సరముల వఱకును మేలిముసుఁగు తీయనని తాను పట్టినప్రతిజ్ఞను మఱచి మొగముతెరదీసి "ఇదిగో నాప్రతిమను జూపుచున్నాను. ఇదిచక్కఁ

గానే చేయబడినదికదా!'' అని పలికెను. నీచెక్కులమీఁదఁగానవచ్చు చున్న మెఱుపును దెలుపునుబెట్టియీశ్వరచిత్రకారుఁ డీవిగ్రహమును బహుకౌశలముతో నిర్మించినాఁడు. ఇటువంటి సుందరవిగ్రహము యొక్క ప్రతిబింబము నొకదాని నీభూమిమీఁద నిలుపక యీసౌం దర్యమునంతను నీతోనే పరలోకమునకుఁ గొనిపోఁదలచితివేని, లోక ములో నీయంతటి కుఱ్ఱదురా లుండదు.'' అని చాతుర్యవతి బదులు చెప్పెను. ''నే నంతటికుఱ్ఱదురాలను గాను. పలుకఁబాఱిన మెఱ్ఱని రెండు పెదవులును, ఱెప్పలమధ్యను వెలిదలుకుఁజూపులు గల రెండు కన్నులును, ఒక్కముక్కును, రెండు చెక్కులును, మొదలయిన యవయవములతోఁ గూడిననాప్రతిబింబములు కొఱఁతలేక యీప్రపం చమునిండఁ గావలసినన్నియున్నవి. ఓయీ! నన్నుముఖస్తుతిచేయుట కొఱకా నీవిక్కడకుఁ బంపబడినది?'' అని మోహిని యుత్తరము చెప్పెను. ''నీరూపమును నేను గన్నులార చూచినాను. నీ కెంతగర్వ మున్ననునీచక్కదనమునకు కొఱఁతలేదు. నాప్రభువు నిన్నుకామించు చున్నాఁడు. సౌందర్యముచేత నీవీవఱకే రాణివయినను నీవు మారాజు నకు రాణి వయ్యెడుపక్షమున, నీచక్కదనమునకుఁ దగినప్రతిఫలము లభించి వన్నెవచ్చుననుటకు సందేహము లేదు. వీరసేనుఁడు నిన్నుఁ దనపాలిటి భాగ్యదేవతనుగా భావించి కన్నీటితో నభిషేకించుచు, నీగుణవర్ణన మనుమదనమంత్రములను బఠించుచు, నిట్టూర్పులతో విసరుచు సదామానసికముగా నీసేవచేయుచున్నాఁడు.'' అనిచాతుర్య వతి పలికెను. ''నామనస్సు నీవఱకే మీరా కెఱుఁగుదును. నే నాతనిని కామింపఁజాలను. అయినను నేనాతఁడుయోగ్యుఁడుకాఁడనిమాత్రము తలఁచను. అతఁడు గుణసంపన్నుఁడనియు, సువిశాలరాజరమాధురం ధరుఁ డనియు, నిష్కలంకచరిత్రుఁ డనియు, నేనెఱుఁగనిదానను గాను,

అతఁడు విద్యానిధియనియు, వినయధౌరేయుఁడనియు పరాక్రమశాలి యనియు, ఎల్లవారు నేకవాక్యతతో ఘోషించుచున్నారు. అయినను నే నాతనిని గామింపఁజాలను. నాయొద్దనుండి యతఁడీయు త్తరమును చిరకాలము క్రిందటనే పొందియున్నాఁడు.'' అని మోహిని చెప్పెను. ''మాప్రభువున కుండినంతవలపు నీమీఁద నాకే యుండినపక్షమున నేను నీవాకిట సదా కదలనికంబమునై నిలిచి నీనామమును సంతతి స్మరణము చేయుచుండి యుందును. నీనిర్దాక్షిణ్యమును నిందించుచు నీమీఁద పద్యములును పదములునుగట్టి, అర్ధరాత్రిమునందుసహితము వానిని పాడుచుందును. పర్వతములలో సహితమునీ పేరు మ్రోగునట్లు చేసి, 'మోహిని' యనుశబ్దమాకాశము మాఱుపలుకునట్లు చేయుదును. నిన్ను భూమిమీఁదను గాలిలోను నిలువనీయక, నామీఁద జాలిపడునట్లు చేయుదును'' అని చాతుర్యవతిపలుకసాగెను. ''నీవెంత పనియైనను జేయవచ్చును. నీవంశమెట్టిది?'' అని మోహినియడిగెను. ''నావంశము నాయిప్పటి భాగ్యదశకు మించినది. నాపరిస్థితస్థితియు సుఖప్రదముగానే యున్నది. నేను మహాకులీనుఁడను'' అనిచాతుర్య వతి చెప్పెను. ''నీ విప్పుడె నీప్రభువువద్దకుఁ బోయి నే నాతనిని మోహింపఁజాలనని చెప్పుము. నాప్రత్యుత్తరము నాతఁడెట్లుగైకొనెనో చెప్పుటకయి నీవు వచ్చినందక్క మఱియొకదూతను నాకడకిఁకఁబంప వలదని యాతనితో నావాక్యములుగాఁ బలుకుము'' అని చెప్పి మోహిని యిష్టములేకయే చాతుర్యవతిని బంపివేసెను. ''ఓచక్కని నిష్కారుణ్యదేవతా! సెలవుగైకొనెదను'' అని చాతుర్యవతి వెడలి పోయెను. ఆమె వెడలిపోయినతరువాత మోహిని ''నావంశము నా యిప్పటిభాగ్యదశకు మించినది. నాపరిస్థితస్థితియు సుఖప్రదముగానే యున్నది. నేనుమహాకులీనుఁడను'' అనుమాటలుమరలమరలస్మరించు

కొనుచు "నిశ్చయముగా నితఁడు మహాకులీనుఁడే. ఇతనిమాటలు, ముఖము, అవయవములు, చేష్టలు, మనస్సు, అన్నియు, నితనిమహాకులీనతను స్పష్టముగాఁ దెలుపుచున్నవి." అని బిగ్గరగాననెను. అటు తరువాతనామె యీశూరవర్మయే రాజయియుండిన నెంతోబాగుండు ననికోరుచు, ఇంతలోఁ దనమనస్సు ప్రేమపాశాకృష్టమయి యాకస్మికముగా నాతనిమీఁదికి బోయినదోషమునకయి తనచంచల హృదయమును కొంత దూషించెను. స్వాపరాధముల నెంచి జనులు తమ్ముఁ దాము చేసికొనెడునింద యెప్పుడును మనస్సులో వేరూని దృఢముగా నాఁటుకొనదు. అందుచేత నామె యాత్మదోషమును వెంటనేమఱచి, మహైశ్వర్య సంపన్నురాలైనతనస్థితికిని రాజసేవకుఁ డయియున్నయాతనిస్థితికిని గల తారతమ్యమును గణింపక, లజ్జాప్రధానలయినకన్యలకు ముఖ్యాలంకారమయినభావగోపనమునైన విచారింపక, రూపయౌవనసంపన్నుఁడయినయాశూరవర్మనువరియింప వలెనని నిశ్చయముచేసికొని, వీరసేనుఁడు బహుమానముగాఁ బంపిన యాభరణము నతఁడిచ్చుటఁదిగఁబెట్టిపోయెనన్నమిషకల్పించిరత్నఖచితమైన యుంగరము నొకదానిపై దనభృత్యునిచేతి కిచ్చి యతనివెంబడినే పంపెను. ఉపాయముచేసి యీయుంగరము నాతనికి బహుమానముగాఁ బంపుటనుబట్టి యాతనికిఁ దనమనోభావమును సూచన చేయవలెనని యామె యుద్దేశించుకొనెను. ఆమెయాలోచన వ్యర్థము కాలేదు. ఆయమూల్యాభరణమును బంపుటవలనఁ జాతుర్యవతిమనస్సునకు సందేహము తోఁచినది. రాజు తనచేత నంగుళీయకమును బంపకపోవుటయుఁ దాను మోహినిసమక్షమున నున్నప్పుడామెకుఁ గలిగినభావవికారములును చూపులును దలపోసి, తనయజమానుని మనోవల్లభ తన్నుఁ గామించిన దని చాతుర్యవతి తత్క్షణమే యూహ

చేసెను. "పాపము ! ఆచిన్నదాని కొకస్వప్నగతుని మోహించుట వలన నెంతప్రయోజనమో నన్ను మోహించుటవలన నంతేప్రయోజనము. లేనివేషము వేయుట యెప్పుడును శుభావహము కాదు. ఈవేషమువలన వీరసేనునివిషయ మయి నాకెట్లువ్యథకలిగెనో యట్లే నామూలమున మోహినికిని లేనిపోనివ్యథ సంప్రాప్త మయినది" అని చాతుర్యవతి తనలోఁదాను నొచ్చుకొనఁజొచ్చెను.

చాతుర్యవతి వీరసేనుని నగరునకు మరలవచ్చినతరువాత తన దౌత్యముయొక్క వైఫల్యము సర్వమును దనప్రభువునకు నివేదించి, ప్రభువువారిక సందేశములచేతఁ దనకు శ్రమ యియ్యవల దని మోహిని స్పష్టముగా విధించినసంగతికూడ మనవి చేసెను. అయినను బ్రియాలాపచతురుఁ డయినశూరవర్మ యింకొకసారి పోయి మాటాడినయెడల మోహినిని దనమీఁద గొంతిదయ చూపునట్లు బోధింప గలుగు నని విశ్వసించి రాజాతఁడు మఱునాఁడు మరల నామెవద్దకుఁ బోవలె నని నియమించెను. ఈమధ్యకాలములో విషాదదీర్ఘతర మైన ప్రొద్దును గడపుట కయి తనకుఁ బ్రియ మయినయొకగీతమును పాడు మని నియమించి, "ఓ చెలికాఁడా! శూరవర్మా! ఆగీతమును నిన్న రాత్రి నేను విన్నప్పుడు నామనస్సులోనితాపము కొంతశాంతి పొందినట్లు కానఁబడినది. ఈపురాతనగీతమును సాలెపడుచులు తమప్రియులతోడ నెండలోఁ గూరుచుండి నూలు వడఁకుచు కర్ణరసాయనముగా గానము చేయుదురు. ఈశృంగారగీతము ప్రౌఢ మయినది కాకపోయినను పూర్వకాలమునందలికాముకజనులయొక్క నిర్వ్యాజానురాగమున్నదియున్నట్లు వర్ణింపఁబడుటచేత నాకింపుగా నున్నది." అని దానిని ప్రశంసించెను. ఆగీతమునందలి విరహతాపముయొక్క స్పష్ట మైనస్వాభావికవర్ణనను దలఁచుకొనఁగానే చాతుర్యవతిహృదయములో

వివిధరసానుభావము లుత్పన్నము లయి వదనమునందుఁ బొడకట్టెను. విచారమును దెలిపెడి యామెచూపును గనిపెట్టి "ఓ శూరవర్మా! నీవు వయస్సునఁ బిన్నవయ్యును నీచూపిప్పుడు ప్రియతము లయిన వారిమీఁద నెవ్వరిమీఁదనో వ్రాలుచున్నట్లు నాకు గోచర మగుచున్నది. నాయూహం సత్యముకాదా" అని వీరసేనుఁ డడిగెను. "ఒకరి మీఁద నాదృష్టి కొంచెము ప్రసరించినమాట సత్యమే' అని చాతుర్యవతి యొప్పుకొనెను. "ఎటువంటి సుందరిమీఁద? ఆమెప్రాయ మెంత:" అని వీరసేనుఁ డడిగెను. "మీపాత్రియమే. రూపమును సరిగా మిమ్ముఁ బోలినదే" అని యామె బదులు చెప్పెను. ఆమాటలకు రాజు చిఱునవ్వు నవ్వి యాచిన్నవాఁడు తనకంటె నధికవయస్సు గలిగినట్టియు చామనచాయ గలిగినట్టియు సుందరిని మోహించెనని భావించెను. కాని చాతుర్యవతిమాత్రము మనస్సులో రాజునే యుద్దేశించెనుగాని యాతనిఁబోలినజవ్వని నెవ్వతెను దా నుద్దేశింపలేదు.

చాతుర్యవతి రెండవసారి మోహినియింటికి వెళ్ళినప్పుడామె దర్శన మగుట దుర్లభము కాకపోయెను. తనయజమానురాలి కా కౌమారసుందరసందేశహరునితో ముచ్చటించుట యానందకర మని పరిచారికలు శీఘ్రముగానే కనిపెట్టినందున, వారనుకొన్నయారాజసేవకునికి వచ్చినతోడనే తలుపులు తీసి మహాగౌరవముతో మోహినీసన్నిధానమునకుఁ దీసికొనిపోయిరి. తనప్రభువుపక్షమునఁ బ్రార్థించుటకై తాను మరల వచ్చితి నని చాతుర్యవతి చెప్పినప్పుడు మోహిని 'ఇఁక నీవు నాతో నీరాజుప్రశంస యెప్పుడును చేయవల దని నిన్ను వేఁడుకొనుచున్నాను. నీవాతనిపక్షమునఁగాక మఱియొకరిపక్షమునఁ బ్రార్థించెదుపక్షమున నే నప్పుడు నీశ్రావ్యసంభాషణమును సంగీతముకంటె నెక్కువ యాసక్తితో వినియెదను' అని చెప్పెను. ఈమాటలయర్థ

మించుమించుగా స్పష్టమే యయినను, మోహిని యింతకంటెనుస్పష్టముగా మాటలాడి యాతనిమీఁదఁగల తనవలపును బయటఁబెట్టెను. ఆమాటలకు సస్రంభ్రమ యయి చాతుర్యవతి తనముఖమునందు కోప చిహ్నములు చూపి యనిష్టమును సూచింపఁగాఁ, 'ఓశూరవర్మా! కంపము నొందుచున్న నీయధరోష్ఠమునందును చూపులయందును కానఁబడుకోపమును దిరస్కారమునుగూడ నాదృష్టి కొకవింతసౌంద ర్యము కలవిగా తోఁచు చున్నవి. నిన్నుఁజూచి నేను నిశ్చయముగా కూ)రము లైనకామశరములపా లయి నీపయిఁ దగిలినమనస్సును ద్రిప్పుకొనఁజాలకున్నాను. నీవిప్పు డెంత సౌందర్యగర్వితుఁడ వయి యున్నను, నీమీఁదివలపును మఱుఁగుపఱుచుట కయి నాకు శక్తిగాని యుక్తిగాని లేకయున్నది.' అని మోహిని పలికెను. మోహినియీ మోహ మంతయు దప్పితీర్చుకొనుటకయి యెండమావుల కాశపడుట వంటి దయ్యెను. అప్పుడు చాతుర్యవతి తా నికముం దెప్పుడును వీర సేనుని సందేశమును గొని యిక్కడకు రా నని కోపదృష్టితోఁ బలికి, మోహినినిమాత్రమేకాక తాను ముం దెప్పుడును లోకములోని యేస్త్రీనిగూడ వరింప నని ఖండితముగా శపథము చేసి యక్కడనుండి వెడలిపోయెను. మోహిని మందిరమును విడిచి వీథిలోనికి రాఁగానే శూరవర్మకుఁ దనపౌరుషమును బరీక్షకుఁ జూపవలసిన యవసరమొకటి తటస్థ మయ్యెను. ఈవఱకు మోహినిని కామించి యామెచే నిరాక రింపఁబడిన యొకరాజకుమారుఁడు వీరసేనుని పరిజనుఁ డొకఁ డామె ప్రేమ కాస్పదుఁ డయినాఁ డని విని మహారోషముతో వచ్చి తనతో ద్వంద్వయుద్ధము చేయవలసిన దని శూరవర్మను నడివీథిలో నిలిపెను. పాపము ! చాతుర్యవతి తా నప్పు డేమిచేయఁగలుగును? ఆమె పై కెంత పురుషవేషమును ధరించినను లోపల స్త్రీస్వభావమువిడ.వనిది

గానే యుండెను. కాఁబట్టి యాచిన్న దప్పుడుతనచేతిలో నున్నఖడ్గము వంకఁ జూచుటకే భయపడ మొదలు పెట్టెను.

అట్లు బలిష్ఠుఁడైనయాప్రతియోధుడు కత్తిదూసికొని తన మీఁదికి వచ్చి తారసించినప్పుడు శూరవర్మ తా నాఁడుదాన నని యొప్పుకోవలె నని యాలోచించు చుండెను. చాతుర్యవతి యిట్టియువస్థలో నుండఁగా, అప్పు డాదారిని బోవుచున్నక్రొత్తవాఁ డొకఁడు వారిచేరువకు వచ్చి యావఱకు దన కామెతోచిరపరిచయమును కలిగియున్నట్లును దానా మెకుఁ బ్రాణమిత్రుఁ డయినట్లును కనఁబడి ఆమె ప్రతిపక్షునితో 'ఈచిన్నవాఁడు నీ కేమైననపరాధమును జేసిన యెడల నేనాతప్పిదమును నాపైని వేసికొనెదను. ఈతఁడు నీతోఁ బోరాడనలసి యుండినపక్షమున, నే నీతనిపక్షమున నీతోఁ బోరాడె దను.' అని యదలించి పలికి, ఆమెను భయమునుండియు రహస్యప్రక టనమువలనియవమానమునుండియు తప్పించెను. అయాచితముగాఁ దనరక్షణభారమును వహించినందున కయి యాతనికి వందనము లర్పించుటకుఁగాని తనమీఁద నట్టినిర్హేతుకజాయమానకటాక్ష మేల రావలెనో విచారించుటకుఁగాని చాతుర్యవతి కవకాశము చిక్కక ముందే యాక్రొత్తమిత్రునికి స్వీయధైర్యసాహసము లేమియుఁ బ్రయో జనపడఁజాలనిమఱియొకరీతిశత్రువులు దాపించిరి. ఆనిమిషమునందే కొందఱు రాజభటులు రాజముద్ర వహించిపరుగెత్తుకొనివచ్చి యాతఁ డెప్పుడో కొన్నిసంవత్సరములక్రిందటఁ జేసినయొక నేరమునిమిత్తమయి యాతనిని పట్టుకొనిరి. అప్పు డావింతపురుషుఁడు చాతుర్యవతిని జూచి, 'నిన్ను వెదకుకొనుచు వచ్చుటచేత నాకిప్పు డీగతిసంప్రాప్తమయినది. ఇప్పుడు నాకుఁ దటస్థించిన యావశ్యకమునుబట్టి నీయొద్ద నిచ్చినధనము నడుగవలసి వచ్చినది. నాకు సంభవించినయాపదను తప్పించుకొలేక

పోయినదానికంటె నీయాపదను దప్పింపలేకపోయినందుకు నా కెక్కువ దుఃఖము కలుగు చున్నది. నీ వూరక వ్యాకులపడి యేల నిలిచెదవు? ధైర్యము తెచ్చుకొమ్ము' అని తానుదాఁచనిచ్చినరొక్కమునడిగెను. ఆమాటల కామె యద్భుతరసావేశపరవశురాలయి యింతలోఁ దెలివి తెచ్చుకొని తా నాతని నావలఁ గెన్నఁడు నెఱుఁగ ననియు, దాపటిక మున కయి తా నాతనియొద్దనుండి ధన మెన్నఁడును పుచ్చుకొనలే దనియు, చెప్పి యాతఁ డింతకుమున్ను చూపినయుపకారమున కయి తనయొద్ద నున్నయల్పధన మంతయు నిచ్చెద ననియు తనవద్ద నంతి కంటె నెక్కువరొక్కము లేకపోయినందుకుఁ జింతిల్లుచున్నాననియు, పలికి తన చెంతనున్న చిన్న మొత్తము నియ్యఁబోయెను. అప్పుడాక్రొత్త మనుష్యుఁ డామెయందు నిర్దయత్వమును కృతఘ్నతను ఆరోపించి యనేకపరుషభాషణము లాడి, మీకన్నులయెదుట నున్న యీచిన్న వానిని నేను మృత్యుముఖమునుండి రక్షించి, యీతనినిమిత్తమే నే నీపురుషోత్తమపురమునకు వచ్చి యీవిపత్తును దెచ్చుకొన్నాను.' అని మఱియు నేమేమో చదువఁ దొడఁగెను. రాజభటులు తమ యభి యుక్తుఁ డితరులమీఁద మోపిన నేరములను వినుచుఁ గాలహరణము సహింపవలసినయక్కఱ లేనివారయి 'ఈసోదెతో మాకేమిపని?' అని యాతని నక్కడనుండి యీడ్చుకొనిపోయిరి. వా రాతనిని దీసి కొనిపోవు చున్నప్పుడు వాఁ డామెను 'విక్రమసింహా!' అని పిలిచి కష్ట సమయమునందు మిత్రుని నొప్పుకొనక విడనాడినందులకై మాట వినఁబడినంతవఱకును దాను విక్రమసింహుఁ డని భ్రమగొన్నయామెను దూషించుచుఁ బోయెను. తన్నాతఁడు 'విక్రమసింహా!' అని పిలువఁగా విన్నప్పుడు రాజభటులాతనినిశీఘ్రముగాలాగుగొనిపోవుటచేతవిక్రమసిం హునివార్తనాతనినడిగి తెలిసికోలేకపోయినను తన్నాతడు తనయన్నగా

రని భ్రమపడినందున నీ యవ్యుత్తము పుట్టి యుండు నని చాతుర్యవతి యూహించి, అతఁడు కాపాడితి నన్నది తనయన్నగారిప్రాణమే యని మరల సోదరునివిషయమయి యాశపెట్టుకొన నారంభించెను. ఆమె చేసినయూహ యసత్యముకాదు. ఆక్రొత్తవాఁడు జలధీశుఁ డనుపేరు గలయోడనాయకుఁడు. ఆగాలివానలోఁ దాను పట్టుకొన్నచాప కొయ్య యాధారముగా నీటిపయిని దేలి బడలి ప్రాణావశిష్టుఁడుగా సముద్రమునఁ బడి కొట్టుకొని పోవుచుండఁగాఁ జూచి కరుణార్ద్ర హృదయుఁ డయి జలధీశుఁడు తనయోడను దాపునకుఁ బట్టించి విక్రమసింహుని నందెక్కించుకొని ప్రాణములు నిలిపెను. అప్పటి నుండియు వారిరువురకు నపరిమితమైత్రి కలిసినందున, విక్రమసింహుఁడు పోఁదలఁచినచోటికెల్లను దానుబోవలె నని జలధీశుఁడు నిశ్చయించు కొనెను. విక్రమసింహుఁడు పురుషోత్తమక్షేత్రమును జూచి జగన్నాథ స్వామిని దర్శింపఁ గోరినప్పుడు పూర్వ మొకసముద్రయుద్ధమునందు దాను వీరసేనుని మేనల్లుని నొక్కని గాయపఱిచి యుండుటచేత నా పట్టణమునకుఁ బోవుట తన కపాయకరమని యెఱిఁగినవాఁడయ్యును దనమిత్రుని నెడఁబాసి యుండలేక యాతనితోఁ డఁగూడ నలెఁ డిప్పు డీపురుషోత్తమక్షేత్రమునకు వచ్చెను. ఇప్పుడు రాజభటులు లాతనిని బట్టుకొనిపోయిన దీనేరమునిమిత్తమే.

చాతుర్యవతిని జలధీశుఁడు కలిసికొనకపూర్వము రెండుమూడు గంటలముందే జలధీశుఁడును విక్రమసింహుఁడును గలిసి యోడ దిగి యాపట్టణమునందుఁ బ్రవేశించిరి. జలధీశుఁడు తనసొమ్ము విక్రమసింహుని చేతి కిచ్చి దానితోఁ గావలసినవస్తువులను కొని తెచ్చుకొమ్మని చెప్పి, అతఁడు పట్టణము చూచి వచ్చువఱకును తాను సత్రమువద్ద నుండెద నని యొప్పి యుండెను. కాని విక్రమసింహుఁడు మితిపెట్టినవేళకు

రానందున జలధీశుఁ డాతనిని వెదకుట కయి బయలుదేఱె, చాతుర్య వతి యన్నగారివలెనే బట్టలుధరించి ముఖలక్షణములయం దాతనినే పోలి యున్నందునఁ దాను సముద్రమునుండి కాపాడితి ననుకొన్న యాచిన్నవానిప్రాణసంరక్షణార్థ మయి యారాజపుత్రునితోఁ బోరా డుటకు సంసిద్ధుఁ డయి, తానను కొన్నవిక్రమసింహుఁడు తన్నెఱిఁగి నట్టే యొప్పుకొనక తాను పుచ్చుకొన్నసొమ్మే లే దనుటచేతఁ గోపా వేశము గలవాఁ డయి యాతని నట్లు కృతఘ్నుఁడ వని నిందించెను. జలధీశుఁడు వెడలిపోయినతరువాత ముష్టియుద్ధము తనకు మరల నెక్కడ సంభవించునో యని భయపడుచు చాతుర్యవతి తనకాళ్ళకు బుద్ధిచెప్పి భయదేవత వెడలనిచ్చినంత వేగముగా జాఱె యిల్లుచేరెను. ఆమె చాలదూరము నడవకమునుపే యామెసోదరుఁ డచ్చటకువచ్చుట తటస్థించెను. ఆమెప్రతిపక్షుఁ డావచ్చినవాఁడు శూరవర్మయే యని భ్రమపడి "ఇదిగో నీవు నాకు మరల దొరకినావు. ఇప్పుడు కాచు కొమ్ము" అని పలికి యాతని నొకగుద్దు గుద్దెను. విక్రమసింహుఁడు పిఱికివాఁడు కానందునఁ దనమీఁదఁ బడినదెబ్బయప్పు వడ్డితోఁగూడఁ దీఱునట్లుగా వీసెగుద్దుకు మూఁగుగుద్దు గుద్ది, యుద్ధమున కయి యొరలోనుండి తనకత్తిని దూసెను.

ఇంతలో మోహిని లోపలినుండి వచ్చి వారిమల్లయుద్ధమును మాన్పి, ఆమెకూడ నాతనిని శూరవర్మనుగా భ్రమించి గృహము లోనికిఁ దీసికొనిపోయి, ఆమూర్ఖునివలన నాతనికిఁ గలిగినశ్రమకు చింత నొంది యాతని నూఱడించెను. మొగ మెఱుఁగనియామూఢశిరో మణియొక్క మోటుతనమున కెంతయద్భుతపడెనో యాసుందరియొక్క యాదరణ కంత యద్భుతపడినను, విక్రమసింహుఁడు మాఱుమా టాడక పిలువఁగానే లోపలికిఁబోయెను. మోహినియు శూరవర్మ తన

యుపచారములయెడ నధికాదరము గలవాఁడయి యభిజ్ఞుఁ డయినాఁ డని సంతోషించెను. ముఖలక్షణము వెనుకటివిధముగానే యున్నను మొట్టమొదట శూరవర్మతో తనకుఁ గలకూరిమిని ప్రకటించినప్పుడు కానఁబడినతిరస్కృతియుఁ గోపమును మోహినియొక్కదృష్టి కిప్పు డీముఖమునం దేదియుఁ గానఁబడలేదు.

ఆమె చూపినయత్యాదరమునకయి విక్రమసింహుఁ డనిష్టము నెంతమాత్రమును గనఁబఱుపలేదు. అతఁ డామెయం దనురాగముగల వాఁడై యామెచేసిన సత్కారమునకు సంతోషించెనుగాని యింతలోఁ దనయం దామె కింతప్రేమ యేలకలుగవలెనో కారణ మూహింపలేక యామెకు మతిస్థిరతలేదేమోయని సంశయింప మొదలుపెట్టెను. అయి నను మోహిని గొప్పయిల్లును వాకిలియుఁ బరిజనమును సమస్తసంప దలును గలిగియుండుటయు, ఆమె సర్వవిషయములలోను తెలివిగల దయి దాసదాసీజనములచేత చక్కగా పనులుగొనుచుండుటయు, చూచి యామె మతిస్థైర్యముకలదిగేయని నిశ్చయించి, ఆమెసద్వర్తన మునకును తనమీఁద యవ్యాజానురాగమునకు పరమాహ్లాదము నొంది యామెను వరియించుట కొప్పుకొనెను. శూరవర్మ యప్పుడు మంచిమనస్సులో నున్నాఁడని కనిపెట్టి యిఁక గొంతసేపుండిన నాతని మతి మాఱునేమో యనుభయముచేత మోహిని తనయింటఁ బురో హితుఁ డున్నందునఁ దన్ను తత్క్షణమే వివాహ మాడవలసిన దని ప్రార్థించెను. అతఁడామెప్రార్థనమంగీకరింపఁగా నప్పుడే పాణిగ్రహణము జరగెను. పురోహితుడిపడి పెండ్లితంతు నడచినతరువాత నతఁ డీసంతోష వార్తను దనమిత్రునితోఁ జెప్పుటకయి కొంచెముసే పిల్లువిడిచి బయటఁ బోయెను. ఈలోపల వీరసేనుఁడు తాను మోహినిని వేఁడుకొనుట

కయి స్వయముగానే బయలుదేఱి వచ్చెను. రాజు మోహినియొక్క యింటిముంగిటికి వచ్చునప్పటికి రాజభటులు జలధీశుని నాతనియొద్దకు గొనివచ్చిరి. అప్పుడు శూరవర్మకూఁడ తనప్రభు నైనరాజుతోనే యుండెను. జలధీశుఁడా శూరవర్మను విక్రమసింహుఁడని భ్రమపడి, ఆతనిని దాను సముద్రమరణమునుండి రక్షించినక్రమమును తా నాతనివిషయమయి చూపుచుండినయాదరమును సమస్తమును రాజుతో నివేదించి మూఁడుమాసములనుండి రాత్రియుఁ బగలును క్షణకాలమయినఁ దన్నెడఁబాయకుండిన చిన్నవాఁడీపట్టణమునకు రాఁగానే నిమిషములోఁ గృతఘ్నుఁడయినాఁడని మొఱ్ఱపెట్టఁజొచ్చెను. ఈమాటలనుచుండఁగానే లోపలినుండి మోహినివచ్చుట తటస్థించినందున రా జాతనికథ వినుటమీఁద మనస్సు లేనివాఁడయి మోమును త్రిప్పి 'ఇదిగో నాపాలిటిభాగ్యదేవత ప్రత్యక్షమయినది! నాపుణ్యఫలము నేఁడు మూర్తీభవించి వచ్చినది—ఓరీ! మూర్ఖా! నీవి పిచ్చిమాటలు ఈచిన్నవాఁడు మూఁడుమాసములనుండి నాయొద్దనే యున్నాఁడు' అని జలధీశు నచ్చటనుండి తీసికొనిపొండని భటుల కాజ్ఞ యిచ్చెను. మఱి నిమిషమున కెల్లను వీరసేనునిపాలిటియాభాగ్యదేవత కృతఘ్నుఁడని శూరవర్మను జలధీశుఁ డెంతదూషించెనో యంతకంటె నినుమడిగా దూషించుటకు తన చర్యలవలన రాజునకు కారణమును గలుగఁ జేసెను. ఆమె మాటాడినంతసేపును శూరవర్మను 'ప్రాణనాథా' యని పిలుచుచు, మాటలవలనను చేష్టలవలనను దనకాతని మీఁదఁగల కూరిమి తేటపఱుపసాగెను. అందుమీఁద రాజు తనకుబదులుగాఁ దనపరిజనుఁడే తనప్రియురాలిహృదయమును లోఁగొని యామెవలపును దక్కించుకొన్నాఁడని తెలిసికొని మండిపడి యింటికి పోయినతరువాత పగ తీర్చుకొనెదనని బెదరించుచు, 'ఓప్రబుద్ధుఁడా! ఇఁక నావెంట

దయచేయుము. నీవుచేసిన యీద్రోహమునకై నీకుతగిన ప్రాయశ్చిత్తము చేయవలసినదని నామనస్సు నన్ను త్వరపెట్టుచున్నది' అని చాతుర్యవతినిబిలిచెను. దురాగ్రహాగ్రహావేశముచేత దేహము తెలియకున్నయారాజు తనప్రాణములు గొనఁదలఁచుకొని యున్నను, చాతుర్యవతి తనకాతనియందుఁగలమోహాతిశయముచేత స్త్రీస్వభావసామాన్యమయిన భీరుత్వమును మఱచి సాహసమునువహించి, ప్రాణాధికుఁడయిన తనప్రభువుయొక్క సుఖమునిమిత్తమయి యత్యంతసంతోషపూర్వకముగాఁ దనప్రాణముల నర్పింపఁగోరి యున్నానని చెప్పెను. అప్పుడు మోహిని వెక్కివెక్కియేడ్చుచు వారి కడ్డమువచ్చి శూరవర్మ తనభర్తయని ఘోషించి, తత్క్షణమే పురోహితుని బిలిపించి యాతని చేత నీతఁడు మోహినిని వివాహమాడి యిన్నగా రెండు గడియలయినను కాలేదనిచెప్పించి, వారికాలు సాగనీయక రాతిగుండె యయినను కరఁగునట్లుగా విలపింపఁజొచ్చెను. తానావివాహకథయే యెఱుఁగనని చాతుర్యవతి మొఱ్ఱయిడెను గాని యామాట లెవ్వరును నమ్మలేదు. సుశీల యైనమోహినియు సత్యసంధుఁ డయినపురోహితుఁడును చెప్పిన సాక్ష్యమువలనఁ దనప్రాణాధిక యైన యమూల్యలక్ష్మిని తనసేవకుఁడు తన్నువంచించి యపహరించెనని రాజునకు విశ్వాసముకలిగెను. అప్పుడు వీరసేనుఁడు మించినకార్య మేమిచేసినను కూడిరా దని తలఁచుకొని, తనచేయి జాఱి యన్యునిపా లయినసొమ్మువిషయమయి యాశవదలుకొని, విశ్వాసహీనురా లయినమోహినిని, వంచకాగ్రేసరచక్రవర్తి యని తాను నూతనబిరుదాంక మనుగ్రహించినయామెభర్తను ముందెప్పుడును దనకంటఁబడవల దని యనుశాసించి వారినివిడిచి పోఁబోవుచుండఁగా, ఎల్లవారును నద్భుతపరవశు లగునట్లుగా మఱియొక్క శూరవర్మ యక్కడకు వచ్చి మోహినిని 'ప్రాణేశ్వరీ!' యనిపిలిచెను.

అప్పుడుట్టిపడినయాశ్చర్యకరముగా శూరవర్మ మోహినియొక్క నిజమయిన భర్తయయిన విక్రమసింహుఁడు. ఏకరీతిముఖమును, ఏకరీతికంఠ స్వరమును, ఏకరీతి వేషమును గల యిద్దఱుపురుషులను జూచుటవలనఁ గలిగిన యచ్చటివారియాశ్చర్యము కొంత శాంతిపొందిన పిమ్మట అన్నయుచెల్లెలును ఒండొరులను ప్రశ్నలువేసికొనుట కారంభించిరి. తనసోదరుఁడు సజీవుఁడయియున్నాఁడని చాతుర్యవతికి నిశ్చయముగా దెలియదు. సముద్రములో మునిఁగి పోయిన దనుకొన్నతనచెల్లెలు మరల బ్రతికివచ్చి పురుషుఁడుగా నెట్లుమాఱెనో విక్రమసింహుఁడును దానూహింపఁజాలకుండెను. అంతట చాతుర్యవతి తా నాతని చెల్లెల ననియు మగవేషము వేసికొని యుంటి ననియు తత్క్షణమే యందఱి ముందఱ నొప్పుకొనెను.

సోదరిసోదరు లిద్దఱు నేకరూపము గలవారగుటచేసంభవించిన భ్రమలు నివారణ మయినతరువాత స్త్రీని కామించిన భ్రాంతికయి యచ్చటివారు మోహినినిజూచి నవ్విరి. చెల్లెలికి బదులుగాఁ దానన్న గారిని వివాహమాడితినని తెలిసికొన్నప్పు డామార్పువలన మోహిని కొంతమాత్రమునుచింతగలుగలేదు. మోహినియొక్కయీవివాహము చేతఁ దనయాశ లన్నియు పూర్ణముగా భంగమునొందఁగా నిష్ఫలము లయినతనయాశలతోడఁగూడ మోహినిమీఁది పట్టరానివలపును సహితమువిడిచి, రాజు తనచిత్తమునంతను దన కత్యంతప్రియుఁడుగా నింతవఱకు నుండి యిప్పు డత్యంతరూపవంతురా లగుప్రియురాలుగా మాఱిన చాతుర్యవతిమీఁదికి ద్రిప్పుకొనెను. అందుచేత రా జామెను ప్రసాదదృష్టితో వీక్షించి, శూరవర్మ మిక్కిలి చక్కనివాఁడని పలు మాఱు తనలోఁ దా ననుకొనుచుండుట స్మరణకుఁ దెచ్చుకొని, ఆమె స్వభావసిద్ధమయిన స్త్రీవేషములోనే యున్నయెడల మఱింత చక్క

నిదిగా నగపడునని భావించుకొనెను. తనపయి నకృత్రిమానురాగము గలదని పలుమాఱామె తనతోఁ బలుకుచుండుటయు, అప్పుడామాటల యర్థమును పూర్ణముగా గ్రహింపలేక విశ్వాసియైనభృత్యునియొక్క సంతోషవాక్యము లని తా ననుకొనుచుండుటయు, తలఁపునఁబాఱఁగా వెనుక గూఢార్థములుగా నుండిన యామెసుందరవాక్యములకుఁ దా నప్పుడు గ్రహింపఁగలిగినదానికంటె నధికార్థమున్న ట్లిప్పుడు తెలిసికొని చాతుర్యవతిని తనధర్మపత్నిగాఁ జేసికొనవలె నని నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయము చేసికొని రాజు 'ఓశూరవర్మా! నీకు నామీఁదఁ గలిగినంతప్రేమ మఱి యేస్త్రీమీఁదను లేదని నీవు నాతో వేమాఱు చెప్పియుంటివి. నీవు నానిమిత్తమయి మృదుస్వభావముగల స్త్రీశక్తికిమించిన కార్యభారమును పైనివేసికొని శక్తివంచన లేక నిర్వహింపఁ బాటుపడితివి. కాఁబట్టి నీవింతవఱకు నన్ను నీప్రభువునుగా భావించుకొనుచుంటివిగాన, నీవిఁక నీప్రభువునకు ప్రభ్వివయి వీరసేనునిరాణివి కమ్ము'' అని తనమనోరథమును దెలిపెను.

మోహిని తాను నిష్కారణురాలై నిరాకరించిన హస్తమును రాజు చాతుర్యవతివశము చేయఁదలఁచుకొనుట యెఱిఁగి, లోపలికి వచ్చి తనగృహపావనము చేసి నాఁటిప్రాతఃకాలమునఁ దనకును విక్రమసింహునికిని వివాహము చేయించిన పురోహితునిచేతనే మధ్యాహ్నమున వివాహము చేయించుకొండని చాతుర్యవతీ వీరసేనులను ప్రార్థించెను. వా రాప్రార్థన నంగీకరించినందున యమళులైన యాసోదరీసోదరుల కిద్దఱికిని వివాహమహోత్సవము కూడ నేకదినముననే జరగెను. సముద్రమధ్యమున నోడ పగులునట్లు చేసి వారి నెడఁబాపి మొదటఁ గష్టపెట్టిన గాలివానయే తుదకు వారికి గొప్ప

సంబంధములను సమకూర్చి వారిని సుఖపెట్టుటకు హేతు వయినది. నడిసముద్రమున నోడపగులుటవలననే చాతుర్యవతి యుత్కలదేశపురాజయిన వీరసేనునికి భార్య యగుటయు, విక్రమసింహుఁడు మహాధనసంపన్నురా లయిన మోహినికి భర్తయగుటయు, సంభవించినవి.

---

టాకన్స ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉ ప న్యా స ము లు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యార్థికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్హా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్యగ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్రకవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శారదా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930

# ధర్మకవచోపాఖ్యానము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ
(మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధి పత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బ ం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా
2 ,, రెం॥భా
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధవ
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహవ
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 నీతిదీపిక

# ధర్మకవచోపాఖ్యానము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

**1950**

కాపీరైటు

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు



## పురుషులు

జనకుఁడు—మిథిలానగరపు రాజు.

ధర్మకవచుఁడు— జనకమహారాజు కొంతకాలము రాజప్రతినిధిగా నేర్పఱిచిన ప్రభువు.

యుగంధరుఁడు—మిథిలానగరములోని యొక రాజపుత్రుఁడు.

సుమిత్రుఁడు—మదనదాసుని చెలికాఁడు.

వీరవర్మ—పద్మావతియొక్క తోడఁబుట్టినవాఁడు.

బ్రహ్మానందస్వామి—యతివేషముతో నున్నప్పటి రాజు పేరు.

## స్త్రీలు

దయామతి—మదనదాసునితోఁడఁబుట్టినపడుచు.

మనోరంజని—మదనదాసునిప్రియురాలు.

పద్మావతి—ధర్మకవచునిభార్య.



# ధర్మకవచోపాఖ్యానము



మిథిలానగరమును పూర్వకాలమునందు జనకుఁ డనుమహారాజు పాలించుచుండెను. అతఁ డతిశాంతాత్ముఁ డయినందునఁ దన ప్రజలు రాజశాసనములను మీఱి నడిచినప్పుడుసహితము వారిని శిక్షింపనొల్లకుండెను. తనభార్యకాని స్త్రీతో సంసారము చేయుపురుషుని శిరశ్ఛేదము చేయవలయు నని యాదేశమునం దొకరాజశాసనము కలదుగాని రాజు దాని ననాదరము చేసి యట్టినేరము చేసిన వారిని శిక్షింపక యుపేక్షించుచు వచ్చుటచేత జనులట్టిశాసన మున్న మాటనే మఱచి యథేష్టముగా విహరింపఁ జొచ్చిరి. అందుచేత జనులనేకులు తమకూఁతు లిల్లువిడిచి బ్రహ్మచారులవెంట లేచిపోయి నిర్భయముగా వారితో స్వైరవృత్తిని విహరించుచున్నారని రాజుతో మొఱ్ఱపెట్టుకొనిరి. తనయతిదయాళుత్వమువలన నైనయుపేక్షచేత జనుల కిట్టియనర్థము మూఁడుచున్నదని తెలిసికొని రాజు మనస్సులో ఖేదపడి ఇంతవఱకును తనకరుణాళుత్వముచేత జనరంజకుఁ డయి దొడ్డవాఁ డనిపించుకొనుచున్నతా నిప్పు డాకస్మికముగా నిర్దయత్వమును బూని యవివేకు లయినకాముకులను మరణశిక్షల పాలుచేసి క్రూరుఁ డనిపించుకొన నిష్టములేనివాఁ డయి, కొంతకాలము తాను రాజధానిని విడిచి దేశాంతరసంచారము చేయుచుఁ దాను లేనికాలములో రాజకార్యములను నిర్వహించుటకు మంత్రులలో నొకనిని దనకుఁ బ్రతినిధిగా నేర్పఱిచి యాతనిచేత నిర్దాక్షిణ్యముతో కామచోదితులయి పూర్వోక్తశాసనమును మీఱిన పడుచుకాముకులను శిక్షింపఁజేయవలెనని నిశ్చయించుకొనెను. కాఁబట్టి రాజు కాల

ములో ధర్మవర్తనముచేతను కర్మనిష్ఠతచేతను మిధిలానగరమునందు మహర్షి యని ప్రసిద్ధిగన్న ధర్మకవచుని దనకు మారుగా ధర్మాధికారమునందు నియోగింపఁ దలఁచుకొని తనయుద్దేశమును ప్రధాన మంత్రి యైన యుగంధరునికిఁ దెలుపఁగా నతఁడు "ఇట్టిరాజానుగ్రహమునకు గౌరవమునకును నర్హుఁడైనవాఁ డీమిధిలానగరములో నెవ్వఁడైననున్నపక్షమున ధర్మకవచుఁడొక్కఁడే యనుటకు సందేహము లేదు" అని పలికెను. అంతట రాజు తనయాత్రాకాలములో రాజ్యపాలనము చేయుటకయి ధర్మకవచుని నియమించి తానొంటిగా పాదచారియై కాశీయాత్ర పోయెద నని బయలుదేఱి మిధిలానగరమును విడిచిపోయెను. అయినను రాజు కాశీయాత్ర మిషపెట్టిబయలు దేఱినను నిజముగాఁ బోవక తరువాత రహస్యముగా మరల మిథిలానగరమునందుఁ బ్రవేశించి పయికి మహర్షివలెఁ గనఁబడుచున్న ధర్మకవచునివర్తనమును గొంతకాలము పరీక్షించవలె నని సన్యాసివేషముతోఁ బ్రచ్ఛన్నుఁడయి తిరుగుచుండెను.

ధర్మకవచుఁ డిట్లు క్రొత్త రాజ్యాధికారమును బూనిన కొన్నిదినములలోనే మదనదా సనెడియౌవనసంపన్నుఁ డొక్క సుందరయువతిని జననీజనకుల యింటినుండి లేవఁదీసి తనయింటఁ బెట్టుకొనుట తటస్థించెను. ఈనేరమున కయి రాజభటులు మదనదాసుని బట్టుకొని నూతనరాజప్రతినిధిగారి సమక్షమునకుఁ దీసికొనిరాఁగాఁ జిరకాలమునుండి యనాదరణ చేయఁబడి యున్న యాపురాతనశాసనమునుబట్టి యతఁ డామందభాగ్యుని చెఱసాలలోఁ బెట్టించి తల తీయించివేయుటకుత్తరవు చేసెను. ఇప్పుడీయపూర్వ దండనమువలనఁ బట్టణమునం దంతటను గొప్పసంక్షోభము కలిగెను. ఎల్లవారును మదనదాసుని యీప్రథమదోషమును క్షమించుట యుక్తమని తలఁచి

యుండిరి. అప్పుడు ప్రధానమంత్రియైనవృద్ధయుగంధరుఁడుసహితము జాలిపడినవాఁడయి మదనదాసునిప్రాణరక్షణార్థము చెప్పఁదలఁచుకొని ధర్మకవచునియొద్దకుఁ బోయి "అయ్యా! పడుచునేరము చేసిన యీభాగ్యహీనునికి సజ్జనాగ్రగణ్యుఁ డయినముసలితండ్రి యొకఁ డున్నాఁడు. పుత్రశోకమునఁ బరితపించుచున్నయీవృద్ధుని జూచి యైనను మదనదాసుని యీమొదటితప్పిదమును మన్నింపుఁడు' అని దీనముగా వేఁడుకొనెను. "ఒక్కరివిషయమున మనము ధర్మశాస్త్రమును మీఱినపక్షమున జనులు ధర్మమునం దాదరము లేనివారై నిర్భయముగా యథేచ్ఛావిహారమును మఱిగి చెడుదురు. కాఁబట్టి మన మపరాధులయెడల దయ తలఁచగూడదు. ఇతఁడు తప్పక చావ వలసినవాఁడే" అనిధర్మకవచుఁడు ఖండితముగాఁబలికి యాతనిప్రార్థన నంగీకరింప నిరాకరించెను.

మదనదాసుఁడు కారాగృహమునం దుంచఁబడినప్పుడు సుమిత్రుఁ డనుమిత్రుఁడాతనిజూచుటకయి యచ్చటికిఁబోగా నతఁడు "ఓ మిత్రరత్నమా! నాయం దనుగ్రహించి నీవునాకొక్క యుపకారము చేయవలెను. ఈదినముననే యొకవిహారమునందు యోగినిగాఁ జేరఁ దలఁచుకొన్న నాచెల్లెలయినదయామతి యొద్దకుఁబోయి, ఆమెతో నిప్పటి నాదుర్దశనుజెప్పి నానిమిత్తమయి యొకసారి శ్రమపడి ధర్మకవచుని సన్నిధికిఁబోయి సోదరుని ప్రాణదానముచేయ నాతనిని వేఁడుకొమ్మని చెప్పుము. ఆమెపోయి వేఁడుకొన్నయెడల ప్రాణరక్షణము గలుగునని నన్నొకయాశ బాధించుచున్నది. ఇతరులమనసున కెక్కునట్లుగా నేర్పుమాటలతో బోధించియెట్టివంటి వారినైన లోఁబఱుచుకొనఁగలసామర్థ్య మామెయందున్నది. అంతేకాక యౌవనవతియైన కన్య పోయి కాళ్ళమీఁదఁబడి కన్నీరు కాలువలుగట్ట దీనముగా వేఁడు

కొన్నప్పుడెటువంటి రాతిగుండె గల కఠినపురుషునిహృదయ మైనను నిమిషములో నీరుగా కరఁగకమానదు'' అని వేఁడుకొనెను.

మదనదాసునిచెల్లె లయినదయామతి యాదినమునందే మిథిలానగరమునందలి యొకవిహారములో శిష్యురాలుగాఁ బ్రవేశించి, శుశ్రూషాకాల మయినతరువాత గురూపదేశమును బొంది యోగిని యయి యాశ్రమస్వీకారము చేయవలె నన్నతలంపుతో నొకసన్యాసిని మఠముయొక్క విధులనుగూర్చి యడుగుచుండెను. ఇట్లడుగుచున్న సమయములో సుమిత్రుఁ డామఠద్వారము చేరి బిగ్గరగా "ఈమఠములో నున్నవారికి తపోవిఘ్నము కలుగకుండునుగాక!'' అని కేక వేసెను. "ఎవరిదో మాట వినఁబడు చున్నది'' అనిదయామతిమఠములోనియోగినితోఁ జెప్పెను. "అది యెవ్వనిదో పురుషునిగొంతుక నీవావలికి పోయి యతఁ డేపనిమీఁద వచ్చెనో తెలిసికొని రా. పురుషునితో నీ విప్పుడు మాటాడవచ్చునుగాని నేను మాటాడరాదు. నావలెనే నీవును యోగినివిగా నభిషిక్తురాల వయినపిమ్మట మన మఠాధిపతీసమ్ముఖమునందుఁ దప్ప నీ వేపురుషునితోను మాటాడగూడదు. ఆయనసన్నిధియందుసహితము మన మొకపురుషునితో మాటాడెడుపక్షమున మన మొగ మాతనికి కనఁబడనియ్యఁగూడదు. మొగము కనఁబడనిచ్చినపక్షమున మాటాడఁగూడదు'' అని యోగిని పలికెను. "యోగిను లయినమీ కింతకంటె నెక్కువ స్వాతంత్ర్యములు లేవా?'' అని దయామతి యడిగెను. "ఇఁక చాలవా?'' అని యోగిని యుత్తరమిచ్చెను. "చాలును. ఇంతకంటె నెక్కువస్వాతంత్ర్యములు కావలెనని నాకోరిక కాదు. ఇక్కడియోగినుల పవిత్రతను కాపాడుట కయి తగినన్నినిబంధన లుండుటయే నాయభిమతము;'' అని దయా

మతి పలుకు చుండఁగా నింతలో మరల వెలుపలినుండి పిలుపు వినఁబడెను. అప్పు డాయోగిని దయామతినిజూచి "సోదరీ! అతఁడు మరల పిలుచు చున్నాఁడు. నీవు పోయి పలుకుము" అని చెప్పెను. అంతట దయామతి గుమ్మమువద్దకుఁ బోయి తన్నుఁజూచి నమస్కరించిన సుమిత్రు నాశీర్వదించి, యిప్పుడు పిలిచినవా రెవ్వరని యడిగెను. అప్పుడు సుమిత్రుఁడామెను గౌరవముతో సమీపించి" ఓకన్యామణీ! నీకు మేలగునుగాక ! ఇక్కడకు క్రొత్తగా నాశ్రమస్వీకారమునిమిత్తము వచ్చినట్టియు మందభాగ్యుఁ డయినమదనదాసుని తోఁబుట్టువయినట్టియు దయామతి నొక్కసారి నాకంటికిఁ గనఁబఱిచి పుణ్యము కట్టుకొనఁగలవా ?" అని వేఁడెను. "మదనదాసుఁడు మందభాగ్యుడా! అతని కేమితటస్థించినది ? నేనే దయామతిని , ఆతనిచెల్లెలను." అని యామె విచారముతోఁబలికెను. "దయార్ద్రహృదయ వైనయోసుందరాంగీ ! నీసోదరుఁడు నీకు తనయాశీర్వచనములు చెప్పు మన్నాఁడు. అతఁ డిప్పుడు చెఱసాలలో నున్నాఁడు." అని యతఁడు చెప్పెను. "హా ! నాగుండెలు పగులుచున్నవి ! అతని కాగతి యేలపట్టినది ?" అని యామె యడిగెను. అతఁ డొకకన్య నింటినుండి లేవదీసినందునఁ జెఱసాలలోఁ బెట్టఁబడినాఁ డని సుమిత్రుఁడు చెప్పెను. "ఆకన్య నా ప్రాణ మయినమనోరంజని కాదుగదా !" అని దయామతి వెచ్చనూర్చెను. మనోరంజనియు దయామతియు దగ్గఱబంధువులు కాకపోయినను చిరకాల మొక్కపాఠశాలలోఁ జదువుకొన్నచిన్ననాఁటి చెలికత్తె లగుటచేత వారొండొరులను ప్రాణతుల్యులనుగా భావించుకొనుచుండిరి. మనోరంజనిమనస్సు తనయన్నగారిమీఁదతగిలియుండుట దయామతి యెఱిఁగిన దయినందున తనచెలికత్తెయొక్కప్రార్థనచేత నాతఁ డాయవివేకకార్యమున కొడఁబడి యుండు నని యామెయూహ

చేసెను. "మనోరంజనియే" అని సుమిత్రుఁడు చెప్పెను. "అయినపక్ష
ముననాయన్నగా రాచిన్నదానినివివాహమాడవచ్చును." అనిదయా
మతి పలికెను. "నీయన్నగా రాకన్నను సంతోషపూర్వకముగా వివా
హము చేసికొనుటకు సిద్ధముగానే యున్నాఁడు. కాని క్రొత్తరాజ
ప్రతినిధి యంగీకరింపక యాయపరాధమున కయి నీసహోదరునికి
మరణదండనమును విధించినాఁడు. నీవుపోయి నీదయనీయవాక్యముల
చేతను ప్రార్థనలచేతను ధర్మకవచునిమనసు కరఁగించి మెత్తపఱచినం
గాని లేనియెడల నీసోదరుఁడు ప్రాణములు విడువవలసినవాఁడే.
ఈకార్యమునందు నీవు నీసామర్థ్యమును జూపవలెను. ఈపనినిమిత్తమే
నేను భాగ్యహీనుఁడయిననీయన్నగారియొద్దనుండి నీయొద్దకు సందేశ
మును గొనివచ్చినాను." అని సుమిత్రుఁడు జాలిపుట్టునట్లుగాఁ జెప్పెను.
"అయ్యో! ఇటువంటియాపత్సమయములోఁ దోఁడఁబుట్టినవాని
ప్రాణము నిలుపఁగలుగుటకు దగినసామర్థ్యము నాయొద్ద నేదియు
లేకున్నదిగదా? ధర్మకవచునిమనసు కరఁగింపఁగలశక్తి నాకుఁ గలదని
నే ననుకోను." అని దయామతి నిట్టూర్పు విడిచెను. "నీశక్తినిగూర్చి
నీవు సందేహపడఁగూడదు. లేనిపోనియధైర్యమువలన మనముప్రయ
త్నము చేయుటకు భయపడి మనము పొందఁగలిగినమేలునే పోఁగొట్టు
కొందుము. అమ్మా! నీవు తప్పక ధర్మకవచునియొద్దకుఁ బొమ్ము.
కన్యకలు పాదములమీఁదఁబడి దుఃఖపడి దీనత్వముతో ప్రార్థించి
నప్పుడు దేవతలవలెనే మనుష్యులును వరప్రసాదు లగుదురు." అని
సుమిత్రుఁడు ప్రోత్సాహవాక్యములు పలికెను. "నేనిప్పుడే పోయి
యీవార్త మఠాధికారులకు విన్నవించి సెలవుగైకొని తిన్నగాధర్మ
కవచునియొద్దకుఁ బోయెదను. నీవుపోయి నాయందు దయయుంచు
మని నాయన్నగారితోఁ జెప్పుము. కార్యసాఫల్యమయినపక్షమున

నావిజయవార్త నీరాత్రియే యాతనికిఁ జెప్పి పంపెదను.'' అని పలికి దయామతి సుమిత్రుని బంపివేసెను.

తరువాత వెంటనే బయలుదేఱి దయామతి రాజమందిరము నకుఁబోయి ధర్మకవచునియొక్క పాదములమీఁదఁ బడి 'ఓమహాప్రభూ! నేను దుఃఖార్తనై దేవరవారితో మొఱ్ఱపెట్టుకొనుటకయి వచ్చినాను. దేవర యీదీనురాలిమొఱ్ఱ యాలకించి కటాక్షింపవలయును.' అనివిన్నపము చేసికొనెను. 'నీవుచేయఁదలఁచుకొన్న విన్నపమేమి?' అని ధర్మకవచుఁ డడిగెను. ఆమె తాను వచ్చినకార్యమును మహావినయముతో విన్నపముచేసి, ఱాతివంటి కఠినచిత్తునిహృదయమయినను కరఁగునట్లు దీనాలాపములతోఁ దనసోదరునికి ప్రాణదానము చేయుమని యాతనిని వేఁడుకొనెను. "ఓ కన్యామణీ! నీవు వచ్చినకార్యమునకు ప్రతిక్రియ లేదు. నీసోదరుని కీవఱకే శిక్షవిధింపఁబడినది. ఇఁక నతఁడు తప్పక చావవలసినవాఁడే.'' అనిధర్మకవచుడు చెప్పెను. "అయ్యో! న్యాయమయిన దయినను నాపట్ల రాజశాసన మెంతక్రూరముగా నున్నది! ఇఁక నేను నాయన్నగారు మృతుఁడయినట్లెంచుకోవలసినదే. అయ్యా! మీకు దేవుఁడు మేలుచేయునుగాక!'', అని యక్కడనుండి వెడలఁబోయెను. అప్పు డామెవెంట వచ్చిన సుమిత్రుఁడు "అమ్మా! ఇంతవేగముగా నిస్పృహతో మరలుట నీతిగాదు. ఇంకొకసారి పోయి యాయనకాళ్ళమీఁదఁ బడి బ్రతిమాలుకొమ్ము''అని యామెను మరలఁ బురికొల్పెను. అంతట దయామతి మరలఁ బోయి ధర్మకవచునిపాదములఁ బడి లేవక దయచూపవలసినదని ప్రార్థించెను. "ఓకాంతా! లెమ్ము. కాళ్ళమీఁదినుండి లెమ్ము. శిక్ష యీవఱకే విధింపఁబడినందున కార్యము మించిపోయినది.'' అని ధర్మకవచుఁడు మరలఁ బలికెను. "నాసోదరుని దేహములో ప్రాణము

లున్నంతవఱకును కార్యము మించిన దనరాదు. దేవరయనుగ్రహ మున్నపక్షమున నాప్రార్థనవలన చెడినకార్యమే మరల చక్కపడ వచ్చును. రాజులకుఁగాని రాజప్రతినిధులకుఁగాని ధర్మాధికారులకుఁ గాని దయను బోలఁదగినయలంకార మింకొకటి లేదు.'' అని యింకను జెప్ప మొదలు పెట్టెను. ''నన్ను పీడింపక యిక్కడనుండి శీఘ్రముగా వెడలిపొమ్ము'' అని ధర్మకవచుఁడు తెగనాడెను. అయినను దయామతి మాత్ర మంతటితో విడువక మఱింత బ్రతిమాలుకొనుచు ''అయ్యా! నీస్థితిలో నాయన్నగారును నాయన్నగారిస్థితిలో నీవును నుండినపక్ష మున, ఆతనివలె నీవును నింద్రియదౌర్బల్యముచేతఁ గామవికారము నకు లోఁబడి యుందువుగాని నీవలె నతఁడుమాత్ర మింతకఠినచిత్త తను వహించి యుండఁడు. ఇప్పుడు నీయధికారమును నాకిచ్చి నిన్ను దయామతినిగాఁ జేయవలె నని యీశ్వరుని ప్రార్థించు చున్నాను. అట్టిభాగ్య మెన్నఁడైన దటస్థించునా? తటస్థింపదు. అపరాధికిని ధర్మాధికారికిని గలభేదము నీకు బోధపడునట్లు చేయుటకై నేనీ నిదర్శ నము నూరక చెప్పినాను.'' అని నానావిధముల ప్రలపించు చుండెను. ''ఓసుందరీ! నీ వింతటితోఁ దృప్తినొందుము. నీసోదరుని దండించు నది రాజశాసముకాని నేను కాను. అతఁడు నాబంధువైనను సోదరు డైనను కుమారుఁడైనను, ఈప్రకారముగా జరగితీరవలసినదే. అతఁడు తేపటినదిము చావక తప్పదు.'' అని యతఁడు ఖండితముగాఁబలికెను 'తేపటిదినమా? ఇంతయాకస్మికముగా ప్రాణముతీయింపక యాతనిఁ రక్షింపుఁడు. ఇంకా శీఘ్రముగా మృతినొందుట కతఁడు సంసిద్ధుఁడ కాలేదు. వంటయింట కోడిపిట్టను జంపవలసి వచ్చినప్పుడు సహితము కొంతకాలము పెరుఁగనిచ్చి మఱి చంపుదురు. అటువంటిస్థితిలో తోఁ మానవునిప్రాణములు కొనుటకై యింత వేగిరపడుట ధర్మమగునా

నీలోనీవు చక్కగా నాలోచించుకొమ్ము. నాయన్నగారు చేసిననేర మునే చేసియున్నవారు లోకములో ననేకు లున్నను వారిలో నొక్క రికిని మరణదండనము కలుగలేదు. కాఁబట్టి యిప్పు డిటువంటిక్రూర శిక్షను విధించుటకు నీవే మొదటివాఁడ వగుచున్నావు; అనుభవించుట కతఁడు మొదటివాఁ డగుచున్నాఁడు. నాసోదరుఁడు చేసినయపరాధము నకు లోనగుట పడుచుతనములో నున్నవారికందటికిని సామాన్య గుణ మగునో కాదో నీహృదయము నడిగి తెలిసికొమ్ము. సర్వ సామాన్యమయిన స్వాభావికగుణమని నీహృదయముచెప్పిన పక్ష మున నాసోదరునిప్రాణము రక్షింపుము." అని యామె యాతని హృదయమును మధ్యవర్తినిగాఁ గోరిప్రార్థించెను. ఇప్పుడాతనిమనస్సు కూడ దయామతియొక్క యసమానసౌందర్యమునకు భ్రమించి మదన దాసుఁడు చేసినయపరాధమునే యామెవిషయమునఁ జేయఁ గోరు చున్నందున, దయామతి చేసిన సంభాషణములో నెల్లను కడపటి వాక్య ములు బాణములవలె ధర్మకవచునిమనస్సులో దృఢముగా నాటు కొనెను. అప్పు డాతనిమనస్సులో ధర్మకామములకు రెంటికిని పోరాట మారంభముకాఁగా నతఁడు దయామతినుండి తనముఖమును త్రిప్పు కొనెను. "ఓసౌజన్యనిధీ! నన్నుఁజూచి మొగ మేల త్రిప్పుకొనెదవు? నీకొక్కలంచమును సమర్పించుచున్నాను. నాయెడ ప్రసన్నుఁడవయి యిటుచూడుము." అని యామె పలికెను. లంచమన్నమాటకద్భుత పడి యతఁడు "ఏమీ! నాకే లంచమిచ్చెదవా?" అని యడిగెను. "ఓసుజనాగ్రగణ్యా! వేఱువిధముగా భావింపఁబోకు నేను నీకిచ్చెద నన్నలంచము భగవంతునికిఁగూడ ప్రీతికరమయినదే. అది ధనకనక రత్నమయ మయినలంచముకాదు. ఇప్పుడునీకు సమర్పింపఁబోవునది దయాళుఁ డయినప్రాణదాతయొక్క మేలు గోరి రక్షితుఁ డయినతన

జీవనము నీశ్వరసేవకయి ధారపోసిన విశుద్ధకన్యయు నీశ్వరుఁడు మెచ్చు నట్లుగా కృతజ్ఞతతోఁ జేయుప్రార్థనారూప మయిన లంచము" అని యామె తనభావమును వివరించెను. ఆమాటలువిని యాతఁడు మఱే మియు పలుకక 'ఓకాంతా! ఇప్పుడు పొమ్ము రేపు రమ్ము, అని చెప్పెను. రేపు రమ్మన్న చిన్నమాట కామె పరమానందభరితురా లయి యొక్కదినము గడు విచ్చుటచేతఁ దనభార్తృవరుని ప్రాణరక్ష ణార్థము మరల వేఁడుకొనుట కవకాశము కలిగినదని కొంతయాశ పెట్టుకొని యామె యక్కడనుండి కదలి 'ఈశ్వరుఁడు నీగౌరవమును కాపాడునుగాక!' అనిపలుకుచు వెడలిపోయెను. ధర్మకవచుఁ డామా టలు విన్నప్పుడు తనహృదయములో "తథాస్తు! నేను నీసురూపసుగు ణములనుండి కాపాడఁబడుదునుగాక!" అనుకొనుచుండఁగా నింతలో దురాశలు మరలవచ్చి యతనిమనస్సును బాధింపఁ జొచ్చినందున నతఁడు తనమనస్సులో "ఏమి యీవింత! నేనామెను కామించు చున్నాను; ఆమె మృదుమధురవాక్యములుమరల వినఁగోరుచున్నాను. ఆమె ముఖదర్శనమువలన నేత్రోత్సవము చేసికొనఁ గోరుచున్నాను; ఇది స్వప్నమయియుండునా యేమి? మనుష్యకోటికి ప్రియశత్రుఁడయిన మాయలమారి కాముఁడు మహాతపస్విని వలలోఁ బడవేయుటకయి తపస్విసినే మచ్చు పెట్టుచున్నాఁడు! ఎంతసౌందర్యముగల జాణాంగ నయు నణుమాత్రిమును నాహృదయమును నేఁటివఱకును చలింపఁ జేయఁగలిగినది కాదు. ఇప్పుడేమోకాని విశుద్ధచరిత్రమైన యీకాంత నాహృదయము సంచలింపఁజేసి నన్ను పరిపూర్ణదాసునిగాఁ జేయు చున్నది. ఇంతవఱకు నేను పురుషులుసుందరులనుగామించిరనివిన్నప్పు డెల్లను జిఱునవ్వునవ్వి యాశ్చర్యపడుచుంటిని. ఆహా! ఏమి యీయా శ్చర్యము!" అని తలపోయుచుండెను.

పాపముతోడి పోరాటములో ధర్మకవచుఁడా రాత్రి తనచేఁ గూ్రరశిక్షపొంది జీవితాశ విడిచి చెఱసాలలో పరితాపపడుచున్న మదనదాసునికంటెను నధికబాధను బొందెను. ఆరాత్రి యతివేష ముతోనున్న రాజు కారాగృహమునకుఁ బోయి పశ్చాత్తాపమును వైరాగ్యమును బోధించి యీశ్వరభక్తి యుదయింపఁజేసి మనశ్శాంతిని కలిగించినందున చెఱసాలలో మదనదాసుఁడు నిర్విచారముగానే యుండెను. కాని ధర్మకవచునిమనస్సుమాత్రము ముయ్యేలవలె నిటునటు నూఁగులాడుచు చంచలము లయినపాపచింతనలచే బాధపడు చుండెను——ఆతనిమన స్సొకసారి నిష్కళంకురా లయినదయామతిని సన్మార్గమునుండి తొలఁగించి మానధనము నపహరించి యామెను చెఱుపవలెనని యభిలషించుచుండెను; ఇంకొకసారి తాను బుద్ధిపూర్వకముగా చేయఁదలఁచుకొన్న పాపకృత్యమునకు భయపడి పరితాప పడుచుండెను. అయినను కట్టకడపట పుణ్యపాపముల కీప్రకారముగా నయిన పోరాటములో పాపచింతలకే గెలుపుకలిగెను. అందుచేత నిమిషకాలముక్రిందట లంచమన్న పేరు విన్నమాత్రముననే యులికి పడినయాతఁ డిప్పుడు సందేహింప యాకన్యను ప్రియసోదరుని యమూల్యప్రాణదాన మనుదుర్నిరోధన మయినపెద్దలంచముతో తప్పుతోవ కీడ్చుటకు నిశ్చయము చేసికొనెను.

మఱునాఁటియుదయమున దయామతి తన దర్శనమునకు వచ్చినప్పుడు ధర్మకవచుఁడామె నొంటిగాఁ దనయొద్దకు రప్పించుకొని ఆమెమీఁద తనకుఁ గలిగినవలపును తేటపఱిచి, "ఓదయామతీ! మనోరంజని మదనదాసునివిషయములో చేసినట్లుగా నీవు నీకన్యాత్వము నాపాలుచేసినయెడల, నేను నీసహోదరునికి ప్రాణదానము చేసెదను" అని చెప్పెను. "అయ్యా! ఇటువలెనే నాసోదరుడు మనో

జీవనము నీశ్వరసేవకయి ధారపోసిన విశుద్ధకన్యయు నీశ్వరుఁడు మెచ్చు నట్లుగా కృతజ్ఞతతోఁ జేయు ప్రార్థనారూప మయిన లంచము" అని యామె తనభావమును వివరించెను. ఆమాటలువిని యాతఁడు మఱే మియు పలుకక 'ఓకాంతా! ఇప్పుడు పొమ్ము రేపు రమ్ము', అని చెప్పెను. రేపు రమ్మన్న చిన్నమాట కామె పరమానందభరితురా లయి యొక్కదినము గడు విచ్చుటచేతఁ దనభాతృవరుని ప్రాణరక్ష ణార్థము మరల వేఁడుకొనుట కవకాశము కలిగినదని కొంతయూఱ ట్టుకొని యామె యక్కడనుండి కదలి 'ఈశ్వరుఁడు నీగౌరవమును కాపాడునుగాక!' అనిపలుకుచు వెడలిపోయెను. ధర్మకవచుఁ డామా టలు విన్నప్పుడు తనహృదయములో "తథాస్తు! నేను నీసురూపసుగు ణములనుండి కాపాడఁబడుదునుగాక!" అనుకొనుచుండఁగా నింతలో దుర్వాంఛలు మరలవచ్చి యతనిమనస్సును బాధింపఁ జొచ్చినందున నతఁడు తనమనస్సులో "ఏమి యీవింత! నేనామెను కామించు చున్నాను; ఆమె మృదుమధురవాక్యములుమరల వినఁగోరుచున్నాను. ఆమె ముఖదర్శనమువలన నేత్రోత్సవము చేసికొనఁ గోరుచున్నాను; ఇది స్వప్నమయియుండునా యేమి? మనుష్యకోటికి ప్రియశత్రుఁడయిన మాయలమారి కాముఁడు మహాతపస్విని వలలోఁ బడవేయుటకయి తపస్వినినే మచ్చు పెట్టుచున్నాఁడు! ఎంతసౌందర్యముగల జారాంగ నయు నణుమాత్రమును నాహృదయమును నేఁటివఱకును చలింపఁ జేయఁగలిగినది కాదు, ఇప్పుడేమోకాని విశుద్ధచరితయైన యీకాంత నాహృదయము సంచలింపఁజేసి నన్ను పరిపూర్ణదాసునిగాఁ జేయు చున్నది. ఇంతవఱకు నేను పురుషులుసుందరులనుగామించిరనివిన్నప్పు డెల్లను నిజమనవ్వునవ్వి యాశ్చర్యపడుచుంటిని. ఆహా! ఏమి యీయా శ్చర్యము!" అని తలపోయుచుండెను.

పాపముతోడి పోరాటములో ధర్మకవచుఁడారాత్రి తనచేఁ గూర్రశిక్షఁబొంది జీవితాశ విడిచి చెఱసాలలో పరితాపపడుచున్న మదనదాసునికంటెను నధికబాధను బొందెను. ఆరాత్రి యతివేషముతోనున్నరాజు కారాగృహమునకుఁ బోయి పశ్చాత్తాపమును వైరాగ్యమును బోధించి యీశ్వరభక్తి యుదయింపఁజేసి మనశ్శాంతిని కలిగించినందున చెఱసాలలో మదనదాసుఁడు నిర్విచారముగానే యుండెను. కాని ధర్మకవచునిమనస్సుమాత్రము ముయ్యాలవలె నిటునటు నూఁగులాడుచు చంచలము లయినపాపచింతనలచే బాధపడుచుండెను—ఆతనిమన స్సొకసారి నిష్కళంకురా లయినదయామతిని సన్మార్గమునుండి తొలఁగించి మానధనము నపహరించి యామెను చెఱుపవలెనని యభిలషించుచుండెను; ఇంకొకసారి తాను బుద్ధిపూర్వకముగా చేయఁదలఁచుకొన్న పాపకృత్యమునకు భయపడి పరితాపపడుచుండెను. అయినను కట్టకడపట పుణ్యాపాపముల కీప్రకారముగా నయిన పోరాటములో పాపచింతలకే గెలుపుకలిగెను. అందుచేత నిమిషకాలముక్రిందట లంచమన్న పేరు విన్నమాత్రముననే యులికిపడినయాతఁ డిప్పుడు సందేహింప యాకన్యను ప్రియసోదరుని యమూల్యప్రాణదాన మనుదుర్నిరోధన మయినపెద్దలంచముతో తప్పుత్రోవ కీడ్చుటకు నిశ్చయము చేసికొనెను.

మఱునాఁటియుదయమున దయామతి తన దర్శనమునకు వచ్చినప్పుడు ధర్మకవచుఁడామె నొంటిగాఁ దనయొద్దకు రప్పించుకొని ఆమెమీఁద తనకుఁ గలిగినవలపును తేటపఱచి, "ఓదయామతీ! మనోరంజని మదనదాసునివిషయములో చేసినట్లుగా నీవు నీకన్యాత్వమును నాపాలుచేసినయెడల, నేను నీసహోదరునికి ప్రాణదానము చేసెదను" అని చెప్పెను. "అయ్యో! ఇటువలెనే నాసోదరుడు మనో

రంజనిని కామించినాఁడు. ఇంతటితప్పిదమునకే మీరాతనిప్రాణములు తీసెదమని చెప్పుచున్నారు” అని దయామతిపలికెను. “ఓకాంతామణీ! మదనదాసునికొఱకై మనోరంజని రాత్రివేళ తనతండ్రిగృహము విడిచివచ్చినట్లుగా నీవును రహస్యముగా రాత్రివేళ నాయొద్దకువచ్చునట్లొప్పుకొన్నపక్షమున, నీసోదరునిప్రాణము రక్షించెదను.” అని యతఁడు స్పష్టముగాఁ జెప్పెను. తనసహోదరుని కేనేరముచేసినందునకయి మరణదండనమును విధించెనో యానేరము నేతానును జేయనెంచి యతఁ డిప్పుడు కన్యాత్వము దూష్యమగునట్లుగా తన్ను ప్రేరేపించుచుండుటవలన దయామతి మనస్సులో కళవళపడి క్షణకాల మూరకుండి “నాసోదరవిషయమునఁగూడ నేనెప్పుడును నామానరక్షణమునకు భంగమువచ్చెడుసాయమును జేయఁజాలను. నన్నొరులు మెడమీఁద కత్తిపెట్టి బాధించి చంపఁబూనినను నేనామరణవేదననైన పుష్పహారమువలె వహించి సహించియుండఁగలుగుదునుగాని మానభంగమునకు సహింపను.” అని తెగనాడి మరల “మీరు నాగుణమును పరీక్షింపవలెనని యిట్లనుచున్నారుకాఁబోలును!” అని పలికెను. “పరీక్షనిమిత్తముగాదు. ఈశ్వరునితోడు! నాహృదయపూర్వకముగానే నే నీప్రార్థన చేయుచున్నాను.” అని యతఁడు చెప్పెను. అటువంటి యవమానకర మయినదుష్కార్యవిషయమై యతఁ డీశ్వరనామమునుచ్చరించినందునకయి కోపపరవశురాలయి “ఓకిరాతుఁడా! నీయీదుర్వృత్తమును నేను లోకమునకు వెల్లడించెదను. కాచుకో. తత్క్షణము నీవు నాసోదరుని క్షమించి విడిచిపెట్టితివా విడిచిపెట్టు లేదా నే నిప్పుడే పోయి నీవెట్టివాఁడవో లోకమునకంతకుఁ జాటెదను” అని దయామతి పలికెను. ‘ఓసుందరీ! తొందరపడఁబోకు. నీమాటలు లోకములో నెవ్వరు నమ్ముదురు? లోకములో పేరుమోసిననావంటి

గొప్పవానిమాటముందఱ నీమాట గవ్వకుకొఱగాదు. నీతోఁ బుట్టువు ప్రాణము రక్షింపఁ దలంపుగొంటివా, నాప్రార్థన చెల్లింపుము. లేదా రేపతనిచావు నిశ్చయము. నీవితరులతో నీ యిచ్చవచ్చినట్లు వదర వచ్చును. అయినను లోకమునకు మాత్రము నీనోటినుండివచ్చిన సత్యకథయందుకంటె నానోటినుండి వెడలినయసత్యవాక్యమునందే యెక్కువగౌరవముండును. కాఁబట్టి నీలోనీవు చక్కఁగా నాలోచించుకొని రేపు వచ్చి యుత్తరము చెప్పు" అని యతఁడు నిశ్శంకముగా మరలఁ బలికెను. "నే నీసంగతి యెవ్వరితో మొఱ్ఱపెట్టుకొనను? నేను జెప్పినను నామాట యెవ్వరు నమ్ముదురు?" అని తనలో దా నను కొనుచు, ఆతనితో మాఱుమాట పలుకక దయామతి యక్కడనుండి గిరుక్కున మరలి తిన్నఁగా తనసోదరుఁ డున్న చెఱసాలవంక నడిచెను. ఆమె చెఱసాల చేరునప్పటికి యతివేషముతో వచ్చి రాజక్కడ మదన దాసునకు హితబోధచేసి యీశ్వరభక్తి నుపదేశించుచుండెను. అతఁ డాసన్యాసివేషముతోనే మనోరంజనియొద్దకు సహితము పోయి యామెతో సంభాషింపఁగా, ఆమె కన్నుల నీరుపెట్టుకొని తనతప్పి దము నొప్పుకొని నిజమయినపశ్చాత్తాపముతో కామవికారమునకు మనఃపూర్వకముగా లోఁబడుటలో మదనదాసునికంటెఁ దానేయధిక దోషము చేసితి నని చెప్పెను.

దయామతి చెఱసాలలోఁ బ్రవేశించి సోదరుఁడు కంట బడ గానే కన్నీరునించుచు "అన్నా! నీ కాత్మరక్షణము కలుగునుగాక నీవు సత్సంగమమునఁ బ్రొద్దుపుచ్చుచున్నావు" అని పలికెను. ఆమాటవిని "ఎవరువారు?" అని రాజామెవంకఁజూచి "లోపలికిరమ్ము ఇటువంటిచల్లనిమాట పలికినవారి నాదరింపకుండరాదు." అని పిలిచెను. "అయ్యా! నేనీమదనదాసునితో లెక్కరెండుమాటలు

మాటాడి వెడలిపోయెదను. మీరు కొంతకాలము దూరముగా నుండవలెను'' అని దయామతి యతనిని తొలఁగ వేఁడుకొనెను. రాజు వెంటనే యాచోటును విడిచి, కావలివానిని బిలిచి తన్ను వారిసంభాషణము వినఁబడుస్థలమునందుఁ గూరుచుండఁ బెట్టుమని యడిగి వాఁడు చూపిన రహస్యస్థలమునందుఁ గూరుచుండెను. అప్పుడు మదనదాసుఁడు తన చెల్లెలినిజూచి "సోదరీ! ఏమిశుభవార్త?'' అని యడిగెను. "నీవు రేపటిదినము దేహము విడుచుటకు సంసిద్ధుఁడవయి యుండవలెను'' అని యామె యుత్తరము చెప్పెను. "ఓదయామతీ! దీనికేదియు ప్రతిక్రియ లేదా?'' అని యతఁ డత్యాతురముతో మరల నడిగెను. "ఉన్నది దానికి నీవొప్పుకున్నయెడల, గౌరవము పోఁగొట్టుకొని నీవు మానహీనుఁడ వగుదువు'' అని యామె గంభీరస్వరముతో బలికెను. "ఓసహోదరీ! అదియేదో నొక్కసారి విననైన ననువిననిమ్ము.'' అని నిస్పృహతోఁ బలికెను. "మదనదాసా! నీవదివిన్నచో స్థిరమయిన కీర్తికాయమును బోఁగొట్టుకొని యస్థిరమయినయీ హేయకాయమును వ్యర్థముగాఁ గొంతకాలము నిలుపుకొనుట కాశపడుదువేమో యని నాకు భయమగుచున్నది. నీవు మృతికి సంసిద్ధుఁడ వయి యున్నావా? మరణమన్న భయపడుట యెట్టివారికిని సహజముగా నున్నది. మరణవేదన మనము నిత్యము కాలిక్రింద నలగద్రొక్కు చీమ కెంతయుండునో మనకు నంతేయుండును.'' అని దయామతి చెప్పమొదలుపెట్టెను. "ఇట్టి పిఱికిమందు వేసి నన్నేల వృథాగా చంపెదవు? నేను చావవలసి యున్నయెడల, చేతులు చాచుకొని యెదురుగాఁబోయి మృత్యుదేవతను కౌఁగిలించుకొందునుగాని నిష్కీర్తికాంతను నేను వరింతునా?'' అని మదనదాసుఁడు విచారముతోఁ బలికెను. "ఓమదనదాసా! నీవిప్పు డన్నమాట మనచనిపోయిన

పెద్దలు విన్నను మెచ్చుకోఁదగినదిగా నున్నది. నీవు చావవలసిన దే పయికి మేకవన్నెపులివలె సాధువర్తనుఁడుగాఁ గనఁబడుచున్న యీధర్మకవచుఁడు నేను నాకన్యాత్వమూఁడిచేసి తనపాలు చేసినపక్షమున నీకుప్రాణదానముచేయునఁట! అతఁడు నామానమును గోరక ప్రాణమును గోరియుండినయెడల నీనిమిత్తమయి నాప్రాణమునుగడ్డిపరకవలె విడిచిపెట్టియుందును", అనియామె చెప్పెను. "ఓదయామతీ", నామీఁద నీకుఁగల దయయొక్క ఋణమును నేను తీర్చుకోఁజాలను., అని యతఁడు పలుకుచుండెను. "బహుభాషలెందుకు? రేపటియుదయకాలమున నీవు చావు సిద్ధముచేసికొని యుండుము" అని చెల్లెలనెను. "చావు భయంకరమైనదికదా!" అని యన్నయనెను. "అవమానము చావుకంటెను నధికభయంకరమయినదిసుమా!" అని చెల్లెలు మరలఁ పలికెను. ఇప్పుడు మరణవిచారము బలపడి యాతనిహృదయమునాక్రమించి వివేకము నందుండి పోఁగొట్టినందున, పాపము చేసినవారికొక్కరికిఁదక్క నితరుల కూహింపనలవిగాని యనుభవైకవేద్యములయిన మరణవేదనలను మనస్సులో ననుభవింపుచు మదనదాసుఁడు "నాప్రియసోదరీ! నాప్రాణములెట్లయినను నిలుపుము. ప్రాణములెవ్వరికిని తీపికదా! సోదరప్రాణరక్షణార్థమై నీవు చేసెడి యీయల్పపాపము దేవునకసమ్మతము గాక పుణ్యకార్యమే యగును." అని దీనముగాఁ బలికెను. "ఓరిపిఱికిపందా! ఓరినీతిమాలినపాపీ! నీచెల్లెలి యవమానమువలన నీప్రాణములు కాపాడుకోనఁ జూచుచున్నావురా? ఛీ! ఛీ! ఛీ! ఒక్కటిగాక నీకు నూఱుశిరస్సు లున్నను వానినెల్ల నీచెల్లెలి సిగ్గుపాటుమాపనోర్చుటకంటె ముందుగా నొక్కొక్కదానినే కోయుటకొగ్గఁగలమానవునకుండవలసిననీతిగుణలేశము నీయందున్నదనుకొన్నాను." అని యామె యన్నగారిని దూఱనాఁడు

చుండఁగా నతఁడు 'నాప్రాణతుల్యవైన యోప్రియసోదరీ! నామాట వినుము—'' అని తన దౌర్బల్యమునుగూర్చి యేమో మార్పణచేయఁ బోవుచున్న సమయములో రాజక్కడకువచ్చి ''ఓ మదనదాసా! నీకును నీచెల్లెలికిని జరగినసంభాషణమును నేను గోడచాటుననుండివిన్నాను. ధర్మకవచుఁ డీచిన్నదానిని చెఱుపవలెనని యెంతమాత్రమును ద్దేశించి యుండఁడు. ఈమెమనశ్శుద్ధిని పరిశోధించవలెననియే యతఁడీమాట యనియుండును. ఈమె నిష్కళంక మయినమనఃపరిశుద్ధత కలదయి యాతనిప్రార్థనను నిరాకరించుచు శ్లాఘ్య మయినయుత్తరము చెప్పి నందునకయి యతఁడు మనస్సులో నపారప్రమోదము నొందియుండును. అతఁడునిన్ను క్షమించునన్నయాశ కవకాశము లేశమునులేదు. కాఁబట్టి నీవీశ్వరప్రార్థనములో గడియలు గడుపుచు, దేహవియోగమునకు సంసిద్ధుఁడ వయి యుండుము.'' అని యుపదేశించెను. అతని మాటలవలన మదనదాసుఁడు తెలివితెచ్చుకొని పశ్చాత్తప్తుఁ డయి ''ఓప్రియసోదరీ! నాయపరాధమును క్షమింపుము. నేను ప్రాణముల మీఁద నత్యాశనుబెట్టుకొని యున్నాఁడనుగాన, ఆయాశను దెగఁ గోయుటకయి నేను పనిచేసికోవలెను.''అని తాను చేసినయపచారమునకు సిగ్గును వ్యసనమును పొందినవాఁ డయి తనమొగము చెల్లెలికిఁ జూపఁజాలక లోపలికి లేచిపోయెను.

అప్పుడు రాజు దయామతితో నొంటిగా నున్నందున, ''నిన్ను సౌందర్యవతినిగాఁ జేసినయీశ్వరుఁడు నిన్ను మహాగుణవతినిగాఁగూడ జేసి యున్నాఁడు'' అని పలికి యామె నీతివర్తనమును మనోధైర్యమును గొంత శ్లాఘించెను. ''అయ్యో! పాపము! పరమదయాళుఁ డయినరాజు ధర్మకవచుఁ డేమోమంచివాఁడని భ్రాంతిపడి మోసపోయినాఁడుగదా! ఆయన యెన్నఁటికైన మరలవచ్చి తనరాజ్యమును

వహించి నాకు దర్శనమిచ్చి మాటాడుట తటస్థించినపక్షమున, నే నీరాజప్రతినిధియొక్క గుట్టంతయు బయలఁ బెట్టెదను.'' అని దయామతి పలికెను. తాను బయలఁబెట్టెద నని బెదరించుచున్న గుట్టు నిప్పుడే బయలఁబెట్టుచున్నా నని దయామతి యెంతమాత్రము నెఱుఁగదు. "నీవు చెప్పిన దంతయునాదరణీయము కాదుగాన యిప్పు డున్నస్థితిని బట్టి చూడఁగా ధర్మకవచుఁడు నీవు తనమీఁద మోపిననేరమును తప్పించుకోవచ్చును. కాఁబట్టి నీకు నే నొక్కహితబోధ చేసెదను ; నీవు దాని నాదరించి వినవలెను. నీ విప్పు డొక్కపుణ్యకార్యమును జేసి నిష్కారణముగా బాధితురాలయి యున్ననిరపరాధిని యగు నొకసుందరికి మహోపకారమును నీసహోదరునికి కూ)రశిక్షావిమోచనమును నీవిశుద్ధచరిత్రమున కణుమాత్రమును కళంకమును కలుగకుండఁ జేయవచ్చును. ఈసంగతి విన్నపక్షమున రాజుపరమానందభరితుఁ డగును.''అని రాజు త్తరము చెప్పెను. పాపకార్య మొక్కటి కాకపోయినపక్షమున, ఎటువంటిసాహసకృత్యమును జేయు మన్నను జేయుటకు తాను సంసిద్ధురాలనై యున్నానని దయామతి మాఱు పలికెను. సుకృతము సదా ధీరత్వము కలదిగానే యుండును గాని యెప్పుడును భీరుత్వమును గలిగి యుండదని పలికి, కొంతకాలము క్రిందట సముద్రములో నోడ మునిఁగినప్పుడు మృతుఁడైనమహావీరుఁ డయినవీరవర్మయొక్క చెల్లెలు పద్మావతిపేరు నీ వెప్పుడైన విన్నావా యని రా జడిగెను. "విన్నాను. ఆమె మిక్కిలి దొడ్డయిల్లాలనియెల్ల వారును జెప్పుకొందురు'' అని దయామతి చెప్పెను. "ఆసాధ్వీమణి ధర్మకవచునిభార్య. ఆమె కన్నగారు మహౌదార్యముతో నిచ్చిన యమూల్య మయినయరణ మంతయు నతఁడు పోయినపడవతోనే మునిఁగిపోయినది. పాపము! ఆమె కందువలన నెంతవిపత్తు వచ్చినదో

విన్నావా ? అపతివ్రతాతిలకము ప్రాణతుల్యుఁ డయినయన్నగారిని పోఁగొట్టుకొనుటయేకాక యాధననాశమువలనఁ బయి కెంతో మంచి వాఁడుగాఁ గనఁబడుచుండెడు తనభర్తయొక్కయనుగ్రహమునుగూడ బోఁగొట్టుకొన్నది. నిర్మలచరిత్ర యైనయామెయం దేదో తాను దుష్ప్రవర్తనమును గనిపెట్టినట్టు నటించుచుచు సోదరమరణదుఃఖము చేత విలపించుచున్నయామెను విడిచిపెట్టి, ధర్మకవచుఁడు ధనము పోయిన దన్నవిచారముచేత భార్య నొల్లక మఱింత దుఃఖముపాలు చేసెను. ఇటువంటియన్యాయప్రవర్తనమువలన మఱియొకసుందరి కయినపక్షమున తనమనస్సులోఁ గలయనురాగరస మింకిపోవలసినదే కాని యీసాధ్వీమతల్లికిమాత్రము ప్రవాహమధ్యమున నేదైనవడ్డు పడినపక్షమున నది మఱింత యురువడితో పొరలి పారునట్లుగా మన సులోనివలపువెల్లువ తొంటికంటెను నధికోద్రేకముతో తన్ను నిరో ధించుకుంత్రుఁ డయినభర్తమీఁదికి పరుగువాఱుచున్నది.'' అని చెప్పి దయామతి ధర్మకవచునియొద్దకుఁ బోయి పయి కాతఁడు కోరినపని కంగీకరించినట్టు నటించి నాఁటియర్ధరాత్రమున వచ్చెద నని చెప్పి నట్టును తన్మూలమున మదనదాసునియొక్కప్రాణము రక్షించి తరు వాత పద్మావతికి దయామతివేషము వేసి చీఁకటిలోధర్మకవచునిగలిసి కొనుటకయి సంకేతస్థలమునకు దయామతికి మాఱుగా పద్మావతిని బంపునట్టును తానాలోచించిన యుపాయమును దెలిపి యాకపట సన్యాసి "ఓకుమారీ! పుణ్యశీలురాల వయిననీ వీపని చేయుట కెంత మాత్రమును సంశయింపవలసినపని లేదు. ధర్మకవచుఁ డామెభర్త భార్యాభర్తల నిద్దఱి నొకటిగాఁ గూర్చుటవలనఁ బుణ్యమేకాని పాపము రాదు'' అని బోధించెను. దయామతి యీయుపాయమున కెంతయు సంతోషించి రాజుపదేశించినప్రకారముగా చేయుట కయి

యప్పుడే వెడలిపోఁగా, రాజును పద్మావతి కీసంగతిని దెలుపుట కయి యామెయొద్దకు పోయెను. ఇంతకు పూర్వమే యతఁడు సన్యాసివేష ముతో భాగ్యహీనురా లయినయాయిల్లాలియొద్దకుఁ బోయి పర మార్థోపదేశము చేసి దుఃఖోపశమనము చేయుటకయి రాకపోకలు చేయుచు, అట్టిసమయములయం దామెనోటినుండియే యీసంగతి నంతను దెలిసికొనెను; అతఁడు పరిశుద్ధుఁడయినపుణ్యపురుషుఁడని యామెమనస్సులో దృఢముగా నమ్మియుండుటచేత నతఁడు తానేర్ప ఱచిన యుపాయమునుగూర్చి చెప్పఁగానే యతఁ డాజ్ఞాపించినట్లు చేయుట కయి వెంటనే యొప్పుకొనెను.

రా జేర్పఱిచినప్రకారముగా ధర్మకవచునితో మాటాడి దయా మతి పద్మావతియింటికి వచ్చునప్పటి కామెనిమిత్తము రా జక్కడనే వేచియుండి "నీవు మంచిసమయమునకు వచ్చినావు. ఆమహానుభావుని వద్ద విశేషము లేమి" అని యడిగెను. దయామతి తాను కార్యసాఫ ల్యము చేసికొని వచ్చినక్రమము సర్వమును నివేదించి, ధర్మకవచుని గృహముతోఁ జేరి చుట్టును మంచియిటుకగోడ గలయుద్యానవన ములో పడమటివైపున నొకద్రాక్షతోఁట గల దనియు, ఆతోఁట లోనికిఁ బోవుట కొకగుమ్మ మున్న దనియు చెప్పి యతఁడు తనచేతి కిచ్చిన రెండుతాళముచెవులను రాజునకును పద్మావతికినిజూపి యందు పెద్దచెవితో తాళముతీసి ద్రాక్షతోఁటలోనికిఁ బోవచ్చు ననియు చిన్నచెవితోతాళముతీసి తోఁటలోనిదొడ్డిత్రోవనుండి గృహారామము నకుఁ బోవచ్చుననియు, నిశీథసమయమునం దతని నక్కడఁ గలసి కొనునట్లు తానుసంకేతముచేసి తనసోదరునికి ప్రాణదానము చేయున ట్లతనిచేత వాగ్దానముఁ బడసివచ్చితిననియు ఎవ్వరైన వెనుక వచ్చు చున్నారేమో యని యడుగడుగున తిరిగితిరిగి చూచుచు తనకంత

స్వర మెవరికైనఁ దెలియునేమో యన్న భయముచేత గుండెలు తలతటఁగొట్టుకొనఁ హీనస్వరముతో గుసగుసలాడుచు నతఁడు రెండు సారులు తనకు దారిచూపఁగఁ దాను పరిశీలనతో స్థలమునంతనుఁ జూచివచ్చితిననియు, అక్కడ నడచినకథ యాద్యంతము పూసగ్రుచ్చి నట్లు క్రమముగా వినిపించెను. "మీయుభయులకును జరగిన సంకేతము పద్మావతి తెలిసికొని యాచరింపవలసినవి మఱియే వయిన నున్నవా? అని రాజడిగెను. "మఱేవియు లేవు. ఇంతే ఈమె చీఁకటి పడినతరువాత వెళ్ళవలెను. అక్కడ నేనల్పకాలముమాత్రమే యతనితో నుండెద నని చెప్పి, నావెంట నొకసేవకుఁడు తోడువచ్చు ననియు నాసేవకుఁడు నాయన్నగారిపనిమీఁదనే నేనక్కడకుఁ బోవు చున్న ట్లనుకొను ననియు నతనికి బోధపడునట్లు చేసినాను." అని దయామతి చెప్పెను. ఆమె నిర్వహించుకొనివచ్చిన కార్యరీతియొక్క నిపుణతకు రాజామెను మెచ్చుకొనెను. అంతట దయామతి పద్మావతివంకఁ దిరిగి "ఓసోదరీ! నీవాతనియొద్ద సెలవుగైకొని మరలివచ్చు నప్పుడు నీవుచేయవలసినపని కొంచెము మున్నది. నీవప్పుడు సూక్ష్మస్వరముతో "నాసోదరునిమాట మఱవకుండవలెను అని మాత్రము చెప్పిరావలెను." అని చెప్పెను.

ఆరాత్రి పద్మావతిని సంకేతస్థలమునకు దయామతి వెంటఁబెట్టుకొనిపోయి తా నీయుపాయముచేత తనమానమును కాపాడుకొనుటయే కాక యన్నగారిప్రాణములనుగూడఁ గాపాడఁగలిగితి ననుకొని యపరిమితసంతోషము నొందెను. అయినను రాజుమాత్రము మదనదాసునిప్రాణరక్షణవిషయ మయి తృప్తినొందక యానడిరేయి తాను కారాగృహమునకుఁ బోయెను; అర్ధరాత్రిమప్పు డతఁ డక్కడకుఁ బోవుటయే క్షేమకరమయ్యెను; అతఁ డారాత్రి చెఱసాలకుఁ

బోయియుండని పక్షమున ఆరేయియే మదనదాసుని శిరశ్ఛేదము చేసియుందురు. రాజు కారాగృహమునకుఁ బోయిన కొంతసేపటికి క్రూరకర్ముఁడైన రాజప్రతినిధియొద్దనుండి యారాత్రియే మదనదాసుని శిరస్సునుఖండించి సూర్యోదయము కాకమునుపే తనకు తెచ్చి చూపవలసినదని యుత్తరువు వచ్చెను. కాని రాజు కారాగృహాధికారితో మాటాడి మదనదాసుని తలదీయుట నిలుపునట్లుచేసి నాఁటి ప్రాతఃకాలమున చెఱసాలలో మృతినొందిన యొక కారాబద్ధునియొక్క శిరస్సును గొనిపోయి చూపి ధర్మకవచుని వంచించునట్లు వాని నొడఁబఱిచెను. కారాగృహాధికారి యెంతమాత్రము ననుమానపడక రాజును నిజమయిన సన్యాసియనియే విశ్వసించినను, వాఁడు మదనదాసుని శిరశ్ఛేదము నాపుట కొకపట్టున నొప్పుకొననప్పుడు రాజావలికిఁబోయి మరలవచ్చి రాజుచేవ్రాలుతోను ముద్రతోను నున్న యొకయుత్తరమునుదెచ్చి వానికిఁ జూపెను. ఆయుత్తరము రాజు స్వహస్తముతో లిఖించినదగుటయు మదనదాసుని ప్రాణరక్షణము చేయుట రాజాభిమత మగుటయు నావ్రాతవలనఁ గనిపెట్టి, రాజు తన కాప్తుఁడుగా నున్నయీసన్యాసిచేత రహస్యముగా నీయాజ్ఞను పంపియుండునని నిశ్చయించుకొని, రాజాజ్ఞను మన్నించి మదనదాసుని ప్రాణత్రాణము చేయుట కొప్పుకొని, మఱునాఁటియుదయమున వాఁడామృతునియొక్క తలను సఱికి ధర్మకవచునియొద్దకుఁ గొనిపోయి చూపెను.

అంతట రాజు కొన్ని హేతువులచేత యాత్ర మాని తాను మరల రాజ్యభారము వహింపవలసి వచ్చినదని తనపేరుతోనే ధర్మకవచుని కొకయుత్తరము వ్రాసి, దానిలో నాతఁడు ప్రాతఃకాలముననే తన్ను పురబహిర్ద్వారమువద్దనే కలిసికొని యక్కడనే యధి

కారము నెప్పగించవలసినదని యాజ్ఞాపించెను. ఆయుత్తరములోనే తనప్రజలెవ్వరైనను దనకు జరిగినయన్యాయములనుగూర్చి మొఱ్ఱ పెట్టుకొనఁ దలఁచినపక్షమున పురములోఁ దాను ప్రథమప్రవేశము చేయునప్పుడే వీధిలోఁ దన్ను సందర్శించి విన్నపము చేసికొనవచ్చు నని పురవీథులలోనెల్లఁ జాటింపవలసిన దని యుత్తరువు చేసెను.

తనసోదరుని గలిసికొనుట కయి దయామతి యక్కడకువచ్చు నని యెఱిఁగి రాజు సన్యాసివేషముతోనే తెల్లవాఱుజామున చెఱ సాలకుఁ బోయి యామెరాకకయి ప్రతీక్షించుచు, ఆమెవచ్చి తన్నడిగి నప్పుడు కొన్ని రహస్య కారణములను బట్టిమదనదాసునిశిరస్సు ఖండింపఁ బడినట్లు చెప్పుటయే యుచిత మని తలఁచుకొని యట్లు చేయుటకు నిశ్చయించుకొనియుండెను. ఇంతట దయామతి యచ్చటికివచ్చి తన యన్నగారిని విడుదలచేయుటకయి ధర్మకవచుఁడు పంపినప్రాణప్రదాన పత్రిక వచ్చిచేరినదా యని విచారింపఁగా అతఁడు "నీయన్నగారిని ధర్మకవచుఁ డీలోకమునుండి పంపివేసినాఁడు. మొండెము నెడఁబాసిన మదనదాసుని శిరస్సు రాజప్రతినిధియొద్దకుఁ బంపఁబడినది." అని చెప్పెను. పిడుగువంటి యావార్త చెవినిబడఁగానే శోకసంతప్తురాలయి యాకాంత దేహముమఱచి "ఓదిక్కుమాలిన మదనదాసా! ఓదయా మతీ! నీవెంత నిర్భాగ్యురాలనైతివే! ఓక్రూరచిత్తుఁడా! ధర్మకవచా! నీవెంత పాపాత్ముఁడవురా! ఓలోకమా! న్యాయమెక్కడనున్నది?" అని బహువిధముల ప్రలపింప మొదలుపెట్టెను. ఆమాయసన్యాసి యామె నూఱడించి ధైర్యము చెప్పి, ఆమె కొంతదుఃఖశాంతి పొంది స్వస్థచిత్తయైన పిమ్మట రాజునాఁటియుదయముననే రాజధానికి రాఁబో వుచున్నాఁడని చెప్పి ఆమె ధర్మకవచుఁడు చేసినయన్యాయమునుగూర్చి రాజుతో మొఱ్ఱపెట్టుకోవలసిన క్రమమంతయు నామె కుపదేశించి

విచారణలో మొట్టమొదట నిమిత్తము లామెకు వ్యతిరిక్తముగా నున్నట్లు కొంతవఱకు కనంబడినను భయపడవలదని దిటవు చెప్పెను. రాజిట్లు దయామతికిఁ జేయవలసినబోధను జేసి యామెను విడిచిపోయి తిన్నగా పరిభావనిగృహమునకు నడిచి యామె నేప్రకారముగా వర్తింపవలయునో యావివరమంతయు నామెకు సవిస్తరముగా బోధ పఱిచెను.

అంతటరువాత రాజు సన్యాసివేషముతో నున్నప్పటియొక్క కాషాయ వస్త్రములను విడిచి రాజయోగ్యములైనయమూల్యవస్త్రములను ధరించి యుచితరాజచిహ్నములు బదాల్చి, తనరాకమునభినందిం చుటకయి వేచియున్న వేలకొలదిప్రజలు అవ్యాజభక్తి కలవారయి మంగళవాద్యములతో నెదురుకొని జయజయధ్వనులు బోరు కలుగ నానందించుచుండఁగా, మిథిలానగరములోఁ బ్రవేశించెను. అప్పుడు ధర్మకవచుండు పురబహిర్ద్వారమువద్దకు రాజున కెదురుగాఁ బోయి, రాజాధికారసూచకములయినముద్రలు మొదలయినవానిని రాజునకు విధ్యుక్తముగా నొప్పగించెను. ఆసమయమునందు గుంపులోనుండి తన విన్నపమాలింపవలసినదని మొఱ్ఱబెట్టుచు ముందుకువచ్చి దయామతి యిట్లు మనవిచేసికొన నారంభించెను — 'న్యాయకర్తవయినయో మహా ప్రభూ! ఒకకన్య నింటినుండి లేవఁదీసినందునకయి మరణదండనము నొందిన మదనదాసనువాని తోఁబుట్టువును నేను. నాసోదరుని క్షమించి ప్రాణదానము చేయవలసినదని నేను దీనురాలనయి ప్రభువయిన ధర్మ కవచునిపాదములమీఁదఁ బడినాను. నేనాతని నెంతదీనముగా ప్రార్థిం చితినో, మొదట నాప్రార్థన నాతఁడెట్లు నిరాకరించెనో, మరల నేనెట్లు వేడికొంటినో, దీర్ఘమయిన యాకథయంతయు నే నేలినవారికి నివేదింప వలసిన యావశ్యకము లేదు. అవాచ్యమయిన దానిపర్యవసానము

మాత్రము దుస్సహదుఃఖముతోను లజ్జతోను దేవరవారికి మనవిచేసి కొనెదను. నేనెన్నివిధములఁ బ్రార్థించినను ధర్మకవచుఁడు దయార్ద్ర చిత్తుఁడుగాక, తన్నుకాముఁడు ప్రేరేపించి పాపకార్యమునకు నేనంగీ కరించి తనకు నామానమును సమర్పించినంగాని నాప్రార్థన చెల్లించి నాసోదరుని విడుదలచేయనని చెప్పెను. కొంతిసేపు నాలోనేనుత్రొక్కట పడి పాపభీతిచేత పరితపించి, సోదర స్నేహము నామనోదార్ఢ్యము నడఁగఁద్రొక్కఁగా, తుట్టతుదకు నేనుమానభంగమునకుసహించిధర్మ కవచుని ప్రార్థన నంగీకరించి లోఁబడినాను. అయినను ధర్మకవచుఁడు తానుచేసిన వాగ్దానముతప్పి, మఱునాఁటివేఁకువను నాసోదరునితల తెఱుగుట కుత్తరవుపంపెను.'' అనిచెప్పుచుండఁగా రాజుతానామాటలు నమ్మినట్టుగానటించెను. అప్పుడు ధర్మకవచుఁడు రాజశాసనమునుబట్టి మరణదండనము నొందిన సోదరునిమరణదుఃఖావేశమువలన మతిచెడిన దయి యాచిన్నది ట్లు వదరుచున్నదని మనవిచేసెను. ఇంతలోతనగొడ వను మొఱ పెట్టుకొనుటకయి పద్మావతికూడ రాజసన్నిధికి వచ్చెను. పద్మావతి యీప్రకారముగ రాజునుసమీపించి ''ఓమహాప్రభూ!సత్య మున కెప్పుడును జయముకలుగవలెను. ఇప్పుడు దయామతి చెప్పిన మాటలు సత్యములుకావు. నేనీతఁడు విధ్యుక్తముగా వివాహమాడిన భార్యను. తాను ధర్మకవచునితోఁ గడపితి నన్నరాత్రి నేనీతనితో తోఁటలోఁగడిపినాను. ఇదిసత్యము. ఇందువిషయమంయి నేనేమిబాస చేయుమన్ననుచేసెదను.'' అనిపలికెను. అంతట తినమాటల యొక్క సత్యమునుగూర్చిబ్రహ్మానందస్వామినడిగి తెలిసికొనవలసినదని దయామతి చెప్పెను. రాజు తాను సన్యాసివేషముతో ప్రచ్ఛన్నుఁడయి యున్న ప్పుడు బ్రహ్మానందస్వామియనుపేరుపెట్టుకొని పట్టణములో గూఢముగా తిరుగుచుండెను. దయామతియుపద్మావతియు నిద్దఱునుగూడ రాజుతము

కుపదేశించినరీతిగా నొక్కయక్షరము నైనను మీఱక నడుచుకొనిరి. మిథిలానగరమునందు సర్వజనసమక్షమున దయామతియొక్క నిర్దోషిత్వమును స్థాపింపఁదలఁచి రాజీయంత్రము పన్నెను. అటువంటి హేతువుచేతనె వారిద్దఱును తమకథలో కొంత వ్యత్యాసము కలుగునట్లుగా చెప్పిరన్నమాటను లేశమయినను చింతింపక ధర్మకవచుఁడు పరస్పరవిరుద్ధముగా నున్నవారిసాక్ష్యమువలననే దయామతి తన మీఁదమోపిన నేరమునుండి తప్పించుకొని తాను పరిశుద్ధుఁడయినట్లు లోకమునకుఁ గనఁబఱుపఁదలఁచుకొని, అకారణముగా నిరపరాధిని పరులుదూషించునప్పుడుకలిగెడుకోపమునభినయించి క్రూరదృష్టితోఁ జూచుచు "మహారాజా! ఇంతవఱకు నేను నవ్వుచు నూరకున్నాను. ఇప్పుడు నాకు శాంతత పోవుచున్నది. ప్రస్తుతస్థితినిబట్టి చూడఁగా నెవఁడో ఘనుఁడొకఁడు తానుచాటున నాయకుఁడుగానుండి ప్రేరేపించి యీయిద్దఱు చెడుపడుచులచేతను పయికీయాట యాడించుచున్నట్లు కనఁబడుచున్నది. ఈదుర్నయమును బయికిఁ దీయుటకు దేవరవారు నాకనుజ్ఞయియ్యవలెను." అని వేఁడెను. "నీమాటలు నాకామోదకరముగానున్నవి. నీ వన్నట్లీదుర్నయమును తప్పక పయికిఁదీసి దోషిని నీ మనస్సునకు తృప్తికలుగునట్లు కఠినముగా శిక్షింపవలసినదే. మంత్రియుగంధరా! కొంచెము శ్రమచేసి యీధర్మకవచునితోఁ గూడనుండి యిందలిదోషమును వెలికిఁదీయుటకయి నీవితనికి తోడుపడుము; వీరిని ప్రేరేపించినసన్యాసిని నే నిప్పుడే పిలిపించెదను; అతఁడు వచ్చిన తరువాత విచారణచేసి సత్యమును కనుఁగొని చేసిననేరమునకు తగినట్లుగా నీమనసు వచ్చినశిక్ష చేయుము. నేను కొంచెముసేపు మిమ్ము విడిచి యావలికిఁ బోయిరావలెను. ఓధర్మకవచా! ఈయప్రతిష్ఠ వ్యవహారములో దోషనిర్ధారణము చేయువఱకును నీవిక్కడనుండి కదలఁ

బోకు" మని చెప్పి, రాజక్కడనుండి వెడలిపోయెను. తనవ్యవహారములలో తన్నేమధ్యవర్తినిగాను ధర్మకర్తగానునిర్ణయించినందునకయి ధర్మకవచుఁడెంతో సంతోషించెను. రాజు తనవేషమునుమార్చి క్రొత్తవేషము వేసికొనుటకొఱకే యావలికిఁ బోవలసినవాఁడయి నందున, వెంటనే కాషాయవస్త్రధారణముచేసి నెత్తినిండ ముసుఁగు వేసికొని సన్యాసివేషముతో మరల వచ్చి యుగంధర ధర్మకవచుల యెదుట నిలువఁబడెను. వృద్ధుఁడయినయాయుగంధరుఁడు తనయుత్తమ స్వభావమునుబట్టి ధర్మకవచునిమీఁద నిష్కారణముగా మిథ్యాదోషారోపణము చేసినారని నమ్మి యాకపటసన్యాసినిజూచి "ఓయతీంద్రా! నీవీస్త్రీలను ధర్మకవచునిమీఁద మిథ్యాపవాదము వేయుఁడని బోధించి పంపినావా?" అని యడిగెను. ఆమాయసన్యాసి తనకంఠముమార్చి మాఱుగొంతుకతో "రాజెక్కడనున్నాఁడు?" నేనుచెప్పెడిది వినవలసిన వాఁడు జనకమహారాజు" అని యుత్తరముచెప్పెను. "ఆరాజిప్పుడు మాలోనేయున్నాఁడు. నీవు చెప్పఁబోవుదానిని మేమే యాతనికి బదులుగా వినియెదము. చెప్పెడిదేమో న్యాయముగా జెప్పు" అని యుగంధరుఁ డడిగెను. ఆయతి యప్పుడు దయామతియొక్క వ్యవహారమును తీర్ప వలసిన భారము నామె యెవ్వరిమీఁద నింద మోపెనో వారి మీఁదనే పెట్టినందునకయి నిర్భయముగా రాజును దూషించి, తాను మిథిలానగరము నందె ప్రచ్ఛన్నుఁడుగా నుండి యనేకదౌర్జన్యములను కన్నులారఁ జూచుచు సహించి యూరకున్నందునకయి రాజు ననేకవిధముల యథేచ్ఛముగా నిందింపఁజొచ్చెను. యుగంధరుఁడాదూషణోక్తులకు సహింపలేక ప్రభుభక్తికొంచెమయినను లేక రాజనిందచేసినందునకయి యామాయయతిమీఁద కోపపడి, రాజద్రోహము చేసిన యపరాధముక్రింద నతనిని దండించుటకయి

చెరసాలకుఁ గొనిపోవునట్లు రాజభటులకాజ్ఞాపించెను. అప్పు డక్కడ నున్నవారందఱు నద్భుతపడునట్లుగా ముసుగుఁ దీసివేసి యాకపటయతి తనముఖము చూపి, ధర్మకవచుఁడు త త్తఱపడి భయభ్రాంతుఁ డయి నిశ్చేష్టుఁడయి నిలువఁబడెఁగా. ప్రత్యక్షముగా జనకమహారాజయ్యెను.

అప్పుడు రాజు మొట్టమొదట దయామయిని పేరుపెట్టి పిలిచి "ఓసాధ్వీమణీ! నీవెనుకటి సన్యాసినో యిప్పుడు రాజు నైనాఁడు. అయినను నేనిప్పుడు రాజచిహ్నములను దాల్చినమాత్రమున నాహృదయమును మార్చుకోలేదు. ఏలయనఁగ నేనిప్పుడును నీసేవకు సంసిద్ధుఁడనయి యున్నాను" అని పలికెను. "ఓమహారాజా! పలినవారియొక్క ఘనత నెఱుఁగక శ్రమపెట్టి దేవరవారిచే పనిచేయించుకొన్న యీసేవకురాలియపరాధమును క్షమించవలెను" అని దయామయి మాఱుపలికెను. అంతట రాజా మెమంచితనమును మఱికొంత శోధింపవలెనని యెంచి మదనదాసుఁడు బ్రతికియున్నవార్తను చెప్పక దాచి "నీయన్నగారి ప్రాణరక్షణము చేయుటకు నీకు నేనేక్షమార్పణము చేయవలసియున్నది" అని చెప్పెను. అప్పుడు ధర్మకవచుఁడు ప్రచ్ఛన్నవేషముతో నుండి రాజే తనదుష్టచేష్టలను కనిపెట్టినాఁడని తెలిసికొని, "ఓమహారాజా! ఈశ్వరునివలె దేవరవారే సాక్షులయియుండి నాయకృత్యములను ప్రత్యక్షముగా చిత్తగించిరని యెఱిఁగినప్పుడుకూడ నాదోషమును నేనొప్పుకోని పక్షమున నాపాపము శతగుణితమగును. కాఁబట్టి దయామయా! నాయవమానమును పొడిగింప వేఱుగ విమర్శపెట్టక నాయొప్పుదల మీఁదనే నన్ను దండింపుఁడు. దేవరవారిని నే నిప్పుడు జేసెడుప్రార్థన యంతయు శీఘ్రముగా మరణదండనమును విధించి యనుగ్రహింప వలయుననుట యొక్కటిదక్క వేఱేదియు లేదు." అని మ్రొక్కెను. "ధర్మకవచా! నీయపరాధములు ప్రత్యక్షదృష్టములు. కాఁబట్టి యింతకుముందు మదన

దాసుఁడు తలఁగొగ్గినవధ్యశిలమీఁదనే నీ శిరస్సును ఖండించుటకు మే మిప్పు డుత్తరువుచేయుచున్నాము. నీవును వెంటనే యాతని గలిసికొను టకయి ప్రయాణము కట్టియుండుము.' అనిపలికి రాజు పద్మావతివంకఁ దిరిగి "ఓపతివ్రతామణీ! నీవిఁక వైధవ్యమునుబొందకతీఱదు. మేమిప్పు డీతని సొత్తంతయు నీపాలు చేయుచున్నాము గాన దానితో నీవు మఱి యొక మంచిభర్తను పునఃపరిణయముకమ్ము." అనిచెప్పెను. "ఓమహా ప్రభూ! యోగ్యతమఁడైనను నాకు వేఱొకభర్తయక్కఱలేదు. ఓకరు ణానిధీ! ఈదీనురాలిని కరుణించి పతిభిక్షపెట్టి రక్షింపుము." అని రాజు పాదములమీఁదబడి సుశీలయైన యాపద్మావతి మదనదాసుని ప్రాణరక్ష ణార్థమయి దయామతి వేడుకొన్నట్లుగానే కృతఘ్నుఁడయిన తనభర్త యొక్క ప్రాణదానము నిమిత్తము వేఁడుకొని దయామతివంక మరలి "ఓదయామతీ! నీమధురవాక్కులను గొంతసేపు నాకెరువిచ్చి నీవు నా పక్షముపూని నాకు మాఱుగా రాజుపాదముల మీఁదవ్రాలి ప్రార్థించి యాతని రాతిమనస్సును కరఁగింపుము. నీయుపకారము నాకిప్పుడుచేసి పుణ్యముకట్టుకొంటివా నేను కృతజ్ఞురాలనయి యావజ్జీవమును నీసేవ చేయుచు నీఋణముతీర్చుకొనెదను." అని ప్రార్థించెను. ఓపద్మావతీ! తెలివిమాలినదానవయియూరక యాచిన్నదానినిపీడించెద వేమి?దయా మతి యిప్పుడునీపక్షమున నిలిచి తన భ్రాతృఘాతకునిప్రాణమునిలుపు మని ప్రార్థించిన పక్షమున చచ్చిపోయిన యన్నగారియొక్క యాత్మ భూతమయివచ్చి యీమెను పట్టుకొని బాధింపదా?" అని రాజనెను. "ఓదయామతీ! ఇఁక జాగుచేయక శీఘ్రముగా రాజుగారి పాదముల మీఁదఁబడుము; చేతులెత్తి మ్రొక్కిప్రార్థింపుము. మౌనమువహించి యూరకున్నావేమి? నామనవి వినుము. లోకములోనుత్తమోత్తముల వద్ద సహితము లోపములుండక పోవు. ఆప్రకారముగానే నాభర్త

యొద్దను కొన్నితప్పులున్నవి. అయినను మొట్టమొదట తప్పిదములు చేసినవారేపిమ్మటపశ్చాత్తప్తులయి మఱింత యోగ్యులగుదురని పెద్దలు చెప్పుదురు. ఓదయామతీ! ఇంకను చెల్లెలిమీఁదనీకుదయపుట్టలేదా?" అని పద్మావతి దీనముగా నడిగెను. "మదనదాసునియొక్క ప్రాణమును గొన్నందునకే నీభర్తయిప్పుడు తనప్రాణము లిచ్చుచున్నాఁడు." అని రాజుపలికెను. ఇట్లు పలుకుచుండఁగానే సుగుణరాసియైన దయామతి ముందుకువచ్చి రాజద్భుతప్రమోదవివశుఁడగునట్లుగా నడుగులమీఁద వ్రాలి, తన సహజదయాదాక్షిణ్యబుద్ధి వ్యక్తమగునట్లుగా "ఓమహాప్రభూ! ఏలినవారనుగ్రహించి నాసోదరుఁడు మృతినొందనట్లుభావించి యీయపరాధియెడఁ గటాక్షింపుఁడు. నాముఖసందర్శనము చేయు వఱకును ధర్మకవచుఁడుపరిశుద్ధహృదయముతోనే స్వకృత్యమునునిర్వహించెనని నేనిప్పుడు దృఢముగా నమ్ముచున్నాను. ఈతనిమృతికినేనే కారణభూత నగుటచేత నాయందనుగ్రహించి యీతనిని రక్షింపుఁడు. తా నెందు నిమిత్తమయి మరణదండనమును బొందెనోయానేరమును నిజముగాఁ జేసినవాఁడగుటచేత నాసోదరుని విషయములో న్యాయవిరుద్ధమేదియు జరగలేదు" అని విన్నవించెను.

తనశత్రువుయొక్క ప్రాణము రక్షింపవలసిన దని వేఁడుచున్న యీయుత్తమాంగనయొక్క యోగ్యతకు ప్రతిఫలము రాజప్పుడు చెఱసాలలో ప్రాణసంశయ స్థితిలోఁబడియున్న మదనదాసుని రప్పించి చచ్చినాడనుకొనుచున్నయీసోదరునిఁ బ్రాణముతోనేయీమెకర్పించి, "ఓదయామతీ!నీచేయినాచేతికిమ్ము. నీనిమిత్తమయియీమదనదాసుని క్షమించినాను. ఇష్టమున్నయెడల నీవు నాయర్ధాంగివి కావచ్చును. అప్పుడు నీసోదరుఁడును నాకాప్తబంధుఁడగును." అనిసెలవిచ్చెను.ఇంత లోపల ధర్మకవచుఁడు తనకుప్రాణభయములేదని ధైర్యము తెచ్చుకొని

కొంత తేటమొగముతో ఆసగల చూపులతో నిలువఁబడఁగా, రాజాతని వంకఁజూచి "ఓధర్మకవచా! నీవిఁక నీభార్యను ప్రేమతో నేలుకొమ్ము" ఆమె యోగ్యతవలననే నీకిప్పుడు ప్రాణరక్షణము కలిగినది కాఁబట్టి యిఁకనైన నీవామె గుణోత్కర్షము నెఱిఁగి యుచితాదరముతోఁ బ్రవర్తింపుము," అని బుద్ధిచెప్పి పద్మావతిని 'ఓసాధ్వీ! నీవు నీభర్తతోఁ గూడి చిరకాలము సౌఖ్యమనుభవింపుము." అనియాశీర్వదించెను. ధర్మకవచుఁడు తనగతవర్తనమునకు సిగ్గుపడి, అల్పకాలమధికారము వచ్చినప్పుడు దయనుమాలి చికటసచి ప్రాణానుపహరించినందునకనుతాపపడి, దయాగుణముతో సమానమైన యుత్తమగుణము మఱేదియు లేదని తెలిసికొని, భార్యను కృతజ్ఞతతో స్వీకరించెను.

అప్పుడు రాజు మనోరంజనిని విధ్యుక్తముగా వివాహము చేసికోవలసినదని మదనదాసుని కాజ్ఞాపించె, దయామతియొక్క యుత్తమగుణములును యోగ్యవర్తనమును తనహృదయము నాకర్షించినందున నామెను పాణిగ్రహణము చేసికొనవలెననియున్న తనయభిమతమును మరలఁ దెలిపెను. ఆమె గురూపదేశమును బొందియుండకను మఠములో యోగినిగాఁ జేరక వివాహమాడుటకు యోగ్యమయిన స్వతంత్రస్థితిలోనే యున్నందున, యతివేషముతో సకలసద్గుణసంపన్నుఁడగు మహారాజు తనకుఁ జేసిన మహోపకారములవలనఁ గలిగిన కృతజ్ఞతాబుద్ధి తన్ను తనపూర్వపుపూనికనుండి మరలింపఁగా యోగిని కావలెనన్న యుద్యమమును మానుకొని రాజు తన కనుగ్రహింపఁదలఁచుకొన్న గౌరవమును సంతోషపూర్వకముగా నంగీకరించి యాతని సహధర్మచారిణియగుటకు కొప్పుకొనెను. దయామతి యిట్లు మిథిలానగరమునకు రాణియయినది మొదలుకొని యామె సద్వర్తనమునుబట్టియు దృష్టాంతమునుబట్టియు మిథిలానగరములోని

కన్యలందఱును యోగ్యవర్తనమును నేర్చుకొని యామె మార్గము నవలంబించి మరల నొక్కరును మనోరంజని మదనదాసునిఁ దీసికొని యిల్లు విడిచినట్లు ప్రియునితో పితృగృహమును విడిచి వెడలక జననీజనకులకును బంధువర్గమునకును సంతోషమును గలిగించుచుండిరి. దయా గుణగణనీయుఁ డయిన యారాజును సకల సద్గుణమణిఖని యగు దయామతి తనకు ప్రాణాధికయై ధర్మపత్నిగా లోకములోని యెల్ల భర్తలలోను ధన్యతముఁడయి చిరకాలము సుఖ మనుభవించుచు రాజ్యము చేసెను.

---

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాద్రౌపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యథార్థ కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

### ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

### తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

### పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

### పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—
కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.
అని వ్రాసిన బడయగలరు.

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930

# కుమారద్వయ విలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీసమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

కీ ర్తి శే షు లై న రా వు బ హ ద్దూ రు

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 [illegible]
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వెనీసు వర్తకచరిత్రము

### వ చ న ప్ర బం ధ ము లు

### ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 [illegible]

# కుమారద్వయవిలాసము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

**1950**

కాపీరైటు

# ఈ కథయందు వచ్చు పాత్రములు

## పురుషులు

సింహావిక్రముఁడు—అయోధ్యాపురవాసి యైన యొక రాజపుత్రుఁడు; కామోద్ధతుని మిత్రుఁడు; చారుమతిభర్త.

కామోద్ధతుఁడు—అయోధ్యాపురనివాసి యైన రాజపుత్రుఁడు; సింహావిక్రముని మిత్రుఁడు; మనోరంజనిభర్త.

సుయోధనుఁడు—చారుమతిని వరింపఁ దలఁచుకొన్న రాజపుత్రుఁడు.

దీనవత్సలుఁడు—చారుమతివెంట నడవికిఁబోయిన సేవకుఁడు.

కామదాసు—పురుషవేషముతో నున్నప్పటి మనోరంజని పేరు.

హస్తినాపురాధీశ్వరుఁడు మొదలయినవారు.

## స్త్రీలు

మనోరంజని—అయోధ్యాపురనివాసి యైన యొకరాజపుత్రి; కామోద్ధతుని ప్రియురాలు.

చారుమతి—హస్తినాపురాధీశ్వరుని కూఁతురు; సింహావిక్రముని ప్రియురాలు.

కలభాషిణి—మనోరంజని చేటిక.

శ్రీ

# కుమారద్వయవిలాసము



అయోధ్యాపురమునందు సింహవిక్రముఁడును, కామోద్ధతుఁడును, అనురాజపుత్రు లిద్దఱు పరమమిత్రులు గలరు. ఆ బాలసఖులయినవారిరువురును గలిసి యేకస్థలముననే చదువుకొనుచు, ఏకస్థలముననే శయనించుచు, కామోద్ధతుఁడు తానుమోహించిన మనోరంజని యింటికిఁ బోయినప్పుడు తప్ప సర్వకాలసర్వావస్థలయందును దా మొక్కచోటనే కాలము గడపుచుండిరి. కామోద్ధతుఁడు తఱుచుగా మనోరంజనిగృహమునకుఁ బోయి యామెతో సంభాషించు చుండెడి యామెయొక్కవిషయములోనుదక్క మఱి యేవిషయములోను నభిప్రాయభేద మెఱుఁగనివారయి యామిత్రు లత్యంతైకమత్యమును పరస్పరానురాగమును గలవారుగా నుండిరి. వారిలో సింహవిక్రముఁడు కాముకుఁడు కానందున, అతఁడు తనమిత్రుఁడు సదా మనోరంజనివిషయ మయియే మాటలాడుచుండుటచేత విసుగుచెంది తనమిత్రుని నెగతాళిచేసి,మనోహరములైనపలుకులతో కామోద్రేకమును పరిహసించుచు, పనికిమాలినకామచింత లెప్పుడును తన మనస్సునందుఁ జొరఁజాలవని తనమనస్థైర్యమును బ్రశంసించి కామోద్ధతునిదానివంటి చింతాభయసహితమైన కాముకజీవనముకంటెఁ దనదానివంటి భయవిచారరహితమైనవైరాగ్యజీవన మధికసుఖప్రద మని శ్లాఘించు చుండెను.

ఒకనాఁటిప్రాతఃకాలమున సింహవిక్రముఁడు కామోద్ధతుని యొద్దకుఁ బోయి తాను హస్తినాపురమునకుఁ బోఁదలఁచుకొన్నందున

మిత్రుని కొంతకాల మెడఁబాయవలసివచ్చిన దని విచారముతో జెప్పెను. కామోద్ధతుఁడు తనమిత్రుని విడిచియుండుట కోర్వలేనివాఁడయి యాతఁడు తన్ను విడిచిపోకుండుటకయి యనేకయుక్తులు చెప్పెను. కాని యతఁడు "ఓమిత్రుఁడా! నాప్రయాణమును మాన్పుటకయి ప్రయత్నింపకుము. అలసునివలె నే నింటికడ నుండి నాబాల్యమంతయు సోమరితనములో వ్యర్థపుచ్చఁజాలను. నీమనోరంజనిమీఁద ప్రేమానుబంధము నిన్నిల్లు కదలకుండ బంధించి యుండనిపక్షమున, నామాట విని నీవుకూడ నాతోడ రమ్ము. మనమిద్దరమును గలిసి పోయి యచ్చటివింతలెల్లను జూచి శీఘ్రకాలములోనే యింటికి మరల రావచ్చును. అయినను నీ వతికాముఁడ వయి యున్నందున నీమనోరథభంగము కలిగింప నాకిష్టము లేదు. కామదేవుఁడు నీ కభిమతార్థసిద్ధిని కలిగించునుగాక!" అని పలికెను.

అన్యోన్యసౌహార్దసూచకము లయినప్రియవచనము లనేకములు పలికి వారొండొరుల నెడఁబాయునప్పుడు కామోద్ధతుఁడు సింహవిక్రముని జూచి "ఓమిత్రరత్నమా! నీయాత్రలయందు నీ వేదైన విచిత్రవస్తువును జూచినప్పుడు నన్నుమఱచిపోక తలఁచుకొని నన్నును నీసంతోషమునకు యోగ్యునిఁగా సంభావింపుము." అని వేఁడుకొని వీడుకొనెను. సింహవిక్రముఁ డాదినముననే ప్రయాణమయి హస్తినాపురమునకుఁ బోవ బయలుదేఱెను. తనమిత్రుఁడు తన్ను విడిచి పోయినతరువాత కామోద్ధతుఁ డొంటిగాఁ గూరుచుండి తనప్రియురాలయినమనోరంజని కొకయుత్తరము వ్రాసి, దాని నామెచేటికయైన కలభాషిణిచేతి కిచ్చి పంపెను. కామోద్ధతునికి మనోరంజనిమీఁద నెంతయనురాగము గలదో మనస్సులో నాతనిమీఁదను మనోరంజని కంతయనురాగ మున్నను, ఆమె యుదారహృదయము గల దయి

నందున ననాయాసముగా మనసిచ్చినయెడలఁ దనకన్యాత్వగౌరవము చులకనగునని యెంచి యాతనిప్రార్థనలయం దాదరము లేనిదానివలె నటించి స్వయంవరప్రయత్నమునం దాతని కమిత మయినశ్రమ కలుగఁజేయఁజొచ్చెను. ఆయుత్తరమును దెచ్చి కలభాషిణిచేతి కిచ్చి నప్పుడామె యాలేఖను గైకొననొల్లక, కామోద్ధతునివద్దనుండి రహస్యలేఖలను దెచ్చుచున్నందునకయి తనచేటికను కసరి తత్క్షణమే గది విడిచిపొమ్మని మందలించెను. కాని యాయుత్తరమును జూడ వలెనని మనస్సులో నెంతోయభిలాషయున్నందున, నాలుగడుగులు నడవఁగానే కలభాషిణిని మరలలోపలికిఁబిలిచి మనోరంజని "ఇప్పు డెంత ప్రొద్దెక్కినది" అని యడిగెను. కాలమును దెలిసికొనుటకంటె నుత్తరమును జూడవలెనని తనయజమానురాలి కెక్కువ యభిలాష యున్నదని కనిపెట్టి యాచేటిక యడిగినప్రశ్న కుత్తరము చెప్పక యుత్తరమును జేతికియ్యఁబోయెను. భయభక్తులులేక ముందుగానే తాను యజమానురాలిమనస్సులోని యభిప్రాయమునుగనిపెట్టినట్టుగా నడుగనిదే యుత్తరమును జేతిలోఁబెట్ట సాహసించినందునకయి చేటిక మీఁద కోపపడి, ఉత్తరమును చించి నట్టింట పాఱవైచి, దానిని తన యెదుటనుండి లేచిపొమ్మని యదలించెను. కలభాషిణి వెడలిపోవుచు నట్టింటఁ జెదరియున్న ముక్కలనేఱి తీయఁబోగా, అది చించినముక్క లను దీసికొనిపోవుట యిష్టములేనిదయి హృదయములో లేనియాగ్ర హమును మోమునఁదెచ్చుకొని మండిపడి మనోరంజని "నీమొగము చూచిన నాయొడలు మండుచున్నది. నీవాముక్కలనేఱుచు మఱింత కోపమును దెప్పింపక యాముక్కల నక్కడనే విడిచితొలఁగిపొమ్ము" అని దానిని సాగనంపి, నానాముఖములఁ జెదరియున్న ముక్కలనేఱి యేకముక్కచేసి వానిలోనిమాటలను జదువఁదొడఁగెను. "కామశర

బాధితుండగు కామోద్ధతుండు'' లోనుగాంగల కొన్నిమాటలను చూచి జాలిపడి, ''అయ్యో! కామశరములవలన నంత బాధ కలుగుచున్నదా! నాయనాదరమువలనం గలిగిన గాయములుమాని బాధపోవునట్లుగా మిమ్ము నాయొమ్మున నొత్తి హృదయగతానురాగరసౌషధమును బూసెదను'' అని యాముక్కలను వక్షముల జేర్చుకొనెను. అటు తరువాత నాప్రియలేఖ నంతయు జదువుకొననెంచి వరుసగా నాచీలికల నొండొంటితోం గలయం జేర్చి యతికించి యభిమతమును బడయం జాలక యట్టివంటి మధురములయిన ప్రియవచనములుగల యుత్తరమును గన్నులపండువుగాం జదువుకొనక యవివేకిని యయి చించివేసినందునకయి పరితాపపడి, తన ప్రియునియెడ నావలె నెన్నండు నుపయోగింపని వలపుదెలిపెడు మధురప్రియవాక్యములతోం గామోద్ధతుని పేర నొక యుత్తరము వ్రాసెను.

తన యుత్తరమున కనుకూలమయిన ప్రత్యుత్తరము వచ్చినందునకయి యానందించుచు, కామోద్ధతుండాయుత్తరమును జదువు నప్పుడు మధ్యమధ్య ''ఏమి నాజన్మసాఫల్యము! ఏమి యీతేనె మాటలు! ఏమి యీభాగ్యాక్షరములు!'' అని తనలోందాననుకొనుచుండెను. ఈయానందపారవశ్యములోనుండంగా నాతనితండ్రి యచ్చటికివచ్చి ''ఏమి చదువుచున్నావు? ఆయుత్తర మెవరువ్రాసినది?'' అని యడిగెను. ''ఇది హస్తినాపురమునందలి నామిత్రుండయినసింహవిక్రముండు వ్రాసినలేఖ'' యని యతండు ప్రత్యుత్తరము చెప్పెను. ''ఏదీ? అతండేమివిశేషములువ్రాసెనో చూచెదను. ఆయుత్తరము నాచేతికిమ్ము.'' అని తండ్రి మరలనడిగెను. ఆమాటలకు దేహము కంపింపంగా నతండు గద్గదస్వరముతో ''ఇందులో విశేషములేవియు లేవు; హస్తినాపురాధీశ్వరుండు తన్నెంతో ప్రేమతో నాదరించుచున్నాండో తెలిపె తనలో

# కుమారద్వయవిలాసము



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
**1950**

కాపీరైటు

# ఈ కథయందు వచ్చు పాత్రములు

## పురుషులు

సింహవిక్రముఁడు—అయోధ్యాపురవాసి యైన యొక రాజపుత్రుఁడు; కామోద్ధతుని మిత్రుఁడు; చారుమతిభర్త.

కామోద్ధతుఁడు—అయోధ్యాపురనివాసి యైన రాజపుత్రుఁడు; సింహవిక్రముని మిత్రుఁడు; మనోరంజనిభర్త.

సుయోధనుఁడు—చారుమతిని వరింపఁ దలఁచుకొన్న రాజపుత్రుఁడు.

దీనవత్సలుఁడు—చారుమతివెంట నడవికిఁబోయిన సేవకుఁడు.

కామదాసు—పురుషవేషముతో నున్నప్పటి మనోరంజని పేరు.

హస్తినాపురాధీశ్వరుఁడు మొదలయినవారు.

## స్త్రీలు

మనోరంజని—అయోధ్యాపురనివాసి యైన యొకరాజపుత్రి; కామోద్ధతుని ప్రియురాలు.

చారుమతి—హస్తినాపురాధీశ్వరుని కూఁతురు; సింహవిక్రముని ప్రియురాలు.

కలభాషిణి—మనోరంజని చేటిక.

శ్రీ

# కుమారద్వయవిలాసము



అయోధ్యాపురమునందు సింహవిక్రముఁడును, కామోద్ధతుఁడును, అనురాజపుత్రు లిద్దఱు పరమమిత్రులు గలరు. ఆ బాలసఖులయినవారిరువురును గలిసి యేకకాలమునందే చదువుకొనుచు, ఏకస్థలముననే శయనించుచు, కామోద్ధతుఁడు తానుమోహించిన మనోరంజని యింటికిఁ బోయినప్పుడు తప్ప సర్వకాలసర్వావస్థలయందును దా మొక్కచోటనే కాలము గడపుచుండిరి. కామోద్ధతుఁడు తఱుచుగా మనోరంజనిగృహమునకుఁ బోయి యామెతో సంభాషించు చుండెడి యాయొక్కవిషయములోనుదక్క మఱి యేవిషయములోను నభిప్రాయభేద మెఱుఁగనివారయి యామిత్రు లత్యంతైకమత్యమును పరస్పరానురాగమును గలవారుగా నుండిరి. వారిలో సింహవిక్రముఁడు కాముకుఁడు కానందున, అతఁడు తనమిత్రుఁడు సదా మనోరంజనివిషయ మయినయే మాటలాడుచుండుటచేత విసుగుచెంది తనమిత్రుని నెగతాళిచేసి,మనోహరములైనపలుకులతోఁ కామోద్రేకమును పరిహసించుచు, పనికిమాలినకామచింత లెప్పుడును తన మనస్సునందుఁ జొరఁజాలవని తనమనస్స్థైర్యమును బ్రశంసించి కామోద్ధతునిదానివంటి చింతాభయసహితమైన కాముకజీవనముకంటెఁ దనదానివంటి భయవిచారరహితమైనవైరాగ్యజీవన మధికసుఖప్రద మని శ్లాఘించు చుండెను.

ఒకనాఁటిప్రాతఃకాలమున సింహవిక్రముఁడు కామోద్ధతుని యొద్దకుఁ బోయి తాను హస్తినాపురమునకుఁ బోఁదలఁచుకొన్నందున

మిత్రుని గొంతకాల మెడఁబాయవలసివచ్చిన దని విచారముతో జెప్పెను. కామోద్ధతుఁడు తనమిత్రుని విడిచియుండుట కోర్వలేనివాడయి యాతఁడు తన్ను విడిచిపోకుండుటకయి యనేకయుక్తులు చెప్పెను. కాని యతఁడు "ఓమిత్రుఁడా! నాప్రయాణమును మాన్పుటకయి ప్రయత్నింపకుము. అలసునివలె నే నింటికడ నుండి నాబాల్యమంతయు సోమరితనములో వ్యర్థపుచ్చఁజాలను. నీమనోరంజనిమీఁద ప్రేమానుబంధము నిన్నిల్లు కదలకుండ బంధించి యుండనిపక్షమున, నామాట విని నీవుకూడ నాతోడ రమ్ము. మనమిద్దరమును గలిసిపోయి యచ్చటివింతలెల్లను జూచి శీఘ్రకాలములోనే యింటికి మరల రావచ్చును. అయినను నీ వతికాముఁడ వయి యున్నందున నీమనోరథభంగము కలిగింప నాకిష్టము లేదు. కామదేవుఁడు నీ కభిమతార్థసిద్ధిని కలిగించునుగాక!" అని పలికెను.

అన్యోన్యసౌహార్దసూచకము లయినప్రియవచనము లనేకములుఁ బలికి వారొండొరుల నెడఁబాయునప్పుడు కామోద్ధతుఁడు సింహవిక్రముని జూచి "ఓమిత్రరత్నమా! నీయాత్రలయందు నీ వేదైన విచిత్రవస్తువును జూచినప్పుడు నన్నుమఱచిపోక తలఁచుకొని నన్నును నీసంతోషభాగయోగ్యునిఁగా సంభావింపుము." అని వేఁడుకొని వీడుకొనెను. సింహవిక్రముఁ డాదినముననే ప్రయాణమయి హస్తినాపురమునకుఁ బోవ బయలుదేఱెను. తనమిత్రుఁడు తన్ను విడిచిపోయినతరువాత కామోద్ధతుఁ డొంటిగాఁ గూరుచుండి తనప్రియురాలయినమనోరంజని కొకయుత్తరము వ్రాసి, దాని నామెచేటికయైన కలభాషిణిచేతి కిచ్చి పంపెను. కామోద్ధతునికి మనోరంజనిమీఁద నెంతయనురాగము గలదో మనస్సులో నాతనిమీఁదను మనోరంజని కంతయనురాగ మున్నను, ఆమె యుదారహృదయము గల దయి

సుందున ననాయాసముగా మనసిచ్చినయెడలఁ దనకన్యాత్వగౌరవము చులకనగునని యెంచి యాతనిప్రార్థనలయం దాదరము లేనిదానివలె నటించి స్వయంవరప్రయత్నమునం దాతని కమిత మయినశ్రమ కలుగఁజేయఁజొచ్చెను. అయుత్తరమును దెచ్చి కలభాషిణిచేతి కిచ్చి నప్పుడామె యాలేఖను గైకొనినట్లుక, కామోద్ధతునివద్దనుండి రహస్యలేఖలను దెచ్చుచున్నందునకయి తనచేటికను కసరి తత్క్షణమే గది విడిచిపొమ్మని మందలించెను. కాని యాయుత్తరమును జూడ వలెనని మనస్సులో నెంతోయభిలాషయున్నందున, నాలుగడుగులు నడవఁగానే కలభాషిణిని మరలలోపలికిఁబిలిచి మనోరంజని "ఇప్పు డెంత ప్రొద్దెక్కినది" అని యడిగెను. కాలమును దెలిసికొనుటకంటె నుత్తరమును జూడవలెనని తనయజమానురాలి కెక్కువ యభిలాష యున్నదని కనిపెట్టి యాచేటిక యడిగినప్రశ్న కుత్తరము చెప్పక యుత్తరమును జేతికియ్యఁబోయెను. భయభక్తులులేక ముందుగానే తాను యజమానురాలిమనస్సులోని యభిప్రాయమునుగని పెట్టినట్టుగా నడుగనిదే యుత్తరమును జేతిలోఁబెట్ట సాహసించినందునకయి చేటిక మీఁద కోపపడి, ఉత్తరమును చించి నట్టింట పాఱవైచి, దానిని తన యెదుటనుండి లేచిపొమ్మని యదలించెను. కలభాషిణి వెడలిపోవుచు నట్టింటఁ జెదరియున్న ముక్కలనేఱి తీయఁబోఁగా, అది చించినముక్క లను దీసికొనిపోవుట యిష్టములేనిదయి హృదయములో లేనియాగ్ర హమును మోమునఁదెచ్చుకొని మండిపడి మనోరంజని "నీమొగము చూచిన నాయొడలు మండుచున్నది. నీవాముక్కలనేఱుచు మఱింత కోపమును దెప్పింపక యాముక్కల నక్కడనే విడిచితొలఁగిపొమ్ము" అని దానిని సాగనంపి, నానాముఖములఁ జెదరియున్న ముక్కలనేఱి యేకముక్కచేసి వానిలోనిమాటలను జదువఁదొడఁగెను. "కామశర

బాధనొందుచుంటి కామోద్ధతుఁడు" యనుగాఁగల కొన్నిమాటలను జూచి జాలిపడి, "అయ్యో! కామశరములవలన నంతబాధ కలుగుచున్నదా! నాయనాదరమువలనఁ గలిగిన గాయములుమాని బాధపోవునట్లుగా మిమ్ము నాయురమ్మున నొత్తి హృదయగతానురాగరసౌషధమును బూసెదను" అని యాముక్కలను వక్షముల జేర్చుకొనెను. అటు తరువాత నాప్రియలేఖ నంతను జదువుకొననెంచి వరుసగా నాచీలికల నొండొంటితోఁ గలయఁజేర్చి యతికించి యభిప్రాయమును బడయఁ జాలక యమృతవంటి మధురములైన ప్రియవచనములుగల యుత్తరమును గన్నులపండువుగాఁ జదువుకొనక యవివేకిని యయి చించివేసినందునకయి పరితాపపడి, తన ప్రియునియెడ నావలె నెన్నఁడు నుపయోగింపని వలపుదెలిపెడు మధురప్రియవాక్యములతోఁ గామోద్ధతుని పేర నొక యుత్తరము వ్రాసెను.

తన యుత్తరమున కనుకూలమైన ప్రత్యుత్తరము వచ్చినందునకయి యానందించుచు, కామోద్ధతుఁడా యుత్తరమును జదువునప్పుడు మధ్యమధ్య "ఏమి నాజన్మసాఫల్యము! ఏమి యీతేనెమాటలు! ఏమి యీభాగ్యాక్షరములు!" అని తనలోఁదాననుకొనుచుండెను. ఈయానందపారవశ్యములోనుండఁగా నాతనితండ్రి యచ్చటికివచ్చి "ఏమి చదువుచున్నావు? ఆయుత్తర మెవరువ్రాసినది?" అని యడిగెను. "ఇది హస్తినాపురమునందలి నామిత్రుఁ డైనసింహవిక్రముఁడు వ్రాసినలేఖ" యని యతఁ డుత్తరముచెప్పెను. "ఏదీ? ఆతఁ డేమివిశేషములువ్రాసెనో చూచెదను. ఉత్తరము నాచేతికిమ్ము." అని తండ్రి మరలనడిగెను. ఆమాటలకు దేహము కంపింపఁగా నతఁడు గద్గదస్వరముతో "ఇందులో విశేషములేవియు లేవు; హస్తినాపురాధీశ్వరుఁడు తన్నెంత ప్రేమతో నాదరించుచున్నాఁడో తెలిపి తనతోఁ

గలిసి సౌఖ్య మనుభవించుటకు నే నక్కడ నున్నచో దనకుఁ మఱింత సంతోషకరముగా నుండునని వ్రాసినాఁడు'' అని బొంకెను. ఆవిషయములో నీకోరిక యేమి?'' అని తండ్రి కుమారుని యడిగెను. "నాకు వేఱేకోరిక లేదు. తమయిష్ట మేదో యదే నాకోరిక. నేను దమ చిత్తానుసారముగా నడచుకోవలసినవాఁడను'' అని కొడుకు కుత్తరము చెప్పెను.

ఈవిషయమయి యింతకుముందే కామోద్ధతుని తండ్రికిని ఒక మిత్రునికిని కొంతసంభాషణజరగెను. ఆమిత్రుఁ డాసంభాషణలో ధనికులయినవా రనేకులు తమపుత్రులను దేశాంతరమునకుఁ బంపి లోకానుభవజ్ఞులఁగాను నాగరికులఁగాను జేయుచుండగా నతఁడు మాత్ర మెదిగినకుమారుని నింటనుంచి యట్టిలాభ మేల కలుగఁజేయ లేదో యని యాశ్చర్యపడి "కొందఱు ఆయుధవిద్యాభ్యాసముచేసి యుద్ధనైపుణ్యము గలవారయి వత్తురని తమపుత్రులను పరదేశమునకుఁ బంపుదురు; కొందఱు క్రొత్తభూములను గనిపెట్టుటకయి తమ పుత్రులను సముద్రయాత్రలకుఁ బంపుదురు; కొందఱు శాస్త్రాభ్యాసము చేసివచ్చుటకయి తమపుత్రులను దూరదేశములకుఁ బంపుదురు. మీవానిమిత్రుఁడు సింహవిక్రముఁడు హస్తినాపురమునకుఁ బోయియుండుట మీరు వినలేదా? మీకుమారుఁడు పయిని జెప్పిన పనులలో దేనికయిన నర్హుఁడగును. యుక్తసమయములో దేశాటన లాభము కలుగఁజేయక మీరిప్పు డుపేక్షచేసినపక్షమున మీయశ్రద్ధకయి మీకుమారుఁడు ముందు పశ్చాత్తాపపడవలసివచ్చును'' అని చెప్పెను. తనమిత్రుఁడు చెప్పినవాక్యములు కామోద్ధతునితండ్రికి సహేతుకములుగాఁ దోఁచినందున తనకుమారుఁడు మిత్రుఁడయిన సింహవిక్రముఁడుతనతోఁగలిసిసుఖమనుభవించుటకయి హస్తినాపుర

మునకు రమ్మని వ్రాసినాఁడని చెప్పినతోడనే యతనిని తక్షణమే హస్తినాపురమునకుఁ బంపవలెనని నిశ్చయించుకొనెను. కాఁబట్టి తన కుమారునిచేఁ జేయింపనుద్దేశించిన కార్యములకు హేతువులను జెప్పక యాజ్ఞాపింప నలవాటుపడిన యావృద్ధుఁడు "ఇప్పుడు నిమిత్తేని యదృష్టమును నాయభిమతమును నొక్కటిదాయైనది." అని చెప్పియామాటలకు కుమారుని ముఖము వెలవెలపాఱుట కనిపెట్టి "నీ విప్పుడు తెల్లపోయిచూడకు. హస్తినాపురాధీశ్వరుని నగరమందు నిన్నుఁ గొంత కాల ముంచుటకు నిశ్చయించుకొన్నాను. నామాట జరిగితీఱవలెను. నానిశ్చయమున కెప్పుడును తిరుగులేదు. నీవేమియు నడ్డంకులు చెప్పక రేపటిదినముననే ప్రయాణమునకు సంసిద్ధుఁడవయి యుండుము." అని యాజ్ఞాపించెను.

తనమాటయే కాని యితరులమాటను తనతండ్రి సాగనిచ్చువాఁడు కాఁడని యెఱిఁగినవాఁడయినందున కామోద్ధతుఁ డాతనియాజ్ఞ కెదురు చెప్పుటవలనఁ గార్యములేదని తలఁచుకొని, మనోరంజని వ్రాసిన యుత్తరము విషయమయి తండ్రితో నసత్యమాడుటవలన నీయనర్థ మంతయుఁ బొసఁగి యామెనువిడిచి పెట్టిపోవలసినగతి పట్టినదిగదా యని తన్ను తానే నిందించుకొనసాగెను. తన మనోవల్లభుఁడు తన్నువిడిచి పోయి మరలఁ జిరకాలమునకుఁగాని రాఁడని తెలిసికొని మనోరంజని మఱింత యాతురురాలు కాఁ జొచ్చెను. అందుచేత నాకాముకీ కాముకులొక్కచోట రహస్యముగాఁ గూడియన్యోన్యవియోగము సంభవించిన దుస్స్థితి ఖేదపడి, తమకిప్పుడుగల పరస్పరానురాగము నెప్పుడును విడువకుండునట్లు పెక్కుబాసలు చేసికొని, ఒకరినొకరు మఱువకుండుటకయి తమ దేహములలోఁ బ్రాణములున్నంతవఱకు కెడఁబాయకుండునట్లు శపథములుచేసి యొండొరులయుంగరములను మార్చుకొని

చింతాక్రాంతహృదయములతో నెడఁబాయవలసినవారయిరి. అప్పుడు కామోద్ధతుఁడు తన ప్రియురాలిసెలవు గైకొని వెడలి తనమిత్రుఁడు నివసించియున్న హస్తినాపురమునకుఁ బ్రయాణ మయ్యెను. కామోద్ధతుఁడు తనతండ్రిమాట కుస్తరముగా హస్తినాపురాధీశ్వరునిచేత సింహవిక్రముఁ డెంతో ప్రేమతో నాదరింపఁబడుచున్నాఁడని చెప్పిన మాటలు గాంకేయయినను, నిజముగానే సింహవిక్రముఁడు హస్తినాపురాధీశ్వరునివద్ద మిక్కిలి చనవరియై యాతనిప్రేమాదరముల కాస్పదుఁడై యుండెను. అంతేకాక కామోద్ధతుఁడు స్వప్నావస్థయందును నూహింపఁజాలని మఱియొకవింతకూడ దటస్థించినది. సింహవిక్రముఁడు తా నావఱకు భూషించుకొనుచు వచ్చిన స్వాతంత్ర్యమును నీతంత్ర్యమును విడిచిపెట్టి యిప్పుడు తానును గామోద్ధతునివలెఁ గాముకుఁడయ్యెను. అతనియం దీయద్భుత మయినమార్పును గలిగించినజాణ హస్తినాపురాధీశ్వరునికూఁతు రయినచారుమతి. చారుమతికిఁ గూడ సింహవిక్రమునియం దవ్యాజానురాగము కలిగెను. అయినను వారు తమ పరస్పరానురాగమునుమాత్రము రాజునకుఁ దెలియనీక దాఁచిరి. రాజు ప్రతిదినమును సింహవిక్రముని దనయింటికిఁ బిలిచి యాతనియం దెంతో దయగలవాఁ డయినను, తనకొమార్తెను సుయోధుఁ డనురాజకుమారుని కిచ్చి వివాహముచేయ నుద్దేశించుకొని యుండెను. ఆచిన్నవానియందు సింహవిక్రమునియం దున్నసుగుణరసికత్వాదులు లేకపోవుటచే చారుమతి సుయోధనునియందుఁ దరస్కారభావము కలదిగా నుండెను.

ఒకనాఁడు కాముకులయినయీప్రతిపక్షు లిద్దఱును చారుమతియొద్ద కేకకాలమునం దేపోయి సరససల్లాపము లాడుచుండఁగా, సుయోధనుఁ డన్నదానికెల్ల నన్యార్థము తీసి పరిహసించుచు సింహవిక్రముఁ

డామెకు వినోదము కలిగించు చుండెను. ఆసమయమునందే రాజుకుండ నక్కడకుఁబోయి సింహవిక్రమునితో నతనిమిత్రుఁడైన కామోద్ధతుఁడు తదాస్థానమునకు శీఘ్రముగానే రాఁబోవుచున్నాఁడన్న శుభవార్తను జెప్పెను. "ఓమహారాజా! నాకిప్పు డేమైనలోప మున్నయెడల, నామిత్రుని నెడఁబాసి యుండుట యొక్కటియే లోపము అని పలికి "నేను గౌరవలేనివాఁడ నయి నాకాలమును సద్వినియోగమునకుఁ దెచ్చుకోలేనివాఁడ నగుదును, నామిత్రుఁడు లోపము లేకుండ దాను సాహసికుఁడయి తనకాలమును జక్కఁగా నుపయోగించుకొని రూపములోను మనస్సులోను రసికపురుషుని కుండవలసిన సమస్త లక్షణములలోను పూర్ణుఁడయినాఁడు." అని యాతనిని శ్లాఘించెను. "అతనియోగ్యతకుఁ దగినట్లు మన మాతని నాదరింతము. ఓచారుమతీ! ఓసుయోధనా! మీరిద్దఱితోను నేనీమాటలు చెప్పుచున్నాను. ఈవిషయ మయి సింహవిక్రమునితోఁ జెప్పవలసినయావశ్యకము లేదు." అని రాజు పలికెను. ఈమాటలు వారనుకొనుచుండఁగానే కామోద్ధతుఁ డక్కడకు వచ్చెను. అప్పుడు సింహవిక్రముఁడు తనమిత్రునిని చారుమతికిఁజూపి "ఓసుందరీమణీ! ఈనామిత్రుని నీసేవకు నాసహాపరిచారకునిగా నంగీకరించి గౌరవింపుము" అని చెప్పి యాతని కామె దర్శనము చేయించెను.

ఆమెయొద్ద సెలవు గైకొని యింటికిఁ బోయి మిత్రు లిద్దఱు నొంటిగా నున్నప్పుడు సింహవిక్రముఁడు "ఓమిత్రుఁడా! నీవిప్పుడెక్కడనుండి వచ్చినావు? ఇంటికడ నందఱును సుఖు లయి యున్నారా ? నీప్రియురా లెట్లున్నది ? మీయిరువురవివాహప్రయత్న మెంతవఱకు సఫలము కావచ్చినది?" అని యడిగెను. "వెనుక నా కామకథను నేను విప్పినప్పుడెల్లను నీకు తల కంటగించుచు వచ్చెను. శృంగారసంభాష

ణము నీకు రుచింపదని నే నెఱుఁగుదును" అని కామోద్ధతుఁ డుత్తరము చెప్పెను. "ఓమిత్రుఁడా! అది నావెనుకటివార్త. ఇప్పుడు నా యవస్థయంతయు మాఱిపోయినది. కాముని దూషించినపాపమునకు పరిహారము కలుగునట్లుగా నా కిప్పుడు ప్రాయశ్చిత్తము జరిగినది. నే నప్పుడు ముందు తెలియక కాముని దిరస్కరించినపగ సాధించుటకయి కామదేవుఁడు న న్నిప్పుడు తనశరములకు గుఱిచేసి నాకన్నులనుండి నిద్రనుతఱిమివేసినాఁడు. ఓమిత్రుఁడా! కామదేవునంతటిబలవంతుఁడు లోకములో నెవ్వఁడును లేఁడు. అతఁడు నన్నుఁ దనబాణములచే నొప్పించి తనకుఁ బరమవిధేయునిగాఁ జేసికొన్నందున, అతనినిగ్రహమువలనఁ గలుగుఖేదముతో సమానమైనఖేదమును నాతనియనుగ్రహమువలనఁ గలుగుమోదముతో సమానమైనమోదమును మఱి లే వని యొప్పుకొనుచున్నాను. శృంగారప్రసంగము తప్ప మఱియొక ప్రసంగ మిప్పుడు నాకు రుచింపదు. ఇప్పుడు నాకు కామగోష్ఠి కలిగినచో భోజనముమీఁదగాని నిద్రమీఁదఁగాని యేయితరసుఖముల మీఁదఁగాని యపేక్ష యుండదు" అని సింహావిక్రముఁడు తెలియఁ బలికెను.

తనమిత్రునియందు కాముఁ డటువంటిమార్పును గలుగఁజేసిన సంగతి విన్నప్పుడు కామోద్ధతుని కెంతో సంతోషము కలిగెను. కాని యిఁకముందుమాత్రము కామోద్ధతుని సింహావిక్రమునిమిత్రుఁ డని పిలువఁ గూడదు. ఈవఱకు సింహావిక్రమునిహృదయమునందు బ్రవేశించి యాశ్చర్యకరమయినమార్పును గలుగఁజేసినయద్భుతశక్తుఁడైన కాముఁడే యిప్పుడు కామోద్ధతునిహృదయమునందును బ్రవేశించి యొకవింతమార్పును గలిగింప నారంభించెను. నేటివఱకును నిర్వ్యాజమైత్రికిని సుస్థిరానురాగమునకును నునికిపట్టయి యుండినకామోద్ధ

తుఁడు చారుమతి కంటఁబడిననిమిషమునుండియుఁ గామదేవునిసమ్మో హనవిద్యామహిమచేత మాఱిపోయి యిప్పు డాకస్మికముగా కపట మిత్రుఁడును కృతిమానురాగుఁడు నయ్యెను. చారుమతియొక్క ముఖ దర్శన మాత్రముననే యాతనిమనస్సులోని మనోరంజనిమీఁది దృఢానురాగ మంతయు స్వప్నములోని పదార్థమువలె నదృశ్య మయ్యెను; సింహవిక్రమునియెడఁగలచిరకాలస్నేహముసహితమాతనిని దనమిత్రుఁనివంచించి తత్ప్రాణవిత్తము నపహరింపవలె నన్నప్రయత్న మునుండి మరలింపఁగలిగినది కాదు. స్వభావముచేత మంచివైన హృదయములు క్రొత్తగా దుర్వృత్తియందుఁ బ్రవేశింపఁబూనినప్పుడు సాధారణముగా పరితాపపడునట్లుగానే మొట్టమొదటఁ గామోద్ధతుని హృదయమునకుఁ బ్రాణపదమయియుండిన మనోరంజనిని విడనాడు టకును దనమిత్రునకుఁ బ్రతిపక్షుఁ డగుటకును గొంతిసంశయము గలి గెనుగాని తుట్టతుదకుఁ దొంటిసద్వృత్తియంతయు నడుగంటి యను తాపలేశ మయినను లేక యాతనిమనస్సు కామపరాధీన మయ్యెను.

సింహవిక్రముఁడు తనకును చారుమతికినిగల పరస్పరానురా గాతిశయమును దామాసంగతి రాజునకునుఁ దెలియనీయక దాచినవిధ మును సర్వమును మిత్రునితోఁ జెప్పి, తమవివాహమునకు రా జనుమ తించు నన్నయాశవదలుకొని యింద్రప్రస్థపురమునకుఁ బోవుటకై యారాత్రితనతోఁగూడ రాజాంతఃపురమును విడిచి వచ్చునట్లుగా చారుమతి నొడఁబఱిచితి ననియు చీఁకటిపడినతరువాత నెవ్వరికిని దెలియకుండ నంతఃపురసౌధముయొక్క గవాక్షమునుండి దారపు నిచ్చెనయొక్క తోడ్పాటుచేత చారుమతిని వెలుపలికి దింపఁ దలఁచితి ననియుఁ దనగుట్టంతయుఁ దెలిపి త్రాళ్ళతోఁ గట్టిననిచ్చెన నాతనికిఁ జూపెను. ప్రాణమిత్రుఁడని నమ్మి యేమియు దాఁచక తనరహస్య

మంతయుఁ జెప్పివేసినతరువాతఁ దాను వెంటనే పోయి యీరహస్యమును రాజునకు వెల్లడిచేయవలెనని కామోద్ధతుఁడు తనమనస్సులో నిశ్చయించుకొనెను. కాఁబట్టి యామిత్రద్రోహి రాజవద్దకుఁబోయి యెన్నో మాయనటనలు నటించుచుఁ దాను మిత్రధర్మమునుబట్టి తనకుఁ దెలిసినరహస్యమును గోప్యముగా నుంచుటకు బద్ధుఁడయి యున్నను రాజునెడలఁ దనకుఁగల ప్రేమాతిశయమును బట్టియు రాజు తనయెడఁ జూపిన యాదరవిశేషమును బట్టియు మిత్రరహస్యము నైన నివేదించుట యుత్కృష్టధర్మముగా భావించుచున్నాఁడ నని కొన్ని యిచ్చకపుమాటలాడి తరువాత త్రాళ్ళనిచ్చెన మూలమునఁ జారుమతి నంతఃపురమునుండి కొనిపోఁదలఁచుట లోనుగా మిత్రుఁడు తనతోఁ జెప్పినదంతయు రాజునకు విన్నవించి, యానిచ్చెనను చుట్టచుట్టి సింహవిక్రముఁడు తన బట్టలలోఁ బెట్టి తెచ్చునని యాతని గుట్టంతయు బయటఁబెట్టెను.

అకార్యకరణమును దాఁచుటకంటె మిత్రునిగుట్టు బయలఁ బెట్టుటయే యుత్తమధర్మ మని భావించియే యతఁ డట్లుచేసియున్న ట్టెంచి రాజు కామోద్ధతుని ధర్మపరాయణత్వమునకు సంతోషించి యాతనిని శ్లాఘించి, ఈరహస్య మెవ్వరివలనఁబయలుకుబ్బినదో సింహవిక్రమునకుఁ జెప్పక తానే యేదో మాయోపాయముచేత నాతని చేతనే చెప్పించెదనని వాగ్దానముచేసెను. తనపూనికను నిర్వహించుట కయి రాజు సాయంకాలమున సింహవిక్రముఁడుపోవుమార్గమున వేచి యుండి, అతఁడు బట్టలలో నేదో దాఁచుకొని రాచనగరుకేసి తొందరగా నడుచుచుండఁగాఁ జూచి బట్టలనెత్తుగాఁ గనఁబడునది త్రాటి నిచ్చెనయని నిశ్చయముచేసికొనెను. అతఁడు తలవంచుకొని తిన్నగాఁ బోవుచుండఁగా రాజాతనిఁ బిలిచి 'ఓసింహవిక్రమా! ఎక్కడి కింత

నాయకుని సాధనమునందును దానికి గౌరవము లేనందున దాని సౌందర్యమొక్కటియే యిందు దానియందు కరణము కానిమ్ము' అని చెప్పెను. సింహవిక్రముఁ డాసంభాషణకు నివ్వెఱపడి దాని పర్యవసానమెట్లగునో తెలిసికోలేక "ఈవిషయమున దేవరవారికి నావలనఁ గావలసినపని యేమి?" అని యడిగెను. "నేను వివాహమాడఁదలఁచుకొన్న చిన్నది మిక్కిలి చక్కనిది. ఆచిన్నదానికి నాతో మాటాడుటకే తగనిసిగ్గు. అంతేకాక యిప్పుడు నేను పెద్దవాఁడ నయి యుండుటచేత యౌవనస్త్రీలను లోఁబఱచుకొనువిధమే నాచేతఁ గాకున్నది. ఈవిషయములో నీవు నాకు గురువ వయి కర్తవ్యము నుపదేశింపవలెను." అని రాజు కోరెను. ఆకాలపు యౌవనపురుషులు తమ ప్రియురాండ్రను వశపఱచుకొనఁ గోరినప్పుడు ప్రియవచనములు పలికియు బహుమానములు బంపియు నిరంతరదర్శనములచే నాశ్రయించుట మొదలుగాఁగల కామతంత్రప్రయోగములు చేయుక్రమమును సమర్థకముగాఁ దెలిపి, సింహవిక్రముఁడు తనకుఁ దెలిసిన కాముకజనైకవేద్యము లయినరహస్యములనెల్ల రాజునకుపదేశించెను. ఆమాటలువిని రాజు తాను బంపెడు బహుమానముల నాసుందరి నిరాకరించుచున్నదనియు, ఆమెను తండ్రి బహుజాగరూకతతోఁ గాచుచున్నందున పగటిపూట దూరకాంమెదర్శనము లభించుటయే దుర్ఘటముగానున్నదనియు, పలికెను. 'అట్లయిన పక్షమున రాత్రివేళ దేవరవారామెను సందర్శింపవచ్చును' అని సింహవిక్రముఁడు చెప్పెను. ఇప్పుడు వక్తవ్యాంశమునకు వచ్చుచున్నామని యెంచి రాజు "రాత్రులయందామెయింటివీథితలుపులు వేసియుంచును. ఏమి చేయుదును?" అని నేర్పుతో పలికెను. మందభాగ్యుఁ డయినసింహవిక్రముఁ డప్పుడు "చేయవలసినదేమున్నది? మీరొక త్రాటినిచ్చెనను

సంపాదించి రెండవకంటివా రెఱుఁగకుండ రాత్రివేళ దానితోడ్పాటు చేత శయన గృహముయొక్క గవాక్షమున కెగఁబ్రాకి పడకగదిలో బ్రవేశింపవచ్చును'' అని యాలోచన చెప్పి, 'కావలసినయెడల దారపు నిచ్చెనను దేవరవారికి నేనొకటి సంపాదించి యిచ్చెదను. దానిని మీరిట్టివంటి దుప్పటిలో దాఁచుకొని పోవచ్చును'' అని తా నప్పుడు కప్పుకొన్నదుప్పటమును రాజునకుఁ జూపెను. ఏదో మిషకల్పించి పయిబట్టఁదీసి లోపల దాచుకొన్న నిచ్చెనను జూడ వలెనన్నతలంపుతోనే యీకథనంతయు నడుపుచున్న రా జప్పుడు సమయము దొరకఁగానే 'నీదుప్పటి నాకెరు విమ్ము' అని పలికి యాతని పయిబట్టను లాగెను. ఆతనిపయిబట్ట లాగఁగానే యాదుప్పటిలో నుండి తాటినిచ్చెనమాత్రమే కాక చారుమతి యాతనిపేర వ్రాసిన యుత్తర మొకటికూడ క్రిందఁబడెను. రాజు వెంటనే యాయుత్తరమును బుచ్చుకొని విప్పి చదివెను. ఆయుత్తరములో నాఁటిరాత్రి ముహూర్తముపెట్టి వారు దేశించుకొన్న కామయాత్రానిర్గమనవిధానమంతయు వ్రాయఁబడి యుండెను. అప్పుడు రాజు తానాతనికిఁ జేసిన యుపకారమునకుఁ బ్రతిఫలముగా నతఁడు కృతఘ్నుఁడయి తన కొమార్తెను రహస్యముగా లేవదీసి యెత్తుకొని పోఁదలఁచుకొన్నందునకయి దూషించి, ఆతఁడు తత్క్షణమే తనమందిరమును విడిచి పోవునట్లుత్తరువుచేసెను. కాఁబట్టి సింహవిక్రముఁడు తనహృదయవల్లభయైన చారుమతి నొక్కసారిచూచి సెలవుపుచ్చుకొనుటకైన నోచుకోక యారాత్రియే పురమువిడిచి వెడలవలసినవాఁడయ్యెను.

ఈప్రకారముగా నిక్కడ హస్తినాపురములోఁ గామోద్ధతుఁడు సింహవిక్రముని జెఱుపుటకయి ప్రయత్నించు చుండఁగా, అక్కడ నయోధ్యలో మనోరంజని కామోద్ధతునివిరహమున కోర్వఁజాలక

పరితపించుచుండెను. అందుచేత నామె కామోన్మత్తయయి కృత్యాకృత్య పరిజ్ఞానమును స్వగౌరవమును మఱచి యయోధ్యానగరమును విడిచి తన హృదయవల్లభునిఁ జేరుటకయి హస్తినాపురమునకుఁబోవ నిశ్చయించుకొని, త్రోవలో నేమియు నపాయము రాకుండఁ దానును దనపరిచారిక యైనకలభాషిణియుఁ బురుషవేషములు వేసికొని బయలుదేఱి కామోద్ధతుని మిత్రద్రోహమువలన సింహవిక్రముఁడు దేశమునుండి వెడలఁగొట్టబడిన తరువాత నల్పకాలములోనే హస్తినాపురమును జేరిరి. మనోరంజని మధ్యాహ్నవేళకు హస్తినాపురము చేరి యొకసత్రములోఁ బ్రవేశించి, తనమనస్సంతయు ప్రాణనాయకుఁడైన కామోద్ధతునిమీఁదనే యున్నందున వివిధాంశములనుగూర్చి మాటాడినయెడల నతనుఁ దనప్రియునివార్త గొన్నైనఁ దెలియునేమో యనుభ్రమచేత నసత్రాధికారితోఁ బురమునందలి నానావిషయములను గూర్చి సంభాషింప నారంభించెను. స్వభావముచేత దయార్ద్రహృదయుఁడైన యాసత్రాధికారి బాహ్యవేషమునుజూచి సుందరపురుషుఁడని భ్రమించిన యామెయొక్క మనోరంజకములయినమృదుభాషణములకు సంతోషించి, అతఁడు మహావంశజాతుఁ డనియూహించి ముఖచిహ్నములవలన నాతనిమనస్సు విచారాయత్తమయి యున్నట్టు కనిపెట్టి యారాత్రి యాపట్టణములో జరగఁబోయెడి నొక సంగీతవినోదమున కాతనిని దనవెంట రమ్మని వేఁడుకొనెను. నాఁటిదినము మనోరంజని విచారముతో నున్నందుకు హేతువు తానవివేకినియై చేసిన యీసాహసకార్యమును గుఱించి కామోద్ధతుఁ డేమనుకొనునో యన్నచింతయే కాని వేఱొకటి కాదు. తానెప్పుడును స్వగౌరవమును నిలుపుకొను మానవంతురాలుగా నుండుటచేతఁ దనయందతఁ డధికానురాగము గలవాఁడయి యుండుటనుబట్టి యిప్పుడు చూపిన

తొందరపాటువలనఁ దా నాతనిదృష్టియందు చులుకనగునని భయపడఁ జొచ్చెను. ఆమెముఖ మిప్పుడు విచారగ్రస్తమయి కనఁబడుట కిదియే కారణము. గానవినోదమునకుఁ బోయినయెడలఁ దన ప్రియుఁ డక్కడ, గనఁబడునేమో యనునాశచేత మనోరంజని సత్రాధికారి పిలువఁగానే పాటవినుటకయి యాతనివెంటఁ బోవుట కొప్పుకొనెను.

అయినను సత్రాధికారితో నామె పాటవినుటకయి రాజగృహమునకుఁ బోయినప్పుడు దయాళుఁ డయిన యాసత్రాధికారి యుద్దేశించిన దానికంటె విరుద్ధఫలము కలుగుట సంభవించెను. ఆమె యక్కడకుఁ బోయి చూచునప్పటి కస్థిరుఁ డయిన తన హృదయవల్లభుఁడే యచ్చట చారుమతియొక్క వేడుకకొఱకు శృంగారగీతములను బాడుచుఁ దనవలపును దెలిపెడుమాట లామెనుగూర్చి పలుకుచుండుట కంటఁ బడి యామెకు దుస్సహ మయినమనోవేదనను గలిగించెను. ఆసమయమునందు చారుమతి తలుపు తెఱచి చూచి తన్ను నమ్మిన ప్రియురాలిని పరితాపము పాలుచేసి విడిచిపెట్టినందునకుమిత్రుఁడయిన సింహవిక్రమునియెడల ద్రోహము చేసినందునకు కామోద్ధతుని దూషించి, అతనిగీతసల్లాపములను విననొల్లక తలుపు మూసికొని సంగీతశాల విడిచి లేచిపోయెను. చారుమతి సింహవిక్రమునిమీఁద బద్ధానురాగము గలదయినందున, మిత్రవంచకుఁ డయినకామోద్ధతుని మాట యన్న నామెకు తల కంటగించుచుండెను. అప్పుడు తనకంటఁ బడినదానినిబట్టి మనోరంజని కామోద్ధతునిప్రేమకు నీళ్లు వదలుకొన్నను, అతనిమీఁద దనకుంగల ప్రేమపాశమును మాత్రము తెగఁగోయలేదు. తనప్రియునియొక్క సేవకుఁ డొక్కఁడు క్రొత్తగా నతని కొలువు విడిచినాఁడని తెలిసికొని, మిత్రుఁడయినసత్రాధికారి తోడ్పా

టుచేతఁ గామోద్ధతుని వద్ద భృత్యపదమునందుఁ గుదిరెను. కామో ద్ధతుఁ డానూతనభృత్యుఁడు మనోరంజని యని తెలిసికోలేక, పురుష వేషములో నున్నయామె నే యుత్తరములును సూడిదలు నిచ్చి చారు మతియొద్దకుఁ బంపుచుఁ దుద కయోధ్యానగరమును విడుచునప్పు డామె తన సంస్మరణార్థముగా నిచ్చినయుంగరమును సహితమ యామె చేతనే పంపెను.

ఆయుంగరమును బట్టుకొని మనోరంజని కాముదా సనుపేరుతో చారుమతియొద్దకు వెళ్ళినప్పు డాయువతీరత్న మాతనిసందేశమును నిరాకరించుటచేత మనోరంజని కపరిమితానందము కలిగెను. అప్పుడు మనోరంజని చారుమతితోఁ గామోద్ధతునిగూర్చియుఁ నతఁడు విడిచి పెట్టిన ప్రియురా లయినమనోరంజనినిగూర్చియు ముచ్చటించుటకారం భించెను. సమయముచూచి యామెయాత్మస్తుతియం దిష్టములేనిదయి నను మనోరంజని గుణసంపదను గొంచెము శ్లాఘించి యామెను దా నెఱుఁగుదు ననియు, ఆమెకుఁ గామోద్ధతునిమీఁద నపరిమితాను రాగము కల దనియు, దయమాలిన యాతనియనాదర మామెకు మనోవ్యథను గలిగించుననియుఁ జెప్పి, ఆమెయొతానయినట్లు సూచనగా "మనోరంజని నాయంతపొడుగుండును; ఆమె ముఖమును నామొగము వలెనే యుండును; ఆమె కన్నులతీఱును కురులయొప్పిదమును నావాని వలె నుండును. వేయేల? ఆమెనుజూచినన్నుఁజూచినవారు నేనేయామె నని తలంచవచ్చును" అని దానాపురుష వేషములో సహితము మనో హరముగా నున్నందునఁ జారుమతియొక్క మనస్సున కెక్కునట్లుగాఁ దెలిపెను. మనోవల్లభుఁ డన్యాయముగా విడనాడినందునమనోరంజనిని గూర్చి జాలిపడినదయి చారుమతి యాయుంగర మామె తనచేతి కియ్యఁబోయినప్పుడుపుచ్చుకొనక "ప్రాణముబొందిలో నున్నంతవఱకు

విడువవలదని ప్రియురాలు తనచేతికిఁ బెట్టినప్రాణపదమయిన ముద్దు టుంగరమును నాకుఁబంపుట కామోద్ధతుని కెంతయు నవమానకరము. ఈయుంగరమును మనోరంజని తనకిచ్చిన దని యతఁడే నాతోఁ జెప్పి నాఁడు. కాఁబట్టి యీయుంగరమును నేను నాచేతితో ముట్టుట కయిన నొడఁబడను. పాపము! నీ వాచిన్నదానిని గూర్చి జాలిపడు చుండుటచేత నీమీఁద నాకుదయపుట్టుచున్నది. ఇదిగో వరాలమూట మనోరంజనిపేర దీనిని నీకిచ్చుచున్నాను. ఓబాలుఁడా! దీని నంగీకరిం పుము.'' అని సువర్ణములతో నిండినయొకమూటను గామదాసున కిచ్చెను. ఈమంచిమాటలు తనకు సపత్నిగా భావింపఁబడిన సుందరి నోటినుండి వచ్చుటచేత, నిరాశ చెందుచున్న యామనోరంజని మనస్సు నకుఁ గొంత ధైర్యోత్సాహములు కలిగెను.

ఇక్కడ సింహవిక్రముఁ డెక్కడకుఁ బోవుటకును తోఁచనివాఁ డయి దేశమునుండి వెడలఁగొట్టఁబడి యిటువంటి యవమానముతోఁ దనతండ్రిగృహమునకుఁబోవుటకిష్టములేక, తనప్రాణధనమయిన చారు మతిని విడిచివచ్చిన హస్తినాపురమునకు సమీపమున నున్నయరణ్య ములో సంచరించుచుండఁగా నాతనిని దొంగలు చుట్టుకొని యాతని వద్ద నున్నధన మిమ్మని పట్టుకొనిరి. అప్పుడు సింహవిక్రముఁడు తాను కష్టములపాలయి యూరు విడచి యడవులఁ బడి తిరుగుచున్న భాగ్య హీనుఁడ ననియు, తాను గట్టుకొన్నవస్త్రములు దక్కఁ దనవద్ద నితర ధన మేదియు లేదనియు, వారితోఁ జెప్పెను. ఆదారిదోపుడుకాండ్రతఁ డాపదలో నున్నవాఁడని తెలిసికొని, ఆతని సాహసవర్తనమునకును గంభీరాకారమునకును సంతోషించి, అతఁడు తమలోఁ గలిసినయెడలఁ దమ కాతని నాయకునిగా నేర్పఱుచుకొని యాతనియాజ్ఞకు లోఁబడి యుండెద మనియు, అతఁ డిందు కొప్పుకొననిపక్షమునఁ దా మాతనిని

జంపెదమనియుఁ జెప్పిరి. అప్పుడు సింహవిక్రముఁడు మహావీర క్తుఁడయి తనస్థితి గేమయినను లక్ష్యముచేయనిస్థితిలో నున్నందున, స్త్రీలను బీదవాండ్రను వారు వధింపకుండుపద్ధతిమీఁద వారికి నాయకుఁడుగా నుండుట కొప్పుకొనెను. విధివశముచేత నీప్రకారముగా దొంగలకు నాయకుఁడుగా నున్నకాలములో సింహవిక్రముని చారుమతి కలిసి కొనుట తటస్థించెను. సుయోధనుని వివాహము చేసికోవలసినదని తండ్రి నిర్బంధపఱుపఁజొచ్చినందునఁ దనప్రియుఁ డింద్రప్రస్థపురమును గూర్చి పోయినాఁడనివిని చారుమతి యాసింహవిక్రము నచ్చటఁగలిసి కోవలెనని నిశ్చయముచేసికొనెను. అతఁడు మొట్టమొదట నింద్రప్రస్థమునకుఁబోవ నుద్దేశించుకొన్నను పోక దైవికముగా దొంగలకు నాయకుఁడయి వారి సైన్యములలోఁ దానుచేరక వారు తనకిచ్చిన యధికారమునుబట్టి వారుదోఁచుకొన్న పాంథులవిషయ మయి దయ చూపునట్లు వారిని నియమించుచు నీయరణ్యములోనే యుండెను. అప్పుడు చారుమతి తనతండ్రిగృహమునుండి యెట్లో తప్పించుకొని పాఱిపోయివచ్చి, త్రోవలోనాత్మసంరక్షణార్థముగా నుపయోగపడుట కయి దీనవత్సలుఁడను పేరుగల ముసలిసేవకుని దనకుసహాయునిగా జేసికొని, సింహవిక్రముఁడును దొంగలును నివసించుచున్న యీయరణ్యమార్గమునఁ బ్రయాణమయి పోవుచుండఁగా దొంగలలో నొకఁడు చారుమతిని పట్టుకొనెను. ఆ తస్కరుఁడు దీనవత్సలుని గూడఁ బట్టుకొనియుండనుగాని యతఁడు వానికందక తప్పించుకొనిపాఱిపోయెను.

చారుమతిని పట్టుకొన్నదొంగవాఁ డామె భయముచేత వడ వడ వడఁకుచుండుటచూచి కొంచెము జాలిపడినవాఁడయి తా నామె కేమియు హానిచేయక తన యజమానుఁడున్న గుహావద్దకుఁ దీసికొని పోయెద ననియు, తమనాయకుఁ డుదారహృదయుఁ డయి స్త్రీలయెడ

దయచూపు స్వభావముగలవాఁ డగుటచేత భయపడవలసిన పని లేదనియుఁ జెప్పి యామె నూఱడించెను. దొంగలగుఱువు రక్షించు నని చెప్పినమాటలయందు విశ్వాసము లేనిదయి చారుమతి వానివెంటఁ బోవుచు "ఓసి మహావిక్రమా! నీనిమిత్తమయి నే నీక్రమకంతయు సహించుచున్నాను" అని దూషింప మొదలుపెట్టెను. చారుమతితప్పించు కొని పాఱిపోయినవార్త విని కామోద్ధతుఁడు పురుషవేషముతోఁ దన్ను సేవించుచున్న మనోరంజని తనవెంటరాఁగా బయలుదేఱి చారుమతిని పట్టుకొనుటకయి యప్పుడే యీయరణ్యమునకు వచ్చెను. ఆమె యాతస్కరునిచేతఁ దననాయకుని నివాసమునకుఁ దీసికొనిపోఁబడుచుండఁగా గామోద్ధతుఁడు డగ్గఱవచ్చి చారుమతిని దొంగలయుపద్రవమునుండి విడిపించి, ఆమె జనపుత్రిక దొంగలనుండి తన్ను రక్షించిన యుపకారమునకయి కృతజ్ఞతాసూచకము లయినమాటలాడుటకయి యవకాశము కలుగకమునుపే తన్ను వివాహమాడుమని నిర్బంధించి యామె మనస్సునకు వేదనకలిగింపనారంభించెను. ఈప్రకారముగా నతఁ డామెను బలవంతపెట్టుచున్నప్పుడు మనోరంజని యాతనిసరసనే నిలుచుండి, అతఁ డామెవిషయమయి యింతకు ముందుచేసినమహోపకారమువలన నామెమనసుకరఁగి మెత్తపడునేమో యని సంశయగ్రస్తురాలయి గుండెలుతటతటఁ గొట్టుకొనఁగా నామెప్రత్యుత్తరము నెదురుచూచుచుండెను. వారిట్లుండఁగా దొంగలెవ్వరో యొకస్త్రీని పట్టుకొన్నవార్తవిని యామెను విడిపించి యోదార్చవలెనన్న వేగిరపాటుతో సింహవిక్రముఁ డాకస్మికముగా నక్కడకుఁ బరుగెత్తికొనివచ్చెను ఆతఁడు వచ్చినప్పుడే తన్నేలుకొమ్మని కామోద్ధతుఁడు చారుమతిని దీనముగా వేఁడుకొనుచుండెను. తాను జేయుచున్న ద్రోహము ప్రత్యక్షముగా మిత్రునికంటఁ బడినందున, కామోద్ధతుఁడు లజ్జలో

మునింగిపోయి తలయెత్తుకొనలేక తనయంతరాత్మ తన్ను శోధింప నారంభింపంగాం బశ్చాత్తప్తుండగుచు యప్పుడే తన యుద్యమమును వదలుకొని కన్నులనీరు కాలువలుగట్ట నేడ్చుచు సింహవిక్రముని పాదములమీందం బడి తనయపరాధమును క్షమింపుమని వేండుకొనెను. సింహవిక్రమునిది దయాపూరితమయిననిర్మలహృదయ మగుటచేతం దన కాతండు చేసినయపకారమును మన్నించుటయేకాక యతనిని గౌంగిటియట్ల మరల తనమిత్రునిగా నంగీకరించి, 'ఓమిత్రుండా? ప్రమాదముచేత నీవు నాయెడల జేసినద్రోహమును పూర్ణముగా మఱచి పోవుటయే కాక నీవు పశ్చాత్తప్తుండ వయి దుఃఖించుచుండుటచేత నీదుఃఖోపశమనార్థముగా చారుమతిని నీకు వదలివేయుటకు సహితము నిశ్చయించుకొన్నాండను'' అని మిత్రవాత్సల్యముయొక్క యుద్రేకములో సింహవిక్రముండు పలికెను. ఆమాట చెవినిబడినతోడనే మిత్రవాక్యము నూంతచేసికొని కామోద్ధతుండు చారుమతిని స్వీకరించునన్నభయముచేత నిలువెల్లను జెమర్చి దేహముకంపింపంగా సేవకవేషముతోం బార్శ్వమున నిలువబడి యున్నమనోరంజని మూర్ఛిల్లి మొదలునఱికినకదళీకాండమువలె నేలం గూలెను. అప్పుడక్కడనున్నవారందఱును శైత్యోపచారములు చేసి మనోరంజనిని మూర్ఛ దేర్చుచుండిరి. ఆసమయమున నామూర్ఛ తేరాకయుండిన పక్షమున తన మనోవల్లభుండు తన్ను మనఃపూర్వకముగా నొదులపాలు చేయునని విశ్వసించుట దుర్ఘటమేయయినను చిరకాలము చిలుకను గాపాడి కడపట మార్జాలమువాతి వేయందలంచినట్లు తన్నుం దన హృదయేశ్వరుండు కామోద్ధతునకిచ్చెద నన్నవాక్యమునకు చారుమతి మనస్సులో ఖేదపడి యుండును. మనోరంజని యింతలో మూర్ఛ తేటి "నాయజమానుండు చారుమతి కిమ్మన్నయుంగరము నియ్యమఱచి

పోయినాను" అని తనచేతియుంగరమును జూపెను. అప్పుడు కామోద్ధతుఁడు వెనుక మనోరంజని తనకిచ్చినట్టియుఁ దా నిప్పుడు చారుమతి కంపినట్టియు నుంగరమును సూత్రిమేకాక తాను మనోరంజని కిచ్చి వచ్చినయుంగరమును గూడఁ దనభృత్యునివ్రేలియందుఁ జూచి శోకసంతప్తుఁడయి గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు "ఓ కామదాసా! ఇది నేను మనోరంజని కిచ్చినయుంగరము. ఇది నీకెట్లు వచ్చినది?" అని యడిగెను. "అది నాకు మనోరంజనియే యిచ్చినది. ఈయుంగరము పట్టుకొని మనోరంజనియే యిక్కడకు వచ్చినది" అనియు కామదాసుఁడుత్తరమిచ్చెను. అప్పుడు కామోద్ధతుఁడు చెప్పవాల్పక కామదాసు మొగమువంకఁ గొంతసేపు తేఱిపాఱఁజూచి తనయీసేవకుఁడే మనోరంజని యగుట కనిపెట్టెను. అందుమీఁద నతఁడు తాను జేసిన యకృత్యమునకు సిగ్గును దననిమిత్తమయి యన్నిశ్రమల కోర్చి యింతదూరము మనోరంజని తన్ను వెదకుకొనుచువచ్చినందుకుసంతోషమును బొందినవాఁడయి తన కామెమీఁద నుండిన వెనుకటిప్రేమ యంతయు నిప్పుడు ద్విగుణమయి మనస్సునందు మరలఁ బ్రవేశింపఁగా, చారుమతిని సింహావిక్రమునకు విడిచిపెట్టి తాను మనోరంజనిని గ్రహించుటకు సంతోషపూర్వకముగా నంగీకరించెను. ఈప్రకారముగా సింహావిక్రముఁడును కామోద్ధతుఁడును తమ పునర్మైత్రికి సంతోషించి తమప్రియురాండ్రకుఁ దమమీఁదఁగల నిర్భరానురాగమును మెచ్చి యానందించు చుండఁగా నింతలో నాకస్మికముగా నచ్చటికి చారుమతిని వెదకుకొనుచు రాజును సుబోధనుఁడునువచ్చి వారికి మఱింత యద్భుతమును బుట్టించిరి. ఆయిరువురిలో సుబోధనుఁడు ముందుగా నచ్చటికి వచ్చి "ఈమె నాప్రాణధనము" అని పలుకుచు చారుమతిహస్తమును గ్రహింపఁబోయెను. అప్పుడు సింహావిక్ర

ముందు ముందుకు వచ్చి గంభీరస్వరముతో "ఓయీసుయోధనా ! దూరముగా నుండుము. చారుమతి నీసొమ్మని యింకొకసారి పలికి నీ వీమెమీఁదఁ జెయివేసితివా, నీప్రాణములు నీవి కావు. కాలసర్పము వలె నీప్రాణవాయువులను పానముచేయుటకై తమకపడుచున్న నాచేతిలోనియీఖడ్గమును జూచి మఱియీమెను దాఁకుటకు సాహసించు" మని యదలించెను. సుయోధనుఁడు పిఱికిగుండె కలవాఁడగుటచేత నాతనిశూరవాక్యములకు జడిసి వెనుకకు తొలఁగి "నాకీకాంత యక్కఱలేదు. తనమీఁద వలపులేనికాంత నెవ్వఁడో బుద్ధిహీనుఁడుగాని యాసింపఁడు." అని పలుకుచు దూరముగాఁ బోయి నిలుచుండెను.

అదిచూచి ధైర్యశాలియైనరాజు మహాకోపముతో "నీవింత వఱకును చారుమతివిషయమై యంతకృషిచేసి యిప్పుడు స్వల్ప కారణముపయిని భయపడి విడుచుట సిగ్గులచేటు" అని సుయోధనునితోఁ బలికి, తరువాత సింహవిక్రమునివంకఁదిరిగి "ఓసింహవిక్రమా! నీధైర్యసాహసములకు సంతోషించినాను. నీవు చక్రవర్తిని నైనను వరించుటకుఁ దగినవాఁడవు. నీవే చారుమతిని జేపట్టుట కర్హుఁడవయి నందున నేనిప్పుడు నీకు దీనిని కన్యాదానము చేయుచున్నాను" అని దయారస మొలుకఁ బలికెను. అప్పుడు సింహవిక్రముడు మహావినయముతో రాజుపాదములకు మ్రొక్కి, ప్రీతిపూర్వకముగా నతఁ డిచ్చిన యమూల్యకన్యాదానమును మిక్కిలికృతజ్ఞతతోఁ బ్రతిగ్రహించెను. అటుతరువాత మంచిసమయము చూచి సంతోషరసాక్రాంతస్వాంతుఁడై యున్నభూకాంతునితో సింహవిక్రముఁ డరణ్యమునందుఁ దన సహవాసులుగా నున్నతస్కరులను క్షమించి మరలఁ బురమునందు వసింప ననుజ్ఞ యియ్యవలసిన దని చెప్పి వేడుకొనెను. వారందఱును

ఘోరపాతకములు చేసినవారుగాక సింహవిక్రమునివలెనే రాజాగ్రహమునకుఁ బాత్రులగుటచేతనే పురము వెడలఁగొట్టబడిన వారగుటచేత రాజల్లునిప్రార్థన నంగీకరించి వారిని మన్నించి మరల యథాప్రకారముగాఁ బురమునందు వసించుట కుత్తరువిచ్చెను. కామప్రేరితుఁడయి మిత్రద్రోహమున కొడఁబడిన కామోద్ధతునిపాపమునకుఁ బ్రాయశ్చిత్తముగా నతఁడాడినయసత్యములను కామప్రేరణచేతఁ బ్రియురాలివిషయమయి చేసినయకృత్యమును సర్వమును రాజుముందఱ నేకరువుపెట్టినట్లుగా శిక్షవిధించి, అతఁడాప్రకారముగాఁ జేసి మనస్తాపమును లజ్జయుఁ బొందఁగా నతనికాశిక్ష చాలునని భావించి యందఱును గలిసి పురమునకుఁ బోయిరి. అటుతరువాత హస్తినాపురమునందు సింహవిక్రమునికిని చారుమతికిని మాత్రమే కాక కామోద్ధతునికిని మనోరంజనికిని మహావైభవముతో వివాహమహోత్సవములు జరగెను.

---

శాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ శుభకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరిప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరదత్తపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్వాకృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

### ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవ చరిత్రము

## సాహిత్య గ్రంథములు

### తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

### పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

### పదకొండవ సంపుటము.

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శారదా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1950

# పద్మినీ ప్రభాకరము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-4-0

శ్రీ రావు బహద్దూరు

# కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

## ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

## నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్యపురాధిపత్యము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

## భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

## వ చ న ప్ర బం ధ ము లు

## ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్

# పద్మినీ ప్రభాకరము



గ్రంథకర్త :
కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు :
హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము
1950

కాపీరైటు

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు



## పురుషులు

౧. వసుదేవుఁడు—పాండ్యదేశపురాజు మంత్రులలో నొకఁడు; పద్మిని తండ్రి.

౨. ప్రభాకరుఁడు—పాండ్యదేశ సేనాధిపతి; పద్మిని భర్త.

౩. మిత్రపాలుఁడు—ప్రభాకరుని మిత్రుఁడు.

౪. దుష్టబుద్ధి—పాండ్యదేశపుసేనలో నొకనాయకుఁడు.

౫. శూరవర్మ—పాండ్యదేశపు సేనానాయకులలో నొకఁడు.

## స్త్రీలు

౬. పద్మిని—వసుదేవుని కూఁతురు; ప్రభాకరునిభార్య.

౭. రాధిక—దుష్టబుద్ధిభార్య.



# పద్మినీప్రభాకరము

మధురాపురమునందలి మహాధనసంపన్నుఁ డయినవసుదేవుఁ డనుమంత్రిశిఖామణికి గుణవతియు రూపవతియు నైనయేకపుత్రి పద్మిని యను కన్యామణి కలదు. ఆచిన్నదానియొక్క సుగుణసంపదనుబట్టియు ధనసంపదనుబట్టియు రాజకుమారు లనేకు లాచిన్నదానిని పాణిగ్రహణముచేసికోవలె నని యాశవహించి వేచి యుండిరి. అయినను తన్నాశించియున్నరూపలావణ్య సంపన్నులయిన స్వదేశస్థులగు రాజపుత్రు లెవ్వరును పద్మినికి రుచింప లేదు. శరీరసౌందర్యమునకంటె మన స్సౌందర్యము నధికముగా గౌరవించెడి యాచిన్నది చిన్నప్పటి నుండియు తనతండ్రియింటికి వచ్చుచు బీదదశనుండి స్వశక్తిచేత క్రమక్రమముగా గొప్పస్థితికి వచ్చి యున్నపరదేశస్థుఁ డగునొక నల్లని క్షత్రియవీరునిమీఁద తనమనసు నిలిపెను. ఆతనిపేరు ప్రభాకరుఁడు. అతఁడు తనసద్వర్తనముచేత వసుదేవుని యనుగ్రహమునకు పాత్రుఁ డయి యాతనిదయవలననే తా నిప్పు డున్న యున్నతస్థితికి వచ్చినవాఁ డగుటచేత పలుమా ఱాతనిగృహమునకు వచ్చుచుఁ బోవుచుండెను.

హీనదశనుండి వచ్చిన యట్టివంటిపురుషుని భర్తనుగా వరింప నపేక్షించినందున కయి పద్మినిని మనమంత నిందింపవలసినపని లేదు. ఒక్క నల్లరూపును దూరముగా నుంచినపక్షమున, లోకములోని యుత్తమోత్తమకన్యను చెట్టపట్టుటకుసహిత మర్హత నిచ్చెడుగుణసంపదలో నాప్రభాకరునివద్ద లోప మణుమాత్రమును లేదు. అతఁడు మహాధైర్యశాలియైనవీరభటుఁడు; బౌద్ధులతో జరిగినఘోరయుద్ధములలో నతఁడు పాండ్యదేశపుసేనలోఁ గొలువుండి తనధైర్యశౌర్యము

లను జూపి, నిరుపమానపౌరుషముచేత రాజానుగ్రహమునకుఁ బాత్రుఁడయి సేనాధిపత్యమును బొందుటయే కాక జనులవిశ్వాసగౌరవములకును స్థాన మయ్యెను.

అతఁడు బాల్యమున బహుదేశములు తిరిగినవాఁ డగుటచేత పద్మిని యాతని దేశాటనవృత్తాంతములను వినుట కత్యంతాభిలాష కలదయి యాతని నడుగు చుండును. అతఁడు చిన్నతనములో తాను పడిన కష్టములను, తా నప్పుడప్పుడు చేయుచువచ్చిన యుద్ధములను మెట్టను సముద్రముమీఁదను తాను బొందినయాపదలను, తా నా యాపదలను తప్పించుకొన్న సూక్ష్మమార్గములను, శత్రువులు తన్ను చెఱఁబెట్టి బాధించిన విధమును, తాను తిరిగిన దేశములయందు మేఘమండలము నంటుపర్వతములలోను మహారణ్యములలోను దాను జూచినవింతలను, ఆయాదేశజనులవిచిత్రవర్తనములను, మృదుమధురవాక్యములతో హృదయాకర్షకముగాఁ జెప్పుచుండఁగా నాచిన్నది యత్యాసక్తితో వినుచు నడుమ నెవ్వారైనఁ బిలిచినచో వేగిరపాటుతోఁబోయి లోపలగృహకృత్యములను నిర్వహించి యప్పుడే మహావేగమున మరల వచ్చి యతనివాక్యామృతపానముచే దనియని చెవులను దనుపుకొను చుండును. ఆచిన్నది యొకనాఁడు నావకాశముగాఁ గూరుచుండి యాతనిని బిలిచి తా నాపటి కప్పుడప్పుడు భాగభాగములుగా వినుచు వచ్చిన యాతనిచరిత్రమునంతను మొదటినుండియు నొక్కసారిగా పూర్ణముగా వినిపింపు మని యడిగెను. అతఁ డది సందుచేసికొని తనకథను జెప్ప మొదలుపెట్టి జాలిపుట్టునట్లుగా తనచిన్ననాఁటి కష్టకథలను సమమనస్కుఁడు వర్ణించుచు పలుమారు నామె కన్నులనుండి నీరు వచ్చునట్లు చేసెను. అతఁడు తనకథను ముగించునప్పటి కాతని శ్రమకు జాలిపడినట్లుగాఁ గొన్నినిట్టూర్పులుపుచ్చి యాచిన్నది కథ

సంతాపకరముగాను వినోదకరముగానుగూడ నున్నదని పలికె. తన యం దనుగ్రహించి యావిచిత్రమును శ్రమపడి చెప్పినందునకయి తన కృతజ్ఞతను దెలిపి, ఆకథ దయారసలేశముగల రసికులా లయినకన్య విన్నపతమున త్రాణము వలచి వరింపఁగోరునంతయింపుగాఁ జెప్పఁ బడిన దని యాతనినేర్పును శ్లాఘించెను. ఇట్లాచిన్నది లజ్జావినయ శృంగారచేష్టలతో తనవలపును సూచింపఁగా నతఁడు గూఢమయిన యామె మనోభావమును గ్రహించి, తన కామెమీఁదఁ గలిగిన గాఢానురాగమును తేటపఱచి తల్లిదండ్రులకు తెలియకుండ రహస్యముగా గాంధర్వవివాహమునఁ దన్నుఁ వరించుట కాకన్యారత్నముయొక్క యంగీకారమును బొందెను.

తనరూపవిశేషముగాని ధనవిశేషముగాని తన్ను వసుదేవుఁ డల్లునిగా నంగీకరించునని యాశపెట్టుకొనుటకు తగినంత గొప్పవి కావని యతఁడు దృఢముగా నెఱుఁగును. అయినను వసుదేవుఁడు తనకోమార్తెకు తనయిచ్చవచ్చిన రాజపుత్రు నివరించుటకు స్వాతంత్ర్య మిచ్చి యుండెను; ఆస్వాతంత్ర్యమునుబట్టి యాచిన్నది మంత్రిపదమున కర్హుఁ డయిన తన యనుమనస్కులలోని యొక రాజకుమారుని భర్తనుగాఁ గోరుకొనునని తలఁచియుండెనే తాని విదేశస్థుఁడైన యాకులముతెక్కువ వానిని వరించునని యతఁడు స్వప్నావస్థయం దయినను దలఁచియుండ లేదు. ప్రభాకరుఁడు రూపమునందు నల్లనివాఁడే యయినను పద్మిని యాతనిచర్మమును జూచి మోహింపక శౌర్యత్యాదిగుణములను కామించి తన హృదయము నాతనికర్పించి తన ధనప్రాణముల నాతని పాలుచేసెను. అనేకము లైన యాతనియుత్తమగుణములనుబట్టియే పద్మిని యాతనియందు బద్ధానురాగము గలదయినందున, తనతోడి రాచకన్నె లందఱును సామాన్యముగా విరసభావముతోఁ జూడఁదగిన

నాతనిని విమర్శించి దోషనిర్ధారణముచేసి శిక్షింపవలసినదని యభియోగము తెచ్చెను. ఆకాలమునందా దేశపు రాజశాసనమునుబట్టి యట్టినేరము చేసినవాడు మరణశిక్షపాలు కావలసియుండెను.

ఇట్టిస్థితిలో నభియోగము వచ్చినప్పుడు సభికులు వసుదేవుడు వృద్ధుడును సత్యసంధుడు నగుటచేత నాతనిమాటలను సావధానముగావిని,కోపావేశముచేత నతడు తగిననిదర్శనములులేనిదే లేనిపోని దోషారోపణములు చేసినను సహించి విమర్శించి, ఏమిసమాధానము చెప్పెదవని ప్రభాకరునడుగగా నతడు తానాకన్యను లోగొనుటకయి యవలంబించిన మార్గమును తాను తనకథను జెప్పినవిధమును నేమియు దాచక యున్నది యున్నట్లుగా సర్వమునునిష్కపటముగా సభవారిముందు దేకరువుపెట్టెను. మధురగంభీరస్వరముతో హృదయరంజకముగా వినిపించిన కథ యాద్యంతము విని రాజు తలయూచి యీకథ నీతనినోట వినుటకు తటస్థించిన పక్షమున వసుదేవునికూతురే కాక తన కొంతెరు సహోదము వలచి వైబడక మాన దనిపలికెను. పద్మినియొక్క చిత్తాకర్షణమునకయి యతడుప్రయోగించిన మాయలును మంత్రములును మాయయు మర్మమునులేని యతని ఋజువర్తనయొక్కటి దక్క వేఱేవియు లేవనియు, అతడు ప్రయోగించిన సమ్మోహనమంత్రమంతయు తన మృదుకథను తేనె లొలుకుమాటలతో మనసుకరగునట్లు కర్ణరసాయనముగా వచించుట యొక్కటియే యనియు సభికులందఱకుగూడవిస్పష్టపడెను. అంతట పద్మినినిగూడ సభకు బిలిపించి యడిగినప్పుడు చిన్నదికూడ తన ప్రేమానుబంధమునకుం గలకారణ మాతడు వినిపించిన విచిత్రచరిత్ర యొక్కటియే యగుట తెలిపి, తన్ను చిన్నప్పటినుండియు విద్యాబుద్ధులుచెప్పి పెంచి పెద్దదానిని జేసినందుకయిన తండ్రియెడల తాను వినయగౌరవములు

చూపి కృతజ్ఞతతో నడుచుకొనవలసినధర్మమును ప్పుకొని యుత్తమాంగ నలకు భర్తలయెడలఁ జూపవలన యధికతరమైన యుత్కృష్టధర్మ మునుబట్టి తాను తండ్రికంటె భర్త నెక్కువ గౌరవించవలసి వచ్చి నదని చెప్పెను.

అప్పుడు వసుదేవుఁడు తాను ప్రభాకరునిమీఁదఁ జేసిన దోషా రోపణములు నిరాధారములయినవని తెలిసికొని, ఆతనిని దాపునకుఁ బిలిచి నిష్కారణముగా తా నతనిమీఁద మిథ్యాదోషము మోపినందు నకువిచారపడి, నిజముగాతనకొమార్తెకతఁడుభర్తయగుట మనస్సులో నిష్టము లేకపోయినను చేయవలసినకార్యము వేఱొకటికానరానందున తానతనికిఁ గన్య నిచ్చితినని చెప్పి, "ప్రభాకరా! ఆజ్ఞమీఱికన్నతండ్రికి మనోవ్యథ వృద్ధిపొందించుటకయి నాకితరపుత్రికలు లేక యీపుత్రిక యొక్క కైయేమైనందుకు కొంత సంతోషించుచున్నాను" అని పలి కెను. ఈకష్టమీవిధముగా తీరినందున, ప్రభాకరుఁ డితరప్రతిబంధము లేవియు లేనివాఁడయి చిన్నప్పటినుండియు నలవాటుపడుటనుబట్టి కష్టములన్న నాహారనిద్రలవంటి సహజధర్మములని భావించు స్వభా వముగలవాఁడగుటచేత సేనాధిపత్యమును వహించి సింహళద్వీపము నందు యుద్ధము నడపి నూతనకష్టములను మీఁద వేసికొనుటకుత్సాహ పూర్వకముగా నంగీకరించెను. పద్మిని గూడ తానింటివద్దనుండి యొంటిగా సుఖమనుభవించుటకంటె భర్తతోడనుండి కష్టము లను భవించుటయే యోగ్యతరమనిభావించి మహోత్సవముతో నాతని వెంటఁ బ్రయాణమయ్యెను.

ఇట్లు భార్యను వెంటఁబెట్టుకొని సేనాసమేతుఁడయి యోడ నెక్కి సముద్రయాత్రచేసి యతఁడు సింహళద్వీపమునందు దిగఁగానే యొక గొప్పఝంఝూమారుతమువలన శత్రువులయోడలుపగిలి చెద

రినవనియు యుద్ధముచేయవలసిన యావశ్యక మఱుమాత్రమును లేక లంక సురక్షితముగానున్నదనియు శుభవార్త తెలియవచ్చెను. అయినను ప్రభాకరుఁడు శ్రమపడవలసిన ఘోరతరమయినయుద్ధ మొకటి యిప్పుడు క్రొత్తగా నారంభమయ్యెను. నిరపరాధిని యైనయాతని భార్యయెడఁగల యసూయాద్వేషములవలన బైలుదేఱిన శత్రువులిప్పు డాతనిపాలికి గర్భశత్రువు లయిన బౌద్ధులకంటెను నధికభయంకరు లయిరి. సేనానాయకుఁడయిన ప్రభాకరుని మిత్రులలో మిత్రపాలుని కంటె నెక్కువచనవరియు నెక్కువనమ్మకమునకు పాత్రుఁ డయిన వాఁడును మఱియొకఁడు లేఁడు. మిత్రపాలుఁడు నిండుయౌవనమున నున్నవాఁడు; మహాసౌందర్యవంతుఁడు; నిరుపమానవాక్చాతుర్యము గలవాఁడు; ఎప్పుడును నవ్వుమొగము పూని యుల్లాసముతో నుండు వాఁడు; మహావీరుఁడు; సరససల్లాపములచేత కామినులయుల్లములు రంజిల్లఁజేయు రసికత్వముగలవాఁడు. ఇటువంటివానిని జూచినప్పుడు వయసు ముదరినతరువాత చక్కఁదనము గల చిన్నకన్నెలను పెండ్లి చేసికొన్న ప్రభాకరునివంటివారి మనస్సులో ననుమానమును భయమును గలుగవలసినదే కాని ప్రభాకరుఁడు పరులమీఁద ననుమానపడుట యెట్టిదో యెఱుఁగని దొడ్డస్వభావము గలవాఁ డగుటచేత పరుఁడు తనయెడల ద్రోహము తలఁచు నన్నయనుమానమే యతని మనస్సున కెప్పుడును తట్టలేదు. ప్రభాకరుఁడు పద్మినితోడితనవివాహ వ్యవహారమునం దీమిత్రపాలునినే నియమించి, ఉభయులమధ్యను సందేశములు నడుపుట కీతనినే దూతనుగా నుపయోగించెను. సుందరులవద్ద హృదయరంజకముగా చమత్కృతితో సంభాషించుటలోఁ దనమిత్రునివద్ద నున్నంతసామర్థ్యము తనవద్ద లేదని తెలిసికొని, తన ప్రతినిధిగాఁ బోయి కన్యావరణముచేసి రావలసినదని నర్మగర్భముగాఁ

బలుకుచు ప్రభాకరుఁడు పలుమాఱు మిత్రపాలుని పద్మినియొద్దకుఁ బంపుచు వచ్చెను. కపట మెఱుఁగని యట్టువంటి యమాయికత్వ మాతనికిఁ గలగుణాలంకారములలో నొక్కటి యని చెప్పవలసినదే కాని దాని నొకదోషమునుగా పరిగణింపరాదు. అందుచేతపతివ్రతా శిరోమణియైన పద్మినికి తన ప్రాణేశ్వరుఁ డయిన ప్రభాకరునికి తరువాత నామిత్రపాలునియందే యధికవిశ్వాసమును బ్రేమయునుండుట వింతగాదు. ఆదంపతులకు వివాహానంతరమునఁగూడ మిత్రపాలుని తోడి తమవర్తనమునందేమియు వ్యత్యాసము కలుగలేదు. అతఁడు మునుపటివలెనే తఱుచుగా వారి యింటికిఁబోవుచు, ఆదంపతులతో యథేచ్ఛముగా సంభాషించుచుండెను. ప్రభాకరుఁడు గంభీరస్వభావముగల మితభాషియైనను, మనసువచ్చిన ట్లమితముగామాటాడు తన మిత్రునియొక్క సంభాషణను విని యానందించుచుండెను. పెండ్లికాక పూర్వము తాను సందేశము గొనివచ్చినప్పటి కాలమునందువలెనే యిప్పుడును మిత్రపాలుఁడును పద్మినియు నరమరికలేక కలిసి మాటాడుచు నానందించుచుందురు.

కొంతకాలముక్రిందట ప్రభాకరుఁడు మిత్రపాలునికి దండులో గొప్పయుద్యోగమిచ్చి విశ్వాసార్హునిగా నెంచి తనకు సహాయునిగా జేకొని యాతనిని సదా తనయొద్దనే యుంచుకొనియుండెను. ఆతని కట్లు గొప్పయుద్యోగమిచ్చుట సేనలో చిరకాలమునుండి కొలువు చేయుచుండుటచేత తానాయుద్యోగమున కెక్కువయర్హుఁడ నని భావించుకొనుచున్న దుష్టబుద్ధికి కడుపుమంటగానుండి కనఁబడినచోట నెల్ల నాక్షేపించుచు, స్త్రీలవద్దఁ గూరుచుండి తియ్యనికథలు చెప్పుటకుఁదక్క యుద్ధకార్యములకు వేనికిని బనికిరా వని యతఁడు మిత్రపాలుని పరిహాసించుచుండెను అందుచేత దుష్టబుద్ధి మిత్రపాలుని

మాత్రమేకాక ప్రభాకరునిగూడ మనసులో ద్వేషించుచుండెను. ప్రభాకరుని ద్వేషించుట కతఁడుమిత్రపాలునియెడ దయగలిగియుండు నన్న యొక్క కారణమేకాక ప్రభాకరుఁడు తనభార్యయైనరాధికయం దనురాగము గలవాఁడయి యున్నాఁడని నిష్కారణముగా దుష్ట బుద్ధి తనమనస్సులో పెట్టుకొన్న లేనిపోని యనుమాన మొక్కటికూడ కారణముగానుండెను. ఇట్లుకారణవైరము వహించి దుష్టబుద్ధి పగ సాధింపవలెనని నిశ్చయించి యొక్కసారిగా మిత్రపాలుని ప్రభాకరుని పద్మినిని నాశనముచేయుటకయి యొకయుపాయ మాలోచించెను.

దుష్టబుద్ధి మాయలమారియు మనుష్యస్వభావమును జక్కగా నెఱిఁగినవాఁడు నగుటచేత లోకములో పురుషుఁడు పొందఁదగిన వేదన లలో నెల్ల భార్యయెడల జారత్వశంకవలనఁ గలిగెడుమనోవేదనయత్య ధికమయిన దనియు దుర్భరమయిన దనియు తెలిసికొన్నవాఁడయి, తాను ప్రభాకరునిమనస్సులో మిత్రపాలుఁడు పద్మినివిషయ మయి ద్రోహవర్తనము కలవాఁడయినట్టు శంక కలిగింపఁగలిగినపక్షమున ప్రభాకరుఁడు గాని మిత్రపాలుఁడు గాని యుభయులు గాని ప్రాణ ములు పోఁగొట్టుకొందు రని తలఁచి, ఆమాయోపాయముచేత పగ తీర్చుకోవలెనని నిశ్చయము చేసికొనెను. జయశాలియైన తమసేనాధి పతి క్రొత్తగా వివాహమాడినభార్యతోడఁగూడ వచ్చుటయు, శత్రు సేన గాలివానచేత సముద్రములో చెల్లాచెద రయిపోయినదన్నశుభ వార్త తెలియుటయు, సేనలో నెల్లవారికిని మహోల్లాసజనకముగా నుండుటచేత సింహళద్వీపములో నున్నసైనికులెల్లరు జేరి నాఁటిదిన మొక్కగొప్పయుత్సవము చేసిరి. ఆయుత్సవములో నెల్లవారును సంతోషాతిశయముచేత మితముతప్పి త్రాగి యెక్కువగా భుజించిరి. సైనికు లతివిస్తారముగా త్రాగి యల్లరిచేసి జనుల కొత్తుడు కలిగింప

కుండఁ జూచుటకును, క్రొత్తగా వచ్చిదిగిన సేనలవలనఁ దద్వీపవాసుల కేవిధమయినయాయాసమును కలుగకుండఁ గాచుటకును అధికార మిచ్చి యారాత్రి ప్రభాకరుఁడు మిత్రపాలుని నియమించెను. ఆరాత్రియే దుష్టబుద్ధియు తాను వారిని జెఱుపుట కయి పన్నినకూఁరోపాయమును ప్రయోగించుట కారంభించెను. కావలిగా నున్నయుద్యోగస్థుఁడు త్రాగుట గొప్పతప్పిదమేయయినను, దుష్టబుద్ధి తియ్యని మాటలు చెప్పి తనకు సేనాధిపతియం దున్నట్లు కల్లపేమను భక్తిని గనఁబఱిచి భ్రమింపఁజేసి మిత్రపాలు నధికముగా త్రాగునట్లుచేసెను. మిత్రపాలుఁడు మొట్టమొదట త్రాగుటకు సందేహించి కొంతసేపటి వఱకును మద్యమును నిరాకరించినను, కడపట దుష్టబుద్ధియొక్క యుత్సాహవచనములకును భ్రాంతిగొలుపుపాటలకును లోనయి సురను సేవించుట కారంభించి యొకపాత్రము తరువాత నొకపాత్రముగా మెల్లమెల్లఁగా సురతో గర్భమును పూరించెను. అతని ముఖద్వారమునుండి గర్భకుహరములోఁ బ్రవేశించిన గర్భశత్రువయిన యామద్యభూత మించుకసేపటిలో నాతనిబుద్ధిని మ్రింగివేసినందున, మత్తెక్కి వివేకహీనుఁడయి యున్నయామిత్రపాలుఁడు దురాత్ముఁడయినదుష్టబుద్ధియొక్క ప్రేరణముచేత నొకసేనానాయకునితో కలహము పెట్టుకొని గత్తిదూసికొని లేచి, నడుమ కలహము వారించుటకయి యడ్డము వచ్చినశూరవర్మ యనునుద్యోగిని గాయపఱిచెను. అప్పుడాకలహముతో పలువురుచేరి పోట్లాట కారంభించిరి. ఈకలహమున కంతకును కారకుఁడయినదుష్టబుద్ధియే త్రాగుబోతులుకొందఱు చేరి పెట్టుకొన్న యీచిల్లరకయ్యము భయంకరమయిన మహాయుద్ధమయినట్టుగా కంటఁబడినవారితో నెల్లఁజెప్పుట కారంభించి, దేశోపద్రవకరమయినజనసంక్షోభము పుట్టినప్పుడు వాయించెడుభేరిని వాయించు

నట్లు చేసెను. ఆభేరీధ్వని విని నిద్రపోవుచున్న ప్రభాకరుఁ డులికిపడి లేచి, వేగిరపాటుతో వస్త్రాదికము ధరించి తిన్నఁగా సేనాని వేశమునకు నడిచివచ్చి యాసంక్షోభమునకుఁ గారణ మేమని మిత్రపాలుని నడిగెను. అప్పటికి సురాపానమువలన తలకెక్కినమత్తు కొంత దిగినందున మిత్రపాలుఁడు తన యవివేకతను ప్రభాకరునిముందఱఁ జెప్పుటకు సిగ్గుపడి సదుత్తరము చెప్పక యూరకుండెను. అంతట దుష్టబుద్ధి తనమిత్రుఁడయినమిత్రపాలుని నేరమును బయలఁబెట్టుట కిష్టము లేనివానివలె నటించుచు, సత్యము చెప్పవలసినదని ప్రభాకరుఁడు తొందర పెట్టఁగా విధిలేక చెప్పుచున్న వానివలె జరిగినకథ యంతయు నేకరువుపెట్టి, అందు తాను ప్రోత్సాహపఱిచి చేసినపనిమాత్రము మఱుఁగుపఱిచి మిత్రపాలుని తప్పిదమును దాచుచున్నట్లగపడుచు నుపాయముతో సేనాపతిదృష్టియం దాతని నేరము మఱింతహీనముగాఁ గనఁబడునట్లు చేసెను. తనసైనికులలో నెంతటి చనవరియైనను తనయాజ్ఞ నతిక్రమించి నడిచినప్పుడు దయాదాక్షిణ్యములు తలఁచి క్షమించి యూరకుండుస్వభావము కలవాఁడు కాకపోవుటచేత నతఁడు వెంటనే మిత్రపాలుని తానిచ్చినపనినుండి తొలగించెను. ఈప్రకారముగా దుష్టబుద్ధి నాఁటినయుపాయబీజము మొలకయెత్తి ప్రథమదినముననే ఫలింప నారంభించినందున, అతఁడు లోపల సంతోషించి తాను మనస్సులో ద్వేషించెడుశత్రువును తన మాయావాగురలోఁ బడవేసి జీవనము తీసివేయించుటలో తృప్తినొంది యుండక యారాత్రి నడచినపనిని బట్టియే తనపగవానిని పూర్ణముగా చెఱుపవలె నని నిశ్చయించుకొనెను.

తనయజమానునియాగ్రహమువలనగర్వభంగముగలవాఁడయి మిత్రపాలుఁడు తనకు పరమాప్తునివలె నభినయించుచున్న దుష్టబుద్ధి

వద్దకుపోయి, నాఁటిరాత్రి తానాప్రకారముగా తప్పత్రాగి మృగము వలెఁబ్రవర్తించి తన యజమానుని యనుగ్రహమును పోఁగొట్టు కొన్నందుకు ఖేదపడి, తన దుర్వర్తనమువలనఁ దాను పూర్ణముగా పాడయితినినియు, అట్టియపరాధము చేసినతరువాత మరల నేమొగ ముతోఁ బోయి త్రాగుఁబోతునని యొప్పుకొని తనపని తన కిమ్మని వేఁడుకోఁగలుగుదుననియు, చెప్పుకొని తనబ్రతుకును రోయఁజొచ్చెను. అతని దీనాలాపములు విని జాలిపడువానివలె నటించి దుష్టబుద్ధి లోక ములో లోపములేనివాఁ డెవ్వఁడుండు ననియు నెంతటి వివేకికైనను ప్రమాదముచేత నొకానొకప్పుడు త్రాగుట సంభవింపవచ్చుననియు నపాయము తప్పించుకొనుట కుపాయమాలోచింపవలెనుగాని యాపద వచ్చినప్పుడు దిగులుపడి కూరుచుండుట బుద్ధిమంతుని లక్షణము కాదనియుఁ జెప్పి యోదార్చి, ఇప్పుడు ప్రభాకరుఁడు భార్య యెంత చెప్పిన నంతచేయుచున్నవాఁడగుటచేత పోయి యామె కాళ్ళమీఁదఁ బడి భర్తతోఁ జెప్పి క్షమించునట్లు చేయవలసినదని వేఁడుకొమ్మనియుఁ ఆమె దయార్ద్రహృదయముగల యుత్తమురాలగుటచేత నీమాట తీసి వేయక తన భర్తతోఁ జెప్పి నిన్నాతనిదయకు మరలఁ బాత్రుని జేయుననియు, హితోపదేశముచేసెను. ఇది తనపగను సాధించుకొను టకయి దురుద్దేశముతో చేయకపోయినయెడల మంచి యుపదేశమే కాని దుష్టబుద్ధిమాత్ర మాతనిని పాడుచేయుటకు మార్గముగానుండు ననియే యీయాలోచనను జెప్పెను.

దుష్టబుద్ధియొక్క మాట విని మిత్రపాలుఁడు పద్మినియొద్దకుఁ బోయి యామె మనస్సు కరఁగునట్లుగా తనకు సంభవించినకష్ట మామెతోఁ జెప్పుకొని, భర్తతోఁ జెప్పి పోయినజీవనమును మరల నిలిపి దీనునిరక్షించిన పుణ్యము కట్టుకొమ్మని బహువిధములఁ బ్రార్థించెను.

దీనదయాళురా లయినయాకాంతామణి యాతని కభయహ_స్తమిచ్చి పంపివేసి, ప్రతిదినమును మిత్రపాలుఁడుచేసిన యల్పదోషము క్షమించి యాతనిపని యాతనికియ్య వలసినదని భ_ర్తను వేఁడుకొన మొదలు పెట్టెను. అటువంటి నేరముచేసినవాని నంతశీఘ్రముగా క్షమించుట యు_క్తముకాదనిచెప్పి యతఁడు భార్యమాటను తీసివేయలేక కాల హరణము చేయుచురాఁగా, ఆయిల్లా లంతటితో నూరకుండక మాపు చేసెదరా రేపుచేసెదరా యని భ_ర్తను పలుమాఱు తొందరపెట్టుచు మిత్రపాలునియొక్క పక్షమవలంబించి యాతఁడు తనదోషమునకుఁ బశ్చాత్తాపపడి యెంత కుంగిపోయినాఁడో చెప్పి, అతఁడు చేసిన యాయల్పదోషమున కతనికంత క్రూరదండనము విధించిన ధర్మము కాదని న్యాయనిష్ఠురములాడి, అతనిని శీఘ్రముగాదయ చూడవలసిన దని నిర్బంధపెట్టుచుండెను. ప్రభాకరుఁడప్పటికిని దయచూపక యుపే క్షింపఁగా పద్మినిభ_ర్తనుజూచి "ఓప్రాణనాథా ! మీపాదసేవకురాలి యందు మీరింత దయ తప్పవచ్చునా? మీకు ప్రాణమిత్రుఁడయి నేను మీచెట్టఁబట్టుటలో సర్వవిధముల సహాయుఁ డయినమిత్రపాలుని విషయములోనే నేను మీతో నింతదూరము మనవిచేయవలసివచ్చు చున్నదిగదా? ఇంతదీనముగా ప్రార్థించుచున్నను మిత్రవిషయములో నింతమాత్రపు చిన్న యుపకారమును జేయ ననుగ్రహింపనివారు గొప్పవిషయములో నేమియుపకారము చేయఁగలరు?" అని బహు విధముల నొక్కిచెప్పెను. దయారసముట్టిపడునట్లుగా నంతమృదువుగా నడిగిన యామెప్రార్థనను నిరాకరింప నోరురాక ప్రభాకరుఁడు మిత్రపాలుని తప్పక క్షమియించెద నని భార్యచేతిలోఁ జేయివేసి వాగ్దానముచేసి కొంత కాలముమాత్ర మోర్చియుండవలసిన దని బతిమాలుకొనెను.

ఒకనాఁడు మిత్రపాలుఁడు తనపనినిమిత్తమయి పద్మినిని సందర్శించి వేఁడుకొని యొకదారిని వెడలిపోవుచుండఁగా నానిమిషమునందే మఱియొకదారిని ప్రభాకరుఁడును దుష్టబుద్ధియుఁ గలిసి లోపలికివచ్చుట తటస్థించెను. అప్పుడుమాయోపాయములయందు మహానిపుణుఁడయిన దుష్టబుద్ధి తనలోఁదా ననుకొన్నట్లు "ఇటువంటిచేష్టలు నాకుసరిపడవు" అని హీనస్వరముతో పలికి తలపంకించెను. ప్రభాకరుఁడా మాటను వినినవాఁడయ్యును దాని నంతగాపాటింపక లోపలికిఁబోయి భార్యతోమాటాడి యాసందడిలో నప్పుడామాటనే మఱచిపోయెను గాని తరువాత నాతని కాసంగతిని మరల జ్ఞప్తికిఁదెచ్చుకోవలసిన యవసరమొకటిసంభవించినది. పద్మినియతనినివిడిచి లోపలికిఁబోయిన తరువాత తనకుఁ గలిగిన సందేహమును దేనినో తీర్చుకొనుటకయి యడిగినట్లుగా దుష్టబుద్ధిప్రభాకరునిజూచి మీరు పద్మినిని వరించుటకయి ప్రయత్నముచేయుచున్నకాలములో మీకామెమీఁద వలపు గల దన్నయంశము మిత్రపాలుఁ డెఱుఁగునా యని ప్రశ్నవేసెను. ఎఱుఁగునని చెప్పి యతఁడొక్కయెఱుఁగుటమాత్రమేకాదు మాయిరువుర నడుమను సందేశములనుగూడఁ గొనిపోవుచువచ్చెనని ప్రభాకరుఁడు పలుకఁగా, ఆలాగుననా యని పలికి దుష్టబుద్ధి పెదవి విఱిచి యూరకుండెను. దుష్టబుద్ధి నిష్కపటియనియు మంచివాఁడనియు నతఁడు నమ్మియున్నందున, అతనికప్పుడు తాను దుష్టబుద్ధితోఁగూడి లోపల బ్రవేశించునప్పుడన్నమాటయు మిత్రపాలుఁడు పద్మినియొద్ద నుండుటయు స్మరణకురాఁగా దానికంతకు నేదోయర్థమున్నదని యతఁ డూహించి యతనికి దెలిసినదేమైన నున్నయెడలఁ దనకప్రియమయి నను సందేహింపక తనతోఁ జెప్పవలసినదని దుష్టబుద్ధిని వేఁడుకొనెను. తమ హృదయములో కాపట్యములేనివారు పరులనుగూడ

తమయట్లే భావించి వారిమాయలను మర్మములను దెలిసికోలేక వారు చెప్పినదియెల్లను పరిశుద్ధహృదయముతోనే చెప్పుదురని భ్రమించి మోసపోవుచుందురు. అందుమీఁదట దుష్టబుద్ధి "మిత్రుఁడా! మన స్సులోపుట్టిన పిచ్చియూహలనెల్ల నెల్లడిచేయుట యెన్నఁడైన ధర్మ మగునా? ఒకానొక సమయమునం దెంతమంచివారల హృదయముల యందును దుష్టచింత లుదయముకావచ్చును. కాఁబట్టి పదింబదిగ విచారించి సత్యమును దృఢముగా స్థిరపఱుచుకొనువఱకును తోఁచిన దానినెల్లఁ బరులతోఁ జెప్పఁగూడదు." అని పలికి అనాలోచితము లయిన తనమాటలవలన ప్రభాకరుని మనస్సునకు కొంచెము నొప్పి కలిగిన పక్షమున తరువాత తనమన స్సెంతో దుఃఖపడుననియు, తన మనస్సులోని దురూహల నెఱుఁగఁ గోరుట ప్రభాకరునియొక్క మన శ్శాంతి కెంతమాత్రమును తగదనియు, అల్పములైన యనుమానము లనుబట్టి మంచివారిపేరును భంగముకలిగించుట యుక్తముకాదనియు, నీతులనుజెప్పఁజొచ్చెను. ఈమాటలవలన ప్రభాకరునియొక్క మనస్సు చెదరి యతని మనస్సులో నేదోయనుమానము పుట్టినదని దృఢముగా దెలిసికొన్నతరువాత నాదురాత్ముఁ డాతనిమనస్సంతుష్టినిచెడఁగొట్టుట కిష్టములేని వానివలె నటించి జారత్వశంక నెప్పుడును మనస్సులోపెట్టు కొనగూడదనియు నట్టిశంకయే యెల్లపాపములకును మూలమనియు బోధించి యాహితబోధవలననే జారత్వశంక యతనిహృదయమునందు మఱింత రవులు కొల్పెను. అప్పుడు ప్రభాకరుఁడు నిట్టూర్పుపుచ్చి "చెలికాఁడా! నాభార్యరూపవతియనియు వాక్చమత్కృతి కలదనియు సంగీతసాహిత్యముల యందు నిపుణురాలనియు నేనెఱుఁగుదును. అయి నను గుణసంపదమాత్రమొక్కటిలేకపోయినపక్షమున స్త్రీలయందు దీచె ప్పినగుణములన్నియు నవగుణములగును, తగినంత నిదర్శనములేని దే

మాత్రము నేనా మెగుణము మంచిది కాదని నమ్మజాలను'' అని పలికెను. "లేని పాపము కట్టుకోరాదు. ఆమెయందు లేశమైనను దోషమున్నట్టు నాకు నిదర్శన మేదియుఁ గనఁబడలేదు. నిదర్శనము లేక యూరక యొకరు చెప్పిన మాటలు నమ్మని నీ స్వభావమునకు నే నెంతో సంతోషించు చున్నాను. నీవు నీభార్యమీఁద నెప్పుడును నిష్కారణముగా నను మానపడఁగూడదు. మిత్రపాలుఁ డామెయొద్దకు వచ్చుచుఁ బోవుచున్న ప్పుడు నిపుణముగాఁ బరిశీలించి మఱియొక యభిప్రాయమును గుదురు కొనవలెనుగాని తొందరపడరాదు. స్త్రీల స్వభావము నాకు చక్కఁగా తెలియును. భర్తలవద్ద సిగ్గుచేత సాహసింపలేక కొన్ని విషయములలో నితరులవద్ద కొంత యెక్కువ స్వేచ్ఛతో ప్రవర్తించినంతమాత్రముచేత వారివిషయమయి యన్యథా భావింపఁగూడదు'' అని హితోపదేశము చేసి, దుష్టబుద్ధి మెల్లఁగా వివాహప్రసంగము తెచ్చి పద్మిని తన్ను వరించుటలో ప్రభాకరుఁడు మాయలను మంత్రములను ప్రయోగించి లోఁబఱచుకొన్నట్లు తండ్రికి నమ్మకము కలిగించి యావృద్ధుని వంచిం చిన దని తోఁచునట్లు సూచనగా నడుమనడుమ కొన్నిమాటలు జాఱ విడుచుచు వచ్చెను. తన్నుఁ గూర్చినవగుటచేత నామాటలు సూటిగా తత్క్షణమే ప్రభాకరుని హృదయాంతరాళమున నాటుకొనఁగా అతఁడు తండ్రిని మోసపుచ్చ సాహసించిన చిన్నది భర్తను మోసపుచ్చుటకు మాత్రము సందేహించునా యని భార్యవిషయమయి సందేహపడ నారంభించెను.

అప్పు డాదుష్టుఁడు తానేమియు నెఱుఁగనివానివలె సభిన యించి యటువంటి యప్రశస్తప్రసంగము తెచ్చినందుకు క్షమింపు మని ప్రభాకరుని వేడుకొనెను. ప్రభాకరుఁడు నిజముగా మనస్సులో వ్యాకులత నొందినవాఁ డయ్యును పయికి తా నాప్రసంగమువలన

నేమియు చలింపకున్నట్లగపడుచు మరికొన్నిసంగతు లడిగి నిశ్చయముగాఁ జెప్పవలసిన దని దుష్టబుద్ధిని బలాత్కారపెట్టెను. ఆసంభాషణము జరుగుచున్నంతవఱకును దుష్టబుద్ధి మిత్రపాలుని తనమిత్రుఁడని పిలుచుచు నతనిలోపములను గప్పిపుచ్చుటకయి ప్రయత్నించుచున్నట్లు మాటలవలన సూచించును, పద్మిని మిక్కిలి చక్కనివారయి లేఁబ్రాయములో నున్నస్వదేశపురాజకుమారుల నెల్ల నిరాకరించి రూపవంతుఁడు కాని వయసుమీఱినప్రభాకరుని గోరుట స్వభావవిరుద్ధ మగుటయు, తొందరపడి యనాలోచితముగా నొక కార్యము చేసినవారు తరువాత తమయవివేకమును దలఁచుకొని పశ్చాత్తప్తులగుట సహజ మగుటయు నేర్పుతోఁ జెప్పి, కడపట మిత్రపాలునికి పని యిచ్చుట కొంత యాలస్యముచేసి యాలోపల నాతనివర్తన మెట్లుండునో యాతనికి పని యిప్పించువిషయమయి పద్మిని యేయేవిధములఁ బాటుపడునో కొంచెము కనుగలిగి చూచుచుండవలసిన దని యాలోచన చెప్పెను.

ఉపాయశాలియైనయాదుష్టాత్ముఁడు తనశక్తినంతను వినియోగించి యమోఘమయిన కుతంత్రమును పన్ని, పద్మినియొక్క సుగుణసంపత్తి నే యామెయొక్క వినాశమునకు మార్గముగాఁ జేయు నాలోచించి మొట్టమొదట మిత్రపాలుని పిలిచి యిచ్చకములాడి తనపనినిమిత్తమయి పద్మినియొద్దకుఁబోయి వేఁడుకొనున ట్లాతని నొడఁబఱిచి సింగారించి పంపి, తరువాత ప్రభాకరునియొద్దకుఁ బోయిపరనూప్తునివలెమాటాడి యాతనిమనస్సులో శంకావిషబీజమును నాఁటి నిర్దోషురాలయిన యాపతివ్రతాతిలకమును స్వగుణరజ్జువులచేతనే యురియొడ్డుకొని యం దనాయాసముగా కూలునట్లు పెద్దపన్నుగడ పన్నెను. వారిప్రసంగము చాలించి వెళ్ళఁబోవునప్పు డాదుష్టాత్ముఁడు దృఢమయినదృష్టాంతము కనఁబడువఱకును పద్మినిని నిరపరాధినినిగానే భావింపవలసిన దని

ప్రభాకరునితో మఱిమఱి చెప్పి ప్రార్థించెను. ప్రభాకరుఁడును తాను వేగిరపడక సావకాశముగా వేచియుండెద నని పలికెనుగాని నాఁటి నుండియు నతనిమనస్సుమాత్రము మరల కుదుటఁబడక శాంతియన్న మాటయెఱుఁగనిదై యుండెను. గతదినమువఱకును నతఁడు హాయిగా పొందుచున్ననిద్రను నాఁటినుండియు మరల నతనికిఁ దెచ్చుటకు నల్ల మందు మొదలయిన లోకములోనిమత్తువస్తువులకు వేనికిని సాధ్యము కాలేదు. ఆక్షణమునుండియు నాతనిమనస్సే యతనికిస్వాధీనము కా లేదు; అతనిశరీరమే యతనికి భారముగా కనఁబడఁజొచ్చెను; అతనికి యుద్ధము నందభిరుచి తప్పిపోయినది; సేనలనుగాని ధ్వజములనుగాని వ్యూహములనుగాని భేరులనుగాని జూచునప్పుడు వీరరసముతో నుప్పొంగి పరుగువాఱెడి యాతనియాత్మ నిరుత్సాహమయి సంతోష హీనమయ్యెను. అతఁడు మతిపోయినవాఁడయి యొకప్పుడు పద్మిని నిర్దోషురాలని తలఁచును; మఱియొకప్పుడామె దోషురాలని తలఁచును; ఒకప్పుడు దుష్టబుద్ధిమాటలు సత్యములు కావని యెంచును; మఱి యొకప్పుడతనిమాటలు సత్యములని యెంచును; ఒకప్పుడుమిత్రపాలుని వర్తనము తనకుఁదెలియకున్న బాగుండుననని భావించును; మఱియొ కప్పుడు తెలియుటయే మంచి పనియైనదని భావించును. ఈవిధముగా నతఁడు మతిస్థైర్యము చెడిన వాఁడయి యొకనాఁడు కత్తి దూసికొని తిన్నఁగా దుష్టబుద్ధియొద్దకుఁ బోయి యాతనిజుట్టుపట్టుకొని తత్క్షణము పద్మినియొక్క యపరాధమును స్థాపించుటకుఁ దగిన నిదర్శనమును జూపకబోయిన పక్షమున నిష్కారణముగా యోగ్యురాలియందు మిథ్యాదోషమారోపించి కల్లలాడినందున కయి యాతని నాలుకను గోసెదనని బెదరించెను. అందుమీఁద దుష్టబుద్ధి తన నిష్కాపట్య మును మంచితనమునే తనకీగతి తెచ్చినట్లభినయించి లేనిరోషము

తెచ్చుకొని, జరీపువ్వులుగల యెఱ్ఱపట్టురుమాలెప్పుడయిన నీవు నీభార్యవద్దఁ జూచినావా యని మొగ మింతచేసికొని యడిగెను. వివాహసమయమునం దట్టిరుమాలొకటి తానే తన భార్యకిచ్చితినని ప్రభాకరుఁడు పలికెను. "అరుమాలుతోనే మిత్రపాలుఁడు నేఁడు మొగము తుడుచుకొనుచుండఁగా నేను ప్రత్యక్షముగాఁ జూచినాను" అని యాదుష్టుఁడు మొగము జేవురింపఁ బలికెను. "నీవు చెప్పినదే సత్యమయినపక్షమున వారిప్రాణములుతీసి నాపగతీర్చుకొనువఱకును నేను నిద్రపోను; నేఁడు మొదలుకొని మూఁడు దినములలోపల తప్పక మిత్రపాలుఁడు యమలోకముచేరును; ఇఁక భార్యారూపమైయున్న యారాక్షసియొక్క వధవిషయమయి నేను పోయి తరువాత నేదో యుపాయ మాలోచించెదను" అని ప్రభాకరుఁ డనెను.

జారత్వశంకను మనస్సులోఁ బెట్టుకొని యున్నవారికి గడ్డిపఱక చేయని విషయములు సహితము వేదవాక్యమువంటి ప్రబలప్రమాణములుగా తోఁచునుగదా! మాయకప్పియున్న ప్రభాకరుని దృష్టి కప్పుడు మిత్రపాలునిచేతిలోఁ బడిన రుమాలు మిత్రపాలుని కది యెట్లులభించినదో యను విచారమైన నక్కఱ లేకయే యిద్దఱిప్రాణములను గొనుటకు చాలినంత నిదర్శనముగాఁ గనఁబడినది. ఆరుమాలు నెప్పుడును పద్మిని మిత్రపాలుని కిచ్చియుండనులేదు, ఆమె ప్రియవల్లభుఁడు తనకు ప్రీతిపూర్వకముగా నిచ్చినవస్తువు నితరుల కిచ్చుటకంత యవివేకినియుఁగాదు; ఈవిషయములో పద్మినియు మిత్రపాలుఁడును గూడ నుభయులును ప్రభాకరున కణుమాత్రమును ద్రోహముతలఁచి యెఱుఁగని నిర్దోషులే. దుర్మార్గములైన యాలోచనలుచేసి కపటోపాయములు పన్నుటలో నసమాన పాండిత్యముగల కుటిలవర్తనుఁడయిన యాదుష్టబుద్ధియే దూరాలోచనలేని యమాయి

కురాలయిన తనభార్యచేత రహస్యముగా నెవ్వరికో నూపి యట్టినేత నేయించుకొనుటకుఁ గావలె నన్నమిషమీఁద దొంగతనముగా తానా రుమాలు తెప్పించి, మిత్రపాలుఁడు దానినిపుచ్చుకొనునట్లుచేసి యది యాధారముగాఁ జేసికొని పద్మిని తా నారుమాలును మిత్రపాలుని కిచ్చినట్లుగా తోఁపఁజేయవలె నన్నదురుద్దేశముతో దాని నతఁడు వచ్చుమార్గమునఁ బడవైచెను.

ప్రభాకరుఁడు కొంతసేపటికి భార్యయొద్దకుఁ బోయి తనకు తల నొప్పివచ్చినట్లు నటించి తనకణతలకు కట్టుకొనుటకయి యారుమాలు తెచ్చి యియ్యవలసినదని యడిగెను. ఆమెలోపలికిఁబోయి మఱియొక రుమాలుతెచ్చి చేతికిచ్చెను. అతఁడది క్రిందఁబడవైచి "నేనడిగిన దిది కాదు. నేను మనవివాహసమయమునందు నీకిచ్చిన జరీపువ్వుల పట్టు రుమాలు" అని కోపదృష్టితోఁ బలికెను. ఆమె లోపలికిఁ బోయి మరల వెదకెను గాని యామె కది యెక్కడను గనఁబడలేదు. ఒరులు దాని నానటకే దొంగిలియున్నప్పు డది యెట్లు దొరకును? ఆమె వట్టి చేతులతో మరల భర్తవద్దకు రాఁగా నతఁడు "నీవా రుమాలు పోఁగొట్టి గొప్పయపరాధము చేసినావు. పదిలముగా వద్ద నుంచు కొన్నంతకాలము భర్త యధికానురాగముతో వశ్యుఁడయి యుండు ననియు వద్ద నుంచుకొనక పాఱవేసినను పరుల కిచ్చినను భర్త ప్రతి కూలుఁడయి నాఁటినుండియు ద్వేషించుననియు దానిమహిమలు చెప్పి యొకసిద్ధుఁ డారుమాలును మాతల్లి కిచ్చెను. అదియామెబ్రతికి యున్నంతకాలమును ప్రాణపదముగా దాఁచుకొని తనయవసానకాల మునందు నాచేతికిచ్చి పెండ్లిసమయమునందు నాభార్య కిమ్మని చెప్పిపోయెను. ఆమె చెప్పినట్టుగా దానిని నేను నీకిచ్చినాను. అనాద రముచేసి నీవది పరులపాలు చేసినావు" అని పలికెను. ఆమాటల

కామె భయపడి తెల్లపోయి "దానిప్రభావ మట్టి దని నేనెఱుఁగను" అని యూరకుండెను. "దానిమహిమ లనిర్వచనీయములు. నీ వది తప్పక తీసికొని రావలెను." అని యతఁడు మరల నిర్బంధపఱుపఁగా, నప్పు డామెరుమాలునుమాత్రమే కాక దానిమూలమున భర్తయొక్క యనురాగమునుకూడఁ బోఁగొట్టుకొనవలసివచ్చునేమో యని భీతి చేత వడఁకుచు నోట మాటరాక నిలువఁబడెను. అప్పు డతఁడు లేచి యేదోసాహసకార్యమునుచేయఁబోయినట్లుగా నలువంకలు చూచుచు తత్క్షణ మారుమాలు తెచ్చి కన బఱుపవలసినదని బిగ్గరగా కేకవేసెను. రుమా లెక్కడను కనఁబడకపోవుటచేత నేమి చేయుటకును తోఁచని దయి నిరపరాధిని యైనయాకాంతాశిరోమణి పరియాచకమునకయి భర్తతనమీఁద లేనికోపమును వహించినాఁడేమో యని భ్రమపడి, "ప్రాణేశ్వరా! మీమనసు నాకిప్పుడు తెలిసినది. మిత్రపాలునికి శీఘ్రముగా పని యియ్యవలసినదని నేను మిమ్ము నిర్బంధపఱతునని నానిర్బంధమునుతప్పించుకొనుట కయి మీరిట్లు మనసులో లేనికోప మును పైకిఁజూపుచున్నారు" అని పలికి యాతని గుణములను కొంత శ్లాఘించెను. అంతట దుష్టబుద్ధి చెప్పినదానికి పద్మినియొక్క వర్త నము సరిపోఁగా నతఁడచ్చట సహించినిలువలేక చివాలున గదిలో నుండి లేచిపోయెను. అందుమీఁదట తనభర్తకేదో తనమీఁద నను మానము పుట్టినదని పద్మినికప్పుడు మనస్సులో సందేహము కలిగెను.

అతని కట్టియనుమానము కలుగుటకు కారణమును తానేమి కలిగించితినాయని కొంతసేపు చింతించి దేనిని కనుఁగొనలేక నిష్కా రణముగా భర్తయందే లేనిదోషము నారోపించితినేమోయని తన్ను తానే నిందించుకొని, మధురాపురమునుండి యేదో యశుభవార్త వచ్చినందువలననో రాజకార్యములలో నేదో తొందర వచ్చినందు

వలననో యాతని మనస్సు కొంచెము కలఁగియుండునని తలఁచికొని యామె మనస్సమాధానము చేసికొనెను. అయినను మనస్సంతటిలో శాంతిపొంది స్వస్థపడనందున పరిపరివిధముల నాలోచించి, "సర్వ కాల సర్వావస్థలయందు నేకరీతిగా మనస్సు నుంచుకొనుటకు పురుషులు దేవతలుగారు పెండ్లికి ముందు భార్యయందుండెడి యనురాగము మగవారికి వారిమీఁద పెండ్లియైనతరువాత నుండదు." అని యింతలో మరల మనస్సు సూర్చుకొని "అయ్యో! భర్తయందు లేనిపాపములు కట్టుచున్నాను గదా! ఆయన నిష్ఠురదయావిహీనునిగా భావించుటచేత నేనే నింద్యురాలను' అని యామె నొచ్చుకొనఁ జొచ్చెను.

అటుతరువాత ప్రభాకరుఁడు భార్యను కలిసికొన్నప్పు డతఁడు తనకు ద్రోహము తలఁచి యన్యునిమీఁద మనసు నిలిపితివని పద్మినిని స్పష్టముగానే దూషించెను గాని యాపురుషుఁ డెవరో పేరును మాత్రము చెప్పినవాఁడు కాఁడు. ఆమాటు చెవిని బడఁగానే యామె నిలువెల్లను చెమర్ప నోటనూటరాక నిశ్చేష్టితురాలయి విభ్రాంతుపడి చిత్రప్రతిమవలె నయ్యెను. అశోఁకును పెద్దపెట్టున నేడ్వఁజొచ్చెను. మగనిగేఁదుపు విని యామె కొంత తెలివి తెచ్చుకొని "అయ్యో! నాపాలిటి కిది మహాదుర్దినము. ఇట్లు మీరేల దుఃఖించెదరు?" అని పలికెను. "బీదతనము, రోగము, తిరస్కారము మొదలయిన సమస్త కష్టములను నేను ధైర్యముతో సహింపఁగలిగితిని గాని యిప్పుడు నాభార్య చేసినద్రోహము నన్ను ధైర్యహీనునిగాఁ జేసి నాహృదయమును పగిల్చి వేసినది. నీ విప్పుడు నాపాలిటికి పయికి సురూపమును సువాసనయుఁగలిగి తాఁకిన శిరోవేదనము కలిగించెడువిషలత వయినావు. నాపాలిటి కాలసర్పమవయిన నీ వీభూమిమీఁద జన్మింపకుండిన

పక్షమున నంత మేలుగ నుండును?'' అని యతఁ డామెను విడిచిలేచి పోయెను. అతఁడు లేచిపోయినతరువాతఁ గొంతసే పభాగ్యురాలయిన యాచిన్నది యేమిచేయుటకును తోఁచని దుః వ్యాకులపడుచు నిర్హే తుకముగా భర్త తనయం దనుమాన పడినందున కద్భుతపడి యింతలో మనోవ్యాకులతచేత కన్నులు మూఁతపడ నారంభింపఁగా తనపరిచారి కను పిలిచి గదిలో పక్క వేయుమని చెప్పి, పెద్దలు తమబిడ్డలక్షేమ మును గోరి వారిని శిక్షించునట్లే భర్త తన మేలుకొఱకే తనమీఁద కోపపడెనని తలఁచుచు గదిలోనికిఁబోయి భర్తయొక్క రాకను ప్రతీ క్షించుచు మంచముమీఁద పరుండి యామె నిద్రపోయెను. ఆచిన్నది వయస్సుచేత పెద్దదేయయినను నిర్దోషిత్వముచేత నిజముగా పసిబిడ్డయే యగుటకు సందేహము లేదు.

ఆమె మనోవైకల్యముచేత మేను మఱచి యలసి నిద్రపోయిన తరువాత ప్రభాకరుఁడు తన భార్యప్రాణములు తీయవలె నన్నపాప చింతతో దృఢనిశ్చయుఁడయి గదిలో ప్రవేశించెను. కాని యతఁడు పాన్పుచేరి సుఖనిద్ర పొందియున్న భార్యయొక్క మొగమును చూచి నప్పుడు పుష్పకోమలమయిన యామెసుందరకాయమును తన బాకుతో పొడిచి గాయపఱుప చేతులాడక, కొంతసేపు త్రొక్కటపడి, జారత్వ శంక యాతనిగుండెను రాయిచేయఁగా పాపనిశ్చయుఁ డయి కడసారి యొక్క ముద్దు పెట్టుకొనెద నని యామెచెక్కులు ముద్దుగొని చిరకాల స్నేహము చేసిన దోషముచేత మరల జాలిగుండె గలవాఁ డయి కన్నులనీరు జాలువాఱ పెద్దపెట్టున నేడ్చెను. ఆయేడుపుతోను ముద్దు తోను పద్మిని మేలుకొని ప్రాణనాథుని మొగమువంకఁ జూడఁగా నతఁ డామెను కన్నులెఱ్ఱచేసి చూచి పండ్లు పటపటఁ గొఱికెను. ఆచూ పవాయకర మని యెఱిఁగి భయపడి యాయుత్తమాంగన తత్తరపడు

చుండఁగా, ఈశ్వరునిప్రార్థించి చావునకు సంసిద్ధురాల వయి యుండ వలసినదని యతఁడు భార్య కాజ్ఞాపించెను. ఏదోషము నెఱుఁగని యాయిల్లాలు కరుణింపవలసిన దని వేఁడుచు తనదోష మేమో తెలుప వలసిన దని భర్తను ప్రార్థించెను. అంతట నతఁడు మిత్రపాలునిపేరు చెప్పి రుమాలు నతని కిచ్చినవార్త యేకరువుపెట్టి తననిర్దోషిత్వమును తెల్లముచేయుటకయి యామె యేమో పలుకఁబోవుచుండఁగా, ఆమా టలను విననొల్లక దురాగ్రహావేశముచేత నుచితానుచితవివేకము చెడినవాఁడయి యామెకంఠము రెండుచేతులతోను గట్టిగా పట్టుకొని మెడపిసికి చంపెను.

ఆనిమిషమునందే గాయమునుండి నెత్తురు కారుచుండఁగా మిత్రపాలుఁడు లోపలికి పరుగెత్తివచ్చెను. అతనినిపొడిచి చంపుట కయి దుష్టబుద్ధి తనసేవకుని నొక్కని నియమింపఁగా వాఁడాతని గాయపఱిచినను చంపుటకు శక్తుఁడు కాకపోయినందున తనదుర్న యము బయలఁబడునన్నభీతిచేత వానిని దుష్టబుద్ధి చంపివేసెను. ఘాతుకుఁ డయినయాసేవకుఁడు మిత్రపాలుని పొడిచి పరుగెత్తు చుండఁగా కొందరలో కొన్నికాగితములు వానిబట్టలలోనుండి జాఱి పడిపోయెను. అట్లు పడిపోయినయుత్తరములను చదివిచూడఁగా దుష్టబుద్ధియే దోషి యగుటయు మిత్రపాలుఁ డేపాపము నెఱుఁగని నిరపరాధి యగుటయు సందేహలేశ మయినను లేకుండునట్లు బట్ట బయలయ్యెను; అప్పుడు ప్రభాకరునికి క్షమార్పణము చేయుటకొఱ కును తన్ను చంపుమని దుష్టబుద్ధిని ప్రేరేపించుటకు తానేమి యప రాధము చేసెనో యడిగి తెలిసికొనుటకొఱకు మిత్రపాలుఁ డక్క డకువచ్చెను. ఆయుత్తరములు బయలఁబడినవార్తప్రభాకరుని హృద యమునకు శూలమువలెనాటి దుర్భరవేదనను గలిగింపఁ జొచ్చెను.

అప్పు డతనిదృష్టికి తనభార్య యాజ్ఞామాత్రమునుద్రోహచింత యెఱుఁగని పరమపతివ్రత యగుటయు తానే క్రూరచిత్తుఁడయినస్త్రీహత్యా పాతకుఁడగుటయు స్పష్టముగా కానఁబడెను. అట్లు స్వదోష దర్శనము వలననయిన దురంతసంతాపముచేత నాతనికి ప్రాణధారణము మహాభారమయినందున భార్యనుపొడువవలెనని తెచ్చుకొన్న బాకుతో తాను పొడుచుకొని చచ్చిపడియున్న భార్యమీఁద పడి మందభాగ్యుఁడయిన యతఁడు ప్రాణములు విడిచెను.

ఆదంపతుల మరణమును విన్నప్పుడాద్వీపములోనివారందఱును తమ కుటుంబములోనివారు మృతులయినట్లు దుఃఖించి, వారి గుణసంపదను సహస్రముఖముల ఘోషించుచు, వారలమృతికి కారకుఁడయిన దుష్టబుద్ధినిపట్టి యధికారులకొప్పగించి యతనిని చిత్రవధ చేయుఁడని వేఁడుకొనిరి. అధికారులును క్రూరకిరాతుఁడయిన యాదుష్టబుద్ధి కర్హమయిన మరణదండనము విధించి, తమ సేనాధిపతి పరలోకగతుఁ డయినదుర్వార్తను దుష్టబుద్ధిశిరశ్ఛేదము చేయించిన వార్తను పాండ్యరాజునకు లేఖవ్రాసి మధురాపురమునకుఁ బంపిరి. దుష్టుల కుతంత్రములను నమ్మి యనాలోచితముగా చేయుసాహసికకార్యములవలన నిట్టియనర్థములు ప్రాప్తము లగునని తెలిసికొని యెల్లవారును చింతిల్లిరి.

---

బాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

## స్త్రీల కుపయోగించుకథలు -

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

## స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రహాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరి ప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని
ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహములు
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము.
11 విద్యాధురీణుల యర్హా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము

23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము

24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

## ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

## సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

## ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్ర కవులు
2 మధ్యకాలపు కవులు
3 ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

కాన్ఫ్ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము. 1950

# మాలతీమధుకరము



గ్రంథకర్త:

కందుకూరి వీరేశలింగము పంతులు

ప్రకాశకులు:

హితకారిణీ సమాజము

రాజమహేంద్రవరము

1950

[వెల రు. 0-5-0

శ్రీ త్రిశేషు శైవ రావుబహద్దూరు
## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

---

### ప్ర హ స న ము లు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్ర॥
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్ర॥
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్ర॥
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నా ట క ము లు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్నిమిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వ చ న ప్ర బం ధ ము లు

### ప ద్య కా వ్య ము లు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము
5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పథికవిలాసము
9 జాన్ గిల్పిన్
10 [illegible]

# మాలతీమధుకరము



గ్రంథకర్త:
కందుకూరి వీరేశలింగం పంతులు



ప్రకాశకులు:
హితకారిణీసమాజము
రాజమహేంద్రవరము
**1950**

కాపీరైటు

# ఈ నాటకమునందువచ్చు పాత్రములు

పురుషులు

౧. ప్రతాపరుద్రుఁడు—రుద్రవరపువారి కుటుంబమునకు పెద్ద; మాలతికి తండ్రి.

౨. మధుకరుఁడు—గణపతిదేవుని కుమారుఁడు; మాలతి భర్త.

౩. మిత్రవిందుఁడు—మధుకరునిమిత్రుఁ డగురాజపుత్రుఁడు.

౪. కామపాలుఁడు—మధుకరుని చెలికాఁ డగురాచకొమారుఁడు.

౫. భీమవిక్రముఁడు—రుద్రవరపువారి కుటుంబములోఁ జేరిన రాజకుమారుఁడు.

౬. గణపతిదేవుఁడు—గణపవరపువారి కుటుంబమునకు పెద్ద; మధుకరుని తండ్రి.

౭. శంకరవర్మ—మాలతినివివాహమాడఁదలఁచిన రాజకుమారుఁడు.

౮. బసవనారాధ్యుఁడు—మాలతికిని మధుకరునికిని రహస్యముగా వివాహము చేసిన యాచార్యుఁడు.

స్త్రీలు

౧. మాలతి—ప్రతాపరుద్రుని కూఁతురు, మధుకరునిభార్య.

౨. రతిసుందరి—మధుకరుఁడు మొదట కామించిన యువతి.

# మాలతీమధుకరము

కాశికాపురమునందు రుద్రవరపువారనియు గణపవరపువారనియు మహాధనికులయి శైవమతస్థులయిన రెండు క్షత్రియ కుటుంబములవారు గలరు. ఈరెండుకుటుంబములవారికిని చిరకాలమునుండి కుటుంబకలహమొకటి యుండెను. అది యెంతకెంతకు ముదిరినందున నుభయకుటుంబములవారును పరస్పరద్వేషమును వహించి యాకస్మికముగా వీధిలోఁ గనఁబడినప్పుడు సహితము తిట్టుకొనుచు నొండొరులతోఁ బోరాడుచుండుటయే కాక యొకకుటుంబములోని వారిసేవకుఁ డింకొకకుటుంబములోనివారిసేవకునితో సమావేశమయినప్పుడు వాండ్రును గర్భశత్రువులవలె కయ్యము లాడుచుందురు. ఈకయ్యములవలన తఱుచుగా నడివీధులలో సహిత మల్లరులుజరుగుచుండును.

ఇట్లుండఁగా రుద్రవరపువారియింట నొక మహేశ్వరవ్రతము తటస్థించినందున గృహయజమానుఁడయినవృద్ధప్రతాపరుద్రుఁడొక్క గణపవరపువారినిదక్క గ్రామములోని స్వజాతివారిని పిన్న పెద్దల నందఱిని విందుకు పిలువఁగా, ఆసమారాధనమునకు క్షత్రియశ్రేష్ఠులందఱును వచ్చిరి. రుద్రవరపువారియింట జరగిన యాయుత్సవమునకు గణపవరపువారికుటుంబమునకు పెద్దయైన గణపతిదేవునికుమారుఁడగు మధుకరునికి ప్రేమాస్పదురాలయిన రతిసుందరియను మహారూపవతియగు రాజకన్యకూడ వచ్చెను. ఆరాత్రి యావేడుకసమయమునం దాయింట మొగముచూపుట గణపవరపువారివంశమునఁబుట్టినవాని కెవ్వనికయినను ప్రాణాపాయకరమైనను మధుకరుని ప్రియసఖుఁ

డయిన మిత్రవిందుఁడతనిని ప్రియురాలయినరతిసుందరిని సావకాశముగా నచ్చటచూడవచ్చునని బోధించి, అక్కడకుఁ బోయినపక్షమునఁ దానింతవఱకును రాజహంసయని భ్రమించుచున్న సుందరిని కాకినిగాఁ జేయఁజాలిన నిరుపమాన రూపవతులను నేత్రోత్సవముగా దర్శింపవచ్చునని చెప్పి మారువేషములో నచ్చటికిఁ బోవునట్లు ప్రోత్సాహపఱచెను. తనహృదయేశ్వరికంటెను లోకములో చక్కనివారుందురన్నవిషయములో మిత్రవాక్యమునం దంతగా విశ్వాసము లేనివాఁడయినను, రతిసుందరియందుఁగల ప్రేమాతిశయము చేత మధుకరుఁ డారాత్రి యాయుత్సవగృహమునకుఁ బోవ నిశ్చయించుకొనెను. మధుకరునకు రతిసుందరిమీఁదఁగల యనురాగ మవ్యాజమయినది; అతఁ డాకన్యమీఁది మోహాతిశయముచేత నిష్టపదార్థానుభవము సహితము మానివేసి కంటిమీఁద ఱెప్పవాల్పక రాత్రులు స్వప్నములో సహిత మామెనే పలవరించుచుండును. అయినను రతిసుందరిమాత్ర మతనియందు మోహములేనిదయి యాతని దీనవాక్యములు పెడచెవిని బెట్టి యాతనిప్రార్థన నంగీకరింపకుండెను. మిత్రవిందుఁడు తనచెలికాని తలకెక్కిన వలపునెట్లైని నాఁటిరాత్రి విందుకువచ్చిన యసమానలావణ్యవతు లయిన రాజయువతులముఖచంద్రదర్శనలాభముచేత మాన్పవలెనని తలఁచుకొనెను. భోజనములయిన తరువాత గంధతాంబూలాదులిచ్చుచున్న సమయమునందు మధుకరుఁడు తన మిత్రులయిన మిత్రవిందునితోను కామపాలునితోను గలిసి యచ్చటికిఁబోయి రాజబృందములోఁ గూరుచుండెను. వృద్ధుఁ డయిన ప్రతాపరుద్రుఁడు తక్కిన వారితోడఁగూడ వారిని సహితము గౌరవించి యతిథిసత్కారము చేసెను. తాంబూలాది సత్కారము లన్నియుముగిసిన తరువాత నుల్లాస పురుషుఁడయిన

యాగృహయజమానుఁడు క్షత్రియులలో నాకాలమునందుఁగల దేశా చారమునుబట్టి వివాహములుకాని రాజకుమారులును రాజకుమారి కలును గలిసి నృత్యవినోదము జరుపవలసినదనికోరెను. పెద్దవాని మాట తీసివేయక యచ్చటికన్యలును బ్రహ్మచారులును గలిసి నృత్య మునకారంభించిరి. అప్పు డచ్చట నృత్యము చేయుచున్న సుందరీమణు లలో నొకలావణ్యవతీరత్నము సభాభవనమునందు దేదీప్యమానముగా వెలుఁగుచున్న దీపపుంజమునకెల్ల నూనెనతాంతిని కలిగించుచున్నట్లు రాత్రియం దసమానప్రభాభాసమానముగా బ్రజ్వరిల్లుచున్నజ్యోతిర్లత యనునట్లును దృష్టిని మిఱుమిట్లుగొలుపుచు మధుకరునికి నేత్రోత్స వము చేయఁగా నతఁడు తనలో "మానవనేత్రముల కపూర్వపర్వ మొనర్చుచు భూలోకమునం దదృష్టశ్రుతపూర్వవిలాసవతిగాఁ గనఁ బడుచున్న సౌందర్యరాశియైన యీసుందరీమణియొక్కముఖచంద్ర బింబము చక్కనిచుక్క లనఁదగిన యీకాంతామణులమోముఁ దమ్ములెల్ల వెలవెలఁబాఱునట్లు చేయుచు బకబృందములోని హంసను వలె వీరిలో మెలఁగుచు నందఱిని మించుచున్నది!" అనుకొనుచు నాశ్చర్యపడఁజొచ్చెను. అప్పు డక్కడ నున్నప్రతాపరుద్రుని తమ్మని కొమారుఁడయిన భీమవిక్రముఁ డాతనికంఠస్వరము నానవాలుపట్టి దగ్గఱవచ్చి మొగమువంకఁజూచెను. ఈభీమవిక్రముఁడాగ్రహస్వభావుఁ డగుటచేత శత్రుకోటిలోనివాఁడుగా పరిగణింపఁబడుచున్న మధు కరుఁడు తమయింటికి వచ్చుటచూచి సహింపలేక, "ఇటువంటిమహో త్సవసమయమునందు పరమపవిత్రమయిన మాగృహమునుదొంగవలెఁ జొచ్చి యీపాపాత్ముఁ డపవిత్రము చేయుచున్నాఁడు" అని కేకలు వేయుచు, మధుకరునిఁ గొట్టఁబోయెను. ఈలోపల వృద్ధుఁ డయిన ప్రతాపరుద్రుఁడు వచ్చి యడ్డుపడియుండనిపక్షమునదురాగ్రహవ్యగ్రుఁ

డయియున్న యాభీమవిక్రముఁ డాతనిప్రాణములు గొని పాపము కట్టు కొని యుండునుగాని, యుక్తసమయమున నావృద్ధగృహస్థుఁ డడ్డు చొచ్చి భీమవిక్రముని వారించి మధుకరుని కేమియునపాయముకలుఁగ కుండఁజేసి యాతని నావలికిఁ బంపివేసెను. అటువంటి సంతోషసమ యమునందు తనయింట దుష్టకృత్య మొకటి జరగుట మంగళప్రదము కాదని భావించినవాఁ డగుటచేతను, గ్రామమునం దెల్లవారును నేక గ్రీవముగా మధుకరుని గుణసంపదను వేయినోళ్ళ శ్లాఘించుచుండఁగా నిత్యమును వినుచుండుటనుబట్టి యట్టియుత్తమబాలుని కాపత్తు సంభ వించుట యిష్టములేనివాఁ డగుటచేతను, ప్రతాపరుద్రుఁ డాపడుచు వానిసాహసకృత్యమును మాన్పెను. అయినను భీమవిక్రముఁడు మాత్రము తానప్పటికి కొంతశాంతసంరంభుఁడయ్యెను మనస్సులోని రోషావేశమును విడువక, "యింకొకసారి యీదుష్టుఁడు వీధిలో నాకంటఁ బడినప్పుడు వీనికండగర్వ మడంచి యనాహూతముగా శున కమువలె మాయిల్లుచొచ్చిన పాపఫల మనుభవించునట్లు చేసెదను" అని శపథములు పలుకుచు నాక్రోశించుచు నావలికిఁ బోయెను.

నాఁటిరాత్రి నృత్యోత్సవ మయినతరువాత మధుకరుఁడు లేచి యుండి యాసుందరీతిలక మొంటిగా మందమందగమనముతో లోనికిఁ బోవుచు నెవ్వరినో యెదురుచూచుచు నిలుచున్న సమయమునందు తడఁబాటుగల చరణములతో మెల్లమెల్లఁగా భయపడుచు నడిచి మార్గములో మధుకరుఁ డామెను తారసించి, మహాసాహసముతో నామెహస్తగ్రహణముచేసి, 'ఓభాగ్యదేవతా! నేను నీకు పరమభక్తు డను. నీదివ్యసుందరవిగ్రహము నాకరస్పర్శనముచేత మైలపడెనని నీవు భావించిన పక్షమున, పాపపరిహారార్థముగా దాసుఁడనైన నేనుమనః పూర్వకమైన సంపూర్ణప్రేమతో నీకరకమలము ముద్దుగొని పాప

విముక్తుఁడ నయి నీయనుగ్రహమువలన పావనుఁడ నయ్యెదను." అని మృదుమధురస్వరముతో దీనముగా పలికెను, "ఓభక్తాగ్రగణ్యుఁడా! నీవర్తనము చూడఁగా నీవు నాయెడల నవ్యాజప్రేమమును సంపూర్ణ విశ్వాసమును కలవాఁడవుగాఁ గనఁబడుచున్నావు. దేవతలకును హస్తములున్నవి; భక్తులు వానిని తాఁకవచ్చునుగాని ముద్దుపెట్టు కొనరాదు." అని యాకన్యారత్న ముత్తరమిచ్చెను. "దేవతలకు వలెనే భక్తులకును పెదవులు లేవా?" అని మధుకరుఁడు ప్రశ్న వేసెను. 'ఉన్నను వారా పెదవులను దేవతాప్రార్థనమునం దుపయోగించ వలెను.' అని యామె యుత్తరము చెప్పెను. "అట్లయినపక్షమున, నాపాలిటి యోదేవతాతిలకమా! ఇదె నిన్ను నేనుప్రార్థించు చున్నాను. నాప్రార్థన మంగీకరించి యభీష్టవరప్రదానముచేసి యీ భక్తునిప్రాణరక్షణము చేయుము" అని మధుకరుఁడు వేఁడుచుండెను. అతఁడీప్రకారముగా లోనియనురాగమును తేటపఱుచుమాట లను చుండఁగా నింతలో తల్లి వచ్చి యాచిన్నదానిని లోనికిఁ దీసికొని పోయెను. ఆచిన్నది తనదృష్టిపథముదాఁటియగోచరయయినతరువాత నతఁ డాయువతీమణి యెవ్వరని పరివారము నడిగి, మదనునిసమ్మో హనమంత్రాధిదేవతలవలెఁ దన హృదయము నపహరించి యవశము చేసిన యాకాంతామతల్లి గణపవరపువారివంశమునకంతకు గర్భశత్రు వుగా నెంచఁబడుచున్న ప్రతాపరుద్రుని ముద్దులకూఁతురగు మాలతి యని తెలిసికొనెను. తనశత్రువుయొక్క పుత్రికమీఁద తనమనస్సు తగిలిన దన్నపిడుగువంటి యాదుర్వార్తవలన నాతనిమనస్సు సంక్షోభ పడెనుగాని యాతని మనస్సులోని యనురాగమునుమాత్ర మావగింజం తయు తగ్గినదికాదు. దర్శనమాత్రముచేత మధుకరునికి మాలతి మీఁద ననురాగాతిశయమెట్లుకలిగినదో యట్లేమాలతికిని ప్రథమ

దర్శనమాత్రయచేతనే మధుకరునిమీఁద ననివార్యమైన దృఢాను రాగము కలిగెను. తనమనస్సు నాకర్షించిన సుందరపురుషుఁడు తన పుట్టినింటివారికి పగవారయిన గణపవరపువారి వంశపువాఁడయిన మధుకరుఁడని తన పరివారమువలన నెఱుఁగుట చేత, మాలతియు కలఁగఁబాఱిన మనస్సుతో మిక్కిలి పరితాపపడుచు నాఁటికి కన్ను లకు నిద్రరాక వేఁగుచుండెను. ఆమె యట్లు వ్యాకులహృదయయయి మేడమీఁది గదిలోనికిఁబోయి తనజననదోషమునుబట్టి ద్వేషింపవల సినవానినే నిర్వ్యాజానురాగముతో తనమన స్సభిలషించి మరల కుండుట యీశ్వరఘటనముకదాయని తలపోయుచు, గవాక్షము తెఱచి తోఁటవంకఁజూచుచు చల్లగాలికి నిలువబడెను.

అప్పటికిరాత్రి రెండుయామములయినందున మధుకరుఁడు తన మిత్రులతోఁగూడ బైలుదేఱెనుగాని తనహృదయమును విడిచిపెట్టి వచ్చినగృహమునువిడిచి దూరము పోలేక వీథిలో కొన్ని యడుగులు నడిచిన తరువాత నాకస్మికముగా మనమిత్రుల నేమఱించి మాలతి మేడకు వెనుక నున్నతోఁటలోనికి చిన్నగోడమీఁదుఁగా దుమికి యదృశ్యుఁడయ్యెను. అతఁ డక్కడ తన నూతనప్రియురాలిని తలఁచు కొని చింతించుచు, కొంతసేపటికి తలయెత్తిచూచునప్పటికి మీఁదుగా గవాక్షములోనుండి తూర్పుకొండమీఁద నుదయించుచున్న బాలా ర్కబింబమువలె సంపూర్ణకాంతితో మాలతియొక్క ముఖబింబ మాతనిదృష్టికి గోచరమయ్యెను; అతిశయకళాపరిపూర్ణమైన మాలతి యొక్క ముఖబింబమునుజూచి సిగ్గుపడి తలఁదాచుకొనుటకు పాఱి పోవుచున్నాఁడేమో యనునట్లు కళావిహీనుఁడయి చంద్రుఁ డాసమ యమునందు పశ్చిమమున నస్తమించుచుండెను. చెక్కిట చెయ్యి చేర్చుకొని యామె నిలువఁబడియుండఁగాఁ జూచి యతఁడప్పుడు తన

కామె వ్రేలిముద్దుటుంగరమయిన నయి జన్మించెడు భాగ్యములభించిన పక్షమున తానామె మెఱుఁగుచెక్కులను చుంబించి ధన్యుఁడనగుదును గదాయని తన మందభాగ్యతకు వగచుచు నిట్టూర్పులు విడుచుచుండెను. ఆసమయమునందు తానొంటిగా నున్నాననుకొని యాచిన్నది మిన్నుచూచి "హా! దైవమా" యని యొక వేఁడి నిట్టూర్పు పుచ్చెను. ఆమె కంఠమునుండి వెలువడిన హృదయరంజకమయిన మృదుమధుర స్వరము చెవినిబడఁగానే యతఁడు దేహము పులకింప సంతోషపర వశుఁడయి తన శ్రవణములకు సంగీతముకంటెను శ్రావ్యతరముగా నున్న యావాగమృతపానము నింకను జేయవలెనన్న యుత్కంఠతో "సౌభాగ్య దేవతా! ఇంకొకసారి తేనెకన్నను మధురముగానున్న నీవా గమృతధారను చిలికి యాఁకలికొనియున్న నావీనులకువిందు చేయుము. నీవాకాశమునుండి మేఘములలోని మెఱుపుదీఁగవలె తళుకుతళుక్కన వెలుఁగుచు నిజముగానే నాదృష్టికి భూమిని పవిత్రముచేయ నవతరించిన దేవతాకన్యవుగానే కనఁబడుచున్నావు" అని హీనస్వరముతో నామెకు వినఁబడకుండఁపలికెను. ఆమెయు తనమాటలన్నియు విను చున్నారని లేశమైన నెఱుఁగని దయి, ఆరాత్రి కామదేవుఁడు తన హృదయములో రవులుకొలిపి ప్రజ్వరిల్లఁ జేసిన కామాగ్ని యుద్రేకించి పూర్ణముగా వెలుఁగుచుండఁగా తన హృదయము నపహరించి స్వవశము చేసికొన్న పురుషుఁడు విన్నుఁబాసిపోయె నన్న విశ్వాసముతో "ఓమధుకరా! ఓమధుకరా!" అని పిలిచి "నీవు మధుకరుఁడ వేల యైతివి? నానిమిత్తము నీవా పేరు మార్చుకొని మఱియొక వంశము వాఁడవుకమ్ము. నీవాపనిచేయ లేకపోతివా నీవు నాయెడల బద్ధానురాగము కలవాఁడవుకమ్ము; నేనే నాపేరుమార్చుకొని నేను రుద్రవరపువారి చిన్నదానిని కాకుండెదను." అని కామోన్మత్తయై పలి

కెను. ఇట్లాశగలుగ పలుకుటవలన మధుకరుఁడు మహోత్సాహము గలవాఁడయి మాఱుపలుకఁ దలఁచెనుగాని కర్ణరసాయనముగానున్న యామె మధురవాక్యములవలన తనివి తీఱక యింకను వినవలెనన్న యాశ గలవాఁడయి యూరకుండెను. మాలతియు మరల వెనుకటి ధోరణినే వలపు తేటపఱు పలుకులు పలుకుచు గణపవరపువారియింట బుట్టి మధుకరనామమును ధరించినందున కొతని నిందించుచు, అతఁ డాపేరు తీసివేసి వేఱొకపేరు పెట్టుకొన్న బాగుండునని వెడ కోరికలు కోరుచు పుట్టుకతో లేక నడుమవచ్చిన యాపేరొక్కటి లేకపోయిన పక్షమున తా నాతనిధనము నగుదునుగదా యని యుస్సురనుచు, కామోద్రేకముచేత పలువిధములఁ దనలోఁదాను ప్రలపింపఁజొచ్చెను. ఈకడపటిమాట యమృతపాతమువలె చెవిసోఁకఁగానే యతఁడు మనసుపట్టలేక, తనలో తాననుకొన్నట్లుగాక యామాటలన్నియు తన్నుద్దేశించియే పలికినట్లు భావించుకొని, యుచ్చైఃస్వరముతో "ఓప్రాణేశ్వరీ! హృదయవల్లభాయని కాని నీయిష్టమువచ్చిన మఱి యొక పేరుతోఁగాని నన్ను పిలువుము. ఇప్పటిపేరు నీకు రుచింపని పక్షమున, నేను నేఁటినుండి మధుకరుఁడనుకాను" అని పలికెను. క్రిందితోఁటలోనుండి యెవ్వనిదో పురుషుని కంఠస్వరము చెవిని బడఁ గానే యులికిపడి మాలతి భయోత్కంపయయి, అర్ధరాత్రమప్పుడు పరులెవ్వరో చీఁకటిలో పొంచుండి తనగుట్టును తెలిసికొనిరని కొంత సేపు త్రొక్కటపడెనుగాని యింతలో నతఁడు మరల మాటాడనారం భింపఁగా గానరసమువలె నాహ్లాదకరముగా చెవులుసోఁకుచున్న పలు కులు పదిమైనను పూర్ణముగా నాతనినోటినుండి వెలువడకమునుపే యతఁడు మధుకరుఁడని తెలిసికొని స్వక్షేమమును జూచుకొనక తోఁటగోడదుమికి యపాయకరమయిన సాహసకార్యము చేసినందున

కాతని మందలించి, నాదాయాదులెవ్వరయిన నిన్నిక్కడఁజూడ తట స్థించినపక్షమున గణపవరపువంశసంజాతుఁడ వగుటచేత నీప్రాణముల మీఁదికి వచ్చునుగదాయని విచారపడెను. "ఓప్రాణేశ్వరీ!అటువంటి వారి యిరువంద్రయొక్క యసంఖ్యములైనవాఁడితూపులలోకంటెను నీయొక్కదానియొక్క రెండువేఁడిచూపులలో నాకెక్కువయపాయ మున్నది. నీవొక్కదానవు నన్ను చల్లనిచూపునఁ జూచితివా, వారం దఱి వైరమును నేను లక్ష్యముచేయను. నీకటాక్షవీక్షణప్రసారము లభింపకపోవుటచేత దుర్భరముగా తోఁచెడు నాబ్రతుకు దీర్ఘమగుట కంటె వారిద్వేషముచేత హ్రస్వమగుటయే మంచిది." అని యతఁడు పలికెను. "ఈస్థలమునకు నీవెట్లువచ్చితివి? నీకు దారిచూపినవారెవరు?" అని మాలతి యడిగెను. "నా కిక్కడకు దారిచూపినవాఁడు కామ దేవుఁడు. నేను కర్ణధారకృత్యము నెఱుఁగనివాఁడ నయినను నీవు సముద్రాంతమంత దూరముననుండఁ దటస్థించినను నేను నీవంటి యమూల్యపదార్థ సంపాదననిమిత్త మోడనడుపుకొనుచు మహా సముద్రమును దాఁటుటకును సాహసించియుందును" అని మధుకరుఁ డుత్తరము చెప్పెను. ఆమాటకెక్కడినుండియో క్రొత్తసిగ్గొకటివచ్చి యామెముఖమునాక్రమించి నిమిషకాలము చెక్కులయందు వెల్ల పాటు కలిగించెను గాని చీఁకటియగుటచేత నాతనిదృష్టికి మాత్ర మావింతసోయగము గోచరముకాలేదు. అప్పుడు తొందరపడి తన మనస్సాతనికి తెలిపి చేలనైతినిగదాయని యామె మనస్సులో నొకవిధ మైన యనుతాపము కలుగనారంభించెను. పనిమించినతరువాత నిప్పు డేమి యాలోచించినను కార్యములేదు. ఒక్కసారి నోటినుండిజాఱిన పిమ్మట తానన్నమాటలను మరలించుకోవలెనన్నను సాధ్యముకాదు; రాజకన్యలలోఁగల యాచారానుసారముగా ప్రియున కొక్కపట్టున

మనసియ్యక తానుపేక్షాపరురాలయినట్లు నటించుచు, తనహృదయములో గాఢానురాగమున్నను వెలిపుచ్చక తాను సులభముగా లోఁబడినచో విభునిమదికి చులుకనయ్యెదనో యనుభయమున వస్తువెంత కష్టసాధ్యమయిననంతయమూల్యమగు నన్న న్యాయమున నాతనినిప్పుడు చిక్కులుపెట్టవలెనన్నను, ఆశలఁబెట్టి వేఁచుటకుఁగాని యాలస్యముచేయుటకుఁగాని యిప్పుడవకాశములేదు. తన నోటినుండివచ్చిన మాటలను ప్రత్యక్షముగా చెవులార మధుకరుఁడు తానే వినెను; తానెదుటనిలిచి ప్రత్యుత్తర మిచ్చుచున్నప్పుడు తానామాటలను నిద్రయందు స్వప్నములోపలవరించుచున్నదని యతఁడు భ్రమింపఁజాలఁడుగదా! ఈయాలోచనలన్నిటిచేతను మాలతి మర్మము విడిచి నిష్కపటముగా తనమనస్సులోనున్నది యొప్పుకొని, వలపుగలిగినచో వినసొంపుగాని మాటయు శ్రావ్యమగునుగాన "నాజీవితేశ్వరుఁడవైన యోమధుకరా!" అని పిలిచి, "నే నయత్నలభ్యురాలనయిన తప్పిదమునుబట్టి నన్ను చపలస్వభావురాలినిగా భావించెదవుసుమా! అది నిజమయినదోషమేయైన పక్షమున, ఆదోషము మనలనిద్దఱిని దైవయోగముచేత నొక్కచోటఁగూర్చి నాలో నేననుకొన్న మాటలను నిన్ను వినునట్లుచేసిన యీనిశాకాంతదిగాని నాదికాదు. మారాచకన్నియలలోఁగల యాచారమునుబట్టి యిప్పుడు నావర్తన మొకవేళ నీదృష్టికి వివేకకార్యముగా కనఁబడకపోవచ్చినను పయికి వివేకమును నటించుచు హృదయములోలేని మాయవినయము లభినయించెడు సుందరులలో ననేకులకంటె నేనే యధికానురాగముగలదాన నని నావర్తనమునుబట్టి ముందు తెలిసికోఁగలవు." అని పలికెను.

ఆమెకుఁగల యకృత్రిమానురాగమువిషయమయి యణుమాత్రమును తనమనస్సులో నేమూలను సందేహలేశమయినను లే

దనియు తానిప్పుడు కనిపెట్టిన నిష్కపటప్రవర్తనమువలనఁ దనకామె మీఁద గౌరవాధిక్యమే కలిగినదికాని లాఘవచింత యావగింజంతయు కలుగలేదనియుఁ జెప్పి యతఁడేదో యొట్టుపెట్టుకొనఁబోవుచుండఁగా, ఆమె యాతని నొట్టుపెట్టుకోవల దని వారించెను. ఆమె కాతనియం దెంత దృఢానురాగము కలిగినను, నాఁటిరాత్రియే యొడంబడిక చేసికొనుటమాత్ర మామెమనస్సున కంత సంతోషకరముగా లేదు. తొందరపడి వాగ్దానముచేయుట యనాలోచితముగాను, మహాసాహసిక కార్యముగాను, అత్యాకస్మికముగాను, ఆమెబుద్ధికి స్ఫురించెను. అయినను మధుకరుఁడు తనమీఁద నామెకుఁగల ప్రేమాతిశయము మాఱునది కాదని శపథము పలుకవలసినదని ప్రార్థింపఁజొచ్చినందున, మాలతి యాతనిప్రార్థనను నిరాకరింపలేక తానతఁడు ప్రార్థింపక మునుపే తనమనస్సును స్పష్టముగా దెలిపితినని చెప్పి, తనప్రేమ సముద్రమువలె నపారమయినదగుటచే నాతనికి నూతనసంతోషమును కలిగించుటకయి తాను వెనుకనాడినమాటల నన్నిటిని త్రిప్పుకొని యనురాగరసమును తేటపఱిచెడి యామాటలనే యిప్పుడు మరల నుచ్చరించెదనని పలుకుచుండెను. ఇంతలో నెదురుగదిలో పరున్న దాది వచ్చి మాలతిని పిలిచి తెల్లవాఱుజాము కావచ్చుచున్నందున పోయి పరుండి నిద్రపొమ్మని చెప్పెను. మాలతి తనదాది కెదురుగాఁ బోయి యేదోమాట చెప్పి దానిని దానిగదిలోనికి సాగనంపి వేగిర పాటుతో మరలవచ్చి, రెండుమూడుమాటలతో నాతనిప్రేమ యకృత్రిమమయినదియు నాతనియుద్దేశము వివాహమును నయినపక్షమున వివాహముహూర్తనిశ్చయమునిమిత్తమయి తేపటిదిన మాతనియొద్ద కొకదూతను బంపెద ననియు, గాంధర్వవివాహమున నాతని చెట్టఁ బట్టిన తరువాత తానాతనికి పాదసేవకు రాలయి తనధనదేహప్రాణ

ముల నాతని కర్పించి తనప్రాణేశ్వరుని వెంట ప్రపంచమంతయు తిరుగ వలసి వచ్చినను తిరిగెదననియు వేగముగా తనయభిమతమును దెలిపెను. మాలతి నిద్రపోక తనలో తానేదో మాటాడుకొనుచున్నట్టు కనిపెట్టి దాది యామె నింకను నిద్రపోలేదేమని పలుకరించి పిలువఁ జొచ్చెను; ఆమె యాతని నొకపట్టున విడిచిపోవుటకు మనసు గొలుపనిదయి చిత్తముబ్బూఁతలూఁగ కామదేవుని యుయ్యాలవలె తానును మంచమువద్దనుండి గవాక్షమువద్దకు గవాక్షమువద్దనుండి మంచము వద్దకును మరలమరలఁ దిరుగుచు నడుమ నొక్కొకపలుకు పలుకుచు ముందుకును వెనుకకును కొంతసేపు రాకపోకలు చేయుచుండెను. మధుకరుఁడును ప్రియురాలిని విడిచిపెట్టలేక పరితపించుచుండెను. కాముకీకాముకుల చెవులకు రాత్రివేళల నొండొరుల సంభాషణములు మంజులగానామృతరసప్రవాహములకన్నను మధురతరములయి హృదయరంజకముగా నుండునుగదా! అట్లయ్యును వా రిరువురును పరస్పర సుఖసంతోషములను గోరుచు తుద కొండొరుల నెడఁబాయవలసినవారయిరి.

వారల్లెడఁబాయునప్పటికే తెల్లవాఱుజాము కావచ్చెను. మధుకరుని మనస్సంతయు రాత్రిజరిగినసమావేశముమీఁదను మాలతి మీఁదను నున్నందున నింటికిఁబోయి పరుండుటకు మనసుగొల్పక పురోహితుఁడైన బసవనారాధ్యుని చూచుటకయి యతఁడు తిన్నగా మఠమునకు నడిచెను. భక్తాగ్రేసరుఁడైన యాబసవనారాధ్యుఁ డప్పటికే నిద్రలేచి స్కాందపురాణము పారాయణము చేసికొనుచుండెను. ఆసమయమునందు మధుకరుఁ డక్కడకుఁ బోయి యాతనిని పేరుపెట్టి పిలువఁగా మధుకరుఁ డంత వేకువజామున తనవద్దకువచ్చుటకాశ్చర్యపడి పడుచువాఁ డగుటచేత కామచింతచేత రాత్రియంతయు నిద్రపట్టక

సంతాపించుచు తన్నేదో యాలోచన యడుగుటకయి వచ్చెనని యావృద్ధుఁ డనుకొనెను. ఆవృద్ధునియూహ కొంతవఱకు సత్యమేకాని యిప్పు డతనిప్రేమ కాస్పదమైనది బసవనారాధ్యుఁ డనుకొన్నట్లు రతిసుందరిమాత్రము కాదు. మధుకరుఁడు తనకు మాలతిమీఁదఁ గలిగినయనురాగాతిశయమును తేటపఱిచి యాదినముననేతమవివాహ కార్యమునకు తోడుపడవలయు నని ప్రార్థించినప్పు డావృద్ధాచార్యుఁడు తా నావఱ కాతనిపక్షమున రతిసుందరినిమిత్తమయి కృషిచేసి యుండుటచేత రతిసుందరి తన్ను నిరాకరించుచున్నదని యతఁ డనేకపర్యాయములువచ్చి మొఱ్ఱపెట్టఁగా వినుచున్నవాఁ డగుట చేతను నింతలోఁ గలిగినయీవింతమార్పున కత్యాశ్చర్యపడి "పడుచు వాండ్రవల పెప్పుడును కన్నులలో నుండునుగాని హృదయములో నుండదు." అని తలయూఁచెను. అందుపైని మధుకరుఁడు "తన్ను కామింపనిదానిని కామించుట బుద్ధిహీనత యని సెలవిచ్చి రతిసుందరి మీఁదిమోహమును విడిచిపెట్టవలసిన దని యీవఱకే మీరు నన్ను మందలించియున్నారుకదా? ఇప్పు డీమాలతి తనమీఁద నాకెంత యనురాగాధిక్యము కలిగియున్నదో నామీఁద నంతయనురాగాధి క్యము కలదిగా నున్నది. కాఁబట్టి కామతప్తులయి పరితపించుచున్న యీకాముకీకాముకుల నొక్కటిగాఁ జేర్చి మీరీపుణ్యము కట్టుకొనక తప్పదు." అని యాతనిని ప్రార్థించెను. అతఁడు చెప్పినహేతువునకు సమాధానపడి, మధుకరునకు మాలతితోడి వివాహమువలన చిరకాల మునుండి పరస్పరద్వేషమును వహించి గర్భశత్రువు లయి విడియున్న రుద్రవరపువారికుటుంబమును గణపవరపువారికుటుంబమును పూర్వ వైరమును మాని మిత్రు లయి యేకము కావచ్చునని మనస్సులో నాలోచించి తానుభయకుటుంబముల క్షేమమును గోరియున్నవాఁ

డగుటచేతను వారిలోవారికి పరస్పరవివాదములు తటస్థించినప్పుడు తా ననేకపర్యాయములు మధ్యవర్తిగా నుండి తగవులుతీర్చి వారి నేకముచేయుటకయి పలుమారులు కృషిచేసి విఫలమనోరథుం డయి యున్నవాం డగుటచేతను తా నీవిధముచేతనైనను మనోరథసిద్ధి పొందవచ్చునని యెంచి, కొంతవఱకు జాలిచేతను కొంతవఱకు మంచి వాండయినమధుకరునిమాట తీసివేయలేని మోమోటముచేతను వారి నిద్దఱిని వివాహబంధముచేత నొక్కటిగాం గూర్చుట కాయూచార్యుం డొప్పుకొనెను. అందుచేత నిప్పుడు మధుకరుండు ధన్యుం డయ్యెను. మాలతియు తానన్నమాటప్రకారముగా మఱునాంటియుదయముననే యొకదూతను బంపి దానివలన హృదయవల్లభునియభిప్రాయ మెఱింగి నాంటిరాత్రియే తిన్నంగా బసవనారాధ్యుం డున్నమఠమునకుం రాంగా, ఈవధూవరులు చిరకాలము సౌఖ్య మనుభవించు చుండవలె ననియు నీవివాహసంబంధమువలనవిద్యూలవారుచిరకాలాగతమయినకుటుంబ కలహములను విడిచి కలిసి సుఖింపవలయు ననియు నీశ్వరునిప్రార్థించి యావృద్ధుండు వారి కిరువురికిని తనయింట విధ్యుక్తముగా వివాహము జరపెను.

పెండ్లితంతు ముగియంగానే మాలతి మహావేగముగా నింటికిం బోయి, ప్రొద్దుపోయినతరువాత వచ్చి గతరాత్రివలెనే తోంటలోం గలిసికొనెద నని వాగ్దానముచేసిన భర్తయొక్కరాకను ప్రతీక్షించుచు మేడమీంద నుండెను. ప్రియాగమనమును కాంక్షించి యెదురుచూచు చున్న యాకాల మెంతసేపటికిని జరగక మాలతిమనస్సునకు క్షణ మొకమహాయుగముగా తోంచు చుండెను.

ఆదినముననే మధ్యాహ్నసమయమునందు మధుకరునిమిత్రు లయిన మిత్రవిందుండును కామపాలుండును పురవీధిలోం బోవు

చుండఁగా రుద్రవరపువారికుటుంబములోనివారు కొందఱు మహాగర్విష్ఠులైన భీమవిక్రముఁడు తమముందు నడువఁగా వారి కెదురుపడిరి. ఆరాత్రి ప్రతాపరుద్రుని యింట జరిగినయుత్సవసమయమునందు మధుకరుని కొట్టఁబోయినవాఁడు మహాకోపిష్ఠుఁ డయినయీభీమవిక్రముఁడే. అతఁడు కామపాలునిఁ జూచి గణపవరపువారివంశములోనివాఁ డయిన మధుకరునితో మైత్రి చేయుచున్నందుకై కొన్ని నిందామాట లాడెను. భీమవిక్రమునివలెనే కామపాలుఁడును వయసులోనుండి కండగర్వముగలకోపశీలుఁ డయినందున, వెనుకతీయక కొన్ని కఠినోక్తులు పలికి యామాటనికి తగినట్టుగా నుత్తరము చెప్పెను. మిత్రవిందుఁడు నడుమ వచ్చి మాటలు మితిమీఱఁబోకుండని యుభయులను వారించుచున్నను వారంతటితో నిలువక యొండొరుల మీఁదిక్రోధముతో వాక్కలహమున కారంభించిరి. వీరిట్లు కలహించుచున్నసమయముననే మధుకరుఁ డత్త్రోవను బోవుచు తటస్థించెను. అప్పుడు భీమవిక్రముఁడు కామపాలుని విడిచి మధుకరునివంకఁ దిరిగి "ఓరి చండాలుఁడా!" అని యవమానకరమైన పేరుతో నాతనిని పిలిచి తిట్టెను. మాలతీకన్యయి యామె యాదరమునకు పాత్రుఁ డయి యున్నవాఁ డను హేతువునుబట్టి మధుకరుఁడు సాధ్యమైనంతవఱకు భీమవిక్రమునితోడి జగడమును తప్పించుకొనుటకయి చూచెను. అంతేకాక తన మంచిస్వభావమునుబట్టి యావఱ కెన్నఁడును లౌకికసంబంధకలహములలో ప్రవేశింపనివాఁ డగుటచేతను మాలతితోడి సంబంధమునుబట్టి యిప్పుడు రుద్రవరపువారన్న యింటిపేరు కోపము పుట్టించునది గాక ప్రేమను బుట్టించునది యగుటచేతను మధుకరుఁడు "ఓ శాంతాత్ముఁడా!" అని పిలిచి భీమవిక్రమునితో మంచిమాటలాడ నారంభించెను. గణపవరపువారన్న యింటిపేరుగల వారినెల్లను తాఁచుపామును ద్వేషించునట్లు

ద్వేషించువాఁ డగుటచేత భీమవిక్రముఁ డాతనిమాటలు గణన సేయక కత్తి దూసికొని మీఁదికివచ్చి యుద్ధమునకు సిద్ధుఁ డయ్యెను. అప్పుడు కామపాలుఁడుతనమిత్రుఁడు భీమవిక్రమునితో సంధిగోరుటకుఁ గలరహస్యకారణమును తెలిసికొలేనివాఁడయి శత్రువు మీఁదికి వచ్చి నప్పుడు సహనమువహించి యూరకుండుట యవమానకరమైనపౌరుష హీనతగాభావించి తాను డీకొని తిట్టుచు ముందుకువచ్చి తనవెనుకటి కలహమును మరలత్రివ్వి భీమవిక్రముని తనతో యుద్ధమునకు రమ్మని పిలిచెను. మిత్రవిందుఁడును మధుకరుఁడును వలదని వారించుచున్నను వారాగక యొండొరులను కలియఁబడి కత్తులతో నఱుకులాడఁగా భీమవిక్రముని ఖడ్గఘాతముచేత కామపాలుఁడు నేలఁగూలి ప్రాణములు విడిచెను. మిత్రునిపాటుచేత శాంతతయంతయు పోయినవాఁడయి మధుకరుఁడు రోషావేశముతో "చండాలుఁడా!" అని తన్నాతఁడు మొదటపిలిచిన యవమానకరమైన పేరుతోనే మరల నాతనిని పిలుచుచుకత్తిదూసికొని భీమవిక్రమునిమీఁదికి నడిచి పోరాటములో నాతనితల యొక్కవ్రేటున నఱికి భూమికి బలిచేసెను. హత్యలకు మూలమయిన యీశుష్కకలహము పట్టపగలునడివీధిలో జరిగినందున కలహవార్తక్షణకాలములో నూరంతటను వ్యాపింపఁగా గుంపులు గుంపులుగా చూడవచ్చెడు జనసంఘముతోఁ గలిసి వృద్ధులయిన ప్రతాపరుద్రుఁడును గణపతిదేవుఁడును భార్యలతోఁ గూడ తామా స్థలమునకు వచ్చిరి. భీమవిక్రమునిచేత చంపఁబడిన కామపాలుఁడు తనకు బంధుఁడగుటచేత రాజాతని మరణవార్త వినఁగానే బయలు దేఱి రుద్రవరపువారికిని గణపవరపువారికినిగల కుటుంబకలహముచేత తనప్రజలకు పలుమాఱొత్తుడుకలుగుచుండుట తలఁచి యీవిషయములో దోషులుగా నేర్పడినవారిని మోమోటపడక రాజశాసనము

ననుసరించి కూ్రరముగా శిక్షింపలెనని నిశ్చయించుకొని యచ్చటకు వచ్చెను. అప్పుడు రాజు మొదటినుండియు నచ్చటినుండి జరిగినదెల్లను జూచుచుండిన మిత్రవిందునిఁ బిలిచి యీకలహకారణ మేమో తెలుపుమని యాజ్ఞాపించెను. అతఁడును సత్యమునుండి తొలఁగకుండ సాధ్యమైనంతవఱకు మధుకరుఁడు చేసినపని విశేషదోషయుక్తముగా కనఁబడకుండునట్లు జరిగినకథయంతయు రాజునకు విన్నవించెను. అప్పుడు ప్రతాపరుద్రుని భార్య దుఃఖార్ణవమగ్నురాలయి రాజుపాదములమీఁదఁ బడి, గణపవరపువారికి చుట్టమును మధుకరుని చెలికాఁడునయిన మిత్రవిందుని మాటలను పాటిగాఁబట్టక భీమవిక్రమునిఁ జంపినందునకయి మధుకరునికి తగినశిక్ష చేయవలసినదని దీనముగా వేఁడుకొనెను. ఆమె గాంగానినట్లు మిక్కిలిక్రూరముగా దండింపవలసినదని రాజును ప్రార్థించినప్పుడు తనయల్లుఁడనియు తన ముద్దులకూఁతురైన మాలతి యొక్క ప్రియవల్లభుఁడనియు నెంచు మాత్రమైన నెఱుఁగదు. ఆసమయముననే గణపతిదేవుని భార్యయు రాజయొక్క సమ్ముఖమునకువచ్చి, కామపాలునిఁ జంపుటచేత రాజశాసనమునుబట్టియో చావ వలసినవాఁడయి యున్న భీమవిక్రముని చంపుటచే తనకొడుకు దోషికానేరఁడని పలుకుచు కరుణించి యాతనికి ప్రాణదానము చేయవలసినదని రాజును దీనవాక్యములతో ప్రార్థింపజొచ్చెను. రాజావృద్ధాంగనల దీనాలాపములవలన లేశమును చలింపనివాఁడయి, నిష్పాక్షికబుద్ధితో సత్యమును పరిశీలించి మధుకరుఁడు కాశికాపురమునుండి వెడలిపోవునట్లు శిక్షవిధించెను.

ఈవార్త కొన్నిగడియల క్రిందటనే కోరిచేసుకొన్న భర్త నెప్పటికి నెడఁబాయవలసిన మాలతిచెవులకు శూలమువంటిదయ్యెను. ఈదుర్వార్త చెవిసోఁకినప్పుడు మొట్టమొదట మాలతి తనదాయా

దుని చంపినందునకయి భర్తమీఁద కోపమువహించి యాతనిని, గోముఖవ్యాఘ్రము, పయోముఖవిషకుంభము, మధురకస్వరసర్పము తేనెపూసినకత్తి, వెన్నమెత్తినశిల, మొదలయినపేరులతోఁ బిలువఁ జొచ్చెనుగాని యంతకంతకు ప్రేమము కోపము రూపుమాపఁగా తుట్టతుదకు మధుకరుఁడు భీమవిక్రముని చంపినందునకయి శోక బాష్పములు విడుచుట చాలించి భీమవిక్రమునిచే హృదయేశ్వరుఁడు హతుఁడుగాక బ్రతికినందునకయి యానందబాష్పములు విడువనారంభించెను. అంతతరువాత మరల నాచిన్నదాని కన్నులనుండి క్రొత్తగా కన్నీరు కాలువలుగట్ట నారంభించెను. ఇప్పు డాకన్నీటి ప్రవాహము తన ప్రాణవల్లభుఁడు దేశమునుండి వెడలఁగొట్టఁబడెనన్న దుఃఖము చేత వెలువడినది. దేశనిష్కాసితుఁడన్న పదమిప్పు డామెచెవులకు వేయిమంది భీమవిక్రముల చావుకన్నను ఘోరతరమయిన భయంకర మయ్యెను.

వీధిలో దొమ్మిజరిగినతరువాత మధుకరుఁడు తిన్నగా బసవ నారాధ్యునియింటికిఁబోయి యాతనిని శరణమొందియుండెను. అక్కడ నుండఁగానే యతనికి మొట్టమొదట రాజువిధించిన దండనవార్త తెలిసెను. అతనిదృష్టి కప్పుడు దేశము వెడలనడఁచుటకంటె మరణ దండనము విధించినచో నెంతో మేలుగా నుండునట్లు కనఁబడెను. ఆతని మనస్సున కప్పుడు కాశీకాపురమునువిడిచినచో తనకు ప్రపంచమే లేనట్టును మాలతియొక్క దృష్టిపథమును దాఁటినచో బ్రతుకే లేనట్టును తోఁచెను. అతనికి మాలతియున్నచోటనే స్వర్గమున్నట్టును మాలతిలేనిచోటనెల్ల నరకమును నరకబాధలునుదప్ప మఱియేమియు లేనట్టును కనఁబడఁజొచ్చెను. వేదాంతవేత్తయైన యాబసవనారాధ్యుఁ డాతనికి వైరాగ్యోదేశముచేసి దుఃఖోపశమనము చేయఁ జూచెను

గాని యున్మత్తునివలె మతిహీనుఁడయియున్న యతఁడా వృద్ధునిబోధ వినక వెఱ్ఱివానివలె తల విరియఁబోసికొని తనసమాధికయి భూమి పొడవు కొలుచుచున్నాఁడో యనునట్లు నేలమీఁద బడి పొరలుచు విలపింపఁజొచ్చెను. ఇట్లు విశ్వమునుమఱచి శోకసముద్రమున మునిఁగి వివశుఁడయియున్న యీసమయమునందాతని పాలిటికి తెప్పవలె ప్రియురాలివద్దనుండి యొకసందేశమువచ్చి యతనికి కొంత తెలివివచ్చు నట్లు చేసెను. అతఁడాప్రకారముగా కొంచెము తెలివిగలవాఁడగుట చూచి యది సందుచేసికొని మెల్లఁగా బసవనారాధ్యుఁడాతనికి మరల హితబోధచేయనారంభించెను. "ఓయీ! మధుకరా! నీవీ వఱకే భీమవిక్రముని జంపితివి. అది చాలక యిప్పుడు నీవాత్మహత్య చేసికొని యందుమూలమున మాలతిప్రాణములుకూడఁగొని యింకొకపాపమునుగూడఁ గట్టుకొనెదవా? అదియేమోకాని సామాన్యముగా మానవహృదయము ధైర్యమవలంబించి వజ్రమువలె దృఢముగా నుండవలసినకాలమునం దధైర్యపడి లక్కవలె కరఁగి పాఱుచున్నది. నీవిషయమున రాజుకూడ మిక్కిలి దయదలఁచినాఁడు. నరహత్యచేసినందునకయి మరణదండనము విధింపక నిన్ను రాజిప్పుడు దేశమునుండి వెడలనడఁచుటతో విడిచిపెట్టినాఁడు. భీమవిక్రముఁడు నిన్ను చంపుటకు మాఱుగా నీవే భీమవిక్రముని జంపఁగలిగి బ్రతుకుగన్నావు. అంతేకాక మాలతి నీకుప్రియభార్యయగుటకూడ తటస్థించినది. ఇంతకంటెమేలు నీకు మఱియేమికావలెను? ఇట్టిమేలునువిడిచి యధైర్యపడి యల్పకారణమునుబట్టి చింతిల్లువాఁడు తప్పక దురంతము నొందును." అని ప్రోత్సాహవాక్యములు పలికి బసవనారాధ్యుఁడు మధుకరునిమనస్సును మేలుకొలిపి, అతఁడు కొంతశాంతచిత్తుఁడయినపిమ్మట "నీవీరాత్రి రహస్యముగాపోయి మాలతియొద్ద సెలవు

పుచ్చుకొని యుజ్జయినికిఁబోయి కొంతకాలమచ్చటనుండుము. తరువాత నేను యుక్తసమయమునుఁజూచి మీవివాహవార్త వెల్లడిచేసెదను. తత్కాలమున నుభయకుటుంబములవారును పూర్వవైరమును మఱచి సమాధానపడి ముందుసుఖముగా బ్రతుకవచ్చును. అటుపిమ్మట రాజుతో నీశుభవార్త తెలిపి వేడుకొని రాజును నిన్ను క్షమించున ట్లొప్పింపవచ్చును. ఇప్పుడు నీవెంతదుఃఖముతో దేశమును విడిచి వెడలవలసినవాఁడవగుచున్నావో యప్పుడు నీవంతకు పదిరెట్లు సంతోషముతో మరల దేశమునకు రావచ్చును'' అని హితబోధ చేసెను. అతఁడు చెప్పిన యాలోచన బాగున్నదనియొప్పుకొని మధుకరుఁడు తానప్పుడు మాలతియొద్దకుఁ బోయి యారాత్రియామెతోఁ గడపి తెల్లవాఱుజామున లేచి యొంటిగా నుజ్జయినీనగరమునకుఁ బోయెదనని చెప్పి యావృద్ధునియొద్ద సెలవుపుచ్చుకొని ప్రయాణమయ్యెను. ఈపురములోనివార్తల నెప్పటికప్పుడు వ్రాసి యుజ్జయినీ నగరమునకుఁ బంపుచుండెదనని బసవనారాధ్యుఁ డాతనికి వాగ్దానము చేసెను.

తాను వెనుకటిరాత్రి పొంచుండి మాలతిపలికిన యనురాగ వాక్యములు విన్నతోఁటలోనుండి చీఁకటిపడినతరువాత రహస్యముగాఁ బోయి యెవ్వరు నెఱుఁగకుండ మాలతియొక్క గదిలోఁ బ్రవేశించి మధుకరుఁడు నాఁటిరేయియంతయు ప్రియురాలితో హాయిగాఁ గడపెను. ఆరాత్రి వారి కపారసంతోషదాయకమయి మహోత్సాహప్రదమయి యుండెను. అయినను వారికాప్రమోదము తడవునిలిచినది కాదు. శీఘ్రముగానే యొండొరుల నెడఁబాయవలెనన్న చింతయు గతదినమున జరగిన దుఃఖకథయు వారికప్పుడుస్మరణకువచ్చి యొకానొకి కాముకు లొండొరుల సమ్ముఖమునం దనుభవించుచున్న

నాఁటిరాత్రి యుల్లాసమున కంతకును నడుమ భంగముకలిగించెను. వారికంటికి నాఁడు ప్రభాత సమయ మతివేగముగా వచ్చినట్లు కానఁబడెను. మాలతి ప్రభాతసమయమునందలి కోకిలరుతము వినఁబడినప్పుడామె తానర్ధరాత్రమునందు కూసెడు చకోరపక్షియొక్క కూఁతను విని భ్రమపడితినని భావించుకొనెను. కాని యామెభ్రమ యిప్పుడే నివారణమయినది. అప్పుడు కూసినది కోయిలయే యని తెలిసికొని దాని మధురరుతము నామె తన చెవులకు వెగటైన కటుస్వరమునుగా గ్రహించి కోఁతపడఁజొచ్చెను. అంతట తూర్పునుండి ప్రభాత రేఖలు బయలువెడలి దంపతులెడఁబాయవలసిన సమయమాసన్నమయినదని వారికి విస్పష్టముగాఁ జెప్పెను. ఉజ్జయినీ నగరమునుండి తాను ప్రతిదినమును ప్రతినిమిషమును క్షేమలేఖలు పంపుచుండెదనని చెప్పి సమాధాన పఱిచి యతఁడు దుర్భరచింతతో ప్రియురాలివద్ద సెలవుగైకొని తడఁబడు పాదములతో బయలువెడలెను. మధుకరుఁడు ప్రియురాలియొక్క మేడమీఁది గదియొక్క గవాక్షములోనుండి క్రిందికిదిగి తోఁటలో నిలువబడినప్పుడు శోకవ్యాకులితయైయున్న యామెదృష్టి కతఁడు ప్రాణములు లేనివానివలె కనఁబడెను. క్రిందినుండి పయికి జూచినప్పు డతనిదృష్టికామెయు శవప్రాయురాలుగ కనఁబడెను. అందుచేత నాతనికామెనువిడిచి సాగుటకు కాళ్ళాడకపోయినను, తెల్లవాఱిన తరువాతఁ దాను కాశికాపుర వీధులలోఁ గనఁబడినపక్షమున ప్రాణములు కోలుపోవలసినవాఁడనని యెఱిఁగినవాఁడగుటచేత మధుకరుఁడు తన మనస్సును వెనుకనే దిగవిడిచి దేహమును వేగిరపాటుతో ముందుకు గెంటుకొని పోవలసినవాఁడయ్యెను.

మందభాగ్యులయిన యీదంపతులయొక్క కష్టకథకిదియే

యారంభము. మధుకరుడు దేహమునువిడిచి చిరకాలము కాక మునుపే ప్రతాపరుద్రుడు తనకొమార్తె నిచ్చి వివాహముచేయుట కయి యొకవరుని నేర్పఱిచెను. ఇప్పుడు క్రొత్తగా దెచ్చినయల్లుడు సుగుణసంపత్తిగలవాడయి తరుణవయస్కుడయి యున్నశంకరవర్మ; మాలతిముందుగా మధుకరుని జూచియుండనిపక్షమున, ఈనూతన వరుడామెదృష్టి కెంతమాత్రము ననష్టుడుగా కనబడును. అతడు స్వప్నావస్థయందును మాలతి కావలకే వివాహమయినదని యనుకో లేదు.

తనకు వివాహసన్నాహము చేయుచున్నానని తండ్రి చెప్ప గానే మాలతి యేమిచేయుటకును తోచనిదయి కొంతసేపు నివ్వెఱ పడి యూరకుండి తరువాత తెలివితెచ్చుకొని తనకింకను స్వతం త్రముగా భర్తతో కాపురముచేయుటకు తగినంత వయస్సు రాలే దనియు, భీమవిక్రముడు మృతినొంది యెంతో కాలముకానందున తానాదుఃఖమువలన భర్తతో సుఖమనుభవింప దగినంతటి సంతోష స్థితిలో లేననియు, భీమవిక్రముని సాంవత్సరిక కర్మలైనను ముగియక మునుపే యింటవివాహోత్సవము జరిగినయెడల లోకులు నిందింతు రనియు నానాకారణములను కల్పించి వివాహము తప్పించుకో జూచెనుగాని తనకావలకే పరిణయమైనదన్న నిజమైన కారణమును మాత్రము చెప్పినది కాదు. ఆమె యెన్ని యాక్షేపములు చెప్పినను వినక పెడచెవినిబెట్టి "నిన్ను బుధవారమునాడు శంకరవర్మకిచ్చి వివాహము చేయక మానను. నీవు పెండ్లికి సంసిద్ధురాలవయి యుండుము" అని ప్రతాపరుద్రుడు కూతున కాజ్ఞాపించెను. అతడట్లు కూతును నిర్బంధపెట్టుట ధనవంతుడును రూపవయో వంతుడును గుణవంతుడును నగువరుడు దొరకినప్పు డల్పకారణము

లనుబట్టి యాతనిని నిరాకరించినపక్షమున మరల నటువంటిసంబంధము మఱియొకటి దొరక దన్నహేతువుచేత నేకాని వేఱుకారణముచేతఁగాదు.

ఇటువంటి విషమదశ సంప్రాప్తమయినప్పుడామె యొక్కతెయు రహస్యముగా నాపద్బంధుఁడైన బసవనారాధ్యుని యింటికిఁబోయి యాతనిని శరణుచొచ్చెను. అతఁ డప్పుడాచిన్నదానిని జూచి సాహసికకార్య మేదియైనఁ జెప్పినఁ జేసెదవాయని యడుగఁగా, తన భర్త్రప్రాణములతో నుండఁగామఱియొకనివరియించుటకంటెజీవముతో సమాధిలోనికిఁ బోవ్మన్నను పోయెదనని యామె యుత్తర మిచ్చెను. అంతట నతఁ డామెనుజూచి "యిప్పుడు నీవు తిన్నగా మీయింటికిఁబోయి సంతోషముతో నున్నట్టు కనఁబడి నీతండ్రికోరినప్రకారముగా శంకరవర్మను వివాహమాడుట కంగీకరింపుము. రేపటిరాత్రి వివాహమనఁగా నీవీబుడ్డిలోని ద్రావకమును త్రాగినపక్షమున, మఱునాటి సాయంకాలములోపల నీవు ప్రాణములు లేనిదానివలె పడిపోదువు. అప్పుడు నీదేహమంతయు చల్లపడి కలువకాడవలె నగును. అంతట నీవారందఱును నీవు మృతినొందినట్లు భావించి నిన్ను ప్రేతభూమికిఁ గొనిపోయి మీకుటుంబమునిమిత్తమేర్పడియున్న సమాధిలో నిన్నుంచి దేశాచారప్రకారముగా రెండుదినములవఱకును నిన్ను పూడ్పక యట్టేయుంచుదురు. మూర్ఛపోయిన మఱునాటిరాత్రి యౌషధప్రభుత్వము తప్పిపోఁగా మూర్ఛ తేరి నిద్రపోయి మేల్కొన్నదానివలె నీవు మరల కూర్చుందువు. ఈలోపల నేను నీభర్తకుజ్జయినీనగరమున కుత్తరమువ్రాసి యతఁ డారాత్రి వచ్చి నిన్ను వెంటఁబెట్టుకొని పోవునట్లుచేసెదను" అని మందుబుడ్డి చేతికిచ్చెను. మధుకరునిమీఁదఁగల యనురాగాతిశయము చేతను శంకరవర్మను

చెట్టపట్టవలసివచ్చు నన్నభయముచేతను మాలతి యట్టితెంపరిపని కొప్పుకొని, అతఁడు చెప్పినట్లు చేసెదనని మందబుద్ధి చేతఁబట్టుకొని తిన్నగా నింటికి నడిచెను.

ఇంటికిఁ బోయిన తరువాత వరణము నిమిత్తము శంకరవర్మ రాఁగా మాలతి లోపలలేనిదయ నభినయించుచు తానాతనికి వధువు నయ్యెదనని చెప్పెను. ఈవార్త చెవినిబడఁగానే ప్రతాపరుద్రుఁడును భార్యయు సంతోషపరవశులయిరి. అప్పుడు వృద్ధుఁ డయినయాప్రతాపరుద్రుఁడు తనకు బాల్యము మరలవచ్చిన ట్లుల్లాసముపొంది, తన యాజ్ఞనుల్లంఘించుటవలన కొమార్తెమీఁదవచ్చిన కోపమునంతను మఱచి విధేయురా లయినముద్దులకూఁతును ప్రేమతో గ్రుచ్చి కౌఁగిలించుకొనెను. తల్లిదండ్రులు సమీపించుచున్న వివాహమునకయి సమస్తసన్నాహములను జేయఁజొచ్చిరి. ఇంట నెక్కడఁజూచినను సంతడిగానుండెను. వివాహమహోత్సవమును మహావైభవముతోఁ జేయుటకయి యెంతసొమ్మయినను వ్యయపెట్టుటకు నిశ్చయించుకొని కాశికాపురమునం దట్టిమహోత్సవమెప్పుడు జరగలేదని జనులకు తోఁచునట్లు చేయఁదలపెట్టిరి.

బసవనారాధ్యుఁ డాజ్ఞాపించినట్లు మంగళవారము రాత్రినే మాలతి యామత్తుమందు త్రాగెను. త్రాగుటకు బుద్ధిని చేతఁబట్టు కొన్నప్పుడామెమనస్సులో ననేకవిధములైనతలఁపులు పుట్ట నారంభించెను. తన్ను మధుకరునికి వివాహముచేసినతప్పు బయలఁబడకుండుటకయి బసవనారాధ్యుఁడు నిజముగా విషమునే పెట్టెనేమోయనియు, పాపభీతిగలవాఁ డగుటచేత నతఁ డట్టిపని చేసియుండఁడనియు, మధుకరుఁడు తననిమిత్తమై రాకమునుపే తనకు తెలివివచ్చునేమోయనియు పరిపరిలాగులనాలోచించి యావఱకుతాను విన్నదయ్యపుకథ లన్నియు

స్మరణకురాఁగా భయపడియు మరల కొంతధైర్యము తెచ్చుకొని మధుకరునిపైఁగల యనురాగముచేతను శంకరవర్మమీఁదఁగల విరాగము చేతను తుదకు సాహసముచేసి యామత్తుమందు మ్రింగి మూర్ఛపోయెను.

మఱునాఁడు శంకరవర్మ వివాహమునిమిత్తమువాద్యములతో తరలివచ్చి లోపలికిఁ బోవునప్పటికి లోపల ప్రాణములతో నున్న భార్యకు మాఱుఁగా ప్రాణములులేని శవము కంటఁబడెను. ఇంట నెక్కడఁజూచినను ఏడుపులును పెడబొబ్బలును మిన్నంటుచుండెను. త్రిలోకసుందరిని వివాహమయి యామెతో నెంతో చిరసౌఖ్యమనుభవింపవలె నని కొండంతయాశ పెట్టుకొనివచ్చిన తనకాంత పెండ్లికి ముందే లోకాంతరగతురాలగుటవలన శంకరవర్మకుఁ గలిగినసంతాపమునకు మేరలేదు. అయినను వార్ధకదశలో తమకెంతో సంతోషదాయకురాలగునని యెంచి తమకు పుత్రికతోడిదే లోకమనియుండిన యేకపుత్రిక మంచివరుని చేపట్టి సుఖపడునని యెదురుచూచుచున్న సమయమునం దాకస్మికముగా తమ్మువిడిచి పరలోకగతురాలగుట చేత వృద్ధులయిన తల్లిదండ్రులకుఁ గలిగిన దుఃఖమునుజూచినప్పు డాతని దుఃఖము దానిలోషోడశాంశమయినను నుండునని చెప్పవలనుపడదు. అప్పుడు కౌమారిత పెండ్లినిమిత్తమయి సమకూర్చిన యమూల్యపదార్థములన్నియు శ్రాద్ధమునిమిత్త ముపయోగింపవలసినగతి పట్టెను. క్రూరమయిన మృత్యుదేవతయొక్క పనిచేత నిమిషకాలములో వివాహమంత్రములు శ్రాద్ధమంత్రములుగాను, సంతోషవాదములు రోదననాదములుగాను, పెండ్లివిందులు శ్రాద్ధభోజనములుగాను మాఱిపోయెను. శవమింటనుండఁగా తడవుచూచుట దుస్సహముగా నున్నందున బంధువులప్పుడే శవమును గొనిపోయి పూడ్చుటకేర్పాటు

చేసి ఖననము నిమిత్తమయి మాలతిని కుటుంబసమాధు లున్నస్థలము నకుఁ దీసికొనిపోయిరి.

అశుభవార్తలు సాధారణముగా శుభవార్తలకంటె శీఘ్రముగా దేశములవెంట పరుగెత్తునుగనుక, బసవనారాధ్యుఁ డీయపరకర్మలును చావును కపటనాటకమనియు శీఘ్రముగావచ్చి మూర్ఛలోమునిఁగి గతప్రాణయట్లు సమాధిలోపడియున్న హృదయేశ్వరిని గొనిపోవలసిన దనియు లేఖవ్రాసిపంపినమనుష్యుఁ డుజ్జయినీనగరము చేరకమునుపే మధుకరుఁ డామెమరణవార్తను వినెను. ఈవార్తయిఁక క్షణమునకు వచ్చుననఁగా నతఁ డొకస్వప్నమునుగని లేచికొంతయుత్సాహవంతుఁ డయ్యెను. ఆకలలో నతఁడు తాను మృతుఁడయినట్లును, అప్పుడు తన ప్రాణవల్లభ దాపునకువచ్చి మరణావస్థలోనున్న తన్నుఁజూచి మీఁద చేయివేయఁగా పోయిన ప్రాణములు మరలవచ్చి తాను లేచికూర్చు న్నట్టును, తరువాత తాను చక్రవర్తియైనట్టును, చూచెను. ఈకల గనిలేచి సంతోషించుచుండఁగా నింతలో కాశికాపురమునుండి వచ్చిన మనుష్యుఁడొకఁడు కనఁబడి, అతఁడేమో తనభార్యనుగూర్చిశుభవార్త చెప్పునన్నసంతోషముతోచేరవచ్చినమధుకరునితోపిడుగువంటిమాలతి మరణవార్తనుజెప్పెను. ఆదుర్వార్తనువినికొంతసేపతఁడు దుఃఖవివశుఁ డయియుండి తెప్పిరిలి,స్వప్నములోవచ్చిమృతుడయినతన్నుమాలతిబ్రతి కించినట్లుగా తానామెను బ్రతికింపలేనిదురవస్థలో నున్నందునకయి విచారపడి, తత్క్షణమే బయలుదేఱిపోయి పాఁతిపెట్టకమునుపే సమా ధిలో నున్నభార్యముఖ మొక్కసారి యారాత్రియే చూడవలెనని నిశ్చయించుకొని గుఱ్ఱమును కట్టించి యప్పుడె కాశికాపురమునకు ప్రయాణమయ్యెను. తెంపరులై యున్నమనుష్యులహృదయములలో దురాలోచనలు శీఘ్రముగాప్రవేశించుటస్వభావమయినందునబయలు

దేఱునప్పు డతని కాకస్మికముగా తనభార్యముద్దుమొగమునొక్కసారి చూచి కృతార్థతగన్న తరువాతనిరంతరదుఃఖభాజనమైన తనశరీరమును త్యజించి దుఃఖవిముక్తిఁ బొందవలె నన్నబుద్ధి పుట్టెను. అందుచేత నాతఁడాత్మహత్యచేసికోవలెనని నిశ్చయించుకొని త్రోవలోనున్న యొక వైద్యునింటికిఁబోయి తనకు ప్రాణాపాయకరమైన మంచివిషము కావలెనని యడిగెను. అక్కడి రాజశాసనమునుబట్టి యాదేశమునందు వైద్యుఁడు కానివాఁడు కేవ్వఁడైనను విషవిక్రయము చేసినపక్షమున విషము విక్రయించినవాఁడు మరణశిక్షకు పాత్రుఁడగును. కాఁబట్టి యతఁడు విషమునిమిత్త మడిగినప్పు డావైద్యుఁడు మొట్టమొదట విష మమ్ముటకు కొంత సంశయించెనుగాని తరువాత మధుకరుఁడు మంచివెల యిచ్చెదనని రెండు బంగారుకాసులు చేతిలోఁబెట్టగానే యాసంశయములనన్నిఁటిని దూరముగాఁబెట్టి బీదవాఁడగుటచేత ధనాశను మరలించుకోలేక "యీవిషము మ్రింగినపక్షమున నిరువదిమందికిఁగలబల మున్నయేనుగువంటివాఁడును క్షణకాలములో పీనుఁగగును" అని చెప్పి యాకాసులుపుచ్చుకొని యొకయౌషధ విషమును రహస్యముగా నతని కమ్మెను.

ఈవిషమును చేతఁబట్టుకొని తన ప్రియురాలియొక్క ముఖసందర్శనముచేత కన్నులను తృప్తిపఱిచినపిమ్మట విషము త్రాగి ప్రాణేశ్వరియొక్క ప్రక్కనేపడి ప్రాణములువిడిచి యేకసమాధిలోనే దీర్ఘశయనము నొందవలె నన్నకోరికతో నతఁడు గుఱ్ఱమెక్కి వాయువేగముతో కాశికాపురమునకు యాత్ర వెడలెను. అతఁ డర్ధరాత్రికి కాశీపట్టణముచేరి తిన్నగా రుద్రభూమికిఁ బోయి యాసమీపమునందు రుద్రవరపువారికుటుంబములో మృత్యు లయ్యేడువారిని పూడ్చెడు సమాధులమధ్యమునఁ బ్రవేశించెను. అట్లు ప్రవేశించి యతఁడు దీప

యొకటి వెలిఁగించుకొని గునపమొకటి చేతఁబట్టుకొని క్రొత్తగాకట్టి యున్న సమాధిపయిని వేసియున్న రాతిని కదలింపఁబోవుచుండఁగా, “గణపవరపువారివంశమునఁ బుట్టిన యోరి దుష్టాత్ముఁడా! నింద్య మయిన యిట్టివంటి దుష్కార్యమును జేయకుము” అని యొకధ్వని వినఁబడెను. అప్పు డామాట లన్నవాఁడు తనకు భార్యగా నుద్దేశింపఁ బడిన మాలతియొక్క సమాధియొద్దకుఁ బోయి దుఃఖపడి యామెకు పుష్పములర్పింపవలె నన్నబుద్ధితో నర్ధరాత్రమునం దక్కడకువచ్చిన శంకరవర్మ. అతఁడు మధుకరుఁ డప్పుడక్కడ కేలవచ్చెనో యెంత మాత్రము నెఱుఁగఁడు; కాని యతఁడు గణపవరపువారి వంశములోఁ బుట్టినవాఁడని మాత్రమెఱిఁగినవాఁడయి యాకుటుంబములోనివా రందఱును రుద్రవరపువారి కుటుంబమునకు గర్భశత్రువులగుటతలపోసి నడిరేయి యాకుటుంబమువారి సమాధుల కేదోయవమానకరమైన దుష్కార్యమును జేయుటకయి యతఁ డక్కడకు వచ్చెనని యూహ చేసెను. అందుచేతనే శంకరవర్మ మహాకోపముతో “అట్టి దుష్కా ర్యమును జేయవలదు” అని మధుకరుని నదలించి పలికెను. అంతే కాక రాజశాసనమునుబట్టి కాశికాపురములో కనఁబడినపక్షమున నతఁడు మరణదండనకు లోఁబడవలసినవాఁడని యెఱిఁగియున్నందున శంకరవర్మ యాతనిబట్టుకొని రాజభటుల కొప్పగింపవలయునని యూ మనస్సులో నూహించెను. అప్పుడు మధుకరుఁడు తన్నువిడిచితొలఁగు మ్మని శంకరవర్మకు బోధించి, అక్కడనే పూడ్చిపెట్టఁబడియున్న భీమ విక్రముని సమాధినిజూపి యాతనికి సంభవించినగతిని స్మరణకుఁదెచ్చి, తనకుకోపము తెప్పించి మఱియొక హత్యనుగూడఁ జేయునట్లుచేసినాతన పాతకము కట్టవలదని యెచ్చరించెను. శంకరవర్మ యాయెచ్చరికను లక్ష్యముచేయక యాతనిమీఁదబడి యతనిని పట్టుకొనఁబోఁగా, మధుఁ

కరుఁడు లోఁబడక యెదిరించినందున వారిద్దఱికిని ఘోరయుద్ధమారంభ మయ్యెను. ఆయుద్ధములో మధుకరుని చేతిఖడ్గప్రహారముచేత శంకర వర్మ శిరస్సు తెగి నేలమీఁదఁ బడెను. అప్పుడు మధుకరుఁడు తాను చంపినదెవ్వనినో చూడవలెనని దీపము చేరువకుఁ దెచ్చిచూచి యతఁడు శంకరవర్మయగుట కనిపెట్టి, అతఁడే మాలతిని నాఁడు వివాహమాడఁ దలఁచుకొన్న నూతనవరుఁడని తోవలో విన్నవాఁడగుటచేతఁ దన వలెనే యభాగ్యుఁడయిన యాతనినిజూచి జాలిపడినవాఁడయి, దావు నకుఁబోయి యతనిచేయి తనచేతఁ బట్టుకొని మరణానంతరమున నయిన నీకు మాలతితోడి పొత్తుగలిగించి నిన్ను ధన్యుని జేసెదనని పలుకుచు మాలతి సమాధిమీఁదిరాతిని పయి కెత్తెను. అతఁ డారాయియెత్తి దీపముల వెలుతురున సమాధిలో లోఁగిచూచు నప్పటికి దృష్టిని మిఱుమిట్లు గొలుపుచు మరణదశలో సహిం తము నైజతేజమును విడువక నిరుపమానమైన స్వభావసౌందర్య ముతో మృత్యుదేవత యామెరూపమునుజూచి మోహించి స్థిరముగా తనయొద్ద నుంచుకొనుటకయి తెచ్చి వద్దబెట్టుకొన్న దేమోయన్న తలఁపును గలిగించుచు మాలతియందు తొలకరిమెఱుపువలె తళుక్కు మనెను. అప్పుడామె మత్తుమందు త్రాగుటకుముందు తానెట్టి యస మానశోభనుగలిగి యుండెనో యట్టి శోభనే కలదయి గాఢనిద్ర పొందుచున్నదానివలె కలకలలాడుచున్న నవ్వుమొగముతో సమాధి లోఁ బడియుండెను. ఆసమీపమునందే క్రొత్తగాఁ గట్టఁబడియున్న భవవిక్రమునిసమాధిని జూచి కన్నులనీరు పెట్టుకొని, మాలతిమీఁదఁ గల ప్రేమాతిశయము చేత నాతనిని 'బావా!, యనిపిలిచి 'ఇప్పుడు నీశత్రువునుగూడ కడతేర్చి నీకు నుపకారముచేసెదను' అని యాశవముతోఁబలికెను. అట్లుపలికి తనప్రియురాలి మొగమువంకఁ

జూచి యామె చెక్కులు పలుమారు ముద్దుపెట్టుకొని యాలోకమును విడిచి తన్నుఁ జేరుట కామెను సెలవు వేఁడుకొని మధుకరుఁడు తాను వచ్చునప్పుడు కొనితెచ్చుకొన్న విషమును త్రాగి తనప్రియురాలి ప్రక్కను పరుండి యప్పుడే ప్రాణమును విడిచెను. ఇతఁడు త్రాగినవిషము మాలతి త్రాగినదానివలె మూర్ఛపుచ్చునదిగాక నిజముగా ప్రాణములు తీయునదిగా నేయుండెను. అప్పటికి మాలతి త్రాగిన విషముయొక్క ప్రబలత్వము తగ్గిపోయి యామెకు తెలివి రావలసిన సమయము సమీపించుచుండెను. బసవారాధ్యుఁ డేర్పఱిచిన ప్రకారముగా సర్వమును నిర్విఘ్నముగా జరగినయెడల నిఁక మాలతి మేలుకొని సమాధినుండి లేచి యింకను దనప్రాణవల్లభుఁడు రాక జాగు చేయుచున్నాఁడని పరితపించుచుండుటకో పెట్టినమితికి ముందుగానే వచ్చినాఁడని సంతోషించుచుండుటకో సమయ మాసన్నము కావలసి యుండెను.

ఇంతలో మాలతి మరణతుల్యమైన మూర్ఛనుండి తేరునని బసవారాధ్యుఁ డేర్పఱచినకాలము వచ్చెను. ఈలోపలనే యతఁడు తాను మధుకరుని నిమిత్తము వ్రాసి యుజ్జయినీనగరమునకుఁ బంపిన యుత్తరము వార్తాహరుఁడు మార్గములోఁ జేసినయాలస్యముచేత మధుకరుని కందలేదని తెలిసికొని చేత నొకదీపమును గడ్డపాఱయుఁ బట్టుకొని మాలతిని సమాధినిర్బంధమునుండి విముక్తురాలిని జేయవలెనన్న యుద్దేశముతో నొంటిగా నిశీథవేళ తానే యారుద్రభూమికి వచ్చెను. తానువచ్చునప్పటికే మాలతిసమాధివద్ద నొకదీపము వెలుగుచుండుట కాశ్చర్యపడి యతఁడు మెల్లమెల్లగా చేరువకునడిచి త్రోవలో ముందుగా కత్తులను నెత్తురుమడుగులను మఱికొంతదూరమున సమాధిప్రక్కను మధుకరుని యొక్కయు శంకరవర్మయొక్కయు శవములను జూచి యత్యద్భుతపడఁ జొచ్చెను.

ఈమరణము లెట్లు సంభవించినవో యూహించి యతఁడు తెలిసికొనకమునుపే మాలతి తన మూర్ఛనుండి తేరి, తన సమీపమం దున్న బసవనారాధ్యుని జూచి తా నున్నస్థలమునకు తా నక్కడకు వచ్చుటకుఁగల కారణమును దెలిసికొని మధుకరుఁడెక్కడ నున్నాఁ డని యడిగెను. ఈమాటలనుగుచుండఁగానే వెలుపల నేదో జనధ్వని వినఁబడినందున మనుష్యప్రయత్నమునకు సాధ్యముకాని యొక మహా శక్తి నడుమ తమ మనోరథములనెల్ల విఫలముచేసినదని పలుకుచు బసవనారాధ్యుఁడామెను మృతులకు వాసయోగ్య మయిన యూసమాధిలోనుండి శీఘ్రముగా వెడలిరమ్మని చెప్పి పరులెవ్వరో సమీపించుచున్నా రని భయపడి యక్కడనుండి పాఱిపోయెను. అప్పుడు మాలతి తన ప్రాణవల్లభునిచేతిలో నేదో మందుబుడ్డి యుంచుటచూచి యతఁ డందులోనివిషము త్రాగి మృతినొందె నని గ్రహించి, ఆబుడ్డిలో విషము మిగిలియున్నచో దానిని త్రాగి ప్రాణత్యాగము చేసికొనెంచి విఫలమనోరథురాలయి, చచ్చిపడియున్న మధుకరునియొక్క చెక్కులు చుంబించి యింతలో జనకలకలము చేరువను వినరాఁగా భయాకులయయి తొందరపాటుతో ముందుఁజూచి యాతని సమీపమునఁబడియున్న కత్తితీసి దానితోఁ బొడుచుకొని తన ప్రాణేశ్వరుఁ డయినమధుకరునిపార్శ్వమునఁ బడి ప్రాణములు విడిచెను.

అంతట కావలివా రక్కడకువచ్చిరి. శంకరవర్మయొక్క సేవకుఁ డొక్కఁడు తన యజమానుఁడును మధుకరుఁడు పోట్లాడుచుండఁగాఁ జూచి పరుగెత్తుకొనిపోయి గ్రామమునఁబడి యాయిరువురును నఱుకులాడుచున్నారని కేకలు వేసెను. ఆ కేకలువిని పురజనులు గుంపులు గుంపులుగా 'శంకరవర్మ!' 'మధుకరుఁడు!' 'మాలతీ!' అని యఱచుచు వీథులవెంబడిఁ బరుగెత్తఁజొచ్చిరి. ఆయఱపులు విని లేచి యాకలకలమునకుఁ గారణమేమో పూర్ణముగా తెలిసికొనలేక తొందరపడి

ప్రతాపరుద్రుఁడును గణపతిదేవుఁడును వీథిలోనికిఁ బయలుదేఱి వచ్చి తమముందు భయకారణమేమో విచారింపవలెనని జనుల నడుగుచు నడుచుచున్న రాజుతోఁ గలిసికొని యాస్థలమునకు బయలుదేఱిరి. భయముచేత వడఁకుచు నిట్టూర్పులు పుచ్చుచు, రోదనముచేయుచు సందేహాస్పదముగా రుద్రభూమినుండి పరుగెత్తుకొనివచ్చుచున్న బసవ నారాధ్యునిఁజూచి కావలివారు పట్టుకొనిరి. అప్పుడు జనులు మూఁకలు మూఁకలుగా వచ్చి రుద్రవరపువారి సమాధులచుట్టును మూఁగిరి. అంతట రాజును వారియొద్దకు వచ్చి బసవనారాధ్యునిజూచి యక్కడ నడచినయావింతసంగతులనుగూర్చి యతనికేమి తెలియునో సత్యము చెప్పవలసినదని యాజ్ఞాపించెను.

అప్పుడు వృద్ధులయిన గణపతిదేవునియొక్కయు ప్రతాప రుద్రునియొక్కయు సమక్షమందు బసవనారాధ్యుఁడు వారికుమా రుఁడును కుమారికయు నొండొరులను కామించినవిధమును, వారి వివాహమువలన చిరకాలమునుండి యాగొప్ప కుటుంబములకు రెంటికి కిని పడిన కలహమడఁగిపోయి సుఖస్థితి కలుగు నన్నయాలోచనతోఁ దా నాబాలదంపతులవివాహకార్యములో తోడుపడుటయు, అక్కడ విగతప్రాణులయి పడియున్న మాలతియు మధుకరుఁడును భార్యా భర్త లగుటయు, వారివివాహవార్తను ప్రసిద్ధపఱుచుటకు తనకు తగిన యవకాశము చిక్కకమునుపే మాలతికి మఱియొకభర్తను గూర్చుటకు ప్రయత్నము జరిగినందున తానేమిచేయుటకు తోఁచని దయి యన్యపురుష పరిగ్రహమును తప్పించుకొనుటకయి తన యాలో చనప్రకారముగా మాలతి మత్తుమందు ద్రాగుటయు, మూర్ఛితు రాలయియున్న యాచిన్నదానిని జూచి మృతురాలయ్యెనని యంద ఱును భ్రాంతిగొనియుండఁగా శీఘ్రముగావచ్చి సమాధిలో నున్న యామెను మూర్ఛ తేఱినపిమ్మట రాత్రివేళవచ్చి వెంటఁబెట్టుకొని

పొమ్మని తాను మధుకరునికి వ్రాయుటయు, ఆయుత్తరమును గొని పోయినవానిలోపమువలన దైవికముగా తనలేఖ యతనికిఁ జేరక పోవుటయు, తనకుఁ దెలిసినది సర్వమును దెలిపి, అటుతరువాత నేమి జరిగినదో తనకు దెలియదనియు, తానామెను సమాధిలోనుండి లేవ దీసి రక్షింపవలెనని యక్కడకు వచ్చునప్పటికి మధుకరుడును శంకర వర్మయు నక్కడఁ జచ్చిపడియుండిరనియుఁ జెప్పెను. అటుతరువాత జరిగిన కథయంతయు తనయజమానునివెంట వచ్చి యాతనికిని మధు కరునికి పోరాటము జరుగుచుండగాఁ జూచిపోయిన శంకరవర్మపరి చారకుడును, ఉజ్జయినీనగరమునుండి మధుకరునితోడఁ గూడవచ్చిన యాతని పరిచరుడును జెప్పిరి. అప్పుడు మధుకరుని భృత్యుడు తాను మృతుడయినపక్షమున తండ్రి కియ్యవలసినదని యజమానుడు తన చేతికిచ్చిన యుత్తరమునుదెచ్చి గణపతిదేవునిచేతి కిచ్చెను. అతఁ డాయుత్తరమును బుచ్చుకొని విప్పిచదువఁగా నందుబసవనారాధ్యుడు చెప్పినప్రకారముగా మధుకరుడు తాను మాలతిని వివాహమాడిన వృత్తాంతమును, తల్లిదండ్రులయనుమతి లేకుండ తాను పెండ్లిచేసి కొన్న యపరాధమును క్షమింపవేడుచు వ్రాసిన దీనవాక్యములును, తాను విషపానము చేసి మాలతియొక్కసమాధివద్దఁ బడి చావవలె నన్న నిశ్చయముతో వైద్యునివద్ద విషముకొన్న కథయు ఉండెను. దానివలన బసవనారాధ్యుడాహత్యలలో సంబంధములేని నిరపరాధి యగుట స్పష్టపడెను. మంచియుద్దేశముతోఁ బ్రయోగింపఁబడిన యాతని యుపాయమువలన నంతమందికి ప్రాణోపద్రవము కలిగినను, బసవనారాధ్యుడు వారిమేలును గోరియే యాపనులు చేసినవాఁ డగుటచేత రాజాతని మన్నించి విడిచిపెట్టెను.

అంతట రాజాముసలిప్రభువులవంకఁదిరిగి పసికిమాలినవైర మును వహించి యిట్టియనర్థమును దెచ్చినందునకయి వారిని దూషించి "ఓప్రతాపరుద్రా! ఓగణపతిదేవా! మృగప్రాయముగా

ప్రవర్తించిన దోషమునకయి యీశ్వరుఁడు మీకిట్టిశిక్ష కలుగఁజేసి నాఁడో కాఁచివిరిగదా! మీకడుపునఁబుట్టిన బిడ్డలకుఁ గలిగిన యన్యోన్యానురాగమునే కారణముచేసి మీవెనుకటిపశువర్తనకు శిక్షగా దేవుఁడు మీకు కలకాలము నుండెడుమనోవ్యధను గలిగించినాఁడు. ఇఁకనైనను మీరు మీవెనుకటిశత్రుత్వమును మఱచి మిత్రభావమును వహించి మీరు సుఖపడి మీపొత్తువలన మీసంతతివారిని గూడసుఖపెట్టుఁడు'' అని మందలించెను. అప్పుడావృద్ధులు రాజసన్నిధియందే యొండొరులను కౌఁగిలించుకొని, తమపూర్వవైరమును కూడ తమబిడ్డల సమాధులోనే పూడ్చివేసెదమని చెప్పి సంధిచేసికొని తమబిడ్డలు కలిపి పోయిన బాంధవ్యమును దృఢపఱచుకొని యిఁక ముందెప్పుడును పోరాటములేక దృఢసఖ్యముతో నొండొరులయింటికి వచ్చుచుఁబోవుచు భోజనప్రతిభోజనములు చేయుచు నేకకుటుంబము లోనివారివలెఁ గలిసిమెలసి సుఖజీవనము చేయునట్లు ప్రమాణములు చేసికొనిరి. అటుపిమ్మట గణపతిదేవుఁడు కోడలియొక్క గుణసంపదను రూపసంపదను దలఁచుకొని దుఃఖించి, ఆమె సమాధిపైని బంగారుగోపురముకట్టించి యామెపేరిటననేకదానధర్మములుచేసెదనని చెప్పెను. ఆప్రకారముగానే ప్రతాపరుద్రుఁడును తన యల్లునియొక్క గుణసౌందర్యమును రూపసౌందర్యమును స్మరణకుఁదెచ్చుకొని పరిపరి లాగులఁ బరితపించి, తా నాతనిసమాధిపైనికూడ బంగారుగోపురమును గట్టించెదననియు నాతని పేరుపెట్టి యన్నసత్రములను విద్యాశాలలను బెట్టించెదననియుఁ జెప్పెను. పనిమించినవెనుక నేమిచేసినను గతించినది కూడిరాదు. ఈవృద్ధులు తమకాలమంతయు కలహములలోఁ గడపి వార్ధకదశలో కడుపునఁ బుట్టిన బిడ్డలు కాలము చేసిన తరువాత పశ్చాత్తప్తులయి యవసాన కాలమునందిప్పుడు బుద్ధిమంతులయి ''పోరునష్టము పొందులాభము'' అను నీతిని నేర్చుకొనిరి.

---

శ్రీ [illegible]

## కందుకూరి వీరేశలింగం పంతులుగారి గ్రంథములు.

### ప్రహసనములు

మొదటి సంపుటము

1 అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము
2 విచిత్ర వివాహ ప్రహసనము
3 మహాబధిర ప్రహసనము
4 పునర్మరణ ప్రహసనము
5 బలాత్కారగానవినోద ప్రహసనము
6 కలహప్రియా ప్రహసనము
7 మహామహోపాధ్యాయ ప్రహసనము
8 యోగనిద్రా ప్రహసనము
9 మహావంచక ప్రహసనము
10 అసహాయశూర ప్రహసనము
11 కలిపురుషశనైశ్చర విలాసము
12 వేశ్యాప్రియా ప్రహసనము
13 కౌతుకవర్ధని
14 వినోదతరంగిణి
15 హాస్యసంజీవిని మొ॥భా॥
16 ,, రెం॥భా॥
17 ,, మూ॥భా॥

### నాటకములు

రెండవ సంపుటము

1 బ్రాహ్మవివాహము
2 వ్యవహార ధర్మబోధిని
3 తిర్యగ్విద్వన్మహాసభ (మూషకాసుర విజయం)
4 మహారణ్య పురాధిపత్యము
5 ప్రహ్లాద నాటకము
6 సత్యహరిశ్చంద్ర నాటకము
7 దక్షిణ గోగ్రహణము
8 వివేకదీపిక

### భాషాంతరీకృత నాటకములు

మూడవ సంపుటము

1 చమత్కార రత్నావళి
2 రాగమంజరి
3 కళ్యాణకల్పవల్లి
4 అభిజ్ఞాన శాకుంతలము
5 రత్నావళి
6 మాళవికాగ్ని మిత్రము
7 ప్రబోధచంద్రోదయము
8 వినీసు వర్తకచరిత్రము

### వచన ప్రబంధములు

### ఉపన్యాసములు

నాల్గవ సంపుటము

1 సత్యరాజాపూర్వదేశ యాత్రలు మొ॥భా॥
2 ,, రెం॥భా॥
3 రాజశేఖర చరిత్రము
4 శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధము

5 రసికజనమనోరంజనము
6 శుద్ధాంధ్రభారత
సంగ్రహము
7 అభాగ్యోపాఖ్యానము
8 పక్షికవిలాసము
9 జార్జ్ గిల్ఫిన్
10 నీతిదీపిక

స్త్రీల కుపయోగించుకథలు

ఆయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక
చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి
చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రహపదీసంవాదము
(మాతృపూజ పితృపూజ)
6 నీతికథామంజరి
ప్రథమభాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉపన్యాసములు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క
పరమార్థము
10 వైరాగ్యము

11 విద్యార్థులకర్తవ్య కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్రము
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము
22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహభూతవర్త మానస్థితులు

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ,- దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు

3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

సాహిత్య గ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

పూర్వాంధ్ర కవులు

పదియవ సంపుటము

ఆధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు కావలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

# కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారి గ్రంథములు

మొదటి సంపుటము-ప్రహసనములు 17.

రెండవ సంపుటము-నాటకములు 8.

మూడవ సంపుటము-భాషాంతరీకృత నాటకములు 8.

నాల్గవ సంపుటము-వచన ప్రబంధములు, పద్యకావ్యములు 10.

అయిదవ సంపుటము-స్త్రీలకుపయోగించు కథలు 19.

ఆఱవ సంపుటము-స్త్రీలకుపయోగించు పుస్తకములు 8.

ఏడవ సంపుటము-ఉపన్యాసములు 24.

ఎనిమిదవ సంపుటము-ఉపన్యాసములు, జీవచరిత్రలు 9.

తొమ్మిదవ సంపుటము-సాహిత్యగ్రంథములు 9.

పదియవ సంపుటము-ఆంధ్రకవుల చరిత్ర 1, 2, 3, భాగములు

పదకొండవ సంపుటము-స్వీయచరిత్రము 1, 2 భాగములు.

షరా:-పైన ఉదహరించిన పదకొండు సంపుటములు వాల్యూములు గాను, విడిపుస్తకములుగాను దొరకును. పుస్తక వ్యాపారస్థులకు, గ్రంథాలయములకు కమీషను యివ్వబడును. నేటిధరలపట్టికకు వ్రాసి, కావలసిన పుస్తకములకు ఆర్డరు యిప్పింపుడు.

తెలుగు విశ్వవిద్యాలయం
గ్రంథాలయం
నమోదు సంఖ్య 18057
తేది 25.10.46

వలయువారు

హితకారిణీ సమాజము
రాజమహేంద్రవరము

అని వ్రాసిన బడయగలరు.

శ్రీమాన్ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము—1950.

స్త్రీల కుపయోగించుకథలు

అయిదవ సంపుటము

1 సత్యవతీ చరిత్ర
2 చంద్రమతీ చరిత్ర
3 సత్యసంజీవిని
4 చమత్కార రత్నావళి
5 సతీమణి విజయము
6 సుమిత్ర చరిత్రము
7 రఘుదేవ రాజీయము
8 కురంగేశ్వర వర్తక చరిత్రము
9 కళావతి పరిణయము
10 గయ్యాళినిసాధుచేయుట
11 చిత్రకేతు చరిత్రము
12 దానకేసరీవిలాసము
13 వైదర్భీ విలాసము
14 భానుమతీ కళ్యాణము
15 సరసిజనమనోభిరామము
16 ధర్మకవచోపాఖ్యానము
17 కుమారద్వయవిలాసము
18 పద్మినీ ప్రభాకరము
19 మాలతీ మధుకరము

స్త్రీలకుపయోగించుపుస్తకములు

ఆఱవ సంపుటము

1 శ్రీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము
2 సతీహితబోధిని
3 పత్నీహిత సూచని
4 స్త్రీనీతిదీపిక
5 సత్యాగ్రాపదీసంవాదము (మాతృపూజ పితృపూజ)
6 సీతికథామంజరి ప్రథమ భాగము
7 డిటో ద్వితీయభాగము
8 దేహారోగ్యధర్మబోధిని

ఉ ప న్యా స ము లు

ఏడవ సంపుటము

1 జన్మాంతరము
2 అతిబాల్య వివాహము
3 విగ్రహారాధనము
4 ఈశ్వరతత్త్వపుస్తకములు
5 ఈశ్వరోపాసనము
6 ప్రార్థన
7 మానుషధర్మము
8 విద్యాధికుల ధర్మములు
9 మనుష్యజీవితములయొక్క పరమార్థము
10 వైరాగ్యము
11 విద్యాధురీణుల యర్థా కృత్యములు
12 వర్ణము
13 హిందూమతములు
14 స్వయంకృషి
15 సహాయకష్టకర్మలు
16 వేశ్యాకాంతల ఉపన్యాసములు
17 ఐకమత్యము
18 దానములు
19 స్త్రీపునర్వివాహచరిత్ర
20 స్త్రీపునర్వివాహవిషయకోపన్యాసము
21 స్త్రీపునర్వివాహవిషయక ప్రథమవిజ్ఞాపనము

22 స్త్రీపునర్వివాహవిషయక ద్వితీయవిజ్ఞాపనము
23 స్త్రీపునర్వివాహశాస్త్ర సంగ్రహము
24 స్త్రీపునర్వివాహభూతవర్తమానస్థితులు

ఉపన్యాసములు-జీవచరిత్రలు

ఎనిమిదవ సంపుటము

1 దేశీయమహాసభ-దానియుద్దేశము
2 స్వదేశసంస్థాన చరిత్రాదులు
3 విగ్రహతంత్రవిమర్శనము
4 ఉపన్యాసమంజరి
5 వివేకవర్ధని మొదటిభాగము
6 ,, రెండవభాగము
7 ,, మూడవభాగము
8 శంకరాచార్యులు
9 బసవరాజు గవర్రాజుగారిజీవచరిత్రము

సాహిత్యగ్రంథములు

తొమ్మిదవ సంపుటము

1 సంగ్రహ వ్యాకరణము
2 కావ్యసంగ్రహము
3 అలంకార సంగ్రహము
4 నీతిచంద్రిక-విగ్రహము
5 నీతిచంద్రిక-సంధి
6 తర్కసంగ్రహము
7 సత్యవాదిని
8 ఉత్తమస్త్రీచరిత్రములు
9 జీసస్ చరిత్రము

ఆంధ్రకవులు

పదియవ సంపుటము

1 పూర్వాంధ్రకవులు
2 మధ్యకాలపు కవులు
3 అధునికాంధ్ర కవులు

పదకొండవ సంపుటము

స్వీయచరిత్ర

పుస్తకములు వలయువారు:—

కార్యదర్శి, హితకారిణీ సమాజము, రాజమహేంద్రవరము.

అని వ్రాసిన బడయగలరు.

శారదా ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము- 1930